గీ ఎసఁగుకట్టావిక్రియ నావి రెగయఁ బగటి, యొండయుడు కాఱకుఁడు భూమండలమునఁ, బొలిచె మాపటఁ బండువెన్నెల చకోర, పోత విశతికి జాఁపట్టు వోసినట్టు ఆము. 2 60.

3 మాలిన్యము, మురికి.

(వ్యవ) రంగుబట్ట మాపున కాఁగును

(ఈ యర్థమున అనౌ.గా వ్యవహారముండుఁ గన్పట్టు చున్నది.)

4 లేకుండఁ జేయు (చూ మాపుచేయు)

విశ మలినము, మురికియైనది.

సీ కురుమాపుదడిమంపుఁగోకలోఁ దొలఁకెడు కంప మానవితంబకాంతిసొంపు ..

కళా 4 105

సీ. కట్టినవెఱమాపుగడితంపు పుట్టంబు సెన్ను మీఱెడునారచీర గాఁగ ..

అచ్చ రా. సుం 28

**మాపుచేయు** స. క్రి. (√మాపు) పోఁగొట్టు, నశింపఁజేయు.

ఆ. తెలుపు మాపుచేసి దిట్టతనంబునఁ, దెలుపు భస్మ ముగను దేటపఱచు, విధముకన్నఁ బరున వేదియు లేదురా ... వేమ. 3. 148.

**మాపుడు** విశ. (√మాయు) మాసినది, మలిన మైనది.

గీ. .... ఒరులు, గట్టి విడిచినవస్త్రంబు గట్టఁగాదు, మడత మార్చు టొప్పదు కడుమాపుడైన ..

భార. అను 4 107.

**మాభీదము** సం. వి. అ. పుం. ఏకముఖరుద్రాక్షము (వై ని.).

**మామ** వి. (సం. మామకః, త. మామన్, క. మావ) 1. తల్లికిఁ దోడఁబుట్టినవాఁడు, మేన మామ, మాతులుఁడు.

గీ. అనఘ మా మామ శకుని నాకై కడంగి, జూద మాడెడి నాతోడఁ గాదు నాశ, యీతఁ డొడ్డిన ధనరాసు లెవ్వియైనఁ, బోఁడిగా నీకు నీ గల వాఁడ నేను. భార. సభా. 2. 174.

ఉ శ్రీరుచిరత్వ భూతిమతిజిత్వరశాక్యతి శక్తి కాంతులన్, దీటత సాటభోగముల ధీనిధి యీశ్వరనారసింహుఁ డా,వారిజనాభశంకరుల వారికుమారుల వారితమ్ములన్, వారి యనుంగుమామలను వారివిరోధులఁ బోలు నిమ్మహిన్.

మనుచ 1. 29.

2 శ్వశురుఁడు

(క) భర్తతండ్రి

కం. ఆమెటఁత నేయునవినయ, సామకథల మృదుగభీరసంభావనలన్, మామయు నత్తయు సంతోషామృతమునఁ దేలి రంతరంగముల దగన్

భాం. అ 7 197.

ఉ ... నీదుపట్టి న న్నెంతయుఁ బ్రేమఁ బట్టి రమియించినయప్పుడె మామ వైతి సీ, కింతటి నుండి కోడలఁ జుమీ నను ముట్టకు రాజశేఖరా.

సారంగ 2 202.

(చ.) భార్యతండ్రి.

ఉ పారణ చేసె రాజు మధుపర్కపుఁ దేనియమామ భీమధాత్రీరమణుండు మంత్రసముదీరణపూర్వము గాఁగ నీయగన్ ... నైష. 6 88.

సీ. విను సామి నీతండ్రిపనుపున నీమామ యగు కుంభకుని యింటి కరుగుదెంచి ...

నీలా. 2. 12.

చం. .. మామగా, రనుట యె కాని మమ్ముఁ గని నయ్యకు మీకును భేద మున్నదే ..

ఉ. రా. 5. 252.

వ. .. శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ చోడ గొంక్క రాజులమామ దణ్డనా (య) కపణ్ణి నాయకుని గొడ్కు చోడపనాయకు.

ద. శా. 4. 1066.

3 మామక సంజ్ఞకుఁడు, మామవావినాఁడు.

చం. మఱఁది యటంచు బావ యని మామ యటంచును నల్లుఁ డంచు నం,దఱకును నన్నివావు లిడి ... దశా. 2. 366.

జ. మామతనము, మామమామ.

**మామకము** సం. విశ (అ. వి. ఆ) నాసంబంధ మైనది

**మామకీనము** సం. విశ. అ. ఆ అ) నాసంబంధ మైనది, మదీయము.

**మామకుడు** సం. విశ. అ. మిశా. అ. 1. నాసంబంధ మైనవాడు

2 స్వార్థపరుడు, లోభి, అత్యాశ గలవాడు

3 అ పుం మాతులుడు, మేనమామ (మే.సి).

**మామతనము** వి. (మామ+తనము) శ్వశురత్వము, మామయగుట

ఉ భూమితలేంద్ర నీ కిపుడు పుత్త్రిక యైతనరారు కన్య నీ,కామహిశాంశజాత యఖిలప్రహిసయ గణప్రపంచములన్, మామక పాణిపీడనసమాచరణంబున కర్థ్మి గాన శ్రీమామతనంబు మిక్కిలిగ మామది కి పగు చున్న దిత్తఱిన్

పరమ 3. 93.

**మామమామ** వి (మామ+మామ. త. మామ మామ) విష్ణువు (సరస్వతి)

సీ హారోగిరపునిరాజారి, కూరిమిపట్టి మామమామ యినుంగు మామగారు, అచ్చ రా శాల 6.

గీ మామమామ మన వారి యొప్ప శ్రీమహేశ. ఆం ంం దేవ. 7

**మామము** సం విశ (అ ఈ అ) నాసంబంధ మైనది, మామకము

**మామిడి - మావిడి** వి. (త మామరం) చూతము, మావి (వృ వి)

చం అల్లయది కెంపులమేడలతోడి విస్ఫుర, న్నవ్రకతకుట్టిమస్థలియొ మవ్వపు తేఁజిగురాకు కెంపును, మ్మరమునఁ దేజరిల్లునెఱమామిడి మాకులతోడి తోఁటయో ప్రభా. 1. 62.

సీ చాన మామిడి నంటి సంపెంగకును మోము చక్కఁ జూపవదేమి తక్కువయ్యె ...

ఉ రా 6. 38.

సీ. ... మామిడి మామి యనంగ నాశ్రమముకు.

ఆం. భా 145.

**మామిడిక్రింది సోమరి** మామిడిచెట్టుక్రింద అపండు రాలి తననోట పడు నని ఆశించి వేచుకొని యుండు నట్టి సోమరి.

ద్వి ఒక విచారము మాకు నొదవె నీరాజు, సుక వాసి, పనిపంద చూపుగుజ్జులు, మామిడి క్రింద సోమరి మేదకుడు.

ద్వి వాశిశ్చ ఉ. 1497 పం.

ఆ అహిర్భాణ్యకశిపునందు సీమామిడి, క్రిందిసోమ రెట్లు బొంది యెత్తెఁ,బులికి మేఁకమఱక పుట్టిన యట్లయ్యె నా. 2 59.

**త్రొక్కుడు** మామిడికాయ - మామిడికాయలు త్రొక్కి చేసిన యొకవిధ మగుపచ్చడి

క .. త్రొక్కుడు మామిడికాయయు నూరుఁ బిడు మెచ్చిరలంతుల్

పాంచ 4. 55.

జ మామిడిగుత్తులు

**మామిడిగుత్తులు** వి బ. (√మామిడి) ధాన్య విశేషము.

మ. సొరిదిం జేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులుం బుష్పమం,జరులు న్మామిడిగుత్తులున్ గుసుమ ముల్ సంపెంగలున్ బచ్చగ,న్నెరవూఁజాజులు గల్గి రాజనపుఁగాంతిందారు ము ల్వ్యాపి చే, లరుదార న్నగుఁ బూవుఁదోఁటల బలాకానీక దంభంబునన్ అము 1 66.

**మామెన** వి 1. ఉత్పలశాలిబ, నల్లసుగంధిపాల (వృ వి).

సీ మామెనయును నేమామెన యటకమామిడి దూలగోవెల. హంస 4 10.

గీ .. మామెన యన నుత్పలశాలిశాహ్వయ మగు భవ. ఆం. భా 57

2. మామెనకాయలతో పెట్టిన యూరుఁగాయ

కం. వడపిందెయు మామెన మామెడుగాయయు నల్లమున్ మిరియపూర్గాయల్, కడనుండఁగఁ ద్రొక్కుడు మా,మిడికాయయు నూరుఁబిండ్లు మెచ్చిరలంతుల్. పాంచా. 4

ఉ ఆరికకూడు పుచ్చవరు గావులవెన్నయు దోస
గింజనం, జాఁపుటాంబురంబు తనిమజ్జిగ పూమె
వగుంపుతోడఁ దం,పారఁగఁ ఒట్టి రెక్కిముఁయ
ల్మునగోలఁ బాని యెల్లకో,శేరులు వైచి
దున్నుటకు నేఁగిన కొండ్రకు పాల, వఁచి నన్
వేం ప.చ. 637

(ప్రాఁత ప్రతిపా. మూకోనకంపు ముద్రి పా

మాయ సం వి ఈ స్త్రీ. 1 దంభము

2. వంచన, మోసము

3. గారడివిద్య, మంత్రవిద్య, ఇంద్రజాలము మొ వలనఁ గలిగిన భ్రాంతి

4. యథార్థము కానిరూపము, అసత్యము (సమాసము యొక్క మొదటిపదముగా నుండునపుడు అసత్యము, కల్పితరూపము గలది, యథార్థము గానిది అనునర్థముల మప యోగింపఁబడును )

(ఉదా.- మాయావచనము — అసత్యవచనము మాయామృగము మొ )

5 కపటోపాయము, రాజకీయతంత్రము

6. (వేదాంత.) అవిద్య

(అవిద్యవలనఁ గలిగిన భ్రాంతిచేత నసత్య మగు జగత్తును సత్యముగాను బ్రహ్మముకంటె భిన్న మైనదిగాను జనులు గ్రహింతురు )

7. (సాంఖ్య.) ప్రధానము, ప్రకృతి

8 బుద్ధునితల్లి యగు మాయాదేవి

9. (శైవమతమున) జీవుని బంధించెడి నాలుగు పాశములలో నొకటి.

10. ఒకానొక పట్టణము, గయ.

11 లక్ష్మి

12 కృప.

13. ఒకానొక విష్ణుశక్తి

14 తెగడ (వ్య. వి.). (వై. ని ).

మాయరవి — దయలేని సూర్యుఁడు

కం. మాయరవి యేల క్రుంకఁడొ,కో యను నిట్టేల తడసెనో ... భార. విరా 2. 312.

మాయఁజేయు స. క్రి. (మాయు) నశింపఁజేయు

౬. చంద్రసూర్యుల ప్రకాశము మాయఁజేయని కటిం చీఁకటిమీఁద మెటిక పిలుచు ..
శుక 2 504.

ఉ. శా నొకమాయఁ జేసి యమృతంబు సురాళికిఁ బంచిపెట్టఁగా, నే నిఁక మాయఁ జేసి త్రిదివేశుల నందఱ మాయఁ జేసెదన్ ..
దశా. 2. 265.

మాయఁబాఱు అ. క్రి (మాయు కాంతి హీన మగుట కున్ముఖ మగు, మాయుట కున్ముఖమగు.

సీ తెలతెల నయ్యెను దిక్కులు, పెలపల మడుగణము మాయబాఱెను బతుల్, కలకలనఁ గూయఁజొచ్చెన్, దులదులఁ దమ్మెదలు దమ్మితుటుముల వెడలెన్ హంస. 1 155

మాయకాఁడు వి విశే. (మాయ + కాఁడు) మాయావి

సీ. నీవు .

గీ. మానుషంబున నడపంగ మాయకానిఁ, గాగఁ జెలులు గాంచుట వగ కలిమిపేర్మి, దాని పెలిపుచ్చు నోపమి వీన నొకటఁ, గార్హ్య పాండురత్వంబులు గలుగు ననఘ
భార అను. 4. 385.

మాయదారి వి. విశే. (మాయ + దారి) (సం. మాయాధారీ. మాయావి) మాయకాఁడు; మాయావిని, మాయలాఁడి.

ఉ వచ్చుటయున్ ఫలందముఁడు వారిజనాభుఁడె మాయదారి యై, యిచ్చటి కేఁగుదెంచె నని యిచ్చఁ దలంచి నమస్కరింప ...
వరాహ. 9. 44.

గీ నిలిచె జిలిబిలిజడదారి చెలువఁ జేరి, మప్పు కప్పెడుదార నమ్మాయదారి ...
కువల. 2 29.

చం హరిహయ కంటకాన్వయుల యావహవైరి కెల్ల యైనక,ల్లరి మదిరిత మేను కుటిలమ్ముగఁ ద్రిమ్మరు మాయదారి మంందర యనుజంత ...
చం. రా. 4. 18.
ఆం భా. 2 266.

**మాయపోతు** వి. విశ. (మాయ + పోతు — మాయము + పోతు శ. ర.). మాయఃకారి (శ. ర.).

**మాయము** విశ. (సం. మాయా, క మాయవు

1. అదృశ్యము, కావరానిది.

ఆ. మడుగుసొచ్చి మునిఁగి మాయమై పోయిన, నద్భుతాత్ముఁ డగుచు వవనివిభుఁడు .. భార అర 4 330

శా ... ఇతఁ డెవ్వాఁడొకో, నేత్రోత్సవ . మై డాయం జనుదెంచె నంతటను మాయం బయ్యె. నైష 6 52

కం. ఉఱికిన నడుమనె తల దెగ, నఱికినఁ బలి మాయమైన నభమున సుర ల. త్తఱి మెచ్చి పుష్పవర్షము, తఱచుగఁ గురియించి రభయదాయకు మీఁదన్. ద్వా 10 57

2 మోసపుచ్చునది, వంచకము

కం మాయపుఁజీకటి విరియఁడుఁ, దోయజమిత్త్రుండు మగుడఁ దోఁచెఁ బ్రజకుఁ గో, పాయత్తులై బలంబులఁ, జేయంగలవారు గడఁగి శితబాణములన్.

భార. ద్రో. 4. 624

కం. మాయఁ బ్రకటించుచును వెడ, మాయపు మంత్రములు రిత్త మంత్రించుచు భూ, నాయకనందన గనుఁగొను, మా యామదిరాక్షి నీమదాలస యగునే. మార్క 2. 91

3. కృత్త్రిమము, తెచ్చి పెట్టుకొన్నది

చం. మదవతి ... చెంబుతో, నుదకముఁ గొంచు ధూర్తమణి యుండెడిచోటికి నేఁగి మాయపు, న్నిదుర వహించి యున్నయతనిం గరసంజ్ఞల లేపి యి ట్లనున్. శుక. 2 525.

4 చెడిపోవునది, నశించునది

కం. కానియటు లుండి నెఱఁబడు, నైన తెఱఁగు దోఁచి మాయ మగు నిబ్భంగిన్, మానసమున కుబ్బు వగయుఁ, దే నోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్. భార. శాం 2. 28.

సీ. అనురక్తి నినుఁ గూడి మనఁ గంటి మంటి నే ననురతిమనువు మాయంబుగాఁగ .. కు. సం. 5. 552.

గీ. అస్త్రశిఖయు నేఘంగి వఱిగిపోయె, మాయ. యగ్నియు నెచ్చోట మాయ మయ్యె .. భా రా. యు 1390.

చం అడరెడుచిచ్చుఁ జొచ్చుతఱి నాదట నూరక చూచునాఁటిని,ల్కడయును గానఁ ద్రోచి చిరకాలము దాఁచిన బెట్టిదంబు నా, యెడఁ గని వంతలన్ విసివి యీతని కెక్కడి మోహ మంచు. ని,ప్పుడమి నడంగి మాయమయి పోయితి వే మె పతివ్రతామణీ ఉ రా 8 99

వి వంచనాసాధనము, మాయోపాయము

క ఈవెడమాయము లేఁటికి,దేవీ యొనరించెదిట్టు దీనికి నెడగా, నీ వొకటి యెద్ది చూపినఁ, బోవఁగనిత్తునె విరోధిఁ బొరిగొన కెట్లున్. హరి. ఉ. 8. 201.

గీ. మాయములు పన్ని యీలీల మహిపుమ్రోల. జాల నిడి హేల నరిగిరి ప్రాణసఖులు ... కృ. శకుం. 3. 33.

**మాయపుఁబుర్వు** — ఘాతుకక్రిమి, నశింపఁజేయు క్రిమి.

కం నాయిష్టవనిత మ్రింగిన, మాయపుఁబుర్వు లివి వీని మడియింతు మునీంద్రా యరుగుము నీవనుటయు, నాయన యత్యంతదుఃఖితాత్ముం డగుచున్. భార అర 4. 334.

సా. కుంచెన్న కూడఁబెట్టిన మంచెన్న మాయంబు చేయను (పెద్దల కష్టార్జిత మగుసొమ్మును వమ్ము చేయునప్పు డీ లోకోక్తిని వాడుదురు).

కం. ఇంచుకయు నే వ్యయింపక, నంచితముగ ధనము విభుఁడు సానుల కొసఁగెన్, "గుంచెన్న కూడఁ బెట్టఁగ, మంచెన మాయంబు చేసె. మర్యా" దలరన్. రుక్మాం 4. 104.

జః మటుమాయ, మటుమాయతనము, మటుమాయలబండి, మటుమాయలాఁడి,మటుమాయలాఁడు.

మాయల చెంచురాయఁడు మి. వి (√మాయ) ఈశ్వరుఁడు, శివుఁడు

కం ఒకతలమానిసి లేఁ డిం, టికి మాయా చెంచు రాయనికి నని వెనక,య్యకు నాతనివెనకయ్యకుఁ, దుకతుకఁ బుట్టించి నవ్వెదురు మన చెంచుల్. చంద్రా 2. 56.

మాయలబెల్లి మి విఙ. (√మాయ) మాయలు గలది.

సీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి పల్లింత మాయలబెల్లి కటికి .. చెన్న 2 24

మాయలమారి మి. విఙ. (√మాయ త. మాయ మాఱి) మాయలు గలవాఁడు మాయావి, మాయావిని, మాయలాఁడి.

ఉ ... నుఖో, పాయత నున్నవాఁడు శ్రుతిపారము సేయుచుఁ దోఁటలోననే, మాయయగా రటంచు నల మాయలమారి చనెం దటాలునన్.

వైజ 4. 16.

మాయలమెకము మి వి.(మాయలు + మెకము) మాయామృగము.

కం. మాయలమెకంబు సేసిన, మాయన నన్నెఱుఁగ వలయు నటకాదె నరుం, డేయకమును గిటిఁ బోరిగొను నాయకుఁ డావెన్క మీరె నన్నెఱుఁగుటకున్. రా వి 3. 47.

మాయలాఁడి మి విఙ (మాయలు + ఆఁడి, త మాయైయాడి క. మాయలాడి) మాయలు గల ఆఁడుది

దండకము. ... గుణం బేఁటికే మాయలాఁడీ విభుండైనఁ బోఁడే నిమగ్నుండు గాఁడే ..

భోగినీదండకము 9 పా

మాయలాఁడు మి విఙ. (√మాయ త మాయై యాడి) మాయావంతుఁడు మాయలమారి.

సీ, ... సహదేవుఁ జులుకన మర్దించి మందల విడువఁడే మాయలాని ...

గీ మేటిమగనిఘటోత్కచుఁ గీటడపఁడె

భార. కర్ణ. 1 42

సీ . మాయలాఁ డని తిట్టె మంజుఘోష.

మముచ 1. 42

కం. అనుడు దఁహాసనసమునఁ. దనవదనజఁ ద్విఘుండు తారుణ్యము గై, కొన మందాందోళన మేతనమున శిర మమఁ మాయలాఁ డిట్లని యెన్ . పాండు 5. 209.

భా రా. యు. 1718., ఆఁ. భా. 2. 256.

మాయసాగు మి వ క్రి. (మాయ + సాగు) మాయచేయు

గీ నీనియోగులు సీమలో లేనిసుద్దులం గదిసి మాయసాగి రనంగ వలదు, మా టొకటి సేఁ తొకటి గా ద దేటి కింత, నాఁటినాఁటికిఁ దెలియుఁగా నడతలోన. రా వి 5. 41.

మాయాకారుఁడు నం. వి. అ పుం. గారడివాఁడు.

మాయాచణుఁడు నం విఙ (అ ఆ అ.) 1. గాఁడి చేయుటకుఁ బ్రసిద్ధుఁడు, 2 మోసపుచ్చువాఁడు, దగాచేయువాఁడు

మాయాజీవి నం వి న్ పుం గాఁడివాఁడు.

మాయాదము నం. వి. అ. పుం మొసలి, మకరము (త్రి. ని.).

మాయాదేవి నం. వి. ఈ. స్త్రీ. బుద్ధునితల్లి.

మాయాధరుఁడు నం. విఙ (అ ఆ. అ.) మోసగాఁడు, మోసము చేయువాఁడు.

మాయాఫలము నం. వి అ న. మాచికాయ.

మాయాయంత్రము నం. వి. అ న మంత్రశాస్త్ర ప్రకారము వేసిన యంత్రము.

మాయావంతుఁడు నం. విఙ. (త్. వతీ. త్)

1 మోసము చేయువాఁడు, వంచకుఁడు. 2 ఇంద్రజాలవిద్యయందు నేర్పరి, ఇంద్రజాలవిద్య నుపయోగించువాఁడు

వి త్ పుం కంసుఁడు.

మాయావతి నం. వి. ఈ. స్త్రీ. ప్రద్యుమ్నుని భార్య.

మాయావి నం. విఙ. (న్. నీ. న్.) మోసము చేయువాఁడు, మోసపుచ్చువాఁడు, యుక్తి వన్నువాఁడు.

వి న్. పుం 1. ఇంద్రజాలికుఁడు, గారడి వాఁడు 2. పిల్లి (శా. ని. .) వ మాఁచకాయ.

**మాయావిదుఁడు** నం విశ (ద్) – మాయ నెఱిఁగినవాఁడు

1 మోసము చేయుటయందు నేర్పరి. 2 ఇంద్రజాలవిద్యయందు నేర్పరి

**మాయి** నం. వి. న్. పుం. 1 గారడివాఁడు 2 బ్రహ్మ 3. కాముఁడు, మన్మథుఁడు. 4 అగ్ని 5 శివుఁడు

విశ (న్ నీ న్) మాయావి

**మాయించు** న క్రి (√మాయ 1. చంపు, సంహరించు

కం. ఆయుధము విడిచి యుండఁగ, సాయకగుణ మీరు నూడఁ జంపినకట్టో, పాయుని దృష్టద్యుమ్నుని, మాయించియ కాని తొడిన మఱు నే నూడ్చన్. భార. కర్ణ. 2 150

సీ ఈతేరఁ గాదె మాయించె సుత్రాముఁడు పాక దైత్యేయు నిర్భరసహాయు ...

హరి 7 154

కం మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్, మాయికరణమున వీనిన్, మాయింపుము మోహనాది మాయలచేతన్. భాగ, 10 ఉ 14.

2. నశింపఁజేయు. అడఁచు.

ఉ. ...మౌర్వి ద్మ్రోయించుట గజ్జచందముగ నేచి విరోధవవానలంబు మాయించు శితాస్త్ర వర్షమున నిట్టిది భీష్మమహాభ్రము ..

భార. భీష్మ. 1 52.

శా ఆరాజన్యు డుదగ్రుడై పొదివి సింహవ్యాఘ్రభల్లూక భూ, దారిజాదికదుష్టసత్వ సతతోత్థానంబు చాపస్ఫురన్నారాచ ప్రముఖాంబకంబుల జడిన్ మాయించుచున్ గ్రక్కునన్, ఘోరారణ్య పదాశ్రమంబులఁ బరిశోభంబు మాన్పెన్ గృపన్. కృ. శకుం 1. 62.

క. పంచినయును మాయయు మా, యించి పరాక్రాంతి నయ్యుమేశాస్త్రమునం, గ్రంచఱ నంతకుప్పు రకేఁ, గించితిఁ బౌలోమకాలకేయాసురులన్. భార. అర. 4. 86

: : చెయిఁచుఁ దెవులపండువు, మాయించు నఘూఁఛ నిట్టిమితి మఱి గలఁదే .. భాగ. 1. 134.

3. పోగొట్టు, కాంతిహీనము చేయు

శా . అరి, తన్మాదారస్థిర కీర్తితారకములన్ మాయించు చేతప్పరా, పాడత్యుండు వెలుంగు ... నైష. 5. 133.

సీ చిఱునవ్వు వెలయించి చెలు వయనవెన్నెలల్ మాయింపు మిప్పుడు మచ్చకంటి . .

విల్హ. 2. 137

సీ నీలధారాదర నిర్మలకాంతుల గడియలో మాయించుఁ గలికివేణి హంస 5. 210.

**మాయికుఁడు** నం వి. అ పుం. ఇంద్రజాలికుఁడు .(వై ని )

**మాయు** అ క్రి. (త మాయ్.) 1 కాంతి హీనమగు, తిరోహితమగు.

కం. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలుసాయల్. నేసెం బలుమొయిళులడర ... భార. విరా. 4 86.

గీ కరము భానుబింబము మాయఁ గప్పె నభము, నంబకములరాగమునఁ జెం, పారుచూడ్కిఁ బ్రతిభటుఁడు నూచి నరుఁ డింక గ్రమ్మ కెట్టుఁ, బూన్కి విడఁ డని సంరంభమును వహింప.

రాఘవ. 4 176.

2. మలిన మగు, మాఁగుడువాఱు

కం మాసినచందముఁ దనుఁ గని రోసినదెందంబుఁ గలతరుణి నెఱుఁగఁడ బి, ట్టేసినమదనునిచే ధృతి వాసినబెగ డొందు సింహబలుఁ డట్టెయెడన్. భార. విరా. 2. 82.

ఉ మాసినదీర్ఘవేణి కుఱుమాసినచేలచెఱంగు గలంక్రియా, వాసముగానిమేను వసివాఁడినముద్దుమొగంబు గాంచి ... శుక. 1. 125.

కం. తల మాసిన నొలు మాసిన, వలువలు మాసినను
ప్రాణవల్లభుసైనన్, గుల కాంతలైన రోయరె,
తిలకింపఁగ భూమిలోన దిఁ ముగ సుమతీ
సు. శ 56

సీ. మాసటి పగలెల్ల మాయుదీ పనిపడు
వెన్నెల నగునట్లు వెలిఁది నవ్వు ...
కు సం 3. 6.

గీ. భ్రమరగీతిః మాయ విపంచి మీటఁ, దాన శ్రుతిఁ
గూడి మిగులఁ జద్రక్తి పెంచ, వే నివారించి
లేచి దైవికము నెదుట, యుక్తులు ఫలింప
ననుము జిట్టూర్పు నవ్వు ఆము. 5. 147

చం. చీకటులు గొబ్బున మాసె మరుండు తుంట
విల్. బలువడి నెక్కుఁ దీసె ..
నీలా 3 44

3. చచ్చు

కం. మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగర
ముఖం దమర్త్యుల గెలుచున్ ...
భాగ 10 ఉ. 14

కం. మాయారణమున దివిజుల, మాయఁగఁ జేయు
టకు నైకమత్యము మెంయన్ .
శశాం 5. 41.

4 క్షీణించు, తగ్గు

సీ. జపములు గాయత్రిసహితంబుగా మాసె
వేదంబు పేరును వినఁగలేద ..
హరి పూ 1. 100

సీ. మనసుఁ గామక్రోధమదలోభముల కిచ్చి సడ
లింతు రన్వయాచారసరణి, నన్వయాచారంబు
లట్లు మాసి చనంగ వర్తింతు రన్యాయవర్తన
మున. భీమ 5. 173.

(మాసిచను — చెడిపోవు)

ఉ. అశ్వమే, ధీయహయంబు మారుతగతిన్
బహుదేశములం దరించుచున్, మాయనివేడుకన్
యుపతిమండలమున్ గదిసెన్ సమున్నతిన్
జై. భా 5. 105.

5. మఱువఁబడు, విస్మృతమగు

సీ. రాజాలయమునకు రాకపోకలు సేయు, మాసి
న చదువులు మఱలఁ జదువు
పాండు 3 43.

6. నశించు

సీ. మాసె నఘస్ఫూర్తి మసభూములఁ దను నెల
మూఁడువానలు నిండఁ గురిసె
మను చ 1 34.

సీ. కను మాయఁ జని సీతఁ జెనకు కాకాసురునకు
మాయఁగాఁ బాటు కొనినచోటు ...
సా. .. 9.

7 దరిద్రుఁడగు, ధనహీనుఁడగు

(వ్యవ) పాపము అతఁడు వ్యాపారము చేసి మాసి
పోయెను.

జ మాపు, మాపుచేయు, మాపుడు, మాయఁజేయు,
మాయఁజాలు, మాయించు, మాసి, మాసిక,

**మాయుకము** నం వి అ పుం గజవిశేషము.
(వల్లనిశరీరము వల్లనినాలుకయు కుఱుచదేహ
మును అల్పములైన గర్ణవాలమేహనములను దీర్ఘ
మగుతొండమును కృశమగుగ్రీవయును దుర్గంధ
మును గలది. ఇది సేనాపతికిని రాష్ట్రమునకును
నాశము గలుగఁ జేయును.) (శ ర)

**మాయురె — మాయురే** అవ్య 1. ప్రశంసార్థకము.

కం. మాయురె హరిహరివరద య, మేయగుణా
యనుచు నాత్మ మెచ్చి ..
భాగ. 10 ఉ 880.

2. సంతాపార్థకము

ఉ. మాయలు మాయ మైనఁ గని మాయురె యం
చను శోషకాఖ్య మౌ, వాయువు నంపఁగా ...
దశా 4. 214.

**మాయురే — మాయురె** మాయొరె, అవ్య. 1. ఆశ్చ
ర్యార్థకము.

చం. పురుపమహీజ మయ్యగురుఁబోఁడి పయంట
చెఱంగు వట్టి త, ద్గురుకుచముల్ బయల్
పడఁగఁ ద్రోఁచె నచేతన మయ్యు మాయురే.
కవిరా. 4. 76.

గీ మాయురే భూరిమహనీయమణి కాయ, హాటక విశంకటనివాటపాటవంబు, అని మనంబున వెఱఁ గంది హర్ష మంది, రఘునృపకుమార వరు హజారమునఁ జేరి ఇందు. 2 118

2 ప్రశంసార్థకము

ద్వి వేయ భంగుల ప్రసావేశంబు దాల్చి, మాయురే యని కలమాఱను మెచ్చి ...

ద్వి. హరిశ్చ. పూ 976 పం.

గీ మాయురే స్వామి చాగు భళా యటంచు, మాగధులు చేరి సముఖంబు వేగ విప్ప, నలుపు మీఱంగ నిజవాహనంబు డిగ్గి ...

ప్రబంధ. 79.

3. సంతాపార్థకము

ద్వి. మాయురే కౌశికుమాయఁ గాంచోలు,... పనిగొని బహుమహోత్పాతంబు లొదవె...

ద్వి. హరిశ్చ. పూ. 1122 పం

ద్వి. హా యని యెలుఁ గెత్తి యఱచి హానాథ, మాయజూదం బింతమట్టుకుఁ దెచ్చి, మాయత్రో వలఁ జూపె మాయురే నాథ ...

ద్వి నల 4 158 పం.

**మాయువు** నం. వి ఉ. పుం. పిత్తము.

**మాయూరము** నం. విణ. (అ. ఈ. అ) మయూర సంబంధ మైనది, నెమిలిసంబంధమైనది.

వి అ న మయూరముల సమూహము

**మాయూరి** నం వి. ఈ. స్త్రీ. 1. అజమోద, ఒక జాతి యోమము (వృ వి.). 2 మృదంగాది వాద నమునందు ప్రేళ్ళ యొక్క ఒకవిధ మగు వ్యాపారము (వై. ని.)

**మాయొరె — మాయురే** అవ్య ప్రశంసార్థకము

మ. అరెరె దాంతి బళారె శాంతి గుణ మయ్యారే ప్రసాదంబు మా, యొరె దాక్షిణ్యము జాపురే తెలివి మే లెంతేతవం ఔర యా,దర మాహా మహిమం బహో కలితమేధాశక్తి మజ్ఝారె స,త్కరుణాలోకన మంచు నాత్మ ముని రాట్కొంరిరవున్ మెచ్చుచున్.

చంద్రా. 3. 125.

**మాయశ్రము** నం వి అ న త్రాసు, మూర, తూము లోనగు మానము (శ ర)

**మారకము** నం వి అ పుం. అంటుకొనెడి పెద్ద వ్యాధి 2 దేగ, శ్యేనము

**మారకమ్మ** వి. ఒకానొక దేవత.

ఆ. వారకాంత లెల్ల వలచి యేతెంతురా, పొందుఁ జేసి ధనము పుచ్చుకొఱకు, మారకమ్మ చొచ్చి మఱి యిల్లు వెళ్లురా .

వేమ. 2. 176.

గీ మారకమ్మపులి యచట మఱియుమన్న, పెద్ద మేకములు పెంచినపిల్ల యొక్కొ, యనఁగ వాలు మృగంబుల కదియ యెపుడు, నాటపట్టు గుజాడలు తేటపడఁగ. ద్వా 8 15.

**మారకుఁడు** నం విణ (అ రికా అ.). చంపెడి వాఁడు, నశింపఁజేయువాఁడు

వి అ పుం. మన్మథుఁడు, మరుఁడు.

**మారజిత్తు** నం. వి. త్. పుం (మన్మథుని జయించినవాడు)

1. శివుఁడు 2. బుద్ధుఁడు.

**మారణము** నం. వి. అ న. 1 చంపుట, నశింపఁ జేయుట. 2. శత్రువును నశింపజేయుటకై చేయఁ బడిన మంత్రశాస్త్రకర్మ, అభిచారిక కర్మ. 3. ఒక దినుసు విషము.

**మారము** నం. వి అ. పుం 1. చంపుట, నశింపఁ జేయుట 2. విఘాతము, విఘ్నము. 3 కామ వికారము, మన్మథ వికారము 4 ఉమ్మెత్తచెట్టు. 5. మృత్యువు, చావు.

**మారరిపువు** నం. వి. ఉ. పుం శివుఁడు.

**మారవము** నం. విణ (అ.ఈ.అ.) మరుదేశసంబంధ మైనది.

**మారాటము — మాఱాటము** (శ. ర.).

**మారాము** వి. పెంకెపట్టు.

(వ్యవ.) ఆ పిల్లవాఁడు చాల మారాము చేయు చున్నాఁడు

మారాముళ్లు వి. బ. మర్మములు, తంటాలు, చిక్కులు

క. ఓ రామచిలుక మాకీ, మారాము ళ్లెట్లు తెలియు మగవారిమె నీ, దారిం బలుపోకలంగడి, దేజన్ శుక. 2 60

(ముద్రి పా "మారాములు తెలియుటకును" శ ( పా ) మారాముడ్లు (బ్రౌ పా )

మారి[1] వి (సం మారీ) మృత్యుదేవత.

వ మారి మసంగిన తెఅంగునం శాకిసమది యొక్కడం దానయై యొక్కొక్క మెఱుంగుటమ్మనం బెక్కంద్ర నుక్కడించి ... అచ్చ రా. యు 364.

సీ మనకీచకుల కెల్ల మారి యై పుట్టినసుదతి వోయెడు నని చూచువారు . . భార విరా 3. 66

గీ ఊరు పాడైనం గెంవుల యూళ్ల కుఱికి, మెసవ దొరకొంటిం బ్రజ మారి మసంగినట్లు, తీఱం గతిపయ దినముల దేశ మెల్ల, మల్లెవట్టినచేని క్రమంబు గాంగ మనుచ. 5. 26 , భార. ద్రో. 1. 141.

జ. మారి మసంగు.

మారి[2] అవ. తాచ్ఛీల్యార్థమున వచ్చు నొకానొక ప్రత్యయము

ఉ ... నీ కొడుకు మూఢత మానుప వేల వాండు రో, తొత్తులమారి యై గృహము ద్రొక్కక యొక్కొకదాని పూనికన్, గుత్తకు నంచు నుంచుకొని కోకలు రూకలు లోకనీయంగన్. నిరం. 2. 48.

గీ. అతండు దాని నెగాదిగ వరసి చూచి, దుడ్డె గట్టిద పని లేక తొత్తుం దానె, పిలిచె నిది పాట్ల మారి గావలె నటంచుం, జేరి తనపేరు పురిపేరు చెప్పి నిలిచె. హంస 5. 69.

మారి సం. వి. ఈ. స్త్రీ. 1. అంటుకొనెడి ఒకానొక చెడ్డవ్యాధి, మసూరికా రోగము. 2. చంపుట. 3 దుర్గాశక్తి భేదము.

మారిపము సం విజ. (అ ఈ అ) మిరియములతోం జేయంబడినది.

మారితము సం విజ (అ అ అ) వశింపం జేయంబడినది

మారిమసంగు అ క్రి. (మారి + మసంగు) మిక్కిలి విజృంభించు, మిగులం జెలరేంగు.

గీ. కాలపక్వంబు లైన లోకములు జముండు, శాకి సమరెడు చాడ్పున మారిమసంగి, యుగ్రరూపుం డై శౌర్య సమగ్ర బాహు, సంపద ద్దాముం డగు క్రీడి నంపె రిపుల భార విరా 5 59.

కం ఈరీతి నెదురం లేక కుమారీక లుగ్రాహవమున మారిమసంగుచో, బీరంబు విడిచిపాఱె సు, రారాతిబలంబు లెల్ల హాహా యనుచున్. వరాహ. 11 102.

గీ దుర్ముఖు నిశితాస్త్రంబున ద్రుంచె నిట్లు, మారిమసంగి దైతేయుల శారిసమరె . . మార్క 6. 103.

స. క్రి సంహరించు, చంపు

కం వల్లియలు ద్రెంచుకొని బల, మెల్లను బెల్లగిలం జొచ్చి యెంతయు వలుకన్, గెల్లువడి సురభి హుంకృతి, మల్లడిగొనం బ్రజల మారిమసంగం దొడంగెన్. పద్మ. 7. 238.

గీ ఉత్తమౌజు యుధామన్యు నుర్విం గూల్చి, మఱియుం దక్కినశూరుల మారిమసంగి ... చిత్రభా. 8. 81.

మారిషము సం వి. అ. పుం. తోంటకూర (వ్య.వి.).

మారిషుండు సం. వి. అ. పుం. గౌరవము గల మనుష్యుండు.

(నాటకోక్తియందు సూత్రధారుండు ప్రధాన నటునిం బిలుచునపుడు గౌరవపద్ధతిని సంబోధింప నుపయుక్త మగుపదము.)

మారీచము సం. విజ. (అ. ఈ అ.) మిరియముల సంబంధమైనది.

వి. అ. పుం. 1. పెద్ద యేనుంగు, గజరాజము. కక్కోలకము (వ్య. వి.) (మే. ని.).

**మారీచి** సం. వి. ఈ. స్త్రీ. కాశ్యపముని యొక్క తల్లి (త్రి. ని.)

**మారీచుఁడు** సం. వి. అ. పుం. 1. బంగరులేడి రూపమున రాముని మోసపుచ్చిన రావణ భృత్యుఁడైన రాక్షసుఁడు, తాటకాసుందుల తనయుఁడు. 2 కశ్యపుఁ డను ఋషి. 3 ఋత్విక్కు, యజ్ఞ పురోహితుఁడు.

**మారు**[1] స. క్రి. (హిం. మార్) కొట్టు. ప్రహరించు

చం. విహరులు మారుమారు ఘనవీరబలం బని పాంథకులందు, లఁబుకు రమాకుమారు నడిదాలని రాగవియోగజాతకా, తరిగుణదాత్య మన్మథ పతాకని తేఁట్ల నదల్చి కమ్మరా, మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగ నల్. వేం. పంచ. 4. 150.

గీ. మాఱు నిను శంకరుఁడు పలుమారు మార, వలసి క్రమ్మఱ బ్రతికించఁ దలఁచె నకట, యట్టి యవివేకమునఁ బామి గట్టు బట్టి, చెట్టు జట గట్టి భైక్షంబు బట్టఁ గడఁగె.
కృష్ణ. 4. 90.

సీ. కొనె మారెఁ జదిపె నాగను గొట్టె నవి తోఁచు ...
ఆం. భా. 3. 132., వైజ. 4. 65

**మారు**[2] వి. (క. త. మోర్) మజ్జిగ, తక్రము (బ్రౌ.).

సా. మఱచిపోయి మజ్జిగలో మారుబొట్టు వేసినారు

**మారుంగము** సం. వి. అ. పుం. మసృణత్వము (వై. ని.).

**మారుండము** సం. వి. అ. పుం. 1. పాఁవుగ్రుడ్డు 2 ఆవుపేడ, గోమయము. 3. బాట, మార్గము 4 గోమయముతో నిండినచోటు

**మారుఁడు** సం. వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు

**మారు(ఱు)గాళ్లు** వి. కృత్రిమ పాదములు.
చెన్న. 2. 20.

**మారుతము** సం. విశే. (అ. ఈ. అ.) 1. మరుత్తుల సంబంధమైనది 2 గాలిసంబంధమైనది, వాయు సంబంధమైనది.

వి. అ. పుం. 1. గాలి, వాయువు 2 శరీరము యొక్క ప్రధానరసము లగు వాతపైత్య శ్లేష్మములలో నొకటి యగువాతము. 3. స్వాతి నక్షత్రము

**మారుతవ్రతము** సం. వి. అ. న. వాయువువలె నంతటను జొచ్చుట వాయు వంతటను బ్రవేశించు నటుల రాజు చారులమూలమున నంతటను జొచ్చుట యనెడి రాజధర్మము

**మారుతసుతుఁడు** సం. వి. అ. పుం. 1. హనుమంతుఁడు. 2 భీముఁడు

**మారుతాశనము** సం. వి. అ. పుం. గాలిమేపరి, పాము.

**మారుతి** సం. వి. ఇ. పుం. 1. హనుమంతుఁడు 2. భీముఁడు.

**మారువు** వి. మత్స్యవిశేషము, ఒకజాతి చేఁప.

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువులెంకల కిచ్చె వాలుగలను సంగడీల కిచ్చెఁ, జాఁపరలను బిన్నవడ వాళ్లకును నిచ్చె మారువులను బన్సు వారి కిచ్చె
హ్యా. 1. 240.

**మారువము** వి. మత్స్యవిశేషము, ఒకజాతిచేఁప.

ఉ. వల్లికతట్ట మారువము వాలుగ బేడిస కొఱ్ఱమీను పెన్, జెల్లయు పక్కి పారయును నీమను ముచ్చఁగి బొమ్మిడాయముల్,... రొయ్య వరకారిగఁ జేఁపలఁ బట్టి బెట్టుగన్.
ప్రబంధ. 195.

**మారువా** వి. రాగవిశేషము, ఒకానొక రాగము.

భైరవి నాట తోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా. గౌర బిళావురి లలితకన్నడ గౌళ ముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధనాసిరి ఘూర్జరి పూరి బేగడా, యారభి రామకళ్లి

మొదలై తగురాగము లింపు మీరఁగన్.
చెన్న 2 256

**మారువాడి** వి. ఒకానొకజాతి, మార్వాడ్ దేశీయుఁడు

సీ. ఆఁడుబిడ్డనుకాచి యల్లుఁడు పింజారి మఱఁదలు కోడలు మారువాడి ... వేణు. 69

**మారువెల్లి** వి. తృణవిశేషము, ఒకజాతిగడ్డి మొక్క

గీ వేరు తొణ్ణంగి తొండును మారువెల్లి, తొప్ప రంట్రింత యెద్దుకొమ్ముగప్పుగడ్డి
హంస 5 47

చం పాని కెడ పేరి తోఁణఁగియుఁ బొత్తర మల్లవ మారువెల్లియున్ .. ప్రబంధ 200

**మారె(రే)డు** వి బొ. అనొ. బిల్వవృక్షము

కం మారెడు మోదుగు విప్రుఁడు, ఖూరమణుఁడు వటము ఖదిరమును వైశ్యుఁడు పెం, పారఁగ రావియు మేడియు గౌరవమున దండములుగఁ గైకొనవలయున్. విజ్ఞా. 1. 21.

సీ. ... ఇన్నూఱు యోజనములనిడుపు యోజన శతంబు, వెడలుపు గలుగుమారెడుతోఁట విల సిల్లు శ్రవనం బనఁగఁ బ్రసిద్ధ మగుచు ...
వరాహ 10. 125.

రగడ. మారేటికిఁ బలుమా ఱేఁటికిఁ జన, గోరంట ల కొనగో రంటవె వన ...
యయా. 4 66.

రగడ మారేడువంటికై మగువ కడుగో రేల, చేర రాఁగదె యిప్పచెంత వదిగో రేల
ఉ. రా. 6 61

సీ .... బిల్వసంజ్ఞ గీ. పరగు మారే డనంగను
ఆం భా 2 44.

**మారెడుగాయ** బిల్వఫలాటువు, దీనితోఁ జేయఁబడు ఒకవిధ మైన ఊరుఁగాయ.

కం. వడపిందెయు మామెన మా,రెడుగాయయు నల్లమున్ మిరియపూర్గాయల్, కడ నుండఁగఁ దొక్కుడు మా,మిడికాయయు నూరుఁబిండ్లు మెచ్చి రలంతుల్. పా చా 4 66

**మార్కండేయపురాణము** సం వి అ న ఒకానొక పురాణము.

ఇది పదునెనిమిది పురాణములలో నొకటి.

**మార్కండేయుఁడు** సం వి. అ పుం ఒకానొక ఋషి (శివుని వరమున మృత్యువులేనివాఁడు)

**మార్కవము** సం వి అ. పుం భృంగరాజము, గుంటగలగర (వ్య వి)

**మా(ఱుకొ)ర్కొను** స. క్రి, అ క్రి. (మాఱు+ కొను ప్రతిఘటించు, ఎదుర్కొను

ఉ. విక్రమ్యుఁడున్ యుధా, మన్యుఁడు నేపి యొఁడొరుల మార్కొని రౌద్రరసం బలో కసా, మాన్యము గాఁగ నస్ఖలితమత్సరముల్ మెఱయఁగఁ బోరిరి
జార పద్మ 1 261.

కం . కశమి వలిచ్చి నతని మార్కొని కినుక, న్నిడుదమొన వాఁడికొమ్ములఁ, బుడమిం బడ వైచి పొడిచి పొరిపొరి మట్టెన్ ..
నీలా. 3. 65

కం. కొం.చక యేమీ మనము సమానముదారక్రి, డకు నొండొరు మార్కొనుట దొ,రకునని వచ్చితి ...
రాఘు. 2. 81.

కం. సకలక్షత్రభయంకరు,నకు బ్రాహ్మద్రథికి నని మొనన్ మార్కొన నో,పక వలియంబాఱఁడె యీ, ముకుందుఁడు. భార. పభా 2 46.

కం వీనికి మార్కొనఁ జాలెడు, వానికిఁ దగువాని ధర్మతనయునిపురిలో, నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి భారం. విరా 2 9.

చం. ఇల నెలదోఁటలందుఁ జరయింపఁగ సాధము లెక్కఁ జిత్రపం, క్తుల మృగరాజిఁ జోడ సమ కొల్పుదు రొఁ దమకూర్పు నెయ్యపుం, జెలు లకు సాళ్వమాశనృపశేఖరు తిమ్మన్నపాల చంద్రుతోఁ, గలవను మార్కొనఁ గడఁగు గర్భి విరోధుల దేమి చిత్రమో.
విప్ర 1 51., కు సం. 11. 660.

**మా(ఱుకొ)ర్కొలు** ($\sqrt{}$మార్కొను) మార్కొనుట, ఎదిరించుట.

మ. మునుపే యాతఁడు కృష్ణుపే ర్నుడివినన్ మోహంబునుం జెంద కే, మనదుం దద్వీపతో రణాంగణమున న్మార్కొల్కలుఁ గల్పించె నే, మనుదున్ దైవము మాకు నెల్లఁ దనువున్ బ్రాణంబులున్ రక్షకుం,డును నెయ్యుండును దేశికుండు నలకృష్ణుండే కదా చూచినన్ .

చిత్రభా. 5. 198

మార్గ సం. వి. ఆ. స్త్రీ సంస్కృతభాష

కం మార్గ కుమార్గము దేశి య,మార్గము వదలంగఁ దమకు మది వదలక దు, రామార్గపదవర్తులనఁ దగు, మార్గవుఁ దలఁప నఁతి మహి సుక వులకున్ ... కు సం 1 28.

మార్గకవిత సం వి. ఆ. స్త్రీ సంస్కృతకవిత్వము

కం. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెలుం,గున నిలిపిరి . .

కు. సం. 1. 23.

మార్గణ సం. వి. ఆ. స్త్రీ. 1. యాచన, యాచించుట, ప్రార్థించుట. 2. వెదకుట, కనుపట్టుట

మార్గణము సం. వి. అ. న. 1. యాచించుట, ప్రార్థించుట 2 వెదకుట 3. బాణము, అమ్ము 4. అయిదుసంఖ్యకు సంకేతము 5 ఒకవిధమగు ధనుస్సు (వై .ని ).

మార్గణుఁడు సం విశే. (అ. ఈ. అ.) 1. వెదకువాఁడు. 2 అడుగువాఁడు, యాచించువాఁడు. వి. అ. పుం యాచకుఁడు, వేఁడెడివాఁడు

మార్గతి మి వి (మాఱు+గతి) వేఱుమార్గము.

సీ. తటి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి వడి చూపు లాదట బయలుపఱుప ...

భార. విరా. 5. 402.

మార్గతోరణము సం వి. అ న రాజమార్గమునఁ గట్టిన విజయసూచక మగుతోరణము

మార్గద్రంగము సం. వి. అ పుం రాజమార్గములో నున్నపట్టణము.

మార్గధేనుకము సం వి. అ. న. నాలుగుకోసుల దూరము (త్రి. ని ).

మార్గధేనువు సం వి ఉ. పుం నాలుగుకోసుల దూరము

మార్గబంధనము సం వి అ. న కాట్రగడ, కంప కోట

మార్గము సం. వి. అ. పుం. 1. త్రోవ, పద్య. 2 పరిశోధనము, పరిశీలన 3. సాధనము, ఉపాయము 4 కార్యము నడుపురీతి. 5. పద్ధతి. విధము. 6 (కవిత్వ) శైలి. 7. వెదకుట. 8. నృత్త గీత నాట్యముల యొక్క యున్నతశైలి. 9. (నాట్య ) తటస్థింపబోవుదానిని సూచించుట. 10 గుదస్థానము (త్రి ని.) 11. కస్తూరి 12 మృగశీర్ష నక్షత్రము 13. మార్గశీర్షమాసము. 14 సంగీతమునందు ఒకానొక భేదము, బ్రహ్మాదులచే మహేశ్వరునుండి తేఁబడి భరతాదులఁచే బ్రయోగింపఁబడు సంగీతవిశేషము (వ్యతి. దేశి )

ద్వి. లాలితశుద్ధసాళగములుఁ బెరయఁ, గ్రాలుచు దేశిమార్గంబుల వెలయ ...

బస పు. 71 పొ. 6 పం.

15. మృగసంబంధ మైనది.

ద్వి మంగళధ్వను లొప్ప మార్గరావముల, సంగత శ్రుతికూడి సరివీణ లొప్ప, వీనుల కింపుగా వినుపింప నపుడు ...

రం. రా. ఉ. 149 పొ. 6 పం

మార్గరుఁడు సం వి. అ. పుం. నావికుఁడు, పడవ నడిపి జీవించువాఁడు

మార్గవటి సం వి. ఈ. స్త్రీ. మార్గస్థుల రక్షించెడి దేవత (విఙ్యమ్ను.).

మార్గశిరము సం వి. అ. పుం. మార్గశీర్షమాసము.

మార్గశిరి సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష శుక్ల పూర్ణిమ.

మార్గశీర్షము సం వి. అ. పుం. మార్గశీర్షమాసము.

మార్గశీర్షి సం వి. ఈ స్త్రీ. మార్గశీర్ష శుక్ల పూర్ణిమ

మార్గస్థుఁడు సం విశే (అ. ఆ. అ.) దారి ప్రయాణము చేయువాఁడు, బాటసారి.

**మార్గాయణి** సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష మాసము (వై ని.)

**మార్గికుఁడు** సం. విశే. (అ ఈ. అ) 1 వేఁట గాఁడు 2. జాటసారి

**మార్గితము** సం విశే. (అ అ. అ.) 1. వెదకఁ బడినది, పరిశోధింపఁబడినది 2 ప్రార్థింపఁబడినది, వేఁడికొనఁ బడినది

**మార్గ్యము** సం విశే. (అ అ అ.) 1 వెదకఁ దగినది. 2 తుడువఁదగినది (శ ర )

**మార్చు**[1] స. క్రి. (√మారు[1]) నశింపఁజేయు

ఉ తూ ర్పరుణంబు గాఁదొడఁగె దుష్టనిశాచర వేళ యయ్యెడున్. మార్పుము కాలయాపన మొన ర్పక యప్పిశితాశిఁ బట్టి పా, లార్పఁగనేల...

భార ఆది. 6 219

**మార్చు**[2] – **మాఱుచే** స క్రి (√మాఱు),

1 వినిమయము చేయు, ఒకవస్తువు నిచ్చి మఱి యొకవస్తువును పుచ్చుకొను

చం. ఇతరులదానమేనిఁ దమయాగియయేనిని నన్ను మార్తురే, మతి వరశాధివాసగతి మాన్పఁ దలంచుట గగ్గినన్ సమం, చితముగ భక్తి నిచ్చుట కుశీలత మార్చుట నాకు హర్షభా,సితయుఁ బరాభవవ్యథయుఁ జేఁతసుఁడీ యిదె చాటి చెప్పెదన్ భార అను. 2. 359.

మ ....నెలంతల్ వణిగాకృతిన్ సరకుమార్చన్. . ఆము 2 12.

2. పరివర్తనము నొందించు

సీ. ... వగచినఁ దాపంబు వొందుట దక్క నొండు, గలుగునే సుఖము దుఃఖంబును దోడివ యవి మార్చి వచ్చును నరుగుచుండు ...

భార. అను. 5 230.

సీ సాలములతొంటిదళములు జర వహింప, మధుఁడు క్రొత్తదళంబుల మార్పనేమొ, పైక మలరెడి తవకల్మి ప్రబల నాఁటి, కొమ్మలఁ బ్రవాళతతులు గీల్కొల్పె వపుడు.

ఇందు 2 37.

గీ వేణువుపై వ్రేళ్లు మార్చి మార్చి, మురులుగొలిపితె గోవింద మందసతుల . .

ఆము. 5. 67.

3. మాఱుపడచు, రూపాంతరము నొందించు.

సీ. కమలషండము నున్నగాఁ జేసి యిరుసుగాఁ గావించి కెందమ్మి కండ్లు మార్చి ...

వీర. 2. 94

మ ఇమఁ దస్త్రాదికిఁ బోఁ గొల్లగొని నే: డేతేఁ తద్దీప్తి సం,జనసంబంధజశాంభవంబున దత్త్రిశాంశాఁగనానేత్రకో,ణనికాయంబుల డాఁచి లిద్ద వశిమన్ దాఁ బూనెనో చొప్పుమా,ర్పవవన్ వెల్వెలఁబాఱె దీపకళికా వ్రాతంబు శాతోదరీ.

మనుచ. 3 86.

4 వడ్డించు.

ద్వి అడ్డిసేయక యిట్టు లమరులబంతి, వడ్డించుచును వచ్చి వచ్చి యచ్చెలువ, తనముహకీర్తి ప్రతాప సంపదల, యనువుల వెలుఁగుచు నక్కడ బంతిఁ, గూర్చున్న శశధరార్కుల కమృతంబు, మార్చి..

విష్ణు. ఉ. 4. (శ. ర ).

**మార్జ** సం. వి ఆ స్త్రీ. త్రిస్నేహము, మూఁడు చమురుల కలయిక

**మార్జకము** సం విశే. (అ ర్జికా. అ ) శుభ్రము చేయునది, పవిత్రము చేయునది.

**మార్జన** సం వి ఆ. స్త్రీ 1. శుభ్రము చేయుట, పవిత్రము చేయుట 2 వాద్యవిశేషము యొక్క ధ్వని, మురజధ్వని.

**మార్జనము** సం విశే (అ ఈ అ ) పరిశుభ్రము చెయునది, బాగు చేయునది: పవిత్రము చేయునది (సాధనము)

వి అ న. 1 శుభ్రము చేయుట, పవిత్రము చేయుట 2 చేతితోఁ గాని కుశతోఁ గాని మనుష్యునిపై నీరు చల్లుట

పుం 1. లోధ్రము, లొద్దుగు (వృ వి ). 2 స్నేహము, చమురు (వై ని )

**మార్జని** సం వి ఈ స్త్రీ. సమ్మార్జని, చీపురుకట్ట.

**మార్జారకంఠము** నం. వి. అ. పుం. మయూరము, నెమలి.

**మార్జారకము** నం. వి. అ. పుం. 1. పిల్లి 2. మయూరము, నెమలి (వాచ.)

**మార్జారకర్ణిక** నం. వి. ఆ. స్త్రీ. పార్వతీసరిచారిక

**మార్జార(ల)ము** నం. వి. అ. పుం. 1. పిల్లి 2. ఇంగుదవృక్షము, గార చెట్టు 3. అగస్త్యవృక్షము, అగిసి చెట్టు

**మార్జారి** నం. వి. ఈ. స్త్రీ. 1. అడవిపిల్లి 2. పునుఁగుపిల్లి, ఖట్వాంగము 3. కస్తూరి 4. చమరీమృగము బోలిన ఒకానొకమృగము. వై. ని.

**మార్జారిక** నం. వి. ఆ. స్త్రీ. పునుఁగుపిల్లి (వై. ని.)

**మార్జారీయము** నం. వి. అ. పుం. పిల్లి (వాచ.) (విశ్వము)

**మార్జారీయుఁడు** నం. వి. అ. పుం. 1. శూద్రుఁడు 2. కాయశోధన చేయువాఁడు, శరీరశుద్ధి చేయువాఁడు

**మార్జాలకంఠము** నం. వి. అ. పుం. మయూరము, మగనెమలి

**మార్జాలకరణము** నం. వి. అ. న. రతియందలి బంధవిశేషము.

శ్లో. ప్రసారితే పాణిపాదే శయ్యాయాం శిథిలే ముఖే, ఉన్నతాయాః స్త్రియాః కట్యాం మార్జాలకరణం విదుః.

**మార్జాలకర్ణి** నం. వి. ఈ. స్త్రీ. చాముండ, దేవతలలో నొకతె

**మార్జాలీయము** నం. వి. అ. పుం. 1. పిల్లి. 2. యజ్ఞపాత్రలను పరిశుద్ధి చేసెడి వేదిసమీప స్థలము 3. అంగశోధనము, అవయవములను శుద్ధి పఱచుట (వై. ని.)

**మార్జిత** నం. వి. ఆ. స్త్రీ. పంచదారయుఁ గొన్ని సంబారువస్తువులును వేసిన పెరుఁగు, రసాల.

**మార్జితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. శుభ్రము చేయఁబడినది, తుడువఁబడినది. 2. రాపుడుచేయఁబడినది.

**మార్ష్టుఁడు** నం. వి. అ. పుం. చాకలివాఁడు, రజకుఁడు

**మార్తండము** నం. వి. అ. పుం. 1. జిల్లేడుచెట్టు. 2. సూకరము, పంది (మే. ని.). 3. పండ్రెండు సంఖ్యకు సంకేతపదము.

**మార్తండుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు

**మార్తికము** నం. విశే. (అ. ఈ. అ.) మృణ్మయము, మట్టితోఁ జేయఁబడినది. వి. అ. పుం. కుండముూఁత, మూకుడు, శరావము.

**మా(ఱు)ర్తుఁడు** వి. (√మాఱు జ. మార్తురు) వై. ". శత్రువు, పగతుఁడు

గీ. మెఱసి బ్రహ్మాండ మెల్లను మ్రింగ నట్ట్రు,వాసి మొనసించి ఐక్షగ్రహ్వారముఁ దెఱచెఁ, దెఱవ నుఱుకడి నర్కుఁడు తెరువు దప్పి, మార్తుఁడనఁ బోక మేఘునిమఱువుఁ జొచ్చె.

సీతావి. 1 20.

చం. పఱచి దవాగ్నిఁ బడ్డశలభంబులకై వడిఁ బార్థుఁ దాఁకి రూ,పతి సుతులున్ సహోదరులు నాలముఖం దెగటారఁ జూచి నీ, మఱఁది భయంబునన్ గలఁగి మార్తునకున్ శరణంబు చొచ్చె నే, తెఱఁగుననైన నానెగులు తీర్పఁగ నెవ్వరు నీవు దక్కఁగన్. జై. భా. 4. 64.

మ. ... కర్ణాది దుర్జనసంఘంబుల మార్తురం దును ముదున్ సంగ్రామరంగంబునన్ ...

భార సభా. 2. 296.

కం. తనుఁ దావఁ దొలుత గెలువన్, మనుజపతికి వలయుఁ బిదప మార్తుర గెలువన్, మనమునఁ దలంచునది ముని, దను గెలువనిపతికి గెలువఁ దఱమే పగఱన్. భార. శాం. 2. 276

కం. కీర్తిదనుఁ దైనయాతని, మార్తుర కని కరుగ నరిది మగువ ... నైష. 5 125.

గీ. అపుడు నరిమమగం డెద నలుక నిగుడ, గట్ల మాఱుతుపగతుని గాంచి పలికె . .

అచ్చ. రా. యు. 40.

**మార్దంగము** నం. వి. అ. న. పట్టణము.

**మార్దంగికుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) మద్దెల వాయించువాఁడు.

కెట్టు నిలుచు నచ్చు వాని యెదురం దిరమై
భార ద్రో 4. 205.

మ మదనాగ ఘటలు సేతు లెత్తి పఱవన్ మార్పొప్ప
కాపన్నులై, యెదురం గాల్కొని నిల్వ కు
క్కడగి ..
కు. సం 1' 602, కు సం. 10 623

**మార్బలము** వి వి. (మాఱు + బలము) ఎదిరి సైన్యము, శత్రుబలము

సీ మార్బలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి,
రథరాజి గలఁచి తురంగములఁ ద్రుంచి
భార. ద్రో 2 186.

కం ని బ్బంధము దుర్మానమ్ము దుర్బుద్ధికిఁ గాక తగునె
డుర్యోధన నీ మార్బలమె పాండవేయులు,
ధౌర్యైర్యము వాయు శుభము దలకొను
సంధిన్. భార. ఉద్యో 3 228
(భా. అ వ్యా. పా)

**మార్బలయు** అ క్రి (మాఱు+బలయు) ప్రతిఘటించు, ఎదుర్కొను

శా .. నాకేశబృందారకస్తోమం బెన్నఁడుఁ
దొల్లి మార్మలసి రెచోటఁ దొల్లి పోటొగ్గి సం,
గ్రామోద్యోగము సేసిర
కు సం. 10. 508.

**మార్మగఁడు** వి. (మాఱు + మగఁడు) ఉపపతి, అంకుమగఁడు

ఆ పడుగుఁ జేయువేళఁ బటము లల్లెడువేళ,
గూడు దినెడువేళఁ గూర్కువేళ, మగనిఁ
గన్నులార మార్మగలను గూడు, నింటి పొరుగు
నఖులయిండ్లలోన హంస 2. 24.

చం. .. అసమాస్త్రకేళిలోఁ, బలు మొన లాని మార్మ
గల పగ్గెలు దిగ్గులు చేసి ప్రోలువన్ గలసి
చరింతు రవ్విలువకత్తెలు మాడువి కత్తులో
యనన్ ప్రబంధ. 17.

**మార్మలఁగు** అ. క్రి (మాఱు + మలఁగు) వెనుకకు మరలు.

సీ ముగుదర మ్మని తాయ మగఁడు చీరినయప్డు
కదియక మార్మలంగెదవు సుమ్ము.
నిలా. 6 94

**మార్మలయు** అ క్రి మార్కొను (మాఱు + మలయు), ప్రతిఘటించు

కం. .. వారు వారిచిరి వృషభంబులక్రియ నొం
డొరులకు మార్మలయుచుఁ దాకుచు నుదాత్త
రభసోజ్జ్వలులై . భార ద్రో. 4 191.

సీ పులికైనఁ జెలఁగి మార్మలయఁ జాలెడుమేటి
యాఁబోతుఁ గిట్టి యుక్కడఁచె నేఁడు.
హరి పూ 6 9, శుక 1 213

**మార్మసలు** అ. క్రి. (మాఱు+మసలు) అపమార్గమున వర్తించు, తప్పదిరుగు

ఉ మత్తెరవోతె నూపడుచు మార్మసలన్ జళికింపఁ
బూని సీ వెఱ్ఱితనాలు మాన వవి వేడ్కని
టాడఁగ నింటనుండి దాఁ, జిట్టునఁ గోపగించు
కొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ వెఱ్ఱి
యగారు మంచిగురువే దొరికెం బదు వెట్లు
చెప్పనో. వైజ. 4. 12.

**మా(ఱుమా)ర్మాట** వి (మాఱు+మాట) ప్రతివచనము, జవాబు.

కం. తమనిగమంబులు గ్రమ్మరఁ, దమకుం దయ
సేయుటకును దగ వేడుకొనం, గమలాక్ష పద
ధ్యానవ, శమున న్మార్మాట లాడ నైరపక
యునికిన్ పరమ 2 118

**మా(ఱుమె)ర్మెడ** వి (మాఱు+మెడ) పెడఁబడినమెడ, ప్రక్కకు తిరిగినమెడ.

ఉ బెబ్బులి గొంతు క్రోల్గఱచి పెల్లున మార్మెడ
ద్రెళ్ల దాఁటుచున్ .. ఆము. 3. 20

వ. .. అవి గొంతు క్రొన్నెత్తురుతె క్రోలి విడిచి
చన మార్మెడలు వడి మళకవన దంశమ్ముల
మూఁగ .. మనుచ. 4 37

**మార్మొగమిడు** అ. క్రి. (మార్మొగము+ఇడు విముఖత్వము నొందు.

చం గిరివర ఘోరకందరలఁ గేవల వన్యగజైక వృత్తిచేఁ, దాలక యున్న సత్కృతము తప్పునె యప్పుడఁ గేసరుల్ నృకేసరు లయి పూర్ణ పౌరుషవిశాలత మించె మహానృకేసరిం, బరు నకు మార్మొగంబిడమి జక్కునఁ గ్రోధ పటల్ ఘటింపమిన్. వసు 5 45.

**మార్మొగము** వి (మాఱు + మొగము) పరాఙ్ముఖము, పెడమొగము

గీ. ఆ ప్రభావతి కొంత సేపవ్విధమున, మాన దుఃఖనిశ్చేష్టిత యైనవెనుక, నుస్సు రనుచును వేడి నిట్టూర్పు నిగుడ, వగలఁ బొగులుచుఁ బోలె మార్మొగము గాఁగ

ప్రభా 5 112.

చం. అనుటయు రామరామ యని యాయన కర్ణ యుగంబు మూసికొ నుచు నకట యెంతపాతకపు నుద్దులు వింటి మటంచుఁ జాలుఁ జాలు ను మిము నాప్తులుచు మదిలోఁ గడు నమ్ముట నింత వాటిలెం, జను మని మార్మొగం బిడిన సాధ్వస మందుచు వారలందఱున్ పరమ 3.66

సీ అటకి మార్మొగము గావట్టి పూరుషసింహ లన యంబు మూల నుండని మహేశులు ...

బిల్హ. 1 30.

**మార్మొగముపెట్టు** అ క్రి. (మార్మొగము+పెట్టు) పెడమొగము పెట్టు

చం పుడమి హిరణ్య శూన్యదశఁ బొందఁగఁ జేయక విక్రమంబుఁ జూఁ, పెడు సమయాన మార్మొగము పెట్టక పట్టక దేవతార్థ మె, య్యెడ దయ మాలి పుణ్యజనహింసకుఁ బోవక సంచరించినం, గడిమి నృసింహమూర్తి సరిగాఁ దగు నీశ్వర నారసింహుతోన్.

వరాహ. 1. 42.

**మార్మొన** వి. (మాఱు + మొన) ప్రాతికూల్యము, వ్యతిరేకభావము.

చం అలుగఁగ నేల మీరు వసుధాధిపు లెన్న స్వతంత్రులై మమున్, వల దనవచ్చు మీ మనసు వచ్చిన చోటికి నేగుఁ డేఁగినన్, నెల కొని నీ ప్రియాంగవకు నీకును మార్మొనలేక యుండవ, ర్మొలి నుండ బు గాఁ నొన చెగ.

నర... 5 170.

**మా(ఱుమొ)ర్మొరయు** అ క్రి (మాఱు + మొరయు) మాఱు మ్రోఁగు, ప్రతిధ్వని చెయు

కం చనుదెంచి రహితవీరులు, వను నాగుహ లాక్రమించి నడచిన మొఱయో, య ... లకు మొఱచే, సినగతి మార్మొరసె నద్రి సేనా ధ్వనికిన్ ... 91

ద్వి ఘుమ్మని ఘనగిరిగుహలు మార్మ్రోయ, హుమ్మని మ్రోయుచు నుర్వికుఁ జూచి

ద్వి హరి. పూ 20' 7 వ.

ఉ రా 2 78.

**మా(ఱుమ్రో)ర్మ్రోయు** అ క్రి (మాఱు + మ్రోయు) ప్రతిధ్వని చేయు, మాఱుమ్రోఁగు

మ అవనీభాగము కంప మొందఁగఁ ననేకాతూహి ణుల్ గోల్వఁగా, జవనాశ్వ దీర్ఘనాద ఘోషముల దిక్చక్రంబు మార్మ్రోయ భూ,ధవులెల్లన్ జని రాత్మధాములకు ...

ఉ రా. 5. 265.

**మాఱు(వె)ర్వెట్టు** స. క్రి. (మాఱు + పెట్టు) ప్రతిఘటించు, ఎదుర్కొను.

మ అతులోత్సాహముతోడ దానవబలం బార్వంగ దోర్వీర్యదర్పితుఁడై ఘోరన వచ్చి తాఁకె నమరుల్ భేదిల్లి భీతిన్ హహా, హతి మార్వెట్టక పాఱఁ దారకుఁడు గోపాసక్తి వీరాసురా, న్వితుఁడై యొక్కడి దంచు రోయుచు మహా వీరుం గుమారు న్వడిన్

కు సం. 12. 910.

**మార్ష్టి** సం. వి ఇ స్త్రీ. శుభ్రము చేయుట, పవిత్రము చేయుట (రూ. మార్ష్టి శ ర.).

**మాఱకము** వి. (√మాఱు) 1. క్రవినిమయము, ఒకవస్తువు నిచ్చి వేఱొక వస్తువును పుచ్చుకొనుట.

సీ. మాఱక మనఁగను మాఱుగడ యనంగ వినిమయనాభిధ వెలయుచుండు ...

ఆం. భా. 2 267.

2 వినిమయము చేయఁ గోరువాఁడు వినిమయము నంగీకరించుటకిచ్చు లాభము

(పై రెండింటిలో పెక్కుడు మారాయకు అర్థా మారుక మిగిలినను చెల్లించ దొరకుట లేదు.)

**మాఱట** విశే (√మాఱు) ప్రతిరూపము, ప్రతి

గీ ధర్మదేవతమాఱటతనువు నూనె, యాయధిక్షిరుజుజ్వలకాయ మింత, యెఱిఁగి కాదె యమ్మహిత యోగీశ్వరుఁడు సమీచ్యయోగబలంబున నితని గలసె భాగ. అశ్వ. 2 77

ఉ నవ్వక నవ్వునెమ్మొగమున న్నగు గుజారెడు వితతాంతియున్, మవ్వపుగ్రొమ్మెఱుంగుల కు మాఱటపైనటాటు రోచులుం, జిహ్వలు చేసి చేసి ఉ హరి 5 159.

ఆ. అఖదు కోతిమిన్న యనఁదరూపునఁ జని, ప్రోతఁబాగ కాలిమూలఁగవను. మాఱి యచటఁ గాంచె మాఱటమిత్తియో, యనఁగ బరగు లంకి జిపి తెలఁగి అచ్చ రా సుం 4.

**మాఱటనోరిది** విశే (మాఱట + నోరు + అది) అడినమాటలనే అడునది, చెప్పినదానినే మరల చెప్పునది

ఉ అఱిడిఁ బోకయున్ ఫలము నందుటయుం గని పల్కినేరమిన్, మాఱటనోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్పకే, గాఱులు ప్రేలెదన్ . భా. ఉద్యో. 3 107.

**మాఱుమ్మ(ము)** వి (మాఱు + అమ్మ) వేఁట కుపయోగించు సాధనవిశేషము.

సీ పకులు గువియలు వలత్రాళ్లు ప్రమోకులు బిసలు మాఱమ్ములు పెద్దదిండ్లు ...
శుక 1 165.

సీ తెరలు నుగ్గంబులు దీమముల్ మాఱము ల్మేక దాంకత్తులు మెకముబోను, లొట్టపైన గొడ్డండ్లు మెఱుఁగుబల్లెంబులు ...
రుక్మాం 3. 70.

**మాఱాకెత్తు** అ క్రి. (మాఱాకు + ఎత్తు) మాఱాకు వేయు.

కఁ అని నగచు మగున లదఱు, పని నెపమున నొక్క రొకరు పలికిన యజ్ఞాపనతాప్యలయించి నగన, మనమున నునుసిగ్గు దేఱి మాఱాకెత్తన్ పం పంచ 4 599.

ఇట అతిశయించు అని భావము )

**మాఱాకు** వి (మాఱు + ఆకు) రెండవయాకు ఉపఘ్నము అని శ ర.).

శా. పాదద్వంద్వము నేల మోపి పవనున్ బంధించి పంచేంద్రియో, న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకు న్మాఱాకు హత్తించి నిష్ఖేదబ్రహ్మ దావలంబనరతిం గ్రీడించు యోగీంద్రుమ, ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరపాదాక్రాంతి నిర్వక్రమై భాగ 8 65.

(బుద్ధిలతకున్ మాఱాకుహత్తించి — బుద్ధిలతను పల్లవింప జేసి అనిభావము).

గీ. రతులఁ బొలయించె నాళ రాజవదన, వతిశయప్రీతిలతిక మాఱాకు లిడఁగ

(మాఱాకులిడు — చిగురొత్తు, పల్లవించు)

శా. విత్తజ్ఞానము పాదు చిత్తము భవావేశంబు రఠాంబువుల్, మత్తత్వంబు తదంకురం బన్నృతముల్ మాఱాకు లత్యంతదుర్వృత్తుల్ పండ్లు .... కా శ 85

**మాఱాట** వి (√మాఱు) ఎదురాడుట, ప్రతికూలముగా మాటలాడుట.

గీ కర్ణునకుఁ జేయవలసిన గారవమున, గొంతియుంకను శ్రాద్ధ మత్యంతవిభవ, ముల్లసిల్లంగఁ జేయఁగా నుచితనిరతి, యావిధమునకు మాఱాటమూనె యెగ్గు భార. ఆశ్వ. 1. 116.

**మాఱా(రా)టము** వి. (√మాఱు) కలహము.

సీ. మనకు వేల్పులకు మాఱాటములు రాక పంచి పెట్టెద నని పడఁతి పూనె ...
భాగ. 8, 320.

(శ ర పా. 'మంచటలేకుండ' ముద్రి పా.).

**మాఱాడు** అ. క్రి (మాఱు + ఆడు ) 1. బదులు చెప్పు, మాఱుపలుకు.

కం కటిగాలు వట్టి వానిని, మడవక పదవఱఁడు మాఱుమాఱులు వీఁచెన్ ..
భార. ఆది. 6 214.

చం జగమెఱుఁగఁగ ద్రోణు ననిఁ జంపక ...
యించె జాతి న, న్మగఁటిమి — గ డిసి ఒలు
మాఱు నను ఒని లేదు ...
భార. భీష్మ 2 17.

చ. ఇరువది యొక్క మాఱు ధరణీశ్వరులం బరి
మార్చి . ఉ. హరి 4 122

మ ... కంజాతాతుఁడే జెక్కు మా, ... నిలో
కొల్చి ... ... ... దానవుల్
రాఘవా ... ఉ రా 2. 106

౬. రెండవతూరి పెట్టఁదగిన భోజ్యపదార్థము, రెండవసారి వడ్డించునాహారము

ఉ. మీఱిన యన్నశైలములమీఁద సమగ్రఘృత ప్రవాహముల్, పాఱఁగ యానపాత్రముల భంగి నపూపము లొప్పె నెవ్వరున్, మా ఱిడనీక క ద్దనియుమాత్రఁగఁ బాత్రలయందు నిండి దై, వాఱెఁ బదార్థసంఘములు ...
భోజరా 4. 102.

ఉ. వంచన వేల్పుఱెంకి కిటు వచ్చి యుపాంతము వందు ముందటం, గంచముఁ బెట్టుకొన్న యది కర్పురయుగ్మము మాఱు వెట్ట నే, తెంచుచు నున్నవాఁడు మనదేవర విష్ణుఁడు
హం 6. 125.

సీ. అడుగకమున్న మా ఱిడఁ దెచ్చి యాతఁ డే, మాత్రంబు వల దన మగుడు సిగ్గు ...
దశా. 6. 33.

ఉ ...పిణవిలోచన బంతివట్టి మా, ఱ్వెట్టఁగ దానివక్త్రి శశిబింబముఁ జూడఁగ నోడి ..
వైప. 6. 132.

విశ. 1. ప్రతి, బదులు.

సీ. మదిఁ దల్లితంద్రులమాఱుగాఁ గొని జను, లని శంబు భక్తి సేయంగ నెగడి ..
భార. విరా 2. 216

ఆ పుట్టినింటి కేను బోయి యెక్కించుక, యూఱ డిల్లి వత్తు నువిద నీవు, వింతదనము లేక విభు నకుఁ బ్రియము నా, మాఱుగా నొనర్చి మనుము నెమ్మి హరి. పూ 1 170.

ద్వి వేలుదేవతలఁ గావింప నింద్రునకు,మాఱింద్రుఁ గల్పింప మదిఁ దలంచుటయు
రం రా బాల. 58 పూ 19 పం.

క - తనకు గాఢ్యము గలిగిన, దనమాఱుగ ధర్మ శాస్త్రత త్త్వార్థవిధి,జ్ఞునిఁ బ్రాడ్వివాకు నుత్తము, జనవాథుఁడు పనుపవలయు సభ్యులకడకున్ ....
విజ్ఞా 3. 4

2. మఱియొకటి, అన్యము.

గీ మాఱుమానిసి లేకుండ మడిసి రెల్ల, వారు ..
భార శల్య 2 11

క .. వేలోకనిలుఁ గొని విమతుఁడు, దూఱఁగ హంసమేన నాఁకెుఁ దొమ్మిది యమ్ముల్, మాఱుసు బదింటఁ బొదివెం, గాఱియగా మఱియుఁ బఱపె గమిగొనఁ దూపుల్.
హరి. ఉ 1. 157.

చ. కలికిపిసాళినవ్వు లెసఁగ న్వటుధూర్తులు గొంద ఱొండొరుం, దలకొన నెచ్చరించి తమదండవుఁ గోలల నున్న మాఱుగోఁచులు వెసఁ బుచ్చి వైచి ప్రభా. 1 102.

గీ మాఱు యిచ్చెద నన్నచోఁ గూడు వెట్ట, రింత పచనస్థలంబైన నీయ రిట్టి, మాలకొంపకు వచ్చితి మాఱు లేక, గంజి వోయుదురే యిందుఁ గలుగువారు
శుక. 3. 182., భార. శల్య. 2. 259..

౩. సమానము, సాటి.

ఉ. పాఱినఁ జూచి కౌరవవస్థాలుఁడు సూత తనూజుతోడ నీ, కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్ర సంపదన్, మీఱిన నీవె మూడఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవుల్, మాఱె తలంప నీదగుబలంబును శేవయుఁ జూపు. మిత్త్రఱిన్. భార. కర్ణ. 3 .10..

మ .. భూరిస,మ్మదలీల న్విలసిల్లి ... ప్రతి జగ
న్మాన్య ప్రభావంబునన్, మదనాగంబునకు
బోలెం గ్రాలవలదా మా ఱెందు లే కున్నతిన్
కు ... 45

గీ ఒప్పులే యేటి మాఱు లేకుండ బ్రహ్మ, యంగ
కంబులు చేసె ... విక్ర 6 46

ఇ మారాటము, మార(ఱు)గాళ్లు, మార్కొను, మార్కొలు, మార్చు², మార్తుడు, మార్పడు, మార్పలుకు, మార్పు, మార్పెట్టు, మార్పేము, మార్మలయు, మార్మగడు, మార్మలంగ, మార్మలయు, మార్మసలు, మార్మాట, మార్మెడ, మార్మొగమిడు, మార్మొగము, మార్మొగము పెట్టు, మార్మొన, మార్మొరయు, మార్మ్రోయు, మార్వెట్టు, మాఱకము, మాఱట, మాఱటనోరిది, మాఱమ్మ, మాఱాకు, మాఱాకెత్తు, మాఱాట, మాఱాటము, మాఱాడు, మాఱుఁగాలు, మాఱుఁదల్లి, మాఱుకొను, మాఱుగడ, మాఱుచు, మాఱుదల, మాఱునీళ్లు, మాఱుపడు, మాఱుపలుచు, మాఱుపలుకు, మాఱుపాట, మాఱుపు, మాఱుపెట్టు, మాఱుబేరగాడు, మాఱుబేరము, మాఱుమగడు, మాఱుమనువు, మాఱుమనువుది, మాఱుమలయు, మాఱుమసలు, మాఱుమాట, మాఱుమూల, మాఱుమొగమిడు, మాఱుమొగముపెట్టు, మాఱుమొగమువడు, మాఱుమొగము సేయు, మాఱుమ్రోత, మాఱుమ్రోయు, మాఱురూపు, మాఱురూపువడు, మాఱువీడు, మాఱుసేత, మాఱుసేయు, మాఱొడ్డనము, మాఱొడ్డాడు, మాఱొడ్డు.

**మాఱుఁగాలు** వి. (మాఱు+కాలు) కృత్రిమ పాదము, కాలికి ప్రతియగు సువర్ణాది నిర్మిత పాదము.

గీ. కాంత యొక్కర్తు మూఁపునఁ గండ లిచ్చె,
మాఱుఁగా లిచ్చె నొకసుధామధుర వాణి. లలన
యొకర్తు నోరతాంబూలమిచ్చె, శక్రజాతర
సద్భక్తిశక్తు కెలఁగ పాండు 3. 77.

**మాఱుఁదల్లి** వి (మాఱు+తల్లి) సవతితల్లి.

సీ. పట్టలుదొరపట్టి పట్టపురాణి యే, మానినీమణు
లకు మాఱుఁదల్లి .. చంద్రా 3. 101.

గీ ముప్పునను గేరడము సేయు నవ్విదంబు,నైన
లేక యొకప్పుడు శమనుఁ గెలిచి, చ ...
మమ్మూఁ జాలిపై జాచె దన్న ..
హరి. పూ. 1. 177.

గీ మాలికరి దాని సైరంధ్రి మాఱుఁదల్లి,మగఁడు
విడిచిన సతి దూతి మంత్రసాని, జోగురాలాఁకు
లమ్మెడిబోటి విడఁగనని వర్తించు నవిజారగా
నెఱుంగు.
జై భా. 3. 80 , హరి. పూ. 2 170.

**మాఱుకొను — మార్కొను** అ క్రి, స. క్రి. ఎదుర్కొను.

ఆ. నాదు బాహుబలమునకు మాఱుకొనఁ జాలు,
భుజబలంబు గలిగి పోక చిక్కఁ, బెనఁగి ..
భార. విరా 2. 283.

ఉ. ఊఱట చెయ్యులం దివుట లూఁగఁగ దర్పము
లొండొకంటికిన్, మాఱుకొనంగ ము న్గనిన
మంజులసౌఖ్యరసంబు నిక్కలం, దాఱుచు.
హరి. ఉ. 7. 182.

కం. దురమున నీ కా రాచూ,లురతోడ న్మాఱు
కొని గెలువరాదు సుమీ ...
అచ్చ రా యు. 463

కం అరదంబురవము సెలఁగగ, శరములు వాయు
జునిమీఁద సాంద్రముగ వెసం, గురియుచు నడ
రెడు భీష్ముని, సరభసముగ మాఱుకొనియె
సాత్యకి గడిమిన్ భార. భీష్మ. 2 224.

గీ. పాండవులసైన్యమును సముద్దండలీల, మాఱు
కొనె . . భార. శల్య. 1. 385.

గీ మలసి యంకెలు వైచుచు మాఱుకొనిన, వృష
భములఠంగి నక్కురువృషభు లిట్లు, సమదగతిఁ
జేరునెడఁ జూచి రమరులు ...
భార. విరా. 5. 165.

గీ. మాఱుకొన్న ఏదర్పైకుఁ జాఱఁవోలె ..
విప్ర. 4. 112,, శైవ. 3. 15

**మాఱుగడ** వి. (√మాఱు) మాఱకము, వినిమయము.

సీ. మాఱక మనఁగను మాఱుగ యనఁగ, వినిమయ శాఖిప వెలయుచుండు ...
ఆం. భా. 2. 167.

**మాఱుచే — మార్చు** స. క్రి. (√మాఱు) వినిమయము చేయు

**మాఱుదల** వి. √మాఱు మాఱుట, మాఱుపాటు (శ. ర.)

**మాఱునీళ్లు** వి. బ. (మాఱు + నీళ్లు) స్త్రీలు ఋతుస్నాన మైనమఱునాఁడు చేయుస్నానము (శ. ర., వా.)

**మాఱుపడు** అ. క్రి. (మాఱు + పడు స్వార్థమున.) 1. ఎదిరించు, మాఱుకొను.

ఉ. మాఱుపడంగ లేనియసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలఁ, దేఁటిపిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై ... భాగ. 1. 154.

ద్వి మగఁడు వాలును వభిమానంబు విడిచి, మొగములు వగులంగ మొత్తులాడుదురె, వతితోడ నతి మాఱుపడెనేని పుణ్య, గతి కేఁగ కది నరకంబునఁ గూలు.
ద్వి. హరిశ్చ. ఉ. 1140 పం.

2. తాఱుమాఱగు. వ్యత్యస్తమగు,

గీ ఆఁడుబిడ్డ సహోదరుఁ డఖలగుణస, మగ్రుఁడుగఁ గోరుఁ గావునమదిఁ దలంచి, మనము చరువులు రెండును మాఱుపడఁగ. వారిగింతము మంచిది యట్టులైన ... వి. పు. 6129.

3. భేదపడు. వ్యతిరేకభావము కలిగియుండు.

కం. ఓకేఁడ నీకు మది వే, మాఱును గుందంగవేల మానసికనుకన్, దేటి కనుంగొనుచో మఱి. మాఱువడం గలరెయొట్టిమన్నీ లైనన్.
అచ్చ. రా. అర. 107.

4. ప్రమాదపడు. పొరపడు

సీ. ఒంటరవు నీవ కావె మహాత్మ నేఁడు, మాఱుపడి యొగ్గు నేసితి మఱవ వలయు ...
భాగ. 10 ఉ. 68.

**మాఱుపఱుచే** స. క్రి. (√మాఱుపడు) తాఱుమాఱు చేయు

ద్వి. కిడుకులు మాఱుపఱుచుపాలిఁడ్లు ....
అ. మ. క. 5. 247 పొ. 3 పం.

(తాఱుమాఱుచు అని భావము.)

**మాఱుప(వ)లుకు** అ. క్రి. (మాఱు + పలుకు ఎదురు చెప్పు, ప్రతికూలముగా మాటలాడు.

సీ. ... పతికి నెప్పుడు మాఱుపలుక వీవు.
కాశీ. 2. 72.

**మాఱుపాటు** వి. (మాఱు + పాటు) మాఱుపడుట. వ్యత్యాసము (శ. ర.).

**మాఱుపు — మార్పు** వి. (√మాఱు) 1. వర్తనము. మాఱుట.

చ. ... విలాసముల్. మనసువకున్ సుఖాస్పదము మాఱుపు లందినమేను లందు రజ్జనుబకుఁ గామ భోగముల జన్మఫలంబునఁ బొల్తు రంగనల్ ..
కు. సం. 7. 959.

2. వినిమయము. ఒకవస్తువు నిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట (శ. ర.).

**మాఱుపెట్టు — మార్పెట్టు** అ. క్రి. (మాఱు + పెట్టు) ప్రతిఘటించు, ఎదిరించు (శ. ర.).

**మాఱుబేరగాఁడు** వి. (మాఱుబేరము + కాఁడు) మాఱుబేరము చేయువాఁడు.

(వ్యవ.) నే నీయావును మాఱుబేరగానియొద్ద నాలుగురూపాయలు లాభ మిచ్చి కొంటిని,

**మాఱుబేరము** వి. (మాఱు + బేరము) ఒకవస్తువును గొని దానిని దిరిగి లాభమునకై విక్రయించుట.

సీ. గుట్టెఱుంగు ది దేల గురులతో గుటగుటల్, బిగియక చనఁగదే బిసరుహాక్షి. కుసిగింపులిడ కేఁగు కొన్నయంగడిలోన, మాఱుబేరములేల మంజువాణి చంద్రా. 6. 185

కం పాటిగ మిఱుఁ బల్లుం బేర్చా లేమియు
లేక కానఁబడి నీలశిలా పేటిక నిండంగా నిడు,
కాటుకయుఁబోలె నై జగంబులఁ దమమున్
పి. శకుం. 3 150.

**మిఱు²** విజ చలించునది.

(మిఱుమిట్లు కలచి యని క ర దీనియామ్రేడిత రూపము మిఱుమిఱు.)

కం ఘలుగలు వలుదపిసలు, చిఱుదోఁ
కయుఁ బసిఁడి యొడలు సిరి గలవాడలున్, నెఱి
మొగము వొక్కకొమ్మును, మిఱిచూపులుఁ
గలిగి విభుఁడు మీనంబయ్యెన్
భాగ 8. 717

జ. మిఱుమిఱు

**మిఱుమి(ర్మి)ట్లు (ట్టులు)** వి. బ (మిట్లు + మిట్లు) 1. కన్నులు మిక్కిలి చలించుటలు.

సీ ఉఱుముచుఁ దళతళ మెఱచుచందంబున
గర్జతో మిఱుమిట్లు కడలఁ దోఁప ..
భోజరా 4 287.

2 మెఱవు మున్నగువానిం జూచుటచేఁ గలుగు దృష్టిచలనము. (చూ మిఱుమిట్లుగొను)

**మిఱుమి(ర్మి)ట్లుగొను.** అ క్రి. (మిఱుమిట్లు+కొను) మెఱుపు మున్నగునధిక తేజస్సును జూచుటచే దృష్టి మిక్కిలి చెదరు, కన్నులు చీకట్లు గ్రమ్ము.

కం మెఱసి యుదయించుగ్రహముల, తఱచు
ప్రభలఁ గ్రేణి సేసి దళదిశలం గ్రిక్కిఱిసి
వెడల నావిండ్లన్, మెఱుఁగులు నృపతనయు
దృష్టు మిఱుమిట్లుగొనన్.
భార. విరా. 4. 114

గీ మిక్కుటంబుగ దృష్టి మిర్మిట్లుగొనఁగఁ, జెదల
వెలుఁగొందు దివ్యతేజంబు చూచి ...
భాగ. 10. ఉ 1306

ఉ. చంచలనేత్ర పోవునెడ సన్నపుఁ బయ్యెద
కొంగు జాఱఁ గాంచుచు గాని చన్నుఁ
గవ| కేవలఁ బ్రోవులు గట్టియున్న క్రొమ్మిం
చుల నాదుచూడ్కి మిఱుమిట్లుగొనం గన రాక
పోయె రాజ. చ. 3 88.

వ ... అపు డప్వీరభద్రతేజోవిశేషంబును గనుఁ
గొనఁ గన్నులు మిఱుమిట్లుగొన వెఱచఱచి
యొలుఁగు డించి తొలంగిరి ... భీమ 6. 60

గీ. కనులు చెదరంగఁ జీకట్లు గ్రమ్మ ననుట, కలరు
మిఱుమిట్లు గొనె నన నద్రినిలయ ...
ఆం భా 3. 109.

**మిఱుమి (ర్మి) ట్లు (ట్టులు) గొలుపు (ల్పు)** స. క్రి (√మిఱుమిట్లుగొను) దృష్టిని చెదరఁజేయు.

సీ. మెఱుఁగులు చూడ్కుల మిఱుమిట్లుగొలు
పంగఁ దేకతారుల బయల్ చిమ్మువారు ...
కళా. 8 41

సీ కమ్మి దీసినలీలఁ గనుపట్టునెమ్మేని మిసమిసల్
గడు మిఱుమిట్లుగొలుప ...
సారంగ. 2. 42.

ఉ మిక్కిలి తేఱిచూడ మిఱుమిట్టులుగొల్పుఁ
జరించునప్పు డమ్మక్క దళుక్కునన్ మెఱసిన
ట్లగు . . విజ. వి 3. 14.

సీ. మించి దృష్టికి మిఱుమిట్లుగొల్పెడి నిది తెలియఁ
గారు మెఱుంగుఁ దీఁగె యేమొ ...
ఉ. రా 4. 189.

చం. .... చన్నులఱిగి రేఁగి చూపఱకనుంగవకున్
మిఱుమిట్లుగొల్పఁగన్ ...
దశా. 2. 317

సీ. బెరసి మొగిళ్లు నెత్తురువాన గురిసెను మెఱుఁ
గులు దెసల మిర్మిట్లుగొలిపె ...
భాగ 3. 604.

గీ. కఱకుటడిదంపు బెడిదంపు మెఱుఁగుగములు,
మిగులఁ జూపఱచూడ్కి మిర్మిట్లుగొలుపఁ,
బొసఁగఁ బదినూర్ల తత్తడుల్ పూనినట్టి,
పసిఁడితే రెక్కి పోరికి బయలువెడలె.
అచ్చ. రా. యు 184.

**మిఱుమిట్లుపోవు** అ క్రి (మిఱుమిట్లు + పోవు) మిఱుమిట్లుగొను.

సీ మెఱుఁగులఁ గన్నులు మిరుమిట్లువోవఁగ .
కుప. 1.

ద్వి మిఱుమిట్లువోవఁ మీఱుక సందు, వెడవెడ కందసీ దరువడఁగనీక .
ప. ఉత్తా. ద్వి. 6. ప్రా

**మిఱుమిఱు** విశ (√మిఱు²) మిక్కిలి చంచలమైనది, మిగుల చలించునది. (మిక్కిలి మిఱుమిట్లు గలది అని శ ర)

కం దట్టపుదురుమును మీఁదికి, బిట్టెంచిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్, నట్టాడు నడుముఁ దేనియ, లుట్టెడు మోవియును మనము నూఱింపంగన్ భాగ 9 608.

**మిఱ్ఱు = మిఱు¹** వి శౌ అనౌ మిట్ట, ఉన్నత భూమి

కం పెనుమిట్టిది పల్లం బిది, యనకుండఁగ నోలమును బయలు నొక్కటిగఁ గనువిచ్చుటయును మోడ్చుట, యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్ భార విరా 2 321

ఉ పల్లము మిఱ్ఱు వేఱుపఱుపన్ వెఱ వేదెడు నట్లుగాఁ దమం, బెల్లెడ నిండఁ బర్విటయు ... దశకు. 9. 8

సీ. ... అన్నరాధముండు

గీ వేగ వట్టోడి యెల్లను వెడలి మిఱుత, నొక వనస్పతి జొంపమై యున్న దానిఁ, జెంది ... భార శాం. 3. 307.

కం ముసివ.సి నవ్వులు నవ్వుచు, మిసిమింతుఁడు గాక యొక్క మిఱుత నిలిచి య, క్కుసుమ శరవైరుఁడు తపసులు, కసమసఁ దనుఁ బట్టుకొనఁగఁ గడఁగినఁ బెలుచన్. హర 5. 57

కం. గుట్టముఁగొనిపో బుద్ధుల, కుట్టఁడ మీఱాత యొద్దకున్, నీతంద్రుల్, వెఱ్ఱులు నీ కైరదె యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్ భాగ 9 215.

గీ. మెట్ట యన మిఱ్ఱు నాఁగఁ దోఁచు నుత్తాన నామంబు .. ఆం భా. 1 158.

జ మిట్టమిఱ్ఱు

**మిలసము** న- వి అ న 1. కలియుం, సమావేశముగట

**మిలమిల** వి. 1 వృడ వస్తువుల మెరలట, మెఱఁగులు, మె. వాసియు: ఎగుద్వరి కను కరణము

సీ. తళతళకాండలలో మిలమిల మెరలెడు కర పడిఁబుల నవకుడములను . .
భాః ద్రి. ౯౬౮.

వ. పుట్టపట్టల గొట్టి గడ్డుచీమఁ జారు జాముల మిలమిల మెఱలుచెదల . ప్ర క ధ 156

వ .. చాపకట్టువడిన ఘోట కంబుల క్రింద మిలమిల మెఱగెడు రావుతులను ..
ఉ హరి 2 27.

2. తళతళ మెఱయుటయం దగుననుకరణము

చం. మిలమిలమంచు మించు చకిమించుల ముద్దుల చందమామకాం, తులఁ దులఁదూఁగు .
శ్రీ ం . 254.

3 తళతళ కాంతి.

(దీనికి కర్మధారయమునందు నిగాగమము)

సీ మిసిమి గుల్కు మెఱుంగు మిలమిలల్ చెక్కులఁ గాశ్మీరపత్త్రభంగముల మనిచి ...
చంద్రా. 6 124.

వ ... మీమొగంబుల మిలమిలలు గిలుబాడ వచ్చెఁ జమీవెన్నెల బచ్చుముచ్చు .
వసు 4 28

వ మిలమిలని జిలుఁగు వలిపెంపు వలువలతెరల యొడల వెలువడి ... భీమ 1 117.

కం. మిలమిలని ప్రొద్దుపొడుపున, ధళధళమను మెఱుఁగు దిగ్వితానము నిండెన్ ...
భాగ 10 ఉ. 1002. హంస, 4 221.

జ మిలమిలన, మిలమిలమను, మిలమిలలాడు.

**మిలమిలన.** వి. (√మిలమిల) మిలమిలమను కాంతి విశేషము

కం. తలతలమను పల్లికలం, గలకల నిడి తమ్మి పూలఁ గలకల నగుచున్, మిలమిల నై తల తల నై, కలగలమాన్నమ్మ నిడిరి కలగలలల నల్. బహు. 4. 19.

మిఁమిలమను అ క్రి. (మిలమిల+అను) మిల మిఁ లాడు, మిలమిలప్రకాశించు

వ ... హరివాణంబుల మిలమిలమను ధవళకల మాన్నంబులు గిన్నియల నించి ... వరాహ. 4 165

మిలమిలలాడు అ క్రి. (మిలమిలలు+ఆడు) తళ తళ ప్రకాశించు.

చం మిఁమిలలాడుచుం డవిలి మింట వెలింగెడు రిక్క లన్నియున్, జలజల రాలఁ దన్నుదునో ... అచ్చ. రా సుం 22.

మిళిందము. సం. వి అ పుం. తుమ్మెద, భ్రమరము

మిళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిసినది, కూడినది.

మిల్లి. వి. (క మిల్లి) అల్పకంబి, చిన్నగరిటె.

గీ. మిల్లి యన నల్పకంబి, యా మిహిరభూష ... అ భా 2 243

మిళిగె వి. (క. మిళి) కొరడా, చేలుకోల, కళ ద్వి కల్ల గుఱ్ఱమునకుఁ గంకటిం బట్టి, ముల్లును మిళిగెయు మోపుట గాక, యుత్తమాశ్వములు వాగెత్తిన రౌతు. చిత్తానఁ గలయట్లు చెలరేఁగి దాఁటు. ప్రభు. 3 92. పొ. 20 పం.

మివులు — మిగులు. (దీనితుమున్నాద్యర్థక రూపము క్రి విశ. గా ప్రయోగింపఁబడి యెక్కువగా, అత్యంతము అనునర్థములనిచ్చును.)

చం తివిరి త్రియామకు న్నొసగు దిద్దుకొనంగఁ బురోదశాళి దా, గవిసెన వెన్నెరించుమణి కల్పితదర్పణమో యనంగఁ గై, రవకుల బంధుమండలము రాశిలె నోలిని నూలియమాన మై, మివులఁ గళంకలక్ష్యతఁ దమిప్రతిబింబము నంత నేర్పడన్. ప్రభా. 4. 122

ఆ. మొగిలుద్రిప్పు నుఁటిముద్దులపట్టి దా, నరిగి నేలకాన్పు నంసి వచ్చు, నెలమిఁ దెలిపి యా పెతఁమానికము రాగ, పుల కొసంగుట యు మివులఁ జెలఁగి. అచ్చ. రా. సుం 178.

మిశి. సం. వి ఆ. స్త్రీ. 1. పెద్దసదాప (వృ.వి.) 2 జటామాంసి (వృ వి ).

మిశ్రకము సం. విశ (అ ఆ అ) 1 కలసినది సంకరమైనది

వి అ. న 1 ఉప్పునేల (ఊసరక్షేత్రము) మొ. నుండి తీయఁబడినయుప్పు 2 ఇంద్రోద్యానము, నందనవనము

మిశ్రజము. సం వి అ పుం కంచరగాడిద.

మిశ్రణము సం వి అ న. 1. కలుపుట. 2. (గణిత) మొత్తము చేయుట, కూడిక

మిశ్రము సం. విశ. (అ. ఆ అ ) కలిసినది. వి అ పుం 1 ఒకజాతి యేనుఁగు.

2. కృత్తికావిశాఖా నక్షత్రములగుంపు.

న 1. మూలకభేదము, ఒకజాతి ముల్లంగి. 2. ఊసరలవణము.

మిశ్రవర్ణము. సం. విశ. (అ. ఆ. అ) మిశ్రమైనరంగుగలది.

వి. అ. న కృష్ణాగురువు.

మిశ్రశబ్దము. సం. వి. అ. పుం. కంచరగాడిద.

మిశ్రితము సం. విశ. (అ. ఆ. అ.) 1. కలుపఁబడినది 2 చేర్పఁబడినది. 3. గౌరవార్హమైనది, పూజ్యమైనది.

మిశ్రుఁడు. సం వి. అ. పుం. 1. గౌరవార్హుఁడు, పూజ్యుఁడు.

(ఇది గొప్పవారల యొక్కయుఁ బండితుల యొక్కయుఁ బేరుతర్వాతఁ జేర్పఁబడును. )

ఉదా : వసిష్ఠమిశ్రుఁడు, మండనమిశ్రుఁడు, మొ

మిశ్రేయ సం వి ఆ స్త్రీ సదాప (వృవి.)

మిషము సం. వి అ పుం స్పర్ధ, విరోధము, ఛలము

వ వ్యాజము, సాకు, నెపము నైష. 1. 56.

మిష్టము సం విణ (అ ఆ అ.) 1. మధురము.
2 తడిసినది, చెమ్మగిల్లినది

వి అ ఫం మాధుర్యము

మిష్టాన్నము సం వి అ న తియ్యనియన్నము' రుచిగలపదార్థము

మిస వి. కాంతివిశేషము, ఒకవిధ మగుకాంతి (దీని యామ్రేడిత రూపము మిసమిస)

కం చన్నులపస యటుమీఁదట, గన్నులపస ముద్దుగుల్కఁగ ముఖమున మేల్, క్రొన్నెల మిస జిగిబిగివగ, చిన్నెలమన చూచి వలచుఁ జిత్తజుఁడయినన్ హంస 2. 98

ఱ మిసమిస, మిసమిసమను.

మిసమిస. వి (మిస + మిస) 1. అధికకాంతి, విశేషకాంతి

సీ కమ్మఁదీసినలీలఁ గనుపట్టునెమ్మేనిమిసమిసల్ గడు మిరుమిట్లు గొలుప ... సాంంగ 2. 42.

సీ. వినుమానికముచాలు గొనఁ జాలుతనడాలు వలుదెస మిసమిసల్ గలయ వెలయ ... సమీం 3 98

సీ. ధగధగత్ప్రజ్వలత్పటుతటిల్లతికాళి మిసమిసన్ మెఱసి యాకసము నిండ ... శుక. 1 187.

2 మెఱయుట యందలి యనుకరణము

కం. .. కోమలతనువుల్, మిసమిస మెఱవఁగ వేశ్యావిసరము ... భాగ 10. ఉ. 686.

వ . మిసమిస మెఱయుచున్నయంబు లాస్యంబులం జర్వించి గర్వించి ఱంకెలు వేయుచుంకలును. ... చిత్ర. భా. 3. 135

(కర్మధారయమునందు నిగాగమము.)

లయవిభాతి మిసమిసనిచన్నుగవపసకు వెసమాఁద్గినలువసమకళికల్ చిదుమ నెనఁగుతటి శాఖా, విసరములుగ్రమ్మఁ గరబిసనటనఁ ద్రోచి ... రా. వి 8 107.

వ ... విలసితగ్రైవేయక ముక్తాఫల హారనిచయంబుల కిమ్ముగ చూపక మిసమిసనిపసఁ గల మెఱుంగులు గిఱికొన ... భాగ 10 ఉ 831.

మిసమిసమను. అ క్రి (మిసమిస + అను) మిసమిస ప్రకాశించు

సీ గిఱికొన్న పల్లజంజులు వెద్రుకలవాఁడు మిసమిసమను మిట్టనొసలివాఁడు .... వరాహ 2. 45.

కం మిసమిసమనుసిరు లెసఁగెడి, కిసలయవిసరము హసించు కేలన్ సకియ, యసమశరుఁ గన్న గన్నసామికి, గుసుమములసరిమ్మొ లయుతఁ గూరిచి యంతన్. ముకుంద. 3 244.

ద్వి మిసమిసమను వీకిమెఱుఁగుఁ జెందొవలు గనిమసంగెడు వైరికంటి తుండములె ద్వి హరిశ్చ పూ. 1108. పం

మిసి[1] వి కాంతివిశేషము.

(దీని యామ్రేడితరూపము మిసిమిసి)

గీ. ఇట్టిపస మిసిజిగి బిగి యీవిధంబు, ప్రణుతి సేయంగఁ దరమె యాబ్రహ్మకైన ... హంస. 1. 85.

ఱ మిసిమి, మిసిమిసి.

మిసి[2] వి మత్స్యవిశేషము.

సీ. మిసి కల్లరుజు తేలుమీను ... హంస 4. 187.

మిసి సం. వి ఇ. స్త్రీ 1. సదాప (వృ. వి.)
2. జటామాంసి (వృ. వి.).

మిసిమి. వి. (మిసి[1]) 1. కాంతివిశేషము, లావణ్యము

మ. నవలావణ్యరసంబు పశ్లేంములోనం బోసి యగ్రంబునన్, భవదీయాస్య మొనర్చి యార్చి పిదపం బ్రాలేయరుజ్మండలం,బు వినిర్మించె విరించి యచ్చిలుము వోఁ బూఁబోఁడి యాచిహ్న మం, బువులం దాతఁడు చేఁదొలంచుమిసిమిన్ బుట్టెన్ సరోజాతముల్. నైష. 8. 193.

గీ పసిఁడిగట్టున కొకవింతమిసిమి నించి, నెఱసెఁ గసపావి మరుసలి తెలుపయొండ ..
పారి. 4 43.

సీ మెఱసి నిల్కడచూపు మెఱపులో యొఱపు బిత్తరుపు లోతరము నిద్రాపసిండి, పసిమిలో మిసిమి రిబ్బరపు సంప గిపూతావిలో తావి ...
ఘటికా. 2 87

2 నవనీతము, వెన్న.

సీ పాలమున్నీటి లో పలిమీఁది మీఁగడ మిసిమి జిడ్డునఁ జేసి మేను వడసి.
భాగ. 8 268.

సీ మినుకు టాకుల వాని మిసిమిమేఁతలవాని మెఱుఁగుజాముని చాయ మేనివాని ...
పాండు 1. 213.

గీ మిసిమి గలపుల్ల పెరుఁగుతో మిళిత మైన యావ పచ్చళ్లు చవిచూచి రాదట మున ...
నైష. 6. 130.

3 భాగ్యము, సంపద.

సీ గుట్టు పోనిచ్చినఁ గిట్టుఁ జెడ్డటికంబు దుర్వ్యక్తి యపరుఁడైనఁ దొలఁగు మిసిమి ...
రామలిం. 48.

4 (హిం. మిస్సీ) పండ్ల కప్పు.

(అంధకార వర్ణనము)

సీ బ్రహ్మయై యుదయించి భానుఁడు లయ మొంద నెరసినచతురబ్ధినీర మనఁగ, సమయంపు యమునిఁడు జాలిల్లి కువహార మొసఁగఁ దెచ్చిన చెక్కుమిసిమి యనఁగ
చంద్రా. 5 49.

(వ్రాఁత ప్రతిపా. మిసిరి. ముద్రిపా.

విశే. 1 లావణ్యముగలది, తళతళలాడునది

సీ ఒనపరి మిసిమి నెన్నొసలిగసల్ గాంచ మొలక క్రొన్నెల జమల్ మ్రొక్కవయ్యె
దశా. 8. 151.

కం ఉరముల మణిహారంబులు, కటములఁ గట కాంగుళీయకప్రముఖములున్, శిరమున మిసిమికుళాయులు, ధరియించి చెలంగి రఖిలతరుచ ముఖ్యుల్
ఉరా. 5 270

కం. తనుఁ దునుమఁ దలఁచుతత్కా, ల నికన్నను మున్నె యతఁడు మిసిమికటాన్, దునిమి ఒలి యొసఁగె సాహస మెనయం దల మొత్తి బాస యిచ్చెన నునుమన్
శుక 2 77.

2. స్నిగ్ధము, నున్ననిది

గీ. దండఱము కాణమునఁ జేర్చుదరడెయును బ, సిండిబురుసా మిసిమిగవిసెన సరులుచు, నిద్ద పువివంచియును నిల్వుటద్ద మమరఁ, బడకయిలు సొచ్చె నప్పు డప్పుడమిఁ జేడు.
రా. వి. 5. 86

గీ. చిక్కన మిసిమి మిహి జిడ్డు జిగురు జిగట, ... అన, స్నిగ్ధనామములు చెలఁగును . .
ఆం భా. 2. 252.

**మిసిమింతుఁడు.** విశే. శ్రమనొందినవాడు, అలసినవాఁడు.

గీ. ... శిఖండి నటుమార్గణాబులఁ గడఁగి యేయ, నతఁడు మిసిమింతుఁడును గామి కల్ల నవ్వి, పఱపెఁ దనయమ్ము లతనిపై ఫల్గునుఁడు ..
భార భీష్మ 3 398.

కం. అంతఁ దెలిసి యసురద్విషుఁ, డెంతయు రథ సమున శత్రు నెదిరి కదిసి దు, ర్దాంతగతి బ్రేయఁగా మిసి, మింతుఁడు గా కాతఁడొక్క సమిద్ధపు శక్తిన్.
హరి. ఉ 1 180.

సీ మిసిమింతుఁడును గాక పసియించుఁ గుత్తుక బంటినీరము బుడుగు టి చలిని....
పాండు 2 29, శీను 1 110.

**మిసిమింతురాలు** విశే. శ్రమనొందినది, అలసినది.

ఉ చక్కనివారిలోన నెఱజాణలలో విటరాజ కోటిలోఁ, జిక్కనివారిలోఁ గడుఁ బ్రసిద్ధి వహించిన నీవు ప్రాణము, లిక, నచోట నీ మనసు ధైర్యమున మిసిమింతురాలు గా, నక్కట పుష్పసాయక మహాకరినాత్మలువో మృగేక్షణల్.
హర. 3. 85

గీ లోచలోచన మిసిమింతురాలు గాక, వహ్ని

కీలలలో నిట్లు వన్నె చెడక, యున్న దిది చా
చిత్ర మోహారో తలంప, వినియుఁ గనియు
నెఱుంగ మివ్విధము నెచట.
హరిశ్చ. 5 140.

**మిసిమిసి¹.** వి. (మిసి¹ + మిసి¹) అధిక కాంతి
ద్వి బిట్టుదాఁటుచు జిగిబిగి నేసరించు, పుట్టచెం
డ్లారితిఁ బొదలుదుప్పులును, మిసిమిసిలంపులు
మేసి తాఁ గ్రొవ్వి, దుముకులువారి గంతులు
గొనులేళ్లు. నవ 146 పొ. 26 పం.

**మిసిమిసి²** వి. మేఁక చేయుధ్వని కనుకరణము.
వ. .. అయ్యజవల్లభుండు సురతసంతంత్రుఁడై
మిసిమిసి యనుశబ్దంబు సేయుచుఁ దచ్ఛాగి
వెంటం జని .. భాగ 9. 5..

**మిసుకు(గు).** అ. క్రి. (క. మిసుకు) 1 కదలు, చలించు.
గీ అకట యే మందు చల్లియిల్లాలి కైన, నెఱ
గలదు గాని వానిలో నడచుదాని, కుబుసు
పోకకు నేని వేఱొక్క దారి, మిసుకఁ గూడదు
మేరకు మేరగాదు. కువల 4 183.
గీ ఎన్నివిధముల మాటాడ కున్నయట్టి, గట్టి
పూనిక నీయందుఁ గలిగెనేని దాని కొక
యుక్తి మునుమున్నె తలఁచినాఁడ, మిసుగ
వచ్చునె విటశిఖామణుమ మెసుట.
నిరం. 3.17

2 వడఁకుఁ, భయపడు.
గీ .. ఒకరి కొకటి, యొసఁగఁ బొసఁగునొ
మిసుక రాదో పరులకుఁ, బుట్టినిల్లలె నత్తయి
ల్లెట్టు లగును .. పాంచాలి 5. 52.

**మిహి.** విశ. 1. ప్రశస్తము, చొక్కము
సీ. మిహిపసిండిపరుంజు మొహదా కెలంకులరావు
గుజ్జరినేఁత కేవడంబు ... మనుచ. 4 28.
కం. నునుగఱులు తళుకుమీసలు, మినుమినుకను
కన్నుదోయి మిహిటుందనపుం, దనువుం గల
యొకమీనము .... దశా 1. 131.
ఉ ఈ మధురాధరంబుజిగి యీవిగిరోరపుఁ జన్ను
దోయితీ, రీమురిపంపుతేనగవు రీమిహి బంగరు
రంగొరంగుమేను ... మీర. 2. 48

2. స్నిగ్ధము, నున్నని
గీ చిక్కనవి మిమి మిహి జిడ్డు జిగురు జిగట
.. అన, స్నిగ్ధనామంబు లెలగును ..
ఆ. భా. 2. 252.

3 క్రొత్త, నూతనము,
గీ క్రొత్తమిహి హొస యనఁగ మీఱును
నవంబు ... ఆం. భా. 2. 2..

**మిహిమల** = మేరుపర్వతము.
క. తుహినాంశుని గెల్చెద నని, మిహిరోరగి లోక
ములు క్రమించి యయమునన్, ఒహుయోజన
ముల పొడ వగు, మిహిమలతుదఁ జేరి విశ్ర
మించిన యంతన్ ఉ. రా 4. 46

**మిహిక** నం వి. అ. స్త్రీ. మంచు, హిమము.

**మిహిరము.** నం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు, అర్క
వృక్షము
న జలము, నీరు (శే ని.)

**మిహిరాణుఁడు.** నం. వి. అ పుం. శివుఁడు. (త్రి ని.).

**మిహిరుఁడు** నం వి. అ. పుం. 1. సూర్యుఁడు
2. చంద్రుఁడు. 3 వాయువు. 4. వృద్ధుఁడు.
5. మేఘుఁడు

# మీ

**మీ¹.** స. నీ శబ్దబహువచన రూపము. (చూ. నీ)
కం మాయందు లేనిగుణములు, మీయనురాగ
మునఁ జేసి మిగిలివెలింగెన్ భార. అర. 1.3.

**మీ².** విశ. (త. మీ. క. మే.) వృత్తియందు
మీఁదిశబ్దమునఁ దొలియచ్చుమీఁదివర్ణములు
లోపింపఁగా మిగిలినరూపము.
(దీనికిఁ బరుపవర్ణము పరమగునపుడు నుగాగమం
బగు.)
ఉదా : మీఁగడ, మీఁగాలు, మీఁజేయి మొ.

మీగండ్లమెకము. వి. (మీఁదు + కన్నులు + మెకము) శరభము, ఊర్ధ్వలోచనము. (శ. ర.)

మీగడ = మీవడ. వి. (మీఁదు + కడ. త. మీక్కడై, మింగడ) కాఁగిన పాలమీఁదిపెట్టె. మండము ; పెరుఁగుమీఁదిపెట్టె, మస్తు వు.

సీ. తొలఁకి మింటికిఁ బొంగుదుగ్ధపాథోరాశికర డులమీఁది మీఁగడల మెఱుఁగు ...
మనుచ. 5. 38.

సీ. కనరు వోకుండఁ గాఁచినయానవాలతోఁ గడి నేయ వచ్చుమీఁగడలతోడ ...
పి. శకుం. 1. 135.

సీ. మీఁగడ యంచన మీఱు మండాభిధ ...
ఆం. భా. 2. 256.

చం. ... పేరినమీఁగడతో మనఁబులన్, పసిఁగొనఁ జేయువాహరిపులమ్కృయణీవధిపిండ ఖండ ముల్, -మెసవిరి కంఠదఘ్నముగ ...
నైష. 6. 129.

సీ. నేరంబు లో మెడునియతికానికి గట్టిమీఁగడ కానుక గాఁగ నిచ్చు ...
శుక. 2. 557.

మీఁగడతెర. వి. (మీఁగడ + తెర) భక్ష్య విశేషము.

వ. ... పొంగలి పుళియోగిరము దధ్యోదనంబు తిరువీసంబు పరమాన్నం బావవాలు జున్నులు మీఁగడతెరలు నవనీతంపుఘుటికలు ..
ప్రబంధ. 112.

మీఁగాలు. వి. తె. (మీఁదు + కాలు) పాదో పరిభాగము.

మ. ... ఆ, హరిశ్రీపాదతలంబుఁ దాఁకుకొని యయ్యస్త్రంబు మీఁగాలని ,షురవేగంబుననుచ్చి పోయె ...
భార. మౌ. 83.

మ. ... అం, దము లై మీటెడు తెల్లచాలు గమి లోనన్ గొమ్మమీఁగాళ్లు చూచి మదిన్ జూడఁగ వీనిపాట గలదే చెప్పంగ నెచ్చోఁ గవన్ ...
యయా. 4. 50

కి. కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్లు దనరు ...
ప్ర. భా. 2. 88. ఆం. భా. 2. 185.

మీఁచే(జె)యి. వి. (మీఁదు + చేయి) చేతి పై భాగము.

సీ. మీఁచేయి నాఁగను మీఱుఁ గరోపరి భాగంబు ...
ఆం. భా. 2. 189.

మీఁటగు. అ. క్రి. (మీఁటు + అగు) ఒప్పు.

చం. ధర యనుకొల్నిలో, మొలచుతామరపూవనఁ గోట మీఁటగున్ ...
పాండు. 1. 106.

కం. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపురూపు మీఁటగువారిం, జాలి భయలజ్జలన్నియుఁ దూలి చనన్ వెన్నుఁ బటచి తొలఁగక కలయున్.
హంస. 1. 221.

మీఁటు. స. క్రి. (క. మీంటు, త. మిట్టు) ఇది సానుస్వార మని చి. ని. నిరనుస్వార మని శ. ర. నిరనుస్వార మనుటకు మనుచ 2. 70. ఆము. 2. 54. బహు. 8. 68. వసు. 2. 156. నిర్ధారకము లున్నను. భార. ఉద్యో. 4. 407. ను బట్టియు. కన్నడమునుబట్టియు సానుస్వారముగా గ్రహింపఁ బడినది.)

1. వీణె మొ. వాయించు, ప్రయోగించు.

ఉ. ... సురాంగన లాడఁ గిన్నరుల్, కిన్నరమీఁటి పాడఁ దిలకించుచు నిద్యోడ కేలరాఁ డొకో...
వసు. 5. 58.

చం. విపంచి మీఁటగతి ప్రయోగి యఖల్ వెడలెం గొలంకులన్ ....
మనుచ. 3. 60.

చం. నఖరాంకురమ్ముల నయమ్మునఁ దంత్రులు మీఁటి గాన మిం, పొనరఁగఁ జేయువాణి ప్రతి భోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్ ...
పారి. 1. 5

2. ఎగజిమ్ము.

ఉ. ఆతతలీలఁ గోమలనవాంశుకపాళి మహాంధకారనం, ఘాతము మీఁటి నద్భుతముగా శశలాంఛనుఁడభ్రవీథికిన్ ...
భీమ. 2. 59.

రగడ. తెలివ యొచటనుండి పాలుతెంచి తెంచితే
సరాలు, మెఱుఁగుబోఁడి చెక్కు చెమటచీ టు
మీఁటుమిగులఁ జాలు ... వరాహ. 3. 92.

ఉ. పోటన బంతి మీఁటుగతి భూవరుఁ డంప్రిన
ఖాంచలంబులన్, మీఁటిన గట్టు బి ట్టెగసి
మేదిని వ్రాలు ఘనస్వనంబువన్, హాటక శైల
కూటకటాళిఁ బ్రతిధ్వని బర్వె ...
వసు 2. 166, మనుచ 3 28

3. త్రోయు, తట్టు, వ్రేలితోఁగొట్టు

కం. ఏటు వడి ధర్మ మనుబరి, దాఁటిననామనను
లోని దర్పము వెడలన్, మీఁటి కరాంజలి మణి
మయ, కోటీరాగ్రమునఁ బెట్టికొని యిట్లంటిన్.
వరాహ 7. 86.

మత్తకోకిల. మేటివెల్లు దగన్ త్రికూటము మీఁదఁ
జూడుము దృశ్యమున్, దాఁటి మాయను
మాటిమాటికిఁ దాల్మిచే నటు మీఁటుచున్.
సీతారా. 1. 156.

సీ. చల్ల నమ్మఁగఁ బోవుసతులకొంగులు వట్టి
మెఱుఁగుచెక్కిళ్లను మీఁటిమీఁటి ..
భాగ. 10. 692.

సీ. పడకటింటికిఁ జెలుల్ ప్రార్థించి యనుపుచోఁ
దలుపు మీఁటితిఁ జూమీ తతనితంబ ....
శుక. 3 500.

ద్వి. శిశువులు వాపోవఁ జెక్కిలి మీఁటి, విశదాత్మ
పాలు ద్రావించుచందమున ...
ద్వి హరిశ్చ. ఉ. 196 పం.

ఉ .. అ, ప్పాటలగంధి వేదననెపం బిడి యేడ్చెఁ
గలస్వనంబుతో, మీఁటిన విచ్చు గుబ్బచనుగుబ్బల
నశ్రులు చిందువందగన్ ... మనుచ 2. 70.

4. పోఁగొట్టు, తేలికగాఁ బోఁగొట్టు

సీ. ... తులువలబలుక్రొవ్వు దొలఁగ మీఁటె.
సీతా. 1. 12.

సీ. మిత్రాధికారంబు మీఁటి వేయఁగ వచ్చు
మహితోపకారంబు మఱవ వచ్చు ...
రామలిం 7.

5 ఏయు, (బాణాదులను) ప్రయోగించు.

ఉ. ... మరుఁడును జిల్కతత్తళా, మీఁదఁ జివు
క్కునం బడి తమిన్ మగతుమ్మెదనారి సింగిణిం,
బాదుకొనంగఁ జేసి యొకపారియ మీఁటెను
బువ్వుఁదూపులన్. మధుసేనము 1 145.

2. పెఱుకు, ఊడదీయు.

ఉ ఎవ్వఁ డొకో లయాంతకుని నేనని మార్కొని
కోఱ మీఁటె వాఁ, డెవ్వఁడొకో పురాంతకుని
యెక్కుడుకన్నరకాఁడదన్నె.
భా రా అర 1 158.

7 (వేలు) కుట్టు

కం. దరఁ దేలు మీఁట కున్నను, గర మసదుగ
లెక్క గొనరు గదరా ... సుమతి. 31.

కం తే లనుచు బిగియఁ బట్టిన, మే లెఱుఁగునె
మీఁటుగాక ..(శ. ర.)

8 తీసివేయు, పోఁగొట్టు.

సీ. కర్ణాభరణహల్లకము వోవ మీఁటెడుతెఱఁగున
గొబ్బున దీపమార్పి ... విక్ర. 8 96

మ పొలయుం గాడ్పు లుదబ్జపాలయవదంభో
జాతవతుస్తుల,స్థలఘుస్రజస్మకరందబిందువుల...
తాపత్రయి మీఁటి ... ఆము. 1. 78.

9 విడుచు, త్యజించు.

గీ. వీని వెడలఁగ ద్రోయుఁడి వీటికోట, దాఁటు
నందాక ననుమాట నోట నుండ, నీటు వో
మీఁటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వున
వచ్చితి బెదరు పుట్టి కువల. 4. 71

వి౹. (వీణ. మొ వానిని) మీఁటుట

శా ఔరా రాగము బాపురే యెదుగు తాయం
బుల్ బళి స్థాయిసం, చారిప్రావులు లెస్స
కంపితము మైచా గోహా మే లమ్మయ,
య్యారే మీఁటు... వాల్మీ. 3. 129.

సీ. మేటియై మజ్జారె మీఁటు వహించె నింపయ్యో.
నయ్యారె కంపితంబు ... సమీ 6. 219

శా ఔరా మీఁటు బళీరె కంపిత మహో యాందో

శితస్ఫూర్తి . చంద్ర. 1 127.

2 ఎదురుపాటు. (ఉద్రేకము అని శ. ర

కం మీఁటు గలరాజభిక్షుల, నాఁటికి వేపుర వదింతు
నరుశరములు నో, నాఁటి పదవై చునంతకు.
భా. ఉద్యో 4. 407.

3 సొగసు

సీ మీఁసేరుపడి మంచిగోసేరు వెట్టినమురువు
చూపట్టెడు ముక్కుకెక్కు .
వాల్మీ 3 119

చం చూ, చెద విపు డన్నియున్ నృపతిచెంతఁజెలి
యనుమాట మీఁటుగన్ ... కకు. 3. 143

సీ మేలిమై మజ్జారె మీఁటు మీఁటు వహించె నిం
పయ్యో నయ్యారె కంపితంబు . .
సమీం 6 213

సీ. కోలగోడల నైన మీఁటుగా నెగఁ బ్రాఁకి దాట
నేరనిదేటి తలిరుఁబోఁడి .

హంస. 1. 102. (ఇట వాక్యాలంకారము.)
హంస. 1. 193.

4 మల్లవిద్యావిశేషము.

క. ఇది మెన యిది వలు కిది పో, టిది మి టిది
చూ టిది దుము కిదె యిదె యని తా, రుదిరి
పడి పండ్లు గీఁటుచు, సదమదముగఁ గాలుఁ
గేలు జంటఁ బెనంగన్. ప్రబంధ 786

విశ. 1 శ్రేష్ఠము.

శా. వీట స్త్రీఁ బగుణోటు లేటివంటదన్ వేమాఱు
గ్రీడింప . . వసు. 1 111.

ఉ. పాటలగంధి నీపెదవి పైకొనునాపలు మోపఁ
గాఁజుమీ, మీఁటమృతంబుకంటె . .

బహు. 3. 68 ద్వి పరమ. 7. 531 పం

2, పెద్దది, గొప్పది.

ఉ. మీఁ టగుమీల నెల్ల మును మ్రింగి క్రమంబున
నానె నెండ పె, న్నీటికవెంటఁదోఁచు .
బొమ్మడాయ డా, తూఁటకులంపులెజెన బకోట
కులం బజల హ్రదంబులన్ ఆము 2. 54

3 అందమైనది, ఒప్పైనది

చ సిజసంభవుండు పురసారసగేహినికిన్
రచించున, చ్చెరు వగుసీలపుంగుళుపు జెక్కిన
మేలిసి ది ముద్దుటుం, గరమన మింటితో
నోరయికన్ గనుపట్టెడు గోపురస్ఫురద్గురుతర
ాతకు శరుచి గుంభితసాలము వీట మీఁటు
గన్ చంద్రా 1 8.

4 (తత్కాలమునకు) ఉచితము, తగినది.

వ . రెండుతెఱంగులవారును బోరాడు
వేడుకను మీఁ టగుమాటల సందడించుచున్న
సమయంబున . . . భాగ 8 331.

జ మీఁటగు, మీఁటుకొను, మీఁటుమిగులు

మీఁటుకొను స. క్రి. (√మీఁటు) చిమ్ము, విజృ
ంభించు

సీ కొనగోళ్ల నుదుట గ్రమ్మిన పెంజెమట
మాటిమాటికిఁ దిగిచి పో మీఁటికొనుచు . . .
వైజ 1. 131.

మీఁటుమిగులు అ. క్రి (మీఁటు + మిగులు)
మిక్కుటమగు, అధికమగు, అతిశయించు

గీ తురంగమేధమఖస, హస్రములఁ గల్గు
కమ్మనిహవ్యతతులు, మీఁటుమిగులంగ మెసఁ
గిననోటనుండి . . . వరాహ 12. 61.

గీ అసదృశం బగు తనగతి నొసలఁ గన్ను, గలుగు
నంతటిబలు వేఁటకానిసార, మేయముల కైనఁ
బట్టీక మీఁటుమిగిలి, చనదె యూహాపోంభూదార
మనఁగ నపుడు. వరాహ. 12 31.

మీఁదఁజూచు = గర్వించు, ఔద్ధత్యమునొందు.

కం సిరిపెంపునఁ గడు నొప్పెదు, సురనాయక
యిపుడు మీఁదఁ జూచెదు . . .
భార. శాం. 4. 435.

మీఁదమీఁద = ఉత్తరోత్తరమున, ఒకదాని వెంట
నొకటిగా.

ఆ. మీఁదమీఁద సుఖనిమిత్తంబు లొదవుచో,
నడుమఁ జెందు నిజజనంబుపీడ . .
కళా. 5. 32.

**మీఁదవచ్చు** = దండెత్తు, యుద్ధమునకు వచ్చు
సీ తనమీఁద వచ్చినఘను లగుదొరలను నూటిపై నొక్కని గీటడంచి , రంగా. 1. 112
జ. మీఁగండ్ల మెకము, మీఁగడ, మీఁగడతెర, మీఁగాలు, మీఁజేయి, మీఁదిమిక్కిలి, మీఁదిసాకిరి, మీఁదుమిగులు

**మీఁదికిమీఁద** = వెంటనే, శీఘ్రముగ
ఉ ఆయవనీసురేచయం బురుసత్త్వుల నుగ్రులన్ మహాకాయులఁ దగ్గణాధిపులఁ గాంచుచు మీఁదికిమీఁద జీవముల్, వోయిరి . . .
కు సం 2 201

**మీఁదిసాకిరి** వి (మీఁదు + సాకిరి) ఉత్తరసాక్షి. (శ ర)

**మీఁది(దు)మిక్కిలి** విణ (√మీఁదు) వయి పెచ్చు అధికము.
కం. వను విడిచినఁగొంపోయినఁ బనికొదవలు లేమి సరియె పత్త్రిక చేఁ జిక్కినయది నీ విఁక నీఁగి లిన నొచ్చుట మీఁదిమిక్కిలి వివేకింపవ్.
ప్రభా 3 145.

కం అలుఁగులపోకడలను మై, యలయికలును మీఁదుమిక్కిలై కడు లోనై, బలములు తమ తమబాహా, బలములు నటఁ బనికి రాక భయ విహ్వలులై. విజ. వి 3 156.

**మీఁదు.** వి తె (త. మీదు) 1. ఉపరిభాగము, పై.
కం. మోఁదు మెడ ద్రొక్కు నెక్కును, మీఁదికి నెగయించు వంచు మెయి సారించున్ . .
ఉ హరి 6 103.
ఉ మేరుమహామహీధరము మీఁదికి నందఁబోయి యేత్రియన్ . భార. ఆది. 2 9.
చం . . కలమము లుండు . . . దృష్టి లోఁ, దలకొన వంగి మున్ జలము ద్రావెడు క్రిందటి వేళ్ల మీఁదటన్, నిలిపి మరంద మానుకరణిన్ నికటోపవనానిలావహతిన్. ఆము 1. 67.

2. అంతస్తు, మేడపైభాగము, నిలువు.
ఉ మేడలమీఁదు లెక్కి యలమేనకఁ గ్రేఁతయొనర్పు ప్రాయపుం, జేడియ లబ్బురంబయిన చెంగలువల్ తగఁ జల్లి రందఱున్
యయా. 4 156.

3 ఉత్తరకాలము
సీ పైతృకం బగుటకు . ధర్మజుఁ డిప్పుడు దాల్చిన నాతనితనయుండు మఱి దాల్చి దాల్చు మీఁద . భార ఆది 6 127.
చం. . . . ఏటికిఁ దత్తరపాటు మీఁది చే, టెఱుఁగవు నీవివేక మిపు డెక్కడఁ బోయె . సారంగ 2. 14.
చం. తలకొని యున్నతొంటిసుకృతంబుకతంబున వచ్చి మీఁదటన్, గలిగెడు శోకనంబులకుఁ గారణమై . . . విక్ర 4. 5.
మ అనుచున్ ఱెప్పలు తేలవైచుచు విశుష్యత్కంఠయై రుక్మిణీతనయా మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ . . .
ప్రభా. 5. 6.
(ఇట నుత్తరజన్మ మని భావము)

4 ఉత్తరకాలఫలము, ఉదర్కము.
గీ కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి, మీఁ దెఱుంగరు మా కేమి మేలు కాక, నాలుకలు గోయు నర్జునావలము దలఁచి, యొరగొనంగని సంతృప్తి యొసఁగ మెసఁగు
భార. ఉద్యో. 4 12.
కం పోఁ దడవు లేదొ క్రమ్మఱ, రాఁ దడవది లేదొ యీసురభి యడకించెన్, మీఁ దెఱుఁగనైతి నటమట, నీఁదించి యథేచ్ఛఁ జనియె నింకే మందున్. భోజ రా 6. 57.

5. దేవతాదులకై నియమించిన ముడుపు.
శు. కాటికేనికి మీఁదుగాఁ గట్టియున్న, గట్టి వరహాని వరహాని గాఁగఁ జూడ, కాడఁబోఁ గూడ కొక్క మాటాడకుండ, గుండనికి రంగుబంగారు గోరు సేసె. శుక. 3. 50.

6. తృతీయార్థక ప్రత్యయము, కరణార్థకము

గీ. తడవులకుఁ గల్గె మనుజయూధప్రచండ, పలల పారణతద్రక్తపానకేళి, లాలానామోద మీసు మాళంబుమీఁద, వరుస నందఱు గతులు వైవుఁడింక. కువల 2 102.

ఉ. లేవడిమీఁద వాలిసలు లేనికతంబున నూరకుండి నన్, బోవమి నప్పుసప్పులకుఁ బోవుట వేఱుగఁ దోఁచె నేమొకో. శుక 2 375.

7. పంచమ్యర్థకప్రత్యయము, కంటె

ద్వి కావున నేనును గౌరీశుమీఁద, దైవంబు లేఁడని తల యిచ్చి వడయు, దు . . . పండితా. వావ 241.

8 ప్రస్తవ్యర్థకము, ఎడల.

గీ బాలుఁ డితండు మీమీఁద భక్తి గలఁడెఁ, చెయునా వీఁడు సులభుఁడై చెప్పినట్లు . . కాశీ. 4. 15.

సీ . విహితసదాచార విధులమీఁది, శ్రద్ధమతి యనంగఁ గ్రస్తుతి కెక్కును . . . కళా. 5. 146.

గీ. తపసిదెందంబు వెన్నచందమునఁ గరఁగెఁ, గల యికలమీఁదితిమురునఁ దొలఁగుచుండఁ, జిత్తజుని సేన లెంగోలు చేసినట్లు, కులుకుఁ బలుకులఁ జిలుకలకొలికి పలికె. విప్ర. 3. 87.

9 వశము, అధీనత.

కం కాపురుషులమీఁద నిడకు కాంతాభరంబుల్ . . . ఆము 4. 214.

10 పయి, పైకి,

ద్వి ఇచ్చలో భరతేశుఁ డిట రాముమీఁద, వచ్చు చున్నాఁ డని వడి నిశ్చయించి . . . రం రా అయో. 119 పా. 16 పం.

విశ 1. పైది, మీఁద నున్నది.

శా. . . . పాలిండ్లపై నూత్నము,ర్యాదన్ జెందు కరంబు క్రిందగుటమీఁదై నాకం బుంట వేల్,గాదే రాజ్యము గీఁడ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. భాగ. 8 592

సీ. విరించి మెప్పించి సప్తమునులకంటె మీదై యొప్పు ననుపమానసుస్థిరజ్యోతిరాత్మకస్ఫురిత పదవి, వడసె . . హరి. పూ 1. 57.

2 అధికుఁడు, గొప్పవాఁడు

ఉ ఒప్పిద మైనసీకరుణ నున్నతుఁ డై మఱి మీఁదుగా జగఁ, బిప్పిళితాశి యేఁచు . . . ఉ. రా 2. 176.

వ. అని మనసిజుండు మీఁదు లేక పలికిన విని రతి పరమేశ్వరుమాహాత్మ్యంబుఁ దలంచి వెఱచియు నిట్లనియె . . . కు. సం 4 427.

మీఁదుగట్టు — దేవతాదులకు సమర్పించుటకై సిద్ధ పఱచి యుంచు

ఆ తవకు మీఁదుగట్టి తగ నియ్యఁ బాటినాఁ, డనుమ నీరపాణి యాపనేసె . 6 341.

మీఁదుగా — గుండా, ద్వారమున.

వ. అందుండి ప్రభాసతీర్థంబుమీఁదుగాఁ జని కాశీ. 3. 111.

మీఁదుపోవు — దేవతాదులకై కట్టియుండు ముడుపు సొగు

గీ. వేళ గాకున్నఁ గడపనివేలుపులకుఁ, మీఁదుపో కున్నఁ గడపని మిన్న కెట్లు,గడపె నింటింట నీకాశికాపురమునఁ, బుణ్యగేహిని యిది మహా ద్భుతము గాదె కాశీ. 7 129.

మీఁదులుచూచు = సిగ్గు మొ వానిచే ఆకసమువై చూచు.

గీ. తిరిగి చూచినయంత నాద్రిమ్మరిఁడు, సిద్ధ మొక్కటి యేనియుఁ జిక్కు నీక,మ్రింగి మీఁదలు సూచుచు మృదులభణితిఁ, బిలిచి యి ట్లను శరదిందుబింబముఖిని. పాండు 4 171.

మీఁ(దులె)దెత్తు = దేవతాదులకు సమర్పించుటకై నియమించి యుంచు.

సీ. తొలుచూలుకా న్పాట దురుసౌనె ప్రసవార్తి యిలువేల్పులకును మీఁ దెత్తి రారె . ఇందు 3.

సీ శుద్ధవేళ సుఖప్రసూతి గావలెనంచు నిలువేలు లకు మీఁదు లెత్తరమ్మ . కువల 2 26.

సీ కొడుకుగుఱ్ఱఁడు చన్నుఁ గుడవక ట్లుంట విచారించి మేదరిసానియపుడు,.. ఇలువేలుపులకు మీఁదెత్తియునుం గవ్వములు గట్టియును భక్తి పూర్వకముగ పరమ. 1 129

వాడుకలోని ప్రయోగ విశేషములు

1 వాడు జీవనమున్నకై దేశము మీఁద పడెను

2 ఆ తప్పు నామీఁద పడెను

3 ఈ కవి రాజుమీఁద రెండు పద్యములు చెప్పెను.

4 నేను నా పనిమీఁదనే యున్నాను

5 ఈ మందు నెమ్మదిమీఁద పనిచేయును.

6 ఈ సంవత్సరము పొగాకుమీఁద హెచ్చు పన్ను వేసిరి

7 మాటమీఁద మాటవచ్చి యీవిషయము చెప్పివేసితిని.

8 నీ మీఁద నాకు కోపమా ?

9 వానిపని గడియలమీఁద నున్నది.

10 పిల్లమీఁద పిల్లనిత్తురా ?

**మీఁదుమిగులు,** అ. క్రి (మీఁదు + మిగులు)

1 పై పెచ్చగు

గీ నీపరిగ్రహములును మున్నిపుడు మీఁద, మేలు చేయంగఁ గోఱు గావు మీఁదుమిగుల, వధిక దుఃఖంబు పుట్టించు .. ప్రబోధ. 5. 21.

2 మించియుండు, మట్టుమీఱు

సీ మఱి సాటి లేని నైర్మల్యంపుమేడలు మిన్నుల కేవిట మీఁదుమిగులు .. ప్రబోధ. 1. 39.

3 విజృంభించు, చెలరేఁగు.

కం. యాదవవిరహిత యగుఁ గో, మేదిని నాచేత నేఁడు మీఁదుమిగిలి సం, పాదితబలులై హారిరుద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్ భాగ. 10 పూ. 1525

**మీటు.** వి. పతప్రమాను క్రిందికి మీఁదికి నాడుట కాడాని మగుటిల

సీ మీటనా తిన యవ మీ ఉత్సాతనకీలము ... ఆం భా. 2. 293.

(పతప్రమానిక్రింది యంభాగము. అని శ.)

**మీఢము** సం విణ. (అ. ఆ. అ. 1 నీటితోఁ దడుపఁబడినది 2. మూత్రితము

**మీనకేతనుఁడు.** సం వి. అ. పుం. మన్మథుడు.

**మీనఘాతి** సం. విణ (న్. సీ. న్) చేపలఁ బట్టువాఁడు. వి. న్. పుం. కొంగ.

**మీనము.** సం వి అ. పుం 1. మత్స్యము, చేప. 2 మీనరాశి

**మీనమేషములు లెక్కయిడు** — సోమరితనమున వృథాకాలక్షేపము చేయు.

గీ పరబలం బిదె నీప్రజ్ఞపనికి రాదు, లె మ్మింకము మీనమేషము ల్లెక్కయిడక ...
సిం. నార. 23.

**మీనరంకుఁడు** సం వి. అ. పుం. చేపలు తిను నొకానొకపక్షి (త్రి. ని.)

**మీనరము.** సం. వి అ. పుం. మకరము, మొసలి.

**మీనవల్లఁకి.** వి (సం. మీనవల్లికా) మీల ముచ్చు, పక్షివిశేషము (శ ర).

**మీనవల్లికా** సం వి ఆ. స్త్రీ. వర్తిక, పక్షివిశేషము (శ. ర)

**మీనాండి.** సం. వి. ఈ. స్త్రీ శర్కర, పంచదార. (రా. ని.).

**మీనాఘ్రీణము.** సం. వి. అ న. 1. చేపలపులుసు 2. కాటుకపిట్ట

**మీనాలయము** సం వి. అ పుం. సముద్రము.

**మీను.** వి. (సం. మీనః క. మీను. త మీన్. బ. మీలు. దీనికిహల్లు పరమైనపు డుత్వలోపము. ఉదా. మీన్నోల మొ)

1. మత్స్యము, చేప.

గీ. నమ్మి యిల్లడ వెట్టినసొమ్ము గొనిన, మీను

లోనగు నీచపుయోనులందుఁ, బుట్టు ...
భార. అను 4. 267.

తరలము. తనువు మీనొప్పల సల్చుజాలరి దానను ... భార. ఆది. 3. 40.

గీ. మీనుపిల్లలజన్మంబు మే లనంగఁ, బడునె ...
దశా. 1 138

కం. జాలరులు వలల నచ్చటి, మీలఁ దిగుచుచుండి యయ్యమేయోగ్రతవ,శ్శీలునిఁ గూడఁగఁ దిగిచి ... భార. అను 2. 259.
అం భా. 1. 159

2 జలజంతువు (ఈయర్థమున నిత్యబహువచనము)

కం. జలరాశిఁ దిమి తిమింగిల,ములు నాఁ దగు మీల నత్త్వములు వినలేదే ... దశా. 1. 153.

జ స్టీమీను టెక్కెముపాఁడు, మీనురూపురిక్క

మీనుటెక్కెముపాఁడు. వి. (√ మీను) మీనకేతనుఁడు, మన్మథుఁడు.

ఆ. మేలుబలముపాఁడు మీనుటెక్కెముపాఁడు, నిఖల మెల్లఁ గలఁచు నేర్పుపాఁడు, పచ్చవింటిపాఁడు పరగ బల్పుపుటమ్ము, గలుగుపాఁడు ప్రౌఢగతులపాఁడు. వీర 2. 91.

మీనురూపురిక్క. వి. (√మీను) రేవతీనక్షత్రము (శ. ర.).

మీమాంస. సం. వి ఆ స్త్రీ 1. లోతుగాఁ దెలిసికొనుట, పరిశీలన, పరిశోధనము.

2. షడ్దర్శనములలో నొకానొక దర్శనము.

(ఇది పూర్వమీమాంస, యుత్తరమీమాంస యని ద్వివిధము)

మీమాంసకుఁడు. సం. వి. అ. పుం. 1. విమర్శించుపాఁడు, పరిశోధించుపాఁడు.

2 మీమాంసాదర్శనము ననుసరించుపాఁడు, మీమాంసా మతస్థుడు.

మీమాంసనము. సం. వి. అ. న. పరిశోధనము; విమర్శనము

మీమాంసనుఁడు సం. వి అ పుం. మీమాంసకుఁడు, పరిశోధించువాడు

మీరము. సం. వి అ పుం 1. సముద్రము.

2 హద్దు, సీమ. 3 పానకము, పానయోగ్య పదార్థము, 4. పర్వతభాగము

మీరు = ఈరు. (చూ ఈవు.)

దీనికి హల్లు పరంబగునపు డుత్వలోపంబగు.)

ఉ. నామనలోన నెంతయు ఘనం బగుచున్నది యద్భుతంబు మీ, రేమహిమన్ యథార్థముగ నిట్టిది సత్వము గంటిరె .. కళా. 2. 58.

మ. బలియుం డాధృతరాష్ట్రసూనుఁడు మహాబాహుండు దుర్యోధనుం, డలఘుం డీకమలాకరంబునకుఁ గ్రీడార్థంబు కౌతూహలం, బెలయంగాఁ బ్రియకామినీసహితుఁడై యే తెంచుచున్నాఁడు మీ, రిల దిం దుండఁ దొలంగి పొండనవుడున్ వా రుద్ధత క్రోధులై.
భార అర 383.

ఉ. పాటెదుర్త్రోప మీకు నలవాటుగఁ జేసిన వీరుఁ డెవ్వఁడో, మీటి యనేకయుద్ధముల మీరు జయించుట లెల్ల నింతతోఁ, దీఱె ననుం గనుంగొనుఁడు .. ఉ. హరి 5. 229.

మీరలు = ఈరలు

గీ మీర లమృతాంశు లమృతంబు మిమ్ముఁజూడ ..
నైష. 3. 59.

కం. మీరలు నా పితృదేవత, లారాధ్యులరు...
భార. ఆది. 2. 146.

మీర్జాకుళాయి వి (మీర్జా + కుళాయి) రాజకుమారులు ధరించుటోపి

సీ లత్తుకరంగు చల్లడము మిటారంపు చౌకట్లు తగటు మీర్జాకుళాయి ... వేణు. 58.

మీఱు న. క్రి. (క. త మీఱు) 1, ఉల్లంఘించు దాఁటు.

సీ కొలఁది మీఱిన బాణకోటులు కై నేయుపై

నేసి పడవై చెఁ బడఁగ .... ఉ హరి ౫ 57.
సీ జూగమై మేఱ మీఱ దొకప్పుడును ఘనశ్రీలఁ
బొంగియును నీసింధుకన్య ... వసు. 6 56.
గీ. అమ్మ నీమాట మీఱ రా దనుచు నదిగొ, నిలిపి వచ్చితి నొకనిండు నీటుకాని ... శుక. ౨. 201
2. నిరసించు
మ తనసౌందర్యము చెప్పఁగాఁ గనఁగి పద్మాక్షి కాంత రప్పించి మోహన కంజుంబున వైచి తియ్య మిడునెయ్యం బొప్పఁ బైకొన్న మీఱి నృశంసత్వమునం దొఱంగి చని వెట్టింజేసెఁ గాకుత్స్థుఁడై, న నిలింపారి విదారి చందములు డెందాన న్విచారింపుఁడా. ఆము. 5 48.
సీ వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు యజ్ఞకోలాహలం బాలకించి, నను మీఱి యీ భువనంబు లెవ్వండు రా సృజియించి మఖము చేయించువాఁడు ... వరాహ. 7 39.
3 అతిక్రమించు, మించు
చం ... వా, పనుపున మీరు చేసఱచి పాఱుఁడు మీఱిన యట్టివాఁడ యీ, ధనమున కెల్లఁ గర్తయగు ... విక్ర 2. 11.
ఉ. ఆఱురసంబులం జవుల యందుల క్రొత్తలు వుట్టనిచ్చలున్, వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ జేసిచేసి న, న్మీఱఁగ బానసీని నొకనింబురిఁగానని యట్లుగాఁగఁ మేన్, గాఱియ వెట్టియైన నొడికంబుగ వండుదు నెల్ల గూరలున్
భార. విరా 1 77.
సీ పరమేశుఁ డీ బింబఫలపాటలాధర నను మీఱి మన్నించినాఁడు మేలె ... కాశీ 4 148
గీ. మీఱె ననఁ గడచె ననఁగ మించె ననుఁ, పొలిచి యుండును ... ఆం. భా ౭ 128.
అ. క్రి. 1. అతిశయించు.
గీ. అసుధాధాము విభవ మహాంబురాశి, కుబ్బి మీఱంగ వందనుం డుదయమయ్యె. .
మనుచ 1. 19.
కం. ...అడవికిఁ గాపురము వచ్చి కలజడి మీఱన్
గీ. మీఱె హెచ్చరిలెను ... పెరిఁగె ననఁగ వృద్ధిఁ జెందె ననుఁ గ్రాఁలు . ఆం భా. ౭ 69.
2 ఒప్పు.
ఉ శ్రీలకుఁ దానకం బగుచు జెన్నలరారెడు వెండికొండపై, మేలికదానిదాల్ హాయలు మీఱెడు జాబిలి జాలమేడలో .. సీలా 1. .
3. జనించు, కలుగు.
సీ ఎఁతు మ్మెదల దిమ్ము వెలిఁ జిమ్మ చెలువమ్ము గఁవేణి కొకవింతనలువు మీఱె .
హరి 1. 56
శా శ్రుతులు హాహాకారముల్ మీఱఁగా, నబ్రహ్మణ్యము వెట్టినన్ . పశా. 1 224
4 విజృంభించు, చెలరేఁగు
ఉ వేఱొకచాప మెత్తి యదువీరుఁడు దెవ్వదిరెండు బాణముల్, మీఱిన పౌండ్రభూవిభుని మేను కలంతట నాఁటి ...
ఉ హరి. ౭ ౫౩, ౫. 228
5 గతించు, కడచిపోవు.
కం. ఏమైన నయ్యెనిఁక నేఁలా మీఱినపనికి నిట్టియంతిపురములో, నోముద్దరాల యేగతి నీ మహిమ గడించుకొంటి విది వెఱఁగు కడున్.
ప్రభా. 5. 72.
6 కొనసాగు, సఫలమగు.
మ కలలోఁ గన్న నృపాలశేఖరుని వేడ్కం జూచు టెన్నండొకో, యిలఁ జేఁ డన్నఁ నారవర్యునకు నన్నియంగఁ బెండ్లాడి నా, తలఁపుల్ మీఱఁగ సూనసాయకుని బందాగా వితర్కించుమన్, చెలువుం డెన్నఁడు గౌఁగలించునొ సుఖశ్రీ గాంచు టెన్నండొకో ఇందు. 3. 14.
మీఱఁబెట్టు = గర్వింపఁజేయు
గీ మీసుతుని మట్టువెట్టక మీఱఁబెట్టి, యెవరి బెదరింప వచ్చినా రెవ్వరిండ్లు, బుచ్చుకొని నెంచినారు... సానందో. 5. 16.
మీలముచ్చు. వి. (మీలు + ముచ్చు) మీల దొంగ, మీనవల్లంకి, నీటికుటికి చేఁపలంబట్టు పక్షివిశేషము, వర్తిక.

సీ ... మీలఁ బ్రముచ్చులు బ్రుచ్చు లేల విడుచు
దశా 1 137.

సీ. పట్టు జీనుపు కొంగ పాతేరు పిచ్చుక పోలుగ పిక్కిలి మీలఁబ్రముచ్చు. హంస. 3 12.

సీ మీలవల్లఁకి యన మీఁబ్రముచ్చు, నాఁగఁ దెఁ చెఁగు ఆం. భా 2 97.

మీలవల్లఁకి వి మీలఁబ్రముచ్చు
ఆం. భా 2. 96.

మీలితము సం విశ. (అ. అ అ, 1. మూయఁ బడినది.

వి. అ న (కావ్యాలంకారవిశేషము) మీల నాలంకారము

మీవ. సం వి. అ స్త్రీ. 1. ఉదరకృమి.
2. గాలి

మీవర = మీఁగడ

ఉ. వేవిన నిద్ర మేలుకని వేఱొకచానకు నేప్పు తోడఁ బై, మీవరఁ బుచ్చి కవ్వ మిడిమిట్ట చనుంగవ రాయిడింప. . వేం. పంచ 1 590.

మీవరము. సం. విశ. (అ. అ అ) హింస్రము, ఘాతుకము.

మీవరుఁడు. సం వి అ. పుం సేనానాయకుఁడు.

మీస = మీఁసము వి (సం శ్మశ్రుః, క. మీసె, త మీసై) పై పెదవిపైఁ బుట్టువెండ్రుకల వరుస

కం కలకంఠభక్తి వెలిగాఁ, గొఱగా వెవ్వియును నవియుఁ గొన్నిఁటి వాళ్లుల్, మఱి పిండ కూడు వెట్టిన, మెఱియలక్రియ మెఱచు మీస మెదుకుల మెఱుపుల్. శివ. సా 197

ఉ. ... ఔడులు దీడికొంచు నే, మీసరు తిట్లు గ్రొవ్విఁ పులిమీసల నుయ్యేలలూ గఁజూచిరే .
భా రా. యు 867

మ. వలచే వజ్రము ఔమ్మునో బిగువు గర్వంబుఁ బ్రమోదంబు మీ, నలలో నవ్వు నొయారమున్ తెలఁగ ... దశా. 4 43.

సీ. శ్మశ్రుసమాఖ్య రాజిలు మీస మీసము నాఁగ ఆం. భా 2. 146.

జ మీఁసకట్టు.

మీసకట్టు. వి (మీస + కట్టు) మీసము యొక్క యేర్పాటు.

గీ మఱియు నాసాగ్రమున నొప్పు మౌక్తికమునఁ కిరుకెలంకులఁ గాంతుల నెనసి సొగసు, దన ఁగా మీసకట్టు నందంబు చూఁప, జెక్కుటద్దము లొఱపు రంజిల్లుచుండ.
వేం. మా. 1. 185.

చం అలనలినారి పౌత్రి నిజయౌవనవేళ స్వకీయ బింబలీలలు దన నెమ్మొగంబునఁ గళంక రుచుల్ మనుమీసకట్టునన్, ... పూనెను నాఁగ మనోహరాంగుఁడై శశాం 2 60

మీసము = మీస వి. (బ మీసములు, మీసాలు) పై పెదవి మీఁది వెండ్రుకల వరుస

కం. ఇయ్యఁగ నిప్పింపంగల, యయ్యలకేకాక మీస మందఱ కేలా .. కవి చౌ. శ. 18

మ. .. చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్ .. మను చ 2 65.

గీ. కటము లదురువంగ మీసాలు గత్తరిల్ల ... నేతెంచెఁ గ్రోధంబు గగనవీధి ...
నైష. 7 46, ఆం. భా. 2. 146.

మీసరము విశ శ్రేష్ఠము.

వ ..మొకంబులు వంచి రెండిమ్ముడిభకాఢకి దాకి సెలఁగ భంగంబు లై నయుత్తుంగ శృంగంబుల. మీసరంబు లగుకానరంబులును ...
ప్రబంధ. 186.

సీ సిబ్బెంపు గబ్బిబల్గుబ్బ చన్గవను మీసరము లౌ నీ లంపు సరము లమర ... శశాం 4 119.

ఉ. శ్రీ సొబగొందు నిందుసరసీ సరసీరుహకేసర ద్యుతిన్, మీసరపోక మీసరపు నిగ్గులజగ్గుల దుప్పటిన్ దటి, ద్భాసిత నీలమేఘమన భాసిలు రంగనివాను .... అ. హ. 1. 1.

సీ మేల్బంతి కన్నాకు మీసరంబు, తలకట్టు నాఁగ

ఖాసిలు శ్రేష్ఠనామంబులు ..
సాం. ని మాన 49.

# ము

ము[1]. అవ. 1. ప్రార్థనాశీరాద్యర్థములందు వచ్చు మధ్యమ పురుషైకవచన ప్రత్యయము.

ఉదా వినుము, చేయుము. ఇది హలవసానంబులు పరంబు లగునపుడు వికల్పముగ లోపించును.)

చం. వినుము నరేంద్ర పాండవులు విక్రమదుర్దముఁ డైనపార్థునం, దనునకుఁ దోడ్పడం గడఁగి
భార. ద్రో 2 ఆ 69 పం.

గీ. . . కృతి వినిర్మింపు మింక మాకుఁ బ్రియము గాఁగ .. ఆము. 1 19

చం. నిలునిలు కర్ణ యొక్కపుడ
భార ద్రో 2. 59

కం వినిపించెద ముగివిధము విను తెలియంగన్
భార. ఆశ్వ. 4. 275 .

2. ఉత్తమపురుష బహువచన ప్రత్యయము. (ఇకారము మీఁది దీనియుకార మికారమగును )

ఉదా చేయుచున్నాము, చేయుదుము.

ఉ చేయుదు మేము కయ్య మొకచీరియు సంపదఁ బంచి యిత్తుమే ... భార. ఉద్యో 4. 201.

కం అడవులఁ బెద్దయుఁగాలం, బిడుములఁ గుడిచి తిమి మాకు నిది తటి యని యిప్పుడ వచ్చి తిమి ... భార. విరా 5 123

3 అదంతము లైన యమహన్నపుంసకములకును, బల్లి దాదులకును వచ్చు ప్రథమైక వచన ప్రత్యయము.

(ఉదా వృక్షము, ధనము.)

ఉ. ఖాండవ మేర్చునప్పుడు ...
భార. విరా. 4. 37.

4. ప్రథమైకవచనేతరవిభక్తి ప్రత్యయము పర మగునపుడు అదంతము లయిన యమహన్న పుంసకములకును బల్లిదాదులకును వచ్చెడి యాగమము

ఉదా వనములు, వనములను, వృక్షమును

కం హయములఁ బాన్పుము దమున ..
భార విరా 4. 42.

5 కొన్ని తెనుఁగు సర్వనామములకు వచ్చు ప్రథమా బహువచన ప్రత్యయము

ఉదా మేము, మనము మొ.

6. ప్రథమాంత మగు నస్మచ్ఛబ్ద విశేషణంబులకు బహుత్వమున తఱుచుగ వచ్చు నాగమము.

ఉదా మేము వృద్ధులము, పేదలము

గీ ... అజ్ఞాతవాస, వత్సరంబు భవదర్పితవాస గుప్తి, వలనఁ గడిపితిమి .. ఏము నిశ్చయ లమై యిందులట్ల . భార విరా. 5. 244

ము[2] న. మూఁడు[2] శబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చురూపము.

ఉదా. ముజ్జగము, ముచ్చిచ్చు మొ

ము[3] విశ ముందుశబ్దమునకు వృత్తిని మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.

ఉదా ముంగురులు, ముంజేయి మొ.

ముంగ[1] వి. ఎన్నుల మోపు.

సీ కణిశైకదేశంబు కనుపట్టు రెల్ల నాఁ గణిశభారముల్ ముంగ యనఁదనరు
ఆం. భా 2. 287.

ముంగ[2] = మూఁగ[1] విశ. (సం మూకః) మూఁగవాడు, మూకుఁడు, వాగ్వ్యాపారము లేని వాఁడు (శ. ర )

జ. ముంగతనము.

ముంగడ. వి. (ముందు + కడ ముగడ, త మున్గడై.) 1 ముంగల, ముందుచోటు.

చం. ... చిల్కకుఁ బాలు పోసి ముంగడ వసియింపఁ జేసి చిరకాలము పెంచిన మేలెఱుఁగునే, కనఁగి ఒడల్పడన్ గఱచుఁగాక .
వేం. పంచ. 1 765.

2 ముంద. (శ ర )

**ముంగతనము** వి. (ముంగ² + తనము మూఁగ తనము ఒండతనము

ద్వి ఈవేగ, మునఁబోదు ముట్టకు ముట్టకు కాలు, మును ముట్ట వచె యేల ముంగతనంబు ..
పండితా. పురా 124 పొ

ష. ఓ మ. = ముంగముూము, ముంగమురారి. ముంగయిమురారి, ముంగాముడము, ముంగై మురారి, ముంగైమురుగు వి

(ముందు + కయి + మఱము శ ర.) మురుగు, హస్తకంకణము

ఉ బంగరురావిరేక పటుఫాలముమీఁద నటింపఁ బచ్చరా, ముంగమురంబు లింపలర ముందర నాడుచు నుండు ముద్దుపట్టింగని తల్లిదండ్రులు.
భాను. 1. 36

(శ ర పా. ముద్రి పా )

పచ్చరాముంగర తొంగలింప.

**ముంగముూము** = ముంగమురము (శ. ర.).

**ముంగమురారి** = ముంగమురము. (శ. ర )

**ముంగయి**=ముంగై వి.(ముందు + కయి)ముంజేయి.

ఉ. బంగరుపట్టుగోఁచి మునుపచ్చని ముంజియు నొంటిజందెమున్, ముంగయికంకణంబు జిగి మోహనహారము ..
సమీర 3. 22

**ముంగయిమురారి** = ముంగమురము. (శ ర )

**ముంగ(ర)** = ముక్కర. వి (ముక్కు + రాయి) అడ్డకాస, నాసికాభూషణవిశేషము.

గీ. చేరుచుక్కయు ముంగఱ చెవులపువులు, బవి రెలును గొప్పవలయును బడఁతి యొర్తు,దిద్దె ..
యయా 4 89

మ. కళుకుమ్ముంగర ముత్తియంపురుచి సింగారంపుఁ గెమ్మోవిపై, దులకింపన్ .. దశా. 2. 264

సీ. ... నాసి, కావిభూషణము ముక్కర ముంగర యనంగఁ బనుచుండు. .
ఆం. భా. 2 148 , ఆము 4 21.

**ముంగల** = ముంగడ వి (ముందు + కలను.) పురోభాగము, ముందుకాలము, తొల్లి

కం లలితకమనీయ మహిమల, నెలనాఁగయు సఖులు గలసి యేతేరఁగ ముం, గల నడచి కంచుకులునుం, దలతల మనఁ బతియఁ బతుఁ ంతరముగ నడచెన్ ... నిర్వ. 8.68.

ద్వి . నవరత్నకాంతుల మించు, తొంగలించెడి జాలు తొడవులమూట, ముంగల నిడిన ...
ద్వి హారిశ్చ. ఉ 2342 పం.

సీ మున్ మున్ను మును ముందు మొగి ముంగల యనంగఁ దగును బురఃపురార్థములుగాను
ఆం భా. 3. 78 , విజ. వి. 1. 42

**ముంగలి.** విశ. (√ముంగల) ముందున్నవాఁడు; ముందున్నది.

కం. కెంఁకులుఁ బిఱింది దెసయుం, గలయం బరి కించి తనయఖండిత బాహా,బలగర్వమ యచ్చట ముం,గలిగా మదమత్త భద్రగజ సద్భగతిన్.
భార. విరా 2 326, 331

కం. . దివ్యవాహనలీలో, త్కృష్టగతిన్ ముంగలి యై, ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజో మహిమన్ ... భా౦. ఉద్యో 4. 129.

చం. ఎలమిఁ గుమారుముంగలి సురేంద్రుఁడు రా
కు, సం. 11. 587 , హరి. ఉ. 8 42.

**ముంగాము.** వి. 1. పొట్లముగా మడిచినతాటాకు మట్ట (ముంగము అని వాడుక )

2. బెల్లము మొ వాని నించినబరువులో సగము (శ ర.)

**ముంగాముచీర.** వి. (√ముంగాము) ఆఁడువారు కట్టుకొనెడి యొకవిధమగు నారకోక (శ. ర.).

**ముంగాముురము** = ముంగమురము. వి. హస్త కంకణము.

సీ. ... తళుకు ముంగామురంబులుచలింప, గంటలు మొలకట్టు ఘణఘణ ధ్వనిచేయ ..
దశా. 8 185.

గీ మేలి మొలత్రాళ్ళ ముంగామురాలతోడ, నిరుగుపొరుగుల చిన్నవాండ్రిటకు వచ్చి ముయ్యఁగాఁ జూచి తనకు నీముద్దుబాలుఁ డడుగ నీనులు చూఁడిన ట్లయ్యె నాకు
శేష. 1 (శ ర)

ద్వి ముత్తెపుఁ జేసలు ముంగాముఁగములు, నొత్తులు గాజులు నొడ్డాణపనులు, గవదసరాలు బంగారుకడెములు
ప్రభులిం 4 143 పొ 15 పం
ధనా 3 37

**ముంగాముురారి** = ముంగమురము (శ ర).

**ముంగాముురుగు(వు)**—ముంగమురము.

గీ కడెము కడియము బొద్దొత్తు గాజు సూడిగంబు చేఁట్టు గోఁడు ముంగామురు వన్ హస్తభూషా విశేషంబు లమరుచుండు అం. భా 2. 149

**ముంగాలు** వి జౌ. (ముందు + కాలు. క. ముంగాలు త ముకగాల్) పాదాగ్రము, ప్రపాదము

సీ. మును నలల్ దమిఁ బట్టి ముంగాళ్ల ముక్కుజోడనలఁ బిలిచి పసర్కొనిన విడిచి .
ఆము 5 117, 6 28

కం. చేఁ పొడిచి అంకె లిడుచును, పలుమఱు ముంగాళ్లఁ ద్రవ్వి బలువిడిఁ బసికాఁపులఁ గ్రుమ్మి విడుచు . .
నీలా 2. 56.

వ. వారెఁ గుదియింప ముంగాళ్లు గగనంబున రా మగిడించి ...
మనుచ. 4. 115.

**ముంగి – ముంగిస.** వి. (క. ముంగి, త. ముంగా)

1 ముంగిస, నకులము.

కం. వినిపించెద ముంగివిధము విను తెలియంగన్ . .
భార. అశ్వ. 4. 275

సీ. ముంగైమురారి నాముంగైని నిడు మన్నముంగై పలుకవే కురంగనయన ... బహు 2. 65.

గీ కేరు నకులము ముంగి ముంగిస యనంగ ...
అం భా. 2. 86.

2. నకులాకారము గల భూషణ విశేషము

వుంజాలపండలు పూదెలకడియాలు ముంగులు రాకట్టు లుంగరములు . . ధనా. 3 37.

**ముంగిలి** వి జౌ (ముంగల + ఇల్లు త మున్‌గట్టు)

1 మునివాకిలి, గృహద్వారమున కెదురుగా నుండు ప్రదేశము, అంగణము, ఎదుటిభాగము.

సీ. వింగడం బైనట్టిముంగిట నెంకొన్న బృందావనికి ముగ్గు పెట్టుదాన ... ఆము 4 53

చం. బలవదనహ్యాసింహాళదభ్రములోగ్ర వసాంత భూమికి,ముమ్మల నిను డించి పోయెద మె ముంగి లెఱుంగనిముద్దరాల విక్ర 7. 103.

కం. ... అంగణ, మెఱుఁగం దగు ముంగిలి యన నిందుపతంపా ... అం. భా 3. 19.

కం. ముంగిటను సప్తసింధువు, చెంగటఁ గ్రతుపాసి నడుమ శ్రీశైలమహాలింగము దక్షారామము ...
భీమ. 3 126

శ్లో పురోభాగే సప్తసింధుః పార్శ్వే యజ్ఞసరో మహాన్. సం భీమ.

ఉ. అంగన నాకుఁ గొంగుముడి యై తగునీ విపుడిచ్చు నీవి త,న్వంగి భవన్మనోజ్ఞమధురాధర కాంచన కాంచికాస్థలుల్, తంగెటిజున్ను ముంగిటనిధానము నౌ, నటుగానఁ జాయలే, నంగజునాన నాదుహృదయం బెఱుఁగున్ వల పంబుజాననా! రామా. 4. 162.

ముంగిటనిధానము – శ్రమలేనిపట్టుడు దొరకునది )

2. బయలు.

వ ... నంగనాచు లగుతంగనలయంగంబుల పస ముంగిటం బడ ...
మనుచ 3 28.

**ముంగిటిముత్యము** = ఎదుట మన్నముత్యము వంటిది.

అ. ఎల్లబంధువులకు నల్లారుచెల్ల మై,యరిది గారవంబు నతిశయిలఁగఁ, దల్లిప్రేమఁగరము దన రారె ముంగిటి, ముత్య మగుచుఁ గ్రొత్త క్రొత్తసిసల. కళా. 6 197.

**ముంగిస—ముంగి.** వి (క. ముంగిసి, త. ముంగా) ముంగి, నకులము.

సీ ఏమి ముంగిసపిల్ల తెంపఁ దాఁకక యుండఁ బడగ లడ్డము పట్టుపాఁపగములు ...
యయా. 2 49.

వ. . కొనసాఁగి పోగ ముంగిస మోరలుం బోని మోరలు సారెసారెకు నెత్తి బయలు పసి పట్టుచు ... మనుచ. 4. 27.

గీ. కేసు నకులము ముంగి ముంగిస యనంగ ...
ఆం భా. 2 86 , కాళ. 3. 46.

చూ ముంగిసమ్రాను.

**ముంగిసమ్రాను.** వి ఔ (ముంగిస + మ్రాను) ముంగిసరూపు కలముసనచివర

గీ ఏమి మఱికొన్నిచెట్టుల కెత్తియెత్తి,యరసి ముంగిసమ్రానితో నాని యుండఁ,గుండ నిండా రఁగా ముంచి కూడు దినఁగ,నింటి కేఁగెను బడలిక లంటి పెనఁగ. హంస 1 187.

**ముంగురుమొటికలు** వి. బ (ముంగురులు + మొటికలు ) ధాన్యభేదము.

వ. ... చౌటవరులు తీఁగెమల్లెలు సుఖభోగులు సన్నసూదులు గౌరవంకరాజనాలు కాటుక రేకులు ముంగురుమొటికలు పసుపుముద్దలు ..
ప్రబంధ 112.

**ముంగురులు.** వి బ. (ముందు + కురులు క ముంగురుకు.) అలకలు, నొసటపైనాడెడు ఉంగరపు వెండ్రుకలు

ఉ అంగము జాళువాపసిఁడియంగము క్రొన్నెల వంక నెన్నొసల్, ముంగురు లింద్రనీలముల ముంగురు లంగజుడాలు వాలుఁజూ, పుంగవ యేమి చెప్ప నృపపుంగవ ... విజ. 1. 40.

సీ నగుముద్దుమోమున మృగనాభితిలకంబు కులుకు జాల్ సిరులు ముంగురుల నొయ ..
దశా 1. 71.

సీ. అలకలు కురులన నలరును బహుతవే వఱలు ముంగురులన భ్రమరకములు ...
ఆం భా. 2. 144 , నీలా. 1. 85.

**ముంగేలు** వి. ఔ అనౌ. (ముందు + కేలు. త ముంగైహస్త ము చేయి ప్రకోష్టము.

సీ ముంగేల వంచినమొగ మెగయించుచో మెయి కొను నేత్రనిమీలనంబు .. కవిక 3 212.

సీ కొసరి వాతెఱ నొక్కి కనుఁగందెనో యంచు, నిలుచుఁ జై ముంగేల నిమిరి నిమిరి .
కృ శకు. 3 50

**ముంగై = ముంగయి** వి (ముందు + కై త మునుగై ) హస్తాగ్రము

సీ. ముంగై మురారి నాము గైని నిడు మన్నముం గై వలుకవే కుడఁగనయ .
బహు. 2 67.

కం అంగాంగసంగతిని దన,ముంగై చెమరింపఁ గంరమున సతికిన్ రా, జాంగజుఁడు కట్టె మణిమయ, మంగళసూత్రంబు జాయమానోత్సుకుఁడై కువల. 5. 68

**ముంగైమురారి** వి. ముంగమురము.

గీ కొలుతుఁ దాన్యగ్భవద్బాహుకులిశయష్టి, నెద్దిగిరివోలెఁ గడుపులో వృద్ధిఁ బొంద, బగిలి రాకాసిదేహంబు మొగపుముత్య, మయ్యె ముంగైమురారిరంగై మురారి
మనుచ. 6 115.

వ అవ్విరించిజనకునకు నరణంబుగా మించుబ. గండపెండెరంబులు రాకట్టుమొలకట్టు లుంగరంబులు ముంగైమురారు లంగదంబులు ..
ప్రబంధ. 605 , బహు. 2 67

**ముంగైమురుగు (వు) — ముంగమురము**

వి (ముందు+కై+మురువు) ముంజేతిమురుగు.

ద్వి ముంగైమురువుల కిమ్ములఁ గంకణముల, చెంగట ముత్యంపుఁజేకట్లు పూని ...
ద్వి పదమ 4 274 పొ.

**ముంగొంగు — మునికొంగు** వి. (ముందు + కొంగు) చెఱఁగుకొన, మునికొంగు

సీ ముంగొంగున వ్రేలుము త్యాలకుచ్చుల నలి

రెడు చెంగావిపలికెములును .

యయా 4 120.

దండకము చెంగావిమంజీర ముంగొంగున స్వి న్న [illegible] క్రొత్తగా [illegible] ముత్తెంబుల స్నూర్పు చెల్వొనకంబు ల్విలోకించువారల్ ...

దశా 4 2:2., రా ఐ 2. 44.

**ముంగొంగుపసిఁడి** – తనచేలాంచలమున ముడియిడిన బంగారు వలె సులభ మగుపదార్థము

గీ భక్తజనులకు ముంగొంగు పసిఁడి గాఁడె, దేవతా రత్న మీవాసుదేవుఁ డనఘ ..

జై భా. 1. 116

కం ముంగొంగుఁబసి డి చెంగటి, తంగెటిజు న్నంక సహితధనరాశి నిపా, సాంగణకల్పమహీరుహ, మంగనకథినాయకుఁ డ సుమా చపలాంగీ.

పె శకుం 3 132.

**ముంగొన** వి (ముందు + కొన త మున్‌గొనై) ముందటికొన

మ అరవిందానన లెల్ల .. ఒక సందోహం బుగా వచ్చి మ్రొక్కి రి పయ్యెంటచెఱంగు ముంగొనలతోఁ గెంగేలుదో యెత్తుచున్ ...

రామా. 2 80.

**ముంగోపము** – **ముక్కోపము** వి వి. (ముందు + కోపము క ముంగోపవు త. మున్ + గోపం) ఓర్పులేక తటాలున వచ్చు కోపము

ఆ. మొగముఁ బోడువ లేనిముంగోప మిఁక నెప్పు, డలఁక చొచ్చెనేని ఖలక వగుదు, మటులు చేయ నీయ కాఁగి తండన మాచ,రింపుఁడనుచు వారిఁ బంపుటయును.

ఉ రా 3. 7.

**ముంగోపి** – **ముక్కోపి** వి. విణ. (ముందు + కోపి, క. ముంగోపు. త. మున్‌గోపి) ఓర్పులేక తటాలునఁ గోపముపడువాఁడు.

శా. ముల్లోకంబులుఁ దల్లడిల్లు నివు డీముంగోపి కేనుంగుతోఁ, జెల్లాడం జనుబాలులీల నితనిం జేష్టించినం గిడు వాటిల్లున్ ..

చ రా. 8 142.

సీ దుష్టనావళిఁ గన్న భక్షించుముంగోపి, గుణ గౌరవంబులు గూర్చుపెద్ద

చంద్రా 6. 150 , పా చా 2 59

**ముంగోరు** వి బొ (ముందు + గోరు) నఖాగ్రము, కొనగోరు

దండకము .. వైతేయు ముంగోరులన్ జేరు రమ్మన్ వడిం జీరి గారించి ప్రహ్లాదు పాహాదుఁ గావింపవా .

కృ శకు.. 6 157

**ముంగోలు**, వి (ముందు + కోలు, మునికలు.

సీ. సింగంబు పటుతెంచె ముంగోలుఁ దెమల్చి నమలి కార్పోతుల నుమిసికొనుచు ...

శకు 4 155.

**ముంగోలు** విణ. (ముందు + కోలు. క. ముంగోల్, త. మున్‌గోళ్) మొదటిది

కం ముంగోలు మొలకవెన్నెల, లుం గలఁగంబడు తమంబులుం గల గగనోత్సంగము గంగా యమునా, సంగమముం దలఁపువేసె సజలాకృతియై . .

కవిక 4 128.

**ముంచు** – **మునుచు**[1] స. క్రి (√ మునుఁగు)

1. మునుఁగఁజేయు, నీరు నేయి మున్నగు వానిలో తూర్చు

సీ క్రొంచఅనీరిలో ముంచుచు నెత్తుచుఁ గారించి తీరంబు సేరఁ బెట్టు ... భార. ఆది 5 166.

సీ అందంద దొరఁగుడు వస్త్రశుజలంబుల పెంపున మోములు ముంపఁబడఁగ ...

భార స్త్రీ 1 98.

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి, పుత్తెంచిన మంచిభక్ష్యములు తేనియ నేతను ముంచి ముంచి ... హర. 2 105.

కం. ఏసిన వరుణుఁడు దనుజుల, రాసారములోన ముంచె ...

ఉ. హరి 1. 29.

2. కప్పివేయు. ఆచ్ఛాదించు.

సీ ... హరికేశుఁ డతఁడు శ్రీయానందకాన
నాభ్యంతరమునఁ, దప మాచరింప నాతని శరీ
రము ముంచి పుట్టె వల్మీకంబు పొదలు పొదలె.
కాశి 5 127.

కం. ఈ కరణి దానవుం డతి. భీకరముగ రణము
సేయఁ బిలుతివియకదై, భాకర సేనలు శస్త్రి,
నీకంబుల ముంచి శాతనిశరీరంబున్ ..
జై భా. 2 34

కం కలయ జగమెల్ల ముంచిన, బలు వగు నమ్మం
చలోన భావింపఁబడున్, వెలుఁగులఱేఁడు
కవిక. 6. 27.

3. వశింపఁజేయు,

చం కడుఁ దొడు సైనయుద్ధరితకర్మము నిన్గొని
ముంచుఁగాక యెక్కడఁ జననిచ్చుఁ బుట్టు
పురుగా కొలగా కెవు డస్వతంత్రతన్, మడుగు
భజించి భేకముల మస్తమునన్ భరియించి
కొల్చి ... వేం పంచ. 3. 355.

అ. క్రి. 1. క్రమ్ము, వ్యాపించు.

రగడ. ఓమి యోమితమధ్య నీపద ముంచు ముంచు
వశోకశాసన ... వసు. 3. 349.

ఉ. మ్రొగ్గెడుపావముల్ మముల ముంచిన ఖేదము
తెంచసోఁకుడున్, వెగ్గల మైనయూర్పులును
విన్నని మోములు గానిపింపఁగన్ ...
విప్ర. 2 53.

2 అతిశయించు.

సీ ముంచి చీకటులు కల్పించునీడలు పోవఁ బద్మా
కరంబులపాఁచి విఱుగ ...
కువల. 7. 10 , సారంగ 3 34.

3. పుట్టు, కలుగు.

ద్వి. ... నిజదేహభానురప్రభలు, ముంచి దిక్కులఁ
బర్వ మురియుచు నేఁగి ...
ద్వి. హరిశ్చ. పూ 684. పం.

మ జర ప్రాప్తింపకమున్నె యతిబల ముత్స
న్నంబు దాఁ గాకమున్నె రుజల్ ముంపక
మున్నె యాత్మహిత మన్వేషి ప కజ్జుఁడు ...
మల్లభా. 3 75.

గీ తిండి మే. దొలఁగినఁ దెవులు ముంచు ..
రామలిం 50.

4 పూను, యత్నించు.

ఉ. పాశము మీఱు పెద్దపెదపాశము లై బలి
తఁపుఁగాఁగులన్, మూలుగుచున్న ప్రాంఁజఁసిఁడి
ముంచి ధనార్థుల కిచ్చు .. పాండు 4. 211

సీ శశిబింబమణి హేమగదామనీ చయోత్కర
కాంతు లన్నియు నరసి తెచ్చి, కర్పూర చందన
కాశ్మీర మృగమదామోదంబులన్నియు ముంచి
తెచ్చు ... కు. సం. 3. 321.

5. విజృంభించు.

గీ. మొనలు దెరలినఁగర్ణుండు ముంచి తాఁక ..
భార. విరా. 5. 292.

కం. దంచున్ జరణాంచలముల, గించుదనం బంచు
ముసలకించున్ ముంచున్, నొంచున్ విద
శనచుంచూ, దంచచ్చంచూపుటస్ఫుటాఘాత
ములన్ .. రామా. 5. 198.

6. నెఱవేఱు.

కం. అని యొల్లఁబోవఁ దాపము, కనుకనిఁ
బోఁదేర్చి పాపకర్మపుటొడయా, నమఁ బంచిన
మన కిచ్చిన, పని ముంచదె యంచు నతనిఁ
బలుకుఁ బ్రతాపిన్. కకు. 5 118.

**ముంచే²—ముణుఁచే.** స. క్రి ముడుఁచు, ముణుగఁజేయు.

ద్వి. కొనులు వంచి యంగము లెల్ల ముంచి, నాన
వాటించి లేవగవులతోడ ...
అ. మ క 2 24 పొ 22 పం.

**ముంచే³— మించే¹** స క్రి. అతిక్రమించు, దాఁటిపోవు.

సీ ముంచి పోవువిమానములు కూడఁ గోరిశఁ
గేలెత్తి ధేయని తోలకున్న ... కకు. 2. 42

**ముంచేకొను** స. క్రి. (ముంచు¹ + కొను

స్వార్థమున.) 1 మునుఁగఁజేయు

కం. వే, గమ్మున ముంచుకొని యొనగ, నమ్ము పయోరాశి భరతరాజవరేణ్యా ...
శృం. శా. 177

సీ. దుర్దమకర్దమ స్తోమసంఛన్న భూములు సోన వానలు ముంచుకొనిన ... పాండు. 4. 28.

2 (నిద్ర) ఆవేశించు, ఆవరించు, ఆక్రమించు.

ఆ కన్యకాకరోరకరవాలధారాలు, ... మూలము లకుఁ గత్తరింప, ... దీర్ఘనిద్ర ముంచుకొనఁగ
వరాహ. 11. 99

కం. చిచ్చుపడి వెల్లవాఱుచు, ముచ్చుముడిఁగి మూర్ఛ తన్ను ముంచికొనంగా, వచ్చిన ధైర్యం బూఁతగ నచ్చేడియ నిల్చి ఒప్పు డద్భుత మయ్యెన్, కేయూర. 4. 199

వ ఇట్లు చెట్లు వెడలి తెవిండ్లు వంచుకొని ముంచుకొను వన్నెల్ల ప్రజం జూచి ... ఆము. 6. 76.

కం వల విచ్చినట్లు జగముల, కల విప్పును గలయ నొక్కకవిఁ జని కోలా, హలముగ సురాసురోరగ, కులముల నాగణము ముంచికొని వచ్చి వడిన్ కు పం. 2. 210.

అ క్రి 1. గుంపుగూడు.

వ. అచ్చటికిం జేరి ముంచుకొను కొంచెపుఁగాండ్రు పెడమోము పెట్టిన ... కువల 4. 209

2 అతిశయించు.

సీ. ఇరుగడఁ బొడి విచ్చి విరియువేసవితోడ మోహాంధతమసంబు ముంచుకొనఁగ ...
కు. సం 5. 549.

వ. నిజకులస్థానపౌరుషంబులు దలంచుకొని ముంచుకొను నభిమానంబుతోఁ గ్రమ్ముఅన్ దొడరి వచ్చు వియచ్చరులు క్రమ్మందిన ... ఉ. రా. 4. 291.

స. క్రి., అ. క్రి. వ్యాపించు.

సీ. మణి విభూషణ దేదీప్యమాన ఘృణులు, దశదిశల్ ముంచుకొనఁగ నెత్తమ్మియడుగు, ... నపంబు భూమిపైఁ గ్రొత్త యైన, మెట్టతామరైయ జిగి మించి తనరె. ఇందు. 5. 101

ఉ .. ... ముంచుకొనం జెవిదండఁ బల్కెనన్. కళా. 4 108

**ముంజకేశుఁడు** సం. వి అ పుం 1. శివుఁడు 2. విష్ణువు.

**ముంజము** సం. వి. అ. పుం. తృణవిశేషము ... విధదర్భలలోనిది.

**ముంజరము** సం. వి. అ. న ... మొదలగు వానిదుంప, తామరకాడ.

**ముంజాతము.** సం వి. అ పుం పుష్పశాక భేదము, ఒక జాతి చెట్టు.

**ముంజి** వి. (సం. మౌంజీ, క ముంజ,) బ్రహ్మచారి ధరించెడి యొకవిధ మగుదర్భల మొలత్రాడు.

సీ ముంజిపైఁ గనుపట్టు ముద్దుగాఁ గట్టిన యంగవస్త్రపు గుడ్డ చెంగు లలర ...

గీ. చనియె గడిదేటి యాబ్రహ్మచారి మీఱి ..
హంస. 1. 157.

గీ వసిఁడిముంజియు హోంబట్టుపంచె హేమ, కంకణంబులు వరుణముఖంబు దీర్చు, వాలమును గల్గు నొకమహా వానరుండు, వచ్చి పొడగన్నె రఘువంశవర్యుఁ డలరి. ఉ. రా. 1. 99.

జ ముంజికాఁడు.

**ముంజికాఁడు** వి. (ముంజి + కాఁడు క. ముంజిగను.) బ్రహ్మచారి.

ద్వి తులువ నీమది నింతదురభిమానంబు, గలవాఁడ వీ ముంజిగానిచే నిట్లు, దొనఁగులంబడి ఒక్క దొంగచందమున, వెస కట్టువడి నీచవృత్తి రానేల. ద్వి. హరిశ్చ ఉ. 1438 పం

**ముంజు.** వి మెదుక, పిండి.

ద్వి. కేలు కేలున బిగ్గఁ గీలించి పట్టి, సోలికి నిలుచుండె సోలియాడుచును, ముంజుగబ్బుల తుట్ట ముదుక వెంద్రుకలు, జుంజురింపఁగ విదుర్చుచుఁ జుట్టుమనుచు
అ మ. క. 2 85 పా. 17 పం.

**ముంజుఁడు.** సం వి. అ పుం భోజమహారాజు నకుఁ బినతండ్రి యగు ధారానగరి రాజు.

**ముంజూరు** వి (ముందు + చూరు) చూరు ముందటి భాగము, వాచూరు.

తే. ఏమటిన వేసఁగాఁజూచి యెలుక యొకటి, దిగదిగన వచ్చి భ్రమియించి దీపకలిక, కఱచి కొని పోయి ముంజూరు కాలఁబెట్టి, నట్లయైనది యైన నే మయ్యె నోరి. రామా 3 102.

గీ. ఇంటి ముంజూరు పెండెలో నిడుకొని కాని, పువ్వు లిచ్చిన ముడువ దప్పాగరు మగువ. వేం. పంచ. 3 183.

**ముంజె(జియ).** వి తేఁత తాటికాయలోని గిజురు.

ద్వి నంజు డించినయట్టి నంజుడుల్ తాటి ముంజెల మిసిమి బల్ ముద్దలప్పెడి...
రం. రా. సుం (చి. వి)

కం. లంజెయును బీరకాయయు, ముంజెయు బాల్యమునఁ జాల మోహమ్ముగొలుపున్.
చంద్ర వి 2 32.

ద్వి. బ్రదు కెల్ల మురిమిచేఁ బడకుండ నాఁడె ముదిసినఁ గొఱయానె ముంజె లంజెయును.
ద్వి. పరమ. 4. 299 పా

**ముంజెయి-ముంజేయి** వి. (ముందు + చేయి) మనికట్టువఱకుఁగల మోచేతిక్రింది భాగము, ప్రకోష్ఠము
సీ తగుఁ బ్రకోష్ఠంబు ముంజెయి యన ...
ఆం. భా 2 188

**ముంజెఱఁగు.** వి. (ముందు + చెఱఁగు) ముని చెఱఁగు, వస్త్రముయొక్క ముందటి చెఱఁగు.

సీ ముచ్చుట్టు ముడిచిన ముంజితోఁగట్టిన చెలువంపుగోచి ముంజెఱఁగు దూఁగ ...

**ముంజెర(ఱ)ము.** వి. (ముక్కు + చెరము) ముకుఁ జెఱము, నాసాపుటము.

సీ. ... ముంజెరమ జెరమ యన నాసాపుటము చెలంగు ... ఆం భా 2. 142.

**ముంజే-ముంజేయి** వి. (ముందు + చే) ప్రకోష్ఠము
ఉ శ్రీరఘువీరశేఖరుఁడు చిత్తము రంజిలఁబల్కు-చొక్క ముంజే దహియింప సీతఁ గని ..
ఉ. రా. 6. 50.

ఉ పూవిలుకాఁడు కీరహాయమున్ మునివంటఁగఁ జోలి నిల్పి తాఁ, బావడ లూఁది త్రొక్కి పడి పాటిగ ముందఱ సాఁగి నిక్కి ముంజే వడిఁ జూపి యాఘనుని చిత్తము లక్ష్యము చేసి వైచె చంద్ర 2 159., విజ వి. 2. 182.

(చూ ముంజేయి)

**ముంజేకోక.** వి. (ముంజే + కోక) వేఁటకాఁడు డేగ మొ వ్రాలునపుడు దెబ్బ తగులకుండఁగ ముంజేతియందు గట్టిన వస్త్రము

వ . మెలివెట్టి చుట్టిన ముంజేకోకలును ...
ప్రబంధ. 88

**ముంజేయి-ముంజెయి** ముంజే వి. జె (ముందు + చేయి) మణికట్టు వఱకును గల మోచేతి క్రింది భాగము. ప్రకోష్ఠము.

కం నాకొలఁది విచారింపక, నీ కిట్లనఁ దగువె మిన్ను నేలయు నిమ్మెఁ, గాక తిరుగంగఁ బడినం, బోకే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్. భార. ఉద్యోగ. 3 60.

సీ వ్రేలివలంబున వ్రేలెడు మెడనూళ్లు జాఱువామ ముంజేతిజతుల త్రాళ్లు.

తే. శాంతిదేవి ముంజేతి పలుకుఁజిలుక, సమదగ జయాన సబ్రహ్మచారి మాకు నైష 2 49

సా. 1. ముంజే యాడిన మోచే యాడును.

కం రంజిలి తాము ను మున్నుగ, నంజలిపడ కిచ్చెనేని నయముగ వారున్, గొంజక యిత్తురు క్రమమ్మెఱ ముంజేయియు నాడె నేని మోఁచేయాడున్.
కుచేల. 1. 108.

2. ముంజేతి కంకణంబున కద్దమేటికి ?

గీ. కమలలోచన ముంజేతి కంకణమున, కద్దమేటికి నీ సొమ్ము లరయరాదె... ఉ. హరి. 4. 100.

ముదుక = ముదుకఁడు. విశే. (ముదియు) వృద్ధుఁడు, ముసలివాఁడు.

కం. పదునాల్గు మహాయుగముల, ముదుసలిగు భీమేశ్వరునకు మొగచాలై యుండెడు సాని పెండ్లి యెప్పుడు, నది దశారామమహిమ మగునో కాదో ... భీమ 1 112.

కం. ... దశాననుని ముదుకఁ గాన మఱఁదోఁ, చినచందం బగునో కాదో చెప్పితి సీకున్ భా. రా యు 4 78.

సీ .. నందగోపుఁడు, మొదలుగాఁ గల్గొల్లు ముదుక లెల్లఁ, గడుఁ గ్రొవ్వి . హరి పూ. 7 157.

2 దళసరియైనది, మోటయినది

ద్వి ముదుకకుప్పసములు ముదముతోఁ దొడిగి, ముదిసిన రాక్షసముఖ్యులు నడువ . రం రా. యు 516 పా 61 పం

ఉ వేసరి యే మటన్న నిలు వెల్వడఁ జాలఁడు చేత నంటిమా, దాసరి బుట్టయున్ ముదుక దావళి దట్టియుఁ గాని కాన మో, కేసరి మధ్య నీ వ్రతిన గెల్చె ... వై జ 3 94.

గీ వలకతలగుడ్డ యొకకాటి పచ్చడంబు, ముదుక నీర్కావిదోవతి మొలను సంచి, తిత్తి వెండుం గరము వ్రేలహత్తి యొప్ప, నుండు శరుఁడను పేదనియోగి యొకఁడు. హంస. 4. 76

3 సాంద్రమైనది, చిక్కనిది

వ ... ముదుకవెన్న లంటుకొని ముదుక నయి పిడిచినం బొలవలచు చుంచుతలలును ... హరి. పూ. 5 143

సీ ముదుక గాకుండఁ బయ్యెదలోనె కేలార్చి కలయఁ జంటను నొంటఁ గలప మలఁద ... ఆము. 1. 60.

4 లావు, స్థూలము, పృథులము.

(దీనికి నిగాగమము నొక్కచోఁ గానవచ్చు చున్నది.)

సీ ... ఆ ... ప్రాణరక్షకమై, తాలిఁగ బలకేళి వలసి కన్నోద్యమ, గడియఁ గాచన కుంభకంబ నంబు లైన, ముదుకని చన్నుల మొన లొత్త దిగిచి, బలువిడి నచ్చటల్ పరిరంభణముల. మోపుచు జనముల మేలొల్ల దెలిసి .. రం రా ఉ 80 పా. 25 కం.

పళువ సన్న బియ్యముకన్న ముదుకబియ్యము వెల తక్కువ

ముదుకఁడు = ముదుక విశే ముసలివాఁడు, వృద్ధుఁడు

చం ముదుకఁడ నైన నాదుబలము జేలమున్ విపిధాస్త్రశస్త్రసంపదయును బోయి సీ గుడుఁడు భార్గవుచే విను ... భా. ఉద్యో 4 246.

సీ ముదుకని మస్తకంబునకు దాపున నూఱు కాండముల్ దలగడగా నమర్చి జై భా. 2 89.

కం ఇది గాంధర్వవివాహము, సుదతీ మనకిపుడు సాక్షి సూర్యుఁడె యన నో, ముదుకఁడ నీకొద దీటిన, వదలెద వే నొల్ల నను బ్రవాళాధర యున్ ... భోజ. 7. 115., భాగ. 10. పూ. 1286.

ముదుకసరులు. వి. బ. ధాన్యవిశేషము

సీ గరుడసరు లోప్పతుగంటరాజనములు మోఁదుగ తొడిమలు ముదుకసరులు హంస 4 128.

ముదుగు విశే ముదుక. దళసరి

రగడ. మూల కొదిగెఁ దుది ముదుగుంగోకల్, సాలిఁ దాచెను సన్నపుఁ జేకల్ ... బహు. 2 12.

వి మోటుమాట, కఠినోక్తి.

ఆ తొత్తుపేరఁ బెట్టి దొడుకుపేరను బెట్టి, పిల్లి కూనపేరఁ బెట్టి యిల్లు, వెళ్ల తే దటంచు మెల్లన ముదుగులు, పాఱవిడుచుచుండుఁ బాటఁ బాట. వై జ 3. 98.

సీ. ఉపబర్హ మెగఁద్రోయ ను కించి మోముపై

మోముఁ జేర్చినఁజూచి ముదుగు లాఁడు ...
హంస. 3. 201

ముదుటుంగరము = ముద్దుటుంగరము.

ఉ కానకుఁ గొంచుఁ బో యిపుడు గాళ్లను
జేతులు గోయుఁ డంచు లో, నూనినకిన్క-
రాజు ముదుటుంగరమిచ్చెను ..
సారంగ. 3. 26, 3. 22

ముదురు. అ. క్రి. 1. లేతదనము వీడి పరిణతి నొందు

సీ. సడలిన నిడుదకెంజడలును ముదురఁ బండిన
నాఁచుదీఁగలుఁ బెనఁగొనంగ ...
హరి ఉ 7 74

కం. ముదిరిన రేయొండలచే. నెద వడ దాఁకంగఁ
గొమ్మ యొడ వడఁ జొచ్చెన్ ..
కళా 3 107.

2. హెచ్చు. అధికమగు.

కం. అని యా రాజకుమారుఁడు, కినిసి పలికెనపుడు
వారికిని మాకును నీ, వనితకు వాదము ముది
రినఁ; జని చెప్పితి మప్పురంబుసభవారలకున్.
భోజరా. 7. 79

సీ. అనఘ మహోదరవ్యాధి నాతనువున, నొదవి
యంతంతకు ముదురఁజొచ్చె ..
నా పంచ. 4 81.

గీ. వీరశైవంబు ముదిరి యేవేళనైన, హరహర
శివా మహాదేవ యనుచుఁ బల్కు ..
హంస. 3 189.

3. పెరుఁగు, వృద్ధిపొందు.

గీ ధనమదంబును వేదవిద్యామదంబు, మోహ
లక్ష్మీమదంబును ముదిరి కాదె, కాశికా
పట్టణంబునఁ గరుణ లేక, బ్రాహ్మణులు నన్ను
నిటు భంగపఱిచి రకట! కాశీ. 7. 155

గీ. వెఱ్ఱిశైవంబు ముదిరి మద్విమతి వినుఁడు ...
ఆము. 4. 42. మనుచ. 5. 27.

4. ఒదుగు, ముడిఁగియుండు

కం అదురుదురే పగదాయకుఁ, జెదురుదురే ధైర్యశ్రీ;
మెదలి జీవితవాంఛన్, ముదురుదురే మూలల
నరి, కెదురుదురే కాక శూరు లెచ్చో నైనన్.
చంద్రా. 6 96.

విశే. 1. లేఁతతనము వీడినది.

గీ. ముదురుఁదీవెల బిగువుగా మోపుఁ గట్టి ...
హర 1 21.

సీ. కంబు సౌందర్యంబుఁ గబళించు కంఠంబు
ముదురు చందురుఁబోలు ముద్దుమోము ..
హ. వరాహ 2. 27.

గీ ముదురు ముంకెనపూవు కెమ్మోవి గాఁగఁ,
దములు చూపఁ గొలిపెడు కొమరుఁ దనపు,
జోగురాలును బోలెను జాగు మీఱు, కొలను
గాంచిరి మదిలోనికోర్కు లలర ...
యయా. 3 55.

వ. ఖిల్లపల్లవాధరలు భల్లవరంపరలన్ బగిలించిన
ముదురు వెదుళ్లనుండి జల్లున రాలి ..
ఉ రా 4. 163.

2. మిక్కుటము. ప్రబలినది, అతిశయించినది.

గీ. ముదురుటూర్పులు గెమ్మోవివదను దివియఁ,
జెమటచిత్తడి చెక్కులఁ జిప్పిలంగ, నున్న
తన్వంగి భయ మేద నుపచరించి, యింపు
రెట్టింపఁ దెరువరు లిట్టు లనిరి. విక్ర. 7. 102.

ఆ. ఎదురు లేనిభక్తి చిదురుపగానీక, యదరు
బెదరు మదిని గదురనీక, ముదురుకరుణ
నన్నుఁ బదురుగాఁ బెనిచెడు గదురు మద్వ్రతంబు
గాచుకుదుఁ, చెన్న 4. 129.

3. చిక్కనిది, సాంద్రము.

సీ. చంద్రకాంతపునీటజాలైనవెన్నెల, ముదురు
వెన్నెల జట్టిఁ బదనుఁ జేసి .. పారి. 2. 48

సీ. గదురుకంపు గడించు ముదురు క్రొంజెమటలఁ
జొనుపు పుక్కిటిలోనిజొల్లు విడెము ...
చంద్రా. 2. 40.

4. ముదిమిఁ జెందినది, వృద్ధము.

లింగము (వృ వి)

పుం న ఒకజాతిమల్లి (వృ. వి),

**ముద్గలము.** సం వి. అ. న రోహిషతృణము, ఒకచనుసుగడ్డి (వృ. వి).

**ముద్గలుఁడు** సం వి. అ పుం ఒకానొక ఋషి

**ముద్గషము** సం వి అ. పుం వనముద్గము, అడవి పెసర (వృ వి.) (వాచ.).

**ముద్ద**[1] వి (త. ముత్తై) కబళము, కడి.

కం. . గొబ్బున నొకముద్దఁ జేసి కొని మ్రింగుఁ జమీ ! .. సీలా. 2 ౭౬.

గీ. మెదడు ముద్దలు గావించి మెసవి మెసవి .. ఉశా 2 4౭౬, ఆం. భా 2 260.

2 పిండము, ఉండ

కం. లోహమయదైత్యనగరీ, గేహంబులు హాటక రాగ్నికీలాజ్వాలా, దాహమునఁ గరఁగి మూఁడుప,మూహము లై పెద్ద పెద్దముద్దలు నయ్యెన్ ... భీమ. 4 141.

కం మానక నిను దూషింపుచు, మానిని విను ముద్దె జేసి మన్ను గొనంగా, నానాఁటికి నాసీచుల, చేనదియంతయును బోపుఁ బెడి పుడికిల్లన్ భోజరా. 8 90.

జ ముద్దకమ్మరి. ముద్దకవ్వము, ముద్దకూడు, ముద్దికొలిమి, ముద్దగించు, ముద్దీఁకె

**ముద్ద**[2] విశ (సం ముగ్ధా, ప్రా ముద్ధ) ముగ్ధ, అమాయకురాలు, గోల. (చూ. ముద్దరాలు.)

జ. ముద్దరాలు, ముద్దటికము, ముద్దియ,

**ముద్దకమ్మర.** వి (ముద్ద[1] + కమ్మరి.) ఖాయి కరఁగి యినుము చేసెడియొక్కజాతి (ముద్ద కమ్మరివాఁడు. శ. ర.)

**ముద్దకవ్వము.** వి. (ముద్ద[1] + కవ్వము) మ్రాని బిళ్ల తగిలించినకవ్వము (శ. ర ).

**ముద్దకూడు.** వి కబళాన్నము, మాధుకరాన్నము.

సీ. హీనవృత్తిని బిచ్చ మెత్తి గోడలు దాఁటి ముద్దకూళ్లకుఁ బోయి మొత్తులఁ బడి .. వేణు. 41.

**ముద్దకొలిమి** వి (ముద్ద[1] + కొలిమి) ఖాయి యినుముగా కరిగెడికొలిమి (శ. ర.).

**ముద్దగించు.** అ క్రి (√ ముద్ద[1]) ఘనీభవించు, గడ్డకట్టు

ద్వి ధృతి ముద్దగించిన దివ్యామృతంబు, లత గరిగొన్నమూల స్తంభ మనఁగ . పండితా దీక్షా ౬ పా.

**ముద్దట** వి పిడుక

కం. గుడిలో ముద్దట లణఁచిన, గుడిలో వెంట్రుకలు వాచికొనినను నెపుడుం, గడు వెలవక పత్తించిన, గడునరి నరకాగ్నిశిఖలఁ గ్రాలు మహేశా .. శివ సా. 293.

**ముద్దయ్య.** వి (ముద్దు + అయ్య) కుమారస్వామి (శ ర)

**ముద్దరాలు.** విశ (ముద్ద[2] + అలు బ ముద్దరాండ్రు) ముగ్ధ, గోల.

చం ఇది గడు ముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేరదంతయున్, మృదు వొకకీడుపాటునకు మేకొనఁ జాలదు ... భార. విరా. 1. 103.

ఆ చాల ముద్దరాలు జవరాలు గోమరాలు, నీకుఖాతుమ్మరాలి కెవ్వఁ డొకొ్కా, మగఁడు సెప్పు మనిన భాగ. 9. 72 ఆం భా. 2 105.

(ముద్దురాలు = మనోజ్ఞురాలు శ. ర పా)

వి. స్త్రీ, ఆఁడుది

కం మీలుం దామరపూలున్, మే లగునమ్ముద్దరాలిమినుకుఁ గనుఁగవన్, బోలక నీట మునింగెన్, మూఁకు దొర గాక యిర్లు మూలకుఁ జేరెన్ అచ్చ రా. బాల. 181

మ. సరసిం దోఁచినముద్దరాండ్ర మొగముల్ సత్యంబుగా మించుతా,మర లంచున్ బరువెత్తఁ బోయెడు మదోన్మత్తద్విరేఫంబులు ... ఉ. రా. 6. 84.

సీ. . . ముద్దాడుఁ బులి లేఁటిముద్దరాలి .
కాశీ 2. 48, దశా. 9. 84

ముద్దలికము వి (ముద్ద² + అలికము) ముగ్ధాత్వము ముద్దరాలితనము.

ఉ ఎచ్చి తదీయమందిరము వర్తన లెల్ల నెఱింగి యచ్చటా. సచ్చరితంబు గల్గుటతిచాడ్పున ముద్దలికంబు చూపుచున్, బ్రముచ్చిలి రాత్రు లీలరంభి మూఁడుజగంబులు బ్రమింగుచుండె
కేయూర. 8 228

ముద్దాడు సం క్రి (ముద్దు + ఆడు) ముద్దు పెట్టుకొను, చుంబనము చేయు

ఆ ఆంరి చెక్కు నొక్కి యక్కునఁ జేర్చి ము, ద్దాడి నీకు ఫలము లారగింప, పలసినన్ని దెత్తు ....
ఉ రా 5 86

మ . జిగిజాళ్వా చెక్కుపున్ ముద్దుచెక్కిలి ముద్దాడుచు
దశా 8. 77

సి ముద్దాడి వలదె యీ మోహనా గునిమోము గండచక్కెర మోవి గలఫలంబు ...
విజ వి 1 71

(ముద్దిడు. శ ర పా.)

2. చుంబనాది పూర్వకముగా లాలించు, బుజ్జగించు.

కం .. మగువయుఁ బతియుం, బొదలెడి విస్మయము మనో, ముదముందలుకొత్తఁ గొడుకు ముద్దాడి తగన్ . హరి పూ. 5 188.

సీ. బలితనూజుం డైన బాణాసురుఁడు దొల్లి కార్తికెయుని శూలి గారవించి, ముద్దాడు నెడ నూచి మోదంబు ఖేదంబుఁ బొడమ నెమ్మనములోఁ గొడుకు నిట్లు పాటింపఁడేఁదండ్రి
ఉ. హరి. 5 9

మ. ... మఖశాలాగ్రంబునన్ శ్రాద్ధదేవుని గట్టించెను వీరభద్రుఁడు భటవ్యూహంబుచే నాగ్రహంబున ధూమోర్ణపయోధరద్వితయమున్ ముద్దాడుహస్తాబ్జముల్ .. కాశీ. 7.89.

(ఇట పుణుకు అని భావము. ఆదరించు అని శ. ర ).

ముద్ది¹ విశ. (౧ ముదియు ము లాపె. వృద్ధాగన

గీ. అవిన నమ్ముద్ది మంచి దయైన నేమి నా తనూ భవకలన వన..... ముద్దిగన నీకు నిదియు లే దన్న నందు, నద్ధమిక్కిలి యవ్వార నడుగుచెట్టి .
శుక 3 49.

గీ ముద్ది యన రాదు గ్రద్దన యయ్యెద్ద ...
శుక. 3 21.

ముద్ది² వి అడుసు, ఆపద (శ ర )

ముద్దిడు, స క్రి. (ముద్దు¹ + ఇడు ముద్దుపెట్టుకొను, చుంబించు

ఉ నద్దుకన్నె కన్నుఁగవ చొక్కపుఁ గెంపులు మోవి నొక్కమై, ముద్దిడువేః మోవితిని మోవి కొఱఁత పలంచి వెలుపు , ఔడ్డకు బాచ నత్తుఁ గని పెంచిన మేటికిఁ బ చక్కి వె, దద్దిర యంచు నవ్వు చతురాస్యుడు మాకుఁ జిరాయు వీవుతన్
రా వి 1 8.

ఉ ముంగిట నాడుపుత్రుఁ డతిమోదము నందను దొలఁ గాంచి వేడ్కం గరయుగ్మ మెత్తి చిఱుగంతులతో నెడ యేడ్పుతోడ డా యఁగఁ జెలఁగి యెత్తుకొని యక్కునఁ జిక్కఁగఁ జేర్చిముద్దుమో, ముం గమియార ముద్దిడుట ముజ్జగ మేలుట గాక యుండునే
కవిక 1 40.

ముద్దిడుకొను స క్రి (ముద్దు¹ + ఇడు + కొను. స్వార్థమున) ముద్దుపెట్టుకొను

కం. విద్దెములు నేయరాదో, ముద్దులపట్టి యటంచు ముచ్చటదీరన్, దద్దయుఁ దలిదండ్రులు తను, ముద్దిడుకొన నజుఁడు వెలయు మోహనలీలన్.
ఇందు. 2. 17.

ముద్దియ¹ వి (√ముద్ద²) స్త్రీ, అఁడుది

కం. అనుటయు దరిహసితము మో,మునకుఁ దొడవుగాఁగఁ బలుకు ముద్దియ ...
భార. విరా 1. 815.

ఉ గద్దియ డిగ్గి కౌశికుఁడు గాదిలిసూనుఁడు గొండ

పట్టినన్, ముద్దియ దతుహూతుకు విమూఢత రెండవపుత్రుడైనను, దద్దయు వేడ్కఁ జూతు నని . కాశీ 6 21.

ఉ ముద్దులు గుల్కుకుందనపుముక్కలిపీట వసించెఁ దమ్మిపూ, ముద్దియగద్దియం బొలుచు ముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్ ..
విజ వి. 3. 92.

2 ముగ్ధ, గోల.

సీ ... ముద్దరా ల్ముద్దియ ముగుద యనఁగ, ముగ్ధ యొప్పను ... ఆం. భా. 2. 105

ముద్దియ(ద్దె)² వి (సం. ముద్రికా, ప్రా. ముద్ది ఆ) తామరపువ్వులోని దుద్దు, కర్ణిక

ఉ అద్దము చూచి చంద్రముఖి యందముగాఁ దిలకంబు కన్గొనెన్, దిద్ది యనేకరత్నమయదివ్య విభూషలు దాల్చి యొయ్యెడన్, ముద్దులు గుల్కుకుందనపు ముక్కలిపీట వసించెఁ దమ్మిపూ, ముద్దియగద్దియం బొలుచు ముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్ విజ. వి. 3. 62.

ఉ పొద్దెపుఁదేఁటి చెక్కుకొన సోఁకులచే రవళించు తమ్మిపూ, ముద్దెడుమామిస, ద్దడర మోదుగు నేఁజయుఁ నల్వకేడెమున్ . ప్రబంధ 5. 14.

గీ పొలుచుఁ గర్ణిక దుద్దు నా ముద్దె యనఁగ.
ఆం. భా 1. 165.

ముద్దీఁకె వి ముద్దు + ఈఁకె) ఏనుఁగును బొడిచెడి ఒరగోల (శ. ర.).

ముద్దు వి (క ముద్దు త ముత్తు) 1. చుంబనము,

(చూ. ముద్దాడు, ముద్దుగొను, ముద్దుగొను,)

గీ. ముద్దు నాఁగను జుంబనం బొప్పుచుండు ...
ఆం భా. 2. 180.

2 ముద్దు వచ్చుపని, ఇంపు గలిగించు పని.

ఉ సందిలి పట్టి యాడు మన నాట్యము లాడుచు ముదు-న్ మహా, వంద మొనర్చె బాలిక డిన-బును జుట్టపుఁ బూవుఁబోండ్లకున్ .
కళా 6 200.

3 ఆదరము

(చూ ముద్దుగావించు )

4. సొంపు, చక్కఁదనము, ఇంపు, మనోహరత్వము

సీ, పలుకుల ముద్దును గలికి క్రాల్గన్నుల తెలివును పలుకు చన్నుల బెడంగు .
భార. ఆది 8 27

గీ ముద్దు, చిలుకు నచ్చు చిలుకల కొలుఁకు లపుడు ... దశా 2 248

సీ తరుణాంగుళీధూతతంత్రీస్వనంబు తోఁ జిలిబిలి పాట ముద్దులు నటింప ... మనుచ. 2. 27.

5. ప్రేమము

చం. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవు గుత్తి వే,ల్పుఁగమిజీవగఱ్ఱ యుడివోవని చేవ్వలకెంకి వెన్నల ల్మొలచినపాదు పాల్కడలి ముద్దులపట్టి నృసింహకృష్ణరా, యలఁ గరుణారసంబు నినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్.
పారి. 1. 6

వ. ... అద్దేవదేవునకు ముద్దులమనుమలు గావున దశా 3. 125.

చం . ప్రసు, కర్ణిక పలుమాఱుఁ జూపఁ జెలికత్తెలు ముద్దులపాప పొమ్మనన్, మొకము సగంబు వాంచె మణిముద్రికలం జిఱునవ్వు గప్పుచున్. ఉ హరి 5 54.

(ముగులపాప = ప్రేమాస్పదమైనది, అమాయకురాలు )

విశ. 1 మనోజ్ఞము, సుందరమైనది

కం. అద్దేవుండు బైపడ, గద్దింపుగ శైల న్య కనుఁగీటంగాఁ, బెద్దవడి నటించుచు వ,ముమ్మద్దియ చిఱునగవుతోడ మ్రొక్కుచు నిలిచెన్ .
ఉ హరి 5. 59.

చ తెలికనువోయిమిం మలును దిన్నని నవ్వులు ముద్దుమోములున్ . విక్ర 1. 79.

కం. వలనుగ నవ్వుముద్దుంబై, దలి వలి నిట్టూర్పు

కమ్మతావులచే వా.విలి వనిచె వనఁగ ని వే,
ల్పుల ముస్నె వ్వారి నెట్లు పూజించెనో
రసిక. ౨ 127

2. ప్రేమా స్పదము, అనుఁగు

శా క్షోణపల్లభు ముద్దుగ న్నెనునుఁబల్కుల్ గ్రోలు
కోలేపు నీ, ర్వాణాన.ఏము లై నపీనులకుఁ
దత్త్వావ్రయు బు గంధర్వర్వాడ్విణానాద మొకింత
సమ్మదము గావింపంగ నింద్రాదిగీ, ర్వాణాధీశ
చతుష్టయం బరిగెఁ దారావీథి దూరంబునన్
శైవ. 7 35

ఉ ద్వారకముద్దుఁజెలె లంట తన్నగరీమణి సృష్టి
యన్నిటం, దిరుగ దైనచో నిదియ నేర్పులమే
లని యెంచి చెసెఁగో, ధారుణి విశ్వకర్మ ...
విజ వి 1. 20

ద్వి ప్రొద్దు నేఁ డిదె గ్రుంకెఁ బోలమునమండి,
ముద్దులేగలు వచ్చి మొనవలఁ గలసె ...
ద్వి హరిశ్చ. ఉ 1684 పం.

**ముద్దుఁడు** విశ. ముద్దుఁడు, గోల, బేల.

గీ. తేరపని మానిపిన వాసుదేవుఁ డిలకు,దాఁటి
శాతాసిపైచె మాధవునిమీఁదఁ, బదిశరంబులఁ
ద్రుంచి గోపాలవిభుఁడు, ముద్దుఁడును బోలె
కన్నులు మూసికొనియె. ఉ, హ 8 100.

**ముద్దుగలకాళ్లపురువు.** వి. (మూఁడు + దుగల + .) జంటముక్కాలి, షట్పదము, తుమ్మెద.

**ముదుగల తల్లుల బిడ్డఁడు** వి కుమారస్వామి.

**ముద్దుగలము** వి (మూఁడు+దుగలము) ఆఱు బేడలు

**ముద్దుగా** అవ్య అందముగా, మనోజ్ఞముగా.

**ముద్దుగుమ్మ** వి (రూ. ముద్దులగుమ్మ)) మనోజ్ఞురాలు, స్త్రీ.

సీ ముద్దుగుమ్మకు శిలీముఖమయ్యె దుమ్మెద
రసిక. 4. 39.

**ముద్దుగురియు** అ క్రి. మనోజ్ఞముగా నుండు.

సీ ముత్యాలసరులతో ముద్దుగులుకు ..
శైవ 3 .13.

**ముద్దుగులము** వి. రూ ముద్దుగలము

**ముద్దుగొను** అ క్రి చుంబనముచేయు

**ముద్దుగైకొను.** అ క్రి. చుంబనము చేయు

**ముద్దుటుంగరము** వి రూ. మురుటుంగరము.

**ముద్దుటుంగ్రము** వి రూ మురుటుంగరము

**ముద్దుపెట్టుకొను.** అ క్రి చుంబనము చేయు.

**ముద్దుప్రాలు** వి ధాన్యవిశేషము

**ముద్దుముద్దు** విశ జిలిబిలి

**ముద్దురాలు** వి ముద్దుగవస్త్రే

**ముద్దులగుమ్మ** వి ముద్దుగవస్త్ర

**ముద్దులాఁడి** వి విశ ముద్దుగుపస్త్రే

**ముద్దులాఁడు** వి మనోజ్ఞుఁడు.

సీ పేరడిచే వదుని వెలఁదికి జగమెల్ల ముఖ
మందుఁజూపిన ముద్దులాఁడు .
భాగ 10 పూ. 1253.

**ముద్దులుగుల్కు.** అ క్రి మనోజ్ఞముగానుండు.

ఉ. ముద్దులుగుల్కు నీ భువనమోహన కుండల
రత్నదీధితుల్ .. కవిక. 6 207.

**ముద్దులుమూటగట్టు** అ క్రి. మనోజ్ఞముగానుండు.

**ముద్దె** వి. 1 పద్మబీజకోశము, కర్ణిక.

ఉ కొమ్మలతోడి హస్తములు గుత్తపు ముద్దెల
ముద్దుగుల్కు పొందమ్మల ..
పంచ 24 154. (శా.)

పొలుచుకర్ణిక దద్దునా ముద్దెయనఁగ ..
ఆం భా 1. 224

2. ముద్దియ

**ముద్ర.** సం వి ఆ స్త్రీ. 1. ముద్దర, సీలు.

2 అంగుళీయకము లోనగువాని యందుండు సంజ్ఞాక్షరములు

3 సంజ్ఞాక్షరములుగల యంగుళీయకము

4 బంగడ, ధాన్యపురాశిపై వైచు సీలు

5 భుజములపై వైచుశంఖము చక్రము లోనగు ముద్ర

6 నృత్తహస్తములలో నొకటి

7 జపము సేయు సమయమందుఁ బెట్టుకొను అంగుళి విన్యాస విశేషము.

8 సాణెము

9 కావ్యాలంకారశాస్త్రము దొక యలంకారము, సరియైన పదములతోను నామములతోను వస్తు పర్ణనము గావించుట ముద్రాలంకారము.

10 బిరుదు వర్ణములుగల పతకము

**ముద్రణము.** వి అచ్చుపని, ముద్రితప్రతి.

**ముద్రణపత్రము** వి అచ్చు నిర్దుష్టముగా పడినదో లేదో చూచుటకు మొదట ముద్రించిన కాగితము, (ప్రూఫ్సు ; విల్యమ్సు)

**ముద్రాంకము, ముద్రాంకితము** విశ ముద్రితము

**ముద్రాక్షరము** వి ముద్రవైచిన అక్షరము.

**ముద్రాకారుఁడు** వి ముద్దరలు చేయువాఁడు.

**ముద్రామార్గము** వి. బ్రహ్మరంధ్రము

**ముద్రాయంత్రము** వి. అచ్చుయంత్రము

**ముద్రారక్షకుఁడు** వి. ముద్రలను భద్రముగా నుంచువాఁడు

**ముద్రారాక్షసము.** వి విశాఖదత్తుఁడు సంస్కృత భాషలో రచించిన యొక నాటకము పేరు.

**ముద్రించు** సం స క్రి. (గొంగ్లెము) 1. వేయు, బిగించు, తాళము వేయు

కం కలువలకు వచ్చుబిందిర, తలుపులు ముద్రించి యున్న తామరసగృహంబులు పాడగుటన్ మూల్గుచు, వలిభూతము లందలోన నధివసి యించెన్ — కవిక. 4. 79.

2 ముద్రవేయు, సీలువేయు.

ఉ పంచశిలీముఖుండు తుదబాణమునన్ ఒగ మెల గెల్చియ, భక్త్యంచిత పుష్పవృష్టి మనుదానశి నింపఁగ నిప్పు డల్లుము,ద్రించినజాడ దెల్పె సుదతీ మధుపంబు పరిచ్ఛదచ్ఛటాకంచుకితో త్పలంబుతుదకన్నునఁ జిక్కి యచంచలాకృతిన్. — వసు 4 133

**ముద్రితము** సం విశ (అ ఆ అ) 1 ముద్ర వేయఁబడినది. 2 మూసివేయఁబడినది, ముద్దర వేయఁబడినది 3 వికసించినది, ముకుళితము 4. అచ్చువేయబడినది.

**ముధా** సం అవ్య. అ 1 వ్యర్థము, ప్రయోజనము మాలినది

ఇది ముధాప్రయాసము మొదలగుచోట సమాస పూర్వపదముగామాత్ర ముండును )

**మునగ** వి (త మురుంగై.) 1. శిగ్రువు, ఒకా నొకచెట్టు.

గీ ఇఱుకుమ్రాను పెరటిలో నెక్కుబావి, మునగలును జొప్పపెనువామి ... తనర నిరతంబు వెలయు నాతనిగృహంబు ...
శుక 2 408. (మునుఁగు అని చి. ని పా.) ఆం. భా. 2. 44.

2 శిగ్రుశలాటువు, మునగకాయ.

ఆ. మునగ యుల్లి యడవిమునగ దుర్మాంసము, లానుగమ్మి మలిన మైనయుప్పు, గజియజీల కఱ్ఱగఱివేము గురుజ యిలుగువ ప్రవర్జనీయ కోటి, — భార అను 8 189.

**మునగపూజిట్టువ** వి. పక్షివిశేషము

సీ జిట్టువ మునగపూజిట్టువ గిజిగాఁడు వల్లడ పొడిపిట్ట వఁగపంఁడు.

ఆ. అవి యైనపతు లతఁడు దీర్చు .
హంస. 3 12.

**మునన** వి. పతఘ్నమానిమీఁది యరభాగము మీఁట (క ర)

**ముని.** విశ. మునుశబ్దమునకు వృత్తియందు దుత్తర పదము పరమగునపుడు వికల్పముగా నగు రూపము.

ఉదా : మునికాళ్లు, మునివేండ్లు, మునిమాపు మొ.

**ముని** సం. వి అ. పుం. 1. ఋషి. 2. దమనకము (వ్య. వి) 3. బుద్ధుడు. 4. ప్రియాలువృక్షవిశేషము 5. మామిడిచెట్టు. 6. ఏడు సంఖ్యకు సంకేతపదము.

**మునిగించే.** సం. క్రి. (√మునుఁగు) మునుఁగునట్లుచేయు. ముంచు, నశింపఁజేయు

చం. వనవిలుకాఁడ మన్మథ యనాథవధూహననపాతకంబు నిన్, గొని మునిగించెఁ గ్రూరం హరకోప కటాక్ష శిఖస్వరూప మై ... నైష. 2. 135

**మునికా(గా)లు.** వి ఔ. (మును[1] + కాలు)

1. పాదాగ్రము, కాలికొన

సీ. మునికాళ్లు మోపి నిక్కినఁ బసచ్ఛవి రేల యును బల్లవించిన యొప్పు మెఱయ ... నృసిం. 2. 81

సీ. మట్టియ లొండింటి బిట్టుదాఁకఁగనేల నందంద మునిగాళ్ల నప్పళించు ... భార. విరా. 2. 250.

కం అని చిందరేఁగిన ట్లచ్చెనఁటి ధరాసురుఁడు చెంతఁ దేపడివనిధిన్, మునిగాలఁ దన్ని చను గతి ఘనజఘనం బాసి యబ్బగాఁ డయి పోయెన్. వేం. పంచ 4. 292.

2. అగ్రపాదము, ముందరికాలు.

సీ. కదిసితో మునిగాలు గఱచి వెంబడి దీయుఁ దిగిచి తోడనె లేవఁ దెరువుఁ గట్టు ... చంద్రా 2. 91.

సీ చెవులు అిక్కించి చూచి మునిగాల్వకి నెత్తి కొట్టుఁ దేఱులఁ జాపకట్టువడఁగ . రాజ. చ. 2. 75

**మునికోల = ములుకోల.** వి. 1. తోత్రము, కొరడా.

చం. .. సత్వసేనుఁ డుగ్రక్కున నిగిడింపఁ జేతి మునికోలయుఁ బగ్గములున్ మహీతలంబున నొగలందునుం బడిన భూవర పార్థుఁడు క్రోధదీప్తుడై. భార. కర్ణ. 1 069.

మ ... అప్పనపాటి క్ష్యముఁ బూని కగ్గములూఁదే జోదిక్యంబుగాఁ బట్టుచున్, మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్ ... భాగ. 1. 228

2. ఆరెకోల, వృషభాదులను నడుపుటకై పొడిచెడి కఱ్ఱ.

క ... వారల నాయంయమిశ్వపుండు, నిశితతరమగుమునికోల నెత్తు రొలుక, మోపుచును ... భార. అను. 2. 210

వ ఇట్లు తాఁ దెచ్చినయెద్దు నెనుపోతును మెడఁ గాఁడి గీలించి ప్రచ్ఛన్నరూపంబునం బాదరక్షలు తోలు మోకు మునికోలయు నంటఁగట్టి పెద్ద యేఁడికోల యమర్చిననాఁగలి భుజాగ్రంబునం దాల్చి . శేష. 3 199.

**మునిగొంగు = ముంగొంగు.** వి. (మును[1] + కొంగు) చెఱఁగుకొన.

చం. . . కుంచితాగ్రముల వలిపంపుఁజేలమునిగొంగొకయించుక యొత్తి ... శుక. 1. 281

**మునిచీకటి** వి (మును[1] + చీఁకటి దీనియా మ్రేడితరూపము మునిమునిచీకటి.) పొద్దుగ్రుంకినతోడనే పర్వెడుపలుచని చీకటి.

గీ. . మునిచీకటి ముఱిచీకటి. మసక ... యనఁ నవతమసనామధేయ మై యలరుచుండ ... ఆం. భా. 1. 148.

**మునిమునిచీకటి** = అసంజవేళఁ బర్వెడిమిక్కిలి పలుచనైన చీకటి.

చం మునిమునిచీకటి న్నడువ ముంగిటవాకిటనైన నొంటిబాటున నడయాడుటవ్వనుల డొంకక పయ్యెదయైనఁ జెట్టయైనను బెడయైనఁ బట్టు . . దశా. 8. 223.

**మునిచెఱఁగు = ముంజెఱఁగు.** (వి మును[1] + చెఱఁగు) ముంగొంగు.

గీ. చేరి రవ్వేళఁ దమమునిచెఱఁగులందు, గాసు దుడ్డును బంగారుపూస వెండితునుక మొదలింటి

చిఱువాడు గొనిన దెల్లఁ, గొనుచు మగవాండ్రు తమకల్లగుట్టు మెఱయ ... శుక. 2 117.

**మునిత్రయము** సం. వి. అ. న. పాణినికాత్యాయనపతంజలు లనుముగ్గురుమునులు.

**మునిద్రుమము** సం. వి. అ. పుం. స్యోనాకవృక్షము.

**మునిపల్లు** వి. ౝ (మును[1] + పల్లు) ముందుభాగమున నుండుపల్లు.

(బ. మునిపండులు, మునిపండ్లు, మునిపల్లులు)

చం. .... తద్గణాధిపుల్, ఒఱువిడిఁ జుట్టి పూషు మునిపండులు డుల్లఁగ వ్రేసి కినుసన్ .
కు. సం. 2. 212

గీ. నాటుకొని శ్రీమహాశ్మశానమున నున్న, యణుకనగాన్నల్లవటుఁ డైన నాగ్రహమున, గర్వితోద్ధతి నేతెంచుకాళరాత్రి, మృత్యుదేవత మునిపండ్లు మెఱుకఁ జాలు . కాశీ. 2. 47

సీ. మొసవాడఁ ద్రిప్పి తోమినమునిపండ్లపైఁ దళుకుత ళ్కొ నెడు కుందనపురవలు ...
రా. వి. 2. 57

**మునిపిత్తలము** సం. వి. అ. న. రాగి, తామ్రము (త్రి. ని).

**మునిపుత్రకము** సం. వి. అ. పుం. 1. కాటుకపిట్ట. 2. దమనకవృక్షము.

**మునిభేషజము.** సం. వి. అ. న. 1. హరీతకి. ఉసిరిక (వ్య. వి.) 2. ఉపవాసము, పస్తు.

**మునిమనుమఁడు.** వి. (మును + మనుమఁడు.)

వ. ప్రపౌత్త్రుఁడు, పౌత్రునిపుత్రుఁడు.

1. రుద్రపవనేంద్రాదులు మనుమ లై మునిమనుమ లై వృద్ధినొందుచుండఁగ నందఱకు నాధారభూత మై కూటస్థబ్రహ్మం బైన నీకు విచారం బేల యని సాభిప్రాయంబుగఁ బల్కిన విని హరి యిట్లనియె. వేం. మా. 4. 137.

2. పౌత్త్రిపుత్రుఁడు, దౌహిత్రునిపుత్త్రుఁడు; దౌహిత్రిపుత్త్రుఁడు.

**మునిమనుమరాలు** వి. (మును[1] + మనుమ + అలు) 1. పౌత్త్రునిపుత్త్రిక. 2. పౌత్త్రిపుత్త్రిక, దౌహిత్రునిపుత్రిక, దౌహిత్రిపుత్త్రిక.

**మునిమనోహరాలు** వి. సం. వి. అ. ధాన్యవిశేషము.

వ. ... రాచవన్నెలు తుంసివనమాలికలు సింధుకర్పూరాలు రాయమెచ్చులు నేఱుసల్లెలు మునిమనోహరాలు వెండిగుండ్లు .. అను నూటనాలుగువగల పైరులచేరుడుబియ్యంపు వట్టిపసాదంబులు ... ప్రబంధ. 112.

**ముని(ను)మాపు** వి. (మును[1] + మాపు) ప్రదోషకాలము, సంజ.

ఉ. అచ్చటు వాసి యల్లఁ జని యాహ్నిక వర్తన మాచరించి రా, లచ్చివిలాస మందఁగ నలంకృతుఁ డై మునిమాపుదర్శనం బిచ్చిన మంత్రిభృత్యసుకవీశ్వరు లాదిగ నెల్లవారలున్, వచ్చి మహీశుఁ గొల్చి రనివారణఁ జిత్తము లంకురింపగాన్ . నిర్వ. 9. 84.

సీ. మునిమాపుజిగిఁ దొలంగిన తమ్మితేకులరీతిఁ గన్నులదైన్యరేఖ దోఁచె ... అని. 3. 121.

కం.... అమ్మెర, మున నొక్కెడ విశ్రమింప మునుమాపగుడున్ ... దశకు. 7. 65.

సీ. చామనిచాయదాసరి ముత్తె మిచ్చినకల మొన్న మునుమాపు దెలుపవలెనె ...
రా. వి. 2. 11, పారి. 1. 49
ఆం. భా. 1. 94

**మునిమీసము** వి. (మును[1] + మీసము) అప్పుడే మొలచుచున్న మీసము.

(దీని యామ్రేడితరూపము మునిమునిమీసము చూ. మునిమీసము.)

**మునిముంగల.** వి. (ముంగల + ముంగల.) మొట్టమొదట. (శ. ర.)

**మునిముచ్చు.** వి. (మును[1] + ముచ్చు) పశ్యతోహరుఁడ, పచ్చెకాఁడు చూచుచుండఁగా దొంగిలించువాఁడు; పశ్యతోహరురాలు, పచ్చెకత్తె.

కం. మునిముచ్చులార మీచేసినపని యటు గట్టి పెట్టి చేకొని యేలా, నను దఱిమితి రిక నేఁయ, వవకుఁడు నాతోడిదొంగ లైతిరి మీగుచ్. ప్రభా 5 70

గీ వైచి సరగునఁ గ్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడెవెట్టి యుఁక మునిముచ్చు కాన, యిటు మొగఁ బైన నాకొద్ది యెఱిఁగె దనుచ, నిఁటి కిని వచ్చె నవ్విటకంటకియును. వి. ప్ర 4 50

(ఇట దొంగముని యని యర్థాంతరము.)

వ. . వాదులు ప్రోదులు సేయుమునిముచ్చు బోధలు వినఁ బనిలేదు. వరాహ. 11 57.

కం. ఏను వల్లభ కన్నుండం, గను పాపం దవియ సేర్పు గలమునిము చ్చి, వనిత తగదిచట నుండన్, వెనుకను దిద్దుకొనవచ్చునే యొక లైవన్. కళా. 5. 198.

**మునిముద్ర** సం వి. అ. స్త్రీ మౌనవ్రతమును సూచించు ముఖాంగుళి విన్యాసవిశేషము

(సంగీత పారపశ్యవర్ణనము)

సీ. చెలి యని కొమ్మపై చేతు లూఁదనికొమ్మ మునిముద్ర దాల్పనిముద్దుగుమ్మ. యాసఖాస్థలి లే దయ్యె ... సమీర. 6. 210.

**మునిమునిమీసము.** వి. (√మునిమీసము) నూనూఁగుమీసము.

సీ. మునిమునిమీసంబు మెనయునేఁటనె యమళ తళ మొనర్చి కౌశలముగన్న .. ప్రబంధ. 29.

**మునిము(ము)చ్చు.** మి వి. (ముని+ముచ్చు) దొంగవేషము వేయుమునులు, వంచకు లగు మునులు.

గీ. పవనపర్ణాంబుభతు లై నవసి యునుప, నచ్చుడా ల్కట్టుకొన్న మునిముచ్చులెల్లఁ, దామరస నేత్రలిండ్ల బందాలు కారె ... మనుచ. 2 73

**మునియేఁడు** వి. దే. (మును[1]+ఏఁడు) నిరాటిక పూర్వపువత్సరము, ముందఱేఁడు

స్త్రీ మునియేఁడే నే నైనమునికనకుడును, తను గుఱ్ఱ గోత్రాత్తి చను గల్గివాఁడు. అ. మ క. . 4 హా 11. కం

**మునివ్రేలు.** వి. దే. మును[1]+వ్రేలు బ. ముని వ్రేలులు, మునివ్రేళులు, మునివ్రేళ్లు.) వ్రేలికొన, అంగుళ్యగ్రము.

సీ శ్రవణసంకుమదంబు సందించి మునివ్రేల మృదు కీలిఁ బైకిఁ గె మెఱుఁగుసేయు ... వైజ. 1 19

కం అని యడిగిన హేమావతి, ఆని దీర్ఘోచ్ఛ్వాస మొనర విడిచి నిజాంఘ్రి, గనుదృష్టి నిలిపి మెల్లన, మునివ్రేలన్ నేల గీరి మునుకొని ఇలికెన్ ... హంస. 2

కం ఉన్నయెడన్ మునివ్రేళులఁ, దిన్ననినడ నగు దవతి పదిలుఁ డై చేసి, గొన్నియడుగు లరి యడరి, యన్నగచరనాథుపై దయంబునఁ బడి యెన్ ... నిర్వ 7. 82

కం మన పోఁడై నడపంబును, మునివ్రేళ్ల నె యెన్ను జగము మునుమేర విలం, ఘన మొనరించు జపంబును మునుకొని లెక్కిడనిజపము ముఖ్యం బగునే ... కాశ్రి. 5 86

**మునిషీ.** వి. (హిం, మున్షీ) చదువు చెప్పువాఁడు, బోధకుఁడు, లేఖకుఁడు, వ్రాయసకాఁడు (మి. బ్రౌ.)

సీ మునిషీ యొకఁడు చెప్పు మొనసి బతీచెప్పు ... వేణు. 19

**మునీంద్రుఁడు.** సం. వి అ. పుం 1. మునిరాజు, మునిశ్రేష్ఠుఁడు. 2 శాక్యముని. 3. భరతు డు 4 ఒకానొక రాక్షసుఁడు

**మును[1]=మున్ను** వి (క. మున్. హల్లు పర మగుచో దీనితుదియుకారమునకు లోపము వైకల్పి కము. దీనియామ్రేడితరూపము మును మును)

2 ముందు, పూర్వము.

కం చనువానిసేయు కార్యంబున కడ్డము సొచ్చి

నేరుపున మెలఁగుచుఁ దా,మును బయిఁ బూను
కొనుటఁ దవ,మును మెలఁగిన మెలఁకువకును
ముప్పగుఁ బిదపన్ భార. విరా. 1 125.

కం. మును రుక్మిణి త న్నడిగిన, దనుజాంతకుఁడే
వరంబుఁ దప్పక యిచ్చున్ ..
ఉ. హరి. 2 77.

సీ. ప్రాణేశ పతికి మున్ పరలోక మరిగెడు చెలువ
లేతపములు చేసిరొకో ...
భా రా యు 392

మ మహి ము న్యాగనుశాసనుండు స్సృజి
యింపన్ .. వసు 1. 10

2. మొదలు, ప్రారంభము

కం. మును వెఱతు నేయ మీంలు, నను నేసివఁ
గాని . . భార విరా 5 124.

మ. అమరారాతు లనేకు లీరణమునం దసమ్రవమ్రహా
చక్రవి,క్రమిగర్వంబునఁ గాలనేమిమునుగాఁ
గాలాంతముం బొందిరి ...
హరి. పూ 4. 183

సీ. అచటిమేటికిరాటు లలకాధిపతి సైన మును
సంచిమొద లిచ్చి మనుప దఖ్యలు ...
మనుచ. 1. 51.

కం. దనుజాతఖండనోద్ధతిఁ, జనుమనుజాధిపు
ప్రతాపజాతము మునుముం, గనిపించె నసుచు
జనముల్ , గనుఁగొన మార్తాండమండలం
బుదయించెన్ కువల 2 50

మ మునుము ద్దెల్పును దూఱఁ దూఱ మఱి
కెంపు న్వెండియుం దూఱఁ గందనగాయం గల
నల్పు దోప నఖకోణశ్రేణిచే విక్రమం,బున వాఁ
డుగ్రతఁగొన్నయట్టి విలసన్మూర్తి త్రయీ
తేజముం, గొనుబీల న్విదళింపవే యసురవ
క్షోభిత్తి మిథ్యాహరి ...
ఆము. 4 23 మనుచ 2. 30.

3. పురోభాగము, ముందువైపు

మ. ... లచ్చిని, బట్టలవుంజన్గవఁ బోలుమున్నో
"గముస్ డా చేసి యుల్లాసి యై ...
పాండు. 3. 160.

చ. అరదము నెక్కి . . ... తాల్మితోన్, దుఁగ
జవంబు మున్గవనఁ ద్రోచికడంగెడు తత్తరం
బతో, హరి పసుదెంచె . . పారి 1. 104.

4. తుద, అగ్రము

సీ మును మించినిడుమోర ముంచి దూఁటిన
మహాజడధిపూరము తలకెడవు గాఁగ ...
హరి. పూ 4. 16.

జ మునికాలు, మునిగోంగు, మునిచీకటి, ముని
చెఱఁగు, మునిపల్లు, మునిమునుమఁడు, ముని
మనుమరాలు, మునిమాపు, మునిమీసము, ముని
ముచ్చు మునిమునిమీసము, మునియేఁడు
మునివ్రేలు. మునుకడ, మునుకొనిపోవు.
మునుకొను, మునుకోలు, మునుగట్టు.
మునుచు[2], మునుపడు మునుపు[1], మునుపు[2],
మునుపట్టు మున్కాలి, మున్నీరు, మున్మనమ్మ
కట్టు. మున్నాపు, మున్వెనుకలు, మున్మను
మఁడు, మున్మనుమురాలు

మును[2]. నం. మూఁడుశబ్దమునకు వృత్తిని పూర్వ
పద మగునపుడు వికల్పముగా వచ్చునాదేశము.
(చూ మునుమాటు.)

మునుఁగబడు అ క్రి (మునుఁగ + పడు
స్వార్థమున) 1. మునుఁగు, మగ్నమగు.

కం . సారరహిత విరహదశా, పారావారమున
మునుఁగఁబడి యున్న యెడన్ .
కువల. 3. 84.

ఉ. ఇక్కవు లెల్ల నిత్తటి మహీధరసన్నిభ మైన
వీనిమే, నొక్కటఁ బ్రాఁకి నొంప బహుయూథ
భరంబునఁ జిక్కఁబోలు నా, గ్రక్కున వారు
పాటి మునుగంబడ నెక్కిన బిట్టుదూలి వల్లి,
కుప్పఁ గూల గాత్రము విదిర్చె నతండు మదద్వి
పాకృతిన్. భా. రా యు. 9. 40.

మునుఁగు(స్గు) అ. క్రి (క. ముళుగు ) 1.
స్నానము చేయు , మునక వేయు.

చొక్కి సుకియు చుబలితఁపు రక్క నులును.
మైరా. 3 143.

9 గ్రుమ్చుకొను, నాటు.

చం చనుమఱింటు వఱమునఁ జతుకుపాంతము లందు ఔవ్వుఁన్. మునిఁగినబాణజాలముల ముప్పిరిగొన్నభయంబు ఖేదమున్, సునమున నిఁడఁగాఁ దొడఁగి మార్కొన లేక కుబేరుఁ డేఁగె న,ద్దనుజుల నింత చేసినవిధాతకు గోడనఁ జోవుచాడ్పునన్. ఉ. హరి. 1. 42

10. పూర్ణము.

తే తన్వి సాత్త్విక రాజసతామసాత్ము, లైన వారలఁ బుణ్యలోకానుభవము, మనుజభావంబు ని.యపీడనముఁ బొందు, మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ మునరు ...
భార. అను 5. 142.

ఆ. అన్యదైవవితతి నర్చించికొలువు తా,డిడి ఫలంబు గొనుట వడయఁగనెడి, సద్యమిష్ట ఫలదు జంగమ మల్లికార్జునుని గొలువు మొనరు మునుఁగఁ గొనుట. కు. సం. 1. 12.

వి. స్నానము, మునుఁగుట

కం. క్రీఁగన్నుల మగలఁ గనుచు, వాఁగిన వడఁకుచును మునుఁగు లాడఁగ నూత్నుల్.
అచ్చ. భా 3. 44 బా

సీ అనిమిషాక్షి మునుంగుడాట లాడెద వేమె పడు తుక నేఁ జోఱుబుడుతఁ గానె ...
చంద్రా 4. 347

మునుఁగ(ంగ)ఁబాఱు = మునుఁగుటకు సిద్ధముగా ను డు.

మ అనిరుద్ధాకృతిమీఁదఁ జిక్కుపడి యయ్యజ్ఞాతిచూ పంగముల్, ఘనరోమాంచమువంపనర్చెఁ బ్రియు నిక్కం బిట్లు గన్నట్లు పై, కొని పూర్వానుభవంబు తియ్యమగు కోర్కుల్ చిత్రరూపంబుపై, మునుఁగం బాఱుట దెల్పెడుక్ వివశతాముగ్ధంబులై భావముల్.
హరి ఉ 7. 180.

చం. మగువముఖేందువం దమృత మగ్నమునన్ మునుఁగంగఁ బాఱెయో

జ ము చు, మునుగొను ముంపించు, ముంపిరి, ముంపు, ముంపుగొను, మునిఁగించు, మునుఁగఁబడు, మునుఁగుకోడి, మునుక, మునుచు.

మునుఁగుకోడి వి (√మునుఁగు) పక్షివిశేషము.

సీ. మునుఁగుకోడియు డాబ ముట్టెకోడియు బోద బొన్నఁగి కల్లెడు బొల్లికోడి .

గీ అది యైనపతు లతఁడు దీర్చు . .
హంస 3 12.

మునుక వి. (√మునుఁగు) 1. మునుఁగుట, స్నానము.

కం ... భాగ్యశాలికిం గలుగుం దు,ష్కృత మాలిక వడపం గల, కృతమాలిక మునుక దొరకునే యన్యులకున్ ... దశా 1, 124.

కం మునుకలు గంగానదిలో, నొనరించుటకన్న భాగ్య మున్నదె యనుచు, న్మునుకలుగంగా దిగి పరి, జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁడై. విజ వి. 1. 55

సీ. స్నానంబు వెలయును దానంబు మునుక బుడుక మజ్జన మన . ఆం. భా 2. 160

2 మునుకవేయుట (శ ర).

మునుక(గ)ఁడ వి (మును[1] + కడ) 1 ప్రథమ సమయము, మొదటివేళ, తొలుదొల్త.

కం. మఱునాటిరాత్రి మునుకడఁ దఱి యెఱిఁగిఁ యవంతివిభుఁడు దయ దైవాఱం, గొఱత వడకుండ వెరవుగ, నెఱమంటలకుండ మున్న యొసకరఁదెంచెన్ ద్వా 7 107

ఉ. వెగ్గల మైనకూర్మి నరవిందదళాయతనేత్ర కొండకా, దగ్గి పటీరకాష్ఠములయందు చవులొల్కనఁ జేసి కమ్మివపూ, మొగ్గలదండ దామది మునుకడఁ గాశిని విశ్వనాయకు న్దిగ్గన సంస్మరించి జననిం జనకుం దలఁచె. గ్రమంబునన్. కాశీ 5. 158.

**మునుకొనిపోవు** అ. క్రి. (మునుకొను¹ + పోవు)
ముందుకుపోవు

చం. మునుకొనిపోవ కెంతయును ముట్టక నిల్పక భావమున్ దనంబును వెలయం దగుల్పడక పొందుగ వాఙ్మయలిఖాగ మొప్పఁగా, నెనిమిది తానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్ల నే, ర్పైనయఁగ వాచకుండు కడునిం పగురీతిఁ జరింపగాఁ దగున్. హరి. ఉ 10. 282.

**మునుకొ(న్కొ)ను¹** అ. క్రి. (మును¹ + కొను)
1 ముందుపడు, ఎదురుపడు

చ. మునుకొని యేను గాంతలును మ్రొక్కుచు నడ్డపడంగ నందఱం, గనుఁగొని ... భా. రా కిష్కిం. 119.

కం. కనుగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తిముకురతలబహి, ర్జనితానుబింబన మ్ములు, వనితారత్నములు, మెఱుఁగువల నెఱిఁగింపన్. వసు. 2. 24.

మ. ... వచ్చె మున్కొని తాత్పర్యముతోడఁ గశ్యపుఁడు దక్షుంగాన సద్భక్తితోన్ ... కు. సం. 1. 118.

చం. వనిత యొకర్తు మున్కొని గవాక్షతలంబున నిల్చి తా నుండుటం, గనుఁగొనఁ జోటు లేమి నొక కార్యము పేరిట జాల నొర్తు వంచనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్సతిజాలకంబుచే, కొనిహరిఁ జూచెఁ గేకిసలుగొట్టుచు బోటులు దాని నవ్వఁగన్. పారి. 3. 18.

2. ముందగు, తలకడచు.

చం అనుపమ సర్వసాధనసమగ్రతతో శుభవేళ వాస్తుపూజనబలిహోమతంత్రములు సద్విధిఁ జెల్లఁగ సూత్రహస్తులై, మునుకొని కోవిదస్థపతిముఖ్యులు శిల్పము లుద్యమింపన ప్పని గనవేగిరింపుక్రియభావనకుం దగిఁ యుండకుండినన్ హరి ఉ. 2 150.

సీ అమృతంబు వెల్లువ యని నిలింపాదులు మునుకొని దోసిళ్ల ముంచి క్రోల.

గీ. ఇట్టిలంబుగ వెన్నెల నిట్టవోడిచె. విక్ర. 6, 69

3. పూను, ఉద్యమించు.

కం. అనిలజభీష్ములు దమతమ, మొనలకుఁ గన్నాకు లగుచు మునుకొని వడి న్వర్జనకుంభసంభవుల ప్రాపునఁ జూపిరి విక్రమంబు భూరిబలంబున్. భార. భీష్మ. 2. 291.

సీ. మున్ను వీఁడిచ్చిన మునుకొని హోమంబు సలిపి భూతములకు బలులు నొసఁగి భా. రా. యు. 1329, భాగ. 9. 398.

4. హెచ్చరికతో నుండు, జాగరూకుఁడై యుండు.

కం. ఆ మ్మింకను గోకుల, మున నుత్పాతములు దోఁచె మునుకొనవలయున్ .. భాగ. 10 పూ. 210

5. ప్రారంభించు, మొదలుపెట్టు.

కం. అని యిట్లు రంభ యూర్వశి, దను నాడిన పలుకు లెల్లఁ దప్పక యుండన్, మునుకొని చెప్పినవంతయు, విని వెడవెడ నవ్వి యమరవిభుఁ డవ్వేళన్. వాల్మీ 3. 27.

ఉ. మోక్షము సర్వధర్మముల మున్కొని కన్గొను దృష్టి తానయై యక్షయ మైన యాగము లన్నియుఁ దాన సృజించి .. వాసిష్ఠ 2 206.

చం. అని యుచితప్రసంగముల నచ్చటఁ గొండొక సేపు నిల్చి యోగమునివరుఁ యామహాగిరిని మున్కొని పాదుడురక్తిధారఁ యేఁ. గనుఁగొని తన్నిమిత్త మడుగం జనుదెంచి భవత్కటాక్షమున్, గని కృతకృత్యతం బొరయఁ గంటిఁ బురాకృత పుణ్యసంపదన్ భోజరా. 5 218.

స. క్రి. ముందుఁ బెట్టుకొను, పురస్కరించుకొను.

చం. ... విశ్వవేది విలసిల్లుచు నాతనిబ్రాహ్మపుత్త్రిల, న్మునుకొని తత్పురోహితుల మువ్వురనుం బిలిపించి యేగత, మ్మున నిజకార్య మంతయును

బొచ్చెము లే కెటి గించి చెచ్చెఁన్

మార్క. 8 23

కం అని సంస్తుతించి యందఱు, మునిగణములు మంకణముని మునుకొని . . భీమ 3 25.

**మునుకొను[1]** అ. క్రి. (మునుము + కొను)

1. వరుసపెట్టు.

క తనకుఁ గలయమ్ములన్నియు, మునుకొని యేయుటయుఁ బూని మున్నున్న తెఱఁగున నచల మొప్ప నిలిచిన, ఘనుఁడు మహోభవు కు నాకుఁ గానఁగఁబడియెన్ హ. ఉ 3 63

(ప్రాఁతప్రతిపా తెలుంగున నచ్చముగను అని క్రొత్తప్రతిపా.)

కం మును తోరణమునఁ బెట్టిన, ఘనతరపరిఘంబు లీలఁ గ్రాలఁగఁ గేలం, గొని దనుఁజట్టినదను జుల, మునుకొని వడి నేలఁ గూలమోది వధించెన్. భా. రా. సుం 470

చం. ... ఘోరపరాక్రమసంపదన్ మదిం, చినన్నప సార్వభౌముల శచీపతిముఖ్యదిగీశవర్గమున్, మునుకొని గెల్చి పోవుచుఁ బ్రమోదము నల్పఁగ నిందు వచ్చితిన్ ... వరాహ 4. 51.

2. అతిశయించు.

చం. మొతనె ఘనాఘనంబులు తమోనికరంబులు మచ్చరించి .... మునుకొని కారుక్రమ్ము కొని ముంచె తజాండకరండమండలిన్ ...

విప్ర. 3 53.

3. వాక్యాలంకారముగాఁ గొన్ని యెడల ను-యో గింపఁబడును.

సీ. క్రూరార్ధచంద్రాస్త్రగ్రోద్భూతోరుబాహు లై మును కొని మురమురమూల్గువారు. ...

భా. రా. యు 1446.

**మునుకోల = మునికోళ** వి. కొరడా. కశ

సీ. పంకరుహంబులు బండికన్నులు ...

గీ. ... కైరవములు మునుకోల ...

కు. సం. 4. 89.

ప్రయోగాంతము కానరాదు

**మునుకోలు.** వి. √మునుకొను: మునుకొనుట క. ౨.)

**మునుగట్టు** వి. (మును[1] + కట్టు ఉపయాత్ర. పూర్వపక్షము

సీ మునుకట్టునలుకాను మోఁకఁ ఒట్టినయిఁద్ర గోపంపు చెప్పి కెంగుచ్చు లనఁగ ...

హ న న 4 6.

**మునుచు[1] = ముంచు** స క్రి √మునుఁగు. మునుఁగఁజేయు. మగ్నముగావించు. శ ౭

**మునుచు[2]** అ క్రి √మును[1] మునుకొను. ముందుకు

సీ మునుప తేఁజాయెనే మోహాకాహాహనిగ్ర సామజపరిత్రాణమునకు .. వసు. 5 46.

**మునుపడు.** అ క్రి (మును[1] + పడు) మునుకొను, ముందగు

కం. వనజాతుఁడు మున్నరిగిన, మునుపడఁగా నతని నేనె ముట్టెద ననుచున్, జని మును ముట్టని వానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా. భాగ. 10 పూ. 459.

ద్వి. మనసులు చల్లనై మదమత్సరములు,మునుపడ దిగనాడి మోహంబు విడిచి ...

ద్వి. హరిశ్చ. పూ 818 పం.

ఆ .. వచ్చుచున్నవాఁడు వనజాక్షి మారాజు, మునుపడంగ నన్నుఁ బనిచె నిటకు .

చసిక. 8 28

**మునుపు[1].** స క్రి (√మునుచు[2]) మునుకొనఁ జేయు, పొడచూపఁజేయు.

ద్వి. వలుగడఁ జొఁనేయు నలినాస్త్రు పువ్వు, ములు కులు వెలికింత మునుపుచందమున, వఱ మోహ నాంగిచే యంటుట వలన, నిలు వెల్ల పుల కింప ... ద్వి. పద్మ. 4 295 పా.

**మునుపు(న్పు)[2]** వి. వా. (√మును) (త. మున్పు.) 1. పూర్వము, ముందు.

కం. .. కల్పసహస్రములకు మునుపట నేఁ జేసిన యానువ్రతము దలంపునఁ బడియె భవత్ప్రసాదమున జగదీశా .. వరాహ. 9. 3.

గీ. అంగి సుఖ మైన సంగంబు లటకు మునుపె చాల సుఖులౌట మనకు దృష్టంబు గాదె .. అము 3 34.

కం. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ, బ్రాయ మంద్రు మానవతి .. కళా 4 47

2. మొదలు, ప్రారంభము.

గీ. మునుపు మధురాన్నములు చవిగొనియె నేని, నడుమ లవణామ్లతిక్తముల్ నంజె నేని, పిదపఁ గటుకార్ద్రభోజనం బొదవె నేని, బలము నారోగ్యమును జాలఁ గలిగియుండు వి. పు 4 211

గీ. మునుపు గోసినయది యంటుకొనుచు నుండు, ననుచు విన్నార మట్టిచోద్యములు గనవె. విక్ర. 2. 46.

సీ. మునుపుగాఁ జొచ్చినవనితలు చల్లెడియుద కంబునకుఁ జేతు లొడ్డుకొనుచు .... కళా. 2 228.

విశ 1. తొల్లిటిది, పూర్వపుది.

కం మునుపటిభవమున నేఁ జేసిన పుణ్యము వలన మిమ్ము సేవింపఁగఁ గంటిని .. . దశా 1 166.

ద్వి పటుతరభక్తి మునుపటియట్ల నడిచె ... పండితా. పురా 160 పా.

2. అతిశయిల్లినది. బలవత్తరమైనది.

సీ. శుభముహూర్తంబున నిభరాజగామిని శివభక్తి మునుపైన శిశువుఁ గనియె ... కాశ. 3. 27.

ద్వి. ధనధాన్యవస్తుసద్భటసమేతముగ, మునుపుగా గడిదుర్గముల ముంచినావె... రం. రా అయో. 138 పా. 8 పం.

3. దట్టమైనది, సాంద్రము.

ద్వి నడి మూర్ఛమునిఁగినపావనిం జూచి, యడరుచుఁ దలవరు లాచావువేటు. గని పోదమనుచు నక్కడఁ జేరువందు, మునుపైన పొదలలో మునిగుండి రంత ... నవ 2. 165 పా. 2 పం.

**మునుమాటు** వి. (మూఁడు + మాటలు. మూఁడుపర్యాయములు, ముమ్మాఱు

కం అని శమనుఁడు మామూఁకకు, మునుమాటికిఁ జెప్పెఁ గాన మురరిపుభజనం,బునకంటె నితరు మగుసాధన మున్నదె నరకజలధి దాఁటఁగఁ బ్రజకున్. జాహ్నవీ. 3 86

**మునుమాడు** స. క్రి. (మునుము + ఆడు) వరుసపెట్టు

సీ. మోహనాకృతి యేల మునుమాడి కొనియాడఁ బుష్పచాపునివింటఁ బుట్టి రవఁగ ... భీమ 1 88.

**మునుమి(న్మి)డు.** అ. క్రి. (మునుము + ఇడు) వరుసపెట్టు

చం. . . అనలం బయి నీదగునల్క లోకమున్, మునుమిడ కాల్పఁ జొచ్చినఁ గనుంగొని యేఁ గృప పుట్టి చెప్పెదం, బనుచె మహోగ్రకోపవివశత్వము నీకుఁ ద్రిలోకనాయకా. భార. ద్రో 2. 164.

కం. పుష్కరషండములోఁ గల, పుష్కరమూలములు గబళములఁ గొనుచున్ సత్పుష్కరతలముల మున్మిడి, పుష్కరములఁ జెరికివైచుఁ బుష్కరమునకున్. కు. సం 1. 94.

సీ. చండగదాదండసారణోద్ధతి యొప్ప మునుమిడి దనుజుల మోది మోది .... మార్క. 6. 94.

ద్వి. ఎమ్ములఁ దక్క మున్మిడి తొల్చి తొల్చి, క్రమమైన భక్షింపఁగా లెక్కగొనక ... పండితా. దీక్షా. 36 పా.

స. క్రి. ఎదిరించు, మార్కొను.

ద్వి. మున్ను వృత్రాసురు మునుమిడి చంపి, సన్ను

తీ-పఁగ దేవసంఘుంబుఁ గూడి, వెలుగొందు
దేవతాధిపుని చందమున ...
రం. రా. బాల. 61 పా 31 పం

మునుము(న్మ). వి. 1. ఎదురు

కం. వీఁ డొకఁడు కురుబలంబున, వాఁడిమగఁ
డనఁగఁ జాలువాఁ డిల్బంగిన్, కోఁడిమిసెడి
యెను ద్రోణుల, వేఁడిమి యిట మనకు
మునుము విక్రమమునకున్.
భార విరా. 5 110.

2 పురోభాగము, ఎదుటిచోటు.

కం ద్విరదము లొలఁగెడివియు నెత్తురు గ్రక్కుచుఁ
గూలెడివి గదువు లై కలయం బొరగుడుపడి
యెడివియు భువిఁ, బొరలెడివియునయ్యేఁ
బవనపుత్త్రిమునుమునన్.
భార. భీష్మ. 2 218.

కం. అని పలికి రామచంద్రుఁడు, వినయం బలరంగ
లేచి వెలఁదియుఁ దాసున్, మునుమున నిలిచిన
మౌనులు కనుఁదనియఁగఁ జూచి చూచి గౌరవ
మెసఁగన్. శేష 4. 122.

వ. ... మునుములన్ గనుమ లొనరించుకొనం
బంచి ... మనుచ 4 87.

3. సేనాముఖము.

వ . అట్టియెడ నాచార్యుండు గయ్యంబు
సేయుమునుమున ధృష్టద్యుమ్నుఁడు దొలంగిన
తెలపిం గదియఁ బాంచాలపతి దటిమిన వప్పు
డగ్గురుండు నవ్వుచు. భార. భీష్మ 2. 278

4 వరుస, పంక్తి

గీ బాడుదల నొండెఁ బట్టుము పాండుతనయ,
ముఖ్యు వీరు వారవ నేల మునుము వట్టి,
వైరివర్గంబు నెల్లను బారిసమరి, సైన్యయుత
ముగ నద్భుతజయము గొనుము
భార. కర్ణ 2 6.

ద్వి. కదువులఁ గదలించి కసవును నీరు, ముద మారఁ
గలిగిన పొలముకుఁ దోలి, మునుముగా మేపుచు
ముందట .... నవ. 1 89 పా 12 పం.

5 వస్తుసమూహము.

ద్వి తాంబూలగంధ మాల్యాంబరాదులు మునుం
బున నొప్పించి తవయుంటఁ గలుగు, ధనధాన్య
ములు జీవితము మొదలైన, మును మంతయును
దెచ్చి ముందటఁబెట్టి
పండితా పురా. 62 పా

6 వ్యాపకము, మునిమి

చం మునుమునఁ బుట్టె నాకు శోకముప్పుటపట్టి
భోజరా. 4 164.

(ప్రయోగాంతరము లభింపలేదు

7 తలచుఁదనము.

ద్వి మినుముమున్మ మునింగె ...
విష్ణు. పూ. 3 (?

8 కోసెడు పైరునకు ముందున్న పైరు.

గీ మునుమునా నలరు కోయు, పయిరుకును
ముందుపైరుగాఁ బార్వతీశ ..
అం. భా. 3. 22

విశే. తలచు, అధికము,

కం అడిగెడువారలు మును మయి, పుడికెడువాఁ
డొకఁడు లేక పురుషాల్పతయై, వదఁతులు తల
చై కులములు, నెడి యన్యులు ప్రబలి జగము
శిథిలత నొందున్. హరి ఉ. 9. 41

చం అనిన త్రివిక్రముండు మొద లైనపురోహితు
లన్ గ్రహాశివూ, జనములు సేయఁ బంచి
మృదుశాలిమయాన్నముఁ బాయసంబులన్,
మునుముగఁ బిండివంటలు సమూహముగా
నొనగూర్చి యిష్టభోజనముల భూసురుల్
దనియ శాంతి దలంబుగఁ జేసి రక్తితోన్.
ద్వా 10 22

జ. మునుమాడు, మునుమిడు, మునుముకొను

మునుముకొను. అ. క్రి (మునుము + కొను,
వరుస పెట్టు.

గీ. హరుఁడు బెట్టుగ నవ్వె వెల్లార్చుటయును, విని
సముద్ధతం యమున దనుజకోటి, మునుగఁ బలు

తెంచి తాఁకిన మునుముకొని వ్రధించి యిల
యెల్ల నెత్తుట ముంచె వతఁడు.
భార శాం. 3. 447.

కం వనముల వనములభంగిన. కొనివత్తుము కొండ
లెల్లఁ గుంభిని ద్రవయ్యన్, మును ముకొని పెఱికి
తెత్తుము, వనరాశికి మిగిలె నేని వైతుము
లంకన్. భా రా యు 729

**మునుముట్టు** అ క్రి (మును[1] + ముట్టు)
1 మొదలు తాఁకు, మొదలంటు.

కం మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధం,బునకుం గై కొనుట
మేలు భూసురునిం గై,కొని యరసి కాఁడనిన
నా, తనియుమ్మలిఃంబు నెఱచు ధార్మికు
నైనన్ భార. అను 3 182.

(తొలుదొల్త, ప్రప్రథమమున అని భావము)

కం. అనుటయు వారందఱు హం,సునితో నిట్లనిరి
రాజమాయమునకు మీ,జనకుఁడు దొడఁగినఁ
జాలును, మునుముట్టన వత్తు మిందు మోసము
గలదే. ఉ హరి 4. 40.

2. మూలమంటునట్లుగ, సమూలముగా.

మ. ఘన మైనట్టి తపోధనంబు నెఱయంగాఁ
బోయినన్ బోవనీ, మునుముట్టంగఁ బ్రబోధ
వాసనలపెంపు ల్మాసినన్ మాయనీ, వనితా
రత్నముఁ గూడ కెట్లును దమిన్ వారింప లే
విద్యోడన్. కళా 3 28

3 సాంతమగు, తుదదాఁకు

ద్వి మునుపు పల్కులతుదల్ మునుముట్టఁ జదువు,
బనుల దుర్గుమలు నిచ్చలుబాధ సేయ ..
ఆ. మ క 1. 10 పొ 21 పం.

ద్వి .. అపరాత్పరుఁడు, మూఁడుకాలంబులు
మునుముట్ట నెఱిఁగి ..
ద్వి. పరమ 1 20 పొ

వ. .. లలాటేక్షణ జ్వాలాజాలంబు మునుముట్ట
నిగుడించి ... భీమ. 4. 139.

**మున్కొ(నుక)లి.** వి. (√మును[1]) ముందు.
అగ్రభాగము.

గీ. పొనఁగఁ దెలిజీబుమునుఁగుతో నెనఁగి చెలులు.
బొదవి నడిపింప మున్కలి మది వికాస, మమర
విభవంబుచే రమాభ్రమర వేణి, మెఱసి వర
లెడుతెరఁ జొర నరుగుటయును
ల. వి 5. 80

**మున్నడి** విణ (మున్ను + అడుగు. వృత్తినివర్ణ
వికారము) అగ్రేసరుఁడు, ముందునడచువాఁడు

ఉ సారలసత్సహస్రకరశాఖలతో నిముఁ డుగ్ర
మూర్తియై, ఘోరతమమ్ములం దొరఁగఁ గోరిన
మున్నడి యై యనూరుఁడున్, ధీరత మీర
నయ్యెరులతేఁకువ మాన్పె ...
కృ శతం 3 56.

క్రి విణ ముందుగా

ద్వి. నగరివాకిటనె మున్నడి తేరు డిగ్గి ...
రం రా అయో. 129 పొ 16 పం.
(శ ర. పా )

నగరవాకిట సమున్నతి రథంబు డిగి ముద్రిపా.

**మున్నరక.** వి (మున్ను + అరక.) 1. తొలి
దుక్కి

గీ మున్నరకె యనఁ దొలిదుక్కి బొదలు
చుండు అం భా 2 233

2. కష్టస్థితి, (ఇది యుభయయతులలోనిది
కావచ్చును ).

చం సరకుగొనందు నన్నుఁ దనచాయలఁ వాతి
నఁశంచె మత్సరం, దరవిభు సడ్డ సేయక యితం
డని రాఘవునాలిజాలి మున్నరకుఁ దెచ్చు
పోలిక ఘనాఘనమాలిక తత్ప్రియాసమా,
హరణజయాశ లాశలను నాఁగె సగర్జిత సింహ
నాదయై. చం. రా. 6 52.

గీ. తెరు గఁ పఁగ మాయన్న దిద్దె నన్ను, నేయ
నేరిపె వింట నొక్కింత నాకు, నావదినె సత్య
భామ మున్నరక యైన, నిలిచి మున్నర
కానుదు గెలిచెఁ గాదె. విజ వి. ప 143.

3. దైన్యము,

కం. ఇందుండ పోఁగువాఁడుం, డందఁదున్ వలల

మో నూలిమగువచూలి, జాళితోఁగూడి వన పాళికేళి సలుప, నుల్లము జనింప గహిమించి యొక్కనాఁడు .. ఉ రా 6 19.

**మున్నీటిరామాలి** = 1 చంద్రుఁడు

సీ మున్నీటి రాచూలిముక్కఁ గెంజడలోనఁ గ్రొవ్విరిగాఁ దాల్చుకొన్నమేటి ..
ఆ భా. 1 37

2 శ్రీ సాగరకన్యక, లక్ష్మి

**మున్నీటిరాణి** = సముద్రకాంత గంగ.

వ అని యమ్మున్నీటి రాణి చెన్ను మాటికిం గొని యాడుచు, గొంతద వ్వరిగి యచ్చట.
యయా 2 47.

**మున్ను** = మును[1] వి, వి 1. ముందు, పూర్వము

ఆ అన్న దేంద్రుచేత మున్న గృహీత మై, యున్న నాకలంబు గ్రస్న నిం, నొరున కర్హ మగునె పరిణయ విషయమై, ధరఁ బరిగ్రహింపఁ బరమమూర్తి భార. ఆది. 3. 168

కం. మున్ను గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని సేయన్ ... భాం విరా. 1 288.

వ . ఏకోదకమగ్నంబు లైన బ్రహ్మాండంబుల నారాయణుఁడు వరాహరూపంబున రసాతలం బవలన నుద్ధరించి మున్నటియట్ల నిలుపుచుండు.
వరాహ 10 178.

2. పూర్వజన్మము

సీ నే శుకకీటంబ నేఁ బుండరీకంబ నే ఖంజరీటంబ నేను దోమ ..

గీ. నేను మానిసి మున్నంచు నేకతమున, నొం డొరుల తోడుతను జెప్పుకొనుచు రుబుసుఁ, దారక బ్రహ్మమణి పేటి దక్షవాటి సంభవించిన త్ర్యగ్ర చంద్రధరులు. క్రీను. 4 83.

3. తొలి, మొదలు.

ఆ ఇట్టు లగుటఁ జేసి యెవ్వరికెనకు శోకంబుఁ బొందఁ గ రణంబు లేదు, జీవుఁ డెల్ల భంగిఁ జెడియెడు వాడుగ, దలఁచి నేని వగవ వలదు మున్న భా భీష్మ 1 197

మ మనువాలాను శరంబులం దొరఁగు రమ్యత దేసితోఁగూడి య,య్యా వి దాడికిఁ బడి పుంగవగవీ హైయగకిన బు ని,గ్ఘర హర్షంబు నొనర్చె మున్ను రుచిసౌఖ్య బులం బిమ్మట న్, మురియం ద్రోయుచు నించె నెమ్మనమున్ మూరార్పసముచ్చాయముల్ నైష 3 99

చం వెలయఁగఁ బెట్టుకోఁ దనము వేసవిఁ జందన చర్చ మును గన్ ఆము 1 81

(దీని యామ్రేడితరూపము మున్మున్ను, మును మున్ను మున్ను మున్ను)

కం. విచ్చి చనకుఁడు జనులారా, నెచ్చుట మును మున్న వలయు తెలుఁగారానికిన్ . .
భాం విరా 4 248
మ. క. 1, 12 పా 7 పం

చం. నరుఁడని లెక్క సేయఁడు మనంబున శాత్రవు నమ్మహాత్ముచే, యవనములఁ జెక్కుచోట్లఁ గనియున్ మననాయకుఁ డేమిచెప్ప నిద్దురి మునుమున్నుగాఁ దేరిన తోడుగ నిన్నెటులైనఁ దేర యిట్లరిప్రాత భీష్మహాని వనయంబును దుర్బలుఁ డయ్యె నార్కటా రాఘవ 4 193
(రామాయణార్థమున)

విశే 1. తొలుతటిది, తొలిజన్మము నందలిది

ఉ మున్నిటికటికంబు గడుమోహనమై తన కన్ను వచ్చినన్ రా 3 116.

సీ మొత్తునాతఁని జూని మున్నిటి దుష్కృతములు పోయె ననుమను నలంపరాయ
ప్రబోధ 4 27.

ద్వి మున్నిటి ఘోరాఘములు పెరుఁ ద్రెవ్వ, నన్నిటిఁ దనర్పుప యినుమత్తిఁ బెఱఁగి
ద్వి పరమ 3 2689 పా.

3. ముందువాఁడు, అగ్రేసరుఁడు, ముందున్నది.

ఉ పాండునృపాలనందనులు పాపని మున్నుగ నేవి యప్డు భీష్ముడు గడకమై నడుమ

ముల్లుచూ(నూ)పు = ములుచూపు. అ. క్రి. (ముల్లు + చూపు) 1 ప్రాసునందుంచినవస్తువులతగ్గు మొగ్గులను సూచించు, మొగ్గును చూపు.

గీ. మునుల తాల్మికి నెవ్వండు ముల్లుసూపు మగల మగువల నెవ్వండు మరులుగొలుపు
భాగ 10 ఉ 10

ఆ సత్య మశ్వమేధశతముం ద్రాసునం బెట్టి, తూన్ప ముల్లుసూపెం దుదకు సత్య. మట్టిసత్యమునకు సకలవేదంబులు, సకలధర్మములును సాటిరావు.
కృ. శకుం 3 188

2 అతిశయించు.

సీ ధీరంభాగంబమున మేరువుతో నెత్తుజూచిన యెడ ముల్లుసూపువాండు ..
దశకు 1 75.

సీ. ఎవ్వం డేయవధాన మెఱుగు నయ్యవధానమున వాని కించుక ముల్లుసూప
విక్ర 1 20

ముల్లూచే. వి. (ముల్లు + ఊచే తృణవిశేషము
హ స 5 45

ముల్లూచి వి తృణవిశేషము. ఒక విధము పగడ్డి ..
ప్రబంధ 01

ముళ్ళపేరు. వి (√ ముడి) స్త్రీల కంఠాభరణవిశేషము.

సీ గింపు బయ్యెదలోనం బిక్కటిల్లుచుం జాలం గ్రుళ్ళు చన్నుల నొప్పుముళ్ళపేరు ..
కళా. 1 102

ముళ్ళమారి. విశ (√ముడి¹) ఒండొరులకు విరోధమును గల్పించునది, దుశ్శీల, చెనటి: దుశ్శీలుండు

సీ ఇక్కకమ్ములు దెచ్చుముళ్ళమారి ...
శ్రీరం. మా. 5 34.

ముళ్ళవేయు స. క్రి (√ముడి¹) 1 ముళ్ళు పెట్టు, ఒండొంటితో బంధించు.

వ. .. శేషవాసుకిముఖ్యమహానాగంబుల ముళ్ళు వేసి చుట్టినం గాని దీనిమొదలివలము కొలపెట్టరాదు ..
వరాహ 12. 43

2 ఒండొరులకు విరోధము కల్పించు

(వ్యవ.) వాండు ముళ్ళు వేయుటలో చాల గట్టివాండు.

మువ్వ[1]. వి (మూండు + వ) మొనను మూండు సందులుగల పెద్దగజ్జె, కింకిణి.

ఉ మువ్వలు గంటలు న్మొరయ ముందటికూంకటి రావిరేకతో, నవ్వసజాతుం డాడు ..
హరి పూ. 5. 191

ఎ పచ్చియేనికతోలుపచ్చడంబు ధరించి గిలుకు మువ్వలకోలం గేలం బట్టి ...
హర 5 55.

చం మలయపుగాలి రేలు వనమాలివిమానపతాకఘల్లుమం, చులియం బసిండిమువ్వగమియొక్కొకమాటు గ్రక్కంగ
ఆము. 1 74, అం. భా. 2. 151

వ్యవహారమునందలి కొన్ని
విశేషప్రయోగములు.

మొన్న కొన్నబిందె మువ్వలాగున నున్నది

(అనంగా తెలిక యై ఇంపుగనున్న దనుట.)

ఈదినము లంఘనము చేసినచో రేపటికి శరీరము మువ్వలాగున నుండును. (అనగా తేలికగా నుండు ననుట.)

ఉ మువ్వకోడియ, మువ్వపోనె, మువ్వపసందము

మువ్వ[2]. వి. ఒకానొక పట్టణము.

('మువ్వపురి' క్షేత్రయ శ ర )

మువ్వంక. వి.బ (మూండు + వంకలు) మూండు వంకలు గలది

సీ. మువ్వంకమురువుతో మురళి యొక్కొకవేళ మోయించు భువనైకమోహనముగ ...
పాండు. 4. 134.

సీ. ముప్వంకమురుపుతో మురళి యూఁదెడునిండు సొగసు గోవులఁ జక్కఁ జొక్కఁజేయు ..
ఘటికా. 1 123.

**ముప్వంకపట్టిన** వి (ముప్వంక + పట్టిన) త్రిశూలము

సీ బిరుదురాకాసులఁ బరిమార్చు ముప్వంకపట్టి సకా మనోభవవిరాను ... నిరం 3. 12.

**ముప్వంచే.** వి. (మూఁడు + పంచలు–వృత్తిని వర్ణలోపాదులు) మూఁడుపంచలు.

సీ. పొడ వైనముప్వంచఁ బొలుచునట్లుగ నేనుఁ గులకు గుజ్జములకుఁ గొట్టములును ...
భార ఉద్యో. 1 93.

విశ. మూఁడుపంచలు గలది (శ. ర.).

**ముప్వంచేకు.** వి. (మూఁడు + పంచేలు + ఆకు) ముయ్యాకుపొన్న (వృ వి) (శ. ర.)

**ముప్వంచే.** వి వృక్షవిశేషము.

ద్వి దేవదారువు కల్వే దేవకాంచనము, నావిరి రేల ముప్వంచు పంచాది ..
ద్వి శ సా 2. 656 పం.

**ముప్వంటులు.** వి. బ (మూఁడు + అంటులు) నెలపురుడు.

సీ. తవరి ముప్వంటుల దినముల యంద పూతన చనుబాలతోఁ ద్రావె నునుర, నెఱి బోరగిలి యాడనేఱనినాఁడ పాదమునఁ దుత్తుమురుగాఁ దాఁచె బండి. హరి పూ 8 58

ఉ. చంట విషంబు మెత్తుకొని చంపుదు నర్భకు నంచు వచ్చి ముప్వంటులనాఁడు పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁజాల్గొంటయుఁ బ్రాణముల్ దిగిచికొలును..
హరి ఉ 4 235.

**ముప్వకోడియ(డె)** వి. (ముప్వ[1] + కోడియ) కాఁడికిని గంతకును క్రొత్తగా నలవటిచెడి యెద్దు (శ. ర.).

**ముప్వదోనె.** వి. (√ముప్వ[1]) అడుగున ఒంటి పలక గలదోనె. (శ ర.)

**ముప్వన్నియవేల్పు** వి (మూఁడు + వన్నియలు + వేల్పు) సూర్యుఁడు

కం పువ్వులఁ బూఁతలు గైకొని, యవ్వల యౌవనజభావనావము అలరన్, జవ్వనులు మెలఁగ నత్తఱి, ముప్వన్నియవేల్పు చరమ భూధర మెక్కెన్ ఘటికా 2 134.

**ముప్వన్నె** విశ. (మూఁడు + వన్నెలు) మూఁడురంగులు గలది.

సీ ముప్వన్నెపులితోలు మొలదిండుగాఁ గట్టి కర్కోటకాహిఁ బాగ గ బిగించి ..
హర. 5 55

సీ. తనుభృశత్రాన్త వేష్టనలగ్నబర్హిబర్హంబు ముప్వన్నెంచుం గై చెలంగ .. అము. 1. 59

**ముప్వన్నెమెక(గ)ము** వి (ముప్వన్నె + మెకము) పులి, చిత్రకాయము

సీ కటిభాగమునయందుఁ గట్టు రంగులు నాఁట వె లుగారు ముప్వన్నెమెకముతోలు ..
కాశీ 2 146.

సీ కమ్మల నిప్పుకల్ గ్రమ్మచు ముప్వన్నె మెక మిర్లఁ గదియుపోలికల మొసలి, కన్నుల రాకాసిమిన్న కోన మెకంపుగుంపులఁ, దార్కొని యంచవాన గుంని . అచ్చ రా యు 311

సీ ముప్వన్నె మెకముతోల్మన్నవపు నడికట్టు ొయ చక్రాయుధచ్ఛవిని దెగడ .. రంగా 1

సీ ముడిచినయొంటికెంజడ మూయ ముప్వన్నె మెగముతోలు కిరీటముగ ధరించి ...
మను చ 1. 59

**ముప్వన్నెవిల్లు** వి. (ముప్వన్నె + విల్లు) ఇంద్ర ధనుస్సు

గీ. వర్ష ధారావశేషాన్వవాయయుక్తి, వాయువశమునఁ దెరలుముప్వన్నెవిల్లు, వేడ్కఁ వెన్నాడు శశిపోలె వెలఁది చాపలమున నంమాహరించు

శుకము దవులుచు    పాండు 4 235

**మువ్వపసరము** = మువ్వకోడియ (శ. ర).

**మువ్వీసము** వి. (మూఁడు + వీసములు) 1. రూకలో పదాఱింట మూఁడు భాగములు.

సీ. ... పణషోడశాంశంబు పరగు వీస, మనఁగ
మువ్వీస మంచనఁ బొల్చుఁ దత్త్రి
యాఖ్యయై ...    ఆం. భా 2 272

2. ఒకవస్తువున పదునాఱు భాగములలో మూఁడు భాగములు (శ. ర)

**మువ్వు(వు)రు** = ముగ్గురు స. ఐ. (√మూఁడు) ముగ్గురు.

(మూఁడు శబ్దమునకు మహన్మహత్వర్థకరూ ము)

కం అవ్వారాంగనజానిన మువ్వురు నీల్గుటకుఁ
దాన మూలం బనుమన్, నెవ్వగలు వగల నీనం.
గ్రొవ్వటి వెసఁ జొచ్చె నగ్నికుండము లోనన్.
విక్ర 6 160

కం ఇవ్విధమున నధ్వశ్రమ మవ్వనమునఁ దీర్చు
కొని వనాటప్రవరుల్, నవ్వుమొగంబుం తోఁ
జని, మువ్వురుదొరలకును జాఁగి మ్రొక్కిన
పిదపన్    రామా 7 11.

శా స్త్రీలన్ మువ్వుర నిచ్చె నాగ్రసుతంన్
జ్యేష్ఠానుపూర్వంబుగాన్ ...
ఉ. రా. 1 293. భాగ ఆది 5 34.

కం అనఘా మఱి నాఁ సంజ్ఞుఁ డతనికి మువురుం,
దనయులు సుమతియుఁ బృథుఁడును, ఘనుఁ
డుగ్రతిగ్ముఁడు ననఁ బ్రకాశితతేజుల్.
హరి పూ 3 82

కం అమ్ముద్దపుఁడు గానము హరి, యిమ్మెయి నఖ
లంబు నేర్చ . .    కళా 2, 37.

సీ అనఘుతఁ దాని యంగుమల్లికార్జునుండు, కూర్మి
ముదగొండశరభన్నకూఁతు నందరీసతీమణిఁ
బెండ్లియై భాసురత్రిమూర్తులను బోలుతన
యుల మువురఁ గనియె.    చెన్న. పీఠి 41

**మువ్వెట్టి.** వి. (మూఁడు + వెట్టులు) త్రివిధమగుకూలి లేని సేవలు.

మ .. అనురాధిపు మువ్వెట్టియుఁ గొన్న
రాతసకులాధీశుండ . . భా. రా యు 200

ఉ ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునుం గను
గాపులట్లు ముప్వెట్టియుఁ జేసి చేసి .
హర. 3 11.

శా లీలం గొంటి కుబేరపుష్పకము బల్మిం గిట్టి
మువ్వెట్టులం, దూలందోలితి వాసవాదిసుర
లన్ ...    భా. రా యు. 54

గీ అష్టదిగ్రాజులను దవ కరియుఁ గోరు, వెట్టు
కాపులఁ జేసి మువ్వెట్టి గొనియె ...
తపతీ. 1. 25.

**మువ్వెత.** వి (మూఁడు + వెతలు) త్రివిధమగు బాధలు.

ద్వి తలిపోవఁగనీక దండి గిటి గిచి, మొఱలు
వెట్టఁగఁ గట్టి మువ్వెతఁ బెట్టి ...
ద్వి. హరిశ్చ ఉ 1264 పం

**మువ్వెలుఁగు** వి. (మూఁడు + వెలుఁగులు) 1 త్రేతాగ్నులు, మూఁడగ్నులు.

గీ కెడల బలరామకృష్ణులు నడుమఁ దానుఁ
భద్రదంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతిరాజసంబున మువ్వెలుంగు,
పోలికఁ బొసఁగ వచ్చెను ప్రోలికడకు ...
విజ. వి. 3. 177

2 సూర్యుఁడు.

గీ మువ్వెలుఁగులోని పరతత్త్వమో యనంగ,
శుద్ధనాట్యంపుఁదెరువునఁ జూడఁ బోలిచె
కకు. 3. 85.

**మువ్వేల్పుటిక్క** = మువ్వేలుపులయిక్క. వి
ముకుంద 1. 34. పా 2. పం.

**మువ్వేలుపులయిక్క** = మువ్వేల్పుటిక్క వి. (మువ్వేలుపులు + ఇక్క) సూర్యుఁడు.

గీ కోరి ముప్వేలుపులయుక్క కొలమునందు, జమిలిచౌవంచకేర్లరాచలివెలుఁగున, కేపుతోఁ బుట్టె వెదరులు వాపి పజలఁ, బ్రోవ నరుదుగ నిరుదుగటూపు లూని అచ్చ రా. బాల. 132

**ముప్వేలుపులు** వి. బ మూఁడు + వేలుపులు త్రిమూర్తులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు

(చూ ముప్వేలుపులయొక్క )

**మునటి.** సం వి ఈ స్త్రీ ధాన్యవిశేషము, ఒకజాతిధాన్యము

**ముష** శం వి అ స్త్రీ లోహములను కరగించెడి మూస, మూష.

**ముషితము.** సం విశే. (అ అ అ) 1 దొంగిలింపఁబడినది అపహరింపఁబడినది. 2 మోసపుచ్చఁబడినది వంచింపఁబడినది.

**ముష్కము.** సం వి అ పుం 1 అండము, వృషణము. 2. అండకోశము, అండములుండు సంచివంటితోలు. 3. సమూహము, రాశి, ప్రోగు, మొత్తము 4. మొక్కపుచెట్టు, మోకము (వృ వి.)

**ముష్కరుఁడు** సం విశే (అ ఆ అ) 1 పెద్ద వృషణములు కలవాఁడు 2 దుష్టుఁడు

క౦ ముష్కరహితవృత్తిని బరఁ, పుష్కర పత్త్రాళిఁ బట్టి భోగించుటచే, ముష్కరహితుఁడవు గమ్మని, నిష్కరుణ శపించి మౌని నిలయముఁ జేరున్ . దశా 7 1 164

3 కృపణుడు, దీనుఁడు

మ. ధరణీరాజ్యము గోలుపోయి .. ముష్కరుల న్యార్థులఁ గొల్చిన ట్లలదె సౌఖ్యా బొంత యన్ .. భార అర 6 165

శ్లో గతశ్రీకాన్ చ్యుతరాజ్యాన్ కృపణా న్గత చేతసః, అరణ్యవాసినః పార్థా న్నానురోద్ధుం త్వ మర్హసి .. సం భార వన 268 16

4 మూర్ఖుడు

మ. . అధిక్షేపొత్తుఁడు జూదరి వెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ముష్కరుఁడై వెండియు నొడ్డఁగా నతఁడు వడి ప్రౌఢిమై గెల్చె ....

భార ఉద్యో 3. 358 4 81.

క గురుఁ దల్లిని దండ్రిని సోదరుని నకారణము గ్రొల్లదముఁ బల్కన ము, ష్కరుచేత సూఱు పణములు, ధరణీశుఁడు గొనుట నీతి దండుప పేరన్ విజ్ఞా ప్రా 43.

**ముష్కుఁడు** సం. వి అ పుం 1 మాంసలుఁడు బలవంతుఁడైన మనుష్యుఁడు 2 చోరుఁడు దొంగ.

**ముష్టి** సం వి ఇ స్త్రీ 1. పిడికిలి 2 పిడికెఁడు బియ్యము మొ

గీ. ఇంట నెవ్వారయిన బిచ్చ మిడిన ముష్టి, వెట్టినఁ గరాశితేశియొప్పిదము దోఁప, నెగిరపడి యిందులకు మీర లెవ్వ రనుచుఁ, బెద్దపులిఁబోలె రొప్పు నాబిసరుహాక్షి

శుక. 3 318

3 బిచ్చము. (ఈయర్థము తెనుఁగునందుమాత్రమే కానవచ్చు చున్నది )

సీ మిన్నంతసంపదఁ దెన్నరియుండియు ముష్టికి లోనయ్యె ముదితనడుము .

చంద్రా 2 [illegible]

(ఇట పిడికిలియని రెండవ యర్థము.)

4 పిడి, కత్తిపిడి 5 పలపరిమాణము 6 అపహరించుట, దొంగిలించుట.

**ముష్టింధయుఁడు** సం వి అ పుం. పిడికిలి నోట నుంచుకొని చప్పరించువాఁడు, శిశువు, చంటిపిల్లవాఁడు

**ముష్టింపచుడు** సం. విశే (అ ఆ అ దరిద్రుఁడు (శ ం)

**ముష్టికాంతకుఁడు.** సం వి అ పుం ముష్టికుని జంపినవాఁడు, బలరాముఁడు.

**ముష్టికుఁడు** సం. వి. అ. పుం. 1 స్వర్ణకారుఁడు, బంగారుపనివాఁడు 2 ముష్టికాసురుఁడు

(కంసుని మల్లురలోని వాఁడు)

**ముష్టిదేశము** సం. వి. అ. పుం. పిడికిటఁ బట్టుచోటు, పిడికిటిమి ప్రదేశము

**ముష్టిద్యూతము.** సం. వి. అ. న. ఒక రకపు జూదము, గవ్వల ముష్టితో నాడుజూదము

**ముష్టిబంధము** సం. వి. అ. పుం. 1 పిడికిలి పట్టుట, సంగ్రామము. 2 పిడికెఁడువస్తువు.

**ముష్టిమేయము** సం. విశే. (అ ఆ అ) పిడికిటఁ గొలువఁ దగినది.

**ముష్టియుద్ధము** సం. వి. అ. న. గుద్దులాట.

**ముష్టీముష్టి** సం. అవ్య. ఒండొరులు పిడికిళ్ళచే గ్రుద్దుకొని చేయునట్టి యుద్ధము

(ఈ క్రియావిశేషణవాక్యమునందు ముష్టాముష్టి అని యతియుపదార్థము ప్రయోగింపఁబడినది కాని 'ముష్టాముష్టి, బాహాబాహి' మొదలగు ప్రయోగము లసాధువు లని 'అన్యేషామపిదృశ్యతే' సూత్ర మనోరమయందు సిద్ధాంతము చేయఁబడినది)

కం. భీమాసురవీరులము, ష్టాముష్టి రణచ్ఛటచ్ఛటా శబ్దం బుద్ధామం బై తత్పవనము, పొమ్మగ పతులకు నతిభయానక మయ్యెన్ ...
భార. అం 3 395.

**ముసగన** వి. కోపమున గలుగు చిఱచిఱ

కం. అసమంజుని వెడలించిన, వసుధేశ్వరుఁ డేటనాడు ముసగన జెడెన్, దెస లెఱిఁగినవరము లకా ముసగ లని కైక నోరుమూయించెఁ జలిన్ చం. రా. 4. 56

గీ. ముసగసలఁ బోరుగురుభీష్మముఖుల సఖుల, నాన్మసైన్య శ్రేష్ఠులైనవారిఁ, జూచి యధిపతి యొక్కడసుద్దు లనుచు, నడిగినా రందులోఁ దగినంతఁ జెప్ప. రాఘవ. 4 49.

2 గుసగుస, రహస్యసల్లాపము

కం. రాచిలుక రాణివాసము, లోచెలి యోలమావి చిన్నియుప్పరిగలపైఁ, జూచితె ముసగస లాడుచుఁ, జూచెద రాతలిరుటెడపుసోరణ గండ్లన్, కు 2 91

సీ. ... ముసగస గుసగుస ముచ్చట యన సల్లాప సంజ్ఞ లై యుల్లసిల్లు ...
ఆం. భా. 1 117.

**ముసజ్జీ.** వి. వస్త్రవిశేషము

రగడ. మాదళంబులు వెన్నమణుగులు ముసజ్జీలు చాదరలు పైరిణీ ల్పక్కనిబాయీలు
హంస 5 356.

**ముస(ర)ద్ది** వి. లేఖకుఁడు, వ్రాయసకాఁడు

సీ. దేశపాండ్యా తాను దినవలె నని చెప్పు ముసరద్ది దెవిలోన మొఱఁగి చెప్పు.
వేణు 16.

చం. అనుకులవార్త తెల్ల సమయ పుముసద్ది లిఖింపు పంపునా, దినచరకమ్మ
ల వి 4 119.

(ముఖాది అపముద్రి.)

**ముసనాబు** వి. అందము వ్రక్కతెర.

సీ. అలరారుకురువేటులుతళుకుబల్మసనాబుఁ జరు వంపుబొగడపూబటువుదిండ్లు ...
చంద్రా 3. 69.

సీ. ఉదిరకంబళము లింటొపసగు దంతపుగొడెల్ నయము మించిన ముసనాబుసడము ...
రా. వి, 2 43.

సీ. . ముసనాబుకుచ్చులు పసిఁడిసరిగె కుట్టు తాపెత బటువులు ... అందలం బెక్కి ...
దశా. 7 129.

**ముసవు.** వి. ముచ్చట, కోరిక, అభిలాషము

సీ. కేవ సాజపరాలిలావణ్యసరసిలో మునుఁగుదు నెన్నఁడు ముసవు దీఱ.
వరాహ 11 56.

**మునమున** వి. 1. పంది మూర్కొనుటయందలి ధ్వని కనుకరణము

గీ. ముట్టె విరియించు మునమున మూరకొనుచు వదరు సంరక్షితఘోణి యజ్ఞఘోణి ...
భాగ 3. 418.

2 మునరుట క్రిమ్ముటయం దగుననుకరణము

వ .. చెరలు కదుపులెన్నగా బుస్సుబుస్సునఁ గూర్చి యొగలీర్చుచు మునమునన మునరు కటకటకటకుటుముల నందంద గ్రందు కొని బొల్లిమొకంబు మెకంబులును ....
ప్రబంధ. 186

3 ఏడిసెము పట్టినప్పుడు బిడ్డలు విడుచు శ్వాసముః ధ్వని కనుకరణము

(చూ మునమునలాడు.)

4 కోపమున గలుగు చిఱచిఱ

సీ. మునమున జంకించు మొకరితు మ్మెద బారువూఁ బోఁడిపాల పు వేర్పున హరించె
భాను 3. 24.

(శ ర పా మునరి జంకింపుచు ముద్రి పా.)

జ మునమునమను, మునమునయను, మునమున లాడు,

**మునమునమను** అ క్రి (మునమున + అను)
1. మునమునమని ధ్వనిచేయు

సీ మునమునమనఁ జుట్టి కొనవెంట్రుకలు పట్టి వాలు మ్మని యందియ లులియఁదాఁచి ...
కవిక. 4. 166 (శ. ర. పా.)

2 కోపమున చిఱచిఱలాడు

ద్వి ముని రోషంబున మునమునమనుచు, మునులాంగములు మునుకొని వినరె.

అభిమన్యుచరిత్ర (శ. ర)

**మునమునయను.** అ క్రి. (మునమున + అను) కోపమున చిఱచిఱలాడు.

కం జలరుహాసంజాత సఖాస్థమున కొగి నేఁగి యతని సత్త్వగుణంబున్, దెలియుటకై మతి వందనములు సేయక యున్న వఱఁడు మున మునయనుచున్
భాగ 10 ఉ 1269.

**మునమునలాడు** అ క్రి. (మునమునలు + ఆడు) బిడ్డలు, ఏడిసెముచే మునమునయని శ్వాసము విడుచు

(వ్యవ) ఆ పిల్లవాఁడు మూన్నాళ్ళనుండి మును మునలాడుచున్నాఁడు

**మునరికొను** అ క్రి. (మునరు + కొను, స్వార్థమున) కలియు, పర్వు, వ్యాపించు.

కం ఇదె ప్రేఁపయడలి ప్రమథులు, మునమున శతకోటిసంఖ్య మునరికొని ప్రియంబు దలిర్ప దినఁ గోలలు, గుదియలు గైకొంద్రు తమకుఁ గోరి ధరింపన్,
హరి ఉ 6 14.

స. క్రి. చుట్టుకొను, పరివేష్టించు

వ. అనుచుం గనుంగొనుచు మునరికొని చనుచుండం బాయాలరాజనందన రాజమందిరంబు చక్కటికి నరుగునవసరంబున .
భార. విరా. 1. 300.

**మునరు.** అ. క్రి (క. మునను. త. మూసు)
1. పర్వు, వ్యాపించు.

సీ. మోహాంబువలనఁ బై మునరు లోభంబు లోభావేశమునఁ గాను మగ్గలించు ...
భార అర. 4. 288.

గీ వాసితానవరుచిరనిశ్వాసములకు. మునరి కారించు నెలదేఁటి మునురుఁ జోపి ...
కు. సం. 9. 318.

సీ. సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక ప్రసవంబునకుఁ దేఁటి మునరి వెఱచు ...
పి. శకుం. 2. 45.

2. పైఁబడు.

కం. ...ఏను నివ్వెఱపడితిన్, జివ్వన మునరి కిరాతులు, క్రొవ్వెసకఁగఁ బెరఁగఁ బాఱగొని రిజ్జనులన్ ..
భాని వరా .13.

కం వాసవనందను: డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం, డా నైరణ సేయఁడు గనుఁ మోసము లేకొక్కమొగిన మునరంగ వలయున్ ...
భార. విరా 4 231

కం, . తృణావర్తుఁ డవని కవచాటముగా, సుంకరువలియై విసవిస, వరు దరు దవ మునరి విసరి వారిఁ గొనిపోయెన్ ..
భాగ. 10 పూ 264

ఙ ముసరికొను

ముసలము సం. వి అ. పుం న. 1. దుడ్డుకఱ్ఱ 2 రోఁకలి 3 శస్త్రవైద్యమునందలి సాధన విశేషము

ముసలాముసలి సం అవ్య రోఁకళ్లతో జరుగు నది (యుద్ధము)

ముసలాయుధుడు సం వి అ. పుం. బల రాముడు

ముసలి = ముదు-లి. విణ. వృద్ధుడు ; వృద్ధ
కం . ముసలిగదా పుట్టినిల్లు ముఖోల్లసితకున్.
మనుచ 6. 47

కం. ప్రాకి నెద్దులు తే కూ,రూరికి మోచుకొని తిరుగునొక ముసలియు నేఁ డేఱు గలిగి యొక యెద్దున బోరదిగంబరుఁడు సరియె పురికాఁ పుఁ కున్
రా. వి. 1 56.

సీ ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముడుకు .. అంగడం బనఁగను నలరు వృద్ధాభిధ .
అం భా. 2. 119, ఆము 5. 58

ఙ ముసలితనము

ముస(ష)లి వి సం వి న్ పుం. 1. బల రాముఁడు 2. శివుఁడు. ఈ. స్త్రీ. బల్లి, గృహగోధిక

ముసలితనము వి (ముసలి + తనము) వృద్ధత్వము, ముదిమి

కం. స్థిరసనేవంబావం దన, ముసలితనం బుడిగి తరుణ మూర్తియుతుండై, వసుధావరుఁ డీటికిఁ జని.
వి|క 2. 157.

సీ, ముదిమి ము ప్పనఁ దగు ముసలితనము ..
అం భా. 2. 118.

ముసల్యుఁడు. సం. విణ. (అ ఆ అ ) రోఁకటిచేఁ జంపఁదగినవాఁడు.

ముసాంబ్రము వి. (హిం ముసాంబర్ మి. బ్రౌ.) ఒక విధమగు మందువస్తువు. (శ ర)

ముసాపు. వి. నానుడువాన, ముసాబు (శ ర).

ముసాబు. వి నానుడువాన.

ఆ. తన్నుఁ దెలియ కున్నఁ దగ వేదములు వెట్టి, సన్యసంపదకు ముసాబు వెట్టి వేమన 2 4ు2.

ముసానమ్మ వి. ఒకానొక గ్రామదేవత.

గీ మోసపోక ముసానమ్మ ముదరాలు, దారె నడినప్డు లేక పాతాళమునకు
కాశీ. 5 269.

ముసి. విణ. 1. అసత్యము, బొంకు.

కం. గతజీవుఁడు వ్రేఁ గనియెడు, కత యది ముసి యయ్యెఁ బంక్తికంఠునియెడఁ దా, నతఁడు మను బ్రతికి వ్రేఁగై, బలిమాలిచె జగముఁ, జచ్చి భారము వాపెన్ రామా. 8. 230.

2 వి. బాధ.

(చూ. ముసిముట్టు)

ఙ ముసిముట్టు

ముసించె. అ. క్రి చెడు.

ద్వి. బుద్ధి గల్గినయానుబుద్ధియుఁ జూటి, బుద్ధి చెప్పి నను నాబుద్ధి ముసిఁచె ...
ద్వి శ. సా 1. 692 పం.

ముసిండి. వి ముష్టిచెట్టు, వృక్షవిశేషము, ముష్టి పండు.

(దీనిపండ్లు మిక్కిలి చేదై ప్రాణాపాయకరములై యుండును).

సీ. పూతాక్కురపవవంబు పూరించువుక్కిళ్లు ముసిఁడిఁదుఁడుతోడ ముద్దుగుఱియ ... క్రీడా 224

సీ. ముసిఁడిమ్రాఁకునఁ బండ్లు పసమీఱఁ గలిగించి యించున కేల పుట్టించఁడయ్యె ...
నీలా. 1 111.

సీ. ముసిఁడిమ్రాఁకున నైతమును బండ్లు గల్పించి చెఱకున కేల సృజింపఁడాయె ...
వైజ 3. 121.

ఆ విను మర్త్యలోకమున సిరి యగునె యాఁకొని ముసిండి దినిన్ గ్రొవ్వు లావుఁ, గలుగునయ్య శకునికన్నుమగ్నాసన మంత్రితంబు గాన్యతంత్ర మగునె భార ఉద్యో 3 333.

**ముసిమి** వి ప్రేమానుబంధము

ఆ ప్రసవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి ముసిమియో యెఱుంగ విసువు లేక, తారసించి ముద్దుతమ్ములఁ జివురాకుఁ బోండ్లు కొలను సొచ్చి పుచ్చికొనిరి
వేం. పంచ 4 153.

**ముసిముట్టు** అ క్రి. (√ముసి) బాధవడు

వ. ఇట్టు బహుభంగులఁ దవకాఁవించు కల్మషంబుల ముసిముట్టుక మెఱయు నాఱగజెట్టి చందంబు విని ... నృసిం. 5 4.

**ముసిముసి.** విశే మందము, అలఁతి (నవ్వు).

సీ. ప్రాణేశునొసలిలాఞ్ఛనంబు వొడగాంచి ముసిముసినవ్వుతో మోము మలఁచు ...
నైష. 7. 191.

చం ముసిముసినవ్వు మోముసయి ముచ్చట లాడ రివంచెమ్రోఁతతో, గుసగుస లాడ వంచగమి గూడఁ జనెన్ జెలి శారిమ్రోలకున్ ...
ముకుంద. 3. 202.

కం. ఒసఁగినఁ గైకొని సంతస, మెసఁగ సదస్యులు ఫలించె నృప నీసుకృతంబు సమస్తం బని పలుకన్, ముసిముసిలేనగవు తనదుమోమునఁ దొలఁకన్ ...
చం. రా. 2. 41.

క్రి. విశే మందముగ, మెల్లఁగ (నవ్వు).

కం. పనిలేనిపని ముఖాంబుజ, మురకుం జెన్నగ్గలింప ముసిముసి నగినన్, వనరుహగేహిని విభునిం, గను గొని యి ట్లనియె నగ్రగణ్యము గాఁగన్.
విప్ర. 4. 37

**ముసుఁగు = ముసుఁవు** వి (క. ముసుకు) కప్పుడు, అవగుంఠనము.

గీ ముసుఁగుఁ దొలఁగించి తనులత మోద మడరఁ బద్మమధ్యంబునం దున్నపద్మవోలె, హంసతూలికాతల్పంబునందు నుండి, యాకళావతి మనుజనాయకునిఁ జూచి ... విక్ర 6 140

గీ కొంత దిగఁగ నీలిపుట్టంబు ముసుగు వెట్టిగాఁ జెగఁద్రోసి చప్పుడు గాక యుడ, వచ్చె నూర్వశి యర్జునావాసమునకు ..
హరి 7 119

మ ... సంసారంపుఁద్రోవ న్సదా, చనుచుండున్ ఘనమోహాఖేద మంటమున్ సంసారి పాంథుండు వ్రాసిన లన్ ధూళి ముసుఁగు గాఁగ ..
ఆము 3 70

చ సతు లిరువంకనిర్వురును శయ్యపయి న్నిదురింప నాథుఁ డొక్క కెకు ముసుంగు మోముపయిఁ గాంచుచు మెల్లన నొత్తగిల్లి ...
గంథ 58.

జ. ముసుఁగుకొను, ముసుఁగుడు, ముసుఁగుడువడు, ముసుఁగుదన్ను, ముసుఁగుబొంద, ముసుఁగు ముసుఁగుదన్ను, ముసుఁగుబొంద, ముసుఁగువడు, ముసుఁగువాఱు, ముసుఁగువేయు

**ముసుఁగుకొను** అ. క్రి (ముసుఁగు + కొను) క్రమ్ముకొను.

కం. తోరము లగునవ్వర్షా, వారములం దొక్కనాఁడవారితధారా, సారంబు పయోధరముల్, ఘోరంబుగఁ గురిసె ముసుఁగుకొని నిశదాఁకన్
వైజ 2 148.

**ముసుఁగుడు.** వి. (√ముసుఁగు) అవగుంఠనము, కప్పుడు.

(జ. ముసుఁగుడువడు.)

**ముసుఁగుడువడు** అ క్రి. (ముసుఁగుడు+పడు) కప్పుడువడు, ఆచ్ఛాదితమగు.

కం అచ్చపడి యుభయబలములు నచ్చెరువుగఁ జిత్రరూపుల ట్లుండ శర,ప్రోచ్చలితచండ దీప్తిస, ముచ్చయములు పెలుచఁ బరగె ముసుఁగుడువడఁగాన్ ..

భార. భీష్మ 1 240.

(శ ర పా ముసుఁగువడంగాన్ ముద్రి. తాళ ప్రతి పా.)

**ముసుఁగుదన్ను.** స. క్రి (ముసుఁగు + తన్ను)

1 మఱుఁగుపఱుచు

సీ కడ లేనివీడ్యంపుఁగప్పు చందురకావిమోవి పల్లొత్తుల ముసుఁగుదన్న ...

పాండు 3 10

2 ఆచ్ఛాదించు, కప్పుకొను

(వ్యవ) వాఁడు దుప్పటి ముసుఁగుదన్ని పండుకొన్నాఁడు.

**ముసుఁగుబొంద.** వి (ముసు గు + బొ ద) మట్ట లూడనితాడు లోనగు చిన్నచెట్టు (శ ర)

**ముసుఁగువ(ప)డు** అ క్రి. (ముసుఁగు + పడు)

1. వ్యాపించు, క్రమ్ము.

కం కడులజ్జయు దైన్యంబును, నడర ముసు గు వడఁగ నాకు నాత్మగతమునం, బుద్ధి వివరంబు లేదే, యడఁగెద నన్నట్టి దయ్యె నప్పుడు కర్ణా ... భార, అర. 6. 14.

గీ. మొగముపై శోకదైన్యముల్ ముసుఁగు వడఁగ మార్క 3 11

సీ ఉడురాజబింబంబు నుల్లసమాడెడుముక్తాత పత్త్రిముల్ ముసుఁగువడఁగ ...

భా. రా యు 470.

2 ఆచ్ఛాదితమగు, కప్పఁబడు

గీ చాతురీరీతి వేర్వేఱ సంగ్రహించి, వనిత యొక జీనిపావడ వానిమీఁద, ముసుఁగువడఁ జుట్టి పై లక్క ముద్రఁబెట్టి, యొరులు గన కుండ నలుదిక్కు లరసి చూచి ... విప్ర. 2.87.

వ. .. కొండగోఁటియ ముఱుగుడుబొందులకు నందడింపకలకగ్నిప్రభావముల మొల్లంబుల ముసుంగుపడువల్లంబులను .

మనుచ 4. 57.

**ముసుఁగువాఱు** అ క్రి . ముసుఁగు + పాఱు) వ్యాపించు.

సీ చంద్రాబ్జవఖకాంతిచంద్రికల్ వతభూప ముకుటాగ్రమణులపై ముసుఁగువాఱ

కవిరా 1 101.

**ముసుఁగువేయు** సం క్రి (ముసుఁగు + వేయు) కప్పు, ఆచ్ఛాదించు

సీ పొరుముంజిముత్యాల యొరగుపాగ మెఱుఁగు నొరలిబిత్తరిబొట్టు ముసుఁగువేయ ...

సారంగ. 1. 79

**ముసుఁడి** వి. (క. ముసుండి) సమూహము.

అ బ-లు వెత్తియున్నపరుసంపు టొడళులు, గలుగునెఱుకుముసిఁడిఁ గనిరి సతులు . .

కు సం. 6 694

**ముసురు** వి. నిరంతరవర్షము, ఎడతెగనివాన , వృష్టి, వర్షము

(బ ముసురులు, ముసుర్లు, ముసుళులు, ముసుళ్లు,)

కం చలిగాడ్పుల ముసురుల మెయి, వలిగొని ధాత్రీపురంధ్రి వలిఁ బచ్చలికం,బలిఁ గపిసికొన్నవిధమునఁ, బొలుపుగఁ జిప్పరలు గవిసె భూతలమెల్లన్. కు సం. 6. 757.

చం ముసురుదినంబులందు మనమోసలఁ బంచట రంగు మీఁటటన్, ... గిరిశభక్తు లనేకులు నిండియుంద్రు ... హర 2. 40.

మ. ... ఎముల్మిగూడఁ బోల మంబళ్మోయుచుం బట్టి పెన్ముసురం దీఁగెడుకాఁపుగుబ్బెతల ...

ఆము 4 138.

సీ పసపస యను నది ముసు రనఁగను మీఱు ...

ఆం, భా. 1. 75.

గీ. వాసితాననరుచిరనిశ్వాసములకు, ముసరికాడించునెలదేఁటి ముసురు జోఁపి ...

కు. సం. 9. 318.

(ఇట సమూహము అని భావము.)

కం ... కురిసిరి ముదమున, నెగడుచుఁ గుసుమ
ముల ముసురు నిర్జరు లధిపా ....
భాగ. 10. ఉ. 23. భాగ. 4. 375.

జ. ముసురుకొను, ముసురుగవియు, ముసురు
మూతి

**మునురుకొను.** అ. క్రి. (ముసురు + కొను)

1. ఎడతెగక కురియు.

కం. దెసలు ప్రసన్నము లయ్యెను, ముసురు
కొనియెఁ బుష్పవృష్టి మురజధ్వని పెల్లెసఁగె
దివి శుభానిలము లొలసె వహ్ని ప్రదక్షిణా
ర్చులం గనుపట్టెన్. జై. భా. 6. 87.

గీ. ... పథికు, లుసురుమన ముసురొ్కొన్న
యమ్మొసురులోన, రాఁడు పతి యంచు నిర్భర
రతులఁ దేల ... శుక. 2. 343.

2. కవియు, ఆవరించు.

కం. ముసురుకొనుజరభరంబున నసురుసు రై
యున్న మమ్ము వడకించితి వి, ట్లుసురుమనఁ
బట్టువడు మొక, యసురకు నీ వనుచుఁ బలికె
నాగ్రహ మెసఁగన్. మనుచ. 4. 84.

వ .. బిసరుహదళనయనలు ముసురుకొని బలిసి
నిలిచి కొలువఁ బ్రతిసంక్రమణవారోత్సవాదుల
యందుఁ బేరోలగం బవధరింతువు ...
భీమ. 3. 211

**మునురుగవియు.** అ. క్రి. (ముసురు + కవియు)
కవియు, వ్యాపించు ముసురుకొను.

గీ. వరుని పాశుపతాదిబాణముల పెంపు, భీము గద
సొంపు నమ్మి యుద్ధాములలఁ, జెలఁగి వెఱ
పేది యక్కడిబలము ముసురు, గవిసి యెపుడుఁ
గయ్యమునకుఁ గాలుద్రవ్వు.
భార ఉద్యో. 2. 226

(ముసురుకవియు అని శ. ర.)

**మునురుతేనె.** వి. ఒక విధమగుతేనె, మధువిశే
షము

వ ... మునురుతేనె పూఁదేనె జుంటితేనె పుట్టతేనె
పెరతేనె కట్టతేనె కురుజుతేనె ...
ప్రబంధ. 112.

**మునురుమూతి.** వి. (ముసురు + మూతి) కోప
వికారము గలముఖము.

ఉదా : ముసురు మూతివాఁడు (శ ర. .

**మునువు** = ముసుఁగు.

మ ముసువు న్మెచ్చటయు ప్రహస్యమునను
న్ముద్రించి నానాదివౌ. కను లాస్థానముఁ గూడి
యాడుదురు శ్రీకాశిప్రదేశంబునన్, గన వై
పుట్టెడుభాగ్యమైన మనకున్ గల్పింప దా
దైవము . కాశీ. 7. 206.

**ముష్టి.** వి. మునిఁడి, వృక్షవిశేషము.

సీ. పురుషుఁ డొల్లనియట్టి పొలఁతియౌవన మెల్ల
ముష్టిచెట్టది పూలఁ బూసినట్లు ..
కలు. శ 87.

**ముస్త.** సం వి. అ. స్త్రీ. నిడుముస్తె, తుంగ
ముస్త. (వృ వి)

**ముస్తము** సం. వి అ పు న. ఒక దినుసుగడ్డి.
నిడుముస్తె వృ. వి పుం. స్థావరవిషభేదము.

**ముస్తాదము.** సం వి. అ పుం. పంది, సూక
రము.

**ముస్తాదు** = ముస్తీదు. విజ

(సంసిద్ధము)

సీ బిరుదువస్తాదులఁ బేర్వేఱ నాడాడ ముస్తాదుగా
నిల్వఁ గుస్తరించి ... రంగా. 2 199

**ముస్తాబు** = ముస్తీదు.

(విజ. సంసిద్ధము)

(వ్యవ.) అత్తవారింటికి వెళ్లుట కతఁడు ముస్తా
బైనాఁడు

**ముస్తీదు** = ముస్తాదు, ముస్తాబు, ముస్తీబు,
ముస్తైదు

విజ. (హిం ముస్తఇద్) సంసిద్ధము

సీ కండచక్కెర దండిఖాణావుటెఱకల జేని ముస్తీదుతేజీలు నడువ ...
ఉ. హరివం 3 13.

సీ తలబొమిడికము కత్తళము కేడెము కత్తి యూనిగాఁ గలవి ముస్తీ దొనర్ప ..
ఉ. రా. 4 278.

వి. పరికరము, పనిముట్టు.

గీ ... రాజు, స్వారి వెడలెడివేడ్కతో సాదిఁ జూచి, తెమ్మని ముస్తీదు ఘటియించి తేజి ననఁగ ... ఉ. హరివం 4 18.

వ. తమతమ ముస్తీదులతో సిస్తుగా దోస్తిని చుట్టు ముట్టి కోపాటోపంబున .. ప్రబంధ 788

ముస్తీబు = ముస్తీదు.

విశ (సంసిద్ధము)

సీ. ఎలదేఁటిగమిమేటి యొలగోలుమూఁకల నెల్ల ముస్తీబుగా నెచ్చరించి ... శశాం. 4 86

గీ. అనిన నీ వంతనేర్పరి వగుదువమ్మ, లెమ్మ ముస్తీబు గమ్మ శీఘ్రంబుగాను ...
చంద్ర. వి 5 84.

ము(స్తియ)స్తె. వి (సం ముస్తా) 1 తుంగ గడ్డ.

సీ సెలయేటియిసుకలంకల వరాహంబులు మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త .
మనుచ 2. 7.

2 తుంగ) వృ వి.

(దీనిభేదములు నిడుముస్తె, నాగముస్తె, వట్రువ ముస్తె)

ముస్తైదు = ముస్తీదు

విశ (సంసిద్ధము).

గీ అమరుముస్తైదుతేజితో వరుగుదెంచె, దారు ణాకారుఁ డై నయుద్ధారుఁ డొకఁడు ...
శుక. 2. 426.

ముహిరుఁడు సం విశ. (అ. ఆ. అ.) తెలివి తక్కువవాఁడు, అవివేకియైనవాఁడు. వి. అ. పుం మన్మథుఁడు.

ముహురాభాష. సం. వి అ. స్త్రీ. మాటిమాటికి మాటలాడుట. అనావశ్యక సంభాషణము.

ముహుర్భుక్కు సం = ముహుర్భుజము.

ముహుర్భుజము సం వి జ. పుం. గుఱ్ఱము, అశ్వము

ముహుస్ సం అవ్య. (దీనికిఁ దెనుగున వ్యస్త ప్రయోగము లేదు) తరుచు, మాటిమాటికి, విడువ కుండఁగ.

ముహూర్తము సం వి అ న పుం. 1 నిమేష కాలము. లిప్త, అల్పకాలము. నలుబది యెనిమిది నిమిషముల కాలము

## మూ

మూ. విశ. వ్యుత్పత్తియందు మూఁడుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము.

గీ నరవరోత్తమ నేఁడు మూనాళ్లనుండి యనుఱుగొన వెంటఁ దిరిగెడు ననుర యొకఁడు ... మనుచ. 4 73.

(మూన్నాళ్లనుండి శ. ర. పా.)

మూండు = మూఁడు. వ. రెండునొకటి.

కం. పోండిగ వగజ తపశ్శిఖి, మూండుజగంబులను దీవ్రముగఁ బర్విన బ్రహ్మాండము గాఁచిన కాంచన, భాండముక్రియఁ దాల్చెఁ దత్ప్రభా భాసితమై. కు. సం. 6 814.

మూఁక. వి. (√మూఁగు.) 1. సేన, దండు

కం. వీఁకఁ బఱతెంచి నలుగడఁ, దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి నమ్మూఁకలు విరి

సీ. మూఁగ నా వెఱయు మూకుఁడు ...
ఆం. భా. 2 121, దశా 1. 10.

జ మూఁగదయ్యము.

మూఁగ² వి ఒకానొకచెట్టు

వ ... ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యాలిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ బెక్కు తెఱంగులఁ బ్రాఁకులు ...
వి. శకుం 2 14.

మూఁగ³ వి త (మూకాన్) 1 పక్షివిశేషము.

సీ, నామాలకేతఁడు నల్లాస కప్పెట కాకి యంబటిజోరిగాఁడు మూఁగ . .
హంస. 3. 12.

సీ. వంగపండును గోరువంక కప్పెట పొట్టిపిట్ట పావురము కన్నెంటి మూఁగ .
సుద. 3. 194.

2. దోమ (శ. ర).

ద్వి పుటియమూఁగలు బొడబొడమని మ్రోయ
ద్వి. హరిశ్చ పూ. 2060 పం

మూఁగ⁴ = మూవ వి 1. మువ్వ

ద్వి కనకఘంటలును మూఁగలును గజ్జెలును, దనరుమేఖల కటిస్థలి నలవడఁగ ..
(నవనాథ. 4 187, పొ 2 పం.

2 ఫలహారవిశేషము.

వ, .. చిమ్మిలుంటలు నటుకులు మూఁగలు లాజలుఁ బేలాలు ... ద్రాక్షలాది యైన ఫలహారంబులను . హంస. 1. 105.

మూఁగంబాఱు అ క్రి (మూఁగన్ + పాఱు, స్వార్థమున) మూఁగు.

శా పంగాదే నడవం జతుర్ముఖునితో నింద్రాది దిక్పాలకుల్, మూఁగంబాఱి భవత్పదాబ్జములకున్ మ్రొక్కంగ తే కున్నచో, నాఁగన్ వచ్చియు నాఁగఁ జాలనిప్రతీహారన్ విడంబించుచున్. దాఁగన్ బోయి తలారివాని యెదుటన్ దాఁగంగ నీ కేటికిన్.
ఉ హరి 4 92.

మూఁగఁబడు. అ. క్రి (మూఁగన్ + పడు స్వార్థమున) చుట్టుకొను

ఉ ... అయెలదేఁటిదాఁటు లో. నూనినడప్పి మూఁగఁబడి యున్నతచంచచంచుకోటిచే నానెడుఁ జూడు మందగరుదంచలఝంకృతు లుల్లసిల్లఁగన్ పాం 4, 5.

మూఁగఁతిట వి. (√మూఁగు) దట్టముగా పెరిగినతీఁట. (శ. ర)

మూఁగదయ్యము. వి. (మూఁగ¹ + దయ్యము) మూకపిశాచము

కం. గట్టిగను మూఁగదయ్యము, పట్టినదో కాక చెట్టో బలురాచట్టో, యిట్టులు మన మిందఱమును, జుట్టుం బిలువఁగ నొకింత చూడక యున్నె. వాల్మీ 3. 118

మూఁగపోఁత వి. (√ మూఁగు) తుపసమేత ధాన్యము

గీ, .. తుపస, మేతధాన్యాభిధలు మూఁగపోఁతనంగ, మూన యనఁగాను ...
ఆం. భా. 2. 238.

మూఁగికొను. స. క్రి. (మూఁగు + కొను, స్వార్థమున) మట్టుకొను, ఆవరించు.

కం. పఁగి పురద్వారము బిట్టాగి నిలిచి తమ్ముఁ జూడ నడవిదిరుగుడుల్, మూఁగికొన గగన మట్టిటు, గాఁగ లయాంబుదములీల గర్జించుటయున్ ఉ. రా 3. 269.

మూఁగు¹ స. క్రి ఆవరించు, చుట్టుకొను.

సీ. గోపాల నవపుష్పగుచ్ఛంబు మూఁగినపరిచారికాద్విరేఫములలోనఁ ..

గీ. గఱయఁ దొలుకామునోములు గఱపు ...
ఉ. హరి. 4. 187.

అ. క్రి. 1. కవియు, ముసరు.

ఉ ... ఒక్కతె కోయుగుత్తికిన్, మూఁగుచు ...
క భా. 3. 17.

2. గుంపుగూడు, సంఘీభవించు.

చం మూఁకలో, మునుఁగఁగఁ జేసి యార్చె దివి మూఁగిన వేల్పులు భీతినొందఁగన్ ...
హరి. ఉ. 1. 129.

3 అతిశయించు.

ఉ మొత్తితి సర్వదిక్పతుల మూఁగిన గర్వము విచ్చి పాఱఁగా ... మొ. రా. సుం. 49.

మ. ..ఉగ్రకుఁడై కోర్కులు మూఁగె వస్తువులపైఁ గన్గొనలం దంద్ర యెక్కుడుఁ దోఁచెం గమనీయ దౌహృద పరిశోభంబునం బొల్తి కిని, హరి ఉ 3 180.

కం .. పురుషవర్గంబు జయ, శ్రీలోలత నేతెంచుట, నేల యవిసి మూఁగినట్లు నెఱసె బలంబుల్ . భారి. భీష్మ. 1 186.

4 వ్యాపించు

కం హారయుం, గిరిని విశిఖంబు లేసిన, మొనపడె గగనంబు మొయిలు మూఁగినమాడ్కిన్ ..
ఉ హరి 1, 147.

(మొనపడు ముద్రి, ప్రాంతప్రతిసా)

జ ముక్కుఁడమూఁక. మూఁకవిప్పు, మూఁగంబాఱు, మూఁగఁబడు, మూఁగటీఁట, మూఁగపోఁత, మూఁగికొను.

**మూఁడవకంటివేల్పు.** వి (మూఁడు + కన్ను + వేల్పు) శివుఁడు.

ఉ మూఁడవకంటివేల్పుఁ దనముందరఁ బెట్టుక నిశ్చలస్థితిన్ .. కాళ. 4. 99.

**మూఁడి** వి. ముడ్డి, గుదము

గీ. వేఁడు తగవరి యొందును మూఁడి చొచ్చి, వాత వెళ్లెడువాఁడె యెవ్వాఁడు నంచు ...
కళా. 2 79.

ద్వి ఓడక కురులు బి ట్టూడిని రాఁ దిగిచి, మూఁడివోఁ దాటించి మూతులు నులిమి, యెగ్గులుఁదప్పులు నెన్ని ...
ద్వి. హరిశ్చ. 1204 పం.

గీ, ముడ్డి మూఁడి యనఁగను బొలుచు గుదము, అం భా 2 186.

**మూఁడు = మూండు.** స, బ (త. మూన్ఱు · కం మూఱు, మ. మూన్ను. తు. మూఱి. దీనికి ద్వితీయాది విభక్తులందు మూఁటిని, మూఁడిటిని మూఁడింటిని మున్నగురూపము లగును ) రెండుకొకటి

గీ అనుదినంబును గొలువంగ నాత్మ మెచ్చి మూఁడు నెలలకు వరదుఁడై వేఁడివెలుఁగు ..
మార్క 7. 160

రగడ. మూఁడు మోములఁ బోటుముట్టుఁ బట్టెడు శూర, వేఁడిచూపునఁ, దియ్యవిలుతుఁ ద్రుంచినధీర !

(సంబోధనవిభక్తి)

త్రిపురాంతకోదాహరణము 20 పా.

ఉ మూఁడుగుణంబులన్ వరుస మూర్తులు మూఁడు ధరించి లోకముల్, మూఁడు రచింపఁ బెంప లయముం బొరయింపఁగఁ జాలుదేవుఁ డ,న్వాఁడవు నీవకావె సుర గ్రాముఁ ద్రోపఁ బురింకరుండ వై, నాఁడవు నీవ ధర్మువఁడ వనం బిత్రుపర్గము నేలువాఁడవున్. భా. రా యు. 6. 22.

కం. మూఁడుజగంబుల లోపల, వాఁడిమగంటిమిఁ గడంగి వడి వాలమునన్, వేడిమితో మార్కొన నెవ్వా, డోపును రామవిభుని వాసవశౌర్యున్
భా రా. అర 239.

గీ. అయుపాయముల్ మూఁటికి ననువుగాని, యట్టివగతుని యెడ భేద మాచరింప, వలయు ... భార. శాం. 2. 416.

సీ ... తద్గణము త్రిగుణిత మైన,వాహిని యగు దాని వడి మూఁట గుణియింపఁ బృతన నాఁ బరఁగుఁ దత్పృతన మూఁట ...

ఆ గుణిత మైనఁ జము వగున్ ..
భార. ఆది 1 80, చిత్రభా. 7. 80.

**మూఁడవతొలుపలుకు** = సామవేదము.

సీ. తుళకించు మూఁడవతొలుపలుకురవలి కోవెల
కూఁతలకు నొక్కవింత నెఱప.

యయా 2 50.

**మూఁడుజాలు** = మూఁడు యామములు (చూ జాలు)

ఆ. తనిసి మూఁడుజాలతఱిఁబ్రొ ద్దొకించుక,
ఒల్లపడిన నల్లనల్ల వెడలి ...

హరి. పూ. 6 99.

**మూఁడేమాటలు** = సంగ్రహముగా నున్నది, లేక కొంచెమే యనుటను దెలుపును

కం. అన శుక మిట్లనుఁ గుతుకం,బునఁ గథ కొదవ
యని యెంత మూఁడే మాటల్,విని
పొమ్మి ..  శు 2. 207

**మూఁడుకన్నులయయ్య.** వి (మూఁడు + కన్నులు + అయ్య) శివుఁడు, ముక్కంటి

ఆ. మూఁడుకన్నులయయ్య ముదముతో నిచ్చిన,
ప్రళయకాలభూరి భయదవహ్ని, చటులకీల
జాలసంయుక్త మైనట్టి,పాశుపతము. బూనె
ఫల్గునుండు ...  గయో. 2. ఆ.

**మూఁడుకన్నులవాఁడు.** వి. (మూఁడు + కన్నులు + వాఁడు) శివుఁడు, త్రిలోచనుఁడు

వ. దుష్యంతుం డలంతులంత కోపువాఁడు కాఁడు,
వాఁడితూపులవేఁడిమిఁ జూపక మూఁడు,
కన్నులవాఁడు వచ్చిన తిచ్చపడండు ..

పి శకుం 3 31.

**మూఁడుకన్నులవేల్పు.** వి (మూఁడు + కన్నులు + వేల్పు) శివుఁడు, త్రినేత్రుఁడు.

గీ. మూఁడు కన్నులవేల్పుతో మోహరించి,
నేఁడు దేహంబు లేక యున్నాఁడు
దాను ...  నైష. 4. 28.

**మూఁడుకా(గా)ళ్లముసలి.** విశే. (మూఁడు + కాళ్లు + ముసలి) నడవ నోపిక లేనంతటి మిక్కిలిముసలి (చేతి నూతగ నుండు కఱ్ఱయే మూఁడవకాలు)

సీ. తల్లి మదేకపుత్త్రిక పెద్ద కన్నులు గావ
నిప్పుడు మూఁడుకాళ్లముసలి ..

నైష 1. 109.

(కన్నులుగానదు వావిళ్ళప్రతిపాఠ)

మ. వరుసన్ మాతను మూఁడుగాళ్ళ ముసలిన్
వర్జించి తేజోధురం, ధరమిత్త్రప్రియపుత్త్రి
పుణ్యజనులన్ వర్జించి రత్నాకలం, స్ఫురదా
వాస మహాబలార్థవదవిస్ఫూర్తుల్ విసర్జించి.

చంద్రా. 6. 130.

**మూఁడు².** అ. క్రి. 1. (చేటుమొ) సంభ వించు, కలుగు.

గీ. ఓటతానన్న శివయోగి యొకఁడు లేఁడు,
నేఁడు మొగసాల నిది యేమి మూఁడె
నొక్కొ!  హరం 2 59

ద్వి. ధనమును భార్యయుఁ దనయు లనంగఁ,
దినదినయేషణత్రయమును మూఁడి, వదలక
బహుమోహవార్ధిలోఁ జిక్కి ..

ద్వి శ. సా. 3. 116 పొ. 13 పం.

కం, నాఁ డర్ధరాత్రి పూతన, పోడిమి చెడి
మొన్న బండ ప్రోలిలఁగఁ బడియెన్, నేఁ
డిదె యీముద్దులకును, మూఁడెను నిష్కార
ణంబు మూలాగ్రముగన్. వి. పు. 7. 144.

(కీడు అని అర్థాపహము)

గీ. అట్టిజెట్టికిఁ బోరఁ జా వెట్టిభంగి, నయ్యోఁ
దేరికి నూతన కంచితాస్త్ర,ములకు దైవో
పహతిఁ జేటు మూఁడెనొక్కొ!

భార. కర్ణ. 1. 43.

కం. విదురుఁడుఁ దంద్రియుఁ దవకుం, బదివేల
విధములఁ జెప్పఁ బాటింపఁడు దుర్మదమునఁ
దగియెడుబుద్ధులు,విధి మూఁడనమర్త్యుఁ డేల
విను నుచితోక్తుల్ ...  భార. స్త్రీ 2 40.

ఉ. కోడలు మ్రొక్కినన్ మదిని గుందుచు
నక్కున నక్కుఁ జేర్చినన్, వేడుక నిచ్చ
నిప్డు రఘువీరుఁడు రాముఁడు వార్ధి మేరగా,
నీడితకీర్తితోఁ బుడమి యేలెడు వంచ్చుఁ

దలంచెఁ గైకచే, మూఁడఁగ నున్నదీని
మునుముట్ట భవజ్జనకుం డెఱుంగునే.
భా. రా. అయో. 91.

(ఇట ప్రాససాంకర్యము కన్పట్టుచున్నది.)

2. ముగియు.

ఉ అంతటఁ గాశియాహివిభుఁడు ... సంతత
కాలకూట నిభ చండవిషోల్బణ పూత్కృతుల్
ఒగిం,బంతయు మూఁడఁజేయఁగ రయంబున
వచ్చె ... వి. పు. 7. 866

ఐ మూఁడ్చు

మూఁడ్చు(డుచే) స క్రి (√మూఁడు².) (కేటు మొ) కలిగించు. సంభవింపఁజేయు.

గీ తాన యుత్పాతములు మూఁడ్చుఁ దరత
రంబ ... కాశి. 6. 59.

మూఁత వి. √మూయు.) 1. మూయుట.

గీ అటుల వశికవ ప్రియభర్త యంబకముల,
మూఁత చాలించి యామించుముద్దగుమ్మ,
సిగ్గు కడ్డంబుగాఁ బతిచేల మంటి, కొనుచుఁ
జూచెను జిన్నెలు కొసరుచూప.
హంస. 2. 68.

2 మూయుటకు తగినమూఁకుడు లోనగునవి.
(శ. ర.)

3. అడ్డము, వ్యవధానము.

గీ. అడ్డి యడ్డము మూయి కప్పడపాటు,
మఱుఁగు చాటోల మోలిమి మాటు
మూఁత, యనఁగ వ్యవధాన మౌ ...
అం. భా. 1. 79.

మూఁతపొడుపు. వి. (మూఁత + పొడుపు) బాలక్రీడావిశేషము.

సీ. దాయాలు సొగటాలు దాఁట్రాయి చదరంగ
ముసు జోడురాళ్లను మూఁతపొడుపు ...
హంస. 3. 146

మూఁతబల్ల. వి. (మూఁత + బల్ల) వాచూరు
పట్టె. (శ ర.)

మూఁపు. వి (త. మూఁపు. క. మ. తు. మురి) భుజశిరస్సు

సీ .. చండభానుని కధిష్ఠానమగుట, భారంబు
భరియింప బరువు పడ్డదివోలె మూఁపు మూఁ
పునను౦డి మొక్కలమున, ననిలంబు లేదను
నంచెలంచెలు గట్టి యాకాశవీథి నందంద
నడచ ...

గీ నడచు రవితేరు ... కాశి 1. 132.

సీ. ఒనుకు వేఁకను గంధమును నాభిమండి మూఁపుల
దాఁక బంగారు పూఁతఁ బూసి ...
వైజ. 4. 67.

గీ కొప్పుఁము మూఁ. పటంచన నొప్పు
నంస,ము ...
అం. భా 2 187. విక్ర. 8. 18.

మూఁపులు మూఁడగు = ఒడలుబ్బు, ఉత్సాహ మధిక మగు.

ఉ. ఆపురమర్దనుం డయిన నాతని నడ్డము దాఁకి
నిల్వఁగా, నోపఁడు మత్స్యయంత్రము
మహోద్ధతి నేసి స్వయంవరంబునన్,
ద్రౌపదిఁ గైకొనం జెనకు రాజకుమారులపా
టెఱుంగమే, మూఁపులు మూఁడగున్ రిపు
చమూపులఁ గన్నపుడే కిరీటికిన్.
విజ. వి. 3. 169.

ద్వి మనమున నిటువంటి మనుమఁడు కలిగె. నని
సంతసించి మీయవ్వ తాతయును, బొదలుచు
వచ్చి మూఁపులు మూఁడు గాఁగ, వదె
పిత్పెదరు మాట లాడవే తండ్రి !
ద్వి. పరమ. 3. 153. పా.

కం. అని మూఁపులు మూఁడై లాలన రథకారు
నకు సంబళముఁ గంబళ మిచ్చి నిలిచి కుహూ
నార్తి గడల్కొన నప్పుడ నిలిచి పేరుకొని
పతి కనిచెన్. వేం. పంచ. 3. 262

మూఁపురము. వి. (త. మూపు. క. మ. తు. మురి.) ఊఁపురము, కకుదము.

వ. మేయుతఱి వీఁ పెక్కు ఱేఁ చొక్కటి మూఁపురంబు గఱచి కఱచి యొఱచి పడ వైవన్ దోడియొక రెండుమూఁడు వెనుక ముందఱ వందంద కాళ్లఁ బెనంగుచు .. మనుచ. 4. 37.

గీ దరుల తడివఁడు బొదువు మూఁపురము లంటు. ఝల్లుగంటల నాఁకోటు లల్లసిల్ల ... ఆము 4. 156.

సీ మూఁపుర మంచన నూఁపుర మంచనఁ గకు దభిధాన మై ప్రకాలుచుండు ... ఆం. భా. 2 262

మూకము సం. వి. అ. పుం. మత్స్యము, చేఁప

మూకాంబ. సం వి ఆ స్త్రీ దుర్గాదేవి యవ తార భేదము.

మూకీభవించే. సం అ. క్రి మూకత్వము నొందు, మూఁగయై యుండు

వ. శరీరసహస్రంబు వెడనెడం బడిన వీర శంఖపణవ దుందుభికాంస్య కాహళాదు లును సమానవ్యసనంబు లయి మూకీభవించె నన నడఁగి యు ఁడ .. హరి. ఉ 2 54

మూకుఁడు. సం. విశే. (అ ఆ అ) 1 మూఁగవాడు 2. దీనుఁడు, కనికరింపఁ దగిన వాఁడు. చెడ్డస్థితిలో నున్నవాఁడు.

పుం. ఒకానొక రాక్షసుఁడు.

మూగురు = మూవ్వురు. న. ముగ్గురు. (మూఁడు నకు మహన్మహతర్థక రూపము.

మూగేలు. వి గంధమూషిక, చుంచు (శ. ర.).

మూచోచే. న. క్రి (మూర్కొను + చూచు, మూతి + చూచే. శ. ర.) మూర్కొను, ఆఘ్రాణించు.

కం. కెమ మొరు చూచినమూచూ, చినభోజ్యము నింద్యము ... భార. అను. 4. 109

మూట. వి. (త. మూటై. క. మూటె మ. మూడ.) సరకులు పోగుచేసి కట్టినముడియ.

సీ .. ద్రవిణంబుమూట వారలకు నిచ్చి .. హర 1 20

సీ. వన్నెలగని చొకారపు మానికముల మూట ... నీలా. 2. 27.

జ. మూటకట్టు.

మూటకట్టు. వి. (మూట + కట్టు) మూట కట్టుట

సీ. శరభంబు నైనను సరభసంబునఁ గిట్టి మూట కట్టుగఁ గట్టు మొక్కలములు ... విక్ర. 1 77.

(మూటకట్టుగన్ = మూటకట్టినట్లు గట్టిగా.)

కం వెఱవక నీగుడిలోపల, గుఱుకొని యాలావు పెట్టుకొని యుండెడిపా, దఱిజముదూతలు గుకర్లఁ, గఱపింతురు మూటకట్టు గట్టి మహేశా! శివ సా. 189.

మూటము = ముటము (శ ర.)

మూఢమంచే వి హిమాని, దట్ట మగుమంచు. లోకమును మూఢముగా చేయుమంచు.

గీ అర్జునుఁడు గవియించిన యంపమూఢ, మంచు దళముగఁ గప్పిన మార్గణాంశు, జాలముల వెస విరియించె శాంతనవప, తంగుఁ డుద్ద్యోతమాన ప్రకాశావలీల. భార. విరా. 5 169.

(అంపమూఢుమంచు. భా. ల. వ్యా. పా )

కం. .. అంబర మెల్ల గప్పి వేసవిఁ, బరఁగుం బెనుమూఢమంచు పౌరవముఖ్యా! భార. మౌ. 4.

మూఢగర్భము సం. వి అ. పుం. నిరుద్ధగతిక మైన గర్భము.

శ్లో. సర్వావయవసంపూర్ణో, మనోబుద్ధ్యాది సంయుతః, విగుణాపానసం మూఢో, మూఢ గర్భోఽభిధీయతే ...

(సుశ్రుతవ్యాఖ్యానము.)

**మూఢము** సం వి అ పుం. ఏ (సాంఖ్య) పంచభూతములు.

విణ. 1 మూర్ఛపడినది, సొమ్మసిలినది. 2 తెలివి లేనిది, మందబుద్ధి. 3. (జ్యోతి) సూర్యునికు సమీపించినది, అస్తమించినది (గ్రహము

**మూఢసత్త్వము.** సం విణ. అ. ఆ అ.) వెఱ్ఱి యెత్తినవాడు, మతి లేనివాడు

**మూతిము** సం విణ (అ ఆ అ) కట్టబడినది, బద్ధమైనది

**మూతి.** వి (క మూతి త మూంజి మ మూచ్చి)

1. పై పెదవియు క్రింది పెదవియును. మూతి వలెనుండు అగ్రభాగము.

సీ ... అగు వా వాయి నో ర్మూతి నా వక్త్రంబు ఆం. భా. ౭. 142

గీ త్రిపురనందన పరభవదుఃఖమునకు, నుల్లమున దుఃఖపిల్లుచు నున్నసరసి, వేడికిట్టూరుపో యన పెదలెం గ్రొత్తతావి మూతులు విచ్చు నెత్తమ్మిపిరం ల. భార విరా. 2 2 6

గీ . నవ్వున ట్లల్ల విచ్చెఁ, గలయ మూతులు కేతకీగగనతతులు ఆము 4 84,

2. మీసమును గడ్డమును, శ్మశ్రువు.

కం. అలరుక్మి రుక్మిణిననుఁడు, తలయును మూతియును గొర్గి తను విడుచుటకున్, విలపించుచు . భోజసుతా. 4. 145.

కం. తలయును మూతియు గొఱుగుట, తలఁ దఱుగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా . భాగ. 10 పూ 1770.

జ. మూతిముట్టు.

**మూతిముట్టు** స. (క్రి. (మూతి + ముట్టు) 1. మూతితో ముట్టు, వాసనచూచు.

సీ. మొకరితుమ్మెద మూతిముట్ట నోడెడివేఁడి నిశ్వాసపవనంబు నివ్వటిలఁగ . శివరా, 2 107.

సీ కోమలినిట్టూర్పుగ్రొవ్వేఁడి నెత్తావి మొకరి తేంట్లును మూతిముట్ట వెఱచె .. నైష 2. 108

2. తిను, భక్షించు.

గీ మొకరతేఁటులు మూతిముట్టవు తేనియల్ శ్రీమధుశాసి కర్పించి కాని . ఘటికా . 74

సీ ప్రాణ జాద్గి బు పర్ణాంబుపులు గాని మూతి ముట్టరు కందమూలఫలము . పి శకుం 4 121

**మూత్రకృచ్ఛ్రము** సం వి అ న నీరుకట్టు, మూత్రము పడునపుడు నొప్పి గలుగు రోగ విశేషము

**మూత్రగ్రంథి** సం వి ఇ పుం మూత్రాశయము మీఁద గట్టిపడుట

**మూత్రపుటము** సం వి. అ. న పొత్తికడుపు, వస్తి

**మూత్రము** సం. వి అ న ప్రస్రావము, ఉచ్చ

**మూత్రవర్ధకము** సం విణ. (అ ఆ అ) మూత్రవృద్ధి చేయునది

**మూత్రశుక్రము.** సం వి అ న మూత్రముతో శుక్రము పడిపోవునట్టి రోగము

**మూత్రాశయము** సం వి అ. పుం వస్తి పొత్తికడుపు, మూత్రస్థానము

**మూత్రించు** సం. అ. క్రి. మూత్రమువిడుచు, నీరువిడుచు

గీ. జనుఁడు కలు ద్రాగి అంకాణె నెఱచి దినియొ, నిలిచి ముత్రించెఁ జండాలలనఁ గూడె .. శివరా. 4 54.

**మూదల** విణ (క మాదలె. మూల + తల . ) 1 ప్రమాణము, నిర్ణాయకము.

కం వేదములకు నిఖిలస్మృతి, వాదములకు బహుపురాణవర్గంబులకున్, వా దైనచోటులను

భా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్ ...
భార. విరా 1. 4

2. సంబంధించినది

ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకర మైన, యట్టి విద్యఁ దాల్చి యింద్రుఁ డవుడు, మూఁడు లో ములకు మూద లై నట్టిశ్రీ, ననుభవించి మి చె నధికమహిమ భాగ. 6 913

జ మూదలించు, మూదలిక

**మూదలించే.** స క్రి (√ మూదల. త మూదలి క మూదలిను.) 1 తాఁకు, స్పృశించు

ఉ. చూచె వనీవిభూతి యొక చొచ్చిన నిద్దుర కన్ను మూయను, న్నేచె మెఱుంగు లెల్లెడల నిండఁ దళుక్కనఁ దోఁచి మాయమై, తోఁచె నఖిలకాశరుచిఁ దొయ్యలి యమ్మని మూదలింపఁగా, మోచె పమీపపుం గదళి మోహనగర్భము మెచ్చ నచ్చరల్
కకు 3 76

2. తాఁకు, కవియు.

వ. ఇట్లు దాఁకి మహాఘోరయుద్ధంబు సేయు చున్న త్రిశిరోసురేంద్రు నిక్ష్వాకునరేంద్రుఁడు గని కోపించి వాని కరచరణశిరంబు లొక్క పెట్టఁ దెగ నేసి మేలువాడి బంభాసురేంద్రుం గిట్టి ముట్టి మూదలించిన నతనికవిగల కబ్బగింపక గూండ్రించి .
కు. సం 12 845

3 ఎదురించు

ఉ. పాండునృపాగ్రనందనుఁడు బావనియుం గవలుం బలంబుమై ,నొండొరు మూదలించు కొని యొక్కటఁ దాఁకినఁ దీవ్రవిస్ఫుర, త్కాండవిదారితాంగకులుగా నొనరించి ...
భార, కర్ణ. 2. 19.

4. స్మరింపఁజేయు.

ఉ ... మును సుయోధనుచందముఁ జూపి యప్పుడే,మంటి యుపేంద్ర నన్నని రణాగ్ర మునన్ నిను మూదలించెదన్. .
భార ఉద్యో, 3. 56.

5 ఎత్తిపొడుచు, ముదలకించు

ఉ. పన్నినవాఁడ నింకఁ జెడి పాఱకుమీ యని మూదలించి చే,నున్ననిశాతబాణము మహో ద్ధతిమై నరిఁ బోసి యేసినన్,గన్నుఁ నోరనెత్తు రొలుకంగ శతాంగముమీఁద వ్రాలె .. ఉ హా. 3. 52.

ఉ. పాడియు సత్యముం గలుగుపాండవకోటికి నీవు దొల్లి యొ,ప్పాడిమెయిన్ సభం గరము భంగ మొనర్చితి నాఁటియందఱుం,జూడఁగ నేఁడు తత్ఫలము సూపెద నీ కని మూద లించి మై, నాశఁగ నేసెఁ ..
భార భీష్మ 3. 112.

గీ నిన్నుఁ గన్నష్ట చక్రాగ్ని నీఱు సేయ,వచ్చు మూదలించుట కింత వలసెఁ జేయ ...
హం. ఉ. 6 217

5 ఘట్టించు.

సీ కావున నయ బు .

గీ. కప్పకుండఁగ నే దేని తప్పుటొ అప్పు, మత్స రాహంకృతులను గామమునఁ గ్రోధ, మోహ ముం ప్రత్యవాయంబు మూదలించు,తప్పు లేకయ శిక్షింపఁ దగవు గాదు.
కాశీ. 5. 319.

**మూదలిక.** వి (√మూదల) తాఁర్కాణము. (శ ర).

**మూన**[1]. వి. 1. తుషనమేత ధాన్యము.

సీ. ... తుషసమేతధాన్యాభిధలు మూఁగపో తవంగ, మూన యనఁగాను ...
ఆం. భా. 2 288.

2. నాఁటెడు వరిమొక్క.

(వ్యవ.) ఈయేఁడు ఆచేనిలో ఒక్కమూన కూడ పెట్టలేదు.

**మూనదిరుగు** — నాఁటినవరిమొక్క వేళ్లుపాఱు.

నాఁటుకొను.

(వ్యాప । ఈచే నప్పుడే మూన దిఁగినది

**మూన2** వి వస్త్రగాలితముచేయఁగా రాలక నిలిచినది. (శ. ర )

**మూను.** స. క్రి. వస్త్రగాలితము చేయు (శ ర.).

**మూన్నా(నా)ళ్లు.** వి. బ. (మూఁడు + నాళ్లు) మూఁడు దినములు.

గీ. చెఱఁగు మాసిన మూన్నాళ్లు సిగ్గుతోడఁ, బతివి లోకనమార్గంబుఁ బరిహరించి
కాశీ 2 72.

కం శిరము దెగఁ గోసి నీపదసరసిజములఁ మూన్చి నీప్రసాదంబున శంకర మూన్నా ళ్లకుఁ గరుణాకర గోవిందుండు వడసె ..
శివ సా 403

గీ. అని వసిష్ఠుండు మఱియు నిట్లనియె వట్లు, దానవునిఁ గూర్చుకొని రఘూద్వహుఁ డతండు, దొలుత మూనాళ్ళు వార్థిఁ బ్రార్థించి పిదప, నలవు గుందించి | మొక్కిన నభయ మొసఁగె సమీర 8. 173.

సీ వెసలలో మూనాళ్ల వెన్న లుండఁగ నాఁడు కాఁచి డించిననెయ్యి గాఁగఁబెట్టు
శుక. 2. 561.

**మూన్నెలలు.** వి బ (మూఁడు + నెలలు.) మూఁడునెలలు.

కం వినుతగుణ హానిస్యాన్నంబున నొకనెల మత్స్యమాంసమున రెండునెలల్, విను లేడి మాంసమునఁ బిత, లొసఁగ మూన్నెలలు దృప్తి నొందుదురు గడున్.
మార్క. 3 199

కం. తెగ దివ్వుడు మూన్నెలలకుఁ దగ వడుగఁగ రెండు దీర్చెదను . జై భా 8. 209.

(ఈ క్రింది ప్రయోగమున మూన్నెల్లు అని కలదు సాధుత్వము చింత్యము.)

ఆ. మొదటిమాసమందుఁ బదనుగా బుద్బుద, భాతి నుండు నాల్గుపక్షములకుఁ, బిండరూప మగచుఁ బెంపొంది మూన్నెల్ల, కవయవ ములు పుట్టు నసఘచరిత
సానందో 4 58

**మూయి** వి (√మూయు) కప్పు, మూఁత

గీ. అడ్డి యడ్డము మూయి క ప్పడ్డపాము మాటు మూఁతయనఁగ వ్యవధాన మౌ ..
ఆం భా 1 86.

**మూయించు** స క్రి (√మూయు) మూయఁ జేయు

కం. అనమ్రజు వెడల వడిచిన, వనుధేశ్వరుఁ దేజనాపవాదముఁ జెందెన్, దెస నెఱిఁగిన పదములకా, మునగన లని కైక నోరు మూయించెఁ బతిన్ చం రా. 4. 56

**మూయు.** స క్రి (త మూడు మూయు క ముచ్చు । కప్పు, అచ్ఛాదించు.

సి. నునుబట్టతలలపైఁ గనకంపుఁ జెఱఁగులఁ బట్టుఁజీరలు మూయఁ జుట్టినారు .
నైష 7 63

ఉ .. మటుమాయల నీలికాన నా, మూసిన ముత్తెపై మెలఁగు ముద్దుఁగుమారునిమీఁద నెట్టుగాఁ, జేసితి వింతమచ్చరము చెల్లునకే మఱి యూఁడుదానికిన్ సారంగ. 3 53

కం. మఱి యైదువేలయేఁడులు, దెఱచినను మూయ కినునిదెసఁ జూచుచు నేడ్తెఱ నూర్ధ్వబాహుఁడై మతిఁ, దఱుమక శ్రుతి నొడివి కొనుచుఁ దప మొనరించెన్ ..
ఉ రా. 2. 164.

(కనుమూయక = ఱెప్పవేయక.)

2 మూఁత పెట్టు.

గీ. అలఁ జెరవ మూయ మూఁకుడు గలదు కాక, నోరు మూయఁగ మూఁకు డెందు లను గలదె ...
సారంగ. 2. 249

కం. అనఁ జెవులు మూసికొనుచుం, దవమదిలో నలిగి కచుఁడు తలిరుఁబోఁడి, వినఁ దగని

పలుకు పలుకం,జనునే తలపోయ నిట్లు చాలు నుడుగుమీ యయా. 3 154.

అ క్రి. 1 ముకుళించు, మొగుడు

ద్వి. కలువలు మూయ నక్షత్రముల్ మాయ, జలజముల్ వికసింప ... నెఱిఁదూర్పు, గొంగపై నిలిచె నాదిత్యుండు ..

ద్వి హరిశ్చ. పూ. 551, పం.

2 మూఁతపడు

కం. వినవయ్య కర్ణగర్వం,బని నాతఁ డభేద్యక వచుఁ డగుటయు విలునే,ర్పును నతనిబాహు విక్రమ,మును దలఁచిననాఁడు గన్ను మూయుదు నాకున్

భార. అర 1 270.

(కన్నుమూయదు = నిద్రరాదని భా )

తలుపుమూయు = తలుపు దగ్గఱగావేయు బంధించు

గీ. శాస్త్రపారక్రమానంతజాడ్యుఁ డైన,ధవుని గని యుస్సు రంచును దలుపు మూసి,గుబ్బ కవమీఁదిపయ్యెదకొంగు పఱచి, నేలఁ బవ ళించు మగువ కన్నీరు దొరఁగ.

శుక. 3 483

జ మూఁకుడు, మూఁత, మూఁతపాడుపు, మూఁతబల్ల, మూయి, మూయించు, మూసి కొను, మూసినమురికి.

మూర. వి. (త. ముళమ్, క మొళ మ. తు. ముళమ్.) హస్తప్రమాణము, రెండుజేనలకొలఁది

వ .. మూర కొక్కండును జేన కొక్కండు నుగాఁ గుట్టినడొల్లుటుల్లారు ఉల్లసిల్లఁ బల్లించినపల్లంబులపై అము. 4 35

మ. ఇరువై నాలుగుమూళ్ల మేర యని గో సెక్కిం పఁగా నేల .. కాశీ. 1. 53.

సీ. ... మూర నా హస్త మొప్పును ...

ఆం. భా 2. 141.

జ. మూరకోక, మూరకోల.

మూరకోక వి. (మూర + కోక) బాఁ చోఁపు. (చి ని, శ ర )

మూరకోల మూః + కోల) గజపుగోల వి. గజముబద్ద (శ ర మూఃకొలతకో. చి ని.)

మూరటిల్లు అ క్రి మ్రోయు

సీ. రాజులు గొల్వ భద్రగజాధిరూఢుఁడై భేరి మృదంగముల్ మూరటిల్లఁ ...

శ్రీరం మా 10. 114.

(ప్రయోగాంతరము కనఁబడలేదు )

మూరి వి (√మూరు ) 1. చిత్తవిభ్రమము. మోహము

చం. అనుపమదివ్యమూర్తి ... సుకుమారి తన్ను విటవర్గము వల్గడ వచ్చి ప్రీతితోఁ, గనుఁ గొని మూరిఁ జూడ నెడ గానక సూతెలు వాఱుచుండె మో,హినియును బోలె నొక్క శరదిందునిభానన నిల్చి ముఁగిటన్.

కు సం. 8 124.

2 అతిశయము (చూ మూరిఁబోవు )

మూరిఁబుచ్చు. స క్రి (√మూరిబోవు ) 1. వర్ధిలఁజేయు.

సీ .. వెన్నుఁడు సొంపు రెట్టింపఁ గ్రమ్మఱఁ బట్టి యొడఁదఁ ..

గీ దమక మినుమడిగాఁ గౌను దక్కఁ దొడిగి, బిగువుఁ గౌఁగిటఁ గదియంగఁదిగిచి తివుట, మోవి గదియంగఁ గోర్కులు మూరిఁబుచ్చు, కలిమి యాబిడచూడ్కులు గాచుఁగాత.

ద్వా 4 218.

2 సంతోషపెట్టు.

సీ మధురార్ధదండకమంజరి మంజులబుధుల నిం పుల మూరిఁబుచ్చదేని ...

కావ్యా 4. 44.

మూరిఁబోవు. అ. క్రి. (మూరి + పోవు.) 1. అతిశయించు.

గీ. లీల మూరిఁబో వచ్చరలేమపిండు, బలసి

యభివందనము సేయఁ బోలెడె ...
భార శాం. 3. 337.

శా దేవోత్తంసుఁడు భక్తవత్సలుఁడు చిత్తేశస్వ భావుండు గౌరీవామాంగుఁడు శంకరుండు దయ మూరింబోవఁ గొఁగేలునన్, జావ న్వచ్చినపుర్వుఁ బట్టి తగునీసద్భక్తికిన్ మెచ్చితిన్, నీ వేయర్థము నన్ను వేఁడెదవు దానిం జెప్పుమా నాపుడున్.
కాశ. 2. 101, ఆము. 6 25.

2 వర్ధిల్లు.

ఉ. తొల్లి దిపెన్నిభానములు దూఁకొని యర్థ విభుం డనం బ్రశస్తమ్మగుపేర్మి నిందుధరు సఖ్యము గాంచినమేటి యొుఁడుచో, టిమ్మెయి మెచ్చ కివ్వరమహీధరుపాదము నాశ్రయించి సౌఖ్యమ్మున మూరిఁబోయెఁ బెఱయద్రుల కింతటిపేర్మి గల్గునే
హరి ఉ 6, 10

3. దృఢమగు.

గీ. తనయ బంధుకళత్ర మిత్రకులమీఁద, మూరిఁ బోవఁగఁ బ్రాఁకినమోహలతను ...
వి శకుం 4. 86.

4 విజృంభించు

సీ వేఱ యొుకతె, విశ్వకర్మతనూజ విశదలావణ్యస, ముజ్జ్వలఁ జేకొని మూరిఁబోయి, ... త్రిదివభూమి వెల్వడియెను ...
హరి. ఉ. 4, 43.

4. సఫలమగు

మ. కడుభక్తిన్ మిముఁగొల్చి మీదయఁ ద్రిలోకఖ్యాతసత్పుత్రు నేఁ, బడయం గోరఁగఁ గూఁతు రిప్పు డుదయింపం జాడియే యిప్పుడీ, వడఁతిం బుత్రునిఁ జేసి మీదగు కృపాప్రావీణ్యముం జెపు నే,కృప నాకోరిక మూరిఁబోవఁగఁ గృతార్థత్వంబు నొందింపరే.
మార్క. 7. 185.

6. సంతోషించు.

కం మదిలో నన్నుఁ దలంచుచు, బఃరీభ సూత్రహవ్యభాగ మనలునం, దొదవించితేనియును నభ్యుదయము నే నొఁది మూరిఁబోవనె చెప్పమా
హరి పూ 3 45

గీ. గాడ్పు మురిపంబు నెందును గలిగె యెల్ల, వారి మనసులు వేడ్కల మూరిఁబోయె ..
హరి. పూ. 9. 68.

ఉ ఆరథసంఘనప్పు కరినాదులచే ధల లేని బొందులం, జూరె కడంక లూరె వని చూపఱు మెచ్చుల మూరిఁబోయి రా, సూరెల మున్నె కన్నిడిన సూటిన వామభుజా భుజాదులం, శీరము సూపి త్రెళ్లె నవి భీమ మహోత్కఘురాహతంబులై ...
కకు. 5 50.

7. సంకోచించు

సీ తొలిక్రొముక్కు చెలిచెవిఁ జిలికించుఁ జిలికించి మురిపెంపుసిగ్గున మూరిఁబోవు ...
కావ్యా. 3. 122.

8. నశించు, చెడు

ఆ. చదువు చట్టువడియె శాస్త్రంబు మన్నయ్యె, బుద్ధి పురువుమేసెఁ బుణ్య మడఁగె, నీతి ముట్ట వడియె నిర్మలజ్ఞానంబు, ముట్ట నుడిగెబోధ మూరిఁబోయె
భాగ. 6 185 6 240.

మూరు. అ. క్రి. (సం మూర్ఛ) అతిశయించు.

ఆ. ఇతనిఁ జూచి మీకు నెతమోహము గల, దంతకంటె మాకు నధిక మైన, మోహరసము మూరి మోచి యున్నది యాకు, మూరుఁ డొక్కరూప మాకు మీకు .. వి పు 7. 100.

సీ ఊరువులు వేఁడి మూరంగఁగ మలినకరగతాబ్జము చురచురలు దెల్ప,నంతంతకును హెచ్చు వతను, తాపస్ఫూర్తి ననిశంబు నెదఁ బర్వు నదరు దెల్ప
భోజసుతా 3 90

జ. మూరి, మూఁబుచ్చు, మూరిఁబోవు.

మూరుకొండ వి రూపగంధ, ఒక విధమగు ఓషధి (శ. ర.).

మూరుకొ(రొ్క)ను. సం క్రి. ఆఘ్రాణించు, మూచూచు

గీ కరి సెలంగి నీమీఁద బుష్కరము సాఁచి, మూరుకొని సెమెదు దు గులమోల నిల్చి, ముద్దుగురియుచుఁ బలుమలు మ్రొక్కు నిట్టి, దాని ని స్నేల పొపుదు మానసీయ
భార అను. 4. 77.

ఆ కావరంబుతోడి కందర్ప విక్రియ, మోర మోర మోపి మూరుకొని యె ... కాశీ 4. 271.

శా పూవుంబోణి విశాలలక్ష్మిఁ గనుచుం బుష్పంబు మూరొ్కఁచు వీణావాద్యంబులు వించు ...
భీమ. 5 191.

కం. గజ మంటినట్లు యడఁచున్, భుజగము మూరొ్కనినయట్ల పొరిగొను ధరణీ, భుజుఁడు వగినట్ల చంపుం, గుజనుఁడు మన్నిఁచినట్ల కొనుఁ బ్రాణంబుల్
వేం పంచ 3 78, యయా. 4 19.

జ మూచూచు.

మూరుతము. వి (సం, ముహూర్తః) శుభ కాలము

కం మూరుతము డాసె నిదిగో, వారులు కట్టుకొని మేలిపని కన్గొనఁగాఁ, గోరి పజీ తెల్ల నున్నా, రోరాయఁడ జాగు సేయుటొప్పునె యిటులన్. అచ్చ. రా. అయో. 47. (మూరతము. ముద్రి. పా.)

గీ. నీలకు, వెన్నునకును బెండ్లి వెన నొనర్పు, వలయు నంచుఁ బూని వల నొప్ప మూరుత, మొజ్జవాపనయ్య నొయ్య వడిగి ...
నీలా 3. 78.

మూర్ఖపండితుఁడు సం. వి. అ. పుం. చదివిన మూర్ఖుఁడు, చదివినవాఁడై నను దెలివిలేనివాఁడు.

మూర్ఖభ్రాతృకుఁడు. సం. విణ (అ. ఆ అ.) మూర్ఖుఁడు సోదరుఁడుగాఁ గలవాఁడు

మూర్ఖము. సం వి అ. పుం ఒకజాతి చిక్కుడు. (వ్యు. వి.).

మూర్ఖు(ఁడు) సం. విణ (అ ఆ. అ) అవివేకి.

గీ. విల యాశీవిషంబుల నెటిఁగి యొటిఁగి, మూర్ఖవై యలిగించెదు ...
భార. సభా. 2. 204.

చం. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి నీవు మూర్ఖవు శిశుపాల యింకఁ బలుకన్ వలసెన్ ... భార. సభా 2 24.

మూర్ఛ సం. వి. అ స్త్రీ. 1. మూర్ఛిల్లుట, సొమ్మసిల్లుట 2. ఆత్మనెఱుఁగమి ఆత్మవిషయకాజ్ఞానము 3. సంగీతమున సప్తసర్వములయొక్క క్రమమైన యారోహణావరోహణములు. 4. పెరుగుట. అభివృద్ధి

మూర్ఛన సం. వి. అ. స్త్రీ. 1. సొమ్మసిల్లుట, మూర్ఛపడుట 2 అభివృద్ధి, పెరుగుట 3 గంధకముతోఁ బాదరసమును భస్మము చేయుట. 4. సంగీతమునందుఁ గ్రమముగా సప్తస్వరముల యొక్క యారోహణావరోహణములు.

మూర్ఛనము. సం. విణ. (అ ఈ అ) 1. మూర్ఛ గలిగించునది. మూర్ఛిల్లఁ జేయునది. (సాధనము) . వృద్ధిపఱుచునది చేర్చునది, బలపఱచునది.

మూర్ఛపు(వు)చ్చు. మి స. క్రి. (√మూర్ఛ బోవు.) మూర్ఛనొందఁజేయు.

గీ. రామ! యాశక్తిఁ గొని కాదె రావణుండు, మున్ను మనలక్ష్మణుని నొంచి మూర్ఛపుచ్చె.
ఉ రా 2. 285.

కం. .. నాఁ సంబు పృథుతరవశు, న్స్వాత్యంబు సేసి విజయుఁడు, నీతనయుని మూర్ఛపుచ్చె నిష్ఠుర వృత్తిన్ .. భార. భీష్మ. 3 343.

మూర్ఛాలుఁడు. సం విణ. (అ. ఆ అ.) సొమ్మసిల్లినవాఁడు, స్మృతితప్పినవాఁడు.

మూర్ఛితము సం విణ (అ. అ. అ) 1. మూర్ఛపడినది, సొమ్మసిల్లినది. స్మృతితప్పినది. 2, పెంపు

చేయఁబడినది హెచ్చింపఁబడినది. 3 ఉన్నతమైనది

**మూర్ఛిల్లు(లు).** సం. అ. క్రి. మూర్ఛపోవు, సొమ్మసిల్లు

ద్విపద ... కవలు మూర్ఛగతిం దాఁకినం జా, కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బి ట్టుల్కి మూర్ఛిల్లకుండన్.

భార. ఉద్యో. 1. 323.

వ అట్లు శ్రుతాయువు మూర్ఛిల్లిన ...

భార భీష్మ. 2 75.

చం. గతుఁకుఁ బాసె నశ్వములు గంధగజంబులు మూర్ఛలెన్ రథ, ప్రతతులత్రోవ గట్టువడె ... కేశవుఁడు .. శార్ఙగుణంబు దీటినన్ ...

ఉ. రా. 2 60.

**మూర్తమాడు** అ క్రి. (క. మూర్తమూను.) విశ్రమించు.

సీ నాకు మీపాదార్చనము సేయ నడలింగ మూర్తి చేకుఱె వచ్చి మూర్తమాడి ...

కాశ. 1. 35.

**మూర్తము.** సం. విశ. (అ. ఆ. అ) 1 మూర్ఛిల్లినది, స్మృతితప్పినది, స్మారకములేనిది. 2. తెలివిలేనిది. 3. మూర్తీభవించునది. శరీరము దాల్చినది. 4 కఠినమైనది, గట్టిది. 5. (వేదాంత) పరిచ్ఛిన్న పరిమాణముగలది. (క్రియ గలదని తార్కికులు)

**మూర్తి.** సం. వి. ఇ. స్త్రీ 1. గొప్పతనము, మహత్త్వము.

చం. నునుసెలగోల సేకొని మనోహర యౌవన మేను రాజుచూపును బ్రజచూడ్కులం దిగువఁ బుష్కరపత్త్రిలిభంబులై నలో, చనము బు మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్లన ల్లన వెడభీతి దోఁప జనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్ ... భార. విరా. 1. 276.

2 స్వరూపము 3. దేహము, శరీరము 4 ప్రతిమ విగ్రహము 5. కాఠిన్యము, గట్టితనము

**మూర్తిపుఁడు** సం. వి అ పుం. విగ్రహములఁ బూజించువాఁడు. దేవలకుఁడు పూజారి

**మూర్తీభవించు** సం. అ క్రి. దేహముధరించు. ఆకృతిదాల్చు.

గీ ... మూర్తీభవించు మంచు, నలువమును పల్కుటయుఁ గాంచములుగాఁగ ..

వరాహ 6. 53.

**మూర్ధకర్ణి** సం. వి ఈ. స్త్రీ ఛత్త్రిము, గొడుగు.

**మూర్ధజము** సం. వి అ. పుం. తలవెండ్రుక (గుఱ్ఱము సింహము మొదలగువాని) జూలు

**మూర్ధన్యము.** సం విశ (అ ఆ అ) 1. తలనున్నది. 2. మూర్ధస్థానమునఁ బుట్టినది. (ఋ, ౠ, ట, డ, ఢ, ణ, ర, ష యను వర్ణములకు పేరు.) 3. ముఖ్యమైనది. శ్రేష్ఠమైనది.

**మూర్ధపుష్పము.** సం. వి అ పుం శిరీష వృక్షముఁ దిరిసెనచెట్టు.

**మూర్ధము** సం. వి న్ పు 1 తల, శిరము. 2. అలికము, నొసలు 3 శిఖరము, ఎత్తయిన భాగము, శిరోభాగము 4 ముఖ్యమైనది, ప్రధానమైనది.

**మూర్ధరసము.** సం. వి అ. పుం. భక్తఫేనము, వార్పుమీఁదిగంజి.

**మూర్ధవేష్టనము.** సం వి అ న తలపాఁగ .

**మూర్ధాభిషిక్తము.** సం. విశ. (అ ఆ. అ). అసాధారణ మైనది (ఉదాహరణము)

**మూర్ధాభిషిక్తుఁడు** సం విశ. (అ ఆ అ). 1. పట్టాభిషేకము చేయఁబడినవాఁడు.

వి అ పుం 1 పట్టాభిషేకము నొందినరాజు. 2. క్షత్రియుఁడు, రాచవాఁడు. 3 మంత్రి.

**మూర్ధాభిషేకము.** సం. వి. అ. పుం. పట్టాభిషేకము.

**మూర్ధావసిక్తుఁడు** సం. వి. అ. పుం

1 పట్టాభిషేకము నొందినరాజు. 2 బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయందుఁ బుట్టినవాఁడు

**మూర్వ.** సం. వి. ఆ. స్త్రీ లతావిశేషము చాఁగ (వృ. వి.). (దీనినార వింటినారికిని, క్షత్రియుల మౌంజికిని ఉపయోగించును)

**మూల**[1] వి. కొప్పు.

సీ. ముడువంగ నేర్తురు మూలఁ గమ్మనితావి, గలుగుక్రొవ్విరులు లోఁ గందకుండ ..
మూల ... భీమ 1 94

ఠగడ తళుకు బంగరువిరులు దాఁచినావఁటె
మూల,నకు కేల జాల రుద్రాక్షతరువుల
ఉ. రా 6 61.

సీ. ముడువంగ నేర్తురు మూల దాపటికి రాఁ
జికురబంధము లీఁగ జీరువాఱ ...
కాశీ 3 109.

సీ .. కబరికిఁ దురుము. కొప్పు క్రొవ్వెద మూల నా వొప్పుఁ బేళ్లు.
ఆం. భా. 2 145., కవిక 3 109

**మూల**[2]. వి. (త. మూలై. క మూలె. మ. మూల).

1 విదిక్కు, దిఙ్మధ్యము.

సీ .. తొలుదాలుపు నొక్కమూల కనిచి .
సిలా. 1. 42

కం. ఉఱు ముఱిమి మూలగాత్పులు, చఱచి విసరఁ జొచ్చె ... హర 2 17.

2. కోణము.

గీ అచటఁ దిగమూల లేర్పడ నరుఁగు నిలిపి ..
అచ్చ. రా. యు. 3 22

(త్రిగమూలలు = మూఁడు కోణములు.)

గీ మూల యన రోక యనఁ గోణ మెవ్వు -
ఆం. భా 1 71.

గీ తనగృహంబున గూఁటిలోఁ దలుపుమూలఁ, ఓడుతతో నాయకుఁడు దాఁచి పెట్టినట్టి, మాక లర్పించి వానితోఁ గూడి మెలఁగె ..
శుక. 3. 131.

(తలుపుమూల = తలుపునొద్ద కోణము)

3 గొంది, చాటైన ప్రదేశము.

సీ నవఁబోడి మునుఁగొప్పునకు దీటు గాక నిచ్చలును జీకటులు మూలలను డాఁగె ...
సిలా 2 20.

వ . ఏపట్టున నిలువం జాలక మూలమూల కరుగు మకర కర్కటకాది జంతుసంతానంబుల కగుబడబానల సంతాపంబునకుఁ గొంత చింతించుచు .. దశా. 1 261.

గీ. కడిఁది నిట్టూర్పుగాడ్పుల గ్రహగణంబు, లొక్కమూలకుఁ జిక్క నత్యుగ్రదృష్టి,నిగుడుచో ల్లిల్ల నిగుడులై తూగయును ..
దశా 3. 171.

సీ మునుఁ గేసికొని మూలమూల డాఁగినదిశాధిపుల కిప్పుడు బయల్ దేఱఁ గలిగె .
ఉ. రా. 1 105.

4. చోటు, ప్రదేశము

సీ. ఒకమూల మకరాలయ ... చారవిందముల్ వేడ్కఁగొనుచు ...
కృష్ణ. 4. 49.

5. లోకము.

సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూల విభుఁ డయ్యెఁ గ్రేపుల వెదకువాని ...
భాగ. 10 పూ 544.

**మూల** సం. వి. అ. స్త్రీ శతమూలి, చల్లగడ్డ, ఓషధి విశేషము.

**మూలఁద్రోచే** = నిరసించు, పరిత్యజించు

గీ అతనిఁ దనసొమ్ముఁ జేసి మున్నాఁగి యున్న, మోహముఖులైన జ్ఞాతుల మూలఁ ద్రోచి, సంప్రాప్తాసురులైననిర్జరులకరణి, మది వివేకాదివర్గ మభ్యుదయ మొందె
పాండు. 4 208.

**మూలఁబడవైచుట** = నిష్ప్రయోజనముగ నుంచుట.

సీ. రతిరాజు శాణసంతతి మూలఁ బడవైచి,
చాపంపు గడపటఁ జప్పఁ జేసె
చిత్రభా. 3. 103.

**మూలఁబడు** = 1 అడఁగు, అస్తమించు

గీ. పరఁగఁ గలకొద్ది మరలకుఁ బంచి యొసఁగి
జాలువృత్రారి యనురాజు మూలఁబడిన,
బలిత మయ్యె విరోచనప్రభవతేజ, మమర
గాఢతమస్స్ఫూర్తి నవనయించి ...
దశా 5 27.

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము)

2. చెడు, నశించు.

ఉ. ... క్రమ్మతి యిల్లు సొచ్చి పేరక్కునఁ
జేర్చి వార్త గలదా యన దూతిక యేడ
వార్త నా,ముక్కుకు వచ్చె నీచెలిమి మూలఁ
బడన్ విడు మిల్లు సేరెదన్.
వేం. పంచ 1. 262

**మూలకము.** సం. వి. అ. పుం న. ముల్లంగి (వృ వి)
పుం. ఒకదినుసు విషము.

**మూలకర్మము.** సం. వి. న్. న కార్మణము,
ఓషధ్యాదులచేత చేసెడి యుచ్చాటనాదిక్రియ.

**మూలకారిక** సం. వి. అ. స్త్రీ. పొయ్యి, ఛుల్లి

**మూలకుఁజొనుపు** = అప్రయోజక మగునట్లు
చేయు, పనికిమాలిన వానిఁగాఁజేయు

వ. ... ప్రబలతమస్ఫార దురహంకార వీర
భట కృపాణికా చాకచక్యంబులు రాత్రిం
చరకరాళ కరవాలకాళిమంబులు మూలకుం
జొనుప ... వసు. 6. 9.

**మూలకృచ్ఛ్రము** సం. వి. అ. పుం. న. తపో
విశేషము (దీనియందు దుంపలుమాత్రము తిని
బ్రదుకుదురు.)

**మూలకొత్తడ(ళ)ము.** వి (మూల[1] + కొత్త
డము.) బురుజు,

గీ. మూలకొత్తళములు చెల్లు బురుజు లనఁగ ...
ఆం. భా. 3. 18.

**మూలకొత్తు**=పరాభవించు

సీ. క్రమజలాభివ్యక్తసహజసాంకవముదా మోదంబు
చిలుకల మూలకొత్త ....
వసు. 3, 132.

**మూలగ** = మూలుగు[2]. వి (త. మూళై.
మ. మూల.) మజ్జ.

ఉ. ... దేగ వడిం జని గిట్ట వట్టి మేన్,
చించిన, గాలిమూఁగయుఁ జెక్కు ముఁ
జక్కెర నద్ది యిచ్చి యే, తెంచె నొకండు
దా లవిటి దీటుచు లావులు గూడ దువ్వు
చున్ చంద్రా. 2. 105

(చి. ని. శ ర. పా మూలుగ. ముద్రి.వ్రాత.
ప్రతి. పా)

**మూలజము.** సం. వి. అ న. అల్లము (వృ వి).

**మూలటిక్క** మి. వి. (మూలము + టిక్క)
ప్రధానస్థానము.

గీ. చంద్రబింబాస్యకుచశైల జన్మభూమి, గాన
రారూపుఁబోలె వక్కడిఁ బిచలికి, నించుకం
తయుఁ గంపింప దివముకొనుచు, ముజ్జగం
బులు పచరింప మూలటిక్క.
పాండు, 4. 5.

(మూలెటిక్క, ముద్రి. ప్రతి. పా.)

**మూలత్రికోణము.** సం. వి. అ. న. సూర్యాది
గ్రహముల గృహరూపరాశి విశేషము.

శ్లో. సింహో వృషశ్చ మేషశ్చ కన్యా ధన్వీ
ఘటో ఘటః. అర్కాదీనాం త్రికోణాని
మూలాని రాశయః క్రమాత్

**మూలదుంప.** మి. వి. (మూలము + దుంప)
మూలకందము, ప్రధానకారణము.

గీ గంగ మనుజులపాలింటికల్పవల్లి, సన్నిధి

గన్న పెన్నిధి జహ్నుకన్య, యమునవది భవరోగ దివ్యౌషధంబు, ముక్తిలతకు భాగీరథి మూలదుంప . . జహ్నవీ. 1. 35

సీ. బలువిడిఁ దమ్ముల నలరించురసికుఁడు, మూఁడు మూర్తులకును మూలదుంప ...
సీతా. 2. 127 ,భీమ 5 157.

**మూలదేవుఁడు.** సం. వి. అ పుం కంసుఁడు (త్రి ని )

**మూలపాల్పఱచు** = మూలపాలువైచు. నిఁడుగ విడిచిపెట్టు.

మ అలరుందూపుల మూలపాల్పఱచి సొంపొనిచ్చుచాపంబునం, దలపెంపెల్లఁ ద్రుణీకరించి మకరాంకం బవ్వలం ద్రోచి యచ్చల మేపారఁగఁ జిన్నిబాలకులచేఁ జప్పట్లు వెట్టింతు ... కవిక. 8 109.

జ మూలకొత్తడము, మూలమట్టము, మూలవసము.

**మూలప్రకృతి** సం. వి. ఇ స్త్రీ. 1 ప్రకృతి, మాయ (సాంఖ్యమతమున). 2. ప్రధానము.

**మూలఫల** సం. వి. అ స్త్రీ. కొమ్మునగొలిమిడి (వృ వి ). (శ ర.).

**మూలఫలదము.** సం వి. అ పుం. పనస (వృ. వి.).

**మూలబంధము.** సం. వి. అ పుం. పునాది. (శ ర.)

**మూలబర్హణము.** సం. వి. అ. న. ఉన్మూలించుట, పెకలించుట.

**మూలబలము.** సం. వి. అ. న. ప్రధానసేన. (మన్మథవర్ణనము )

సీ. అబలలు సోపిన నాకాశమునఁ బాఱునలి శుకములు మూలబలము గాఁగ ...
కు. సం 4. 431.

**మూలభద్రుఁడు.** సం. వి. అ పుం. కంసుఁడు (త్రి ని ).

**మూలభృత్యుఁడు.** సం. వి. అ. పుం. వృద్ధభటుఁడు, వంశపరంపరగా వచ్చుభటుఁడు.

**మూలమట్టము.** వి. (మూల[1]+మట్టము.) గోడమూల మొదలగువానిని సమకోణములుగాఁ జేయుట కుపయోగించు శిల్పిసాధనము (శ. ర.).

**మూలము.** సం. వి అ. న. పుం.

1 వేరు. (వృక్షాది) మూలము. 2. మొదలు (అంగుష్ఠమూలము మొ ) 3. ఆధారము. మఱొకదానితో నతికికొనెడిచోటు.

ఉదా . బాహుమూలము, పాదమూలము, ఊరుమూలము, కర్ణమూలము మొ.

4 ప్రారంభము, ఆది. 5 మూలాధారము; పునాది; మొదటికారణము 6. మట్టు, అడుగు, క్రిందిభాగము. 7. మూలగ్రంథము (వ్యాఖ్యానము కానిది ) 8. పొరుగు, ఇరు ప్రక్కలు, మూలధనము, పెట్టుబడిసొమ్ము, మొదటి 9. సొమ్ము, 10. (గణిత) వర్గమూలము, పదము. 11. ఒక రాజుయొక్క స్వీయదేశము (సొంతనాడు).12. చెట్ల గుంపు, చిట్టడవి, తుప్పడవి. 13. పిప్పలీమూలము. 14. ఒకవిధ మయిన యంగుళీ సన్నివేశము, వ్రేళ్ళనొకమాదిరిగా నుంచుట, (అభినయహస్తము). 15. రాజధాని, ముఖ్యపట్టణము, 16. నికుంజము, పొదరిల్లు. 17.పిప్పలి, పుష్కరము, శూరణము మొదలగు చెట్లమూలము. 18. మూల యనునక్షత్రము. (ఈయర్థమున నిది దర్భాది.)

వ. ... దక్షిణవామలోచనంబుల ధనిష్ఠామూలలును ... భాగ. 5. 2. 87.

వ నిమిత్తము, కారణము.

కం. వరవరనుత నీ కీదు,స్మరణమునకుఁ బూన నేల మదిలోపల నే,పరభేదము గల దది యొ,వ్వరి మూలము చెప్పు మనిన వాఁ డవనతుఁడై ..
ద్వా. 8. 117.

**మూలముట్టుగన్** ఆమూలము, ఆరంభము మొదలు

క్రాని.

గీ మూలముట్టుగఁ దెల్పె నమ్మునివరుండు, ప్రార్థి తుండయి నాకు నప్పురమవిద్య ..
మనుచ. 3. 139

ఉ. అనవుఁడుః బసివడి వెదకం,బున వలసివసోమ్ము డావ చను వెంచినచో,ద్భున విన నక్కె నితని ముఖ,ముప నికాక్షించెంబు మూలముట్టుగ నను చున్ ..
భోజ 3 242.

సీ అదె యన్నద్ధి గీ. మూల మని దాని నిప్పుడు మూలముట్టుగాఁగఁ కెలిచెద నంచు నాగ్రహముచేయు ...
ప్రబోధ 5. 51

**మూలఝా(ఖా).** వి వి. (మూలము + ఝాయి) వజ్రము.

సీ ఆ మూల నునుమూలఝామొత్తముల చలులా మూలముగఁ దీవతంట నలయు .
వసు. 2. 57.

సీ. మూలఝా ఖాళంబములు పెక్కు జత సేసి జాళువాప్రతిమలచా లమర్చి ....
చంద్రా. 2. 86., ఉ. రా. 2. 292.

సీ. పొలుచును వజ్రంబు మూలరా లన, మగరా లనంగను,గురుజా లనంగ ....
అం భా. 2. 278.

**మూలఱేఁడు.** వి (మూల² + ఱేఁడు) నిరృతి, కోణపుఁడు

సీ. వాలు మోచుకయుండు మూలఱేఁడు ....
అచ్చ రా సుం. 41

**మూలవసము.** వి. (మూల¹ + వసము.) పట్టము లోని కమ్మకము నిమిత్తము వచ్చు సరకులపైఁ బుచ్చుకొను సుంకము ...
కొండవీటిశా. శ 1142

**మూలవ్రతి.** సం. విశే. (న్. సీ. న్) దుంపలు మాత్రమే తిని బ్రదికెడివాఁడు.

**మూలాధారము** సం వి. అ. పుం.) (యోగ.) గుహ్యలింగస్థానములకు మధ్య నుండు మూలాధార చక్రము

**మూలాహ్వము.** సం వి. అ. న. ముల్లంగి, మూలకము (వృ వి)

**మూలి** సం. వి. ఈ స్త్రీ. ఇల్లి న్. పుం. చెట్టు వృక్షము.

**మూలిక.** సం. వి. అ స్త్రీ. వేఱు, దుంప

**మూలుగ.** వి. వృక్షవిశేషము

సీ నారువ సుఁ పొన్న వారిజమును బొన్న నెల్లి మూలుగ విల్లు నెమిలియడుగు .
హంస 4. 11.

**మూలుగు¹(ల్గు)** అ క్రి (త. మునంగు. క. ములుగు.) 1. ధవదేవత మొ. వర్థముగానున్న నన్ను పరిగ్రహింపుఁడని సూచించుచు కూయు

ఉ. వాలినవేడుకన్ బహుసువర్ణముఖంబున మున్నరుత్తమూ. పాలునిచే మహీసురు లపారసు దక్షిణ లంది తెప్పలం, దేలి యథేచ్ఛఁ గొం చరుగ నిల్చినవిత్తము వెక్కసంబుగా, మూలుగు చున్న దిప్పుడు నముద్రితమై తుహినాద్రి చేరు వన్ .
జై భా. 1 66.

ఉ. పాళము మీఱుపెద్ద పెదపాళములై బలితంపుఁగాఁగులన్, మూలుగు చున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థుల కిచ్చు .... పాండు. 4. 211.

2. (బాధచే) ఒకవిధముగా రోదన ధ్వనిచేయు.

కం. తలనొప్పి కడుపుకుట్టుం, బలుగుఱుపుం గాళ్ళ తీపు పాటించుచు వ,చ్చెలి మూల్గు ఖాన్పుమీఁదం తెలుపుఁడు దత్తచ్చికిత్స సేయ న్నగుచున్ ...
శుక. 2. 205,

ద్వి బాలిక పువ్వులపానుపు విడిచి, మూలను బనళించి మూల్గుచు నుండె ...
ద్వి. శ. సా. 1 35 పా. 11 పం.

వి అట్టిధ్వని.

(వ్యవ.) వాని మూలుగుచేత నాకు నిద్రపట్టలేదు.

**మూలుగు(ల్గు)** = మూలగ. వి. ఎముకలమధ్య

నుండు మాంససారము, మజ్జ

సీ. మూల్గులుకెమ్ముల తోడ ముడుక గట్టఁగఁ జాఁదు సేసినవల్లజారుఁ గాఁచి .. హరి 2 121

సీ. . మూలుగు నా మజ్జ బొలుచు .. ఆం భా 2. 163

**మూలేరము** సం వి అ పుం జటామాంసి (వ్యా. వి.)

**మూలేరుఁడు.** సం వి అ పుం రాజు ప్రభువు

**మూల్యము** సం వి అ న. 1 వెల క్రయము, విలువ 2 ఒద్ధి, లాభము 3. మూలధనము, మొదటిసొమ్ము, పెట్టుబడిసొమ్ము

**మూవ¹** = మూఁగ¹

గీ కణఁగి వడ్లును జెరుఁగును గలుపుథంగి, నకల వికటంబు లగుప్రశ్న లడిగె నదియు, మూవలమువోలె దీనుదేఁ జావ నేల, యీడు జోడుగఁ జెప్పెద నెఱిఁగినంత .. వాసిష్ఠ 3 182

**మూవ²** = మువ్వ.

ద్వి మూవలగంటలమ్రోఁతకు వెఱచి, దేవి యున్న నగంబు ధృతిఁ దన్నుఁ గలయ ... బస. పు 3 604 పం

**మూవు** = మూఁగు అ. క్రి. ముసరు.

గీ. తమముఖంబులు దశితాంబుజములు సావి, మూవుతేఁటులఁ గని . కు సం 3 266

చం. అలు లొడఁగూడు ... సుగంధము మీఱుఁ బువ్వగుత్తులపయి మూవు, బుప్పొళులఁ ద్రావు కు సం. 4. 461

**మూవురు** = మూగురు న. ముగ్గురు (మూఁడు నకు మహన్మహాత్వర్థక రూపము.)

కం. అవిప్రు లేడ్వు రైనను, నేవురు మువ్వురును నైన నిమ్మహిలోనన్, భావితసభ యగుఁ గావున, మూవు రివళ్యంబు వలయు ముఖ్యులు నభకున్ విజ్ఞా పర్వన 3.

కం. ఈవిధమున గర్భులు లగు, మూవురలో రాజ సతులు మును మును సుతులన్. కైవాత్మలఁ గని రిద్దఱ ఉ హరి 4 10.

**మూష** సం. వి ఆ స్త్రీ 1 మూస 2 గాలి రంధ్రము, గవాక్షము

**మూషకపర్ణి** సం వి ఈ స్త్రీ ఎలుకజీడి (వ్య వి)

**మూషకము** సం వి అ పుం ఎలుక

**మూషకవాహనుఁడు** సం. వి అ పుం. ఎలుక వాహనముగాఁ గలవాఁడు, గణేశుఁడు, విఘ్నేశ్వరుఁడు

**మూషకారాతి.** సం వి ఇ పుం. పిల్లి, మార్జాలము

**మూషకుఁడు** సం విణ. (అ. పిక. అ.) దొంగతనము చేయువాఁడు.

**మూషణము.** సం. వి అ. న దొంగిలించుట. చౌర్యము

**మూషము** సం. వి. అ పుం. 1 ఎలుక; చుంచెలుక 2. గుండ్రనికిటికి, గాలిరంధ్రము. 3. మూస.

**మూషికము.** సం వి. అ పుం. 1. ఎలుక. 2. ఎలుకచెవిచెట్టు. 3 ఒకానొక దేశము.

**మూషికరథుఁడు** సం వి. అ. పుం మూషిక వాహనుఁడు, గణేశుఁడు

**మూషికారాతి.** సం వి. ఇ. పుం. మార్జాలము. పిల్లి

**మూషితము.** సం విణ (అ ఆ అ.) దొంగిలింపఁ బడినది.

**మూస.** వి. బంగారు లోనగువానిని గరఁగెడి పాత్రవిశేషము.

చం. ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు శాణము పటకారు మూస బలునాణె రీతులమచ్చు లాదిగా, సమరఁగ భద్రకాంక సమాహ్వయుఁ డొం డొకఁ

ష ము వచ్చునెన్. హంస. 2 181

మూసిక వి. (సం. మూషికా.) నాసుక్రోవి.

గీ. ..శాశి,బొట్టు మూసికతోఁ గూర్చి పొసఁగ నలుతఁ, బ్రాడు గట్టక ...
నీలా 1. 103

మూసికొను స. క్రి. (√మూయు) చుట్టుకొను

ఉ. .. పెఱవట్టుల వీయ లుపగ్రవృత్తిమై మూసికొనంగ వత్తు ..
భార. విరా. 5. 250.

మూసికముసికి. విశే. (√ మూయు) అప్రయోజకుఁడు.

సీ మూసినముసికి నిర్భాగ్యహ స్వామిద్రోహి దుష్టు రోఁతమారి కోనశారి ...
హంస. 5. 113.

## మృ

మృగగామిని. సం వి. ఈ. స్త్రీ వాయువిడంగము (వృ. వి ) (రా. వి ).

మృగజీవనుఁడు. సం. విశే. (అ అ. అ ) వేఁటకాఁడు, బోయవాఁడు.

మృగణ సం వి అ. స్త్రీ. వెదకుట పరిశీలించుట.

మృగతృషము. (తృట్టు) ష్ స్త్రీ. ఎండమావులు, మరీచిక.

మృగతృష్ణ సం. వి అ. స్త్రీ. మరీచిక, ఎండమావులు.

మృగదంశకము. సం. వి. అ. పుం. శునకము, కుక్క.

మృగదంశము. సం. వి. అ. పుం. శునకము, కుక్క.

మృగదృశ + (దృశ్కు). సం. వి శ్. స్త్రీ. మృగాక్షి, లేడిచూపులు గల స్త్రీ

మృగధరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

మృగధూర్తము. సం. వి. అ పుం నక్క

మృగనయన. సం. వి ఆ. స్త్రీ. మృగాక్షి, లేడి కన్నులుగల స్త్రీ

మృగనాభి. సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి.

మృగనాభిజ సం. వి. అ. స్త్రీ. కస్తూరి.

మృగపతి సం. వి. ఇ. పుం. సింహము.

మృగపాలిక. సం. వి. అ. స్త్రీ. కస్తూరి మృగము.

మృగపిప్లువు సం. వి. ఉ పుం చంద్రుఁడు మృగలాంఛనుఁడు. (త్రి. వి )

మృగప్రియము. సం. వి. అ న కొండలమీఁదఁ బెరుగు గడ్డి.

మృగబంధిని సం. వి ఈ స్త్రీ జంతువులను బట్టుకొనెడి వల

మృగభక్ష. సం. వి. అ. స్త్రీ. జటామాంసి (వృ.వి ).

మృగమదము. సం. వి అ పుం. కస్తూరి.

మృగమదవాస. సం వి ఆ. స్త్రీ. కస్తూరి. మల్లిక, ఒకజాతి యడవిమల్లె.

మృగము. సం వి అ. పుం 1 (అ)చతుష్పాజ్జంతువు, నాలుగుకాళ్ల జంతువు 2. లేడి. 3 వేఁటాడఁ దగినజంతువు. 4. కస్తూరి. 5 అన్వేషణము, వెదకుట. 6 విమర్శనము, పరిశోధించుట 7. అడుగుట, వేఁడుట. 8 ఒకజాతి యేనుఁగు. 9 పురుషులలో నొకజాతి. 10. మృగశీర్ష నక్షత్రము 11. శాకద్వీపమున నొక దేశభాగము

మృగయ. సం. వి. అ స్త్రీ. వేఁట

మృగయువు. సం వి. ఉ. పుం 1. నక్క, జంబుకము 2. బ్రహ్మ, 3. బోయ, వేఁటకాఁడు,

మృగరాజము సం. వి. అ. పుం. 1 సింహము, 2 సింహరాశి 3. పెద్దపులి.

మృగరిపువు సం వి. ఉ పుం సింహము.

శ్లో తుల్యార్థాః కథితా హరిర్మృగపతిః పంచాననః కేసరీ, హర్యక్షో నఖరాయుధో మృగరిపుః సింహాశ్చ కంఠీరవః ..
హలా ని 2 59.

మృగరోమజము. సం వి. అ. న ఉన్నెబట్ట, రాంకవము.

మృగరోమము సం వి న్ న. ఉన్నె

మృగలక్ష్మకుఁడు. సం వి. అ పుం. బుధుఁడు, గ్రహములలో నొకఁడు

మృగలాంఛనుఁడు సం. వి అ పుం చంద్రుడు

మృగలోచన. సం. వి ఆ స్త్రీ లేడికన్నులవంటి కన్నులు గల స్త్రీ.

మృగవధాజీవుఁడు సం వి అ పుం. వేఁటకాఁడు

మృగవల్లభము. సం. వి. అ న. కుందురుతృణము, కుందురు (వ్య. వి.).

మృగవాహనుఁడు. సం వి అ పుం జింకరౌతు, వాయువు

మృగవ్యము. సం వి అ న, వేఁట, ఆఖేటము

మృగవ్యాధము. సం. వి. అ, పుం, ఒకానొక నక్షత్రము

మృగశిరము. సం. వి న్ న. మృగశీర్ష నక్షత్రము.

మృగశీర్షకము. సం వి. అ పుం అభినయ హస్త విశేషము (శ. ర)

మృగశీర్షము సం వి అ న. ఒకానొక నక్షత్రము.

మృగశ్రేష్ఠము. సం వి. అ పుం. పెద్దపులి

మృగాంకము సం. వి. అ. పుం కర్పూరము,

మృగాంకుఁడు సం. వి అ. పుం. 1. మృగలాంఛనుఁడు, చంద్రుఁడు.

2. మృగవాహనుఁడు, వాయువు

మృగాంగన. సం వి ఆ స్త్రీ ఆఁడుజింక

మృగాండజ. సం వి ఆ స్త్రీ కస్తూరి

మృగాంతకము సం = మృగాదము

మృగాక్షి సం వి ఈ స్త్రీ. లేడికన్నులవంటి కన్నులు గల స్త్రీ

మృగాజినము సం వి. అ న కృష్ణాజినము, లేడిచర్మము

మృగాజీవము సం వి అ పుం సివంగి, తరుసు (శ ర).

మృగాయువుఁడు సం వి అ పుం. బోయవాఁడు (శ. ర).

మృగాదనము. సం వి అ పుం తరుసు సివంగి.

మృగారాతి. సం వి ఇ పుం 1 సింహము. 2. కుక్క

మృగావిత్తు. సం విశ (థ్) వేఁటకాఁడు.

మృగాశనము. సం. వి. అ. పుం సింహము.

మృగాస్యము. సం వి. అ పుం సింహరాశి.

మృగి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడులేడి

మృగితము సం. విశ. (అ ఆ. అ) 1. వెదకఁబడినది 2 యాచింపఁబడినది.

మృగీదృక్కు. సం. వి. శ్. స్త్రీ ఆఁడులేడి చూపులు గల స్త్రీ

మృగేంద్రచటకము. సం. వి. అ పుం. డేగ, శ్యేనము.

మృగేంద్రము. సం. వి. అ. పుం. 1. సింహము 2 పెద్దపులి. 3 సింహరాశి.

మృగేంద్రాసనము. సం వి. అ. న. సింహాసనము.

మృగేష్టము. సం. వి. అ. పుం. ఒకజాతిమల్లె, ముద్గరము (వ్య వి) (రా. ని).

మృగోర్వారుపు నం. వి ఈ. పుం. బుడము (న్ని ప) (శ ర.).

మృగ్యము నం విశే. (అ. ఆ. అ) వెదకఁదగినది, పరిశీలింపఁదగినది, విమర్శింపఁదగినది.

మృచ్ఛకటిక నం వి ఆ స్త్రీ. శూద్రకకవి రచించిన యొక నాటకము.

మృజ నం వి ఆ స్త్రీ 1. శుభ్రపఱుచుట, పవిత్రముచేయుట 2 శుద్ధి, శుభ్రత, పవిత్రత.

మృజము నం. వి. అ పుం. వాద్యవిశేషము

మృడాని నం వి ఈ. స్త్రీ. పార్వతి.

మృడీకము నం వి అ పుం. లేడి.

మృడుఁడు నం వి అ పుం శివుఁడు.

మృణాలము నం. వి అ. పుం న. తామర తూఁడు, బిసము.

వ వీరణమూలము, వట్టివేరు. (మే ని.)

మృణాలసూత్రము. నం. వి అ, న. తామర కాడలోని దారము

మృణాలి నం వి ఈ. స్త్రీ. మృణాలము.

మృణాలిని నం వి. ఈ స్త్రీ 1. పద్మలత, తామరతీగ 2 పద్మసమూహము. 3. పద్మములతో నిండినచోటు, పద్మముల ప్రదేశము.

మృతండుఁడు నం వి. అ పుం. సూర్యుఁడు.

మృతకము. నం వి. అ పుం. న. శవము, పీనుఁగు. వి అ న. 1. మృతాశౌచము. 2. మృతి. చావు.

మృతకల్పుఁడు నం. విశే. (అ. ఆ. అ) మృతప్రాయుఁడు, చచ్చినవాని వంటివాఁడు.

మృతకాంతకము నం. వి. అ. పుం. జంబుకము. నక్క.

మృతజీవము. నం వి. అ పుం. తిలకవృక్షము. (రా ని.).

మృతపుఁడు. నం. వి. అ పుం. మాదిగవాఁడు.

మృతప్రాయుఁడు. నం విశే (అ ఆ. అ.) చచ్చినవానితోఁ దుల్యుఁడు.

మృతమత్తము. నం. వి. అ పుం జంబుకము, నక్క (త్రి. ని).

మృతము నం. విశే. (అ. ఆ. అ) 1 చచ్చినది, మృతిఁబొందినది 2 మృతతుల్యము. చచ్చినవానితో సమానమైనది, నిరుపయోగమైనది. 3 భస్మము చేయఁబడినది,

వి. అ. న 1. మృతి, చావు. 2 భిక్ష, యాచనవలన సంపాదింపఁబడిన యాహారము (చూ — అమృతము)

మృతసంజీవనము. నం. విశే. (అ. ఆ. అ.), చచ్చినవానిని బ్రదికించునది (కరణము)

వి అ. న. చచ్చినవానిని మరల బ్రదికించుట.

మృతసంజీవని నం. వి. ఈ. స్త్రీ. 1. చచ్చినవానిని బ్రదికించుట. 2 చచ్చినవానిని బ్రదికించెడి యమృతము 3 ఒకానొక విద్య (దీనిని శుక్రుఁడు కచున కుపదేశించెను.)

మృతాంగము. నం వి అ న శవము,

మృణాలకము నం. వి అ. న ఒకజాతి రేగడిమన్ను, తొగరిమన్ను

మృతి. నం. వి ఇ. స్త్రీ మరణము చావు

మృత్కాంస్యము. నం వి. అ. న. మంటిపాత్ర. (త్రి ని.)

మృత్కిర నం వి ఆ. స్త్రీ. వానపాము, ఎఱ్ఱ.

మృత్తాలకము నం. వి. అ పుం 1 తొగరి (వై.ని.) 2. తొగరిమన్ను. 3. అడవితొగరి తీగ (శ ర.).

మృత్తిక. నం. వి. ఆ . స్త్రీ. మన్ను.

మృత్తు. నం. వి. ద్. స్త్రీ. మన్ను, మృత్తిక.

మృత్యుంజయుఁడు. నం. వి అ. పుం శివుఁడు.

మృత్యునాశకము. నం. వి. అ. పుం. పాదరసము.

మృత్యునాశనము. సం. వి. అ. న. అమృతము.

మృత్యుపాశము. సం. వి. అ. పుం. యమపాశము.

మృత్యుపుష్పము సం. వి. అ. పుం. చెఱకు, ఇఱువు (వృ. వి).

మృత్యుఫలము. సం. వి. అ. న. ఒకదినుసు పిచ్చిపృథము

మృత్యుఫలి. సం. వి. ఈ. స్త్రీ. కదళీవృక్షము. అరఁటిచెట్టు

మృత్యుబీజము సం. వి. అ. పుం. వెదురు (వృ. వి)

మృత్యుభృత్యము. సం. వి. అ. పుం. రోగము, జబ్బు

మృత్యులోకము. సం. వి. అ. పుం. యమలోకము పితృలోకము.

మృత్యువంచనము. సం. వి. అ. పుం. 1 కాకోలము. మాలకాకి. 2 బిల్వము, మారేడు (వృ. వి.).

మృత్యువంచనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

మృత్యువు సం. వి. ఉ. పుం. 1. యముఁడు 2. బ్రహ్మ 3. విష్ణువు. 4. మాయ. 5 మన్మథుఁడు కామదేవుఁడు.

స్త్రీ వు. మరణము. చావు.

మృత్యుసూతి. సం. వి. ఇ. స్త్రీ. ఆఁడుపీత

మృత్స. సం. వి. అ. స్త్రీ. మంచిమన్ను.

మృత్స్న సం. మృత్స

మృద సం. వి. అ స్త్రీ. మృత్తు.

మృదంకురము. సం. వి. అ పుం. హారీతపక్షి, పచ్చపిట్ట.

మృదంగఫలము. సం. వి అ పుం. పనసచెట్టు.

మృదంగము. 1. మద్దెల. 2. వెదురు (వృ. వి.) 3 ధ్వని, శబ్దము.

మృదాకరము. సం. వి. అ. పుం. అశని, పిడుగు.

మృదితము సం. విశే. (అ. అ. అ) 1. నొక్కఁబడినది 2. చూర్ణముగాఁ జేయఁబడినది.

మృదిని సం. వి. ఈ. స్త్రీ. మంచిమన్ను

మృదుకర్ణాయసము సం. వి. అ. న. సీసము

మృదుగమన. సం. వి. అ. స్త్రీ హంసాంగన ఆఁడుహంస

మృదుచర్మి. సం. వి. న్ పుం. భూర్జవృక్షము, బుజపత్తిరి (వాచ.).

మృదుచ్ఛదము. సం. వి. అ. పుం మృదుచర్మి.

మృదుత్వక్కు. సం. వి. చ్. పుం. మృదుచర్మి

మృదుచ్ఛకము సం వి అ న. ఒంగారము.

మృదుపత్త్రము సం. వి. అ. పుం. నలదము (వృ. వి)

మృదుపర్వకము. సం. వి అ. పుం పేము, వేత్రము (వృ. వి.).

మృదుపుష్పము సం వి అ పుం. శిరీషవృక్షము, దిరిసెనచెట్టు

మృదుఫలము. సం వి అ. న 1 వికంకతమనుచెట్టు, 2. మధునారికేలము (వృ. వి)

మృదుభాషి. సం. విశే. (న్. ణీ న్.) 1. మెల్లఁగా మాటలాడువాఁడు 2. తియ్యని మాటలు చెప్పువాఁడు.

మృదురోమము. సం వి న్ పుం. శశము, కుందేలు

మృదులము. సం. విశే. (అ. అ. అ) మృదువైనది, నున్నది, లేఁతది, సుకుమారమైనది, వి అ. న. జలము, నీరు.

మృదువర్గము. సం వి. అ. పుం. అనూరాధా మృగశీర్షా చిత్రా రేవతీ నక్షత్రముల సమూహము.

మృదువు సం. విశే. (ఉ. ద్వి. ఉ ఉ)

1. మెత్తనిది 2. సౌమ్యమైనది. మంచిది.

వి ఉ పుం. శనిగ్రహము, మందుఁడు.

**మృద్గము** సం. వి. అ. పుం. ఒకజాతి చేప

**మృద్గర్భము** సం. వి అ. పుం ఇంద్రనీల రత్న దోషము.

ఉ విదితముగ నీలమణిలో, మృదు వగుమ న్నున్న నదియు మృద్గర్భ మగున్, ముదమున ఖూనిన మానవు, దుగర ప్రాణంబుబాధ నొందుచు నుండున్ .. రత్న. 60.

**మృద్వి** సం వి. ఈ. స్త్రీ ద్రాక్ష.

**మృద్వీక** సం వి. అ. స్త్రీ. మృద్విక (వ్యు. వి)

**మృధము** సం. వి. అ. న యుద్ధము, పోరు.

**మృష** సం. అవ్య. అసత్యము.

శా. జాతుల్ సెప్పుట సేవ సేయుట మృషల్ సంధించు టన్యాయ విఖ్యాతిం బొందుట కొండెకాడవుట .. కాశీ .ఖ. 100.

**మృషాధ్మాయి.** సం. వి. న్. పుం ఒక విశేషము, ఒకజాతి కొంగ.

**మృషాలకము** సం వి. అ. పుం. మామిడిచెట్టు.

**మృషోద్యము.** సం వి. అ న అసత్యము చెప్పుట, కల్లలాడుట, అసత్యకథనము.

**మృష్టము** సం. విశే (అ. ఆ అ.) పవిత్రమైనది. శుభ్రమైనది.

వి. అ న మిరియము

**మృష్టేరుకుఁడు** సం విశే (అ ఆ. అ) 1 భోగ్యపదార్థములు తినెడివాఁడు. భోగియైన వాఁడు, విలాస యుక్తుఁడైనవాఁడు. 2 అతిథి ద్వేష్టు, కొ దాత, ఈవి గలవాఁడు.

## మె

**మెంచే.** వి. (సం. మ్లేచ్ఛః. పా. మిలిచ్ఛో.) మ్లేచ్ఛుఁడు.

సీ. . . మెంచ యనంగను మ్లేచ్ఛుఁ డొప్పు .... ఆం. భా. 2. 290.

**మెండాడు** అ. క్రి. (మెండు + ఆడు) సంచరించు, తిమ్మరు.

సీ విటుఁడై మెండాడు వీధుల జంతల వెనుగాటు కలకవప్పు తెరనెఁ గాక . కవిక. 4. 90.

**మెండియ(డె)ము.** వి చూపుడువ్రేలను ధరించెడి యుంగరము, తర్జన్యాభరణము.

కం. మెండియపువ్రేల వెండియు, మెండినికిఁ బొరుగు వ్రేల మేలిమిపసిఁడిన్, గొండొకవ్రేల జలంబును, నుండంగా వలయు బ్రాహ్మణోత్తము చేతన్. విజ్ఞా 1 77.

జ మెండీఁడు

**మెండీఁడు.** వి (మెండెము+ఈఁడు) చూపుడు వ్రేలు. తర్జని, ప్రదేశిని

కం మెండియపువ్రేల వెండియు, మెండినికిఁ బొరుగు వ్రేల మేలిమిపసిఁడిన్, గొండొకవ్రేల జలంబును నుండంగా వలయు బ్రాహ్మణోత్తముచేతన్ విజ్ఞా 1. 77.

విశే. మార్గదర్శకుఁడు

ద్వి. మిండలు మిండలు మెలఁతల వరయ, మెండీలు మెండీలు దుండగింపంగ .. పండితా. పర్వ. 858 పా

**మెండు.** వి 1 ఆధిక్యము

సీ. కొట్టివైచినతల లుట్టలై కాటుకకొండల దండిని మెండుసూప .. దశా. 6 137

ఐ. కోమలతరతమాల మాలాకార శాఖోటవిట పిసండంబుల మెండును ... భీమ. 3 57 లా. 2. 64, ఆం. భా 3. 24.

2 అతిశయము.

వ. మిటిమిటం గాయుదట్టంపుఁ బండువెన్నెల మెండున బెండువడి డెందంబు గంది తాలిమి చిందువందై కెందలిరు పాన్పునందమునొందక .. మనుచ 3. 28

వ ... ఎండ మెండునం బెండుపడకుండ గడితంపు పచ్చడంబు ఉల్లెడల వడుపునం బట్టువాఁడను... శుక 2. 10.

3. ఉద్ధతి. మిడిసిపాటు

ద్వి. దండకాటనిఁ జొచ్చి దశకంధరుండు, మెండు వంగొనిపోయెను మేదినీసుతను ...
రం. రా. ఉ 120 పా. 18 పం.

4. విధము, రీతి.

గీ. చండకాతోత్థభూరజో హిండనమునఁ, గొండ మెండునఁ గదలక యుండుదైత్య, మండ లేంద్రునిదేహము ... దశా. 4 26.

వ ... పుట్టచెండు మెండున మిక్కుటంబుగఁ బుటంబు లెగయ నిజేచ్ఛం జనుహాయంబులు ...
చంద్ర. 2. 64

వ. ఇత్తెఱంగున నక్కార్తవీర్య ద్విర్యవర్యులు .. అథంగురప్రళయకాల మార్తాండ మండల ద్వితయంబు మెండున ... ఉ. రా 3 246.

5. మిట్టు, ఉన్నతభూమి.

గీ. మెట్ట యన మిట్టు నాఁగను మెండు నాఁగఁ దోఁచు నుత్తాననామంబు ...
అం. భా. 1. 158

6. మెలి. (చూ. మెండువెట్టు.) విణ అధికము, మిక్కుటము, అధికుఁడు, గొప్పవాఁడు.

వ. ... గగనమణి గాయునీరెండ మెండగనం బరగు ... ఆము. 6 98.

కం. మండలపతి సముఖంబున, మెండైనప్రధాని లేక మెలఁగుట యెల్లన్, గొండంతమదపుసేనుఁగు, తొండము లేకుండినట్లు దోఁచుర సుమతీ...
సు. శ 88.

సీ. మిక్కిలి యెక్కువ మెండగ్గలము పెచ్చెరుగు నాఁగ నధికంబు దోఁచుచుండు ..
అం. భా. 2 24.

క్రి. విశ. అధికముగ, మిక్కుటముగ ...

సీ. నడిగొండచఱిదండ నడదండమున మెండ చరుగండకముగం డడంచె నొకఁడు ...
రా. వి. 3. 65.

ఇ మెండాడు, మెండుకొను, మెండుమీఱు, మెండువెట్టు, మెండొగ్గు, మెండొడ్డు, మెండోడు.

మెండుకొను. అ. క్రి (√మెండు) 1. అతిశయించు.

వ వెండియు మెండుకొనుశబ్దంబువలన శరదబ్దరుచిస్ఫూర్తియు నగుపురుషుండు సంభవించె...
వరాహ. 9. 115

కం. వెండియు దినదినమును దన,దండను వేదండయాన తరితీపునగల్, మెండుకొన నుండఁ గన్నుల, పండువుగాఁ జూచి కామపరవశుఁ డగుచున్. శశా. 2. 91

వ. భగ్గున నెగయునిజావయవతాపానలంబు డఁబున విడంబించు దగద్ధగితమార్తాండోపల కలితకీలికీలామాలికల చాయలవగిది మెండుకొని ..
చంద్రా. 2. 84

2. విజృంభించు.

ఆ నికుంభుఁ డంతఁ,బండమైవకాలదండంబుఁ దాల్చిన, దండధరుఁడపోలె మెండుకొనుచు .. భా. రా. యు. 1218.

3. (దిగ్భ్రమచెంది) ప్రోగుపడు.

సీ. బహుళకపిధ్వజప్రభలు లోచనములు మిఱుమిట్లుగొనఁ బర్వ మెండుకొనుచు ...

గీ. నడచు కౌరవరాజసైన్యంబుఁ గదిసె ... అర్జునుండు ... భారం. విరా. 4. 248

4. నిండుకొను, సమృద్ధమగు.

కం. రెండవప్రబంధము యజ్ఞం, కాండము లేదింటి యందుఁ గలయర్థములన్, మెండుకొని సఫలనొప్పుచు, నుండఁ గలదు ...
పంచ. 2. 233.

శా. ఆర్ద్రైతేయతనూజ నింగి వడఁగా హాస్యైక్యంబు పై నొక్కనాఁ, డేదిక్కుం జెలిపిండు మెండుకొనఁగా నేకాంతనిద్రారతిన్, మోదింపన్ ... ఉ. హరి. 5. 84

5. అధికమగు, దశ మెక్కు, చిక్కఁబడు

(వెన్నెల) వ. కుముదకాండ ప్రకాండకాండవిత పాండుపరాగమండలంబున మెండుకొనుచు.
వసు 4 23.

**మెండుమీఱు** అ. క్రి. (√ మెండు) అతిశయించు, మెండుకొను

గీ మెండుమీఱిన పగటిపేరెండ దాఁకి
ఆము 2. 56.

**మెండువెట్టు** స క్రి (√ మెండు) మెలివెట్టు, పెనవేయు.

గీ. పండచేలావుగల గట్టిపండువెదురు, తండముఁ గొమ్ముపంగల మెండువెట్టి, బెండు వోఱిచినకై వడిఁ బెనచి విఱుచుఁ, బోతరించిన దుప్పులప్పాలములోన ..
చంద్రా. 2. 61.

**మెండొగ్గు** అ క్రి. (√ మెండు) ఎదిరించు

ద్వి. కండక్రొవ్వున నమ్మఁ గైకొని రాక, మెండొగ్గెదవు మంచెమేలముల్ మాను ...
ద్వి. హరిశ్చ. ఉ. 894 పం

**మెండొడ్డు.** అ. క్రి. (√ మెండు.) 1. ఎదిరించు.
గీ. మించి మెండొడ్డ సాగె నమిత్త్రకులము ...
దశా. 2 51

సీ మాటికిమాటికి మగనితో మెండొడ్డి చలపాదితనమున నలగి యుండు ..
శశాం. 4. 82

2. చెప్పినదానికి వ్యతిరేకముగా వర్తించు

సీ తనమేధ చక్రభ్రాదంభసంభ్రమమున మెండొడ్డు కుండలిఁ గుండలించు ... బహు. 1 60.

గీ ఒరులు చెప్పినవెనుకఁ దా నొకటి చేసె, పనెడిమాటకు మెండొడ్డె ననఁగఁ దోఁచు ..
అం. భా. ✱ 108.

**మెండోడు** అ క్రి. (√ మెండు.) పాటిదప్పు.

ద్వి. దండనీతిక్రియల్ దానధర్మములు, మెండోడి చెడిపోవు మింతురు రిపులు ...
రం. రా. అయో. 128 పా. 22 పం.

**మెంతి** వి (సం మేథి, క. మెంతె, త. మెంతియమ్) 1 సస్యవిశేషము

ఉదా మెంతికూర.

సీ. మెంతి యనంగను మేంథినామము తగు . .
ఆం. భా. 2. 236.

2. మెంతులతోఁ జేయఁబడిన యొకవిధ మగుతాలింపు వస్తువు

ఉదా , మెంతిపెరుఁగు, మెంతికాయ మొ.

3 మెంతులు ధాన్య విశేషము

**మెంపు.** అ. క్రి. ఎదురేఁగు, ఎదురుగా వచ్చు.

వ. .. లేఁగదూడలకు మెంపుచు గుంపులై యఱ్ఱు లెత్తి యంబే యని యఱచుచు జిఱ్ఱజిఱ్ఱన నఱ్ఱాడుధేనువులఁ బేరుపేరం బిలుచువారును . వి. పు 7. 147.

**మెకపుటాము** వి (మెకము + ఆము) మృగమదము, కస్తూరి

గీ. మేలిగొజ్జంగిపూనీట మెకపుటాము, గలిపి బలురాచతెరువులఁ గ్రంతలందుఁ, జిలికి ..
అచ్చ. రా అయో

**మెకము** = **మెగము** వి. (సం. మృగః. ప్రామిడీ) 1. నాలుగుకాళ్ళ జంతువు చతుష్పాజ్జంతువు.

కం. చెలువునడు మనిసివను బెను, వెల మెకములు పెదరినను వివేకనిధి యుక్కఱి బహుశైన్య మఱిముట్టిఁ, బఱచిన నాఁగంగ రాదు బలియుఁడై నన్.
భార. శాం. 3. 16.

కం కాన మెకా అని యమగతితో వావేఁట మునియుగము ద్రుంగించెఁ దుదన్ ...
రాఘవ 1 25

2 జింక, కురంగము

ఆ కాంతలారఁ మెకము గన్నదిమొ యగా, నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన, గోఁచి బిగియఁ గట్టుకొనిన యావడుగని, మర్త్తికాని

మ . ...ట్టాపికుట్టాకుగో, గి ము శ్లోకి .. ..
అము 4 134.

ఆ మెంచెం దినియెం గుడిచె మెక్కి లో సేసెను, సమలె నాడిగించె నా భుజించె, ననుచు కాశ్య గుచు నలరారుచుండును ...
ఆం. భా. 8. 118.

కం. అనయంబు నడిచి వెలిది, య్యలిపండులు మెక్కి చొక్కి యక్కజపుశిగి, స్వైరుమిసుకులు నక్కొనలుం, గొనకొని యెలుంగించు మరుని గుజ్జుపుం దుటుముల్
అవ్వ రా. బాల. 118

సీ. ఫలమూలములు దిని బ్రదుకు మర్కటులకు మేలోగిరంబులు మెక్కం గలిగె ...
ఉ రా 5 278.

**మెక్కొను** అ. క్రి కలుగు, సంభవించు

చం. కని హృదయంబు ఝల్లుమన ఘల్లుమనంగం బదాంగదంబు దిగ్గన వెస లేచి లేనడయొయ్యారముతోం దెరచాటుం జేరెం గా, మిని చెలికత్తె తత్తరము మెక్కొన గద్దియం దెచ్చి యుంప నుంచినతమి వందుమీంద నివసించె ధరావరుం డాదరాత్ముండై.
కువల. 3 58.

**మెగము** = మెకము. వి (సం. మృగః, ప్రా. మిడీ) (లేడి)

గీ ... రఘురాముం డచట మాయ, మెగము వధియించి కైకొని వగలు వొడువు, నంత రంగంబుతో నేంగె ...
భా రా. అర. 2 63.

(క్రూర జంతువు)

సీ కానరే యే మైనం గని మెగాల్ దినియెనో కానరే యని వేటకాండ్ర నడుగు ...
సారంగ. 3. 231.

సీ ఆది నిండు చలివెలుంగా కాదు మబ్బు చేసుంగుం దోలు తెఅనోటి మెగము గాని.
వే. పంచ. 4. 283.

(తెఅనోటి మెగము = సింహము)

**మెచ్చించు** స. క్రి. (√మెచ్చు.) 1 మెచ్చునట్లు చేయు, శ్లాఘింపం జేయు

ద్వి చెచ్చెర దేవరచిత్తంబు వడసి, మెచ్చించు వాండ నమ్మికం బాపు మనుండు ...
రం రా యు. 312 పా 11 పం

కం. . సంగ్రామాచలమున నిదె నను మెచ్చించెద వే నఘడు నిన్ను నేశా సందున్.
హం. 7.63

ద్వి. మెచ్చించె శివదేవు మీ రొక్కమాట. కిచ్చ నవ్వుట సాలదే నన్ను మనువ .
బస. పు. ౬. 908 పం

2 సంతోషపెట్టు

సీ. వ్రేల్మిడిం జాణూరు విఱిచి లోకముల మెప్పించినట్టి యాజగజెట్టి యితండె ..
భార. ఉద్యో. 3. 175

శా నీతోడ్పాటున నేం ద్రివిష్టపముల గ్గెల్వంగ నూంకింతు నా, చేతం గర్ణుండు రూపుమాలి చను మెచ్చింతున్ నిను జూడుమీ ...
భార. కర్ణ. 3. 130

సీ. ... ఇటమీంద బరమేశ్వరుండు తండ్రి గాకున్న జన్మంబుకసటు వోదు ..

గీ. తగవు మెచ్చ కద్దేవుండు తండ్రి గాండు. గాన మెచ్చింతుం దపముచేం గానలోన ...
ఉ. హరి 5 6.

శా .. దైవత, శ్రేష్ఠున్ విష్ణుని బ్రహ్మపార నుతి మెచ్చించెన్ సముద్యత్తపో, నిష్ఠాత్మ ప్రవరుండితండు ఎరాహ 1 1.7.

**మెచ్చు** స. క్రి. (క. త మెచ్చు) 1 శ్లాఘించు. పొగడు.

మ. రమణీ! పుత్రుల కర్థి నే నిడనవిక్రాంతాభి నామంబు లెల్ల మనెన్ మెచ్చవు నీవు రాజతనయాలంకారముల్ గ వాక్షో
మార్క 3. 107.

గీ. దిట్టతనమున బిచ్చేము దేహి యనుచే, వాడవాడల భిక్షించేకూడుగాని. యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు ..
హర. 5. 16

మ .. భావోదయ, స్ఫుటభేదంబు లెఱింగి తద్రసగతుల్ శోధించి యచ్చంపు మె, చ్చుటకున్ దావల మై చతుర్యపతి సంతో భిల్లు నెల్లప్పుడున్ ...
కావ్యా 3 138

2 గారవించు

వ కల్మాషపాదుండు శక్తి యనుమహామునిం గని తెరువు దొలంగు మని రాజాభిమానం బున మెచ్చక పలికిన
భార. ఆది 7 110.

ఉ. ఎక్కుడుమోహదృష్టి తిర నిచ్చఁ దలంపక వచ్చి వేఁడినం, జక్కనివాఁడు కాఁ డనుచు జక్కెరవిల్తుని మెచ్చ రన్నచో
దశా 1 90.

3, లక్ష్యపెట్టు, సరకుసేయు

ఆ. ప్రొద్దు నేఁడు పెద్ద వోయె నిత్యము నిటం తెచ్చి యిచ్చుబలియుఁ దెచ్చి యీఁగ, నొల్ల కెలుఁగు లిచ్చుచున్నవాఁ డమ్మను, జాధముండు మెచ్చఁ డయ్యె ననుచు.
భార. ఆది 6. 290

సీ. మెచ్చక యెదురైనమృత్యువు మెడ ద్రొక్కి క్రొవ్వాఁడి కోఱలు ద్రెవ్వ శాచి .
నృసిం. 2. 119.

కం. గుజ్జములపరువు మెచ్చని,నజ్జులఁ గట్టిన రథంబు . భాగ. 10. పూ 894.
మనుచ 1 50.

4 గణించు, లెక్క వేసి చెప్పు.

మ, కనియెం బ్రస్ఫుటసర్వ లక్షణకుభాకారుం గుమారాగ్రణిన్, జనిలగ్నగ్రహచార సంప దలు మెచ్చం బంచె దైవజ్ఞులన్ ...
కకు 4 35.

అ క్రి. సంతోషించు, ప్రియపడు

ఉ. దుర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహో దరవీరులుఁ దానుఁ జూచి లక్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్ ...
భార సభా. 2 162.

గీ ధర్మపరులు వరాటికా దానమాత్ర, లాభమున కైన మెత్తు రుల్లములలోన ..
వైష 2. 77.

గీ వదలి శౌర్యంబు విద్యలవానికిరణి, నింద్ర జాలంబు పన్నెదవే బలీంద్ర, యిదిగో వజ్రంబు మెచ్చి యిచ్చెదను గొనుము .
దశా 2. 408

వి. 1 శ్లాఘ, పొగడ్త.

కం. నొచ్చియుఁ జెనఁగినఁ గృపయును, మెచ్చుఁ గదిరి విప్రుతోడ మెయిగొని పోరి, ట్లచ్చుపడ నేఁటి కని విస్మయచ్చుఁడు గ్రేడించి యొండువలనికి నడచెన్
భార. భీష్మ 2. 307.

మ. ... దేవి యగ్గలికం బెద్ద పెనంగి డస్సి తిటు లింకం జాలు ని ల్మంచు మెచ్చులు దోడ్తోడ మనంబునం బ్రియము లై సొంపారఁ బ్రేమంబునన్ హరి. ఉ 4. 159.

చం. పఱ పగునారికేళవనపంక్తులు మామిడి తోఁపులుం గడున్, మెఱయుచు నాత్మకు న్ముదము మెచ్చును నచ్చెరువున్ ఘటింపఁ గన్ ..
కళా. 2 134.

సీ. కాంతిసంపద నిశాకరుతోడ నొరసిన మెచ్చు మీఱఁగ నొర పచ్చువాఁడు ...
దశకు 1 75.

సీ. ఇచ్చ నెచ్చినకోర్కు లిచ్చు మెచ్చులచెట్టు... సమీర. 6. 80. ఆం భా, 1. 111.

2. శ్లాఘించువాఁడు. ఒట్టు,

ఉ. క్రచ్చులఁ బారిజాతలతికావనదేవత జంభ వైరిపై, మచ్చికఁ గూర్పఁగా నవసుమప్రకరం బుల వేల్పుఁచేటిలో, విచ్చినపైఁడితామరల

మున ) శ్లాఘించు.

గీ అట్టు లరుగుదెంచినట్టియచ్యుతునకు, నతుల గతుల నతులు నుతులుచేసి, యభిషిక్త నున్న క్షితితలపతిభృతి, మతిని మెచ్చికొనుచు మౌను లనిరి

దశా. 1 171

**మెచ్చుగొల్పు.** స. క్రి. (√మెచ్చుకొను) మెచ్చు కొనఁజేయు, మెప్పించు

శా సందర్భంబు నవార్థగర్భ మగుచుం జాటు క్రియన్ మించఁగాఁ, జిందుల్ ద్రొక్కుచు నిండి యంతట రసశ్రీ మెచ్చుగొల్పఁగ నా, నందాంభోధి తరంగముల్ వెలెఁ బ్రబంధంబుల్ భువి న్నిల్పి వాల్మీ 1 12

**మెచ్చులాఁడి** వి. (మెచ్చులు + ఆఁడి) మెచ్చు కొనఁదగిన స్త్రీ.

సీ ఒఱపుఁజూపులఁ గాంచనోత్తరీయము లకు మీనంచు వ్రాయునే మెచ్చులాఁడి.

కకు 1. 2.

వ నిలింపనతికొలువు వెలచెలువుల చెలువంబులు మెచ్చని మెచ్చులాఁడులు.

ఉ రా 5 249.

విశ. మెచ్చుకొనఁదగినది (శ ం)

**మెచ్చులాఁడు** విశ. (మెచ్చులు[1] + ఆఁడు) మెచ్చుకొనఁ దగినవాఁడు (శ.)

**మెచ్చులుసేయు** అ. క్రి (మెచ్చులు[1] + చేయు) సంతోషము కలిగించు

వ మెచ్చుపెరుగు నచ్చపుఁబచ్చల చాయలు మెచ్చులుసేయఁ బచ్చికల మ ...ల విచ్చల విడిఁగ్రచ్చుకొని మెసవ ను ...చు నంకిపు రాజికి.

...సు. 3 11.

**మెచ్చుపచ్చు.** అ. క్రి (√మెచ్చు[1]) స్తుత్య మగు, శ్లాఘాపాత్రమగు.

గీ అంత నద్దశకంధరుం డంతలోనఁ, దెలిసి హాను మంతుఁ జూచి నీబలము మెచ్చు, వచ్చె నీకు బ్రేటునఁ బంక్తివదనుఁ డమఁ, వై ...ప్రేత

లోకముఁజూచి వచ్చె నౌర

భా రా యు 82.

మత్తకోకిల. మెచ్చువచ్చుకడాని బంగరు మేటి మంచముమీఁదఁబన్, హెచ్చుపట్టుపూఁబాన్పు పైఁ బడి యెంతయుక్ విరహార్తితోన్

ఇంను. 8. 9.

**మెచ్చువడు** అ. క్రి (మెచ్చు[1] + పడు) మెచ్చు వడు శ్లాఘనొందు.

చం ... పరిపూర్ణవిలాసము లద్భుతంబుగా, సు నుల కెల్ల మెచ్చువడఁ జూపి వరంబు లొసంగి వి త్తమున్, నిజముగ సంగ్రహించి యట నేను కుబేరున కప్పుడిచ్చితిన్. వె. మా. 5 ...

**మెటిక[1] (కె)** వి. అంగుళిపర్వము, వ్రేలిగనుపు

కం చెలువుఁడు మాఱాడిన మెటికలు పెళ్లున విఱిచి తిట్టి కనలుచు నింతింతలు గాకుండం బోడిచిన, కలహప్రియురాలు దీనిఁ గంటె సుధీంద్రా.

సానందో. 5. 198

సీ. పినతల్లి మెటికలు పెళ్లున విఱుచును నన్న దమ్ములు చూడ రతులకరణ ...

హంస 3 150

జ. మెటికవిఱుచు

**మెటిక[2] = మెట్టిక** వి. సోపానము

సీ మెటిక మె ట్టనఁగను మెఱయు సోపా నంబు... ఆ భా. 2. 22

**మెటికవిఱుచు.** స క్రి. (మెటిక[1] + విఱుచు) ఏవగించు.

కం. అని మగని మెటికవిఱుచుచుఁ, జనుదెంచిన యతిథికోటి సంబంధిజనుల్, వినఁ దిట్టి శాపె కుడుచుచు, నవయంబును రిట్టినింద కలుకక యుండెన్.

శేష. 1 95

**మెట్ట.** వి (క. మిట్టు) 1 కొండ, పర్వతము.

ద్వి. వట్టియాకులు గాలివడిఁ దూలుఁ గాక, మెట్టలు దూలునే మేటిగాడ్పునకు

బ పు. 7.571 పం.

చం॥ జలవిధులైన మెట్టలగు శైలములైన నడఁగు నవ్విధియ, త్తలమయినం దలంబ యగు ..
హరి పూ 1. 117.

సీ చిన్నారి జాబిల్లి సేస(క్రొ)వ్వెదపువ్వు మెట్ట రాచ బిడారు పట్టినిల్లు . రసిక. 1. 2
ఆం భా 2 27

౭ సిరుతేనిభూమి

గీ మెట్ట మెరక యనఁగను మెఱయుచుండు. స్థలికి స ప్లులు . ఆం. భా 2 5.

సీ విషరాశివిష మానువిషధరంబుల రోసి మెట్టకు నరుగు(క్రొ)మ్మెఱుఁగు లనఁగ .
దశా 2. 238.

౮ పాదము, కాలు

గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టువాలు, బిట్టు గాలుపసిండి(క్రొం)బట్టు పేలు, మెట్ట జాలు మొగిల్పన మెట్టఁజాలు, నట్టిడాలును గల జెగ జెట్టిఁ దలఁతు. అచ్చ. రా. బాల 3

గీ. మెట్టదమ్ముల వందియల్ బిట్టు మొరయ, దిట్టతనమునఁ జెలరేఁగి పట్టపగలె, నెట్టుకొని యెల్ల(వే)తలనట్టులందు, గుట్టు లరయుచు మెలఁగు నప్పట్టి మఱియు. నిరా. 1. 75.

విశే. ఉన్నతము, ఉత్తానము (జలప్రదేశము).

గీ. మెట్ట యన మిట్ట నాఁగను మెండు నాఁగఁ దోఁచు నుత్తాననామంబు ..
ఆం. భా. 1 158.

౹ మెట్టకెందమ్మి, మెట్టచెంగల్వ, మెట్టజీలుగు, మెట్టతమ్మి, మెట్టతామర, మెట్టపంట, మెట్ట వాల్పిట్ట . మెట్టాడు

**మెట్టకెందమ్మి** వి (మెట్ట + కెందమ్మి) మెట్ట నేలఁ బుట్టెడి యెఱ్ఱదామర (వృ. వి.), దాని పూవు

వ. .. కలిగొట్టుచెట్టులపట్టున నిట్టలంబుగాఁ బుట్టుమెట్టకెందమ్ములకు .. ఉ. రా. 6 24.

**మెట్టచెంగల్వ** వి. (√మెట్ట) మెట్టనేల మొల చెడి యెఱ్ఱగలువ

గీ మెట్టచెంగల్వపువ్వాడుల్ మెట్టి మెలఁగు, చలువతెమ్మెర యమ్మేటి(శ్ర)మము మాన్చె
ఉ. రా. 4 167

**మెట్టజీలుఁగు.** వి (√మెట్ట) సస్యవిశేషము.
ద్వి మెట్టజీలుగుమేలు మెట్టపాలయ్యె ..
(విష్ణు. పూ 8 ౪ ర.

**మెట్టత(ద)మ్మి** వి. (√మెట్ట) మెట్టనేలఁ బుట్టెడి. తామర (వృ వి), స్థలపద్మము.

గీ. నిలుతు రొకచోట మెట్టతమ్ములు జనింప
ఉ రా 1. 170

సీ ఇది చెల్వ చెల్వంబు గదిసి పైఁబడ మూఁడి మేను తేర్చినకమ్మ మెట్టదమ్మి ..
రా. వి. 4 14.

గీ తెలిమెట్టదమ్ముల వెలిఁబెట్టఁగాఁ జాలు(శ్ర)వణాంతకాంతనేత్రములవాని .. దశా 8 27.

**మెట్టతా(దా)మర** స్త్రీ. (√మెట్ట) స్థలపద్మిని (వృ వి.), స్థలపద్మము

సీ. ... జీలుగు మెట్టదామర వెట్టిసెనగ జంబీరము కాఁచి నల్లకాఁచి . . హంస 4. 10

చం. కురిసిన(క్రిం)దిపువ్వాడులఁ గొంచు నగంబుల మీఁదికై పిశం, గరుచులఁ గొన్ని పెల్లగసె గాడ్పు సుకృతి మాధవుండు రా, నెఁపుగఁ బూవునొ మ్మిడి వనేంచిర భూమికి వెండి మెట్టదా, మరవణంబు తాఁగొన (భ్ర)మద్గతు లౌమలుచుట్టులో యనన్ ఆము. 5. 124.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడి తామరయనఁ బచ్చతామర యన, నేల తామర యన ... ఆం. భా 2 69

సీ. జనకకన్యపిసాళి జలుకుకందోయితో సరియైన మెట్టదామరలు కొన్ని . . ఉ. రా. 6. 29.

**మెట్టపంట.** వి. (√మెట్ట). 1. జలమక్కఱ లేకయే పండుపంట.

సీ. సకలదైవతబుభుజాపూర్తి కెవ్వాఁడు పుట్టు

గాననిమేరి మెట్టపంట ... మనుచ 1 '8

2 వర్షాధారమువలనఁ బండుపంట

(వ్యవ.) ఈయేఁడు వర్షములు లేక మెట్టపంటలు పోయినవి

**మెట్టబందారి.** వి వృక్షవిశేషము (వృ వి).

సి నేల, తంగేడు మెట్టబందారి దుండుగ ప్రహ్లాదండి ఘూతుల సెట్టిదండి హం.స 4 10

**మెట్టవా(లుపి)ల్పిట్ట.** వి. (మెట్ట + వాలు + పిట్ట) కోడి. చరణాయుధము.

గీ మెట్టవాల్పిట్ట రామేరిదిట్టవేల్పు, గ్రచ్చులోడఁ గూర్చ మము నిచ్చుఁ గాచుఁగాత .. విచ్చి రా బాల. 8.

**మెట్టాడు** అ. క్రి. (మెట్ట + ఆడు) త్రొక్కుడు లాడు (మిట్టాడు. శ ర.).

వ అనుచుఁ దలంగిపోక యిట్టునట్టుం జుట్టు మెట్టాడు చిట్టివడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదురఁ నదలించుచుం దనమేళగాండ్ర నాలోకించి .. ప్రభా 1. 107

**మెట్టించు.** స క్రి (√మెట్టు[1]) 1. అయత్త పఱుచు, సిద్ధపఱుచు.

సీ. బండ్ల మెట్టింపు పై బరువులెక్కించుపుమీ దళ్లను బూన్పు కాళ్లవ నునుపు .. హరి పూ. 6. 21

2 త్రొక్కించు.

కం . కాంతల యిడుగు లెత్తి చేతుల, మెఁర కువ శశి సన్నెకల్లు మెట్టించె నటన్ . శశాం 5 141.

కం త్రిపదంబులచే సురలను, విపదంబుధిఁ దేల్చి నట్టి విష్ణుని చే న, త్ప్రపదంబులు మెట్టించిరి, .. ముకుంద 3 295

**మెట్టిక–మెటిక[2].** (మెట్టు[1] + ఇక. స్వార్థమున) సోపానము, తాప

శా. పన్నీటిమున్నీటిబల్, త్రోవ గట్టిన పచ్చమెట్టికలపైఁ దోడ్తోడఁ గ్రీడింపఁగాన్. రా వి 3 79.

చం అని జననేత తత్ప్రియనఖాగ్రగణికే ల్కయిదండఁ బూని చ,క్కనితెలిమిన్న మెట్టిక లుగట్టినత్రోవ నగేంద్ర మెక్కె . చంద్రి 2. 5.

సీ పైఁడిమెటిక లెక్కి పై కేఁగి చేఁతగట్లఁదు దాఁగురుమూఁత లాడి యాడి . యయా 3. 53

సీ మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు. అం భా. 2. ౬౬, పాంచా. 4 21.

**మెట్టికొను.** స. క్రి. (మెట్టు[1] + కొను, సార మున) తొడిగికొను.

గీ విటునివలె హరి సొగసుగ వేస మెసఁగఁ, దాల్చి విటక త్తెవలె నుండుతరుణిఁ గూడి పాదుకల మెట్టికొంచు నాప్రథితయుక్షు. వాటిఁ జెంగఁ జూచుచు వచ్చుచుండె ... వేం మా 1. 136.

**మెట్టినయిల్లు,** వి. (√మెట్టు[1]) అత్తవారియిల్లు.

గీ అవిభునిదేవి శ్రీవెంగళాంబ పుట్టి, నిల్లు మెట్టిన యిల్లు వర్ధిల్లఁ జేసె ... వసు. 1. 63

ఉ. పుట్టినయింటి కెంతయు సమున్నతి చల్లఁ దనంబు మీఱఁగా, మెట్టినయిల్లు గహ్వరము మీఱియు వెండిఁ బ్రసిద్ధికెక్క ... శశాం. 1 14.

**మెట్టియ(ట్టె) = మట్టియ, మట్టె** వి (త మెట్టి) స్త్రీలు కాలివెండవ్రేల ధరించుభూషణ విశేషము.

సీ అరిగింపుఁడు మీర • ని ప్రియంబాడెడు పోలు పున మెట్టియ ల్గులకరి ప పారి 2 19.

గీ భువన సమ్మోహనాకాంక్షఁ బుష్పధన్వి, పొన్ను మెట్టియ నెత్తమ్మి పూవునడుమఁ, బ్రాణమై డాఁచె ననఁగఁ గట్టాణిముత్తి. యంపుముంగర విలసిల్లె నబ్జముఖికి సుద 5. 144

సీ గిలుకమెట్టెలడాలు చలువకుచ్చెలఁపై జాళు వాబంగారుసరిగఁ గూర్చ .. ఉశా 2. 66.

గీ . మెట్టెలు పిల్లాండ్లు మొదలుగాను,

గీ. ఇన్నగంబునఁ బ్రవహించు సన్నపాటి, నిర్ఝ రమువోలె మందాకినీస్రవంతి, గాన నీ మెట్టు మోక్షంబుకట్టుమట్టు, కనుడు గీర్వాణవరులార కన్నులారఁ వరాహ. 6. 87.

గీ. మరుని నాళీకసాయకోత్కరము కరము, ధరముఁ దరమిడి మెఱము సేయఁదిది సౌరిది, నుఱిగి నవి మెట్లు తెగఁగోయనునువదీర్చు, రంబుల జనింపవో శతారములు గావొ . వసు. 2 114.

కం. తొడిగినపాముల విసమును, మెడవిసమును నొనలిడిచ్చు మెట్టులవడయున్, ముడివడఁగా వడకాలము, గడవుట కడుఁగడిఁది యయ్యెఁ గఱకంఠునకున్ . ద్వా. 9 12.

3. తిన్న.

గీ. మిణ్ణుఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క, మిట్ట మై యది నునుపారు మహిత మైన. యక్కొ లన ... భార అను 1. 220.

4. సోపానము.

సీ. తనలోఁణ కమలాంఘ్రితలరుచుల్ మగఱాల తెలిమెట్లఁ గెంపుమెట్టుల నొనర్ప .. ఉ రా 5 154.

సీ. పుడమివింతలు చూడ నడరుకోరిక గన్న మిన్నేగు దిగుటకు మెట్టు దొంతె ... శశాం. 1. 10.

సీ మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు ఆం భా 2. 22.

5 ఆశ్రయము, ప్రాపు.

సీ కంబాలు మెట్టు గ్రక్కునఁ గదల్చె... పారి. 1 23

సీ. శూద్రులకును మెట్టు శూరులవిడిపట్టు మంత్రి వర్గములకు మనికిపట్టు ... శివధ. 1. 16.

6 సుంకము తీసికొనెడిచోటు, ఘట్టము (శ. ర.).

7 శిరస్సు, తల

చూ మెట్టుఁదాలు.

8 మొత్తము, వెఁస.

గీ. నీవిచార మే నెఱిఁగితి గారవమునఁ, దొడరి నన్నుఁ బంపించి నీకొడుకు రాజుఁ, జేసి మధుర యేలింపఁ జూచెదవు జాల్మ, మెట్టునకుఁ జన్నె తరములు పెట్టి చూడ. హరి పూ 8. 70.

సీ. నిగరంపుఁజనుకట్టు నగరఁపురవికెమేల్ సరిగ కుట్టుల మెట్టు నడల నిక్క .... రా. వి 8 125.

9 బండి యిటు నటు గదలకుండ బండిక్రిందఁ గట్టెడుకఱ్ఱ

సీ పంకరుహంబులు బండికన్నులు చపకంబులు నొగలుత్పలంబు లిరుసు, .. కేతకుల్ మెట్టులు .. కు. స. 4 439.

10. కాలు

సీ నిండు బంగరుపట్టు కొండ వంచినమెట్టు వెలయువాని శుకాత్మ నొఱయువాని .. చంద్ర 5. 57.

11 వీణసరకట్టు, వీణాదండమున కుండు మెట్టు.

గీ .. నార, దుండు వీణగవుసెననుదొలఁగఁ జేసి, మెట్లు తడఁబడ దుడుకుగా మేళవించి, ... కువల. 5. 59

ఉ ... దంతపుమెట్లవెంబడిం, జేవడి వీణ మీటుటయు .. ఆము. 1. 62.

సీ మేళవించినవి సుమ్మీ దీని మెట్లని మాసలాఁ నంబున మహతిఁ జేర్చి ... పారి. 5. 86.

గీ. సారె మెట్టన సోపానసంజ్ఞదనరు ఆం. భా. 1 126

12. చెప్పు, పాదరక్ష.

సీ అట్ట లెత్తినప్రాఁతమెట్టులు కడగుటంబటి చాటికలతోడి వరువకాళ్ళు, .. వేం. పంచ. 1. 598

సీ పచ్చిట్టితో ల్పత్తెచుచ్చాలమె ట్లందికొనఁ దాని యూరెల్ల గుత్తవట్టి ... ఆము. 6. 69

సీ. నడునెత్తిసికలు గీర్వాణమంబు లెకవాటు

మెట్టులు గ్రొవ్వాఁడి మెఱుఁగునుశెలు ....
రసిక. 1. 68.

సాం. వి. మాన. 44., ఆం. భా 2. 298.

18. పాదుక.

గీ. సింహాగతి మీఱువసురాజుచెంత నొక్క, తోయ ధరవేణి పాదము ల్విడిచి మెట్లు, వెట్ట నొక కన్య హస్తమర్పింప వచ్చె, నలిల భవనంబు నకుఁ బ్రజోత్సవము మెఱయ ...
వసు. 5. 77.

విశ ఉన్నతమైనది, ఎత్తైనది.

(చూ. మెట్టునేల.

జ. మెట్టించు, మెట్టిక, మెట్టికొను, మెట్టినయిల్లు, మెట్టుఁబ్రాలు, మెట్టుగుదె, మెట్టునేల, మెట్టులుగొను, మెట్టువరి, మెట్టువిల్వేలుపు, మెట్లగుంటక.

మెట్టు². వి. పులికడుగు, అభిఘతము. (పులి, మజ్జిగ' అని శ ర)

గీ. .. మెట్టనఁగ మెడ దనంగఁ బులిమెట్టనంగఁ జెలఁగుచుండు నభిఘతాఖ్య ...
ఆం. భా. 2. 250.

మెట్టుఁబ్రాలు. వి. బ. (మెట్టు¹ + బ్రాలు) తలఁబ్రాలు,

కం. తదనంతరంబ హర్షము, పొదలుమదిన్ మెట్టుఁ బ్రాలపుట్టికల యెడన్, గదియన్ బట్టిన పెంధెరఁ, గదియించిరి బంధుజనులుకన్యావరులన్ ..
మనుచ. 5. 79.

ఉ ... వధూవరులం గడానిబం,గారపుమెట్టుఁ బ్రాలపుటికల్ గదియించిరి గొందఱౌ దువల్ ...
విజ వి. 3 112.

మెట్టుగుదె. వి. (మెట్టు¹ + గుదె.) ఒకవిధమగు శకటావయవము.

సీ. సింధువారంబులు సీలలు గేతకుల్ మెట్టులు మొల్లలు మెట్టుగుదెలు ... కు నం, 4 439.

మెట్టునేల వి. (√మెట్టు¹) మెట్టభూమి, మెరక నేల ...
ద. శా. 4. 1248.

మెట్టులుగొను. అ క్రి. (మెట్టులు¹ + కొను.) మెట్లవలె నేర్పడు, సోపానము అగు.

లయగ్రాహి. వి ట్టడరి కేల మెడ నుట్టి తెగ నెత్తు వడు నట్టలు శిరంబులును మెట్టులుగొనం బ్రో, వెట్టు ...
కు. నం 12. 953.

మెట్టువరి. వి. (మెట్టు¹ + వరి) ఋడుమ, జిలమ మున్నగు వర్షాధారమునఁ బండెడు వరినస్యము.
ద. శా. 4. 1384.

మెట్టువిల్వేలుపు, వి. (మెట్టు¹ + విల్లు + వేలుపు.) శివుఁడు, గిరిధన్వుఁడు.

దండకము. ఆరిదిబిరుదా నీవు రాయంచతేజీ వజీరుండ వై చుట్టు వాల్దాల్పవై మెట్టు విల్వే ల్పవై ...
అచ్చ. రా. యు. 161.

మెత్రిలు. అ. క్రి. ప్రసరించు, తొలఁకు.

చం తొలఁకెడు తత్తరంబు వగతోఁ దొడినిగ్గు హిజారుమీఁద మెత్రిలవడి నొంటికట్టున ఘటిం చినచీర సగంబు మూఁపుపై, నలవడ బోఁటి దట్టి మొద లైనవి తేఁ దిరుమంజ నంపువే. శలు దరితప్పె నంచు నవలా భయమందుచు నిల్లు వెల్వడున్
శుక. 3. 16,

(ప్రయోగాంతరము గానరాదు.)

మెట్లగుంటక. వి. (మెట్టులు¹ + గుంటక) ఒక విధమగు గుంటక ఒకానొక సేద్యపుఁ బనిముట్టు (శ. ర.).

మెడ వి. (త. మిడఱు.) 1. కంధరము, గ్రీవము. అఱ్ఱు.

గీ త్రుంచి తోడన ముప్పదితూపు లతని, యొడల నాఁటుడు హయములమెడలు నూతు, గళము నజ్జనపతికుత్తుకయును దునిమె, ఘోర భల్ల షట్కముత్రినఁ గుంభభవుఁడు.
భార. ద్రో 5. 59.

చం .. సిరుకో, క్కొఁకకొఁ మంచు గ్రుంకు మెడ గుంపులవంపులు దోఁప . .
ఆము. 1 71.

సీ. మెడ యెత్తి కలయంగ మింట నరయు ..
మనుచ. 3 16. ఆం. భా. 2 141.

2 కత్తుక గళము.

ద్వి మృడునకు వరమాంసమే కాని యొండు,
మెడకుఁ జోదయ్యెనే మే లయ్యె ననుచు.
బస. పు. 4 635 పం

సీ. ఎండెండ నసలందు వెండి మీ ల్మెరలంగ బ్రమింగి
మెడ ల్వంబు కొంగగుంపు ...
ఇందు 3 94.

మెడగట్టు = తప్పించుకొన శక్యముగాకుండునట్లు కూరు

శా. ఆలుఁ బిడ్డలుఁ దల్లిదండ్రులు ధనం బంచు
న్మహాబంధనం, బేలా నామెడఁ గట్టినాఁ
డవు . కాశ. 4, 9

మెడఁజుట్టుకొను = తప్పించుకొన శక్యము గాకుండ నేముకొను

గీ ఆస లన్నియు మొదలంటఁ గోసి యున్న,
గోఁచికట్టిన కటువంటిగొడవగడన,రాక మెడఁ
జుట్టికొనియె నూరక యకార్య, కరణ శీలుర
కెప్పాటఁ గలదె సుఖము. పాండు 5. 288.

జ మెడకాయ, మెడతెరువులు, మెడనూలు,
మెడవంపు, మెడవల.

మెడకాయ = మెడ (శ ౦.)

మెడతెరువులు. వి (మెడ + తెరువులు) పికిలి పిట్టలు మున్నగువాని మెడలమీఁది చాలలు.

సీ మెడతెరువులు వల్లిపొడలు కాలిఁకలు సోగ
లాగలు నిక్కుఁరాగికాళ్లు ... ప్రబంధ. 130.

మెడద. వి. వనము, అడవి.

సీ మెడది వాటిలుకిత్తు వెడదవా వడిఁ గ్రోలి
బెడది వాపెడు గొత్వయెడద వాఁడు ...
ప్రబంధ. 217.

మె(ణ్ణా)డనూలు. వి. ౩. (మెడ + నూలు.) కంఠాభరణ విశేషము. (బ. మెడనూలులు, మెడ నూళులు, మెడనూళ్లు.)

సీ. వ్రేలివలంబున వ్రేలెడు మెడనూళ్లు జాళువా
ముంజేతి జతులప్రోళ్లు .. రా వి. 2 44.

సీ. కమ్మల పచ్చల కడియాలబొట్లును పతకాలు
మెడనూళ్లు బాహుపురులు .. ధనా 3. 87.

లయవిభాతి చిలువ మెడనూలు పనిమలపు తాలి
చూలు మొల నెఱుమనువాలు మెకె మెలయు
వలకేలున్ .. అచ్చ రా బాల. 216.

సీ మెఱుఁగఁచు కమ్మలు మెణ్ణాలు గెజల
ముక్కర యడ్డబుడగలు కట్లసరులు ...
హంస. 4. 158., ఆం. భా. 2 148.

మెడవంపు వి (మెడ + వంపు.) గ్రీవాగ్ర భాగము. మెడ కొనభాగము

సీ మెడవంపు నాఁగను మీఱు గ్రీవాగ్ర
భాగము ... ఆం. భా 2. 142.

మెడవల వి (మెడ + వల ) జాలభేదము, ఒక విధమగు వల

కం మెడవల సన్నువుల త్రో,వుడువల డొంక వల
మిట్టముక్కిడివల దాఁ,టుడువల సింగితమను
కువ, లెడవల కుందెవల మొదలయిన బలువల
లన్. హంస 4. 185.

మెడిదము. వి ధ్వని, చప్పుడు

గీ. గొరగొరం జనుపందుల ఘుర్ఘురంపు, మెడిద
ములఁ బడమియు వడవడ వడంక, నెపుడు
నెడయాని చీకట్ల నివము గొనుచు, నొంటిఁ
జొం రానియట్లుగా నుండె మఱియు.
యయా 1. 116.

(శ ర. పా., బెడిదము. ముద్రి. పా.)

మెడుకు అ. క్రి త్రుళ్లు, ఎగిరిపడు

వ. ... జడియుచు నొడియుచుఁ గదలుచుఁ బొరలుచు మిడుకుచు మెడుకుచు వ్రేయుచు
రోయుచు ... ప్రబంధ. 788.

మెడుద. వి. పులికడుగు, అభిషుతము

గీ, ... మెట్టనఁగ మెడు ద,నంగఁ బులిమెట్టవంగఁ

మలయుచు వచ్చె గంధగిరి మంథర బంధురగంధ
వాహముల్. కవిక 4. 12.

6. నడక, సంచారము

ఉ. కాలు మెఱుంగులో మెలవుఁ గైకొనసేర్చిన
పైఁడిబొమ్మలో, మారునిదీముతో కలికి
మాటలచంద్రికలో చెలంగుళ్ళం, గారరసాధి
దేవతలో కమ్మనిక్రొవ్విరి తీఁగెలో యనన్,
వారిజపత్త్రలోచనలు వచ్చిరి మోహవిలాస
మూర్తులై. వి. పు. 5. 146.

7. చాంచల్యము, కదలిక.

సీ. మృగమదంబును మదమృగమును హసియించు
గాయంపువలపు కర్దోయి మెలపు ...
అని 2. 26.

8. స్థైర్యము

సీ కదుఁబేద యగుకొను గమనవేగంబున మెల
పేది జవజవ జలదరించె ...
కవిక. 3. 151.

9 మాంద్యము, మెల్లఁదనము.

సీ పూఁదీఁగఁబోఁడిచూపులు చంచలము లని
మెలవు నెన్నడపున మేళవించె ....
విక్ర. 4. 17.

10 విధము, రీతి.

వ తనయందు నివి మొదలయిన తీర్థంబులు గల
వని యవనీజనంబులకుఁ దెలుపు మెలపున
వెలుంగుచు .. కాశ. 1. 142.

మెలయు = మెలియు. అ. క్రి. 1. వర్తించు,
ఉండు,
(చూ కలయు. ఇది కలయు ధాతుపూర్వకము
గానే ప్రయోగములయందుఁ గానవచ్చు
చున్నది.)

గీ. కాంతలిద్దఱు నచ్చటఁ గలసి మెలసి, సంభ్ర
మంబునఁ బుష్పావచయ మొనర్చి ...
రాజ. చ. 3. 42.

గీ. మాటలాడుచుఁ బాడుచు మంద మంద, గమన
ములఁ గామినీమణులో గలసి మెలసి, వన
విహారంబు గావింప వారిఁ గూడి, యలరె
నవమన్మథునిలీల నబ్జుమందు
ఉ. రా. 3. 209.

గీ. అనుచు ననిచినకూరిమి నణఁగి మణఁగి, కలిమి
లేమిని భర్తతోఁ గలసి మెలసి, హెచ్చు తగ్గుల
సోకరిత నెసఁ మెసఁగ, వెలసె విలసితకీర్తుల
వెంగమాంబ.
కృ. శకుం పీఠి. 1. 78.

2. జాగరూకతతోనుండు (శ. ర.).

3. పెనఁగు (శ. ర.).

జ. మెలఁత, మెలఁతుక, మెలపాడు, మెలపారు,
మెలపు.

మెలరారు అ. క్రి. 1. మనోహరమగు, ఒప్పిదమగు.
(ఈ రూప మొక్క కు సం. నందే గానవచ్చు
చున్నది)

సీ. మెలరారు క్రేఁగంటి మెఱుఁగు దీఁగల దుల్లు
కారాకు లొక్క క్రొక్కారు మెఱుఁగులు...
కు. సం. 7. 903.

సీ తెలిమోముపైఁ బర్వు తొలఁకాడుచాయతో
మెలరారు కనుఁగవ మెఱుఁగు లడరు...
కు. సం 8. 9.

2. చలించు, త్రుళ్ళు

కం ఎలమెడు జలజాతంబులు, మెలరారెడు జల
చరములు మేలిల్లెడుని,క్కాల మంద...
కు, పం. 10. 391.

మెలవు = మెలఁగు. అ. క్రి.
(మరలు, తిరుగు.)

వ ... దీనిపడుమట వడగొండియేఱు ఉత్తర
మించి మెలవినమెలవంక కొల్లిప్రోలును మల్ల
ప్రోలును గూడినచోటి పుట్టయసీమము...
పి. శా. శ. 1024. Ep. Ind. 5.

మెలి వి. (√ మెలియు సం. మిళితం) మెలిక, పెన.
శా. శైలాంచత్కచపాశిఁగూర్చి మెలు లొందం

జుట్టి మేల్పాగలన్.. రా వి. 2 51.

2. చిక్కు.

సీ. జన్నిదంబులు ము త్తెసరులు జిక్కులుపడ్డ
మెలులు విప్పుచుఁ గొంత మేలమాడి...

మృ వి. 2. 88.

**మెలిక** వి (మెలి + ఇక, స్వార్థమున, మెలి, పెన వ్యైన ) పాశములు మెలికలు వడినవి.

**మెలికించు** స క్రి. (√ మెలిక) మెలిపెట్టు, పెనవేయు.

సీ. బహుమార్గముల నందిపడగలు గట్టిరి మెలి
కించి కట్టిరి మేలుకట్లు...

వీర. 3. 118.

**మెలిగొను** అ. క్రి. (మెలి + కొను) 1. పెనగొను, చిక్కువడు.

సీ. నవమైనకృష్ణాజినముతునక మెలిగొన్న ధవళ
యజ్ఞోపవీతంబు మెఱయ....

ద శా. 5. 81.

చం. ... తాళగతి బంగరుగాజులు మ్రోయ హార
ముల్, మెలిగొన నూర్పు లుప్పతిల ...
అలికులవేణి యోర్తు కర పంకజను కెంజిగు
రాకుఁబోఁడికిన్. కవిజ. 3. 26.

2 వంకర దిరుగు.

సీ. ... ఇనుపకడెంబులు నింగలంబు, గురిపెడు
మిడిగ్రుడ్లు నెఱచూపులను నేపుమీఱడు మెలి
గొన్న కోఱమీసలు ...

ఉ హరిశ్చ. 4. 157.

**మెలిదారము** వి (√ మెలి) జాతిపనివాండ్రు దిండు ప్రక్క కొయ్యలకుఁ గట్టెడు బిగిదారము.

(శ. ర.).

**మెలిపె(వె)ట్టు** స. క్రి. (మెలి + పెట్టు) పెనవేయు.

సీ. మెలిపెట్టి చుట్టిన తెలిపసింగిముడాసు పైల
పేటాకమ్మిపసుపుఁ జెలఁగు, బంగరు వ్రాఁతల
కుట్టుహిజారు ... శుక. 2. 426.

**మెలియు** = మెలయు అ. క్రి. పెనఁగు (శ. ర.).

జ మెలి, మెలిక, మెలికించు, మెలిగొను, మెలిదారము, మెలిపెట్టు, మెలివడు, మెలుచు. మెలుపు.

**మెలివడు** అ క్రి. (మెలి + పడు) మెలిగొను.

(శ. ర.).

**మెలుత** = మెలఁత మెల్త, వి నెలఁత, స్త్రీ.

కం. ... అమ్మెలి, లోకము నేరుటయు నమెల్త
లుఁత యెలుఁ గెసఁగన్ . .

భార. అను 3. 221.

ద్వి. మెచ్చ దింద్రాదుల మెలుఁత యానంబి
మెచ్చునే యెలుఁగమే మీఁదాసికొలఁది ...

పండితా మహిమ 281 పు.

(క్రొత్త ప్రతిపా. మెలఁత ప్రాఁత ముద్రి పా.)

**మెలుచు** స. క్రి (√ మెలియు) మెలివేయు, పెనవైచు.

ద్వి. అనుమాన మేల రమ్మని చెట్టఁబట్టి, మెలు
చుచు బంగారు మేడలోపలికిఁ. బోలఁగనీయక
వెంటఁ దోడ్కొని పోయి . .

ద్వి. శ. సా. 1 509 పం.

(మెలఁచుచు అపముద్రి.)

చం. ... కేలఁ గేల్, మెలిచిన బెత్తుకేడినల
మిన్నలచిన్నెల వెన్నుదన్నులల్, పొలపుల
చూలపుత్తుకలఁ జొత్తిలఁ జూచె ఆ తాంగి
నాథునిన్. ర. స. 1. 42.

**మెలుపు** = మెలపు, మెల్పు వి (√ మెలియు) (మార్దవము, సౌకుమార్యము)

సీ. అఖసభావంబున పొలుపును మెలుపును
గలుగు నగ్గిరి కన తలఁచి [illegible] ...

[illegible] 7.

కం. మెలుపును గొప్పును [illegible] దేని
లేదు తను కుమపఁ నన్, [illegible]
తప్పక, తలముల నెలసె [illegible]
పొల్పున్. [illegible] 85

కం వనితలు మేలుపుమెయి మెలు [illegible]

నొప్పుహోఁ ములు ముదలగు ప్ర,న్నని తొడ వుఱు గ్రద్దలు దివి, య వరేంద్రులు గొంద ఉనికి యచ్యుత కంటే.

భార. స్త్రీ. 2. 17., కు సం. 6 13.

(మెల్లఁదనము.)

సీ. ... గౌరి వచ్చి, వెనుకదిక్కున మెలుప్పనఁ జేరి మోమున కలఁతిన వ్వినుమడచెలువు నొసఁగఁ, దమ్మిఱేకుల నుల్లసమ్మాడు తన మృదుకర యుగ్మమునను శంకరునినేత్ర, యుగ్మమల్ల మూసి ...

భార అను. 4 419

(చాతుర్యము, నేర్పు.)

సీ. ఆసీనుఁ డయి తదీయాంఘ్రి పద్మంబులు తన చారుపాణి పద్మముల మెత్త, మెత్తన యొత్తుచు మెలు పొందఁ గర్జంపుఁబలు కులఁ జిత్తవిభ్రమము మాన్పి.

భార. మౌ. 1. 73.

చం. చెలువను గౌఁగిలించుకొని చెక్కను జెక్కను నంఘటిల్లఁ దొ, ట్రిలుచుఁ బదంబు లొక్క టొకటిం బెనఁగన్ మెల పొప్పఁ దార్చె తేఁ, దలిరుల తొంపముల్ గలుగు దట్టపుఁ బూఁబొదరింటి లోనికిన్.

కళా. 3. 84.

(చక్కఁదనము, సౌందర్యము.)

సీ. భద్రనిదోఘాతపత్రంబు గ్రాలుచు మిన్నేటి ఠిఠఁగల మెలువు గొలువ ...

భాగ. 6. 260.

మెలుసు వి (సం. మిశితమ్?) మెలిక, కైన.

గీ. బిఱుగు మెలుసులకలఁకలు గలిగికొనుచు, మెఁ చ్చప్రకృతిని దగులక మిలివెలఁగు, వెలుఁగు వెలుఁగఁగఁ జేయుచుఁ గ్రాయ వెలుఁగుఁ, బరమపరిపూర్ణ నిర్గుణబ్రహ్మమునకు.

సీతారా. 2 6.

వ. అప్పుడు నిప్పుడు గాకుండఁ దప్పటడుగు లిడుచు నినుపగొలుసుల మెలుసులు విడినఁ జాలఁబులు మహోత్తాలుం డయిన బిడ్డనిఁ నడ్డంబు గాక కీ లూడి వీడిపడ ...

భాగ 10 పూ. 142

మెల్కువ. వి. జాగరూకత, మెలఁకువ.

ఉ ...తద్గణ, స్తోమము గాంచి భక్తి మదిఁ దొల్కఁగ సంగయ పల్కె మెల్కువన్ ...

చెన్న 3. 274.

మెత్త = మెలఁత వి. ఆఁడుది, స్త్రీ

ఉ . సా, రంగముఁ జాయఁ డీయవసరంబున మే లని మెచ్చిరో సుమీ, ద్రిమ్మింగియుఁ గ్రాయు నచ్చిలువ మెత్త విధుం గసుగంద కుండఁగన్. నైష. 3. 173.

ఇ: మెల్తుక.

మెల్తుక వి (మెత్త+ఉక. స్వార్థమున) ఆఁడుది, స్త్రీ.

ఉ. .. మేదినీ, పుత్రి మహాశ్రమ స్థలము పొంత వనంబునఁ ద్రోచి వచ్చె సౌ, మిత్రి తపస్వి బాలకులు మెల్తుకఁ గన్గొని వచ్చి నాకుఁ ద,న్మాత్ర నెఱుంగఁ జెప్పుటయు.

నిర్వ. 10. 131.

చం. మెలఁగుచు నున్నవానిఁ గని మెల్తుక యొక్కతె భూసురుండ కాఁ, దలఁచి ...

మార్క. 5. 13.

మెల్పు = మెలుపు.

సౌకుమార్యము, మార్దవము.)

చ. .. విదురాది సజ్జనులబుద్ధికి రా నుచితంబు తోడి మె,ల్పునఁ బరుసందనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ ...

భార. ఉద్యో. 3. 23

సీ. భావతి నడపాడు పదగతు లవ మెల్పు దల కొని క్రాలు పదక్రమములు ...

కు. సం. 6. 713.

(మాంద్యము, మెల్లఁదనము.)

ఉ. అప్పు డొకర్తు కొంచె మగు నాభరణంబులు

సన్నపూఁతయున్, గొ ప్పిడి త్రిప్పి లోఁ జెరివి కొన్న నడఁగిన పూవులుం బయిం, గప్పిన చేలకొంగు నునుఁగప్పును మెల్పున నేఁగు మెట్టెలేఁ, జప్పుడు చెన్నుఁ జేయు గతి చందము వింతఁగఁ బోవు నయ్యెడన్.

నిర్వ. 6. 58.

శా. ధేనుగ్రాసము మాన్ప దోస మని సందేహిం చినన్ సస్య మెం,తే నష్టం బగు నైన నేమి మఱియున్ విత్తంగ యామంబులో, నా నన్నన్ మునుసెల్ల మిక్కిలియు నేఁ డాఁ కొందు రిధేనువుం, దానో మానము దప్పి మేసినది యింతం దోలెదన్ మెల్పునన్

వరాహ. 10 40.

ఉ. గంధవహుండు వీచె వెనకంబున నాత్మజు మీఁద మెల్పునన్ ....

భా రా యు 1718.

(నేర్పు)

సీ. కాఁడిన విషకంటకములు మెల్పునఁ బుచ్చి తన పెచ్చు పాదపద్మములు గాఁచి ...

జై. భా 6. 85.

(రీతి, విధము,)

చం. నిలువక మెల్లఁ దాఁటు నట్లు నిల్చిన మెల్పు నటించుఁ బట్టఁ జే,యలఁతికిఁ జేరినం జిదిమి నట్టులు దూరము దాఁటు ...

భా రా అర. 2. 46.

మ. .. మాయఁ బన్ని పెలుచం గోశంబులో వాలు మె,ల్పున రాజిల్లుచు మాట మెత్తఁ దనమున్ లో వాఁడియు నేర్పడన్ ...

భాగ. 10. పూ. 223.

మెల్ల[1]. విశ కొంచెము వంకరైనది (కన్ను. చూపు) కేకరము.

(వ్యవ) ఆ పెండ్లి కుమారునికి మెల్లకన్ను. అట్లు మెల్లచూపు చూడకు.

జ, మెల్లకంటి, మెల్లకంటివాఁడు.

మెల్ల[2] విశ. (త. మెల్. కర్మధారయమున నిగా గమము.) 1. మందము, వేగము లేనిది.

ద్వి మెల్లనినడపులు మృదుభాషణములు, వల్ల భత్వములు చిత్తోల్లాసములును .

పండితా. పర్వ. 235 పు

2. శాంతము, ప్రసన్నము.

ఉ .. మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపులఁ మందహాసముల్. చాటువు

3 మెత్తనది.

(వానిపని యిప్పుడు మెల్ల శ. ర.)

క్రి విశ. క్రియా. 1. మందముగా, త్వరపడక

(దీని యామ్రేడితరూపము మెల్లమెల్లన్, మెల మెల్లన్, మెల్మెల్లన్.)

శా. ఏమే చెల్లె బిటీన రాఁగదవె యేలే జాగుఁ యోసక్క లోఁ, తేమోనే వెఱతున్ భళా యెఱుఁగమే యీబూటకా లమ్మలా, రా మెల్లం దిగరమ్మ .. ఉ హరిశ్చ. 3. 27

ఆ నల్లగోల నిచ్చి మెల్లనె చివ్వంగి నోరి జిక్కఁ దివియునేరు పొదవు, వేటకాఁడు వోలె ...

ఆము. 4 193.

మ. కర మొప్పారు నిశానవోఢకు నిశాకాం తుండు మెల్మెల్లనే, కరముల్ సాఁచి తమోవినీలపట ముత్కంఠం దొలంగింప ...

కవిజ 3 77

గీ అలరు మెల్లఁగ వన శకైలంధ్ర మగుచు ...

ఆం. భా. 3 76

2. బిగ్గరకాకుండ, ఉచ్చైర్ధ్వని లేకుండ.

(వ్యవ) మామకు నిద్రాభంగము గలుగును, మెల్లఁగాఁ బయుపుకొనుము. పెద్దలతో మెల్లఁగా మాటాడ వలయును

జ, మెల్లన.

మెల్ల[3]. వి. ఊరబయలు.

సీ. ...మెల్లన నికర్షణ మొప్పు ...

ఆం. భా. 2. 23

మెల్లకంటి. విశే. (మెల్ల[1]+కన్ను) కేకరాతుఁడు, కొంచెము వంకర యైనచూపు గలవాఁడు, కడకంటి కొంగిన కనుపాపగలవాఁడు, కలది వి వాయసము, కాకి. (గ్రా.)

మెల్లకంటివాడు. విశే. (√మెల్లకంటి) కేకరుఁడు,

గీ ... మెల్ల, ంటివాఁ డనఁ గేకరాఖ్య యగు .. ఆం భా 2 120.

మెల్లన. వి. (√మెల్ల[2]) 1. అల్లన, మాంద్యము, మందస్వరము.

సీ భోగించువారలఁ బుల్కుపుల్కునఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లుమ్రింగువారు ..

నైష 7 53.

సీ మనసుకక్కుటితి మెల్లన లేచి చేతులఁ గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు ...

మనుచ, 3. 123

కం. తనరెడు లజ్జాభయవా, సన లుద్బోధమునఁ దనర సతి గనుఁగొని మెల్లన నిలుఁ డని యావ లిడన్, జనిరొక్కొకనెపముఁ జెప్పి సకియ లిరువురున్.

ప్రభా. 5. 37.. నీలా. 2. 11

2 శైథిల్యము, నడలు,

సీ అంగంబు మెల్లన వక్కుఁ దేర్పనె గాని మించి బిగ్గరఁ గౌగిలింప రాదు ...

దశా. 2. 311.

మెల్లము. విశే. ఉపశమిల్లినది, తగ్గినది.

ది॰ మీఱినతాపంబు మెల్లంబు చేసి ...

ద్వి. పరమ. 5. 41 పొ.

మెల్లా. వి. చవిక. (శ ర., గ్రా )

(వ్యవ.) వా తామెల్లాలోఁ గూర్చుండి మాట లాడుచున్నారు.

మెల్లె. వి. చివక, చువ్వ.

సీ. పెండె గట్టెడుచోటఁ బెనుపగడుపుఁడీగ లీత మెల్లెలు దుల్య మెపుడు నృపతి ...

శా. వి. 3. 41.

మెళవ. వి. ఒంటిపాటు, ఏకాకిత్వము.

గీ. ఒంటిమైనేఁగు చలముల నుడుగరమ్మ, మెళవ లిడరమ్మ కవగూడి మెలఁగరమ్మ, తగినజత గూడి తలఁపులు దలఁచరమ్మ, యేను దెలిపిన చందమే యొన్నరమ్మ.

చంద్రా. 4. 197.

మెసఁగు=మెసవు. స. క్రి. 1. తిను, భుజించు, మ్రింగు, కబళించు.

సీ. తివుటఁ జుక్కలతేని దినగోరు మెసఁగిరి ...

నైష. 7. 82.

గీ ఎంగిలికి రోఁత పడక మెసంగువారు, గావ విద్యలపైఁ బ్రేమ గలుగువారు, విష్ణునామ త్రయజపంబు విడుచువారు, నియమార్గాను వర్తులు నిశ్చయంబు. శేష. 3. 44.

గీ ...మంచిపనసపండుల మెసంగు, జాణలకు మావిపండులు చవియ కావె ..

నీలా. 2. 31.

వ. పంచతన్మాత్రసహితం బైన యమ్మహామాన సంబు నిద్రాసమయంబుఁ గబళించుచాడ్పున నహంకారంబు గబళించు, నయ్యహంకృతి మహాబుద్ధి మెసంగు. సీతారా. 2. 158.

2. అనుభవించు.

కం. శివయోగినింద విని యెడి, యవివేకులు తనువు వెడల నంతమువఱదున్, దవిలి నరకంబు మెసఁగుచు, భువి చనునంతాఁక యమునిపురి నుండు రోగిన్. శివధ. 3. 89

మెసవు=మెసఁగు. స. క్రి. తిను, భుజించు ; కబళించు, మ్రింగు.

గీ. వేఁడి యగుదాఁక నోరువ మాఁడు గలిగెఁ, బులిసినది గగ్గె పన్నంబు పోఁకయంత, యొసఁగి తు త్తార్పు వెసఁ జల్ది మెసవనైన, పావ ముడిపించుకొందుఁ దవంబుకలిమి.

పాండు. 4. 153.

కం. ... నిలింపవిరోధి, నామెయిమేదోమయదృ.

ప్రామిషములు మెసవు మన్న నతఁడును
నా_రిన్ . . అము 6. 53.

కం. ఫాలాతుఁడు కబళింపఁగ, హాలాహల విషము
గొంత యవశిష్టం బై, తూలగ నది వృశ్చి
కములు, వ్యాళంబులు మెసవి విషవ దాఖ్యల
వెలసెన్. దశా. 2. 222.

గీ. కలువపిశితంబు మెసవురాకాని కాశి...
కాశి 2.49., ఆం. భా. 3.118.

# మే

మే = మేను వి 1. దేహము ఒడలు

ఉ ... పరిశ్రమ పారవశ్యముం, గూడి ప్రమాణ
కోటి వనఘుండు సమీరణనందనుండు మే,
యాడక నిద్రపోయె ...
భార. ఆది. 5 170.

శా. విధి నామేఁ బ్రాణముల్ నిల్పె .
భార. శల్య. 2. 21.

కం. మే నిమిరి శిరముమూర్కొని, దావవపరిపంథి
యొంతధన్యనో నియత ధ్యానసురు లయిన
మునులుం, గానని నినుఁ గంటి మంటి గత
కల్మష నై పారి. 3.26
ఆం. భా. 2. 134.

2. విధము, ప్రకారము.

ఉ .. పాండవుల్, మిక్కిలివారు నీతలఁపుమే
గెలుచున్ వరమే మహీశ్వరా ..
భార. ద్రో. 6 124.

3. తెగ, సంఘము.

చం. అనునినసూనుమాట విని యందఱుఁ గన్గొని
పెద్దలెల్ల ని, న్ననుమతి సేయ సైన్యముల
నన్నిటఁ బన్నఁగఁ బంపు రెండుమేల వడత
మిత్రిగర్తులబలంబుల ముందటఁ బంచి
వానిపోయిన మఱునాఁడు పోద మనియెం
గురునాథుఁడు దుస్ససేనుతోన్ ...
భార. విరా. 3. 123.

(రెండుమేల శ. ర పా.)

4. పార్శ్వము

శా. ... ఇర్మెలం బాయనివేల్పుచాలు గల
సామిన్ వెన్నునిం గొల్చెదన్ ...
చంద్ర 5 58.

శా. .... ఇర్మేలన్ జేరొ్కనువేల్పుచాలు నెద
నెమ్మి న్నిల్వఁ బూఁజాలు నే,వేళం బూతల
మేలుమేలును గలావెన్నున్ నిమం గొల్చె
దన్.. ప్రబంధ. 154.

జ: మేకొను, మేకొలుపు, మేకోలు, మేగలి,
మేతాలుపు, మేపుట్టువు, మేముఱుఁగు,
మేవడి, మేవడికాఁడు.

మేండుఁడు సం వి అ. పుం. మేఢుఁడు, మూవటి
వాఁడు (త్రి వి.).

మేంఢ్రించు. స క్రి. పోఁగొట్టు, నశింపఁజేయు
(ఛేదించు అని శ. ర )

శా. మింటన్ బ్రోసినబ్రోఁత చాలిమిని లో
మేంఢ్రింప మున్ నీవు నా,యింటం బుట్టెద
వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ
యన్నలన్... భాగ. 10 పూ. 124.

మేంధి, సం. వి. ఈ స్త్రీ మేంధిః, మేంతి (వ్య. వి.).

మేఁక వి. (సం మేకః) 1. ఛాగము, అజము

గీ ఓమే యమే మే యి దే మేమే లేమ యేమే.
మేఘపుష్పంబు దే వంచు మేలమాడ,
మేమేమేమేలు దఱ చయ్యె మేలుమేలు,
మేఁక మేఁ కన సభవారు మిగుల నగిరి.
వై షి. ఎ 11..

మ. ... మేఁ, కెరువుం గుంపటమంచ మెక్కరి
ప్రభుత్వైకాప్తి రెడ్ల జడిన్ ...
అము 4. 134.

2. చింబు, ఛాగి, ఆఁడుమేఁక.

సీ. .... మేఁక చుచ్చును జింబు మీఱు ఛాగి.
ఆం. భా. 2. 165.

మేకవన్నె పులి= మేఁకవలె పైకి సాధువుగాఁ
గనఁబడుచు లోపల పులివలె క్రూరస్వభావము
కలవాఁడు, కలది.

ఉ. అక్కట మేఁకవన్నెపులు లంగన లెన్నిట నిన్నె చూచినన్... కవిరా. 1. 134.

జ. మేఁకతిండి, మేఁకపోతు, మేఁకసారము.

**మేఁకతిండి** వి. (మేఁక + తిండి) అజాదనము. తోఁడేలు (శ. ర.)

**మేఁకపోతు** వి. (మేఁక + పోతు) ఛాగము, మగమేఁక.

(వ్యవ.) వానిది వట్టిమేఁకపోతు గాంభీర్యము.

**మేఁకసారము** వి. (మేఁక + సారము) స్వరవిశేషము, గాంధారము (శ. ర.).

**మేఁగు** = మ్రేఁగు స. క్రి. పూయు, లేపనము చేయు.

సీ. కమ్మగొజ్జఁగినీటఁ గలయఁపి చల్లిరి మేఁగి మెత్తిరి క్రొత్త మృగమదంబు.

శివరా. 2. 53.

ద్వి. . పెన్నలవు, మించి కందెననూనె మేఁగిన ట్లున్న, మొగమునఁ జీకట్లు ముడి పడఁ గల్గు.

ద్వి. హరిశ్చ. ఉ. 1390 పం.

సీ. . సమూంబువులు పైనఁ జిలికి కప్పురము వీనుల నూఁది మేలిచందన మెద మేఁగి తాళ, వృలంబు చేఁబూని.

చెన్న. 4. 21.

**మేఁడి.** వి (సం. మేథీ, ప్రా. మేఢీ. ఇది శ. ర. ననుసరించి సానుస్వారముగా గ్రహింపఁబడినది కాని నిర్ధారక ప్రయోగము లేదు) మేఁడితోఁక.

సీ. . . ముష్టి సంగ్రాహ్యదారువు పొలుచు మేఁడి, యనఁగ ... ఆం. భా. 2. 232.

ఉ. మేఁడియు సీరమున్ భుజము మీఁద ధరించుచుఁ బోతునెద్దుతోఁ, గూడఁగఁ గాఁడిఁ బూన్చి మునికోల కరంబునఁ బట్టి పగ్గపుం, ద్రాడును మోకు వాతెనయు దాలిచి ముందట వెన్కఁ ఖంగు ప్రేలాడఁగఁ గానె కట్టుకొని యక్కుటిలాత్మకుఁ డేఁగెఁ జేనికిన్.

శేష. 4. (శ. ర.)

జ: మేఁడికోరు, మేఁడిచీల, మేఁడితోఁక, మేఁడిపాలు, మేఁడిసోగ.

**మేఁడికోరు.** వి. (√మేఁడి) సేద్యగానికి వచ్చు ధాన్యభాగము.

**మేఁడిచీల.** వి. (√మేఁడి) మేఁడి జాఱి రాకుండ వేసిన చీల (శ. ర.)

**మేఁడితోఁక,** వి. (√మేఁడి) దున్నువాఁడు పట్టుకొనుటకు మేఁడిచివర అడ్డముగాఁ జెక్కిన చిన్నకొయ్య (శ. ర.).

**మేఁడిపాలు** వి. (√మేఁడి) సేద్యగానికి వచ్చు ధాన్యభాగము (శ. ర.).

**మేఁడిసోగ** వి. మేఁడితోఁక (శ. ర.).

**మేఁత,** వి (√మేయు) పశుపక్ష్యాదుల యాహారము

(ఇది మనుష్యుల విషయమునఁ గూడ నుపయోగింపఁబడును)

సీ. తనసంతతికి మేఁతఁ గొని వచ్చురీతి దిక్కరికరీరంబుల గఱుల వాను ...

దశా. 1. 289.

గీ. మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱిచి, తనదు కేళీ దీర్ఘికలందుఁ గనకనళిన, జాతులెల్ల నాఁటించినాఁ డాతఁడింద్ర, యటు చవక మేఁత వడచునే హంసములకు.

ప్రభా. 1. 120.

చం. కొంకొలమంచు మేఁతలకు గూఁడులు వెల్వడు పక్షిరాజముల్ .. పారి. 2. 69.

సీ. మినుకుటూర్పులవాని మిసిమిమేఁతలవాని మెఱుఁగుఁజామని చాయమేనివాని ...

పాండు. 1. 213.

సా: పఁటియూఁతకు లంక మేఁతకు సరి.

**మేఁతకాఁడు.** విశే. (మేఁత + కాఁడు) తిండిపోతు, మేఁతరి.

సీ. కోలాహలాభీలహాలాహలజ్వాల మెడబంటి
మెసఁగిన మేఁతకాడు... వరాహ. 11. 14.

మేఁతరి = మేఁతరీఁడు. విశే. (మేఁత + అరి.)

1. ఠంచిపోతు, ఘస్మరుఁడు.

కం. ... అ, బ్బాలమేఁతరిచెలి ద్రిమ్మరు, పాల
మేతటిరై న వేలుపులు సొరరసుమీ ...
అచ్చ రా. బాల 113.

2. ముఖ్యుఁడు.

సీ. అంతట చామయ్య యనుదొమ్మరీలమేఁతరి
తనవీడును దాను గదలి ..
చెన్న. 2. 204.

మేఁతరీఁడు = మేఁతరి. విశే. (మేఁతరి + ఈఁడు
స్వార్థమున) (ముఖ్యుఁడు.)

మ. కనియెం దొమ్మరిమేఁతరీఁడు ... ఉద్యాన
మున్ .... చెన్న 2 214.

మేఁ(తా)తలాడు = మేపాడు. అ. క్రి.
మేఁతలు + ఆడు.) మేఁతమేయు.

సీ. మిన్నేటిదరులందు మేఁతలాడుచు నున్నయు
దుటురాయంచలేఁగొదమ యనఁగ ...
సారంగ. 1. 122.

కం. ఆకాశ నాకపథమున, నేకాకిత మేఁతలాడ
నీరముగములం, గీశామండల మగునర, యూ
కాననమునకుఁ బోవ మన్నెడ నటకున్ ...
వేం, పంచ. 2. 7.

మేకము. సం వి, అ. పుం. – మే అని కూయునది,
మేఁక, ఛాగము.

( కల్పద్రుమాది కోశములం దీపదము రా. ని.
లో నున్న దని కలదు. కాని రా. ని. లో లేదు.
వ్యుత్పత్తినిబట్టి వ్యాకరణముచే సాధువు గాన
గ్రహింపఁబడినది) .

మేకలకన్య. సం. వి. అ. స్త్రీ. నర్మదానది,

మేకలము. సం. వి. అ. పుం. ఒకానొక పర్వతము,

మేకు. వి. ఇనుము మున్నగువానితో చేసిన చీల
(శ. ర )

ద్వి మొన సూపి నన లొత్తుమొగడల దనరి,
మినుకుఁ దేఁటులతోడ మేకులు చేసి, యూని
వగతి నాకు నిగురుఁబొక్కిమ్మ, గానరాకుండ
నల్లడ విజ్జివీఁగి ...
ద్వి. పరమ. 4. 266 పు.

సీ. .. మేఁకన నెసఁగు శంకు ...
ఆం. భా. 2. 218.

మేకొను = మైకొను. స క్రి. అ. క్రి. (మే+కొను)
అంగీకరించు, ఒప్పుకొను.

కం. ఉన్నారు మంచి యేర్పన, మిన్నలవలె రాజు
పంపు మేకొన కిఁక మీఁ, రెన్నఁటికి మీవిలా
సము, లిన్నియు నెన్నటికిఁ జెప్పరే చెలు
లారా ... రామా. 2.83.

ద్వి. ధారుణిపై నవతారంబు సేయ, మీరును
దోడ్పాటు మేకొనవలయు ...
రం రా బాల. 18 పు, 30 పం.

ఉ. అక్కట కౌరవాన్వయ మహార్ణవ మింకెడు
నట్లు పుట్టె నిం, దొక్కరుఁ డైనఁ గేశవు
హితోక్తికి మేకొనఁ డయ్యె ...
భార. ఉద్యో. 4. 54.

ఉ. పె, తెల్లి తినవేడ్క నవ్వనమహీరుహముం
దవసొమ్ము సేఁతకై, మెత్తవ వేడెఁ జిత్తవిభు
మేకొని యచ్యుతుఁడుఁ జెచ్చెరన్ ...
హరి. ఉ. 1 204

స. క్రి. 1. పొందు.

కం. మృతుఁ డఁట పుట్టుఁ బెరుగును, మృతుఁడఁట
వేఱొకఁడు గుడువ మేకొనుఁ దృప్తిన్
నైష. 7. 75.

కం. ఇనుమంతగాని లేఁ డీ, ఘనిస లుఁడు [illegible]డు
గూటిప్రాయమువాఁ డి, ట్లైపర ఉపాఖ్య
రానులు, మెసఁగెడి వినుపఁడు ప్రతిష్టి
మేకొనఁడు గదే పాండు. 4. 150.

ఉ. ఘూరిజటల్ ప్రవాహముం బోల్పుఁ గనన్
ఘనబాహుశాఖలన్, మీటి గుపర్ణ పర్ణమిచి

మేకొనఁ గ్రొన్నెలరేక కోరకా, కారముఁ
బూన నీలగళకాంతులు కేఁటులనీటుఁ కెంద
ము-, దారములీల కూలి ధననాథునకున్
గనుపించి యిట్లనున్ ... ఉ. రా. 2. 815.

2. చేయు, ఒనర్చు.

ఉ. మించి ముఖాబ్జ చుంబనము, మేకొని నవ్వు
విభుఁడు నేర్పునన్ ... నైష. 7. 183.

అ. క్రి. 1. పూను, ప్రయత్నించు.

ఉ. ప్రముచ్చిర నేల యేఁ గలుగ ముద్దియ నాకు
వృకోదరుండు వి,వ్వచ్చుఁడుఁ దోడు గాఁగ
జనవంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ,
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁ
గాక . భార. ఉద్యో. 3. 120

ఉ .. మీ, మీనిపుణత్వముల్ దెలియ మేకొని
యమ్మగని లోను చేసినన్ ...
వాల్మీ. 3. 69

చం. చలనము లేక యానృపతి శయ్య నహర్ని
శమున్ సుఖించు నా, మెలఁకువ హాని చేయు
టకు మేకొని రాఁదగునయ్య ...
నా పంచ. 1. 815.

2. ఓర్చు, తాళు, సహించు.

చం. ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగ
నేర దెంతయున్, మృదు వాకకీడుపాటునకు
మేకొనఁ జాల దుదాత్తచిత్త ...
భార. విరా. 1. 103.

3. కలుగు, సంభవించు.

ఉ మిత్త్రులచెయ్దులన్ సుఖము మేకొనువంటయుఁ
జెందు దుఃఖముల్, శత్రులచెద్దు వంటయును
సన్మతి దా ధనమూల మంటయున్ ....
భార. శాం. 2. 207.

దండకము. ... మేకొన్న పేరల్కతోఁ బుష్పలా
వర్తకాబ్దంబులం బంపఁగా ...
పారి. 3. 33.

4. తహతహపడు.

క. ఇనుఁ డెఱిఁగె ననుచు సమయాం, గన నీల
పటంబు దాల్చి కలయాశల మే, కొని యెడు
జారిణికై పడి, వనఁ జీకటి పుడమిఁ జెలఁగె
నతిబహుళంబై ... విల్హ 2. 22.

(ఇది కొన్ని యెడల పాదపూరణమునకై ప్రయో
గింపఁబడును )

ఉ. మేలున సంతసిల్లు నెడ మేకొని యాపద లొందు
నాపదల్, తూలఁగఁ బూని సౌఖ్యములు
దోఁచు ... భార. అర 5. 341.

ఉ. మేకొని నీదుభక్తి కుది మెచ్చితి దక్షిణలిచ్చి
నట్లు కౌ. త్సా కనుఁగొంటి నీదగు కృతజ్ఞత
యింతియ చాలు ...
ఇందు 1. 177.

**మేకొలుపు.** స. క్రి (√మేకొను) 1. మేకొనఁ
జేయు, అంగీకరింపఁజేయు.

చం మెయివడి గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్
రతికిం గ్రమంబునన్ ...
కు. సం. 9. 345.

కం. అని ప్రియము గడల్కొనఁ బల్కిన నెంతయు
హావభావలీలాగతులన్, దనచతురోక్తులచే
నా,యనమది మేకొలుప లేక వ్యాకుల
మతియై .. సారంగ 2. 85.

2. కలిగించు.

ఉ. ... కర, ల్లాడఁగనీక మంథనగ మాడిన నాఁటి
పరిశ్రమక్రమా, ప్రమేడితవేగవాసనలు మేకొలి
పెన్ బళిరే తదస్త్రముల్ ...
రామా. 7. 103.

3. పొందించు.

సీ. పులితోలు విడిపించి జిలుగుదువ్వటపురింగుల
వల్లెవాటు మేకొలుప వచ్చు ...
రామా. 2. 110. (ధరింపఁ జేయవచ్చునని
భావము.)

**మేకోలు** = మయికోలు. మెయికోలు, మైకోలు.
వి. (√మేకొను) 1. సమ్మతి, అంగీకారము.

మ. అని యామాత్తికవాక్య మిచ్చుటయు సాంద్రా నంగముం బొంది మా,నిని మేకోలునఁ గుండలావచనముక్ వీక్షింప వయ్యెంబుజా,నన కాని మ్మని పల్కఁ గృత్రిమ విమానం బెక్కఁగాఁ జేసి య,ద్దనుజాధీశుఁడు తా నదృశ్యుఁ డయి చెంతం బోయె సంతుష్టుఁడై ... కువల. 4. 91.

మ. .. పూ దోఁటలోఁ, దనమేకోలున వచ్చి యున్న యువనాథప్రౌఢు సాథోకమా,నని రూఢప్రడిమానురాగ మిగురొందం గూడి క్రీడింపఁగన్. శుక. 2. 889

సీ ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు మేకోలు సమకోలు మేము దొడఁబడిక యొడఁబా టనుట కనుపట్టుచునుండు సమ్మతి పేరు ... ఆం భా. 1. 104.

2. కోరిక, అభీష్టార్థము.

గీ తగులు గానిచ్చు పీఠమర్దవిటచేట, కులకును విదూషకులకు మేకోలు వదపి, తండ్రి గడి యించినట్టి వి త్తంబు వోవ, లొల్లగాఁ దయ్యె నవ్విప్రవల్లభుండు. శుక. 4 111

3. పూనిక, ప్రయత్నము.

మేఖల నం. వి అ స్త్రీ. 1. నడికట్టు, మొలనూలు మొలత్రాడు. 2. ద్విజులు ధరించెడి మౌంజి, ఉపనయనమందు ధరించెడి తృణవిశేషముతోఁ జేసినపడికట్టుకట్టు 3 పర్వతనితంబము, కొండనడుము 4. కత్తి పట్టుకొనుటకై కట్టిన త్రాడు 5. గుఱ్ఱము కడుపుక్రిందనుండి జీను మొదలగునవి కట్టెడితోలుపట్టె, టంగువారు. 6 వర్మదానది. 8 పృశ్నిపర్ణి, ఉమ్మెత్త. (వ్య.వి.)

మేఖలము నం. వి. అ. పుం. ఒకానొకకొండ.

మేగలి = మైగలి. విశే (మే+కలి) శూరుఁడు (వి. పూనిక అని శ. ర.)

కం. ఆటోప మడఁగి యచ్చుటి, మేటిమగలు బిచ్చపడిరి మేగలి కర్ణుం,డే ఓలవికిఁ గవిసె ధను ర్జ్యాకృతి సెలగఁ బాండవాగ్రజుఁ గెలుచన్. భాం. కర్ణ. 2 138.

(శ ర. కరాలప్రతిపా. మెయిగలి. ఆనంద ప్రతిపా. మేగ జ. పా అని అన్యప్రతి. మేగల భా. ల. వ్యా)

మేఘంకరము నం. విశే (అ. ఈ. అ) మేఘముఁ గలిగించునది.

మేఘకఫము నం. వి అ. పుం. కరిక, వడగల్లు.

మేఘచింతకము. నం. వి. అ. పుం. చాతకపక్షి.

మేఘజాలము. నం. వి అ న. 1 మేఘసము దాయము, మబ్బులగుంపు. 2 అభ్రకము

మేఘజీవనము. నం. వి అ. పుం. చాతకపక్షి

మేఘజ్యోతిస్సు. నం వి. . న. మెఱపు, విద్యుత్తు.

మేఘడంబరము. నం. వి. అ పుం. ఉఱుము. గర్జితము

మేఘదీపము. నం. వి. అ పుం. మెఱపు, విద్యుత్తు.

మేఘద్వారము. నం. వి. అ. న. మొగులుదారి, ఆకాశము.

మేఘనాదము నం వి. అ పుం. 1. మేఘధ్వని, ఉఱుము 2. పలాశవృక్షము. 3. తండు లీయము, చిల్లికూర (వ్య. వి).

మేఘనాదానులాసకము. నం. వి అ పుం. మయూరము, నెమిలి

మేఘనాదానులాసి నం వి. న్ పుం మయూరము. నెమలి.

మేఘనాదుఁడు. నం వి. అ. పుం. 1. వరుణుఁడు. 2 రావణునికొడుకైన యింద్రజిత్తు.

మేఘనామ నం. వి. న్. పుం. ముస్తకము, ముస్తె (వ్య. వి.).

మేఘనిర్ఘోషము నం. వి. అ పుం ఉఱుము

మేఘపథము నం. వి అ. పుం. మేఘమార్గము. ఆకాశము.

మేఘపుష్పము సం. వి. అ న. జలము, నీరు

మేఘభూతి సం. వి ఈ స్త్రీ. పిడుగు, అశని.

మేఘమార్గము. సం. వి. అ పుం. ఆకాశము,

మేఘము. సం. వి. అ. పుం. 1. మబ్బు 2. (సంగీ.) రాగభేదము 3 ముస్తె (వృ వి ) వ అభ్రకము,

మేఘయోని. సం. వి. ఇ. పుం పొగ, ధూమము

మేఘరంజి సం. వి న్. న. ఒకానొకరాగము

గీ. అనిలసుతుఁడు త్రిలోకమోహనము గాఁగ, మేఘరంజి యొనర్చి యమేయుతాన, ఆహరిఁ జెంగటిగండోపలంబు గరఁచె ..

సమీర. 6. 213

గీ. ... శంక, రాభరణమును శోకవిరాళి మేఘ, రంజి గుజ్జరి పంతువరాళి నాట

ప్రబంధ. 97, హంస. 5 124

మేఘవన్నె. మి. వి. ఒకవిధమగు వస్త్రము, మబ్బురంగుబట్ట.

గీ. .. మేఘవన్నెలు పచ్చపట్టు, గరుడపచ్చలు నేత్రముల్ తురగవళ్ళు, హంసవళ్ళును బదాగ్రలు హాళిణవళ్లు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు ...

ప్రబంధ. 272.

మేఘవర్ణ సం. వి అ. స్త్రీ.. నీలిమందుచెట్టు

మేఘవర్ణము. సం. వి. అ. పుం. న. వస్త్రవిశేషము

వ తోఁపులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు చీనీలు సాలువులు కళ్ళాయులు నడికట్లు చాదరులు హాసావళులు తగటిపాగలు ...

ప్రబంధ. 605.

మేఘవహ్ని. సం వి. ఇ. పుం. మెఱపు. విద్యుత్తు.

మేఘవాహనుఁడు. సం. వి. అ. పుం ఇంద్రుడు, మబ్బురౌతు.

మేఘవిస్ఫూర్జితము. సం. వి. అ. న. 1 మేఘధ్వని, ఉఱుము.

2 (ఛంద.) వృత్తభేదము.

మేఘవేశ్మము సం. వి. న్ న. ఆకాశము, మొగులుపట్టు.

మేఘసారము. సం వి. అ పుం. ఒక విసుపు కర్పూరము, చీనకర్పూరము (వాచ.).

మేఘసుహృదము. సం. వి. ద్. పుం. మయూరము, నెమలి.

మేఘాఖ్యము సం వి అ. న. అభ్రకము.

మేఘాగమము. సం. వి. అ పుం మబ్బులరాక, వర్షర్తువు, వర్షాకాలము.

మేఘానంద సం వి అ. స్త్రీ. ఒకజాతికొంగ, ఒక విశేషము

మేఘానంది సం వి. న్. పుం. మయూరము, నెమలి.

మేఘాస్థి. సం. వి. ఇ న. కరక, వడగల్లు.

మేచకము, సం. విశే. (అ. చికా. అ.) నల్లనిది. నలుపురంగు గలది.

వి. అ. పుం. 1. నలుపు. 2. నెమిలికన్ను. 3. మేఘము. 4. పొగ. 5. చనుమొన.

న. 1. చీకటి 2. స్రోతోంజనము.

మేట. వి. ప్రవాహముచే కొట్టుకొనివచ్చి కమ్ముకొనిన యిసుక (శ. ర ).

మేటరి విశే (మేటి + అరి³. స్వార్థమున) మేటి, శ్రేష్ఠుఁడు

శా జ్యోతిశ్శాస్త్రిలకెల్ల మేటరివి ...

భాగ. 10 పూ. 285.

మేటి విశే (క మేటి) 1. గొప్పవాడు.

(క) పరాక్రమమున.

కం. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ జేటిచూడ నరిది సం,గరమున నీతని నీశ్వర, వరజనితుఁడు మేటి శౌగవవ్యూహమునన్.

భార. విరా. 5. 8.

(చ) ధనమున.

సీ అచటిమేటికిరాటు అలకాధిపతిసైన మును

సంచిమొనలిచ్చి మనువ దఱులు ..
మనుచ. 1 50.

(ఓ) పరిమాణమున.

గీ. మేటినక్రంబు సందిటం ద్రాటఁ బట్టి ...
కాశీ. 4 69.

కం. పోటరియై రణములోన భుజబల మెల్లం, దేటపడఁ జూపి కుండిన, మేటియశం బెల కలుగు మీరాజునకున్ . విక్ర. 4. 69.

గీ. పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కు, లుఁరలె పాతాళభువనంబు లుదిలె నభము, మేటి ధాటీజనిత కాలకూటవిసము. చిమ్ము వెలువడి యంతంతఁ బెచ్చుపెరుఁగ
భీమ. 4 61.

(త) విద్యలయందు.

కం. చాటు ప్రబంధరచనా, పాటవకలితుఁడవు శబ్దపరిచితియందున్, మేటివి దీనిం దెనుఁ గునఁ, బాటించి రచింప నీవ ప్రౌఢుఁడ వర యన్, రాఘవ. 1. 12.

(వ) కులాచారములయందు.

శా. ... దుశ్శీలాగారము వారయోవతము నిస్సీ మేటి వాటించునే ..
పాండు. 3. 42.

2. అధిపుఁడు, ప్రభువు.

గీ. అంబురాశి నదంబుల కచలములకు, నాహి మాద్రి పతులకుఁ గళ్యపసుతుండు, మేటియై యొప్పశ్రీయ సురకోటి కెల్లఁ, బ్రభుఁడ వీ వొక్కరుఁడ కావె పద్మనాభ
హరి. పూ. 7. 206

3. శ్రేష్ఠుఁడు

మ. ...ఖం కేల చిం,తిల నీపుత్త్రిలయందు మేటి యనఁగా దీపించు విద్యాగరిష్ఠులలో శ్రేష్ఠుఁడు బ్రహ్మనిష్ఠుఁడు గనిష్ఠుం డింమలిం జానకా · ఉ. రా. 2. 184.

సీ. ... కన్నాకు మేల్పంతి నికరము మేటి మేలు. తనరు శ్రేష్ఠము .. అం. భా. 8. 15.

వి. (క. మేదె) (కసవు, వామి, (గడ్డి) కుప్ప. (శ. ర).

జ. మేటరి, మేటితనము, మేటిల్లు.

మేటితనము వి. (మేటి + తనము) గొప్పతనము
కం. తనువు గలయాత్మ లెల్లన్, దినవశముగఁ దనరుదండధరుఁ డట్లు విచే,తనుఁ డయ్యె. మదుఖజాఘా,తన కింతియు చాలు మేటితనమని.
యొలమిన్ హరి. ఉ 10. 141

మేటిల్లు అ. క్రి. (√ మేటి) అతిశయించు
కం. ఏమి మడివాల యే మీ,భూమీశ్వరు నర్థి గానఁ బోయెదము సభా,భూమికిఁ జనియెదు వారికి. శ్రీ మేటిల్లంగ మంచిచీరలు వలయున్. హరి పూ. 9, 18.

మేటుల సం. వి. అ. స్త్రీ ఆమలకి, ఉసిరికచెట్టు (వృ. వి)

మేఠి సం వి అ. పుం 1. స్తంభము, 2 కళ్లము మధ్యమున నెడ్లను గట్టెడిరాట. (స్తంభము)

మేఠుఁడు సం వి అ. పుం. మావటివాఁడు,ఏనుఁగును నడుపువాఁడు.

మేడ వి. 1 సౌధము

సీ. మేడల ముత్యాల మేలుకట్టులు గట్టి రత్న దీపిక లగారముల మంచి .. విక్ర. 4 136.

సీ. మేడన స జ్జన మేలుమ చ్చనఁగను నుప్పరి గన సౌధ మొప్పుచుండు ... అం. భా. 2. 17

సీ. మలయజం బేవిటఁ దొలుఁ జెక్క డులిచి మేడల కిడ్డమిగులు భూములకు డిగ్గు ... ఆము, 2. 3.

2 దేవళము, దేవగృహము.

సీ. అదె కుక్కుటేశ్వరం బయ్యొపొంతముమేడ హుంకారిణీ దేవి యోలగంబు .... భీమ 3.56.

మేడి వి. అత్తి, ఉదుంబరము (వృ. వి.)

గీ మేడిపండ్లును మొదలుగాఁ గూడిమాడి, చెంచె తలు దెత్తురిత్తు విచ్చేయవయ్య...కాళ. 3.69.

దండకము ... నీమెయి వ్నల్వగ్రుడ్డుంగముల్

మేడిపండ్లున్ వలెం గ్రోవులై యుండు...నీలా 2 41.

సీ. . అత్తిమేడి యనంగ నవు నుదుంబ, ఠంబు. . ఆం భా. 2. 42

**మేడికాయబోనము** = సారహీనము.

కం. రాగంబు నొడిచి ముక్తి(శ్రీ)గౌరవముల కపేక్ష చేయుమునులకున్, నాగేంద్రయావ యైహిక, భోగం బిది మేడికాయబోనము సుమీ. విప్ర. 2. 80.

**మేడించు = మేదించు** స క్రి. (సం. మృడ్) మర్దించు.

సీ పూఁదేనెఁ జిలికి కెంబుప్పొడి మేడించి చుక్క బొట్టుగ దిద్ది నొక్క చెలికి .. చమ 1 77.

**మేడు** వి. 1. అజ్ఞానము.

(చూ. మేడుపడు.)

2. వంచన. మోసము.

(చూ మేడ్పెట్టు).

జ మేడుపడు, మేడ్పఱచు, మేడ్పెట్టు.

**మేడుప(డ్ప)డు** అ. క్రి. (√ మేడు) అజ్ఞతనొందు.

కం. ఈగికిఁ గలుచు హారిద్రా.రాగం బది నిల్వదె యిది రతి మేడ్పడి సం,భోగగతిఁ గలుచు విటు నివి.రాగం బది నిల్చు భావరస జననంబై. కు. సం 8 163.

గీ చదురుఁ డై మేడ్పడి యడుగువాఁడు...
దశకు. 6 133.

ఉ. మేడ్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవు గాక . . ఉ హరి 5. 198

ద్వి ప్రామిడి యై మేడుపడియెడుదానఁ, గామి నీ వెఱుఁగవే కదయింటిపొడువ ... బస పు 4. 503 సం.

(ప్రామిడిమై మైదుబడియెడు దానఁ, గామి ... ప్రాఁతప్రతి పా)

**మేడెము**¹ వి (క. మేడె) 1. గుఁపు, సంఘము

సి. ంథికవహిస్తిపగతారంగికుల్ వలగొని మేడెమై కనఁ(జూపుమేర నడవ ...

ఉ. రా. 3. 136. (మేడమై శ. ర. పా).

2 యుద్ధము,

కం ఒరో- వంకముక్కువ, నూరుపు దెబ్బ తిఁక సేల యోడితి నన్నన్, వాఁడు మేడెముఁ బొడుతురె .. బస. పు 6. 25 (ప్రా).

(మేడము పొడతురె శ. ర. పా.)

ద్వి ఒడితి నన్నను మేడెము పొడువఁ, బాడితే బస. పు. 6 58 సం.

**మేడెము**² వి. చెక్కడపు జుమికీయంచు పనితనము (శ. ర, ప్రా.).

**మేడెము**³ వి. గుదస్థానము

సీ. వాఁడికొఱ్ఱుల నాఁటవైచి మేడెముతోన . . వి పు. 8. 471.

**మేడ్పఱచే–మేడ్పెట్టు** స క్రి. (√ మేడుపడు) వంచించు.

సీ. ... దనాశ్యంతరమున. కరిగి మేడ్పఱచి కామాతురుఁ జేసి యిమ్మునినాథు నిట దెచ్చె ముదముతోడ ... దశకు. 5 35.

**మేడ్పెట్టు–మేడ్పఱచే** స. క్రి. (మేడు+పెట్టు) వంచించు.

సీ. మును వసుపాలితుధవము వెడ్డువఁ గొన్న తరుణి మేడ్పెట్టెడు మెఱపు గొఱలి ..దశకు. 5.88..

**మేఢ్రము** సం. వి. అ. పుం. జొట్టేలు, గొఱ్ఱెపోతు.

వ శిశ్నము, పురుషుని గుహ్యావయవము

**మేణత** వి. ముట్టడి.

మ . కృష్ణరాయమహారాయలు పుదయగిరి దుగన్ంమీద విడిశి ప్రతాపరుద్రగజపతిని కొండ వీడు పర్యంతం విరుగంబొడిచి పుదయగిరిదు ర్గానకు మేణత చేయించి దుర్గం పుచ్చుకొని ... నె, కా. 3. 1886.

**మేతాలుపు(ల్పు)** వి (మే+తాలుపు) శరీరధారి

సీ పొర యూని మేతాలుపులఁ జిట్టుమని వెఱ కొలుపుచు రెండునాల్కలు దనర్చ ... అచ్చ. రా బాల. 106.

కం తల లేక నిరుపు లగుచే,తులు గ్రాలఁగ నతని లోన దొంకినమేతాల్పుల. నెల్లఁ బట్టి

భ్రమింగెడు, పాలమేపరి నొకనిఁ జూచి పొది
లిన కినుకన్. అచ్చ. రా. ఆర. 117

**మేథి.** సం. వి. ఇ. పుం. కళ్లమునందు పశువులను కట్టుటకు పాఁతినరాడు.

**మేథిక.** సం. వి. ఆ. స్త్రీ. తృణవిశేషము. మెంతి (వృ. వి.)

**మేథిని.** సం. వి. ఈ. స్త్రీ. = మేథిక, తృణవిశేషము (వృ. వి.)

**మేద.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక ఓషధి.

**మేదకము.** సం. వి. అ. పుం. 1 పిండితో చేసినకల్లు. మద్యపిష్టము.

**మేదకుఁడు** వి. వెట్టికాగులవాఁడు.

గీ. ... మతి లేనిమేదకుండు, మౌనివర్యులఁ జది
వించుమట్టినీడఁ, బంచముఖుపీట మే నొస
రించెనేని .. పాండు. 1. 101

ద్వి. ఒకవిచారము మాకు నొదవె నీరాజు, సుక
వానిపనిపంద చూపుగుట్టంబు, మామిడిక్రింది
సోమరి మేదకుండు ...

ద్వి. హరిశ్చ. ఉ. 1497 పం

సీ. మితభాషి యగువాని మేదకుండని పల్కు
జడుఁడంచు వచియించు శాంతిపరుని

రామలిం. 32.

**మేదజము.** సం. వి. అ. న. ఒకజాతి గుగ్గిలము.

**మేదము.** సం. వి. అ. పుం. 1 ఒకానొక సంకరజాతి 2. అలంబుష యనెడి యోషధి (వృ. వి.)

**మేదర.** వి. వెదురుతడకలు, చాపలు మున్నగునవి అల్లుకొని జీవించు ఒకజాతి (శ. ర.)
ఇ. మేదరి, మేదరసాని.

**మేదరి.** వి. (మేదర + ఇ) మేదరవాఁడు, వెదురు బద్దలతో చాపలు లోనగునవి యల్లెడి యొకజాతి వాఁడు.

ద్వి. పీఁగుచుఁ జేటలవేమయ్యభువిని, దాఁ గాక
మఱియు మేదరులు గొందఱకు, జీవితంబులు
జేసి చేటలు చాలఁ, గావించి ...

పండితా. పురా. 162 పొ.

ద్వి. తనతోడిజోడుమేదరులు సోదరులు ...

ద్వి. పరమ. 2. 127 పొ.

**మేదరిసాని.** వి. (మేదర+సాని) మేదరవాని భార్య.

సీ. కొడుకుఁగుఱ్ఱఁడు చన్నుఁ గుడుప కట్టుంట
విచారించి మేదరిసాని యపుడు ...

పరమ. 1. 109.

**మేదస్తేజస్సు.** సం. వి. స. న్. అస్థి, ఎముక.

**మేదస్సు.** సం. వి. స్. న. వప (సప్తధాతువులలో నొకటి.)

**మేదావి** వి. 1. బ్రహ్మచారులు మేధావీభూయాసమ్ అను మంత్రమును జెప్పుచు అగ్నికార్యాంతమందు ధరించుబొట్టు.

గీ. దబ్బవేలియుంగరము మేదావిబొట్టు, మడుఁగు
పేటిక పిరచుట్టు బెడఁగుఁ గాఁగ, ఏడుగు
చందఁబు హర. ఉ. 10. 233.

సీ. మూర్తిత్రయీమధ్య మునివర్ణ మిదియ నాఁ
ద్వైత్రిపుండ్రమధ్య మేదావి యొనర ...

రా. వి. 2. 36

2. అగ్నికార్యభస్మము.

వ. .. బొట్టునకు మేదావి మేమినలవాటునఁ
గఁదిన యంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం
బృథగ్వర్ణమూర్తు లగుసంపత్తికలు గలంట
రుహం బనఁ బ్రశస్తం బగు హస్తం బెత్తి
స్వస్త్యస్తుతే యని యాశీర్వదించుట.

పాండు. 4. 120

**మేదించు = మేడించు.** స. క్రి. (సం. మృద్.)

1 మర్దించు.

సీ. మంచిమిన్నిట మేదించినసారంగనాభి పంకం
బున నాభిదీర్చి ... వరాహ. 3. 109

సీ. గోడలు పూయింగఁ గుమ్మ గందంబున మేదిం
చినట్టి జవ్వాదియడుసు ... యయా. 1.119.

సీ. గొజ్జంగిపూఁదేనె కులికి మేదించిన కమ్మ
కస్తూరి మేనఁ గలయ నలఁదు ..
కాశీ 3 118

2. నేర్పు, అభ్యసింపఁజేయు, మప్పు

సీ కోడె లన్నింటిని గూడంగఁ దోలించి
మేదింప దుక్కికి మెదుకలైన, ద్రుచ్చు
గిత్తలఁ బట్టి ముకుద్రాళ్లు గుట్టించి ..
నా పంచ. 5 13

**మేదిని** నం. వి ఈ స్త్రీ 1. భూమి. 2 ఒకా నొక సంస్కృత నిఘంటువు. 3 మేద(వ్యు.వి.)

**మేదినీద్రవము.** నం. వి అ పుం దుమ్ము, ధూళి. (త్రి ని)

**మేదినీపతి** నం వి అ పుం భూపతి, నేల ఱేఁడు.

**మేదిరము.** వి. (నం. మేదస్) మెదడు

సీ హరునిచే మడిసిన యంధకాసురు నాఁడు
వెసఁగమే కడుపార మేదిరములు ..
మైరా. 3. 145

**మేదు.** స క్రి. 1. పూయు

సీ లోకపాలోన్నత ప్రాకారములయందు మృగ
మదపంకంబు మేదిరొక్క . భోజరా. 2 101.

2 మెదుపు.

ప ... బొట్టునకు మేదావి మేదునలవాటునం
గందినయంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం
బృథగ్వర్ణమూర్తు లగునంవర్తికలు గలజల
ఱంబు బని .. పాండు 4 152.

**మేదుఁడు.** నం. వి అ· పుం. ఒకానొక రాక్షసుఁడు

**మేదురము** నం విణ (అ. ఆ. అ.) సాంద్రము. దట్టమైనది.

**మేదురితము.** నం విణ (అ. ఆ. అ.) దట్టమైనదిగాఁ జేయఁబడినది, సాంద్రీకృతము.

**మేదోజము.** నం. వి అ. న. అస్థి, ఎముక.

**మేదోర్బుదము.** నం వి. అ. న. మేదోధాతువు.

**మేధ** నం. వి ఆ. స్త్రీ (సు. దుర్, వ్యతిరేకార్థకమగు నఞ్ అ. పూర్వపదముగా నుడిన బహువ్రీహిసమాసమున మేధస్ అని మారును ఉ సుమేధస్, దుర్మేధస్, అమేధస్ .

1 ధారణశక్తిగలబుద్ధి. 2 తెలివి, బుద్ధి.

**మేధము.** నం వి అ. పుం. 1 యజ్ఞము.
2. హవిస్సు (కల్ప)

**మేధాజిత్తు.** నం. వి. త్. పుం. కాత్యాయనుఁడు (త్రి. ని.).

**మేధాతిథి.** నం వి ఇ. పుం మనుస్మృతిపై వ్యాఖ్యానము రచించిన యొక పండితుఁడు

**మేధారుద్రుఁడు.** నం వి అ. పుం. కాళిదాసుడు (త్రి. ని )

**మేధావంతుఁడు.** నం విణ (త్. వతీ, త్) తెలివిగలవాఁడు, బుద్ధిమంతుఁడు.

**మేధావి** నం విణ (న్. నీ న్.) 1. చాలబుద్ధిమంతుఁడు, మంచిజ్ఞాపకశక్తి (ధారణ) గలవాఁడు. 2. తెలివి గలవాఁడు, బుద్ధిమంతుఁడు
వి న్. పుం 1 శుకము, రామచిలుక. 2. మద్యము, సారాయి.

**మేధావిని.** నం. వి. ఈ. స్త్రీ. బ్రహ్మభార్య, సరస్వతి.

**మేధి.** నం వి. ఇ స్త్రీ = మేథి.

**మేధ్య.** నం. వి ఆ. స్త్రీ మండూకాద్రి

శ్లో మండూకీ బ్రహ్మజా శంఖపుష్పీ జ్యోతిష్మతీ మునిః, విష్ణుక్రాంతా వచా శ్వేతా మేధ్యాయాం సప్త నమ్మతాః (రా. ని.)

**మేధ్యము.** నం విణ. (అ. ఆ. అ ) 1. యజ్ఞమునకుఁ దగినది. 2 పవిత్రమైనది.

వి అ. పుం. 1. ఛాగము, మేఁక. 2. ఖదిర వృక్షము, సండ్రచెట్టు. 3. యవధాన్యము.

**మేన.** విణ. (√మేను) స్త్రీకి తోడఁబుట్టినవాని యొక్కయు పురుషునకు తోడబుట్టిన దాని యొక్కయు స్త్రీ పురుషులకు తండ్రి తోడఁ

బుట్టిన వానియొక్కయు తల్లితోఁబుట్టిన వాని యొక్కయు దేహసంబంధము కలవాఁడు: కలది.

(దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

ఉదా: మేనల్లుఁడు, మేనత్త, మేనమామ

**మేన.** సం. వి. అ. స్త్రీ. హిమవంతునిభార్యయగు మేనక.

**మేనక.** సం. వి. అ. స్త్రీ. 1. ఒకానొక యప్సర స్త్రీ. 2. హిమవంతుని భార్య.

**మేనకాత్మజ** సం వి. అ. స్త్రీ పార్వతి.

**మేనకోడలు** వి. ఔ. (మేన + కోడలు) పురుషునకు తోడఁబుట్టినదాని కూఁతురు: స్త్రీకి తోడబుట్టిన వాని కూతుఁరు

(వ్యావ) ఆమె తనమేనకోడలినే కొడుకునకు చేసికొనవలె నని గట్టిపట్టు పట్టినది.

**మేన(య)త్త.** వి. (మేన + అత్త) తండ్రితోడఁ బుట్టినది

సీ. ... పద్మనాభుఁ, గావఁగఁ జనుదెంచి కడుఁ బ్రీతి ని ట్లను నవఘ యే మీకు మేనత్త మగఁడ... హరి. 1 136

చ. అతివిక్రృతస్వరూపధరుఁ డైన కుమారకుఁ బ్రీతితోఁడ సాత్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి యద్భుత, ప్రతిభులు రామకేశవులు పన్నుగ నేఁగిరి...

భార. సభా. 2 55.

**మేనబావ.** వి. (మేన + బావ) తనకంటె పెద్దవాఁ డగుమేనమామకొడుకు, మాతులేయుఁడు, తనకంటె పెద్దవాఁ డగు మేనత్త కొడుకు.

కం నిను నెఱుఁగ కుండి యాదవుఁ, డని సఖుఁ డని మేనబావ యని యే సహాభో, జనములు సల్లాపంబులు, నొనరించుచు మేలమాడు చుండుదు నెపుఁడున్.. భార. భీష్మ. 1. 217.

ద్వి. కురునాయకుని కొఱకొఱమాటలకును, హరి మేనబావను నాత్మఁ గైకొనక ..

అ. మ. క. 5. 255 పా. 2 పం.

సీ. మేనబా వని మేర మాని యుండక బుద్ధి బలదేవునెడ భక్తి మెలఁగవమ్మ ...

ముకుంద. 3 309.

**మేనమఱఁదలు.** వి ఔ. (మేన + మఱఁదలు) తనకంటె చిన్న దగుమేనమామ కూఁతురు, మేనత్తకూఁతురు.

సీ భరతకులాగ్రణి పాండవసింహంబు సర్వ ధర్మజ్ఞుఁ డాసవ్యసాచి, తనమేనమఱఁదలి భవశాక్షిఁ దోడ్కొని చనియె నాతని కడి చనదె చెపుఁడ ..

భార అది. 8. 203.

ఉ. ఇది వీరభద్రుభుజ వీర్యకుల్కయే, మిన్నక కాదు నీదయిన మేనమఱందలు నీక చేరె నీ, యన్నుఁ బరిగ్రహింపుము ..

హరి. పూ. 6. 168.

మ. ... సందర్శనపోషిపా, ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగన్ ... వన జాతాతుఁడు పెండ్లియాడె సహితవ్రాతంబు భీతంబుగన్ ... భాగ 10 ఉ 145.

**మేనమఱఁది** వి. (మేన + మఱఁది) తన కంటెఁ చిన్నవాఁడగు మేనమామకొడుకు, మేనత్తకొడుకు

చం భువనము లొక్కపెట్టు మృతిఁ బొందిన జీవము లావహింప నేర్తు వలచినట్టులైన గుణరూఢుఁడు మేనమఱంది పౌత్రుఁజూ, పవిడుతె ... భార అశ్వ 3. 177.

**మేనమామ.** వి. (మేన + మామ) తల్లితోడఁ బుట్టినవాఁడు, మాతులుఁడు

కం. మదుమథనుఁ డాక్షణంబున, మధుర గుఱిచి కదలి మేనమామఁ దగఁ దడీ, యభరిత్రికి వీడుకొలిపి యధికప్రమదంబుతోడ వన్నయుఁ దానున్... హరి. ఉ. 1. 169.

సీ. మినిమిసెఁ సీమ వలరాజు మేనమామ ...
మనుచ 1. 18.

కం. కంచికిఁ జని బహువిభవస, మంచిత మగు మేనమామమందిరము ప్రవేశించి తనవనితఁ గనుఁగొని, సంచలత వహించి గుండె జల్లన నున్నన్ ... విక్ర 7 126.

**మేనఱికము** వి (మేన + అఱికము) 1. మేనమామకూఁతురు మేనత్తకొడుకున కిచ్చి చేయు పెండ్లి సంబంధము

(తోడఁబుట్టిన దానియొక్కయు తండ్రితోడ బుట్టిన దానియొక్కయు, దేహసంబంధ భావము. శ. ర.)

(వ్యవ.) వారిపిల్ల వానికి మేనఱికమే కాని పై సంబంధము చేయరు.

2. పరిహాసము.

ఉ. గిరీశ గళమూలహాలాహల కాలకాంతితో, మేనఱికంబు లాడుతనమేటి త్రిశూలముఁ బూని యుద్ధతిన్
మనుచ 4 96.

**మేన(య)ల్లుఁడు.** వి (మేన + అల్లుఁడు బ. మేనల్లురు, మేనయల్లురు) పురుషునకుఁ దోఁడఁబుట్టిన దానికొడుకు, భాగినేయుఁడు, స్త్రీకి తోఁడఁబుట్టిన వానికొడుకు.

మ. హరిమేనల్లుఁడు గొంతికూర్చుమనుమండసన్మిత్తనూజుండు ...
భార. ద్రో. 2. 236.

సీ. అమ్మహాసురుని మేనల్లుఁడు లవణుండు మధు దైత్య తనయుఁ డున్మాద బలుఁడు ...
హరి. పూ. 5 59.

కం. నిముఁ బట్టి పాండుపుత్రులఁ, మేనల్లురఁ దొఱంగె ధరణీశ్వర . .
భార. శల్య. 1. 79.

శా. నా మేనల్లురు బాహుసత్త్వవికసన్మాహాత్మ్యవిఖ్యాతు లా, రాముం గృష్ణునిఁ జూచు వేడుక మనోరంగంబువం దాడెడున్ ...
హరి పూ. 8 75.

**మేవాదము** సం. వి. అ. పుం 1. మయూరము, నెమలి. 2. పిల్లి 3 మేఁక

**మేని** వి కాంతి (శ. ర.)

**మేను** = మే. వి దే 1. శరీరము.

(కొన్ని యెడల దీనికి హల్లు పరమగునపు డుత్వ లోపము)

సీ అతఁడు వంద్రెండు వాలమ్ము లావీభత్సు మెయిఁ గ్రుచ్చి కృష్ణుని మేనియందుఁ, బది వాలు తూపులు వఱపిన మదిలోన నగ్గించి ...
భార. శల్య 1. 212.

సీ. మెలఁత మేనిమెఱుఁగు మెఱయు కారు మెఱుంగు చిగురు కెంపులగ్రోవి చిన్నిమోవి.
విక్ర 1. 119.

ఉ .. న, స్మిఱఁగ బానిసీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మేన్, గాఱియ వెట్టియైన నొడికంబుగ వండుదు సెల్ల గూరలున్ .
భార విరా. 1. 77.
ఆం భా. 2. 134.

2. జన్మము, పుట్టువు.

సీ. ఏమిటఁ జూచిన నీయింత తొలుమేన సుకృతంబు సేయుట ప్రకట మయ్యె ...
విక్ర 4. 198.

కం. విను ప్రద్యుమ్నునిఁ దక్కన్, మనము నే నొరు వరించ మాట విడువు మా,ఘనుఁ దొల్లి కున్నఁ జెందుదు, మనసిజ శిఖఁ దనువు వ్రేల్చి మఱునటి మేనన్ ...
ప్రభా. 3. 102.

గీ. కోరి తొలుమేనఁ దన కైన కొదవలెల్లఁ మాన్పుకొన వచ్చి ... పారి. 1. 17.

3. పార్శ్వము, ప్రక్క.

(ఇరుమేను = రెండుప్రక్కలు.)

గీ. తఱిమి సాత్యకి గృతవర్మ దాఁక నతఁడు,

నేచి మార్కొంచ నిరుమేను పూచి యొప్పు, మిగులు మోదుగుఁబ్రూఁకులపగిది గాఁగ నడరె, మార్కొన్న రెండు వాలంపగములు.
భార భీష్మ. 1. 251.

కం పెంట్రో శద్దాసరి యష్టుం ఒదవాతులను గవోణిపోటుల నిరుమేనం బొడుమచుఁ బెన గుచు బో,వం బట్టి వటఁబుఁ జేర్చి వాఁడిట్లనియెన్. అము 6. 24

**మేనుపూను** = జన్మమెత్తు, అవతరించు

**మేనుమఱచు** = ఒడలెఱుంగకుండు. పరవశమగు.

సీ మరువంపువలపుఁ బల్మఱు క్రోలి క్రోలి కన్ బ్రూల్చి యూఱక మేనుమఱచుఁ గొన్ని .. పాండు 1. 181.

**మేనువైచు** = పండుకొను, శయనించు.

వ ఆయ్యింతి ... ఏకాంత భవనంబున విరహశయ్యపై మేనువైచి చింతాక్రాంతయై యుండె శివరా. 2 22

గీ. జన్నంపుఁ గూటిదొరల, మాటకయి మేను పూనిన మేటివేల్పు .. నీలా 3. 51.

జ; మేన, మేనకోడలు, మేనత్త, మేనబావ, మేనమఱఁదలు, మేనమఱఁది, మేనమామ, మేనటికము, మేనల్లుఁడు.

**మేపరి** విశ (మేపు + అరి³) తినువాఁడు. (చూ పాలమేపరి.)

**మేపాడు.** అ క్రి (మేపు + ఆడు) ఆహారము గొను.

కం. పోఁ మునిమేపాడి కపింజల మత్తటి మఱలి వచ్చి శశము నివాసస్థలిఁ గనుఁగొని ... వేం. పంచ. 3. 108

(మేఁతాడు, శ ర సా)

**మేపు.** స. క్రి (√మేయు) పశుపక్ష్యాదులను ఆహారము తినునట్లు చేయు.

(ఇది మనుష్యాహారవిషయమున నిందార్థోద్యోతకముగా నుపయోగింపఁబడును.)

సీ. ... వత్సముల్ మేపుచు వత్సన్నపుడు ... దశా. 6. 155.

కం. ... నృప కృప, చాలుం గాఁరాకు మేసి చంపకు ప్రజలన్ . అము. 2. 32.

(వ్యవ.) చిన్నతనమునుండియు వీరి కుటుంబము నంతయు శెగమేపఁగా తుడకు వి స్వాసా న్యులైనారు వానిని అత్తవాఁర చాలాకాలము మేపినారు

వి 1 (పశుపక్ష్యాదుల) ఆహారము, తిండి.

కం. రేపకడ నీరు ద్రావక, మేపు గొనక మున్న గోవు మిక్కిలి భక్తిన్ . భార. అను. 2. 18.

కం గోపకుమారకశేఖరు, నేపున సప్పంబు గఱచు టీతించి వగన్, మేపులకు దొలఁగి గోవులు, వాపోవుచు నుండె వృషభ వత్సంబులతోన్. భాగ. 10 పూ 647.

చం కనుకని తెల్లవారునను ప్రతి గోరెడు పల్లవాళి మేపు, ల్గనుఁగొని వెడెముగలుపు లాహిరి మేపుల నిద్రబుచ్చి చెందన చిఱునవ్వుతో నపుడె నిద్దురలా యని వింతపైఁడి పట్టిన వెలముద్దుగుమ్మలు పడన్ శయనించిరి చప్పరంబులన్ కువల 2 112.

2. దోసె పిండి మొదలైనవానికి నూటికూడఁ జేర్చెడు మినపపప్పు లోనగునది (శ. ర)

**మేపుట్టువు** వి. (మే + పుట్టువు) 1. కుమారుఁడు, ఆత్మజుఁడు

ఆ అనిచి సోఁకు జేని యనుఁగు మేపుట్టువుఁ, బొదివికొనిన వాఁడు నుదరి లేచి, వ్రేల్మి పోవఁబెట్టి వ్రేల్మిడిఁ దేరెక్కి కడిఁది మగతనంబుఁ గడలుకొనఁగ ...
అచ్చ. రా. యు. 340.

2. కూతురు, తనూజ (శ. ర).

**మేపుఁడు.** విశ. (√మేయు) మేయునది.

కం. గాలికవణంబు మేపుడు. చాలుపులంబోలి

తరకసంబున నొఱపూ, స్మేలి యపరంజిపిం జల, వాలారుందూపు లుఱక వామిగ చేసెన్. అచ్చ. రా. యు. 293.

మేమఱుఁగు వి (మే + మఱుఁగు) మైమఱువు కవచము.

సీ మైమఱు వనఁగను మేమఱుఁ గనఁ గత్తళ మ్మనఁగా బొందళం బనంగ. జో డనఁ గవచంబు శోభిల్లు .. అం. భా. 2. 204.

మేము. అ క్రి. స క్రి. అంగీకరించు, ఒప్పుకొను. (చూ. మేముడు.)
జ· మేముడు )

మేముడు వి. (√మేము) అంగీకారము, ఒప్పుదల

సీ. ఇయ్యకో లొప్పుకో లీకోలు మైకోలు మే కోలు నమకోలు మేము వొడఁబ,డిక యొడఁబా టనుట కనుపట్టుచునుండు సమ్మతి పేరు .. అం. భా. 1. 104.

మేమెయి = మయిమయి, మేమే, మైమై వి అనాయాసము.

"క్రి విశ అనాయాసముగా" అని (శ. ర.)

ఉ. వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు, న్మీలితవిక్రముం డగుడు మేమెయి నాతనిఁ దాఁకె నస్త్రవి, ద్యాలసితుండు సాత్యకి ... భార. శల్య 1. 322.

గీ వారి మేమెయిఁ గొనియాడువారికోర్కు, లొనర జంగమమల్లికార్జునుఁడు నొసఁగు ... కు. సం. 12. 1004

ఉ. ఆటున మూర్ఛవోయిన బ్రహస్తుఁ గనుం గొని యింకఁ దాఁకినన్, గీ టడఁగించు నర్జునుఁడు గేనలుఁదే యని భీతచిత్తులై, మేటిమగల్ నలం జెదలి మేమెయి మార్కొన లేక పాటినం, గాటుకకొండ వోలె దళకంఠుఁ డెదిర్చె మహీమహేం ద్రునిన్. నిర్వ. 7 52

మేమే[1] = మేమెయి.

మ. ... ఇద్దరున్ భుజబలాటోపంబుమై నొండొరున్, మిగులం జాలక కొంత సేపువడి మేమేఁ జోరి రుగ్రాక్సతిన్
భార. విరా. 2. 348.

మేమే[2] వి. రాకవాదుబయందు దుఃఖమువలన కలుగుధ్వని కనుకరణము.

కం. సామీ యల్లదరాసురు, సామీ ప్రతదేహుఁగా వచఃకళచేతన్, మేమే శిక్షించుతటి, స్మేమే యన విడిచినాము మిము దూరుటచేన్. పార్వ. 5. 128.

మేయము సం విశ (అ ఆ. అ.) 1. కొలువఁ దగినది 2 జ్ఞేయము, తెలియఁ దగినది.

మేయించు. సం స క్రి. ఊహించు, అనుమానము సేయు.

కం ఆయెడ నిద్దఱుమిండలఁ, జాయక రతిసల్పు కాఁవడఁతుక యెటులన్, మేయించి బొంక వలెఁ జెపు, మా యని చక్రాంగవంశ మండన మనినన్ హంస. 4 161.

మేయు స క్రి. (పశ్వాదులు) తిను, భక్షించు.

చం. నునుఁజిగురాకు మేయుతటి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్, వనతరుశాఖలన్ గువకువ ధ్వనిఁ జాఱుపికాంగనన్ ... మనుచ. 3. 82.

సీ. ... ఎల్లకడల, మెలఁగుచు నసి నెల్ల మేయుచు గోడలు వెలుగులు వెండెముల్ విఱుగఁ ద్రొక్కి ... నీలా. 2 48.

వ. తియ్యనివోరం జేదు మేయుట నాయంబు గాదు ... ప్రభా. 1. 90.

2. అనుభవించు.

కం. మౌని నయినాఁడ రాముని,చే నొగచేపట్టు మేసి చిత్తంబున కు, ద్యానారామపదం బవ, సానవిరామాహ్వయంబు జగు కగు ననినన్. చం. రా. 6. 60

8 నోటనుంచు.

మ. కలుచం గోశబిలంబు వెల్వడి యదఃఖడ్గాహిపై వచ్చుచోఁ, జలనం బించుక లేక యీతనిరిపుక్ష్మాపాలసంఘాత మో, చెల హస్తాంబురుహాంగుళీమయమహాసిద్ధౌషధి పల్లవాం, చలము ల్మోసి భజించుజాంగుకతన్ సంగ్రామరంగంబునన్. నైష. 5 157.

జ మేఁత, మేఁతకాఁడు, మేఁతరి, మేఁతరీఁడు, మేఁతలాడు, మేపరి, మేపాడు, మేపు, మేషుడు.

మేర వి 1 ప్రదేశము, చోటు. (సం మిరా, ప్రా. మేరా, క మేరె.)

సీ నిట్టలు ద్రోచుచు నెరవులకలమేర లెల్లను బిగియెక్కి యేర్పడంగ ...

భారం. విరా. 1 245.

చం. మదగజరాజకుంభముల మచ్చరికించు నురోజకుంభముల్, గదిసి కలంతమేరయునుఁగైకొని యున్నవి యెల్లవారికిన్, విదితముగాఁగ ...

నైష. 8. 65.

సీ ఒకమేర సుకుమారసకుమార కరవీరవరవీర తరుసముత్కర మెసంగ....

ఇందు. 3. 30.

2 క్రమము, విధము

సీ. సూకరపతిమేర నేకపద్ధతిఁ బోని యలరు విల్తు నిభంగి యతనుతఁ గని ...

ప్రబంధ 6.

మ, ఆమలాత్ముం డగునట్టిధీరునకు సింగాధీశతిమ్మావనీ, రమణీనాథకుమార తిమ్మమనుజేంద్రస్వామిరంగతమా, రమణు ల్గల్గి ధరిత్రి దాళరథిమేర ల్దాల్చినారు. భామ. 1. 23.

సీ. భయభక్తియుక్తి నెప్పటిమేరఁ దనయాజ్ఞఁ బాలింప దయ్యెను జారకులము . .

దశా. 2. 51.

3. ధర్మము, న్యాయము.

చం .. అమృతంబు సురాళికిఁ బంచిపెట్టి నిం కెటువలె నమ్మ వచ్చు జగదీశ్వరుఁడే యొకయింత మేర లే, కిటువలెఁ జేయఁ జూచె మన కెయ్యది తప్పు గణించి చూడఁగన్ . .

దశా 2 382.

గీ. అప్పు డట నుండ మేర గా దనుచు మేము, విడిచి కీమెను దోడ్కొని వెడలి రాఁగ, నతఁడు చనవలదం చని యడ్డగింప.. పాంచా 4 160.

శా. చేఁన్ బోవఁ బ్రధాను లడ్డమయి యాజ్ఞాపించి యల్లేఁగఁగా, మేరా నీ వెటఁ బోయె దెవ్వఁడవు . ఉ రా 3 230

4. ఏర్పాటు

కం ఏమిట నీకేఁ దక్కువ, నామేరకు నడ్డపడితివి ... భార. ఉద్యో. 3 296.

గి. ఆమేర లెల్లను నబ్జజుం డెటిఁగి, సామీఁద గోపించి నయ మింత లేక ...

రం రా యు. 293 పొ 5. పం

గీ. వెఱచి పలుమాఱుఁ జాఱెడివిష్ణుభటులు, విమ్ము నెగచుట దైవంబుమేర గాదె, మనకు నెప్పుడు దైవంబు మంచి దదును, నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు.

భాగ 8 636

5 మర్యాద, హద్దు.

ఉ. అంబుధి మేర తూర్పునకు నబ్ధియ పీ మటు యామ్యదిగ్విభా, గంబునకుం బ్రతీచికిని గౌతమి సీమ ... భీమ 5. 76.

శా. .. బొ,రౌరా యానకు మేర లే దనుట సత్యంబె కదా ధారుణిన్..

దశా. 2. 246., అం. భా 2. 191.

(తుద, అంతము అని భావము )

6. దూరము

వ. మహానుభావులం గొంతమేర యైనం గొలిచి వచ్చుట భాగ్యంబు కాదే..

శశా. 1. 53.

మ. ఇరువై నాలుగుమూళ్ల మేర యని గోసెక్కి-
వఁగా నేల ... 1, 53.

7. పద్ధతి

కం. మీ రరయని ధర్మంబుల, మేరలు నెఱుకలును
గలవె మీకుం దగవే, నారాయణభక్తి పరత,
వారించెద ననుట యిట్లు వైదికవర్యా...
నృ సిం. 5 17.

మేరకంబము — సరిహద్దు దెలుపుటకు పాతిన
కంబము.

మ స్వగతక్షోణికి మేరకంబములు ప్రాకైన్యంబు
వస్త్రాద్రియున్. కవిక. 3 146.

మేరమానిసి = మర్యాదగల మనుజుఁడు, పెద్ద
మనిషి.

గీ మేరమానిసి సా దుపకారి గోల, నిగ్రె
ఉండు .. సారంగ. 2. 264.

మేఁ(లు)మీఱు = అధికమగు.

సీ. వారాశిగర్వంబు మేరమీఱె ...
మనుచ 3. 23.

ఉ. ... విషాదహర్షము మేరలుమీఱుట లేర్పడన్
బడన్. జొచ్చె వక్షస్సఁత్సు నిషూదను
చూడ్కులనీఱు నిప్పులన్ ...
కళు. 2 128.

మేరవెట్టు = కట్టడసేయు

ఆ. శిఖలు చూపకుండ శిక్షింప పౌలితికినై, నోరు
దెరవకుండ మేరవెట్టి, వేఁడి యెల్ల నుడిపి
విబుధారి కినుకమై, భీతిపాత్రుఁ జేసె వీతి
హోత్రు నృసిం 2 118.

జ మేరగట్టు.

మేరకుఁడు సం వి. అ. పుం విష్ణుశత్రువు

మేరగట్టు వి. (మేర + గట్టు) చక్రవాళ పర్వతము

సీ. చుట్టుకొం డన మేరగ ట్టనఁ జక్రవాళాచల
సంజ్ఞలై యలరు ... ఆం. భా. 2. 28.

మేరు(వు), సం వి. ఉ. పుం. హేమాద్రి, సుమేరు
పర్వతము.

మ. బలవన్మేరుశరాసనంబును బరబ్రహ్మాస్త్రము.
గల్గుట, శ్వీలుకానిం ద్గుణ మైన చాపమున
గాలిం బోవువేయల్గులం, జలమానించి సగంబు
చేసి తవు నౌ సంకల్ప సిద్ధుల్ గొనం, బలుమేరు
న్నిరసింప లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే
వసు. 3. 179.

ఉ. అక్కట దిక్కులేమి రజతాచల మొక్కఁడు
పెల్లగించె వే, టొక్కఁడు వంచె మేరు మఱి
యొక్కఁడు వింధ్యము నేల జూచె ...
చంద్రా. 1. 15

మేరుకము. సం. వి అ. పుం ధూపము, యక్ష
ధూపము (వాచ).

మేరుధాముఁడు. సం. వి న్ పుం శివుఁడు.

మేరుపృష్ఠము. సం. వి. అ న. 1. స్వర్గము.

2. ఆకాశము.

మేరువు వి. 1. వీణాగ్రము.

ఉ. .. పచ్చలం. బన్నినయట్టి మేరువును బాగగు
తంత్రులు మించ నొప్పమే, ల్కిన్నర కెంతఁ
జేరి యొకకిన్నరకంఠి యొసంగ నయ్యెడన్.
చంద్రి. 2. 95 ఆం. భా. 1 126.

2. ఎక్కుటకును బరువెక్కించుటకు పొడుగుగా
కట్టవలె వేయించెడియిసుక లోనగు వానిదిబ్బ.
సారువ

కం మేరువఁ తీరు కురుఁజుల, సౌరు వితానప్రతాన
చతురపతాకా, చారువిపణి గారుడమణి,
తోరణఘృణి యేమి చెప్పుదుం బురిలోనన్.
రా. వి. 5. 49.

ఉ. వేడుక నిట్లగణ్యరుచివిభ్రమధన్యయగేంద్ర
కన్య రాఁ, జూడఁ దలంచి నిల్చిరి వసుక్షితి
పాలపురీపురంధ్రికల్, మాడువులన్ హజార
ముల మచ్చుల సజ్జల గోపురంబులన్, మేడల
నాట్యశాలికల మేరువలన్ భువనేశ్వరంబు
లన్, వసు. 6. 64.

గీ. ఎచటఁ జూచిన వాఁడిగా నేర్పరించి, పెద్ద

ముత్యాల ముగ్గులు పెట్టువారు, నెదు జగఁ(పుమేగుఫు) లెత్తువారు, నైరి పీఁటను గలిగినవార లెల్ల

యయా. 4 81., విజ. వి 2 69.

క. హారము మధ్యమందు వ్రేలెడుమణి (శ ర)

**మేల** సం. వి. అ. స్త్రీ 1. సంగమము, కూడిక 2. సభ, పెక్కండ్రు కలిసినసంఘము 3 సుర్మా, కాటుక. 4. నీలిమందుచెట్టు. 5 మసి, సిరా 6. రాగానుగుణముగ స్వరస్థానముల యందు మెట్లు కుదుర్చుట, శ్రుతి సరిపెట్టుట

**మేలగొను.** అ. క్రి (మేలము + కొను) పరియాచకములాడు, మేలమాడు.

సీ. నునువెడంద యురంబునను జీనిసరపెణలిమ్మన్న జన్నిదముతో మేఁగొనఁగ .

దశా 1 27

**మేలనము.** సం. వి. అ. న. 1. కూడిక, సంగమము కలయిక, 2. సభ పెక్కండ్రు కలిసి... 3. కలుపుట 4. యుద్ధము, తాఁకుట.

**మేలమాట.** వి. (√మేలమాడు) పరిహాసముచేయుట.

చం. గురుతర సుందరాననము కోమలికంబులు ముద్దుమాటలు, వన్నెంపు లతిప్రసంగములు నప్పుట నప్పుట మేలమాట లం,తరత కళానిధానములఁ దాడనపీడన భాషణంబులున్, బలువడి నొందనేర్చు ప్రియభాషలు గల్గు నరేంద్రభామకున్ విధి. 6

**మేలమాడు** అ. క్రి. (మేలము + ఆడు) పరిహసించు, గేలిసేయు.

క. నిను నెఱుఁగకుండి యాదవుఁ, డని సఖుఁడని మేనబావ యని యే సహభో, జనములు సల్లాపంబులు, నొనరించుచు మేలమాడు చుండుదు నెపుడున్.

భాగ. భీష్మ. 1. 217.

గీ. ఓమె యేమె యిదే మేమె లేను యేమె మేఘుపుష్పంబు దే వంచు మేలమాడ. మేమెమే మెలు దలుచయ్యో మేలు మేలు. మేఁక మేఁ కన సభవారు మిగుల నగిరి.

నైష. 6 114.

శ్రీ. కలహంసగమనల కన్నులబెళుకులు మీన పజ్ఞులతోడ మేలమాడ అని. 2 56.

(ఇట సమమాద్యోతకము)

మ. ... తమలముం బుష్పంబులున్ లోనుగా లలితద్రవ్యము లెల్ల నా కొసఁగె మేలం బాడుచున్ ప్రీతితోన్ ... దశకు. 4. 20.

**మేలము.** వి. 1 పరిహాసము.

క. వనితలు మేలుపుమెయి మెలు, పునఁ దిగిచిన నొప్పహారములు మొదలగు ప్రసన్నవితొడవులు గ్రద్దలు తివి, యనరేంద్రులు కొంద లుసిరి యచ్యుత కంచే. భాగ. స్త్రీ. 2 17

ఉ. అన్నారినివహంబును మేలంపుమాటలకై పడి హంసగమన హంసాభిముఖ య్యైన యాత్రఁ [illegible] ..

నైష. 2. 46.

గీ . మేల మన మందె మేల మనఁగఁ, బొలుచుఁ బరిహాసములు .

ఆం భా. 1. 169

2 పరిహాసోక్తి

కం రాజునకుఁ దియ్య మెసంగెడు, పూజావచనముల నెయ్యపుంబలుకులఁ జెరోఁజమెయి ఒంఘమిత్రసమాజములకు మే ములఁ గుమారులకుఁ దగన్ ...

భార. ఉద్యో. 3 179.

చం. బలిదనుజేంద్రుఁ గట్టి లని పల్కఁగ వింటుము గాని నేఁడు మా, చెలి యదె పుష్పదామకముచే నినుఁ గట్టగఁ గంటి మింక నె, మ్మెలు పచరింప రా దనుచు మేలము లాడెడుసలిప్త బోంట్ల సన్నుల నెసిగొల్పుచుం గెలన నవ్వెర ధర్మజభీమ ఫల్గునుల్.

పారి. 5. 81.

3 జాగరూకత

కం. ఇలోనన తా మేల్కని, బాలారత్నంబు
కూర్మపతి కౌఁగిటిలో, నాలిధ యగుటఁ
గదలక, మేలమ్మున నుండె విభుఁడు మేల్కను
ననుచున్. కృ. శకుం 3.59.

జ మేలగొను, మేలమాట, మేలమాడు.

**మేలము** సం. వి. అ. పుం. కలయిక, మేలనము.

కం. అమ్ముదిత రత్నకటకచ,య మ్ముదితసినాద
మయ్యె నయ్యెడఁ జల మేళ మ్మని పతితోఁ
దగు మేళ మ్మని సహజానురక్తి లాలించు
క్రియన్. ఎసు 6. 80

సీ. పొలుపొంది నలగుణంబులపై క్రుతు ల్గూర్చి
సారెఁ దన్మేళప్రకార మరసి...హ. న. 2. 63.

2 నివాసము

సీ. రమణ లక్ష్మీమందిరమ్ము మేలమ్ముగాఁ గని
సదాళి గుణమ్ముగా గ్రహించి . విష్ణు. 1. 44.

**మేల(క)ము** సం. వి. అ. పుం. 1. సమావేశము, కలయిక. 2. ఐకమత్యము 3. అంగడి, బజారు, సంత 4 సంఘము 5. సభ

**మేలాంధుకము.** సం. వి. అ. పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి

**మేలాంబువు.** సం. వి. ఉ. పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి (వై. ని.).

**మేలానందము** సం. వి. అ. పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి (వై. వి.).

**మేలిగాఁడు.** వి. (మేలిమి+కాఁడు) శ్రేష్ఠుఁడు.

సీ. నలువతూ పరివోసి బలిమిమై నద్దోసకారి
రక్కసు మేలిగానిమీఁద, నేసిన ..
అచ్చ. రా. యు 267.

**మేలిమి (ళ్మి).** వి. (మేలు+ఇమి) 1. శ్రేష్ఠత; ఆధిక్యము.

చం. ... ఏ,మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి
ధృవంబు కేశవా ...
భార. ఉద్యో 3. 21.

ఉ. .... ఆజికిం, బూనితి నిల్వు మింక నెటఁ
బోవఁగ వచ్చు భవద్దిగీశల, క్ష్మానితవద్య
భోగముల మేలిమికిం దుది యయ్యె నియ్యె
డన్ ... హరి. ఉ. 8.261.

కం. వేలిమి సేసె మృగాంకుని, మేలిమి గను
గత యిడె సుమేధుఁడు మదుటన్ ..
దశా. 5. 75.

చం. చదువుఁ మేలు సాముపస చక్కఁదనంబు
తెలుంగు సంపదం, బొదలెడు మేల్మి పేర్మిగల
భూరిభుజాబల శౌర్యధైర్యముల్, సద
యతయు స్వవివేకసంస్థితు లాకృతిఁ జెందెనో
యనన్ శుక 1 263.

2. అపరంజి ప్రశస్తమైన బంగారము.

ఉ. చొక్కపు రత్నపుందళుకు సోయగపున్నెర
మేల్మితొట్లలో, ముక్కువ నుంచి తేట వగ
మాటలు నీ చెనయన్ సువర్ణస, మ్యక్కుర
కింకణధ్వనులు మార్మ్రలయం గొలుసుల్
గదల్చుచున్, జొక్కుచు రాజనందనకు జోలలు
పాడుదు రంగనామణుల్ ..
ఇందు. 2. 140.

సీ. ... అతిశుద్ధచామీకరాఖ్యలు చనఁ గడాని,
మేలిమి యపరంజి జాళువా కుందనం బుదిరి
నా .... ఆం. భా 2. 279.

3 వలపు, ప్రేమ

గీ. అనిన విని యావిశాల యారౌర యనుచు,
మెచ్చి తనమదిలోఁ గలమేలి మెల్లఁ, దెలిసితివి
జాణ వౌ దని పలికి ...
హంస 3. 228

విశే. 1. శ్రేష్ఠము, ఉత్కృష్టము.
(దీనికి వృత్తియం దంత్యవర్ణము వికల్పముగా లోపించును.)

వ. ... కయ్యంబు గజిబిజిగాఁ దలంచుచు వాని
పిన్నతమ్ముండు మేలిమిరథంబునం దగు
తురంగంబులం బూన్చికొని...
భార. ద్రో. 4 285.

ద్వి మీ రానతిచ్చిన మేలిమిమాట, వారు వీరన కెల్లవారికి హితము ...

రం. రా. అయో. 86 పా. 16 పం.

సీ ... సభాపర్వంబు విని హానిపక్ష, మిడువది యారణ్య మింపార విని తనిపండ్లును మేలి దుంపలును శీత, జలకుంభములు గలసర్వకామ సమృద్ధి గలిగించునన్న మిం పొలయ నొసఁ గఁ, గీఁపసు ... హరి ఉ. 10. 300.

గీ . పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము, నేఁడు నీ కేల గల్గు నో నీరజారి ..

మనుచ. 8. 41.

2 శుభప్రదము, మేలుకలిగించునది.

ద్వి మేదినీవిభుఁ గాంచి మేల్మియతతలు, వేద మంత్రముల దీవించి యిచ్చుటయు ...

ద్వి. హరిశ్చ. పూ. 444 పం.

మేలిమిగట్టు వి (మేలిమి+గట్టు) మేరుపర్వతము, బంగారుకొండ

సీ జగముల దిగుల నిచ్చలపు మేలిమిగట్ట ...

అచ్చ రా. యు 204.

మేలిల్లు అ. క్రి (√మేలు) శ్రేష్ఠమగు, ఒప్పు.

కం. ఎలమెదు జలజాతంబులు, మెలరారెడి జల చరములు మేలిల్లెదుని, కొక్కెల మంద నెందుఁ బోయెనో జల మనునాశంక శేయు జలమ మలరుచిన్ ... కు సం 10. 391.

సీ. మేలిల్లునీలతమాలమేల్ ధూమసంహతు లవఁ దనరు నత్యసితభాతి ...

కు. సం. 5. 561., 1.36.

కం. మడియిల్లు తత్వముల వెను,బడక నిజాజ్ఞా ప్రశస్తి భావింపఁగఁ బొ,ప్పడు సాత్వికగుణ సంగతి, మృడుఁ డనునామంబు నీకు మేలిల్లు శివా ... శివ సా. 82.

వి. ఒప్పు, పొగను.

గీ. ... చెల్లుఁబైమేడ యొప్పు మేలిల్లనంగ ...

అం. భా. 8. 48.

మేలిల్లు[2]. వి (మేలు+ఇల్లు) చంద్రశాల, పైమేడ.

గీ ... చెల్లుఁ బైమేడ యొప్పు మేలిల్లనంగ ...

అం. భా. 3 48.

మేలు వి దే. అసా. (క. మేలు.) 1. శ్రేష్ఠత. గొప్పతనము, ఆధిక్యము

(బ. మేలులు. మేకులు, మేళ్లు, దీనికి కొన్ని పట్ల హల్లు పర మగునపు డుత్వలోప మగును.)

వ. ... కొదమతామేళ్ల మేళ్ల నగుమీఁగాళ్లతో ... ఆము. 6. 98.

చం. అనిన సునందపల్కు విని యాయెలనాగ మతొక్కరాజుమేల్, వినగఁ దలంచి వేడ్కఁ బదవే పదవేగలి చిత్రలీలతోఁ ..

ఇందు. 5. 130.

శా. ఏయేభూములు చూచినావె కొరవంజీ రూపలావణ్యరే, ఖాయుక్తిం దగుకొమ్మ లెందుఁ గల రీజ్యామండలిన్ హావభా, వాయత్తైక విలాసవైఖరులమే లం దెవ్వరిం కెందు ... శుక. 1. 17

2. పరము, దేవతలవలన నగులాభము.

మ. ... సరోజాక్షా తపస్సిద్ధికిం, దగుమే లిచ్చుటఁ గాదు పూర్వవిహితార్థం బింత కిం కేఁటికిన్ ... ఉ. హరి. 2 300

3. ఉపకారము.

కం. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు వెండియు గడుమే, లొనరించుఁ గీ డొకించుక, యును దవదెనఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్.

భార. ఉద్యో. 2.48.

గీ. మీకులముతేటఁ జేపట్టి మీవిరోధి, యైనపులిఁ జెంది మైచఁన్మ మూనెఁ గాదె, యట్టిమే లైన నెటిఁగి యాహరుని పేర నెసఁగుసొంంగ ధరుఁ జూపుఁ డేణులార. సారంగ. 3 235.

శా. ఆలోకించెను శ్యాముక్తపటుశాణాఘుంబుచే
నీ మొనల్, నేలం గూల . ఉ. హరి 4.195.

2 వ్యూహము.

కం. మొన దీర్చు వెరవు యంత్రము, ఆనేకము
లొనర్చు నేర్పు .. సేనాపతికి సైనికములు
గావలయున్ . భార. శాం. 3. 360.

కం. ఎనుబది యొనిమిదిఁ తుఁ, దనుజులు రాక్షసులు
నడువ దమసైన్యంబుల్, మొనలై పది
యక్షౌహిణు, లనూనగతి నడువ నడిచి రా
నృపతనయల్. ఉ. హరి. 4 222

గీ. అవధరింపుము జనమేజయక్షితీశ, వరుస కిట్లను
నమ్మౌనివల్లభుఁడు, దైవసైన్యంబు లీరీతిఁ
దనతరంబ, వెడలి మొన లేర్పరించి యుద్వేల
వృత్తి. పారి. 5. 2.

3. దురము, పోరు.

కం. నడచి మొనచేయ నాయిత,పడి విడు విడు
మనుచునున్న ప్లవగబలంబున్ ...
భా. రా యు. 6. 51.

ఉ ... పంచశర సుందరరూపుల జారవీరులన్,
గ్రొన్నన వింటివాని మొనకుం గదియించెద
నంచు నెంచుచున్. హంస. 3. 208.

4 సేనాముఖము, నాసీరము

సీ. ... పొల్చు సేనాముఖము మొన యనఁగ...
అం. భా 2. 210.

5. అగ్రము, కొన

కం. సకలక్షత్ర భయంకరు,నకు భార్గవప్రథికి నని
మొనన్ మార్కొన నో,పక వలియం బాఱఁడె
యీ, ముకుందుఁడు భయాతిరేకమునఁ బది
మాఱుల్. భార. సభా. 2 46.

సీ. మొన లావులించి వాసన నల్లఁ బసిగొని లేఁదేఁ
టిగము లెంగిలిం పుఁడ,... గిరిజ పూజించెఁ
బసిఁడి తామరల నందు... కు సం. 3.351.

సీ చిగురుఁ దామరపాకు జివ్వంచుఁ జనుదోయి
మొనల గ్రొవ్వేఁడిని మునుఁగబాఱె ...
నైష. 2. 119.

చం. ... పట్టిఁ బ్రోవ నాఁ,గలిమొన హస్తినాపురి
పెకల్చితి కౌరవవీరు జెల్ల బెగ్గిల నంరేవతీ
రమణికిం బతివై యదువంశమౌక్తికా
హరి. ౫. ౬6.
అం. భా. 2 37.

6. శస్త్రవిద్యా విశేషము. ఒక విధమగు సాధన.

సీ ... సాదశాఁ దనఁగను శస్త్రసంఘుఁ,

గీ దలరు దద్విద్య సాదన యనఁగ నెగడు,
నలుకు పరుసడి గాయమానంబు విసరు, మొన
యనఁగను దద్భేదములు చెలంగు ..
అం భా. 2 205.

వ. ...అఱమీటు మొన నెఱమీటు మొన సరి
తాలంపు మొన లాదిగాఁ గలపదిరెండుమొనలు.
ప్రబంధ 78.

7. ఖడ్గాదులధార, వాదర.

మహాస్రగ్ధర .. నై,చిన చక్రంబా విరోధిక్షితి
పతి నడగించెం జలంబున్ దహించెన్, మొన
లన్ వేయింటన్... వరాహ. 5. 41.

8. బాణాగ్రము.

మ ఇనవంశోత్తమ నీ మొనం దునిసి పో నే
వాలినో నప్తసా.లినో మారీచుని తల్లినో...
చం రా. 6. 45.

9. ముందు, పురోభాగము.

లయగ్రాహి. ఆ యెలుఁగుచేఁ బులుఁగురాయనికి
జో డగు జటాయు వమరాలి పగదాయకు
మొనై యో, రియొచటికిం జుణిఁగి పోయెదు
పలాశపశదా యని... చం. రా. 5. 72.

(విజ. ఎదురు, ప్రతి?)

ద్వి ముందర నీడేరి మొనకు రా వనుచు ..
ద్వి. శ., పా. 2. 517 పం.

మొనలకైదువ—త్రిశూలము.

కం. మఱి యూరుఁ బడమి తేరును, గలిగిన నెఱ
వేల్పు మొనలకైదువు తాల్పు ...
అవ్వ రా. అయో. 118.

ఇక్లే, మొనలవాలు, మొనవాలు.

ఉత్సాహ. మొలను దోలుఁ దలను జాలు మొనల

వాలు నిండు వెన్నెలలఁ బోలునొడలిడాలు...
నీలా 1. 119.

సీ ఒక కేల మొనవాలు సికపట్టు వినుజాలు మొన
తోలు సెమ్మెనఁ దెలుపుడాలు ...
చెన్న. 4 80.

ఇ. మొనకట్టు, మొనకాఁడు, మొనకాలు, మొన
కెక్కు, మొనకొను, మొనగాలు, మొనగుబ్బ,
మొనగురువు, మొనగోరు, మొనచేయు, మొన
దేలు, మొనపడు, మొనపల్లు, మొనయిడు,
మొనలిడు, మొనలెత్తు, మొనవ్రేలు, మొన
సెలవి

మొనకట్టు అ. క్రి. (√మొన) 1. మూరొత్కొను,
ప్రతిఘటించు.

వ. వాఁడు పడినం దక్కటిరాజులుం గౌరవులు
నీకు మొనకట్టరు... భార. కర్ణ. 3. 127.

2. ఉత్సహించు, ఉత్సాహపడు.

కం వనరుహ గర్భన కైనను, వనరుహలోచనున
కైన వనరుహాఁపుజూ, టునకైనఁ దరము గాద,
మ్మునివరుకోపాగ్ని కెదిరి మొనకట్టంగన్.
హంక. 1. 208

3. గుంపుగూడు.

చం కలువలు నిక్కఁ దమ్మిల మొగంబులు
ముచ్చముడుఁగ నింగిఁ జుక్కలు మొనకట్టి
ముత్తములుగట్టి విహంగమ పంక్తి నీడముల్,
సెలకొని చేర.. ధనా. 3. 28.

వి. 1. ఉత్సాహజనకమగు మూలికా విశేషము.
(ఒకానొక స్తంభనమూలిక శ. ర.)

సీ. మొనకట్టు నెత్తమిచ్చి ముత్తమ్మునకు రచ్చపట్టు
రమావధూ పరివృఢునకు ...
చంద్రా. 5. 120.

(విశే. ఉత్సాహాకరము. అని శ. ర.)

సీ. చనవుతోఁ దారికట్టును మొనకట్టును దెలుపు
వారల మనవులు ఫలించె ... కువల. 5. 56.

2. ఉత్సాహము. (శ. ర.)

మొనకా(గా)ఁడు. విశే. (మొన + కాఁడు. బ.
మొనకాండ్రు, మొనకాండ్రురు. మొనకాఱు)

1. శూరుఁడు

కం. ఎట్టి మొనగాండ్రు లేనియుఁ, గట్టిగ నా
యెదుట దిటము గలఁగఁగఁ జఱతు, ర్నెట్టు
కొని నేఁడు మిగుల, న్బొట్టెఁడ వీ వెట్లు నిలిచి
పోరెదు చెపుమా... అచ్చ. రా. బాల. 202.

2. ముఖ్యుఁడు, ప్రధానుఁడు (శ ర).

వి. సేనాధిపతి.

కం అని యతఁడు వల్కఁగా నింద్రుని మొగ
మును జూచి నారదుఁడు మేలింకన్, మొన
గాండ్రకు మద్దత్తుగ, వని సేయఁగ వేల్పు లొజ్జ
వఁసఁగ వలయున్. మల్లు. పు. 2. 10

మొనకాలు. వి (మొన + కాలు) పాదాగ్రము,
కాలికొన.

గీ. కరినవజోజ్జలశైల సంఘట్టనమునఁ, దిరిగెఁ దరఁ
గలు భూమి భృద్వరుల, నత్త్వగరిమ యోచని
బలుమొనకాళ్ళమీఁద, నడరు జడమూర్తులకు
గెలు పగునె యెందు. ఘటికా. 2. 126.

మొనకెక్కు అ. క్రి. (√మొన) అధికమగు హెచ్చు.

కం. మనను గరగించు సిగ్గులు, మొనకెక్కని కోప
ములను ముచ్చటగా నూతన భూషణములు
గోరుచు, మొనయుట మొదలైన వెల ముగ్ధల
చేష్టల్. గంధ. 1. 98.

మొనకొను. అ. క్రి. (√ మొన) 1. తోఁచు,
స్ఫురించు.

కం. చని యమ్మునిని గనుఁగొనఁగను, దనపాదాం
గుష్ఠమునను, ధర వ్రాయుచు నిల్చిన నెవ్వతె
వీ వనినను, మునివర చిత్తమునఁ దెలియ మొన
కొను వనియెన్ .. అధ్యా. ఉ. 224. పో.

2. సమీపించు, చేరువగు.

కం. వినరైతి రిట్టిహేతువు, జనియింపఁగ వలసె
మనకు సాంఘాతిక మై, మొనకొనియె
మరణకాలం, బనుమానం బింక నేమి యనపుడు
నఁతన్. రంగా 3 155.

మొనగాలు వి. (మొన + కాలు) అశ్వగతి విశే
షము.

గీ పొలుచు నాస్కందితి విశేషము మొనగా
ఁ నఁగ . ఆం భా 2 198

ఉ వీతఋశీనమై యతులవేగమున నొ్రెనగాలు
ద్రొక్కుతృష్ణా తురంగంబు నెక్కి యలసస్థితిఁ
జేడ్పడకుండు వానికి, జేతఁడు నేల మేరుగిరి
సింధువు వత్సపదంబు దూంతృ. ష్ణాతినుఁ
దైవవానికి నిజాంతగతార్థము దవ్వు పెద్ద
యున్ . వేం పంచ 2. 150

మొనగుబ్బ. వి (మొన + గుబ్బ) స్తనాగ్రము.
చం ఒకనికి మోముచుంబనము లొక్కనికిన్ మొన
గుబ్బ పోటు.. హంస 4 89.

మొనగురుపు వి (మొన + కురుపు) వ్రణవిశేషము
కం కని దీని నెత్తఁ దోడ్పడు, మనుజుని దలఁ
ప గఁ బసులమారియె వచ్చె, న్మను గండ
మాల మీఁదను, మొనగురుపుం బుట్టె నన్న
మోనం బాయెన్. ద్వా. 1. 63.

మొనగోరు వి. (మొన + గోరు) నఖాగ్రము
వ. . మచ్చరంబున విచ్చలవిడిఁ గదిసి పయింబడి
జెడిదములగు నిడుద మొనగోళ్ళ గ్రుచ్చినఁ
దామును నెదిరి పైకొని కొట్టుతఱి ...
చంద్రా 2 84.

(ఇది భల్లూక వర్ణనము)

మొనచే(సే)యు స. క్రి. (మొన + చేయు)
వాఁడిఁచేయు, పదనుబెట్టు
ఉ. చిత్తజుఁ డల్గి తూపు మొనచేసినఁ జేయఁగ
నిమ్ము పైధ్వజం, బెత్తిన నెత్తనిమ్ము వచియిం
చెదఁ గల్గినమాట గట్టిగా విజ. వి. 3.15.

అ. క్రి. 1. ఉదయించు, పొడచూపు.
ఉ. తోయజవైరి మాసె రవి దూర్పుదెసన్ మొన
చేసెఁ జుక్కలుం, జాయలు దీసె ...
కృ. శకుం. 3.54.

మ. కటి దొడ్డైన నౌటఁ గన్గవ కటాక్ష శ్రీల
గర్వంబు చూ, పుటఁ జన్నుల్ మొనవేసి
యుంటఁ బగడంబున్ దార్కొనన్ మోవి
పూ, నుటఁ దారుణ్యపు బందుకట్టగుట మేమం
దీపకుం జెప్ప కౌ, చ్చటికో పోయె మిటారి
బాల్య వసమాప్త ప్రాప్త దౌర్బల్యమై.
చం రా 6 72.

2 మోహరించు.
సీ. మోహరించె ననఁగ మొనఁజేసె ననితోఁచు ..
ఆ .భా. 3. 101.

మొనదేఱు అ. క్రి (మొన + తేఱు) నిశితమగు
వాఁడి కలది యగు.
గీ. పృథుతరంపు రేఁపె నపుడు మాధు పదపాంగ,
సాన మొనదేఱినయనంగశరము ననఁగ .
రా. వి 2. 120.

మొనపడు అ క్రి. (√మొన) ఆవృతమగు, కప్పఁ
బడు.
కం. విని కడఁగి యసుర లెనుబది, యేమిమిదివే
లొక్క మొగిన యెత్తిన హరియుం, గినిసి
విశిఖంబు లేసిన, మొనపడె గగనంబు మొయిలు
మూఁగిన మాడ్కిన్.. ఉ హరి 1. 147.

మొనపల్లు వి. బొ (మొన + పల్లు) దంతాగ్రము.
పంటికొన
సీ చక్కెర కెమ్మోవి చవిచూడనే కాని మొన
పల్లు చుఱుకున మోపరాదు.. దశా 2 311.
సీ మొనపంట మడుపు వేఁడిన నీళ యెుసఁగ
నందుచుఁ జుఱుక్కని మోవి నొక్కుదాని....
ఉ రా. 1 . 319.

మొనపు. అ క్రి (√మొనయు) 1. కలుగు, పుట్టు.
గీ. తవతనూజుని బిరుదగాథలు వినంగ, మొనపు
వేఱపున సురరాజు మొగము, తెల్లఁబాఱు
నిఁకనని తెలిపెడు భంగి నాసతిలలామంబు వద
నంబు తెల్లఁబాఱె ... వరాహ 3. 5.

సీ. గళలిప్తకస్తూరికా రేఖ లొరిజలు సనుఁజెక్కుల
జవాది మొనపుమదము.

గీ. అంగసంభవుమదపుచేనుంగు లనఁగ, వఱలు
దురు వీరుఁ బణ్యలావణ్యవతులు...
చంద్రా. 1. 32.

2. ప్రకాశించు, ఒప్పు.
గీ. తోఁచె హరిణాంకబింబంబు నాఁచుతోడి,

దొడ పుగతీ . చిలుప, బిలుపసిరువిధాన వెన్నె లలు మొనపె .. వరాహ. 4. 147.

3. హెచ్చు, అతిశయించు.

కం అరుదెంచినఁ బనినెపములఁ, బరిచారిక లెల్లఁ దొలఁగఁ బార్థివుఁడు మరో, హాంపర్యంకమునకు నా, తరుణిఁగరము పట్టి తిగిచి తమకము మొనపన్. వరాహ. 4. 180.

చం. .. మంత్రి పురోహితదండనాథశా, సనధరు లాఖణంబ శుభసంభ్రమసన్నహానానులాప ముల్, మొనపగ నమ్మహానగరముం గయి సేయఁగఁ బంచి రెంతయున్... వసు. 5. 68.

వ. క్రి. 1. మొనయఁజేయు, పూనఁజేయు

సీ. సముద్రగకలశముల్ చక్రవర్తి లటంచు మొట్ల మారుఃసరి మొనపఁ దగునె .

గీ. గభ్భిమన్ను గవకు. చంద్రా. 4. 127.

2. కలిగించు, పుట్టించు.

మ వనిత ల్నవ్వఁగఁ గౌఁగిలింపఁగన నిశ్వాసింప గానం బొనర్ప నదల్పం బలుక న్మధాసవము గూర్పం దన్న నంటన్ననల్, మొనపుం బొన్న కురంటకంబు తిలకంబు న్సిందువారంబు ప్రేం, కణము న్సంపగి గోఁగును న్వకుళముం గంకే శియు న్మావియున్. రామా. 1. 190.

సీ. జోడన ల్దూఁటించుచోఁ గవ్వపుంగొండ వెను వెంటఁ బుట్టచెండనువు మొనప ..బహు. 3.6

**మొనయించు.** వ క్రి. (√మొనయు)

1. మొనయఁజేయు, కలిగించు.

గీ. మల్లికాయోగ మంది సంపఁగి సువర్ణ, పుష్ప ములు పెక్కు మొనయించెఁ బొలఁతిమాడు... ఉ రా. 1. 171.

3. వ్యాపింపఁజేయు.

సీ. వినుఁగెంపు వగఁజాలు మనుఁగెంపు తెగడాలు మొనయింపుకుండలంబులు వెలుంగ ....
ఉ. రా. 1. 99.

**మొనయిడు.** అ క్రి. (√మొన) వాఁడి గలిగించు. పదనుపెట్టు.

గీ. చెఱకువిలుకాఁ డురం బనుమెఱుఁగుసాన, పైని మొనయిడు కాంచనాంబకము రేఖ ...
దశా. 2. 282.

**మొనయు.** అ క్రి. 1. యత్నించు, పూను.

కం. చని ఖాండవంబు గాల్పఁగ మొనపి మహా హాస్తియూథముఁబోని ఘనా, ఘనములచే బాధితుఁ డయి .. భార. ఆది. 8. 249.

గీ. సత్యమును శౌచమును...కలిమి పుణ్యవృత్తం బిది గలుగువరుఁడు, మొనయు దీనినూఁతగఁ గొని మోక్షమునకు ..భార. అశ్వ 1. 192.

గీ. మూఁడులోకంబులను గావ మొనసినట్లు, నేత ముమ్మొనకయిదువు చెన్ను మీఱ . .
హరి, ఉ. 6 34

ద్వి. మునిశాపభయమున మునిఁగి యొండాడ, మొనయక యూఁకొట్టి మొక్కుచునున్న ..
ద్వి. హరిశ్చ. పూ. 1417 పం.

2. కలుగు, జనించు, పుట్టు,

చం. అనుటయు నాదిదేవుఁ బరమాత్మ, గనుంగొన నెమ్మనంబులన్ మొనయుకుతూహలాంకురము మోడ్పడ... నృసిం. 1. 88.

కం అన విని ధర్మతనూజుఁడు, జనపతులును గృష్ణుఁ జిత్తసరసిరుహములం, దునిచిరి పుల కాంకురములు, మొనయఁగ నానందబాష్ప ములు వెడలంగన్... ఉ హరి. 2. 61.

కం. అనుమాటలోను వెలిగా, మొనసినపేరాస వారముఖ్యయుమఱి తజ్జననియు నొంశొరుఁ, గడవం, జని దిగ్గనఁ దలుపు దీసి సంభ్రమ మొదవన్. విప్ర. 4. 63.

3. సంభవించు. తటస్థించు.

మ . .విఘ్నంబు పూజావిధిన్, మొనయన్ దానవ చంద్రుఁ డద్భుతరసాంభోరాశిమగ్నాత్ముఁడై.
ఉ రా. 3. 219.

సీ. దైవంబుకృప లేక తను ప్రోవఁడెవ్వఁడు, మోహ మగ్గల మైన మొనయుఁగీడు. ..
రామలింగ. 60, సారంగ. 2. 117.

4. అవతరించు.

కం. మోహము లేక జగంబుల, మోహింపఁగఁ

జేయ నేర్చి మొనసినకృష్ణున్, మోహింపి చెద
మనిరొడి, మోహమున విధాత దాన మోహి
తుఁడయ్యెన్. భాగ. 10 పూ. 5-3

కం. అని పలుకుచుండ నిద్దఱు. వనితలు తత్పా మ
వెనలి వలరాయనిపూ, దొననుండి వెలికి మొన
సిన,కనదనుపమగంధిలాస్త్రశిఖలో యనఁగన్.
సుద. 5 21.

5. ఒప్పు, శోభిల్లు.

సీ. ముత్యాలముగ్గులో మొనయుస్రుష్టిలఁ దమ
యంగసంగ సౌఖ్యములవలన

గీ. అల్ల తపసి, యింతులును నేర్పుమై నేర్పరి తు
రన్న .. రామా. 1 124

కం. అలవడ శబ్దార్థములకు, తెలువంబగు నవ్య
క్తప్తిసృజియించి సముజ్జ్వల దుత్ప్రేక్షావ్యంజన,

ములచే నుత్ప్రేక్ష యనఁగ మొనయుం గృతు
లన్ .. కావ్యా. 5. 44.

గీ. మొనసె నొకకడ సామిసంపుల్లమల్లి, పాటలీ
చంపకోత్పల ప్రౌఢిమములు... పారి 3 46.

6. ప్రత్యక్షమగు, గోచరించు.

కం. తొల్లిటిమునులు తపంబులు, మొల్లముగాఁ
జేసిరి శౌరి మొనసినపిదపన్, సల్లలితంబుగ
వేఁడరె, యుల్లములకుఁ బ్రియము లైన
యుచితార్థంబుల్ ... కుచేల. 1. 95.

7. రూపొందు

సీ. తనయప్రశస్తత నడుమనె తాల్చి సాంగమై
మొనసినయతను సమ్మోహవిద్య ...
వసు. 2 27.

8 నశించు, అణఁగు.

చం. తవదగు సంతతిన్ గనలి, తానె వధించిన
పాపముల్ చెడన్, మునిగెఁడునాగుణాగ్ర కిణ
ముల్ మొనయంగ శమంతపంచక, మున్ననఁ
బిత్పృతర్పణోచ్ఛలనమున్కలు వెట్టు భవద్భుజా
యుగం, బున కిదె వందనంబు భృగుపుంగవ
రూప విహంగవాహనా. మనుచ. 6 109.

9 సిద్ధమగు, ఉన్ముఖమగు.

గీ. .పె.కి., వెన్గి యున్న ను బ్రోవింప
మొనసి యున్న . భా. అని 5 56.

10. వ్యాపించు, అలము.

మ. అనిచె గైటభదైత్యవైరి దరహాసాంకూరము
ల్మోవిపై, మొనయం గొంత్సోక నిల్చి
పారి. 4 12.

సీ. మొనయు సంపతులకు మోహ మీవై ఖరి
వనుమూడ్కి జీకటు లలమె దిశల....
దశా. 7. 152.

కం. చిత్తజుఁడు జగముపై దం, డెత్తను నవియిద్ద
ముపు చేనుఁగనంగా, హత్తుకొనె దిశలఁ
దిమిరము, ముత్తెపుఁ జాడోలి యనఁగ మొన
సెం దారల్ రసిక. 4 98.

11. జరుగు

కం. వెనుకకు మొనసి కదంబునఁ, బెనఁచి తిరిగి
నిఖిలలోక భీకరుఁడగు న,ద్దనుజేంద్రు ననా
యాసంబునఁ జంకిట నిఱికి యింద్రపుత్త్రిఁ
డచలుఁడై. నిర్వ. 7 83.

12. ఆది కొన్నిచోట్ల వాక్యాలంకారముగఁ
బ్రయోగింపఁ బడును.

గీ. మొనసి మొలనూలి మువ్వల మొరప మమరె,
కు. సం. 8. 179.

ద్వి. మోని మై మీచేత మొనసి కోల్పడితి, నో సం
యమీశ్వర యోవరబ్రహ్మ.
రం. రా. బాల. 44 పా. 31 పం.

స. క్రి. ఆచరించు, చేయు.

సీ. మునుల మై తపములు మొనయుదమా యని
మౌనులై యుందురు మాట లేక....
భాగ. 10. పూ. 454.

కం. వనమునఁ బుట్టినశాకము, లనయము భక్షింప
దనకు నాఁకలి జెడదే, విను మును నోదర
పోషణమున కెవ్వఁడు కష్టవృత్తి మొనసెం
జెపుమా. నా. పంచ. 2.135

అ. క్రి, స. క్రి మార్కొను, ప్రతిఘటించు.

చ. అనుపమదివ్యశస్త్రధరులైన యమర్త్యుల
కాహవంబులో, మొనయక కాలకేయులు

సముద్రముఁ జొచ్చి.. భార. ఆర. 3. 9.

గీ. కనిమసఁగిన యంతకుకరణి యంత్యకాల రుద్రునిచిచ్చ మకాండమృత్యుముఖము నుగ్రభావముదోఁచు మొనయు వీరసమితిఁ దెగటార్చునప్పు డాశల్యునందు.

భార. శల్య. 1. 252.

గీ. ముజ్జగంబులు నొక్కటి మొనసె నేని, మీఱి నీదాఁక రానిత్తుమే నిశాచ, రేంద్ర నీసత్త్వ మొగిని నీ వెఱుఁగ వెందు, నిన్ను మార్కొని మర్త్యులే నిలుచువారు రాజ. చ. 2. 57.

గీ. సత్కవీశ్వరు నెదురింగఁ జాల కవలఁ, జెదు కూఁతలె కూయును జెనఁటి మొఱకు, మత్తకరకుంభవిదళనోద్వృత్త హరిని, మొనయ లేకను గుక్కలు మొఱుఁగు నటుల ...

భోజసుతా 1. 13.

జః మొనవు, మొనయించు.

**మొనలిడు.** అ. క్రి (√మొన) అంకురించు, మొలకెత్తు.

సీ. ఓతిమీఁద లేఁతకెంగే లిడి తడవుచో మొనలిడు నొండొక ముద్దుఁజెలువు... కళా. 6. 196

**మొనలెత్తు** అ క్రి. (√మొన) మొలకలెత్తు.

కం. ననలు మొనలెత్తెఁ దేనెలు, చినికెం జిగురాకు గండెఁ జెదరె వలితతుల్, దనువున నిపూఁదీఁగకు, ఘనమైన నృసింహుపొందు గలుగఁగ బోలున్ వరస 5 175.

**మొనల్పడు.** అ. క్రి (√మొన) మొనలేర్పడు.

శం. కొనలు మొనల్పడఁ గొఱడు కోలవిదంబున దూయఁ జెక్కు చక్కని కుఱుమట్టపుం జిఱుతకట్టియ నోరు కొసంగి కొట్ట నెత్తిన మనికాళ్ళ గోళ్లుపడిఁ ద్రెంచి తటాలునఁ గుక్కపట్టెడం, గొని పువిఁ గట్టు పట్టి నృపకుంజరు చెంగట నొక్కఁడుద్ధతిన్.

చంద్రా. 2. 95.

**మొనవ్రేలు.** వి. వొ. (మొన+వ్రేలు) అంగుళ్యగ్రము, వ్రేలికొన.

మ. లలనాచిహ్నము నొయ్య నొయ్య మొన వ్రేలన్ నేల వ్రాయించి నిశ్చలవృత్తి న్వరవర్ణపూర్ణఫలకాసంగ బు నొందించి. నెయ్యంపు టొజ్జలు. వసు 3 100.

మొలసెలవి వి (మొన + సెలవి) సెలవి మొన, సృక్కాగ్ర భాగము

కం మొనసెలవి యెత్తి ప్రియు నాననమున్ మూర్కొనుచు వట్టు నా కెదు వేళన్. .

మనుచ. 6 78.

మొన్న. వి. వొ (మొదలు+నాఁడు, క. మొన్నె)

1 కడచిన దినమునకు పూర్వదినము.

కం నిన్నన మొన్నన నావలి, మొన్ననఁ బ్రకృతతిథిముందు మూఁడు వరుసగా నెన్నఁగ సరివడి వచ్చును... ఆం భా. 1 92.

చం అవ విని యుత్తరుండు దగ నజ్జనపాళకుతోడ నిట్లను, నృవనొక రాజ్యముం గలదె నన్నును నిన్నును నిన్న మొన్న వీ, రనితర సాధ్యశత్రువిజయంబునఁగాంచిన యప్డు గల్గఁ జేసినయది దక్క.. భార. విరా. 5. 349.

ఉ. అతఁడు మొన్న నున్నతమదాంధత దాడిగ నేఁగుదెంచి యాపోతర మేమి చెప్ప వనుబూఁతకిఁ గైకొన కప్సరోవధూ, వ్రాత నిశాత పాణిరుహవారి సలాలస నవ్యపల్లవ, జైతనరారునందన మహావనిలో విడియించె సేనలన్. ప్రభా. 1. 72

2. అచిరభూతకాలము, కడచిన కొలఁది కాలము.

ఉ. వింటిరె తమ్ములార యొకవింత వినంబడె మొన్న యేమొ ముక్కంటిఁ గవంగ నెల్ల తెఱగంటి దొరల్ మును లేఁగి (మొక్కి మీబంటుల మమ్ము నొంచెదరు బాదలఁ బెట్టి సుకేశపుత్రు), లక్కంటకులన్ వధించి మముఁ గావఁగదే శివ యంచు వేఁడినన్.

ఉ. రా. 2. 4.

ఉ. అమ్మక చెల్ల యే మెఱుఁగ దాఁరయ మొన్నటి చిన్నబాల యీయమ్మ... ఇందు. 2. 4

మొప్ప వి. ఒకవిధ మగు జలజంతువు. (బ్రౌ.)

ఉ. చేప మెడ కిరు ప్రక్కలనుండు ద్వారములు (శ. ర..

మత్స్యాదుల శ్వాసకోశములు [బ్రౌ]

మొప్పె. విశ. మూర్ఖుఁడు.

ఆ ఎద్దుఁ దెలుప వచ్చు నేఁడాదికైనను, వాని దెలుపవచ్చు మాసమందు, మొప్పెఁ దెలుప రాదు ముప్పదేండ్లకు నైన... వేమన. 2. 68.

గీ. మణులుఁ గోకలుఁ గస్తూరి మలయజంబుఁ, గప్పురంబును హరియించు మొప్పె లెల్ల, నేకవింశతియుగము లనేక నరకములఁ బొంచియుఁ గాకులై పుట్టుచుండు. శేష 3 25

సీ అతతాయ బిగాది యడిగుండ బండఁడు మోఁడికట్టె గులాము మొప్పె గోపు... హంస 5. 117.

జ మొప్పెతనము.

మొప్పెతనము. వి (√మొప్పె.) మూర్ఖత.

కం. ముప్పది యాఱేండ్లది ఘుం, దెప్పుడు నొక్కరుని నెఱుఁగ దేలాగున నీ, విప్పుడు దిద్దుకొని యెదో, మొప్పెతనము మాన్పవే యి ముందఱ యవనిలో

చంద్ర వి. 2 106.

మొయి(యు)లు = మొగులు. (త. ముహిల్ — బ. మొయిలులు, మొయిళులు, మొయిళ్లు) మేఘము, మబ్బు

కం మానె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలుసాయల్, నేసెం బఱ మొయిళు లదరి, మ్రోసెం దమయంతిఁ దూఁర్యము లుపద్వనులై. భార. విరా. 4. 66.

కం. ... హరియుం, గినిసి విశిఖంబు లేసిన, మొన పఱె గగనమున మొయిలు మూఁగిన మాడ్కిన్... ఉ. హరి. 1. 147

గీ. ... మొయిలు మొగులు మబ్బన మేఘాఖ్య లగును ... ఆం. భా. 1 71.

మొర = మోర. వి. పశ్వాదులదీర్ఘ ముఖము.

సీ. కరమూలమున వెండి మొరవంక కడియంబు మూఁడు మూలల లింగ ముద్ర లొత్త... క్రీడా. 101.

మొరడు వి. మ్రోడు, స్థాణుప్పు.

కం మఱియు కళాకృషి బీజము, మఱియు ధనఫల ప్రదక్షమాజము తలఁపన్, మఱియు చెలిమఱియు చుట్టము. మతిహీనులు చూడ మొరడుమ్రాఁకులు ధాత్రిన్... కేయూర 2 24

సీ. మొరడు వంగిన సెట్టిముమకకు జవరాలి మోము గాననివాని ముకుర మయ్యె

వే పంచ సీ. 165

(ఇట మొరుడువంటిది గావున నడుమును గౌణముగా 'మొరడు' అని కవి వాడియున్నాఁడు.]

మొరపము[1]. వి (√మొరయు) ధ్వని. మ్రోత

తే. .మొనసి మొలనూలి మువ్వల మొరపమమరె. . కు. సం 8 179

చం. . గడ్డమున గూఁడులు పెట్టిన పక్షికోటి పెన్, మొరప మెఱుంగ రెట్లు మునిముఖ్యుని యాతను వంచుఁ దాపసుల్ ..

వరాహ. 10. 65.

సీ. చరణంపు సరిపణి మొరపంబు విన్న రంతుల కట్ల యెదురు నిఁతులకుఁ దొలఁగి...

ఆము. 9. 64.

మొరపము[2] వి. శర్కర, గులకఱాయి.

సీ. ...మొరప మనంగ శర్కర దనర్చు....

ఆం. భా. 2. 29.

(క్రొత్త. వ్రాఁత ప్రతిపా. మొరప యనఁగ ప్రాఁత ప్రతిపా.)

మొరము(ర్మ). వి. 1. శర్కర, గులకఱాయి,

ఆ. మొరపవాన పెల్లుగురిసె సులాక్షితతి, డొల్లెఁ బడియెఁ బడుగు నెల్లకడల...

భార. ద్రో 3. 36.

సీ. మృదుశయ్యపై నున్న మెలఁతకా పల్లేరు ముండ్లు దట్టంబైన మొరప నేల...

ప్రభులిం. 2 24.

2. గరకైన చూర్ణము. [మొరుము అని వా.]

సీ అనువొంద నందంద యల్లార్చు బలుగద శత్రు

దేహంబులు చఱపి, చదిపి, చదలు మొరుమ్రోగఁ బఱివ్రేశక్తి శూలాదులఁ బఱపి పీనుఁగు లుర్విఁ నెఱపి నెఱపి... హరి. ఉ. 7. 17.

పిండిమొరుము, పసుపు మొరుము (వా).

**మొరయించే.** స. క్రి. (√మొరయు) 1. మ్రోగించు, ధ్వనింపఁజేయు.

ఉ. మొరయించున్ మరుఁడిక్షుచాప మలిశింజినీ ఁడతువాటి మహాపురమధ్యంబున ముజ్జగంబు గెలువన్... భీమ 1. 69

కం. వెండియు రాముఁడు...సాం, బుండును శంఖంబు లప్పుడు మొరయించి రోగిన్.. చిత్రభా. 7. 67.

సీ. తరుణీమణి యొకర్తు తంబురా మొరయించ వెలఁది యొకర్తె ముఖవీణె యూఁద... వాల్మీ. 3 125.

2 చాటించు.

సీ. మముఁ జొచ్చినా రెఱుంగుము సుమ్ము రిపులని మొరయించుగతి మాఱుమ్రోసె గిరులు.. కవిక. 2 83.

మ. ... సిద్ధపురీశుపైఁ జమటకు న్నావహా-రి కోత్తంసని,శ్చితవేళన్ మొరయింపఁ బంచు టయు... విక్ర. 4. 49

**మొరయిక.** వి. (√మొరయు) మ్రోఁత.

కం. పదమా మొరయిక చెలియా,పద మాటికి నీకు బ్రహ్మపదమా... రా వి 4 64

**మొరయు.** అ. క్రి. 1 మ్రోయు, ధ్వనించు.

మ. ...రత్నాలతాటంకముల్, మొరయు న్నూపుర మేఖలా వలయముల్ మ్రోయంగ .. హర 6. 117

మ. కురిసెన్ ఝల్లున నింగిమ్రాని విరిచిమ్ముల్ దేవతాదుందుభుల్, మొరసెన్ ... ఉ. హరిశ్చ. 4 89.

సీ. మొరయు మేఖలతోడి గురునితంబతిరంబు మందయానమునకు వంద మొసఁగ— ప్రబోధ. 1 71.

2. (పక్షులు మొ.) కూయు.

మ. కృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ బ్రభుం గిన్ ఘోగ్న కంఠ ధ్వనిన్ ... మనుచ. 3.55,

మ. ..త్రిభంగిగా మొరసెఁ దెంతం దామ్రచూడామముల్... వసు 4 128.

చం పరువడి భేకముల్ మొరయఁ బ్రాగ్దిశనుండి కడంగి తెమ్మెరల్, నెరయ.. శుక. 1. 166.

3 (ధ్వని ప్రవర్తిల్లు, కలుగు

మ మొరసెం దివ్యమృదంగనిస్వనము సమ్మోదానుసంధాయి యై... 1. 180.

కం. కురిసె విరిసోనవానలు, దొరిసె సుధాంధోవ ధూమఘురగానంబుల్, మొరసె దివిఁదూర్య రవములు, విరిసె న్నని మానసారవిందము లంతన్. రామా. 3. 117

జ : మొరయించు, మొరయిక.

**మొరళి.** వి. మోరటి, ప్రియాలము, ఒకానొక చెట్టు.

సీ. దినములోఁ గ్రొత్తయొత్తిన కజ్జికవ్వాది ముక్కులు మురియని మొరళిపప్పు... పి శకుం, 1. 98

**మొరసు.** వి 1. మొరము, గులకఱాయి.

చం. పరుపు లిడంగ నాత్మ ఖురపాతములం గన కాద్రి చెగటన్, గర మపరంజిరా మొరసు దట్టఫ నేలలఁ చూర్ణితంబు లై, ఖురళికలట్ల యాట ...కవిక. 2. 100.

సీ. మొరపనేల యనంగ మొరసునేల యనంగ కర్కరిలాపనీనుజ్ఞ వెలయు... అం. భా. 2 8.

2. కాఁపులలో నొకతెగ

గీ. పంట మోటాటి పెడగంటి పాకనాఁటి, యరవెలమ లాదికొండారె మొరసుగోన, కొణిదఁ కాపులు మొదలై నక్షోణిఁ దనరు, కాఁపులకు నెల్ల మిన్న యకాఁపు కొడుకు...హంస. 4. 136. (బ్రా. పా.)

విజ. మోటు. మూఢము.

గీ. మొరసు మోసు పిశాళి నా మూఢుఁ డొప్పు అం. భా. 3. 8.

మొరిఁకె = మొంకె వి. బాలిక లాడుకొను చిన్నచేట.

కం. అమ్మరో రావే బంగరు, క్రొమ్మొరిఁకెను ముత్తియములు గొని తేవే... సమీర 2. 70.

సీ చేట నా కూర్పంబు చెలఁగు మొంకె మొరిఁకె యనఁ బ్రహ్మకూర్పాఖ్య యలరుచుంతు... ఆం. భా. 2. 240.

మొఱ = మొఱ్ఱ వి. [క. మొఱె] ఆర్తధ్వని.

గీ మొఱ్ఱ యన మొఱ యనఁగ వాపోక యనఁగఁ, గూయి వాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు ... ఆం భా. 1. 115.

కం. ఆమొఱఁ వేమఱుఁ జెవి నిడి మనుచ 4. 67

గీ. వీను మీచెలి నిం తేల యొరవుసేయ, ఎంత వారైన మొఱ యాలకింతు రకట, ప్రాణ సఖులరె కావరే ప్రాణ మిచ్చి. మమత విడువక మాన్పరే మధువబాధ... పి శకుం. 2. 75. వరాహ. 8. 34.

జ. మొఱయిడు. మొఱవెట్టు. మొఱవైచు.

మొఱఁగు స. క్రి. 1. వంచించు. మోసగించు.

సీ. .. అనిమిషసంఘంబు నొక కారణమునఁ బావ కుఁడు మొఱఁగి. ఆయరిగి తనదు గుప్తియర్థించి గోవుల, నాశ్రయించె... భార. అను. 3. 101.

మ. కమలాభర్త భవద్విరోధివయి చక్రంబుం బ్రయోగింప నుత్తమశస్త్రం బది యాత్మ నామ కభిదాదర్పాంధు నిన్నున్ మొఱంగి మహోరా హువుఁ దున్మియుం దుమును కేఁగెం గాక చక్రంబు చేఁదుముదై పోవని వారలుం గలరె నీ దోషంబు గాదే శశీ. వసు. 4. 31

కం. విను ముత్తమురాలుసుమీ, జవహాయక జనక తనయ సందేహపడం, బనితేదు మాకుఁ దెల్లము, జనులకు మము మొఱఁగ రాదు సకలక్రియలన్. భార. అర. 7. 163.

ఆ. నీడఁ గడవఁ బాఱ నేలకు వెలి గాఁగ, నడుగు వెట్టి తిరుగ నాత్మ మొఱఁగి, యొకటిఁ దలఁప వరుల కొదవిన నొదవ దే,కఁటణి మృత్యుదేవిఁ గన్నుఁబ్రాము.. మనుచ. 4. 106.

2. కప్పిపుచ్చు, మాటుపఱచు : పొంచు

గీ. పంచభూత సుధాకర భాస్కరాత్మ. రూప మగురూపు నీరూపు రుచిరరూప, మొఱఁగెడవె మాకు వ్రేళ్ళతో మొదలు చూచి, చెట్టెఱుఁగు వారి కాకులు చిదుమ నేల. ఉ. హరి 4 95.

సీ. శీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల మొఱ తెఱుంగుచుఁ దన్ను మొఱఁగుఁవాడు భాగ 8. 87.

గీ. ఇంతదడవును నాయొద్ద నిచట నుండి, యరి గెఁ జదువంగ వని భర్త కరిన మొఱఁగు... కాశీ. 4 85.

వ. ...ఒక్కతరుషండంబు మఱుంగున మొఱంగి యేపునం దూపు సంధించి... రామా. 5. 318.

వి. 1. వంచన, మోసము.

ఉ .. ఓరి మెఱుంగుఁబోఁడులే, కైవడినైన వేఁడు దురు గాదె మొఱంగు తెఱుంగఁ గోరువా, రై వినరానిమాట అకటా మగవానికిఁ జెప్ప వచ్చునే... వేం. పంచ. 4. 466.

2. మోసపుఁబలుకు, వంచనావచనము.

గీ. ఈవు గోత్రాల వైయుండెదే కుమారుఁ, డుదయ మొందక పోవునో యువిదసుతుఁడు. కలిగినప్పుడు కోడలు కలదె నీకు, వనముచేరిమి మొఱఁగు లిట్లాడుటయును...వి. పు 6. 226.

విశే. మొఱవెట్టువాఁడు.

సీ. శీలతో నామొ ఱాలింపఁడే మొఱఁగుల మొఱ తెఱుంగుచుఁ దన్ను మొఱఁగు వాఁడు.. భాగ. 8. 87.

జ: మొఱఁగుడు.

మొఱఁగుడు. వి. (√మొఱఁగు) వంచన. మోసము

సీ.... వంచన మెనంగు.

గీ. జడుఁగు క్రుక్కు కికురు పిక్కుజుణుఁగు మొఱఁగు, దనఁగ.... ఆం. భా. 292.

**మొఱక.** వి 1. మొక్క, మొన, వాఁడి.

కం విఱుగుట గానక నెరయం, దఱతఱకలు వాఱఁ గొంతదడ వడి గోటికెన్, గోటికిన నొగులదు పగులదు, చిఱుమొఱకలు బోయెఁ నుల్లసిలె దంతంబుల్ ... వేం. పంచ. 4. 540.

2 న్యూనత, తక్కువతనము [శ. ర.]

విశే న్యూనము, తక్కువయైనది. [శ. ర.]

**మొఱకదము** వి. [√మొఱకు] దౌష్ట్యము.

సీ....క సుని మొఱకదములు.
గీ తలఁపవచ్చినఁ జంపక తొలఁగు నెవ్వఁడు... హరి. పూ. 9. 170.

**మొఱకు (ర్కు)** విశే. (సం. మూర్ఖః)
1. మూర్ఖుఁడు.

కం. వెఱఁగంది శౌరి యిట్లనుఁ, దెఱవా మీతండ్రి నిట్లు దెగి చంపిన యీ, మొఱకు శతధన్వు నిప్పుడ, నఱకెద మోమోట లేక నాచక్రమునన్. వి. పు. 6. 283.

మ. మొఱకై యెప్డుఁ బ్రచండకోపుఁ డగుచున్ బోనాడుభూభర్తకో, క్కరుఁ డాత్మీయుఁ డనం గలాఁడె... మల్ల. 1. 47.

గీ. పెద్దలెల్లఁ బ్రతిష్ఠించుపిదప లింగమూర్తి యగుఁ గాని శిలయను మొఱకు గలఁడె... చెన్న. 2. 175.

1. పరుషము.

ద్వి. మొఱకు వెంట్రుకలును ముదురు మీసములుఁ, గఱకునల్లని మేను గలచోరు నొకని... ద్వి. హరిశ్చ. ఉ. 2269పం.

3. క్రూరుఁడు.

సీ. అనుచు నాళాళి పలికినయాగడంపు, ముచ్చటల కబ్బురం బంది మొఱకుతురక, కఱకుఁదన మూఁది... రంగా. 2 36.

వి. ఒకానొకయాటవికజాతి.

ఉ. పాయక వేరు వెల్లకియు...కానలో, నేయెడఁ దారయై పొలుచు నెర్కులు మొర్కులు నేక పాదులున్... కు. సం. 6. 692.

జ మొఱకదము మొఱకుఁదనము.

**మొఱకుఁడు** = మొఱకు. విశే మూర్ఖుఁడు.

కం ...తల్లిదండ్రులు, మునుకొని చెప్పఁగ వినియు మొఱకుఁడై వచ్చినపిదప నిల్పఁగను నం,గన వశమా చనినఁ బనియెఁగా కనువారన్ భోజరా 6. 107.

అ మునికినాఁటివారు మొఱకులు గనపరు, లఱవవారు ద్విజుల కాన పెద్ద యనుచు దేశభాషలను గులంబును దిట్టు,నతఁడు దండు వచ్చు శతపణములు. శిక్షా. 2. 68.

గీ. దీనితేనియఁ ద్రావినమానవులకు. జరయు రుజయును దప్పియుఁ జావుఁ గలుగ, దనఁగఁ గొందఱుబోయలు విని కడంగి, యుఱక మొఱకులై చటిఁ బడ నుటికి రవ్వడు. భార. ఉద్యో 2. 278.

**మొఱకుఁదనము.** వి. (√మొఱకు) మూర్ఖత.

కం. మొఱకుఁదనంబునఁ బెఱచెలిఁ జెఱఁగొని నీమనుఁ డుఱకఁ జెడఁ జాల్పడె రూ,పటి యని నలువకుఁ దెల్పఁగఁ, బఱచెనవన్ మింట నంచ జారులు సనియెన్ అచ్చ. రా. కిష్కిం. 61.

వ. ... మొఱకుఁదనంబున మీఁది కుటికి బెట్టుగాఁ బరఘట్టనంబులు వరగించురట్టడి దనుజులును... ఉ. రా. 4. 291.

**మొఱమొఱ.** వి. (సం. మర్మరః) బట్టలు లోనగువాని మ్రోఁత కనుకరణము.

ద్వి. మురువైనకుచ్చెల మొఱమొఱ మెఱయ ద్వి. పరమ. 2. 56 పా.

జ; మొఱమొఱలాడు.

**మొఱమొఱలాడు.** అ. క్రి (మొఱమొఱలు + ఆడు) (వస్త్రములు మున్నగునవి) మొఱమొఱయని ధ్వని చేయు (శ. ర.).

**మొఱయించు** స. క్రి. (√మొఱయు) మ్రోగించు ధ్వనింపఁజేయు.

సీ. కెంజడల్ పైఁ బ్రాలి కెంపు లీన విపంచి మొఱయించు నారదముని యనంగ... రా.వి. 3.9

గీ. నాకి మొఱయించి తెగలించ నాఁట దిగిచి
దశా. 7. 1. 208., వేం. మా. 3. 8.

**మొఱయిక** వి. (√మొఱయు) ధ్వని, మ్రోఁత.

సీ. మొఱయికనిడుతంతి మొఱయ నానందాబ్ధి మునిఁగి కన్ఱెప్పలు మోడ్చి మోడ్చి .. మల్లుపు. 2. 89.

(మొఱయికనిడు = మొఱయించు.)

**మొఱయి(లి)డు.** అ. క్రి. (మొఱ+ఇడు) ఆర్తనాదముచేయు, మొఱపెట్టు.

కం. ఏయెడఁ బతిఁ బొడగానక, ... కూయిడు మొఱయిడు... కు. సం. 5. 547.

కం. ఆఱవు లుడిగి పోపో నీ,యఱచేతికిఁ బండ్లు వచ్చినప్పుడు మమ్మం, గఱచెదవు గాని తగు నెడ, మొఱయిడు మది యెట్టిదైవములు విని యెడినో. కళా. 3. 218.

గీ. అఱచె వాపోయె నేడ్చెను మొఱలిడె నవఁ దవరు రోదనమును జేసె ననుట కాఖ్యలు... ఆం. భా. 3. 84., దశా. 4. 84.

**మొఱయు.** అ. క్రి. ధ్వనించు.

సీ. మొఱయికనిడుతంతి మొఱయ నానందాబ్ధి మునిఁగి కన్ఱెప్పలు మోడ్చి మోడ్చి... మల్లుపు. 2. 89.

ఱ: మొఱయించు, మొఱయిక.

**మొఱవ** విశే. వాఁడిచెడినది. (చూ. మొఱవవోవు.)

ఱ: మొఱవవోవు

**మొఱవవోవు** అ. క్రి. (మొఱవ + పోవు) 1. వాఁడి చెడిన దగు, మొక్కవోవు.

సీ. మొఱవవోయెనొ వక్రముఖనక్రహారమహోసం పర్కనిర్వక్రచక్రధార... సిం. నార. 4.

2. క్షీణించు,

సీ. ముదిమి నింద్రియశక్తి మొఱవవోకుండంగమైథు నక్రీడ యేమఱమి యుఱవు... కాశీ. 6. 83.

**మొఱ(లు)పెట్టు.** అ. క్రి. (మొఱ(లు) + పెట్టు) 1. ఆర్తనాదముచేయు, కూపెట్టు.

మత్తకోకిల. ఎంతయున్ మొఱపెట్టి వేగము శీశ్వరా మము దేవతా,హంతచేఁ బడకుండఁ బ్రోవవె యంచు.. దశా. 1 273.

2. కష్టములు చెప్పికొను.

కం. వగఁ బొగులు దీనజనముల, ఖగగమనుఁడు బ్రోవకున్న గతి యెవ్వ రిఁకన్, మగువ విను రాజు గొట్టఁగ, మొగసాలకు మొఱలుపెట్టు మూఢులు గలరే... కుచేల. 1. 75.

3. పెద్దగా ధ్వనిచేయు.

వ. ... కనవుఁ గఱచి చే యెత్తి మొఱపెట్టుట కరులయందు...

ఆము. 4. 157. (ఏనుఁగు పక్షమున.)

**మొఱవైచు.** అ. క్రి. (మొఱ + వైచు) మొఱపెట్టు, ఆర్తనాదముచేయు; పెద్ద ధ్వనిచేయు.

ఉ. ... సమస్త ని,ర్మాణ ధృతిప్రభాకరు మాధవునిం జెనకంగఁ బోవు గీ,ర్వాణుల బోకుఁ డంచు మొఱవైచెనొకో యన మ్రోసె వంత ని,స్సాణము పాకశాసనుహజారమునం గదనాభి కాంక్షయై... పారి. 4. 83.

**మొఱసడము.** వి. ఉడువకుక్క, ఉడుములు మున్న గువానిని వేఁటాడెడు శునకము.

ఆ. కాలుద్రవ్వి యునికిఁ గని కొమ్ము టుడుములఁ, గఱచి తిగిచెఁ గొన్ని మొఱసడములు ... చంద్ర. 2. 45.

కం. జాగిలములు మొఱసడములు, సాగెఁ గలిసి చాపముక్త శరంగతి వంకా, జాగిలము లెదిరెఁ బందుల్కై గోధాదికముగాలి కడరె నితర ముల్... మనుచ. 4. 41.

**మొఱి (కి)** విశే. మొఱ్ఱి (శ. ర.).

**మొఱుఁగు = మొఱుపు.** అ. క్రి. 1. (కుక్క) కూయు, అఱచు.

సీ. ...పెక్కు లయ్యుఁ గుక్క, లిభకుంభదళన మహిష్ఠనిష్ఠురనఖముఖుఁ డగు హరి మీఁద మొఱిఁగి యేమి, ల. పేయనోపు ...
భార. సభా. 2. 33.

చం ... దవుదవ్వులఁ గన్గొని సారమేయముల్, మొఱుఁగఁగఁ బౌరబాలకులు మూఁకలు గట్టి పిఱుంద రాఁగ. .తూఁగుచు వచ్చె నొ క ం డు భిక్షుకున్ ..

భో. ఉరా. 3. 43., ఆం. భా. 1. 123.

2. ప్రేలు, ప్రలాపించు.

కం. మఱి శివుఁడు భక్తిఁ గొడుకుం, దఱిగిన చిఱు తొండనంబిఁ దనవాఁ డనుఁగా, కెఱుఁగక యేఁటికిఁ గారులు, మొఱిఁగెదు నీ మంత్ర తంత్రములు పేకొనునే... శివ. సా. 483.

వి 1 కుక్కకూఁత, భషణము (శ. ర.)

2 ప్రలాపము, ప్రేలుట.

(వ్యవ.) ఇంక నీ మొఱుఁగులు కట్టిపెట్టు.

జః మొఱుఁగుడు.

మొఱుఁగుడు. వి. (√మొఱుఁగు) కుక్క కూఁత' భషణము (శ. ర ).

మొఱువు = మొఱుఁగు (శ. ర.).

మొఱో = మొఱ్ఱో. వి. (భయదుఃఖాదులచే చేయు) ఆర్తధ్వనికి అనుకరణము

మ. పని లే దేఁటికి బాధపెట్ట ననునబ్రహ్మణ్య మైతో మొఱో, యని యుచ్చైర్ధ్వనిఁ గూఁత వెట్ట ముఖశాలాగ్రంబునన్ శ్రాద్ధదేవునిఁ గట్టించె వీరభద్రుడు .. కాశీ. 7. 89.

మొఱ్ఱ = మొఱ వి. ఆర్తధ్వని.

చం. తగవులు నిల్పఁ జాల్పడిన దైవము వక్కట నీవు ప్రముచ్చు వై, మగువల మాత్రకున్ బయి సిమాలిన నేరకిఁ జెప్పికొందు మి,జ్జగమున రాజు గొట్ట మొగసాలకొ మొఱ్ఱ పవిత్ర కీర్తియన్, బొగడికఁ గన్ననీవ తలపోసి యెఱుంగుట కాక యచ్యుతా... పరమ. 4. 110.

గీ. మొఱ్ఱ యన మొఱ యనఁగ వాపోక యకఁ గఁ, గూయి నాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు.. ఆం. భా. 1. 115.

మొఱ్ఱి వి. అంగన్యూనత.

(వ్యవ.) ఆ పెండ్లికొడుకునకు కొంచెము గ్రహణపు మొఱ్ఱి యున్నది.

సీ. మొఱ్ఱి న భిన్నత్వ మొనరును...

ఆం. భా, 2. 134.

విశే. 1 అవయవలోపము కలది, మొఱి.

(చూ. మొఱ్ఱివోవు)

2. న్యూనము, (సందర్భాదుల) కొఱఁత కలది

వ. ... ఓరి నీవు నక్కణక వెఱ్ఱిమొఱ్ఱి చేష్టలు చేసిన భంగము సుమీ యనిన మన బ్రతుకే వెఱ్ఱిమొఱ్ఱి యై యున్నది .. మృ. వి. 2. 82.

జ, మొఱ్ఱివోవు.

మొఱ్ఱివో(పోవు). అ. క్రి (మొఱ్ఱి + పోవు.) అవయవలోపము కలది యగు

(వ్యవ.) ఆ కుండ మొఱ్ఱిపోయినది.

మొఱ్ఱో. వి. (భయ దుఃఖాదులచేఁ జేయు) ఆర్తనాదమున కనుకరణము.

గీ. ఓడితేనియుఁ బట్టి మొఱ్ఱో యనంగ, లింగమును గట్ట కుడుగము ... ఆము. 4. 60.

ద్వి. మొక్కలంబుగఁ గుయ్యో మొఱ్ఱో యనంగ, బిగువు పగ్గంబుల బిర బిరఁ దెచ్చి, తగనంటఁ గట్టి రాస్థానంబునందు.

ద్వి. శ. సా. 3. 158. పం.

కం. అందునఁ జావక మిగిలిన, కొందఱు పఱతెంచి యసురకొల్వున మొఱ్ఱో, యందఱ ప్రమింగెను దానవు, లందఱకును వీఁడు దారుణాంతకుఁ డనుచున్. మొ. రా. సుం. 132.

మొల.[1] వి. 1. చీల, కీలము.

సి. గఱి గావ నొడళుల విఱిగెడు నస్త్రముల్ దొలఁగు సంధుల కిచ్చు మొలలు గాఁగ...

కు సం. 11. 692.

(నక్షత్ర వర్ణనము.)

సీ. ఇనకరము క్తమై యిలఁబడు నభమని వలువ దాఁచిన వెండిమొల లనంగ...

శివలీలా విలాసము కొమ్మన. 1.

గీ. విస్తరవుగుబ్బ లేఁపునఁ బెరుఁగు నంచు, వెంచి మును వల్వ మొదలను నినుపమొలలు, నించ నవి యంత నిలువక వెరయఁ బెరుఁగఁ, బొలఁతి నెఱిఁ గంచెల బిగించఁ బోలుఁ జమ్మి. అచ్చ. రా. అర. 24.

కం. అరపై కంబును జేయని, హరివాసరమునకునై నిజాత్మజుఁ డునుమన్, గరవాలుఁ జేతఁ బూనిన, కరణి యినుపమొలకు మేడఁ గాల్పుట సుమ్మీ. రుక్మాం. 5. 148.

2. త్రాసుముల్లు (చూ. మొలత్రాసు.)

జ. మొలత్రాసు

మొల² వి. 1. నడుము, కటిప్రదేశము

కం. తలుగులపొది యొకదెసఁ బెయ్యలదామెన యొక్కవలన జినువై యుండన్, మొలమోపి పెక్కుచుట్లన్, బలుద్రాటం జుట్టి గోపభావం బమరన్... భార. విరా. 1. 275.

చం. కలచివపీనుఁగు న్వెడఁదకప్పెరయున్ మొలఁ బచ్చితోళులున్... ఉ హరి 2 126.

గీ. వలదు కుక్కల విడువంగ వలన దేయ, వడిచి మొలపిడియమ్మునఁ బొడువ వచ్చు... మనుచ. 4. 20, ఆం. భా. 2. 136.

2. కట్టుబట్ట.

సీ. తల వీడ మొల వీడ నలుగడఁ బఱచినఁ బూరి గ్రసించినఁ బోవనీక... దశా. 6. 135.

జ. మొలకట్టు, మొలకత్తి, మొలగులికి, మొలత్రాడు, మొలనూల, మొలవంకి, మొలవిడి.

మొలక(ల్క)=మొలవ మొక్క. (√మొలచు)

క. మొళకె. త ముళై.) 1 అంకురము, మొక్క.

సీ. మొలక మొలవ మొక్క ... మొటి కనంగ నంకుర మొప్పుచుండు... ఆం. భా. 2. 35.

సీ. తోరణమాలికాహీరాంకురచ్ఛాయ వెలఁది లేఁజిఱువవ్వు మొలక గాఁగ... నైష. 6 82.

గీ. మొనలు చూపినముత్యాలమొలక లనఁగ, నొఱపు తోడుతఁ జెలిపలువరుస దనరె... యయా. 4 58.

సీ. తనతల నెలమొల్క తళతళ జిగిగుల్క వెలయుము త్తెపుతురాబెళుకు గాఁగ.. ఇందు. 1 7. (నెలమొల్క = బాలచంద్రుఁడు) ఉ. రా. 1 126.

2 అంకురితబీజము, మొలకెత్తినవిత్తు.

వ. ...చతురవాలికుండు సల్లుపరువంపు మొలకల చెలువునఁ బెల్లుదుల్లు ఫల్గునాశుగసంతాడనవ్ర కీర్ణ శత్రుశేఖరవజ్రవ్రజంబులవలనను... భార. విరా 5. 6?.

3. మూలవ్యాధి, అర్శము.

సీ అ ర్శంబు మొలక యంచనఁగ వెలయు... ఆం. భా 2 128.

4. వ్రణమునందలి దుర్మాంస విశేషము (శ. ర.).

విశ. లేఁత, చిఱుత, చిన్న.

సీ. ఈరేడు భువనంబు లేలు సంపద చేడె మొలక చందురుఁ దాల్పు ముద్దరాలు.. భీమ 1. 4.

కం. మొలకలు రాజకుమారులు, తల్లిదండ్రులు లేనివారు దయకర్హులు భూ,తలమునఁ గల ప్రజలందఱు, నొలిచివ నొలి నాడెదరు సుబోధను బాధన్... హై. భా. 1 68.

శా. జీవంజీవసుహృత్కలాధరుఁడు లక్ష్మీశర్త యుం దక్క న,య్యార్త హచంయమవర్య యుమ్మొలక ప్రాయంపున్నరుల్ నేర్తురే,యావి ల్లెక్కిడ... శామా. 4. 86.

సీ. పలుకఱుగ నేర్తురు పాటలాధరముల మొల్క లేనగవులు ముద్దుగురియ... భీమ 1. 94.

మగమొల్క=పురుష శిశువు.

ఉ. ...నాదు సంపదకు దిక్కగుచున్ మగమొల్క నీకిఁకన్, బుట్టునొ యంటమే నితవిపోఁడిమి గంటిమ... కళా. 4. 74.

మొలకకట్టు=మొక్కకట్టు. వ. క్రి. (మొలక +

కట్టు ) మళ్ళలో చల్లుటకై విత్తనములు మొల కెత్తుటకు తడిపి ముడియఁగట్టు.

గీ. అఁటరు రేనియ నానిచి మొలకకట్టి. శర్కరా బీజముల సుధాశాదభూమి, భావజుఁడు విత్త.. పాండు. 3. 191

మొలకట్టు. వి. (√మొల.²) 1. మొలత్రాడు, కటసూత్రము.

ఆ. బంగరు మొలకట్టురంగు మీఱంగ నా,నాగ భోగ మద్రినడుమఁ జుట్టి ... దశా. 2 16.

సీ. వాలుగడ్డంబులు కేల జాడింపుచు మొలకట్ల గచ్చడంబులు చెరుపుచు.. చెన్న. 5 328

2. కట్టుకోక, అంతరీయము.

సీ. మొలకట్టు పాటుటాకులు జాఱకుండఁగ దీటి కట్టిన బలుతీవకట్టు... చంద్రా. 2. 39.

(శ.ర. వ్రాఁతప్రతి పా. మొలఁగట్టు ముద్రి. పా.)

మొలకకెంపు. వి (మొలక + కెంపు.) రత్నాంకురము, లేఁత కెంపు.

ద్వి. మొలక కెంపులపిడి మొలవంకిఁ జెక్కి... రఘునా. 7 పా. 13 పం

మొలకత్తి వి. (మొల² + కత్తి) బాకు, మొలను చెక్కుకొనుకత్తి.

సీ. కిసలయాధరు మేనిపసపుడాల్దుప్పటి కాసె నొ,ప్పగు మొలకత్తి యమర...శకాం. 5 14

మొలకబంగారు. వి. (√మొలక) పుట్టలలో పురుగుటవలన కలుగు బంగారము. (శ. ర., బ్రౌ.)

మొలకబేడలు వి. బ (మొలక + బేడలు) నీట నానఁబెట్టి పొట్టు తీసిన కాయధాన్యముల దళములు.

సీ. శాల్యోదనంబులు సద్యోఘృతంబులు మొలకబేడల పప్పు మోదకములు, తలవంటకంబు లప్పళములు వడియంబు లతిరసంబు వడలామ వడలు ... బ్రహ్మో. 3. 330.

మొలక(కె)లెత్తు అ. క్రి. (మొలకలు + ఎత్తు) కలుగు, అంకురించు.

ఆ. అట సుశీలమగఁడు నరుదెంచి యొకకొన్ని, దివసములకు దొరలఁ దిరియునాసఁ, గోసి తన కులంబు వాసియు వన్నెయుఁ, దలఁచుకొనుచుఁ దెలివి మొలకలెత్త. పాండు. 4. 207.

గీ. మునిజనావంద కందముల్ మొలకలెత్త, రావణాగ్రిప్మ్రత ప్తధరాతలంబు, శైత్య మొందంగ .. దశా. 7 1. 18.

మొలగ. వి ఒక జాతిచెట్టు.

వ. ....వెఁగల మొలగల బీఱల గారల వేములఁ బ్రేముల.. పి శకుం. 2 14

మొలగులికి. వి. (మొల²+కులికి ) 1. సస్య విశేషము.

2. జ. ధాన్యవిశేషము (శ. ర.)

మొలకొలకి, మొలకొలుకులు (వా. శ. ర.)

మొలచే(ల్చు). అ. క్రి 1. (వృక్షాదిస్థావరాదికములు) పుట్టు, జనించు.

(క) వృక్షాది స్థావరములు

చం వలవదు రోయఁ ఖాండవుఁ వారోక యూఱట లేని త్రిమ్మటన్, బలమఱి వన్య సత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూఁరియున్. మొలవదె ...భార. విరా. 3 95.

చ ... తొ,య్యలిహృదయాల వాలమునయందనురాగ లతా వితానముల్, మొలచె కొటిఁగి యంగజుఁడు మోహనబాణము నారిఁ గూర్చినన్. విక్ర. 4. 146. మనుచ. 2. 10

(చ) సంతోషాదిమనోధర్మములు.

కం తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల కెల్ల మోదము వెలఁగున్, మదిమొలవఁ జక్రధరుపై, వదలక వినువీథిఁ బుష్పవర్షము గురిసెన్. ఉ. హరి. 1, 122.

చం పొలఁతుక గంగచేరువ తపోవన భూములు

చూడ నీమదిన్, మొలచిన కౌతుకంబు దుగి ముట్టఁగ లక్ష్మణదేవు విన్ను నం,దులకు మనో ముదం బెసఁగఁ దోకొనిపో నియమించితిన్...
నిర్వ. 8 132.

సీ. చూర్ణాలకంబుల స్రుక్కఁ జక్కఁగఁ దీర్చి నలువు నెమ్మేనములో మొలవఁ బెట్టు...
నైష 7. 172.

(ట) మానవాది జంగములు.

చ. చలువవెలుంగు వేల్పుల రసాయనపుం దొన పాలవెల్లిలో, మొలచిన ముద్దుపాపఁడు కుము ద్వతి వేడుక కాఁడు తమ్మిలోఁ, గిలి గల చంద్ర బింబముఖికిన్ సయిదోడు చకోర భోజనం,బుల నెఱదాత చందురుఁడు పూర్వదిశాస్థలి నొప్పె నయ్యెడన్.
కవిరా. 5. 180.

శా. పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభో యాన పాత్రంబునన్, నెట్టం గల్గను గాశిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటి..
భాగ. 1. 7.

సీ తమ్మిఁ బాల్చినవానిఁ దమ్మి దొల్చినవానిఁ దమ్మి మొల్చినవాని, దాంసించు...
నరస. 1 64.

2 అవిర్భవించు, ప్రత్యక్షమగు.

కం. అచ్చతురాననమూర్తుం, డచ్చటఁ దా నపుడు మొలచి యాశీర్వాదం, బిచ్చెనె యింద్రుఁడు మెఱుఁగులు, నెచ్చెఁగదా ప్రాయమునకు దీవన వనివన్....
కకు. 3. 45.

3. ప్రాప్తించు, సంభవించు.

మ ... ఇపుడు కళ్యాఖ్య ప్రసాదంబుచే, మొల చెన్ గర్భము నాగమారమణి కాముగ్ధన్ విచా రింప నే,తలపుం జెంద నెఱుంగనట్టి యబలం దప్పించుచే తప్పగున్...
చెన్న. 1. 202

ద్వి మొలచెఁ గాళ్లును రెండు మును గురుభక్తి.
పండితా. పురా. 109 పా.

కం. అలుకయు మదమును గర్వము, నొలుకు నకారణవిరోధ మొందుజనులచెయ్యిల కెక్కు

డై నయాపద, మొలచెను మదుబిందుకళహా ములచందమునన్..
కేయూర. 2. 109.

జ: మొలక, మొలకకట్టు, మొలకకెంపు, మొలక బంగారు, మొలకబేడలు, మొలకలెత్తు, మొల తెంచు, మొలవబెట్టు, మొలవేయు.

**మొలతెంచు.** అ. క్రి. (మొలచు + తెంచు స్వార్థమున) కలుగు, పుట్టు.

కం. మునివర నాదగుచిత్తం,బునఁ గౌతూహలము సాల మొలతెంచి తలి,ర్చున నెలరారెడు..
భార. అను 4. 447

కం. ఏనుఁగు జేయుతెలం గెద,లో నాలోకించి ధర్మలోభము ధర్మ,గ్లాని కర మయ్యె నని య,జ్ఞాననఁ బొందుటకు సంశయము మొల తేరన్.
దశకు 592.

సీ తరణికూటమున మే యురలి పద్మిని మేన మొలతెంచు మధుమద మొలుకకుండ...

గీ. గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు...
కు. సం 3 351.

**మొలత్రాడు.** వి. దే. (మొల$^2$ + త్రాడు) కటి సూత్రము, మొలకు కట్టుకొనుత్రాడు.

సీ. ముందటిది కూర్కెడి మొలత్రాటఁ దవిలిన తోఁకగోఁచులవెంటఁ దూలువారు...
ఉ. హరి 1. 102.

గీ. జమిలి మొలత్రాట నినుపకచ్చడ మమర్చి....
విక్ర. 2. 97.

ద్వి. ముప్పిరి యగుదొడ్డ మొలత్రాడుగట్టి...
పండితా. పురా. 100 పా

**మొలత్రాసు,** వి. (మొల$^1$ + త్రాసు) ముల్లు గల త్రాసు.

చం. ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెట నీరుకారు శాణము పటకారు మూస బలు నాణెపరీక్షలమచ్చు లాదిగా, నమరగ భద్ర కారక సమాహ్వయుఁ డొండొకఁడుండు నవ్పురిన్...
హంస. 2. 181.

మొలనూలు వి. వె (మొల$^2$ + నూలు) స్త్రీలు అలంకారార్థము ధరించెడు కటిసూత్రము. రశన

సీ .. మొలనూలిమువ్వల మ్రోఁత నిగుడ
విక్ర. 3 39

సీ. ధాత్రిమహాదేవి తాల్చినమున్నీట మొలనూలి
రత్నాలపుమొగ పసంగ... ప్ర. ఖా. 1. 54.

సీ. ముత్యాలపేరులు మొలనూళ్ళు .
ధవా. 2 67, ఆం ఖా. 2. 150

మొలపించు. స క్రి (√మొలచు) మొలచునట్లు చేయు

ఉ ఏ యెడ నెన్నఁడున్ గననియింపును గుల్కెడు తద్గళస్వనం, బాయతమైనకాతుకము నద్భుతమున్ మొలపింప... క ఖా. 1. 92

సీ కండచక్కెరదీవి దండకెంపులరీవి మొలపించు చెంగావిమోవిదాని... ఉ. రా 2. 266.

మొలపూస వి (మొల$^2$ + పూస) మొలత్రాటి యందుఁ గట్టెడిపూస, బాలుర కటిసూత్రము నందు గ్రుచ్చుబంగారు మొదలగువానిఘుటిక.

గీ. ఘోరవాలంబు దలపోయ మేరు వయ్యె, భూరితారావళులు మొలపూస లయ్యెఁ, గమలిసీనాయకుఁడు బొడ్డుఘంట మయ్యె, ననుచు రాఘవునకుఁ దోఁచె నట్టివేళ.
సీతావి. 2 150

మొలవ వి. అంకురము.

సీ. మొలక మొలవ మొక్క మోక మో సీరిక మొటిక నా నంకురం బొప్పుచుండు...
ఆం. ఖా 2. 65.

మొలవంకి. వి. (మొల$^2$+వంకి) మొలలో చెక్కుకొను కత్తి.

సీ. మొలవంకికొద్ది బెబ్బులిని గెల్చిననాఁడు గలిగె నీ ముంజేతి గవ్వదండ... చంద్రా. 2. 57.

చం. అసి మొలవంకి డుస్సి సమరార్భటిఁ జావడి క్రిందికిన్ గుఖాలున దుముకన్...
అహ. 1. 104.

మొలవఁబెట్టు. స. క్రి. (మొలవన్ + పెట్టు) నాఁటు.

సీ. ఈ నీఁజానన బావ కుదురుచేసి వలయు బీజము లెల్ల మొలవఁబెట్టె... కు. సం. 7. 850

మొలవిడి. వి. (√మొల$^2$) పశురోగవిశేషము.

ద్వి. మొలవిడి సెలతెవుల్ ముకుబంతి కవట, తలయేరు తొడకు వాతము కల్లవాపు, ... అదిగానెన్నఁ, గలపసరాలరోగములకు నెల్ల...
నవ. 1. 41 పా. 3 వం

మొలవేయు. స. క్రి (మొలక+వేయు) నాఁటు. కాకరగింజలు మొలవేసితిని. (శ. ర )

(వ్యవ) చింతగింజ మొలవేసినాఁడు = చాలకాలము నివసింప సంకల్పించినాఁ డనుట.

మొలాజిమతు వి. (హిం. ములాజిమిత్) ఆశ్రయించుట.

శా. రంగారాయఁడు మా మొలాజిమతుకై రాకేఁటికిం జిక్కె ... రంగా. 2. 89.

ఉ. ... మీ,యాదరణన్ మొలాజుమతుకై చనుదేరఁ దలంచినాఁడు స,మ్మోదముచేత రమ్మనెడి ముఖ్యముగాఁ దమకౌలు వచ్చినన్...
రంగా. 2. 167.

మొలాము = మలాము, మొల్లాము, మోలము, మోళము వి. (హిం. ములమ్మా) 1. బంగారు, వెండిమొ. వానిపూఁత (శ. ర.).

2. పుండ్లకు పూసెడిమందు (శ. ర.)

మొలుగు(ల్గు) = మోలుగు. వి. వృక్ష విశేషము.

సీ. జువ్వి మామిడి జీడి సురుగుడు మొలుగు పావట చంద్ర పసిరిక పాల రేల...
వేం. పంచ. 4. 522.

సీ. గంగుకాయయు మొల్గుకాయ యందుగుకాయ లుసిరికెకాయలు మస్తకాయ,

గీ.ఆది, యైన యూరుఁగాయలు గల వతనియింట,
హంస; 4. 185.

ఆ. పెక్కి వేళ్లపిట్ట పరగంగ వెణుతుతు వేరివట్ట

మిరెము వెల్లులియును, నూరి నీళ్ళఁ ద్రావి నూనెయు మొల గాకు, రసము గొనఁగ నెలుక విసము లడ గు. (చికి, చి. ని.)

**మొల్ల** వి. కుందలత, బొడ్డుమల్లె (వ్య. వి.)
1. బొడ్డుమల్లెపూవు.

సీ. మొల్ల యనఁ గుందము చెలంగను ఆం భా 2. 52.

సీ. సన్నజాజులు నురిపొన్నలు గలిగొట్లు మల్లెలు సంపఁగెల్ మొల్లవిరులు.. ఉ. రా. 3 201

చం ...దృక్తరళకాంతులు నుత్తర మిచ్చు వంత రాం, తరముల నవ్వులుం గలువతండము మొల్లలు వంచు ఆము. 2. 20. పారి. 3. 51.

జ: మొల్లమ్రాను, మొల్లసుగంధి

**మొల్లమి**¹ = మొల్ల¹ము. వి 1. సాంద్రత, తఱచు

ఉ వాల్లకముల్ సనిద్రకములై పొరలన్ జల జాత జాలముల్, మొల్లమి నుల్లసిల్లఁ దమ ముల్ దమముందటిచోటి కేఁగఁగా, బల్లున వెల్లవారె సమభల్లరణార్థుఁ గుండె ఝల్లనన్. రా వి 1. 78.

వ. అవిరళదళకిసలయవిలసితలతావితానంబులు మరకతకురువిందనిచయఖచితంబులగు సిగ తులపగిదిఁ జూపట్ట నమకట్టు జల్లుల మొల్లమి నుల్లసిల్లుచు .. కళా 6 224.

2 వర్గము, గుంపు.

కం. చల్లని కమ్మఁ దెమ్మెరలఁ, జల్లెడు ననుకూల పవనసంతతు లెసఁగన్, మొల్లమి గని యష్ట మది, గ్వల్లభు నాఁబోతు లంకెలైచె న్నింటన్. రామా 7. 155

గీ. తుటుము మొల్లము మొల్లమి తుట్టె వఱ్ఱు, వనఁగ వర్గము తగు... ఆం. భా. 2. 100.

విశే సాంద్రము, దట్టమైనది, తఱచైనది.

కం. మొల్లలవై చినలక్ష్మి, వల్లభసుతుఁ గాల్పవే యవారితవృత్తిన్, మొల్లమిగ జాల వైచిన, యల్లగణాధిపున కిదె యపవర్గ మజా. శివ సా 449.

వ .. మొల్లమిగ నంతకంతకు దిగంతంబులు దంతంబును దీరిచిన యుడుపులంబోలెఁ దీండ్రింప.. మనుచ. 5 28.

**మొల్లమి**² = మొల్ల²ము వి. ధనము.

కం అని యిట్లు పలికి మంతన, మున కాతనిఁ బిలిచి మీరు మొల్లమి గలవా, రని కంసుఁ డెఱిఁగి యుండును, జన దిచ్చట నుండ నొండు చాయకుఁ జనుఁడీ. వి పు 7. 103.

గీ తల్లులను దండ్రియును దాము మొల్లమి గని, మెల్ల సంతోసములఁ జెంది యుల్లసిలఁగ. దశా 8. 26.

**మొల్ల¹ము** = మొల్ల¹మి. వి. 1 మొత్తము, గుంపు

ఈధరం బన నెద్ది పొలపంబు పుట్టించు నల్లాలి మెఱుఁగుఁ మొల్లములకు.. పాండు. 5. 261.

గీ తుటుము మొల్లము మొల్లమి తుట్టె వఱ్ఱు వనఁగ వర్గము తగు.. ఆం భా. 2. 100.

రగడ. చాలు చాలు నీసంపెఁగ మొల్లము, చాల కంటెవే పొదరి మొల్లము... కువల. 3 127.

2 తఱచు, సాంద్రత

వ.. కొండగోఁటియమలుగుడుబొందుఁ కు సంద డించుకంకగృధ్రావళుల మొల్లంబుల మునుఁగు పడు పల్లంబులును. మనుచ 4 37.

3 పెంపు, అతిశయము

ఉ. పెల్లుగ గబ్బచెన్నవలు పెంపెసలారఁ గడింది వేడుకల్, మొల్లము మీఱఁ గ్రొత్త తెలి ముత్తియపున్ రతనంపు సేసల్రాల్, చల్లుచుఁ జేరటాండ్రు ధవళంబులు పాడిరి కొంద ఱయ్యెడన్... రసిక. 6. 200.

వ.. అల్లంబు మొల్లంబును... కాశీ 7. 165.

విశే. 1 సాంద్రము, దట్టమైనది.

ఉ. మొల్లపు మొల్లపూఁ బొదల మొగ్గల వగ్గల మైనతీవలం, దల్లనఁ జల్లనై యొలయు

నందపు గంధవుఁ గొండ గాడ్పుచే, నల్లిక బిల్లి
కన్ దనరు నామిడిమామిడిక్రింద భూమిభృ,
త్తల్లజుఁ డల్లజాలరివిధంబునఁ బొంచి హరించె
డెందమున్... కృ శకుం. 2. 220.

ఉ ఇల్లొక పట్టునం గడచి యేఁగఁగ నేరని చుంచు
కుఱ్ఱలన్, మొల్లపుఁగాఱు కోవలకు మున్న
రకం గొనిపోవఁ జూతురే ...
అచ్చ. రా బాల. 104.

2. అధికము, హెచ్చు.

శా. ...బ్రహ్మాండ భాండంబు భే,దిల్లన్ బెట్టుగ
నార్చి పేర్చి గ్రణయోద్వృత్తాంతకాకారుఁడై,
మొల్లం బైన బలఁబులం బొలిచె సమ్మూర్ఛ
త్ప్రతాపంబునన్.. భా. రా. యు 1. 374.

గీ మొల్ల మగుకీర్తివాఁ డేఁడి మొల్లలార, శుక
నిగదితునిఁ జెప్పుఁడు కింశుకములార.
భాగ. 10. పూ. 1015.

ఉ. ఎల్ల విధంబులన్ వినుతికెక్కిన యీప్పవు
కూర్మి పత్నినై, మొల్లము లైవ సంపదలు
మోచి వెలుంగుచు నున్న నాకు నీ,తల్లి సవత్ని
నౌదు వని తాఁ బలుమాఱును వచ్చి నాకడం,
బ్రల్లదముల్ వచించు వది పల్కులు నే వినఁ
జాల నెన్నఁడున్... వి. పు. 2. 12.

మొల్ల²ము=మొల్ల²మి. వి (సం. మూల్యమ్)
ధనము.

ఉ. ఎల్ల ధనంబు నోటుపడి తిందుకులేశ్వర యుంక
నొడ్డఁగా, మొల్లము నాకుఁ జూపుమని ముందట
సారెలు ద్రోచి యాడఁగా, నొల్లక యున్న
సౌబలునకు.. భార. సభా. 2. 194.

కం. నాయింటి మొల్లమునకును, నా యొడలికిఁ
బ్రాణములకు నావారికిఁదా, నాయకుడై .
దశకు. 5. 55.

ద్వి. తన మొల్ల మ-తయుఁ దత్కారణమున, సమ
యుడు బస. పు. 4. 897.

మొల్లమ్రాను వి (మొల్ల + మ్రాను) వృక్ష విశే
షము.

సీ. ... మొక్కపు కొక్కెన మొల్లమ్రాను ..
గీ. మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు.
హంస. 4. 11.

మొల్లసుగంధి. వి. విశ (√మొల్ల) మొల్ల పూవు
వంటి పరిమళము గలది

ఉ మొల్లసుగంధి నామవను మోహము నాటి
వెట్టి నీవు వ,న్నొల్లక వీడనాడెద వయోతగవా
వి. పు 2. 283.

మొల్లా వి. (హిం. ముల్లా) మహమ్మదీయ పురో
హితు లుచ్చరించు మంత్ర విశేషము

మ. . .పైకారవం,బుల మొల్లా పరియించుచున్
మధుజలంబుల్ జల్లి వేగాడ్పు భా,నులచేఁ
జైత్రపు నైదుజీర్ణదళ పహ్నుల్ గంతె
త్రొక్కింపఁగన్... చంద్రా. 4. 208.

మొల్లాము = మొలాము.

ద్వి పసిఁడి మొల్లాము గుబ్బల కవాటములు.
ద్వి. పరమ. 3. 146.

మొవము = మొగము. వి.

సీ. మొవముత కెగయు చన్గవపైని నునుమోవి
తళుకుఁ గుంకుమ వసంతములు చల్ల ...
దశా. 2. 273

మొవలి. వి. మొగలి. (వ్య.వి.) పి. శా. శ. 1024

మొవు = మొవ్వు వి. మోవు.

ఉ. నాసికపేరురిమవ్వపుటవంటికిఁ బై బొమలాకి
లయ్యె ను,ల్లాసము చూపుతేఁత మొవు లాగ
మెయిం దిలకంబు గల్లెడున్ ...
కవిక. 6. 209

మొవుడు = మొగుడు. అ క్రి. ముకుళించు.

కం. కవిసర్ప గారుడం బను, కవితా లత
మొనర్చి గర్వితమద దుష్కవి సర్పంబు
మొగములు, మొవిడించి కలంచి ముంచ మ
దుగ నేర్తున్... కవిస.

మొవ్వి. వి. ఒకానొకచెట్టు.

వ. ప్రోఁగువాఱించి రావుల మోవుల జువ్వల మొవ్వల రేఁగుల గోఁగుల రేలలఁ జాలల నొద్దుల మద్దుల విరుగుల నిరుగుల నెమ్మల యిమ్మల  పి. శకుం 2 14

**మొవ్వ = మొవ్వ** వి మోవు. అరఁటిచెట్టు లోనగువానియందు పుట్టెడు ముడుతవిడని లేఁత ఆకు మొలక.

ఉగడ. మొలచు మొవ్వల వంటిమోవులను మోవులను.  భాను 2. 63

**మొసడి** వి = మొసలి

తరళము.. వినిన్మదియ కా దిది యేను తీర్థము లీనముద్ర తటంబునన్ విదితముల్ దురితాపహంబులు వీని నెన్నఁడు నాడ నో, డుదురు సమ్మను లిఁదుఁ గోల్మొసడుల్ గొనున్ వడిఁ గొంచ్చుడున్.  భాం ఆది 8 148.

**మొసరు** వి (క మొసరు) 1 పెరుఁగు, దధి

గీ అన్యదైవవితతి నర్చించి కొలువు తాడిడి ఫలంబు గొనుట పడయఁ గనెడి, సద్వరిష్ఠ ఫలదు జంగమమల్లికార్జునునికొలువు మొసరు మునుఁగఁ గొనుట  కు సం 1. 12.

కం. పెసరుంబ ప్పేమిటి కని, కసరు న్నొయి గొనఁడు పండుగను గొయకూరే, కొసరుం బలుచనిచల్లయె. మొసరుం గనఁ డతనిలోభమున కేమందున్.  బహు. 5 8.

**మొసలి.** వి. (బ మొసలులు, మొసళులు, మొసళ్లు) నక్రము, జలజంతువిశేషము

ద్వి కని మనఁగుచుఁ దీవ్రగతి వంచి నొక్క, మొసలి యేతెంచి సముద్ధతిఁ బట్టుకొని పోవదరి నున్న కొడుకు వాపోవ . .

పండితా. మహిమా. 287 పొ.

ద్వి పస నిల్లు వెడలిన భయపడుతల్లి, మొసలి కొప్పించి యిమ్ముల మనఁ గలనె

పండితా. మహిమా 287 పొ.

గీ. ... ఉడుములన రేల్దిరిగెఁ గుక్కపిసికి బావులఁ బడుటకుఁ బసులయొకపు, పెరలకు మొసళ్లు ...

ఆము 2. 53, ఆం. భా. 1 160.

**మొసలి టెక్కెము జోదు** = మకరకేతనుఁడు, మన్మథుఁడు

సీ. కలువ చెలికాఁడు గాదిలిసైదోడు మొసలి టెక్కెము జోదు ముద్దు కొడుకు ..

జాహ్నవీ 1 6

**మొసలిడాలువే(ల్వ)ల్పు(లుపు)** = మకరకేతనుఁడు, మన్మథుఁడు.

కం గోలపయి న్వాలారుం, గోలలఁ జరగించి మరులుగొల్పుచు మిగులం, దూలించుట కిఁకఁ దాకం, జాలము నీయాన యో మొసలిడాల్వేల్పా.  నీలా 3 41.

ఇశ్లే మొసలి సిడమువాఁడు.

చం కిసలయశయ్య డిగ్గియొకక్రేవ శకుంతల నిల్చియుండఁ దత్కుసుమ నవాంక మంటుకొని క్రొత్తవిరుల్ గనుపట్టె నెంతయు, న్మొసలిసిడంబువాని నవమోహనవల్లియొ యంచు రాజునిం, పొసఁగఁగఁ జూచుచుండె మధురోల్లసదుగ్ధములైన చూపులన్...  పి శకుం. 3. 74.

జ. మొసలికాటు, మొసలి దోరణము, మొసలిపట్టు మొసలిపోగులు, మొసలిరాసి, మొసలివా మొసలివాతమ్మంట్లు, మొసలి వాపోగులు మొసలి వాయెంట్లు, మొసలి బొమ్మలు.

**మొసలికాటు** వి. (√మొసలి) మకరముఖరూపము గల కత్తి పిడికొన, చిమట,

సీ. పరుఁజతోపలఁ జీల పట్టించువలుఁగువా యమరువ యోగ్యమైనట్టితావు, మొసలికాటనఁగను మొసలివా యనఁగను జిమట యనంగను తెలుఁగుచుండు...  ఆం. భా. 2. 216.

**మొసలిదోరణము.** వి (√మొసలి) మకరతోరణము.

గీ. మొసలిదోరణ మెక్కియాముసఁ తెలంగు,చున్నఁ

బొలియక చిక్కిన యుటియ బంట్లు, పఱచి తొలివేల్పు జేని క త్తెఱఁగు దెలుప...
అచ్చ. రా. సుం. 101.

మొసలిపట్టు. వి. (√మొసలి) మకరాలయము, సముద్రము.

కం. వంతమునఁ బ్రొద్దుపస యుక్కిగింతుమొ నత మొసలివట్లఁ గినుక నిగుడ నిం,కింతుమొ...
అచ్చ. రా. యు. 16.

మొసలిపోగులు. వి. బ. (√మొసలి) మకరకుండలములు.

సీ. మొసలిపోఁగుల నిగ్గుటొ నపరిసాము కూటము లైన చెక్కు టద్దములవాని ...
చం. రా. 2. 5.

మొసలిరాసి. వి. (మొసలి) మకరరాశి. (చి. ని., శ. ర.)

మొసలివా(యి) వి. (మొసలి మోముకూపముగల క త్తిపిడికొన, మొసలికాటు,

మ. ... జాళువా మొసలివా దీప్తార్చి గాఁగజ్జలా, న్వితధూమానిత రేఖ పై యలుఁగుగా విజ్ఞాన దీపాంకురా,కృతి నందంబగు వందకం బగులతా శ్రేణిచ్ఛిదంజేయుకన్. ఆము. 1. 6. ఆం. భా. 216.

మొసలివాతమ్మంట్లు. వి. బ. (మొసలి + వాయి + తమ్మఁట్లు) మకరకుండలములు, మొసలిమోము చెక్కిన కర్ణాభరణ విశేషము.

సీ. మిసమిసల్ నిడిగించు మొసలివాతమ్మంట్లు నొక కేలఁ బద్మంబు నొకట గదయు ...
విప్ర. 5. 65.

మొసలివాపోగులు. వి. బ. (మొసలి + వాయి + పోఁగులు) మకర కుండలములు.

గీ. మొసలివాపోఁగు లింపెసఁగ వీనులఁ బెట్టి తలలి వాొఁబొమిడిఃల్ దనర నిల్పి ...
అచ్చ. రా. సుం. 34.

మొసలివాయొంట్లు. వి. బ. (మొసలి + వాయి + ఒంట్లు) మకరకుండలములు.

సీ. మొసలివాయొంట్ల కెంపులకెంపు దృక్కోణ సంరక్తరుచులతో సంధిసేయ ...
ఉ రా 280

మొసలిసొమ్ములు. వి. బ. (మొసలి + సొమ్ములు) మకర కుండలములు.

ద్వి. ముద్దుల మొసలి సొమ్ముల చకచకలు, తద్ద యుఁ జెక్కుటద్దముల న ర్తింప...
ద్వి. పరమ. 2. 122 పా.

మొహదా. వి. అడ్డక త్తి, పట్టిసము

సీ. మిహిపసిండి పరుంజు మొహదా కెలంకులతావు గుజ్జరినేఁత కేవడంబు...   మనుచ. 4. 28.

సీ. పట్టిసతామము ల్పట్టె మన మొహదా యన నడ్డక త్తి నా నలరుచుండు ...
ఆం భా. 2. 215.

మొహరి(రీ). వి. (హిం. మొహర్) ముప్పది చిన్న ముల యెత్తు బంగారు నాణెము.

(వ్యవ.) పూర్వకాలమున ధనికులు మొహరీల పేర్ల నెక్కువగా ధరించెడివారు

మొహరు. వి. (హిం. ముహర్) ముద్ర.

గీ. మీఁగాళ్ళపైఁ బింజె జాగైనదోవతుల్ జిగి తరం బైన ఫార్షీ మొహర్లు...   వేణు. 59.

మొహళము. వి. ఒకవిధమగు కూరాకుచెట్టు (శ.ర.).

## మో

మోఁకటి(రి)ంచు = మోఁకాఠించు. అ. క్రి. (√మోఁకాలు) మోఁకాళ్లు నేలకానువట్లు ముందటి కొఱగు.

గీ. మ్రొక్కుమైతిమి భవుఁ డని మోఁకటించి...
కాశీ. 4. 110.

వ. వాఁడు భయభక్తితాత్పర్యంబులతోడ మోఁక టించి నరంబులు నేల నూఁది నమస్కరించి...
వి. పు. 7, 381

మోఁకటి(రి)ంచుకొను. అ. క్రి. (మోఁకటించు +

కొను=స్వార్థమున` మోఁకాళ్లు నేల కానునటు ముందటి కొఱగు

వ ... ఘోటకంబు వెగ్గలంబుగ మ్రొగ్గియు నగ్గలిక చెడక మోఁకటించుకొని ...

మను చ. 4 115.

మోఁకటిల(ల్ల)ఁబడు. అ క్రి. (మోఁకటిల్లన్ + పడు స్వార్థమున) మోఁకటించు, మోఁకాళ్లు నేల కానునట్లు ముందటి కొఱగు.

సీ. ఆర్చి యొకవంక సాత్యకి యడ్డగింప, వాసుదేవుండు వేఱవంక వచ్చి యుఱుము, వ్రేయ వవ్వీరుఁ డచ్చోట వ్రేసెఁ దత్తఱి చి పౌంఢ్రుఁడు ధర మోఁకటిల్లఁబడియె

ఉ. హరి. 2. 65.

వ. అమ్మేదినీపతి పార్శ్వభాగంబు బెట్టడఁచిన మోఁకటిలంబడియును . .

భార. శల్య 2 267

శ. ర. పా 'మ్రోఁకరిలంబడియును' ముద్రి. పా

శ్లో. స విహ్వలః ప్రహారేణ జానుభ్యా మగమ న్మహీమ్ సం. భార. శల్య. 58 56

కం వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గదలింపలేక దుస్సహపీడన్, మోఁకటిలఁబడియె నేలను, సోఁకోర్వక దిగ్గజంబు సుడిసుడిగొంచున్. భాగ 3. 561

మోఁకటి (రి) ల్లు (లు) = మోఁకటించే. అ క్రి. (√మోఁకాలు) మోఁకాళ్లు నేలమీఁద నానునట్లు ముందున కొఱగు.

చం. వస మఱి మోఁకటిల్లి రథవాజులు మాఁటము దప్పి నిల్చినన్. భాగ. 10. ఉ 1105.

మోఁకారించు = మోఁకటించే. అ. క్రి మోఁకాళ్లు నేల కానునట్లు ముందటి కొఱగు.

కం. ఒకచేతఁ బట్టి తివిసిన, నొకయింతయుఁ గదలకున్న నొగి మోఁకారించుక బలిమి రెండు చేతులఁ, బెకలింపఁగఁ బూమటయును భేదిలకున్నన్. భా 4. 73.

కం. పుడమిన్ మోఁకారించిన, వడితోఁ జేయూఁది శ్రీనివాసయగారే, యడియే వని యొండొరులు, బడి రయగాం ద్రసలు పెంటప ట్టన కచటన్ .. పాంచా. 1. 78.

మోఁకాలు వి. ఔ. (మోఁదు + కాలు. మోఁద + కాలు శ. ర క. మొణకాలు) జానువు. (బ మోఁకాలులు, మోఁకాళులు, మోఁకాళ్లు)

గి ... వచ్చినట్లు, మూర్ఛవోయి మోఁకాళులు మోవఁబడియె... భారం. ద్రో 4. 45

కం శి సుండఁగ మోఁకాలను సేసలు వెట్టుట, శీలతనము గాక మీకుఁ బెద్దఱికంబే. .

ఉ. హరి. 1 96.

గీ. ... గాడుపుకుట్టఁ డవ్వాలునడుమఁ, బట్టుకొని కిన్క మోఁకాలఁ బెట్టి విఱిచె ...

అచ్చ. రా. యు. 242.

ద్వి మోఁకాళ్ళ మోచేత ముష్టి వందంద, దాఁకి చి పడఁదీసి తలలు ద్రొక్కించు ...

రం. రా యు. (చి ని.)

గీ ముడుము మోఁకాలు నాఁగఁ జెన్నడరు జాను,

ఆం. భా. 2 165.

(శ్రీ) రా మోఁకా లొడ్డుట = ఐశ్వర్యము కలుగు. చుండ వారింప నెంచుట.

కం. కౌరవనాయక పాండుకుమారులు నీతోడి పొత్తు మనియెద మనఁగా, (శ్రీ) రా మోఁకా లొడ్డిన, వాంఛితముకాదెనీవు వలదనుటెల్లన్. భార. ఉద్యో. 3 348.

జ మోఁకటించు, మోఁకటించుకొను, మోఁకటిల్లఁబడు, మోఁకటిల్లు

మోఁచెయ్యి(యి)మోఁచేయి వి మోఁదు + చెయ్యి మోఁద + చెయ్యి. శ ర ) కూర్పరము.

ద్వి అణుమూర్తియను భక్తుఁడతఁడు మోఁచెయ్యి, గణనాథ సావపైఁ గదియించి తివియ...

పండితా. పురా. 195 పా.

సీ. కూర్పరంబు మోఁచెయ్యి నా ...

ఆం. భా. 2. 198.

**మోఁచేతిమ (డుపు) డ్పుటిల్లు** వి (మో చేయి + మడుపు + ఇల్లు) మోఁచేతిమడుపువలె కట్టిన కట్టడము

(రెండిండ్లు కలిపి కట్టిన కట్టడము. శ ర.)

**మోఁచేయి = మోఁచెయ్యి** వి ఔ (మోఁ దు + చేయి. మోఁద + చేయి శ ర.) కూర్పరము.

గీ. చిత్రజలజంబులో నున్న శివుని వీడి, వెలి నవసి యించువేల్పు నేలించు టెల్లఁ, బాణి నున్నట్టి కబళంబుఁ బాఱవైచి, కడఁగి మోఁచేయి నాకుట గాదె తెలియ .. శివధ. 2 118

వ. వరాంతకారులపైఁ బడి మడఁగి రెండుమోఁ చేతుల పోటుల. ప్రబంధ 7౦.

ద్వి. మోఁచేతఁ బగులంగ మొగములు బొడిచి. పూఁచిన శస్త్రాస్త్రములు పొడిచేసి ౦ం. రా. యు (చి ని)

**మోఁత** వి (√మోయు) 1. మోయుట, వహించుట

ఆ. పుస్తకములు జడలు పులితోలు చర్మంబు, కతు పాలలు వదిలకు లైన, మోఁతచేటు గాని మోక్షంబు లేదయా... వేమ 8 196

2. బరువు, భారము (శ. ర).

**మోఁద.** వి. (√మో ద) మోఁదుచేత కట్టిన నెత్తురు గడ్డ (శ ర).

**మోఁదకట్టు.** అ క్రి. (మోఁదు + కట్టు) మోఁదు చేత నెత్తురుగడ్డకట్టు. (శ. ర.)

**మోఁదు** స క్రి. కొట్టు, ప్రహరించు

గీ. .. కోపించి మెఱసిన ప్రతిభటాలి, మీఁద గవిసి తుంగలఁగొని మోది నిరవ, శేషముగఁ జేసె భార. మౌ. 1. 61.

కం రాఁ దిగుచు నెగుచు వగుచుం, బోఁ దట్టుం బట్టుఁ దిట్టుఁ బోకిఁ బోతి రోఁజున్, మోఁదు మెడ ద్రొక్కు నెక్కును, మీఁదికి నెగయించు వంచు మెయి సారించున్. ఉ హరి 6 10౩

ఉ వేఁదుఱు గొన్న మానవుని వేములు గంటియు బిట్టు గాల్చియున్, మోఁదియు నీటఁద్రొక్కి యను మున్గొన్ తీఁవ్రఁ గడంగువెజ్జు న,శ్లేఁదగ నిన్ని చందముల నీపనిఁ దీర్పుటకై పెనంగితిన్, ఏమి సేయుదున్. నృసిం 5. 1౩

౨ దెబ్బ, ప్రహారము.

మ. అని నీకే నటు మోఁదులం బడి కడుం బ్రాణార్తుఁడై పాఱిపో,యిన సుగ్రీవుఁడు.. భా రా కిష్కిం 20౩.

ఉ మోఁదుల కోఁక నన్ను జూపినన్ దశకు 4 12

జ మోఁకాలు, మోఁచెయ్యి, మోఁచేయి, మోఁచేతిమడ్పుటిల్లు, మోఁద, మోఁదకట్టు, మోఁదులాట, మోఁదులాడు

**మోదులాట** వి (√మోఁదు) కొట్లాట దెబ్బలాట.

గీ .. వృష్ణిభోజాంధక వీరు లెల్ల, మునివర నిర్దిష్ట ముసలాత్మకము లైన ముయ్యంచు తు గల మోఁదలాటఁ.

సీ జెబ్బ యొడొటుప్పలఁ బరిమార్చుటయును .. భారం మౌ 9౬.

**మోదులాడు** అ. క్రి (మోఁదులు + ఆడు) దెబ్బలాడు

చ . బోఁలుం, దొడలను వీపులున్ దలలు నొవ్వఁ గడఁదిగ మోఁదులాడుచున్ .. అచ్చ. రా. యు. 194.

**మోక = మొక్క, మొలక.** వి 1 అంకురము.

సీ మొలక మొలవ మొక్క మోసిక మొటక... నాకు న-కురం బొప్పుచుండు . . ఆం. భా. 2. 35.

2. వృక్షకము, చిన్నచెట్టు.

గీ ధవళకేతకిధూళి గాత్రమునఁ జఱచి, మోక మామిడి కొకకొంత ద్రొక్కి నిలిచి, యొడలిలోఁ జక్కసగము నా కొసఁగు మనుచు. నద్రికకన్య తల వాంచె హరుఁడు వవ్వె. ఉ హర. 5. 56.

సీ తలకంబు బలు తేనియలఁ బోఁక మోకల

రండ. సం వి. ఆ స్త్రీ 1. నింద్యయగు స్త్రీ. దుర్మార్గురాలు

సీ ఏజంత భోధి చెనే నిన్ను నోతల్లి కాన పాపం డసంగతుల మెరగ, ఏరండ భ్రమయించెనే నినుఁ దల్లిధర్మంబు మోక్షం బబద్ధంబు లనుచు. ప్రబోధ 3. 8.

2 విధవ, భర్తృహీన

శ్లో॥ రండా పీనపయోధరా ... ... నో గాఢ మాలింగితాః. సం. ప్రబోధ 8. 18.

3. మూషకపర్ణి, ఎలుకచెవిచెట్టు

రండకము. సం వి అ. పుం గొడుచెట్టు, కాపు లేనిచెట్టు, న. స్వర్ణంబు ధర్మకార్యమగు అంతః కరణము

రండుఁడు సం విణ (అ ఆ. అ) విదలాంగుడైన వాఁడు, అంగచ్ఛేదము చేయఁబడినవాఁడు. 2 ధూర్తుఁడు, ...

రంత సం. విణ ... ...మి చి వాఁడు, క్రీడింగువాడు

రంతిదేవము సం. వి అ. పుం కుమము, కుక్క

రంతిదేవుఁడు సం వి పుం 1. భరతునితర్వాత నాలుగ ... చంద్రవంశపురాజు. 2. విష్ణువు

రంతు = ఈ. తు. వి. (సం రతిః) 1 క్రీడ, ఆట. మత్తకోకిల. రంతు సేయుచు వాతధూతతరాళ భంగురభంగదు, ద్రాంతనంతలసాగరోదక తల్ప మొందవసించు బ్రహ్మ తివానిని బొడ్డుఁదమ్మిని నాఁచి కాచిన నేర్పరిన్ భాగ. 6. 328.

ఉ. అప్పుడు బారసాఁచి తనయర్మిలివిందులు విచ్చి రంచు నవ్వొప్పఁగఁ జిరుతల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు, నెప్పటి వచ్చి చనుడుచును. భాగ. 10. పూ. 302

2. రతి, కామకేళి

గీ బాహుమవపీథి శిఖాంకుధరవిరతు, శౌరి గోపాలకామినీ చౌర్యకేళి, కామరసభావములు మించి కానఁబడఁగ, దీర్చి యిడుపుల యందుఁ జిత్రించినారు. నైష. 7. 151

3. ఒప్పిదము.

సీ. చూపుచున్నది జోగిణీపంతురంతుగా రంభ నాట్యగృహాంతరంబునందు. కవిరా. 3. 88.

4 కలకలము, అలబలము, శబ్దము, సద్దు,

ఆ. ... పురములోన ఘనముగా రంతయ్యె, నాతి కులను దివియ లందుకొనుచు, గల్లు బట్టె వనుచు నెల్లదిక్కులఁ జూడ, లరయఁజొచ్చి రతి విహస్తులగచు ద్వా. 10. 125.

కం. .. రంతు సేయని విద్యుద్ర్వాతంబుఁ జూచి లాఁతుల, మాతరవాయుడుగ మాటలాడుం డనుచున్ ఆము. 8. 4.

5. మనవి, విన్నపము

ఉ అంతటఁ బ్రొద్దుగ్రుంకుటయు నాశకశంబు గజేంద్ర రోహిణీ, కాంతునికొల్వుచూచు టకుఁగాఁ దొడితెచ్చితిఁ జూడుమంచు నిశ్చింతఁ జేరి దంతికి శశిప్రతిబింబముఁ జూప మ్రొక్కచో రంతులు చిత్తగింపు మపరాధము సైపు మటంచు వేఁడుచున్.

నా. వంచ. 3. 112.

6 సింహనాదము, పెద్దమ్రోఁత. (ఆంజనేయ స్వామి.)

సీ. రంతుచూపినపట్ల వంతుమోపినయట్ల గుహలు ప్రతిధ్వనుల్ గ్రుమ్మరింప. రామా. 6. 88

సీ. రట్టు రట్టడి రవ్వ రద్ది రద్గుప్పత రంతుగోవారు గోంపన వెలయు, నాఘోషణసమాఖ్య.

ఆం. భా. 1. 115.

7. కలహము, వాక్కలహము, రచ్చ.

శా. ...తి, పార న్నేఁ జననీమియు న్నగిడి నీ వా రామియుం దెల్ల మే, లా రంతుల్ వలు పల్కు లంత్యకుల యేలా చింత లేలా వగల్.

ఆము. 6. 41.

8. మిడిసిపాటు:

మానినీవృత్తము. అంతమదింపకువే యని పల్కిన వంత మదింపకువేయనుచున్, గంతు లడంచెద లెమ్మని పల్కిన గంతు లడంచెద లెమ్మనుచున్, రంతుల నేమి ఫలంబని పల్కిన రంతులనేమి ఫలం బనుచున్. కళా. 3. 185.

జ. రంతుగ త్తె, రంతుకాఁడు.

**రంతుకత్తె.** విశ (రంతు+కత్తె) క్రీడాపరురాలు.

సీ. బవనీల జవనికపాటల నిల్లాంద్రరమణఁ ద్రుళ్లాడించు రంతుకత్తె: క్రీడా. 128.

**రంతుకాఁడు.** విశ. (రంతు+కాఁడు) క్రీడాపరుఁడు.

వ. అతండు నిర్జితుం డగుట మనకుఁ గీర్తికరంబనిన యారంతుకాంద్ర కలపులు విని రుక్మి వారు మం దానును. హరి. ఉ. 3. 228.

(ఇట ద్యూతక్రీడాపరాయణు అని భావము)

**రంతువు.** సం. వి. ఉ. పుం. 1. మార్గము, దారి 2. నది, ఏఱు:

**రంధనము.** సం. వి. అ. న. 1. పాకము, వంట వండుట.

**రంధి.** వి ఏకచిత్తత, తత్పరత. (ఇది జలధివంటిది)

గీ పసిఁడియందెలు గల్లనఁ జాటిపాటి, మెచ్చు వద్దేని పని సేయకొత్తె నవక, ఘుటిక మ్రింగిన సిద్ధునియటుల నుండు, నినజపరిపంథి యతని క దేటి రంధి. పారిజ. 2. 158.

**రంధితము** సం. విశ అ ఆ అ. 1. పాకము చేయఁబడినది, వండఁబడినది.

**రంధ్ర.** కంటము. సం వి. అ. పుం. బహ్వారవిశేషము, జలబర్బురము (వృ వి.) (వాచ.)

**రంధ్రబభ్రువు.** సం. వి. ఉ పుం. ఉందురము, ఎలుక.

**రంధ్రము** సం. వి. అ. న. 1. బెజ్జము, కన్నము, ద్వారము. 2. నిద్ర, దూఱు, 3. తప్పు, అపరాధము. 4. (జ్యోతి) తొమ్మిదవ సంఖ్యకు సంకేతపదము.

**రంధ్రవంశము.** సం. వి. అ. పుం. కీచకము బొంగు వెదురు (వృ వి.).

**రంధ్రాగతము.** సం. వి. అ. న. గుఱ్ఱములగళ రోగభేదము, గుఱ్ఱముల కంఠరోగము (అ. ని).

**రంధ్రాన్వేషి.** సం. విశ. (న్ జి. న్.) రంధ్రములు వెదకువాఁడు, లోపములు కనిపట్టువాఁడు.

**రంధ్రుఁడు** సం వి అ. పుం. సాంకరజాతివాఁడు (కే ని)

**రంపు** వి. రాయిడి, ఒరపిడి

చం. రతిపతి యంపజంపముల రంపునఁ గంపము నొంది నేను మున్, రతికయి వచ్చి మచ్చిక లొనర్చిన జెచ్చెరనొందనేరకే, ఋతుదివసంబు దప్పెఁ గడ కేఁగు మ టంటివి. అహల్యా 2 75.

సీ ..రాయిడి రారాపు రం పనంగ, నను మర్దనం బొప్పు ఆం భా 2. 223

**రంపె** (పియ) వి. 1. మాదిఁగవాఁడు తోలుకోసెడి సాధనవిశేషము (శ. ర) 2 తాటాకులు మల్గించికోసెడు సాధనవిశేషము (ర. స)

**రంపె** (పియ) వి. దారుణ ఖత్యము (చూ. రంపెలాఁడి) జ. రంపెలగొట్టు, రంపెలాఁడి

**రంపెలగొట్టు** విశ (రంపెలు² + గొట్టు²) దారుణకృత్యములు గలవాఁడు. దారుణకృత్యములుగలది.

ఉ. ...... విరాళిగాఁ డే రంపెలగొట్టుగాక బలురాయిడి క్షత్రియగాక యెప్పుడున్, సొంపుపాఁ యుంబలేని యెక జూదరి క్షత్రియగాక యొంతయున్, ధనాభి. 2. 60

**రంపెలాఁడి** విశ. (రంపెలు² + ఆఁడి) దారుణకృత్యములు గలది. ఆఁడుది)

సీ. దింపివై చుకొకాని చీరలు బ్రనఁ గటిముసఁ గై సేయ దా రంపెలాఁడి. వేం. పంచ 5. 182.

(శ. ర. పాఠము ఖలాఁడి ముద్రి పా)

రక్కసి వి (సం. రక్షస్) 1. రాక్షసుఁడు, రాక్షసి.
సీ పసిదిండి మెకపురక్కసితోలు మొలఁజుట్టి.
నీలా. 1. 13

కం. రక్కసి మగువలయాలవు, మొక్కవరచె దీవ.
పారి. 1 50.

ద్వి. పలుగాకిగాక యీపాప మెందైనఁ, గల
దమ్మ యెంత రక్కసి యనువారు.
ద్వి శ. పా. 3 186. పం.

2. నైరృతుఁడు.

గీ. ... పాలను,దిండి రక్కసి రాతిరిదిరుగుమేటి.
యనఁగ నైరృతి దగు. ఆం. భా. 1. 50

జు. రక్కసిగొంగ, రక్కసిదాయ, రక్కసిఱేఁడు
రక్కసులగొంగ

రక్కసిగొంగ. వి (రక్కసి+గొంగ) దైత్యారి
విష్ణువు

ఉ. రక్కసి గొంగ పైఁ గడుఁ దిరంబుగ నిల్పిన
డెంద మింకఁ దాఁ,డక్కరినొక్కనిం గవయుట
న్నెఱిఁగోరునె. నీలా. 2 115.

రక్కసిదాయ. వి. (రక్కసి + దాయ) దైత్యా..
విష్ణువు

రగడ. రామ తెలనె నీ రక్కసిదాయకు, నీమృష
లన్నియు నిజ మని దాయకు. చమ. 1.134

రక్కసియ(సె). వి. (సం. రక్షః) రక్కసి.

సీ. కదలక పెన్నిధి గాచు దయ్యంబులు రిచ్చ
రావుల బొమ్మరక్కసియలు.
కవిక. 4. 110.

(ముద్రి. పా రక్కసీలు అని రక్కసీఁడు అని
గ్రహించిన శ ర. పా.)

గీ బల్లఁ బొమ్మన్న(బోదె తా మల్లసముల, నేఁప
వదిరక్కసియ యాట యెగ్గె...
ఆము. 5. 51.

రక్కసిఱేఁడు వి (రక్కసి + ఱేఁడు) రాక్షస
రాజు.

శా. విను మో దేవ రావణుఁ, డను రక్కసి
ఱేఁడు చెనఁటియై నీ పాలతిం, గొనిపోవఁ
వానిం బై, కొని యని యొనరింప నిట్టి
గొడనలు సెందెన్. అచ్చరా. అర. 111.

రక్కసుఁడు. వి (సం. రాక్షసః) 1. రాక్షసుఁడు.

ఉ. ఉక్కటి యిట్లు మధ్యము మహోగ్రశరం
బులుదాఁక నోర్వ కా, రక్కసులెల్ల నాహవ
పరాఙ్ముఖులైన... భా. అర. 4 12.

ఉ. ... పె, వ్యాలుగవై మహో...వం బోలుఁ
బల్కుల దొంగ రక్కసున్, ఇ...వంక వాఁడి
గలి వచ్చి వెన న్నిగమాలిఁ దిమ్మిపూ, చూలి
కిఁ దెచ్చి యీవె త్రిదశుల్ గొనియాడ
మురాసురాంతకా. పారి. 3 28.

గీ. ... రక్కసుతో దైన్యవిరహితముగ, ధర్మ
మెఱిఁగించు సూక్తి నాతండు వలికె.
ఆము 6. 27.

ఉ. కావున క్రుచ్చిరక్కసుని గ్రక్కున నొక్కట
ను క్కడంచి... దశా. 1. 276.

2. నైరృతుఁడు.

మ. ...గజము డు రక్కసుఁడు నీరై...
తాల్పు రాగాడ్పు...కు...ల ...
తాలుపును బల్కు...బోటిగేస్తుండుఁ బ...
రాడాల్ దొరయు నొమ్మద లలుగ వేల్ప...
న వ్వెండిగు,బ్బలిపైనుండి జగంబు తేలు బలు
వేల్పా గట్టు విల్గాలుపా. నీలా 2 118.

రక్కసులగొంగ వి. (రక్కసులు + గొంగ).
రక్కసిగొంగ (శ. ర.).

*రక్కాముకోళ్లు వి. అరణ్య జంతువిశేషము.

గీ. అమరికలఁగల్గి సంకటి తమిఁదరొట్టి, వేఁట
పొట్టచెవ మినువపిండ మెఱిక, లొడికముగ
బొక్కి దిగదిరఁ బడినకోళ్ళఁ, గఱచి కాటుల
గెల్చు రక్కముకోళ్లు. ... ధ. 132.

రక్కెస. వి. (సం. రాక్షసః) 1. రక్కసి.

కం. రక్కెసకుఁ దాను పెక్కుఁడు, రక్కెసరాజు
కృష్ణుఁ డిట్లు క్రౌర్యావేశం, బక్కజముగఁ

ప్రచరింపంగ, వ క్కుటిలాసురియుఁ గెడసె వాయనును భువిన్. హరి. పూ. 5 151.

కం. ఏతెంచు పాండుపుత్రు ని, కేతమునుండి పోరి కిన్ వ ... కు వ, వ్యాతూలసుతుని గని నం, జాతస్మరణముల రక్కొనలు తిమలోనన్. జై. భా. 5 187

2. గయ్యాళి, ధూర్తస్త్రీ.

సీ. యువతినేసిన యపూర్వోపచారమునకు వెస మిన్నుముట్టియమ్మినలిసెట్టి, యిచ్చ వచ్చెరు వంది ముచ్చటైనను మొగం బీని రక్కొన దను దాన వచ్చి, నను నిట్లు కౌఁగిలించినది నేఁ డిం దుకుఁ గారణం బేమేనిఁ గలుగవలయు. వేం. పంచ. ౭. 302.

3. వృక్షవిశేషము. (శ. ర.)

విశ. 1. అయుక్తము.

ఉ. రక్కొనమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ, వొక్కటియైనఁ గాదనక యూకొను చుండుట యంతకంటె మేలు.. భార. ఉద్యో. ౧. ౨౪

కం. ఆలంబులోన రక్కొన, మేలంబులుగలవె... ఉ. హరి. 6. 54. రాజ. చ. 2. 48.

2. దుస్సహము.

ఉ. నెట్టన యిట్టియల్క మదినిల్పితి రక్కొన శాల్కిఁ జిచ్చాడిం. గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి వాలుచున్నదుం, బుట్టుదు దుష్ట గ్రహము పూని యుగంబులుగాచువట్టి ... వు నీవుఁ దేజమునఁ బొల్చిన భర్తలుఁ గల్గ వచ్చునా. భా. ఉద్యో. 3. 118.

రకొ్కను. రెకొ్కను. అ. క్రి. 1. కలుగు, జనించు.

సీ. కపురంపుఁబలుకులు గలగల రాలుట క్రొత్త చిట్టములు రకొ్కనుట నెఱప. కు. 7. 63.

సీ. మును పుష్యరాగంపు మొవల రకొ్కనిమించు వైడూర్యశాఖల పచ్చరాద, డమ్ములు... ప్రబంధ. 203. 2. వర్ధిల్లు.

కం. అని యెంచి యుంచువిలువీ, రుని యలుగుల గుంపు తుది చుఱుక్కున నాఁటన్, జనియించిన తమకము రకొ్కని ముంచినఁగలఁగి తెప్పి కోల్ ధృతిమించన్. కువల. 3. 34

3. సిద్ధించు, నెఱవేఱు.

ఉ. ... కోరికల్, రకొ్కనఁజేయు శ్రీ వరద రాజులఁ గొల్వఁగఁ జేరి చేరువన్. ఘటికా. 2. 222

4. తేఱుకొను, తెప్పిఱిలు.

ఉ. నక్కెరవి టురాజు నగచాపునితో నెదిరించి వద్దనాఁ, డెక్కడనుంటి వీవు మఘవెక్కడ నుండెను మందమారుతం, బెక్కడ నుండె సిగ్గుపడరే మిపుడాతఁ డదృష్టరేఖచే, రకొ్కని క్రమ్మఱం బ్రతికిరాఁగ నజీర్ణ ... యిచారుగా తి. విజ. వి. 3 54

(రకొ్కలుపు)

రకొ్కలుపు. (లుపు). స. క్రి. (√. రకొ్కను) రకొ్కనఁజేయు.

మ. రజనీకాంత వియత్తలంబు చవుటన్ రకొ్కలుపు దీ ప్రాసిత, ధ్వజకాదంబము మచు పేర రవబర్వన్. చంద్రా. 5 60.

రక్త సం. వి. అ. స్త్రీ. 1. లక్క, 2. గుంజలత, గురివెందతీగ, 3. మంజిష్ఠ, మంజిటి (వ్య. వి.) 4. అగ్నిజిహ్వలలో నొకటి.

రక్తకంఠము. సం. విశ. (అ. ఈ. అ.) ఇంపైన కంఠముగలది., శ్రావ్యమైన కంఠముగలది.

వి. అ. పుం. పికము, కోకిల. (విల్యమ్సు).

రక్తకంఠి. సం. విశ. (న్. ఈ. న్) రక్తకంఠము.

రక్తకందము. సం. వి. అ. పుం. 1. ప్రవాళము, పగడము. 2. రక్తాలువు, ఎఱ్ఱదుంప, తియ్యదుంప. 3. రక్తపలాండువు, ఒకజాతినీరుల్లి.

రక్తకందలము. సం. వి. అ. పుం. ప్రవాళము. పగడము.

రక్తకంబళము. సం వి. అ. న. చెంగలువ.

రక్తకమలము నా. వి అ. న ఎఱ్ఱతామర, చెంగలువ.

రక్తకము. నం. విశ. (అ. ఆ. అ.) 1 అనురాగము గలది, మోహించినది, వలచినది. 2. సంతోష కరము, ఉల్లాసపఱుచునది.

వి అ. పుం. 1. ఎఱ్ఱబట్ట. 2. అమ్లానవృక్షము, పెద్దగోరంట (వృ. వి.) 3. బంధూకము, మంకెన (వృ. వి.).

న. 1. నెత్తురు. 2. ఎఱ్ఱబట్ట, తోపుచీర

రక్తకరవీరము. నం. వి. అ. పుం. ఎఱ్ఱ గన్నేరు (వృ.వి.).

రక్తకాంచనము. నం వి అ పుం కోవిదారము (వృ. వి.)

రక్తకాండ. నం. వి ఆ. స్త్రీ రక్తపునర్నవ. ఎఱ్ఱ గలిజేరు (వృ. వి.

రక్తకుండలము నం వి అ న కోకనదము, చెంగ లువ (వై. ని.)

రక్తకుండు. నం. వి అ పుం 1 కాముకుడు, క్రీడా క్తుడగు మనుష్యుఁడు

రక్తకుసుమము నం వి అ పుం పారిభద్రకము (వృ. వి.).

రక్తకేసరము న. వి అ పుం ప్రవాళ వృక్షము, పగడపుఁజెట్టు. 2. నమేసువృక్షము. పున్నాగము (వృ. వి.), 3. పారిభద్రము (వృ వి.).

రక్తకైరవము నం వి అ న. చెంగలువ పువ్వు

రక్తకోకనదము న. వి. అ పుం చెంగలువ పువ్వు.

రక్తగంధకము. నం వి అ. న. గోపరసము, పరిమళముగల యొక యెఱ్ఱనిబంక

రక్తగ్రహుఁడు. నం వి అ. పుం. రాక్షసుఁడు. వై. ని.).

రక్తఘ్నము నం వి. అ పుం రోహితక వృక్షము, ములు మోదుగు చెట్టు

రక్తఘ్ని నం. వి ఈ. స్త్రీ దూర్వాతృణము.

రక్తచందనము నం వి. అ న. 1. ఎఱ్ఱ చందనము

రక్తచిత్రకము. నం వి. అ పుం. 1. ఎఱ్ఱ చిత్ర మూలము (వృ. వి) 2. ఈ. వ. వసుపుం (వాచ.)

రక్తచూర్ణము నం వి అ న. సిందూరము.

రక్తచ్ఛర్ది. నం వి. ఇ స్త్రీ. రక్తము (నెత్తురు) క్రక్కుట, రక్తవమనము.

రక్తజిహ్వము. నం. వి. అ. పుం. సింహము.

రక్తఝింటి నం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱగోరంట.

రక్తతుండకము. నం. వి. అ. పుం ఘూనాగము, వానపాము.

రక్తతుండము. నం వి. అ పుం చిలుక, రామ చిలుక, ఘూనాగము, వానపాము (రా.ని.).

రక్తతృణ. నం వి ఆ. స్త్రీ. ఒకానొకతృణము, గోమూత్రిక (రా. ని.)

రక్తతేజస్సు నం. వి. స్ ... మాంసము పు (వ్యము)

రక్తదంతి నం వి ఈ స్త్రీ దుర్గాదేవి

రక్తదంతిక నం వి. ఆ స్త్రీ దుర్గాదేవి.

రక్తదల. నం. వి. ఆ. స్త్రీ నలి, గువ్వగుత్తి. (వృ వి.)

రక్తదృశము. నం. వి. శ. పుం. పావురము, కపోతము, ఇట్లే రక్తదృష్టి.

రక్తధాతువు నం వి. ఉ. పుం 1. గైరికము (ఎఱ్ఱనిధాతు, ఎఱ్ఱమన్ను) 2 తామ్రము, రాగి. 3. రుధిరము నెత్తురు.

రక్తనాలము. నం వి అ. పుం జీవశాకము (వృ వి.) (రా ని).

రక్తనాసికము నం. వి. అ పుం ... ము గుడ్లగూబ (వ్యము).

రక్తప నం వి ఆ. స్త్రీ. 1 ... రక్తము త్రాగునది. 2. డాకిని, రాక్షసి.

రక్తపక్షము సం. వి. అ. పుం. గరుడపక్షి. గరుత్మంతము (విఙ్యమ్ను).

రక్తపత్త్రిక సం. వి. ఆ. స్త్రీ. 1 నాకులి (వృ.వి.) 2. రక్తపునర్నవ (వృ. వి.).

రక్తపము సం. వి. అ. పుం. పిశాచము. దయ్యము.

రక్తపల్లవము సం. వి. అ. పుం. అశోక వృక్షము.

రక్తపాకి సం. వి. ఇ. స్త్రీ. బృహతి, వాకుడు (వృ.వి.)

రక్తపాణిపము సం. వి. అ. న. ఉత్పలము, కలువ (వై. ని.).

రక్తపాత సం. వి. ఆ. స్త్రీ. 1 జలగ (అ. ని.).

రక్తపాతము సం. వి. అ. పుం. రక్తస్రావము, ప్రాణవధ.

రక్తపాదము సం. వి. అ. పుం. ఎఱ్ఱని పాదములుగలపక్షి, చిలుక.

రక్తపాది. సం. వి. ఈ. స్త్రీ. 1. లజ్జాలువు ముడుగుదామర (వృ. వి.). 2. హంసపది (వృ. వి.) (వాచ)

రక్తపాయి సం. వి. న్. పుం. మత్కుణము, నల్లి (విఙ్యమ్ను)

రక్తపాయిని సం. వి. ఈ. స్త్రీ. జలగ.

రక్తపిత్తము సం. వి. అ. పుం. న. ఇంగిలీకము.

రక్తపిండము సం. వి. అ. న. 1. ఎఱ్ఱనిమొటిమ ఎఱ్ఱగా జన్మముపై బయలుదేఱెడికాయ. 2 ముక్కునుండియు నోటినుండియు నాకస్మికముగా రక్తముకారుట (విఙ్యమ్ను). 3. పుం. ఓడ్రపుష్పము, దాసనము (వృ. వి.) (త్రి. ని.).

రక్తపిత్తము. సం. వి. అ. న. రోగభేదము. పిత్తమున బయలుదేఱిన రక్తము క్రమము తప్పిపోవుట (రక్తస్రావమగుట).

రక్తపుచ్ఛిక సం. వి. ఆ. స్త్రీ. వలికండ్లపాము.

రక్తపుష్పము సం. వి. అ. పుం. ఎఱ్ఱని పువ్వులుగలచెట్టు, కరవీరము, రోహితకము, దాడిమము, బంధూకము, పున్నాగము మొ.

రక్తపుష్పి సం. వి. ఈ. స్త్రీ. 1. పాటలివృక్షము. 2 జపాలత. 3 ఆవర్తకీలత 4 నాగదమనీలత. 5 కరుణీవృక్షము 6. ఉష్ట్రికాండీలత. 7. బ్రాహ్మణి, ఒకానొకకీటము (వాచ) (కే.ని.).

రక్తపుష్పిక సం. వి. ఆ. స్త్రీ. 1. లజ్జాలువు. ముడుగుదామర (వృ. వి.) 2. రక్తపునర్నవ (వృ. వి.) 3. భూమిపాటలము (వాచ.)

రక్తపూరకము. సం. వి. అ. న. వృక్షామ్లము (మారేడు, చింతచెట్టు)

రక్తఫల. సం. వి. ఆ. స్త్రీ. 1 బింబిక దొండతీగ. 2. స్వర్ణవల్లి.

రక్తఫలము. సం. వి. అ. పుం. 1. వటవృక్షము. మఱ్ఱిచెట్టు 2. దొండ.

రక్తబిందువు సం. వి. ఉ. పుం. రత్నదోషము. క. నెట్టనమణిపై నెత్తురు, పెట్టినయట్టున్న రక్తబిందువు, గానం, బట్టకు ... రత్నపరీక్ష 61.

రక్తబీజము సం. వి. అ. పుం. రూ. రక్తబీజము, దాడిమవృక్షము, దానిమ్మచెట్టు.

రక్తభవము సం. వి. అ. న. మాంసము.

రక్తమంజరము సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు నిచులవృక్షము.

రక్తమండలము. సం. వి. అ. న. కెందమ్మి, చెంగల్వపువ్వు.

రక్తము. సం. విశ. అ. ఆ. అ. 1. రంగువేయబడినది. వేఱురంగు కలుపఁబడినది, చిత్రితమైనది. 2. ఎఱ్ఱనిది, కెంపువన్నెగలది. 3. వలచినది, అత్యాసక్తమైనది. 4 క్రీడాసక్తమైనది.

వి. అ. పుం. 1. ఎఱుపురంగు, కెంపువన్నె. 2 కుంకుమపుష్పము. 3. హిజ్జలము. 4. పరాగము, పుప్పొడి. 5. రంగువర్ణము, న. 1 నెత్తురు. 2. తామ్రము, రాగి,

3. ఇంగిలీకము. 4. కుంకుమపువ్వు. 5. సిందూరము. 6. పద్మకము (వ్య. వి.). 7. ప్రాచీనామలకము (వ్య. వి.). 8. రాగము, ఎఱుపు. 9. ఆర్తవము, ముట్టునెత్తురు. 10. రంగు, వర్ణము.

రక్తమూల. సం. వి. అ. స్త్రీ. లజ్జాలువు, ముడుఁగుఁదామర (వాచ.).

రక్తమూలకము. సం. వి. అ. పుం. దేవసర్షపము. (వ్య. వి.) (వాచ.)

రక్తమేహము. సం. వి. అ. పుం. మూత్రముతో రక్తము పడుట, మేహరోగవిశేషము.

రక్తమోక్షణము. సం. వి. అ. న. రక్తస్రావము, నెత్తురుకాఱుట.

రక్తయష్టి. సం. వి. ఇ. స్త్రీ. మంజిష్ఠ, మంజిటి (వ్య. వి.)

రక్తరాజి. సం. వి. ఇ. స్త్రీ. ఒకానొక నేత్రరోగము. ఒకనకము కంటిజబ్బు (విల్యమ్సు).

రక్తరేణువు. సం. వి. ఉ. పుం. 1. సిందూరము. 2. పున్నాగవృక్షము. 3. కోపి, కోపముగల మనుష్యుడు. 4. పలాశకలిక, మోదుగుమొగ్గ.

రక్తల. సం. వి. అ. స్త్రీ. కాకతుండి (వ్య. వి.).

రక్తవటి. సం. వి. ఈ. స్త్రీ. మసూరిక (మసూచకము), అమ్మవారిజబ్బు.

రక్తవరటి. సం. వి. ఈ. స్త్రీ. రక్తవటి.

రక్తవర్గము. సం. వి. అ. పుం. 1. లాక్ష, లక్క. 2. దాడిమవృక్షము, దానిమ్మచెట్టు. 3. కుంకుమపువ్వు. (దాడిమాదిసమూహము అని వాచ.).

రక్తవర్ణము. సం. వి. అ. పుం. ఇంద్రగోపము. ఆరుద్రపురుగు.

రక్తవర్ధన. సం. వి. అ. స్త్రీ. వార్తాకి, ములక (వ్య. వి.).

రక్తవాను. వి. లేఖరి, వ్రాయసకాఁడు.

గీ. రసికుఁడైనట్టి కాలంపు రక్తవాను, తనర బ్రహ్మాండ మను పెద్ద దవతిలోన, శాయి నిండారఁబోసిన చందమునను, గారు తిమిరంపుగుంపు సొంపారఁ బర్వె. హంస. 1. 141.

రక్తవాలుక. సం. వి. అ. స్త్రీ. సిందూరము.

రక్తవాలుకము. సం. వి. అ. న. సిందూరము

రక్తవృంత. సం. వి. అ. స్త్రీ. శేఫాలిక, వావిలి (వ్య. వి.).

రక్తశాలి. సం. వి. ఇ. పుం. రక్తవర్ణధాన్యవిశేషము.

రక్తశీర్షకము. సం. వి. అ. పుం. 1. ఒక జాతినారాయణపక్షి. 2. సరళద్రుమము. 3. కర్పూరతైలము. (వై. ని.)

రక్తశీర్షము. సం. వి. అ. పుం. (శ్రీ)పిష్టమను నిర్యాసము, ఒకవిధమగు క్రౌంచపక్షి (కే. ని.).

రక్తశృంగికము. సం. వి. అ. న. ఒకవిధమైన విషము.

రక్తసంకోచకము. సం. వి. అ. న. ఎఱ్ఱతామరపువ్వు. కెందమ్మి.

రక్తసంకోచము. సం. వి. అ. పుం. కుంకుమపువ్వు.

రక్తసంజ్ఞము. సం. వి. అ. న. కుంకుమపువ్వు.

రక్తసందంశిక. సం. వి. అ. స్త్రీ. జలగ.

రక్తసంధ్యకము. సం. వి. అ. న. 1. చెంగల్వ. 2. కెందమ్మి.

రక్తసరోరుహము. సం. వి. అ. న. 1. ఎఱ్ఱదామర. 2. కుంకుమపువ్వు.

రక్తసర్షపము. సం. వి. అ. పుం. రాజిక, నల్లఆవ (వ్య. వి.)

రక్తసారము. సం. వి. అ. న. రక్తచందనము, ఎఱ్ఱచందనము.

రక్తాంగ. సం. వి. అ. స్త్రీ. కాంపిల్లము, రోచని (వ్య. వి.). 2. జీవంతి, పాలకూర (వ్య. వి.) (కే. ని.).

రక్తాంగము. సం. వి. అ. పుం. 1. మత్కుణము, నల్లి. 2. కంపిల్లము (వ్య. వి.). 3. గ్రహమండలము. న. 1. పగడము. 2. కుంకుమపువ్వు.

రక్తాంగుడు. సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు

రక్తాకారము. సం. వి. అ. పుం. ప్రవాళము, పగడము.

రక్తాక్తము సం. వి. అ. న. రక్తచందనము, ఎఱ్ఱచందనము

రక్తాక్షము సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱ్ఱనికన్నులుగలది 2. భయంకరమైనది, వెఱపుగలిగించునది. వి. అ. పుం. 1. మహిషము, దున్నపోతు. 2. పారావతము, పావురము. 3. సారసము, బెగ్గురుపక్షి 4. చకోరపక్షి.

రక్తాక్షి. సం. వి. ఈ. పుం. అఱువది సంవత్సరములలో నొకటి. రుధిరోద్గారికి తరువాతిది.

రక్తాతి (తీ) సారము. సం. వి. అ. పుం. రక్తవిరేచనము

రక్తాధారము. సం. వి. అ. పుం. చర్మము, త్వక్కు.

రక్తాపహము. సం. వి. అ. పుం. బోలము, గోపరసము, పరిమళముగల యొక బంక

రక్తామ్రము. సం. వి. అ. పుం. కోశామ్రము, కొండమామిడి

రక్తార్బుదము సం. వి. అ. పుం. రక్తగ్రంథి, శరీరముపై బయలుదేఱెడి యెఱ్ఱని కాయ, రోగవిశేషము.

రక్తార్శస్సు సం. వి. స్. న. ఒకవిధమైనరోగము. మూలశంకురోగములలో నొకజాతి.

రక్తాలువు. సం. వి. ఉ. పుం. తియ్యదుంప, ఎఱ్ఱదుంప

రక్తాశోకము. సం. వి. అ. పుం. ఎఱ్ఱని పువ్వులుగల యశోకవృక్షము

రక్తాశ్మము సం. వి. న్. పుం. కావిఱాయి (శ. ర.).

రక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1 మనోహరత. 2. రాగము, అనురాగము.

రక్తిక. సం. వి. అ. స్త్రీ. 1. గుంజాలత, గురివెందతీఁగ. 2. తూనికలో నుపయోగింపఁ బడెడి గురివెందగింజ. 3. బంధూకము, మంకెన (వ్య. వి.) (కే. ని.).

రక్తిమ(ము). సం. వి. న్. పుం. రక్తవర్ణము, ఎఱుపురంగు.

రక్తైరండము. సం. వి. అ. పుం. పేరాముదపుచెట్టు.

రక్తోత్పలము. సం. వి. అ. న. ఎఱ్ఱకలువ.

రక్తోపలము, సం. వి. అ. న. 1. ఎఱ్ఱసుద్ద, ఎఱ్ఱమన్ను. గైరికము.

రక్ష సం. వి. ఆ. స్త్రీ 1 రక్షించుట, భద్రపఱుచుట.
గీ.. విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష.
భార. అర. 4.130.

2. కావలి, కనుపెట్టియుండుట 3. కాయెత్తు, బిడ్డలకు రక్షణకై కట్టెడి యంత్రము వేసిన వస్తువు 4. నొసటఁ బెట్టుకొనఁబడెడి భస్మము, విభూతి. 5. శ్రావణపౌర్ణమాస్య యందు(నితరసమయములయందునైనను) రక్షాబంధముగా ముంజేతఁ గట్టుకొనఁ బడెడి పట్టు త్రాడు లేక పట్టుగుడ్డ. 6. లక్క.

రక్షకుఁడు, సం. విశే. (అ. ఆ. అ.) 1 కావలియుండెడివాఁడు. 2. రక్షించువాఁడు. సంరక్షకుఁడు

రక్షణ సం. వి. ఆ. స్త్రీ. రక్షించుట, కాచుట.

రక్షణము. సం. వి. అ. న. రక్షించుట, భద్రపఱుచుట.

రక్షణారకము. సం. వి. అ. పుం. రోగసంబంధమైన మూత్ర నిరోధము (విల్యమ్సు).

రక్షణి సం. వి. ఈ. స్త్రీ. 1. కళ్లెపువారు, కళ్లెము. 2. త్రాయమాణ, కలుఁగానుగు (వ్య. వి.) (వాచ.).

రక్షణీరకము = రక్షణారకము. సం. వి. అ. పుం. (విల్యమ్సు).

రక్షణుఁడు. సం. వి. అ. 1. రక్షించువాఁడు. 2. విష్ణువు.

రక్షము సం. వి. అ. పుం భద్రపఱుచుట, రక్షించుట.

రక్షస్సభము. సం. వి. అ. న. రాక్షస సమూహము.

రక్షస్సు. సం. వి. స్. న. పిశాచము, దయ్యము.

రక్షాకరండకము = రక్షాకరండము. సం. వి. అ. పు.

రక్షాకరండము. సం. వి. అ. పుం. భద్రపఱచెడుబరణి, డబ్బి, కాయెత్తు, యంత్రమువేయఁబడిన రక్షరేకు గొట్టము.

రక్షాగృహము. సం. వి. అ. న. పురిటిల్లు, ప్రసవ గృహము.

రక్షాధికృతుఁడు. సం. వి. అ. పుం. 1. రక్షణమునకై యేర్పఱుపఁబడిన యధికారి, పలువాఁడు 2. న్యాయాధిపతి. 3. రక్షకభటులలో ముఖ్యాధికారి.

రక్షాపత్రము. సం. వి. అ. పుం. ఒకజాతి భూర్జపత్రి వృక్షము.

రక్షి. సం. విశే. (న్. ఈ న్) రక్షిత.

రక్షించు. సం. స. క్రి. గుప్తపఱచు, కాపాడు.

కం. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబున దానిన్, రాజాన్వయ రక్షించితె... భార. సభా. 127.

రక్షించుకొను. సం. స. క్రి. (రక్షించు+కొను) కాపాడుకొను (చూ. రక్షించుకోలు)

రక్షించుకోలు. మి. వి. (రక్షించుకొను) రక్షించుకొనుట.

మ...ఎ, య్యదిది దిక్కెక్కడఁ జొత్తు మెవ్విధమునన్ ప్రాణంబు రక్షించుకో, లోవవున్ దైవమయంచు గోపనివహం బుద్వేగమొం దెన్మదిన్. హరి. పూ 7. 164.

రక్షిక. సం రక్ష.

రక్షితుఁడు. సం. వి. అ. పుం. రక్షకుఁడు

రక్షిత సం. విశే. (ఋ ఈ. ఋ.) రక్షకుఁడు.

రక్షితము సం. విశే (అ. ఆ. అ) రక్షింపఁబడినది.

రక్షితవ్యము. సం విశే (అ ఆ అ) రక్షింపఁదగినది (శ. ర)

రక్షివర్గము. సం వి అ పుం. అంగరక్షక సమూహము (శ. ర).

రక్షోఘ్నము. సం. వి. అ. పుం తెల్లయావాలు, శ్వేతసర్షపము న. 2. కాంజికము, పులిగంజి 3. భల్లాతకము, నల్లజీడి (వృ.వి.) 4 సూక్తభేదము (ఋగ్వేదము). విశే అ.ఈ. అ. రాక్షసులను చంపునది (రక్షోహననము, అమనుష్యకర్తృకమైనపుడే ఈరూపము).

రక్షోఘ్ని. సం. వి. ఈ. స్త్రీ వచ, వస (వృ వి).

రక్షోజనని సం వి. ఈ. స్త్రీ. రాత్రి (విల్యము)

రక్షోహము సం వి న్. పుం. 1. గుగ్గులము. 2 తెల్లఆవాలు (వాచ).

రక్ష్ణము. సం. వి. అ. న రక్షణము.

రక్ష్యము సం. విశే. (అ. ఆ అ.) రక్షింపఁదగినది (శ ర).

రగులు. అ. క్రి. మంటయెత్తు, మండు

చం. రగులదె నల్వగ్రుడ్డుగమి రాముని కించుక కీడుగల్గినన్.

ఆచ్చ. రా అ. 47.

జ : రగుల్చు.

రగు(వు)ల్చు(లుచు). స క్రి (√రగులు) రగులఁజేయు, మండఁజేయు

చం మగటిమనోనివాసముల మానిని దృక్కుద నాస్త్రపావకున్, రగులుకొనన్ రగిల్చి చిఱునవ్వను గంధవుఁ గొండగాడ్పుచేఁ, బొగలెగయించి పల్కు నెయివోయుచు మండఁగ మాయకట్టెచే, నెగసనఁ ద్రోచి యార్పఁదగునించుక యించుక కూర్మితు పఁన్.

కా. 4. 24

రఘుపతి సం వి. అ. పుం రఘువంశీయులలో శ్రేష్ఠుఁడు. శ్రీరాముడు ఇట్లే రఘు రుఁడు, రఘువంశతిలకుఁడు, రఘునందనుఁడు, రఘూద్వహుఁడు. మొ.

రఘువు. సం. వి. ఉ. పుం దిలీపుని కొడుకును, నజుని తండ్రియు నగు సూర్యవంశపురాజు. బ. రఘుని వంశమునఁ బుట్టిన రాజులు. న. రఘువంశమను పందొమ్మిది సర్గల మహాకావ్యము (వాచ.)

రచన సం. వి ఆ స్త్రీ 1. ఏర్పాటు, విన్యాసము. 2. నిర్మాణము, సృష్టి. 3 కృతి, గ్రంథరచనము. 4. కల్పన, ఊహ

రచనము. సం. వి. అ. న రచన.

**రచయిత** సం. వి. అ (ఋ. (స్త్రీ. ఋ)
1. రచించువాఁడు, నిర్మించువాఁడు 2. గ్రంథకర్త, కవి.

**రచి(యి)ంచు** సం. స. క్రి. ఏర్పఱచు, నిర్ణయించు.
వ. అత్రిపుత్రుఁడు తన కూఁతును...అభిమతుండైన రాజపుత్రునకు వివాహంబు సేయం గావక స్వయంవరంబు రచియించుచున్న వాఁడు.
భార. ఆది.7. 4

2. చేయు, నిర్మించు.
సీ. చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర, కాశీ. 1. 7.
వ. చంద్రాంగదచరిత్రానుబంధం బగు నొక్క మహాప్రబంధంబు నవరసనిబంధబంధురంబుగా రచియింపఁ బూని. చంద్రా. 1. 7.
3 వన్ను, సిద్ధపఱచు.

**రచితము.** సం. విశే. (అ. ఆ. అ) 1. ఏర్పఱుపఁబడినది. చేయఁబడినది నిర్మింపఁబడినది.

**రచ్చ**[1]. వి. 1. (గ్రామములో) పెద్దమనుష్యులు గూర్చుండు చావడి, మొగసాల.
సీ. కావున నాచారగతి వింట గడులెస్సరాజ మార్గంబున రచ్చ మంద, మూత్రపురీషవిమోచనంబు సేయమి ... భాగ. షష్ఠ. 4 117.
ద్వి. రచ్చలు నంగళ్లు రాజమార్గములు, నచ్చుగాఁ జెన్నారు నారామములును
రం. రా. ఉ. 148 పే. 1 పం.
చం. రయమున వృష్టిపై యొదిగి రచ్చలకై విధి యంతు రుగ్రతన్, హాయఁ దిమిరంబు ... వాతనిపై నృపతిం గజాదినిస్సమయముల ... లాడుదురు... అశ్వగుల్. ఆము. 4. 151.
2. కొలువు, సభ.
మ. స్ఫురణం బాసిన సజ్జనుండు ధనహీనుండైన రాజున్ నిర, ఘరుఁడౌ యోగియు రచ్చలో ఖలుఁడు నిష్కంటకంబుతో తోయముల్.
మల్హణ. 1. 48.

కం. రంభకు నహుషు యొక్క ప్రతి. రంభ గలిగి తిరిచి తెచ్చె రచ్చల కని సం స్తంభింపనీరు హాస్యా. రంభణ మీపోరు నిర్జరవిటుల్ నగుచున్.
కళా. 3. 248.
3. రాజమార్గము.
ఉ.. తారకగణస్ఫురితద్యుతిఁ దాల్చి పొల్పుసం, ధ్యాంగనవోలె నొక్కవనజానన భోరనవచ్చె రచ్చకున్. కు. సం. 7. 125.
సీ. శచిమాఱుమనువు రచ్చలఁ బెట్టి యొందఱే నింద్రుల మనువారలేఁగి రహహ. గీ. చూడనివి యెల్ల యుగ చర్య సుద్దులయ్యె. హంస. 1. 150.
మ...నాకాన్పు రచ్చల కెక్కెంగద యింక మానుదురె యీ సాధ్వుల్ వనుం దూఱఁగా
శుక. 441.
4. స్థానము, ఉనికిపట్టు.
చం. చెలువము రచ్చ కాముకుల జీవన మంగజ రాజ్యలక్ష్మి తూ, గులు గనువట్టిసద్గతి మరుద్గణికామణిసోమయాజుల, న్వలవఁగఁ జేయు నౌషధము స్వర్గవిభూషణ మంబురాశి స, త్కులభవ పుణ్యరాశి నలకూబరు ప్రాణ పదంబు రంభదాన్. చిత్రభా. 2. 64.
5. గోష్ఠి.
చం.. శ్రుతిహితస్వరవైఖరు లుచ్చరించుచున్, మనుకులదీప్తిదీప్త భువనద్విజరాజుల రచ్చ లచ్చటన్, గనుఁగొని సాంద్రవిస్మయవికాస విభాసిత మానసాబ్జుఁడై.
హ. నల 2. 31. (హరిశ్చంద్రపతమున)
చం ... ఇంటిగొల్లకదడయ్యక రచ్చల గొల్వఁ బోవలెన్. ఉ. రా. 5. 145.
6. కలకలము
చం... శ్రుతిహితస్వరవైఖరు లుచ్చరించుచున్, మనుకులదీప్తిదీప్త భువనద్విజరాజుల రచ్చ లచ్చటన్, గనుఁగొని సాంద్రవిస్మయవికాస

విభాసితమానసాబ్జుఁడై.
హ. నల, 2.31. (నలపక్షమున)

7. కలహము.

ఉ.. వివేకములెల్లను వెచ్చఁబెట్టివీ, రిచ్చట దొమ్మిగూడి కలహించిన తేరుగడేలబుట్టు నీ, రచ్చలణంపఁగావలయు రాయని యింద్రుఁడు చేయమర్చుచున్.
అహ. 1. 105

కం. అజుఁ దరుగు దెంచి గురునిన్, రజనీకరుఁ గాంచి యిట్టి రచ్చలుగలవే, గజిబిజి వలదనితారా, గజయానం తేరఁబోయి గ్రక్కునఁ బలికెన్
శశాం 5. 127.

8. సమ్మర్దము.

వ... మొగులు తెగలరచ్చలనచ్చటం బెచ్చుపెరుగు జాంబూనదాంబుజకదంబ తాలంబ కాదంబ కాడంబరములు వాసించుచు వసు 2 140

బలుపచ్చబెరఁగునిగ్గుల రచ్చతుదఁగల్గు ఘన కిరీటము మస్తకమునలర్ప ఉ. హరిశ్చ 1.55.

9. బాధ, ఉపద్రవము (చూ.రచ్చసేయు)

ఱ. రచ్చకొట్టము, రచ్చగొను, రచ్చపట్టు కొట్టము, రచ్చబండ. రచ్చమ్రాను, రచ్చయిండు, రచ్చ యొనర్చు, రచ్చరావి, రచ్చబాయి, రచ్చ సేయు

రచ్చే$^{2}$. వి. (సం. రక్షా) కాపు, రక్షణము (చూ. రచ్చసేయు)

ఱ. రచ్చసేయు.

రచ్చేకొట్టము, వి. (రచ్చ+కొట్టము) 1. రచ్చ చావడి (మండపము), సభామందిరము.

సీ. సత్రంబుసాలయుఁ జలిపందిరియు రచ్చకొట్టము వచ్చుట గురుజనముల, నిందించుట... నిరయహేతువులు. భార. అను 2. 61

గీ. క్రోధలోభాత్ముఁడై రచ్చకొట్టమును సు,రాల యంబును బ్రపయును గూల్చి, నతని కీర్తిలైదరు లోభియైన సకల, సుకృత విక్రయ మాటిచెద ర్యాడు మధిప, మార్క. ౫. 8౩.

కం. దేవగృహ ముకడ వీథిని, గోవాటమునందు రచ్చకొట్టము పొంతన్, భూవర నన్యములను వి, ప్రావిసృజన మొప్ప దండ్రు చారిత్రవిదుల్.
భార. అను 498.

2. ధర్మశాల

సీ రచ్చకొట్టంబు నారామంబుఁ గూపంబుఁ బ్రపయుఁ గావించుట... భార. అను. 2.64.

గీ. నానాపనీ సమాయాతపథికు, లమరఁ గనుపట్టు రచ్చకొట్టమున కరిగె. శుక. 3. 188.

ద్వి .. రచ్చకొట్టమె నాయున్న కొలువు, కూటమి, ఇక్కడ నాయింట నీరీతియైన, దిక్కులేనట్టు వర్తిలు మదియాజ్ఞ.
ద్వి. పరమ, 3. 310 పా.

రచ్చేగొను అ. (క్రి. రచ్చ$^{1}$+కొను) గుంపుగూడు.

వ అచ్చెరువడి వియచ్చరులు వచ్చి రచ్చగొని యాడ. రామా 5 188.

రచ్చేపట్టు వి. (రచ్చ$^{1}$+పట్టు) కొలువుకూటము, సభాభవనము.

సీ. మొనకట్టు నెత్తమ్మి మొత్తమ్మునకు రచ్చ పట్టు ఐమానధూపరివృఢునకు.
చంద్రా 5 120.

(సూర్యోదయ వర్ణనము)

వ. అచ్చిత్రరేఖయుమ్మచ్చెకంటి పచ్చవిలుతురచ్చ పట్టయిన పాన్పువం బవళించియున్న నచ్చో టికింబోయి... ఉ హరి. 5. 138.

2 గోష్ఠి స్థానము.

గీ కనకగమికేమఁ గల్పవృక్షనమునికిఁ బచ్చరా చట్టుగమి రచ్చపట్టు మాకు మనుచ. 2.43.

3 ఉనికిపట్టు, ఆశ్రయము.

మ. దళకుఁగఁదువ దావకేశి కీ పంతశుద్ధికిం జన్మభూమి యుదాంతత్వము రచ్చపట్టు ... గొబ్బున నారసింహమనుజే డ్రస్వామి సామా న్యుఁడే. రామం. 1.82.

చ . చలుపు చ్చపట్టు జలజంబులతుట్టు విరాలి

కలిక్రోవులకనుకుట్టు జక్కవలగొట్టు చకోరులమేలియట్టు.. రా. వి. 3 8

రచ్చపట్టుకొట్టము = రచ్చపట్టు వి. (రచ్చపట్టు + కొట్టము) సభామండపము.

వ... వచ్చుబాబంతులంగను పట్టుకోటవాకిటిరచ్చపట్టుకొట్టంబున నట్టనడితెరవుం జట్టుకొని ... ఉ. రా. 3. 22

రచ్చబండ. వి (రచ్చ[1] + బండ) రచ్చసేయు కాలమందు పదిమంది కూర్చుండెడిబండ, రచ్చబాయి (శ ర.).

రచ్చమాను. వి జౌ. (రచ్చ[1] + మ్రాను) జనులు గోష్ఠిసేయుచోట నీడకై పెంచిన చెట్టు, చైత్యము.

గీ. విడువకెప్పుడు పెనుగాలి వీచె దొడగె, దోచె దక్షిణ దిక్కున ధూమకేతు, సురకన్యలు పూజింపవరుగుత్రోవ, నున్నతంబైన రచ్చమ్రానొరిగి కెడసె హ. హం 5 37.

సీ. లలుపుదూలము కొమ్ములు నొగరాగాడి మచ్చుముంగిట రెండు రచ్చమ్రాకు, లీను గోవగ వేగురింటి బిడ్డలు నూళతార్పులు నూవపాంతలంగొలుచు. వేం పంచ 4 116.

రచ్చయుండు అ క్రి (రచ్చ + ఉండు) సభచేసి కూర్చుండు, కొలువుండు

గీ. ఇచ్చటనెకాదె యిచ్చరాగచ్చు చెన్నె, ముచ్చటలు మీఱ మెచ్చుచు రచ్చయుండి ఇంద. 3 33.

రచ్చయొనర్చు అ. క్రి (రచ్చ[1] + నర్చు కొలువు సేయు; నివసించు.

ఉ. పచ్చిచాయయుం బిఱుతపాయముగల్గు వెలుంగునిచ్చలో, రచ్చయొనర్చు నదలి బరాకున దేలుచు వేడ్క నేలుచున్ పాండు 4 48.

రచ్చరావి. వి. (రచ్చ + రావి) పెద్దమనుష్యులు కూర్చుండుచోట నీడకై చేసిన రావి చెట్టు.

చం. విపులధరాధరాగ్రమున నేలుపవంశకలరచ్చరావిది, వట్టపరిమళంబుతోఁ గదవలంతలుపండుల విఱ్ఱవీగు... వరాహ. 10.120.

సీ. కదలక వెన్నెదిగాచుదయ్యంబులు రచ్చరావుల బొమ్మరక్కసియలు గీ. అంజతల్లు అవఁగ... కవిక 4. 110

రచ్చబాయి. వి. (రచ్చ[1] + బాయి) రచ్చచేయు కాలమున పదిమంది కూర్చుండు బాయి, రచ్చబండ,

సీ అచ్చమైవాకిట రచ్చబాయి మెఱుంగు పంచతిన్నెలు గొప్ప పాఠిగోడ. శుక 2. 407

రచ్చసేయు[1] అ క్రి. (రచ్చ[1] + చేయు)

1. గోష్ఠిసలుపు.

కం. ఈరీతినెల్లవారలుఁ, జేరి వాలాంకుండు రచ్చసేయఁ దదీయాం, భోరుహముఖ సరకాపుటా, యారులఁ గూడికొని నిజగృహాంతర సీమన్. శుక 2. 418.

2 గుమిగూడు సభచేయు.

గీ. స్థూల పరిపక్వకానసోదుంబరాగ్ర, రంధ్రముల వాననీరు సొరంగవెడలె, మశక పంక్తులు దావ ఘూమంబు లణఁగ, రచ్చసేయంగ వెడలె విశ్రాంతి కనఁగ. ఆము. 4 111.

3 కలహించు

ద్వి. రత్నాలకుప్పయో రాజీవనేత్రి, రత్నాంగి నీతోడ రచ్చచేసినది. ద్వి.శ.సా. 1758 పం.

స. క్రి. 1. బయలుపఱుచు.

గీ. రవి బిగియింతు నదియును నవలజైచి, కుంకుమపు బూత చిమచిమకొనెడుచిన్ని, పచ్చికొనగోటిజాఁకులు రచ్చసేయ, గుబ్బయరగానరాఁ జైటకొంగుచైతు కువల. 4. 158.

2. బాధించు

గీ. రచ్చసేయఁగ దొరకొనురాత్రులందు, ముని కుమారుల బెదరించికొనఁగఁ నోడఁగుఁ, గామినీ మోహవాడు నిక్కముగఁజేసె, నిందు రమ్మన్నచోట నిల్లల్లగొనుట. కువల. 3. 2..

రచ్చసేయు². అ. క్రి. (రచ్చ²+చేయు) కాచు, రచ్చ సేయు

సీ. క్రేశల పలవు(గొల్చెడు దిస్సమొలవాత్తి గచ్చ
కయలత్తి రచ్చసేయ. ఘటికా 128

రజ్జి. సం. (రజ్జు + కిప్.) రజ్జువు, త్రాడు

సీ. పశుభాగములవెంబడి కుథంబులు జాటిపోవ
రజల్ త్రవయ్యా( బొంగిపొంగి.
వేం. పంచ. 1 62.

రజఃపుష్పము. సం. వి. అ. పుం. కేతకి, మొగలి (వృ. వి.).

రజక. సం. వి. అ. స్త్రీ. చాకిత, చాకలది.

రజకము. సం. వి. అ. పుం. 1. చిలుక, కీరము

రజకి. సం. వి. ఈ. స్త్రీ. 1. చాకిత, చాకలది

రజకుడు. సం. వి. అ. పుం. బట్టలుతుకువాడు, చాకలివాడు.

విశే. (అ. ఆ. అ.) మృగముల నానందపఱచు వాడు.

రజతప్రస్థము. సం. వి. అ. పుం. కైలాసము, వెండి కొండ.

రజతము. సం. విశే. (అ. ఆ. అ.) 1 తెల్లనిది, శ్వేత మైనది.

వి. అ. పుం. న. 1. వెండి 2. బంగారము 3. ముత్తెములసరము, ముక్తాహారము 4. రక్తము, నెత్తురు 5 దంతము 6 పర్వతము. 7 ఏనుగు. 8. రూప్యము. 9. తెలుపు. 10 హ్రదము (కే. ని.)

రజతాద్రి. సం. వి. ఇ. పుం. వెండికొండ, కైలాస పర్వతము. ఇట్లే రజతాచలము మొ.

రజతి. వి. గడన, సంపాదనము (శ. ర.)

రజనము. సం. వి. అ. న. 1. రంగువేయుట 2 కుంకుమపువ్వు. 3. రాగద్రవ్యము (కే. ని.).

రజని. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. రాత్రి 2. పసుపు. 3. లక్క. 4. దుర్గాదేవి. 5. కుంకుమపువ్వు. 6 జతుకృత్తు, కోరింద (వృ. వి.) (కే. ని.) 7 నీలి ఒకానొక ఓషధి

రజని (నీ) కరము. సం. వి. అ. పుం. కర్పూరము.

రజని (నీ) కరుడు. సం. వి. అ. పుం. చంద్రుడు.

రజని (నీ) చరుడు. సం. వి. అ. పుం. 1. రాత్రించరుడు, రాక్షసుడు, పిశాచము 2. చోరుడు. దొంగ. 3. రాత్రికావలి యుండెడివాడు. 4. చంద్రుడు

రజని (నీ) జలము. సం. వి. అ. న. రాత్రి పడెడి మంచు, తెల్లమంచు

రజని (నీ) పతి. సం. వి. ఇ. పుం. చంద్రుడు.

రజని (నీ) ముఖము. సం. వి. అ. న. నిశాముఖము, సాయంకాలము, ప్రొద్దుకుంకువేళ.

రజము. సం. వి. అ. పుం. రజస్సు, ఆర్తవము. 2 రజోగుణము. 3. పాంసువు, ధూళి (కే. ని.).

రజసానువు. సం. వి. ఉ. పుం. మేఘము. 2. దేవుడు 3 హృదయము. 4 ధర్మము (వై. ని.).

రజస్వత్వము. సం. వి. అ. న. రజోగుణము కలిగి యుండుట.

రజస్వల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఋతుమతియగు స్త్రీ. ముట్టయినయాడుది. 2 పెండ్లియీడు గలకన్నె.

రజస్వలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. దుమ్ముగలది దుమ్ముక్రమ్మినది 2 ఉద్రేకము గలది. రజోగుణముగలది. వి. అ. పుం. మహిషము, దున్నపోతు.

రజస్సు. సం. వి. స్. న. 1. దుమ్ము, ధూళి. 2 పుష్పపరాగము, పుప్పొడి. 3 సూర్యకిరణములో కనబడు అణువు, పరమాణువు 4. దున్నబడినభూమి, సేద్యము చేయబడిన పొలము. 5. త్రిగుణములగు సత్త్వరజస్తమోగుణములలో రెండవదగు (రజో) గుణము 6 ఋతురక్తము ముట్టు నెత్తురు. 7. కుంకుమపుష్పం. 8. తగరము. 9 శరదృతువు. 10. నీరు. 11. పూలమాల. 12. తేజస్సు, కాంతి. 13. రాత్రి. 14. తేజస్సు, వీర్యము. 15 పగలు. (కే. ని.).

4. దురభిమానము, తగని గర్వము.

కం. శా వెత్తుకొంటి రక్కల, నేనియుఁ దలమాసు వోని నెత్తురుకుడుమున్, సేనానిఁ జేసి రజ్జున, దానవపతిమీఁద నడవఁదగునే నీకున్.
కు. సం. 10. 580.

5. అతిశయము.

వ..చింతగ్రొజ్జురజ్జునుఁ జేలసిండి మెండును ఇప్ప పూ మొగ్గల యగ్గలికయు... కాశీ.7. 185.

ఇ: రజ్జాడు, రజ్జులాడు, రజ్జులాట.

**రజ్జులాఁడు** విణ. (రజ్జను + ఆఁడు) 1. వ్యర్థభాష ణుఁడు, వదరుఁబోతు.

కం. మండెదు బలునారసముల, వెండియు నా రజ్జులాని విన్నప్పుండు, ద్దండత నేసిన యొక నవి, ఖండించెను గురుసుతుఁడు గర్వంబలరన్.
భార. ద్రో. 4.245.

2. ఆత్మస్తుతిపరుఁడు.

ఉ..... వాలిభూరికా, ర్యాల యుధనై పుణక్రియలయం దు బదాలవపాలుఁ బోలఁడీ, వాయుపురజ్జులాఁ డధిప...
భార.అర.6 63.

**రజ్జులాట**, వి (√రజ్జులాఁడు) డంబములాడుట.
కం...రణ శ్రీవిక్రమంబు నెఱపఁగ, రావింపుము రజ్జులాట రాకోచితమే. విక్ర. 4.72.

**రజ్జువు** సం. వి. ఉ. స్త్రీ. 1. దామము, త్రాడు, దారము. 2. వేణి, అల్లిన వెండ్రుకల కుప్ప. 3. అష్టహస్తప్రమాణము, ఎనిమిది మూరల కొలత (శే.ని.).

**రటంతి**. సం. వి. ఈ. స్త్రీ. మాఘకృష్ణచతుర్దశీ తిథి.

**రటనము** సం, వి. అ న. 1. కేకలువేయుట, మాట లాడుట.

**రటితము**. సం. వి. అ. న. అఱుపు, కలకలధ్వని.

**రట్టడము**. వి. (సం రాష్ట్రకూటం) సత్రము, ధర్మశాల

వ .. వీరడిపులనాంటికొల్లి మె (బి) లింట్టడము యష్టభోగం సల్విన పదలతోం గూడవిలిచి...
దశా 4.1281.

**రట్టడి¹** వి. గ్రామాధికారి.

ఉ...సుతలఁదిమ్మమరంగమ లింగగోపమన్, రట్టడి కాకుమారి పెద రంగయ సోముఁడ గాంచె వేడుకన్. అప్ప.1.80

కం ... శివుని భక్తింపూజింపుఁడు మీ, రోజనెడి వడవకుండుఁడు, రాజులు రట్టళ్లనగుట రావె ల్లిటకిన్. శివ. సా. 200

వ. స్వస్తి శ్రీముఖుదిన్యపక వర్షంబులు 1030 యగు నేండుగుండిడటితిగటూరి రట్టడియైన త్రికాటబోయని మన్మణ్ణుపకుకబోయని ఎత్తి చ్చినగుడి. 1035 గుజి ఇనుమెళ్ల శాసనము.

వ...నడుకునిరి సురపరట్టడియు అండపురి బతమ రట్టడియు... బెండనిపూండి కామిరట్టడియు.
దశా 4 1194

ఇ రట్టడికము.

**రట్టడి²** వి 1 రట్టు, నిద

సీ. కడలేని రట్టడి కొకిగట్టుకొనియైనఁ గమలారి గురుతల్పగతుఁడు కాఁడె. ప్రబోధ. 1. 50.

2. అగ్రహాము
(యమదండన)

వ ఎగురులాడుచు ముష్టి ఘాతంబుల బాధించుచు బెట్టురట్టడిఁ గొట్టుకొనిపోయి తన్నగరదక్షిణ దిగ్భాగంబున, సౌన దో. ౨. 128.

విణ. నింద్యుఁడు, నింద్యము

ద్వి. వడిఁబాటి యిచటికివచ్చినఁ జూచి, రట్టడి మంత్రుల రాజ్యంబునాకు, గట్టిరి తియకాని కపటమే నెఱుఁగ.
సం. రా. కిష్కిం. 205 పొ వ పం.

కం. బిట్టలిగి త్రేత లోగిఁ దన, గట్టడిచందములు దెల్పి. నీలా. 1 98.

3. దుష్టుఁడు, దుష్టురాలు

వ. రట్టడివీరులకుఁ దోబట్టువులై బాలయును

జ. మ్పొత్కటియున్. అవందగు వన్నెలు చెన్ను వహించిర, ఉ. రా. 1. 300.

ద్వి ఎక్కసంబున మూర్లు వేలు వచ్చిచ్చి, ముట్టి జిక్కినవేళ ముట్టిచేపట్టు, రట్టడై తిరిగి పత్రం బులుగొనుచు. ద్వి. హరిశ్చ. ఉ. 480 పం.

ద్వి. రట్టడి ముక్కిడి రక్కసి మఱియు, దిట్టరై బలముల దెచ్చెఁ గావలయు,
రం. రా. అర. 161 పా. 28 పం.

3 వ్యర్థము

క. అలిపల హృదయము లారసి, రతికలన ద్దెల్పి తేరి రట్టడరూపున్ జతురతయు జవ్వనంబును, వితయుచు మీ యడవిఁగాయు వెన్నెలరీతిన్
శశాం. 3. 78.

జా. రట్టడితనము.

రట్టడికము వి (√ రట్టడి) గ్రామాధికారము.

వ. ఆచంద్రార్కము నడచునట్లుగా గంగగొండ చోళకై రాగియాణ్డా, రిత్వేతం బుత్తెంచిన నుంటయిరు ణ్డు మ డలకుంటగు వెలగాం తే కొని అణ్డమూర రట్టడికము
ద. శా. 4. 1186
ద. శా 4 1029.

రట్టడితనము. వి (రట్టడి + తనము) కోపపు వచనము.

ఉ. రాకు రాకు మనడి రట్టడితనములు, పోకు పోకు మనెడి పొగరుబగలు, పొడువు పొడువు మనెడి వె ,ద, పుబీరముల్, ఇడువు నిడువు మనెడి వీఁక పెనఁగ. విజ. వి. 3. 150.

రట్టణము. వి నాట్యవిశేషము.

ఉ దేశిపథంబు రట్టణము దివ్యకళాంసియుఁ గోల చాప్పె, లాసకి. శ్రీరం మా. 4. 182.

రట్టు వి 1 నింద, దూఱు

సి శాఖోపశాఖలు జాగు నన్న రట్టు.
శివగా. 3. 71.

గీ. పాపు రాభోగవార్తి పెనపుడుపాని, మదిఁ బొడము డంబపోసి రట్టని యటంచుఁ, తెలువ సంకోచవిభవపై చిక్కఁ బరఁగఁ, బరఁగు నా నగరంబు గన్పట్టఁ జూచి.
రాఘవ. 2.38 (రామాయణార్థమువ)

గీ. పేరు ఋషిగాని మాతండ్రిపేరు పెంపు, గల మహారాజమణి యట్టఘను కడుపున, బుట్టియే విట్టిరట్టొడిఁ గట్టుకొన్నఁ, జెట్ట యని తిట్టరే తోడిచేడెలెల్ల. ఉ. రా. 1. 183.

2. అపకీర్తి

గీ రాజవై నేఁడు కడపట నోఁమాలి, తెచ్చికొంటి విపాయని తిట్టురట్టు, నకటయిఁకనైన నా చెప్పినట్లు చేసి, దేవతాచార్యునకుఁ దారఁ దిరుగ నిమ్ము వరాహ. 7.26.

ఉ అట్ట మదీయమైన వపురాశ్రయలోభ మహాపరాధమే, గట్టిగ తేచివచ్చుటకుఁ గారణమైనది నాకు దోసముల్, గట్టెడు నీ మృషాచటువికారముఁ జూడఁగజేసి యిప్పుడున్, దిట్టునురట్టు వర్ధమగు దీనికి నిన్ననఁ జెల్ల దేమియున్.
ప్రభా. 5. 128.

ద్వి. వట్టిఁ దిట్టునా కెనఁగకయుండ, బోరన ముని పుత్రుఁ బ్రోఁచితిగాన.
ద్వి. హరిశ్చ. పూ. 2419 పం.

3; ఉపద్రవము. ఆపద.

ఉ గొట్టుతనానఁ దన్ వెడలగొట్టిన దిట్టను రట్టడంచుఁ దోఁబుట్టువనాట నొండవకపోయితి.
ఉ. రా. 2. 309.

ఉ. రాచకుమారు పోరు భువి రట్టని యెంచక నైజ వంశమున్, నీచతఁజెందువం చనక నెమ్మది మామయశోవిలాసనా, రోచితవృత్తియుం దెగి యనోపకవశైను నీలలోహితుం, జూచిన చూపె ఖావమునఁ జూచుచుఁగాఁ పమిటారి యేపునన్.
ఉ. హరిశ్చ. 4. 35.

(ఉపద్రవకరమని భావము).

ఉ. హత్యకురోయఁజూతురె దురాత్ములై చరియించు రాక్షస, బ్రాహ్మ్యలు వీతివంక వగు

రట్లఁబు దిట్లకుఁజెట్లకోర్చునా, ద్రవ్యవిశేష మెక్కుడిది చం రా. 2. 85.

4. మొఱ (ఫిర్యాదు).

దండకము ... వెన్న చేమాటుగొల్లాడఁగా గొల్ల యిల్లాండ్రు వందారవిందాస్యలై రట్టు గావించి నన్. పారి. 3 39.

5. గోల, అల్లరి.

పి. పదినదలపోఁత దాఁచెదమంటిమా నిట్టూర్పు గాడ్పులు రట్టు సేయు. వరాహ. 4. 19.

గీ. తనదు చిన్నెలకైయానఁ దతవు సేయ, నడుగ వచ్చిన మనను రానట్టివారి, రట్టుగావించి మగవారిఁ బట్టి డాసి, తౌర మొఖ్ఖోయటని దుమ్ము తూరుపెత్తు శుక. 2. 105.

6 చౌరవ, సాహసము.

కం. చుట్టఱికమొంతగల్గిన, రట్టునరారాని యొకకు రా వాకలపై, నెట్టి సుబుద్ధుల కైనను, బుట్టును రోషంబు దావఁ బుట్టుం జెట్టన్. హంస. 5 39.

సా. అట్టుపిట్టునాసాదివానిది రవ్వరట్టు గంగా వమ్మది.

జ. రట్టుకత్తె రట్టుపడు.

**రట్టుకత్తె.** వి. (రట్టు + కత్తె) సాహసికురాలు. చౌరవకత్తె

సీ. అలిగి యొంతటిరాజు నాఁడ్రయైననుబుట్టి పుట్టు పావలజేయు రట్టుకత్తె. క్రీడా 129.

**రట్టుపడు** అ. క్రి. (రట్టు + పడు) రవ్వపడు.

కం. చెట్టునమోవవచ్చిన, పట్టున ధైర్యంబు వదలి పలుమఱుమిగులన్, రట్టుపడి తమకి మదిలో, నట్టిట్టనెనేని నవ్వరా సరివారల్, హరిశ్చ. 4 114.

గీ. చాలభువిదట్టుపడి హరిశ్చంద్రు చేత, లీల భూచక్రమెల్ల నేలించుటకును, నిలఁ దనదు పుణ్యమటుబంచి యిచ్చుటకును, గారణం బేమి గాధికుమారునకును. ఉ. హరిశ్చ. 478.

**రడి** = రడ్డి. (శ. ర.)

రడ్డి = రడి. వి. (సం. రాట్.) శూద్రులలో నొకతెగవాఁడు.

వ ... శ్రీమతుకాకపతి నచ్చయరడ్డికొడుకు సూరయరడ్డి ద శా. 4 1152.

కం. ఎడ్డెతనపుఁ గయిసేతల, రడ్డులు నడచిరి పురస్సరద్వారభ్యముగా, గుడ్డుబుచక్కగట్టం, బడ్డ మహాశక్తి దివ్య భవన బునకున్. పాండు 3 75.

సీ. శూద్రవానుంబులు శోభిలు. తద్విశేషమ్ముత్తె తనరుఁ గమ్మని వెల్మయని రెడ్డియని రడ్డియని వచింప. ఉం శా 2. 282.

గీ. రాజశేఖరుఁడగు నెల్లఁడ్డిరాణి, భూరి సద్గుణ నికురుంబ పోచమాంబ శివ వ. 1. 07.

వ ...బుధవారము నాఁడు శ్రీమద్దాక్షారామ భీమేశ్వర దేవరకు కొండిపత్తి దాప డ్డి కొడుకు పోతిరెడ్డి తల్లిదండ్రులకుం దనకు ధర్మార్థముగా) బోలు నలువురు బూట్టుగా మూడ వువడపున .. ద శా 4 1185. సాం. ౧గ 2 115.

రణతూర్యము. సం. వి అ న యుద్ధవాద్యము.

రణత్కారము. సం. వి అ. పుం. 1. ఁణఁణధ్వని, గడగడధ్వని, గణగణమనుధ్వని, గలగలలాడుధ్వని, ఘల్లుఘల్లుమనుధ్వని. 2 సామాన్యధ్వని 3. ఝుంకారము. తుమ్మెదల ధ్వని.

రణపెండ్లికొడుకులు. మి వి. బ. ధాన్యవిశేషము

సీ... గౌరి, కుంకుమల్ రణపెండ్లి కొడుకులు పిప్పుకిగోళ్ళు ప్రియాగలు గొట్టఁ బ్రాలు. హంస 4 128.

వ ...సీతాభోగాలు గౌరికుంకమలు నాగమల్లెలు గొబ్బికాయలు రణపెండ్లికొడుకులు ఈశ్వర ప్రియములు . . ప్రబంధ. 112.

రణప్రియము. సం వి. అ. పుం. డేగజాతిలోఁ జేరినపక్షి. (యుద్ధమందిష్టముగలది) (విల్యమ్స్)

రణము. సం. వి అ. పుం. న. 1 యుద్ధము. కయ్యము. పుం. 1. ధ్వని, చప్పుడు 2 క్షణము, 3. గతి, గమనము.

రణరంగము సం. వి. అ. పుం. యుద్ధరంగము, యుద్ధస్థలము

రణరణకము. సం. వి అ పుం. న 1. ఉత్కంఠ, ఉద్వేగము

వ ...అని యనేక ప్రకారంబులం బ్రలోచను డు రణరణక వ్యథాకులిత హృదయుం డగుచు నుండె నంత...

కు సం 6 326

2 వియోగము (కే ని.)

రణరణకుఁడు. సం. వి. అ. పుం మన్మథుఁడు, కామదేవుఁడు (కే. ని.).

రణసంకులము. సం. వి. అ న యుద్ధవ్యాకులత, దొమ్మియుద్ధము.

రణాంగణము సం వి అ న యుద్ధరంగము.

రణితము సం. వి. అ. న. మ్రోత.

విశే మ్రోసినది (శ. ర.).

రతకిలము. సం. వి. అ. పుం. శునకము, కుక్క (విల్యమ్సు).

రతకూజితము సం, వి అ. న. మణితము

రతగురువు సం వి. ఉ. పుం. మగఁడు, ప్రియుఁడు.

రతజ్వరము. సం. వి. అ పుం. కాకి (త్రి. ని.).

రతతాలి సం. వి. న్. పుం కాముకుఁడు, భోగలోలుఁడు ఈ స్త్రీ. వేశ్య. లంజె

రతనపుగని వి. (రతనము+గని) రత్నాకరము, సముద్రము

కం. విను మనుమఁడ మానుడువులు, వినుమునుపు దలింప నీవు వేఱొండు నలఁ, పునమండిన నీ రతనపు, గని యిందిఁక నొరుఁడు దాఁటఁ గలఁడే చెపుమా.

అచ్చ. రా కిష్కిం 82.

రతనపువిల్లు. వి (రతనము + విల్లు) ఇంద్రధనుస్సు (శ. ర.).

రతనము. వి (సం రత్నం) రత్నము, మణి.

చం. రతనపుఁ గోటఁ గ్రుమ్మినను రాలెడు కెంపులగ ద్దలోపలన్,

దశా. 1 86.

కం సుతుఁ దునుమఁ దగునె ముద్దుల, రతనమ్మైన యో యిదే దొరతనమ్మౌ నృపా.

సారంగ 3 61.

ఉ. తెల్లని దీవి తమ్మి నెలదేఁటి వలెన్ దగునొక్క బంగరిన్, వల్లని వాని లచ్చిఁ రతనంబును మచ్చయొదం దలిర్పు రం,జిల్లెడు వానిఁ జుట్టు లగుఁ జందమునందిన వానిఁ బెంపునొం, పెల్లెడఁ గల్గు పాల్కడలి యిల్లటపల్లునిఁ గాంచి నెయ్యెడన్.

రామా 3 44.

(రతనము = కౌస్తుభము)

గీ. మానికము రతన మనంగ మణి చెలంగు.

ఆం. భా 2. 278.

జ. రతనపు విల్లు, రతనాల కుప్పె.

రతనారిచము. సం వి అ. పుం. 1. కుక్క. 2. రతికూజితము, మణితము. (రతనారాచము)

రతనారిచుఁడు. సం. వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు, (రతనారాచుఁడు)

రతనాలకుప్పె వి. (రతనాలు+కుప్పె) భూషణ విశేషము.

సీ రతనాల కుప్పె సౌరపు జడకుచ్చులు శశి పూల చందురుల్ సరిగెలు చెప్పు,లును ...

చెన్న. 2. 207.

రతనిధి. సం. వి. ఇ పుం. కాటుకపిట్ట.

రతము సం. విశే. (అ అ.అ.) 1 అనురాగము గలది. 2. ఇష్టముగలది. 3. తదేకాయత్తమైనది.

వి అ న 1 ఆనందము, సంతోషము. 2 రతి, మైథునము 3 గుహ్యావయవము

రతవ్రణము నం. వి. అ. పుం శునకము (త్రి ని).

రతహిండకుఁడు. నం. వి అ పుం. 1 స్త్రీని బలాత్కరించువాఁడు, స్త్రీలఁ దెచ్చువాఁడు.

రతాంఘ్రి నం. వి. ఈ. స్త్రీ. కుహేళి, మూడమంచు (త్రి. ని.)

రతి వి రత్నముల తూనికయం దుపయోగించు పరిమాణ విశేషము, ఒకానొక యెత్తు.

సీ. అతివినోదముగాఁగ రతుల మెప్పించు నీపచ్చల కడియాల పద్మగంధి.

విజ. వి 1 16.

రతి. సం వి ఇ స్త్రీ. 1 ఆనందము, సంతోషము 2. అనురాగము, తత్పరత 3 పరమప్రీతి. 4 వలపు, ప్రేమ, శృంగారరసస్థాయి భావము. 5 రత్యానందము, రతిసుఖము. 6 సురతము, మైథునము 7 మన్మథుని భార్య యగు రతీదేవి, 8. యోని, ఆఁడుగుఱి. 9. చంద్రుని పదియాఱు కళలలో నా ఱవదియగు కళ.

రతికుహరము సం. వి. అ న. స్త్రీ గుహ్యము, ఆఁడుగుఱి, యోని

రతిపతి సం వి. ఇ పుం కామదేవుడు, మన్మథుడు

రతిప్రియుఁడు సం. వి అ. పుం కామదేవుడు మన్మథుఁడు

ఇట్లే రతిరమణుఁడు మొ.

రతిబంధము. నం. వి అ పుం. సురతమందలి భంగిమ.

(నాగపాశము, లతావేష్టము మొ.)

రతిమందిరము నం. వి అ. న 1. స్త్రీ గుహ్యావయవము, ఆఁడుగుఱి. 2. మైథున గృహము. ఇట్లే రతిగృహము మొ

రతిమద సం వి ఆ స్త్రీ అప్సరస. ఇట్లే రతేమద (వై ని).

రతిలక్షము. సం వి. అ న మైథునము, సురతము.

రతిరోత్వర. సం వి ఆ. స్త్రీ. ఒకానొక ఓషధి, వాక.

రతీము వి ఆహారము.

పంచచామరము,

రతీశుబాణసంపదన్ నిరాకరించుమే వహో, రతీశుకామినీ మవశ్యరవ్యవింటయల్లెకా, రతీర్వరల్ కుగల్, మనోజరాజసైంధవాళికిన్, రతీలోసంగుమోవి య వ్వనాంఘ్రి నెన్న శక్యమే.

చంద్రా 4. 142.

మ .. పెం, దొగలేఁ దూఁడు రతీబు వారువవ్వు ఒల్తూ పేసి వారించుచున్ చంద్రా. 6. 86.

రతువు సం వి ఉ పుం. వార్తాహరుఁడు, దూత

స్త్రీ 1. నది 2. బంధనము 3. మార్గము.

రత్నకందళము. సం. వి. అ పుం. ప్రవాళము, పగడము

రత్నకంబళము. సం వి. అ పుం ఒకరకపు కంబళి.

వ. ... రత్నకంబళములు దుద్దుగంబళులు జముకాళంబులు తివాసీలు పట్టుచాఁపలు

ప్రబంధ 805

రత్నకంబళి (ణి). మి. వి. రత్నకంబలము, ఒక విధమగు తివాసి.

సీ. రవలపావలు చామరంబులు రత్నకంబళ్లు నీరాజనభాజనములు, గీ. మొదలుగాఁగల వస్తునముత్కరములు, కరము లెరిఁగి వెడలిరి సరసిజాక్షులు.

నలచ. 4 122.

చం. విరితొగచందువాతెగల పెడు యానడి యంగణంబులోఁ, బఱచిన రత్నకంబళిని బాగుగ నూరెపుటంపుగద్దియన్, వలులు మెఱుంగు బంగరవువన్నె జగబుకు సాలివాసిపై, ధరణిజతో వసించెఁ బతి తక్కుతలాఁ శేతులూనుచున్. ఉ. రా. 6 128.

సీ. రత్నక ఒళ్లు నూరుత్తుకుత్తిరి పట్టుదిండ్లు

చేమంతి పూచెండ్లు గంద, వొడులు
సావం॰. 1. 1.9.

**రత్నకేలితములు** వి. బ. వస్త్రవిశేషము.

వ ... ద్రౌపదీ స్వయంవరంబులును ... వస త విలాసంబులునురత్నకేలి తంబులును.
ద్వా 3. 188.

**రత్నకూటము.** సం. వి. అ. పుం ఒకానొక పర్వతము.

**రత్నగర్భ.** సం. వి ఆ స్త్రీ. వసుంధర, భూమి.

**రత్నగర్భము.** సం. వి అ పుం. సముద్రము.

**రత్నగర్భుడు.** సం. వి. అ. పుం. 1. కుబేరుడు. 2 సముద్రుడు

**రత్నద్వీపము.** సం వి. అ పుం. న సుధా సముద్రమందున్న ఒక ద్వీపము (వాచ ).

**రత్నధేనువు.** సం వి ఉ. స్త్రీ. ఒకానొక మహా దానమునకై నిర్మింపఁబడు మణిమయమైన గోవు (వాచ )

**రత్ననిధి** సం. వి ఇ. పుం. 1 సముద్రము 2 విష్ణువు 3. మేరువు. 4. కాటుకపిట్ట (విశ్వము).

**రత్నము** సం వి అ న 1 మణి, మాణిక్యము, వజ్రమౌక్తికాది, 2. అమూల్యవస్తువు, ప్రియ పదార్థము. 3 (సజాతీయుఁడు) శ్రేష్ఠమైన పదార్థము. ఉదా — పుత్రరత్నము, స్త్రీరత్నము 4. అయస్కాంతము, సూదంటురాయి. 5 వజ్రము (రాజ. ని.). 6. నీరు, సలిలము (కే. ని.).

**రత్నముఖ్యము** సం. వి అ. న. వజ్రము

**రత్నవతి.** సం. వి. ఈ స్త్రీ రత్నగర్భ భూమి.

**రత్నవరము.** సం వి. అ. న. బంగారము. (వై. ని.).

**రత్నసరులు** వి. వి బ. ధాన్యవిశేషము.

సీ పలిక రాజనా లీశ్వరప్రియములు రాపిపూరాజ వాల్ రత్నసరులు. హం.స. 4 129

వ. .. రామబాణాలు కటకసరులు రత్నసరులు జీనిసరులు. ప్రబంధ. 112.

**రత్నసానువు.** సం. వి. ఉ పుం. మేరు పర్వతము.

**రత్నసువు.** సం. వి. ఊ. స్త్రీ. రత్నగర్భ, భూమి.

**రత్నహస్తుడు.** సం. వి. అ. పుం కుబేరుడు (వై. ని.)

**రత్నాకరము.** సం. వి. అ. పుం. 1. మణుల గని. 2. సముద్రము.

**రత్నాచలము.** సం. వి. అ. పుం దానార్థము కల్పించిన మణిమయపర్వతము.

**రత్నాభరణము.** సం. వి అ. న. రత్నభూషణము, రత్నములతో చేసిన నగ.

**రత్నావళి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రత్నహారము, మణిసరము. 2. రత్నసమూహము. 3. శ్రీ హర్ష రచితమగు నొక నాటిక

**రత్ని.** సం. వి. ఇ. పుం. స్త్రీ. మూర, మోఁచేయి మొదలు పిడికిలికుఁగల ప్రదేశము. పిడివెలితి మూర.

**రత్యంగము** సం వి. అ. న. స్త్రీ గుహ్యము, ఆఁడుకలి.

**రథకడ్య.** సం వి అ. స్త్రీ. రథసమూహము.

**రథకారుఁడు** సం వి అ. పుం. 1. రథములు చేయువాఁడు, తేరుచేయువాఁడు 2. వడ్లవాఁడు. 3. క్షత్రియునివలన సంకరజాతి స్త్రీయందుఁ బుట్టినవాఁడు, సంకరజాతివాఁడు.
(వై. ని.)

**రథకుటుంబి.** సం. వి న్. పుం. సారథి, తేరునడపు వాఁడు

**రథగర్భకము** సం. వి. అ. పుం. పాఁకి

**రథగుప్తి** సం. వి. ఇ. స్త్రీ. సంఘర్షణము (తాఁకుడు) వలనఁ కాపాడుటకై రథముపై గట్టితోఁ గాని యినుముతోఁ గాని కట్టిన యావరణము. శత్రుశస్త్రాదులులోఁ పలఁ బడకుండఁగ కాపాడఁబడిన (అవరణకట్టఁబడిన) రథమధ్య భాగము

రథచరణము. సం. అ పుం. 1. బండిచక్రము, 2. చక్రవాకపక్షి ఇట్లే రథపాదము మొ.

రథచర్య సం. వి అ స్త్రీ. రథోపయోగము, రథ ప్రయాణము.

రథద్రువు. సం. వి. ఉ. పుం. తినాసము (వృ. వి).

రథనీడము. సం. వి అ. పుం. రథము యొక్క చివరిభాగము (వై. ని)

రథము. సం. వి. అ పుం. 1 తేరు, బండి, శకటము 2 పాదము, అడుగు. 3. అవయవము 4. శరీరము, దేహము. 5 ఱెల్లు. 6. తినిశము (వృ. వి) (వాచ) 7. చక్రవాకము (వై. ని).

రథయాత్ర. సం వి ఆ. స్త్రీ. రథోత్సవము, రథముపై దేవతావిగ్రహ ముంచి యూరేగించుట.

రథసప్తమి సం. వి ఈ స్త్రీ. మాఘశుక్లసప్తమీ తిథి.

రథాంగనామము. సం వి న్. పుం చక్రవాకపక్షి ఇట్లే రథాంగాహ్వయము మొ.

రథాంగపాణి సం వి ఇ. పుం. చక్రపాణి, విష్ణువు.

రథాంగము. సం. వి. అ న. 1. బండిచక్రము, 2 విష్ణునియాయుధమైన చక్రము 3. కులాలచక్రము, కుమ్మరిసారె. పుం. చక్రవాకపక్షి.

రథాభ్రము సం. వి. అ. పుం. ఱెల్లు. (వృ వి). వేతసము, నీటిప్రబ్బలియని (వాచ).

రథాంగాహ్వయము సం వి. అ. పుం. చక్రవాకము. (శ. ర.).

రథి సం. విశే (న్. సిన్) 1. రథముపైనెక్కి పోవువాఁడు 2. రథాధిపతి.

వి న్. పుం 1. రథికుఁడు, రథయజమానుఁడు, 2. రథముమీఁదనుండి యుద్ధముచేయు యోధుఁడు.

ఈ. స్త్రీ. ఎద్దులుగట్టిన బండి, గంత్రి (శే. ని.).

రథికుఁడు. సం. విశే. (అ. ఈ అ) 1. రథము (బండి) మీఁద వెళ్ళుచున్న వాఁడు, రథముపైఁ బోవుచున్న వాఁడు, 2. రథయజమానుఁడు, రథముగలవాఁడు.

రథిని. సం. వి ఈ స్త్రీ రథసమూహము, బండ్ల మొత్తము.

రథినుఁడు సం. విశే (అ ఆ అ) రథి

రథిరుఁడు సం వి అ. పుం = రథినుఁడు

రథోపస్థము సం వి. అ. న. రథమధ్యము

రథ్య. సం వి ఆ. స్త్రీ 1. రథములుపోవుమార్గము. పెద్దత్రోవ, రాజమార్గము. 2. పెక్కుత్రోవలు కలిసికొనెడిచోటు, అవర్తి 3. రథసమూహము. బండ్ల సమూహము.

రథ్యము సం వి అ పుం. 1 రథాశ్వము, తేరుగుఱ్ఱము బండిగుఱ్ఱము 2. రథావయవము. రథము యొక్క యొక భాగము, చక్రము మొ.

రదచ్ఛదము సం. వి అ. పుం. పెదవి, మోవి.

రదనచ్ఛదము సం వి అ. పుం. పెదవి, పలుకప్పు (శ ర)

రదనము సం వి అ. పుం రదము

రదము. సం. వి. అ పుం 1 పగులువారుట, బద్దలగుట 2 గోఁకుట, గీఱుట 3. దంతము 4. ముప్పదిరెండు సంఖ్యకు సంకేతపదము.

రది సం. వి న్ పుం. దంతములుగలది, దంతి, ఏనుఁగు.

కం. రదిఁగొను మచ్చోటనులే, పొదప్రాంతాపత్య లోకమున వనవుడు ... భా. అను 1.72.

రద్ది. వి. 1. అల్లరి, గోల.

కం ముద్దుల కొమరుని ద్రేశల, రద్దులకుఁ దల్లి రోలఁ రజ్జునఁ గట్టన్, బద్దు ... ముగ్గులమం గూల్చె జనసమ ... కడన్. ... 177.

సీ .. ... యెవ్వతె ... చెప్పుకొనుడు, నంటి నామటి వినికంటె ... సెక్కుడగు వాఁడు లేఁడు ... ... 138.

2 గొప్పచెప్పి.

సీ. గం ... రద్దిగాఁ దెలంగింపక పలుమాఱు వెఱ్ఱినె పలుకుచుండు. అని. 3 16.

**రద్దు** వి. 1. అల్లరి.

ద్వి. పుట్టు గొఱ్ఱెడాలిని పురవీథి నడుమఁ, బట్టి
యీడ్చుచు రద్దు పద్దుచేయుఁగను
ద్వి శ. సా. 3 166 పం.

సీ. కోళ్ళఁపెంచిన బొంతకుండలో విష్ఠించుఁ గొద్ది
తొత్తుంబొందు రద్దుకీడ్చు. వేణు. శ. 15
2. కొట్టివేఁత, తీసివేఁత. (శ. ర.)

**రవరము** సం. వి అ పుం. మండూకము, కప్ప.
(కే. ని.)

**రవరుఁడు** సం విణ (అ ఆ అ) విద్వాంసుఁడు
(కే. ని)

**రవణము** వి. 1 గర్వము

ద్వి. పోఁడిమి జంపుచాయలఁ గ్రిందుపఱచి, కవు
రంబు చవచవగా నాడిమంచు, రవణంబు
విడియించు రమణఁజెన్నొందు, నహిరాజ
శయనంబునందు ద్వి. పరిమ 4 304 పొ.

2 ఉత్సాహము.

మ. అపరాజితమూర్తిముఖుండుఁ దత్పతియు నత్యానంద
సంధానతన్, వ్యాసకాంతాజనముల్ మహీసుర
పురంధ్రీ రత్నముల్ గొల్వఁగా, రవణం
బుప్పతిల దదుపరి విభవారంభంబు గావించియ,
చ్చపలాక్షీమణికి న్వివాహ మొనరించం గార్య
మూహించుచున్. శుక. 1 364.

విణ గొప్పది ఘనము

సీ రవణంపుజెమ్మ ముత్తెపుఁ గంటసరితోడ
మెడకప్పుకస్తూరి పెడఁగుతోడ.
పాంచా. 3. 76.

**రవము**. వి 1. అధికారము.

క. చెపమేమియు లేకయె తన, రవమైతము బాధ
పఱుప రాక్షసుమీఁదన్, గుపితాత్ముఁ దప
సులు, శపియింపఁగఁజాలరైరి బలజుమహి
మన్. సీతావి. 1. 25.

2 చెల్లుబడి

చం. ... భువనబంధుఁడులేని యరాజకంబుచేఁ,
దన రవమై చరించె వసుధాస్థలి చీకటి
పాలెగాఁడొగిన్. అని. 3. 8.

సీ. చెల్లుబడికిఁ బేరు చెలఁగును రవమన...
ఆం. భా. 3. 32.

విణ. 1. అధీనము.

చం విరహులఁజంపసాగితివి వేయన నేమిడికూరు
ముక్కఁడిన్, బరఁగినదోఁడుఁబోతులరవం
బనుమాట నిజంబెపో శశీ. హంస. 5. 285.

2. ప్రచురము.

ఆ. ఇరులుగొనుచు దిక్కులెల్లఁ దిక్కువపడఁ
దమ రవం బనంగ దట్టమగుచు, చేతికంటెవట్టు
చెన్నువింతగఁ దోఁచె, నంబు గర్భమూతనాం
బుదములు
శివలీలావిలాసము (కొమ్మన) 1. ఆ.

వ. ... అపరాహ్ణంబు.

చం. ... ఎల్లెడం, దన రవమై చరించునతిదారుణ
లీలవనాంతరంబునన్. విక్ర. 2. 128.

కం. అమరఁగలతికలు, దరువులు, దమరవమై పసిమి
మిసిమి దగ్గకమిగులం, గోమరై ద్రాక్షాద్రాక్ష
చాయల. గుతులై యొలదోఁట యనలుగొన
లుం చాటెన్. విప్ర. 2. 24.

**రవ్వ**. వి రాయివంటి గట్టివస్తువు. (ఇది రాయితోఁ
గూడి ప్రయోగింపఁబడును, గాని స్వతంత్ర
ప్రయోగము లేదు)

చం. పయిఁబయిఁ బండుకొల్చు విరిపైఁడియు గట్టి
దినుసు రాయిరవ్వయు మటిబంటుబాని
సలుఁ బైరముఁ బెయ్యముఁ జేనుఁజెట్టులో,
నయిన సమస్తసంపదలు... కళా. 6 86

కం. ఇదిరాయిరవ్వపల్లం, బిదిమిట్టిది మాకుమట్టి
యిదిపొమిదిగా, మిదియని వివరింపఁగజె, ట్టి
దమై యొప్పెసఁగునక్కటికి చీకటిలోన్.
వేం. పంచ. 4. 244.

**రప్పించు.** స. క్రి. (√వచ్చు) 1. రావించు, రాఁజేయు.

కం. నటవాహాంకృతిఁ దమలోఁ, జిటపొటి జగడంబులూన్చి రంభలకుం, బోటమిన మే లేర్ప ఉపఁగ, నిట నిను రప్పించె నిర్జరేశ్వరుఁ డధిపా. విక్ర. 2. 87.

సీ. పతికళావతి యనుశావిఁ బద్మనయన, దమ సహోదరి గారాపుదాదికూఁతు, నంతికమునకు రప్పించి యాదరించి, వరమ్మసాక్షిణిఁ గావించి నగుచు పలికె. నైష. 8. 54.

కం. క్రమమున ధరణీశరణ, క్షమమగుతద్ధర్మనీతి చాతుర్యవిశేషము శేషమరసి యధిక, ప్రమదుఁడయి ప్రసంగవశత రప్పించి తగన్. రాఘవ 3. 5.

2. కలిగించు.

ఉ. ఉంచినయగ్రహారముల నున్నతవైఖరి విద్య లెల్ల, రప్పించిన విప్రవక్త్రములు, బెంచిన వప్యవనోత్కరంబులన్, నించిన బత్తటాకముల నెమ్మిగనందగు వెంగళాంబ, యక్షయ్యుచిత కీర్తిసౌధవిశదాక్షర సూనమరాళ రాజమై. వసు. 1. 64.

ద్వి. మానంబు దప్పించి మరను నొప్పించి దీనత రప్పించి దిగులు దెప్పించి. ద్వి. హరిశ్చ పూ. 1813 పం.

**రప్పు** హిం. వి. పోగులియుట (శ. ర)

**రబాబు.** వి. (హిం. రబాబ్) వాద్యవిశేషము.

సీ. గోటివాద్యంబు కిన్నరమీటుబడ్డి, వాద్యము రబాబు వగలు సర్వంబు మెఱయ, దురుసు గతిఁ జూపఁ బార్శ్వతీతరుణి మెచ్చి, జాయురి గంచువయ్యంటఁ జిక్కఁదేర్చి, కువల. 4. 112.

సీ. వేటుగజ్జెలు మద్దెల వీణెచెంగు, ముఖవీణాసంగతి త్తి కిన్నెరరబాబు, శంఖతాళాది వాద్యములొ సరసరీతి, పాటప్రశుతిఁగూడి నాదమేర్పాటు సేయ. మల్లుపు. 4. 64.

వ. ... పికిలులు బచ్చికోళ్లు రుద్రవీణియలు స్వరమండలంబులు తంబురలు కిన్నెరలు రావణహస్తంబులు బాబులు ... ప్రబంధ. 605.

**రభసము** సం. విణ. (అ ఆ అ.) 1. ఉగ్రమైనది, తీవ్రమైనది. 2 తొందరగలది, అతిత్వరగలది. 3. సంతోషము గలది, ఆనందముగలది.

4. గొప్పది.

వి. అ పుం. 1. తొందర. 2. ఆలోచింపక పని చేయుట. 3 కోపము, కోపావేశము. 4. హర్షము. సంతసము. 5. ఔత్సుక్యము. ఉత్కంఠ.

**రభసుఁడు** సం. వి అ. పుం. మ్లేచ్ఛుఁడు. (శే. ని)

**రభస్సు** సం. వి. స్. న. రభసము.

**రభువు.** సం. వి. ఉ. పుం. వార్తాహరుఁడు, దూత. (వై. ని).

**రమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. విష్ణుభార్యయగులక్ష్మి. ధనాధిష్ఠానదేవతయగు లక్ష్మి. 2. సంపద. 3. శోభ, కాంతి.

**రమకుఁడు** సం. విణ. (అ. ఆ. అ) క్రీడాపరుఁడైనవాఁడు, ఆటలాడువాఁడు.

వి. అ. పుం. ప్రియుఁడు, ప్రేమపాత్రుఁడు.

**రమఠధ్వని.** సం. వి. ఇ. పుం. ఇంగువ, హింగువు.

**రమఠము.** సం. వి. అ న హింగువు, ఇంగువ.

**రమరుఁడు** సం. విణ. (అ. ఆ అ.) క్రీడనశీలుఁడు. (శే. ని)

**రమణ—రాణ.** వి. (సం. రమ్యమ్) 1. ఒప్పిదము.

క. ...రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమానముగా దీనిని... భా. ఆది. 4.15.

మ. తమవక్త్రాధరకేశయౌవనయశోద్దామ ప్రభావంబులన్, రమణం బోలుదుమన్న ... కు. సం. 7. 888.

2. ప్రేమము, ప్రీతి.

ఆ. అతులమగుచు దివ్యమైన యా మోక్షమా,
ర్గంబు చూపవలె యు రమణతోడ.
భాగ. 5 172.

మ. రమణం బొప్పి సరోవరం బనిలజున్ రాజీవ
రాజీవ, సత్సమదాశ్రితవ్రజ చక్రవాకబకహంస
క్రౌంచనాదంబులన్. భార ఆది. 6. 172.

గీ. రాజనందనపాలికి రమణవెరిగి
దశకు. 6 167.

గీ. రాము డాదిత్యకులభర్త రమణవచ్చి, కరుణ
సేయ నేలకు దగుగట్టితాల్మి.
రాఘవ. 3 35.

3. ఆనందము, సంతోషము.

సీ. మందాకినియు ను గాళిందియు నిరుచక్కి
రమణంబై విలజామరంబు లిడిరి. హర 4.52.

ఆ. రాజసుతులతోడ రమణం బాండవధృత,
రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దం, దద్దయును
ముదమునం దమతమ విద్యలు, మొఱసిరెల్ల
జనులు మెచ్చి పొగడ. భార. ఆది. 6 11.

గీ. రమణనారామలక్ష్మి యారామవిభుని, బూజ
గావించు చందావ బొల్పెనపుడు.
ఉ, రా. 6. 25.

4. ఆసక్తి.

ఆ. పొలుచు ద్రుపదరాజ పుత్త్రీస్వయంవర, రంగ
మునకు జనిరి రమణతోడ.
భా. ఆది. 7. 165.

ఆ. హృదయహారి వివిధ, రత్నరాజి సుంద
రంబైన మగధేశు, రథముపెంబనిచె రమణ
తోడ. భార సభా. 1. 214.

5 ప్రసిద్ధి

పీ. బ్రహ్మభాగవతాది పదునెనిమిది పురాణము
లలో ప్పాండంబు రమణం గాంచు. సురా. 8.

6. విధము.

పీ. కప్పారురేణువు కమలాప్త బింబంబు రాహు
మండలమున రమణం గప్పు
భార. భీష్మ. 1. 242.

వ. .. యోగంబులం దాత్మయోగంబు రమణ
నోషధులయందు యవలనొంబగు న.
భాగ 12. 48.

కం. శ్రీరామ మంత్రి వరద సు, ధీరత్నముకుల
వధూటిదీపించు య, శోదారమణిరమణవిష్ణు,
శ్రీరంజితకొండమాంబ చిరఘన్యముల్ న్
పాండు. 1. 56, భార. శాం. 4 62.

7. ఇది కొన్నిచోట్ల వాక్యాలంకారముగ నువ
యోగింపబడును.

గీ జనులు నిగ్రహానుగ్రహశక్తుండై న, రాజు
శాసనమువంజేసి రమణతోడ, నోలిం దమతమ
మర్యాద లొక్కనాడుం, దప్పవోడుదు రిమ్మ
హితలమునందు భార అర 3 350.

ఆ. రమణతో వనాంతరమున రేతస్స్కంద,
మయ్యె నవనిపతికి నెయ్యమొదవ.
భార. ఆది. 3 27.

సీ. .. రాక్షసంబునాను, రంబు గాంధర్వంబు
రమణం బైశాచంబునను నెనిమిది వివాహముల
యందు. భార. ఆది. 4. 54.

రమణవోలె—విధముగా.

సీ. దేవశాసదికి శోభావహమ్ముగ హేమరాజీవ
ముదయించు రమణవోలె.

ఆ. మానినీలలామ మేనక కుదయించె రాజవదన
శైలరాజకన్య కు. సం. 3. 272.

జః రమణకెక్కు. ఒమణించు.

రమణ సం. వి ఆ. స్త్రీ 1. భార్య, గృహిణి.
2 మనోజ్ఞ స్త్రీ. ఇంపైన యాడుది.

రమణకెక్కు అ. క్రి. (రమణకు+ఎక్కు) వన్నె
కెక్కు, శోభిల్లు

సీ కంగత చక్రవిక్రమశక్తి నెవ్వాని రాకూము
జత్వంబు రమణకెక్కు. వసు. 1. 13.

రమణము సం వి. అ. పుం. 1. గార్దభము, గాడిదె.
2. వృషణము. 3. మహారిష్టము, వేము (వృ.వి).
న. 1. క్రీడ, ఆట. 2. సరసము, ముద్దులాట.

వినోదము. 3. రతి, మైథునము 4. ఆనందము, సంతోషము. 5. జఘనము. 6. జంబూద్వీప మండలి నవవర్షములలో నొకటి రమ్యకవర్షము. 7. పటోలీమూలము, పొట్లవేరు.

**రమణి** సం వి ఈ. స్త్రీ. 1. మనోహరురాలగు యువతి. 2. భార్య, గృహిణి. 3 స్త్రీ, ఆడుది. 4. కలబంద చెట్టు, బాల (వృ. వి.).

**రమణించు** = రవణించు. అ క్రి. (√రమణ) ఒప్పిద మగు, ఒప్పు,

గీ. అప్పురంబున రమణించె హర్మ్యచయము. నిర్వ. 1. 52.

**రమణీయము.** సం. విశే. (అ. ఆ. అ ) 1. మనోహర మైనది, అందమైనది.

**రమణుడు.** సం. వి. అ. పుం. 1. ప్రియుడు, భర్త. 2. కామదేవుడు, మన్మథుడు 3 అర్జునుడు

**రమతి.** సం వి. ఇ పుం. 1. కామదేవుడు, 2. ప్రియుడు, నాయకుడు. 3. స్వర్గము. 4. సమయము. 5 వాయసము, కాకి. 6. కాముకు (వాచ.) 7. పథ (కే. ని.).

**రమము.** సం. విశే అ. ఆ. అ. ప్రియమైనది, ప్రేమా స్పదమైనది.

వి. అ. పుం. 1. సంతోషము, ఆనందము 2 అశోక వృక్షము (వృ. వి.),

**రమరమి** = రమారమి. వి క్రమము (శ. ర.).

**రమాకాంతుడు.** సం. వి. అ పుం. విష్ణువు, లక్ష్మీపతి. ఇట్లే ంమాపతి, రమాప్రియుడు మొ

**రమాప్రియము.** సం. వి. అ. న. పద్మము, తామర పువ్వు.

**రమారమి** = రమరమి. వి క్రమము.

పంచచామరము. రమాకుమారసారె పాంథశాలి మెంచనిట్లులీ, రమ్మాయుమాధినాథుతోడ రాయి డించి మించినే, రమాని తౌర నీకునుం దురంగ మొక్కకీరమా, రమారమిన్నెలంగ కౌరరవ్వ సేయ సాటిమా. కృష్ణ. 4. 81.

**రమి (యి)ంచు** సం అ క్రి. 1. క్రీడించు.

ఉ. భూవిభుడెప్డు భూమిసతిం బొంది రమింప మహోన్నతుండగున్ భార. శాం. 3. 125.

2 ఆనందించు

కం. సమరమునవప్పుడు నీకీ, యమృత పదప్రాప్తి హేతువగు సమ్యగ్బోధము వివరించితి వచలత, రమింపు మిందెవుడు శమధురా ధుర్యుడవై. భార. అశ్వ. 1. 224.

స క్రి. సంభోగించు.

మ. జవరాండ్రన్ రమియింపం గానరతి భాస్వచ్చంద్రికారాత్రులన్, సవిశేషంబగు విద్య నైన నసినైన న్వైరులంగెల్చి ప్రాభవమొప్పన్ యశమొందం గానరు జనుల్ . .. మల్లభూ. 3. 46.

**రముడు.** సం. వి. అ. పుం. 1. ప్రియుడు, భర్త 2. మన్మథుడు కామదేవుడు

**రమ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి. 2 స్థలపద్మిని (వృ. వి.).

**రమ్యకము.** సం. వి. = రమ్యము.

**రమ్యపుష్పము.** సం. వి అ. పుం. శాల్మలి వృక్షము, బూరుగుచెట్టు (వృ. వి )

**రమ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) మనోహరమైనది, అందమైనది.

వి అ పుం. 1 చంపక వృక్షము 2 బక పుష్పము (వృ వి.)

వి. అ. న. 1. పురుషుని శుక్రము. 2. పటోలి మూలము, పొట్లవేరు. 3. జంబూద్వీపాంతర్గత మైన నవవృక్షములలో నొకటి.

**రయము.** సం. వి. అ. పుం. 1. నదీప్రవాహము, ప్రవాహము. 2. వేగము, వడి, త్వర.

**రయి.** సం. వి. న్. న. 1. ధనికుడు, డబ్బున్న వాడు. 2. జలము, నీరు.

**రయిక.** — దై. వి. అవిక, కంచుకము (వా., శ. ర.).

**రయిష్ఠుఁడు** సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు. 2 అగ్ని 3. బ్రాహ్మణుఁడు (ఆ. ని.)

**రరాటము** సం. వి. అ. పుం. లలాటము, నొసలు

**రల్లకము** సం. వి. అ. పుం. 1. ఉన్నిబట్ట. రోమ వస్త్రము, కంబళము 2 నేత్రలోమము, కనురెప్ప వెంట్రుక. 3. మృగభేదము.

**రవ**[1]—**రవ్వ**[1]. విశ. 1. చిఱు, అల్పము (దీని యామ్రేడిత రూపము రవంప).

సీ. ఒకచోట సాలభంజికి గీలు వన్నిన ముత్తె పుంరవ గొండ్లి పంధవింప నైష 7 150

మ. పొంజతీచూడరె తేఁటి జక్కలి గాడ్పుం బోదలేఁదాఁకుడో, కిలచెజాఱు మెఱుగు పుప్పొడులరేకల్ మీఱగుత్తి బులై, ... రుం బెజ్జపుమావిజంతికలఁజెన్నారన్. చంద్రా ... 109.

ద్వి. రవ పగా నుప్పు వగూడి సొంటి, ల... మైన చల్లని మజ్జిగయును అ. మ. క. 5. 248 పొ.

2. సన్ననిది, సున్నితము.

సీ. చిత్రముగూలంబు చెలువుమీఱఁగఁ గట్టి పైపైడి మొగ్గల అవిరిదొడఁగి. చెన్న. 2 238

వి. (సం. లవః) 1. వజ్రము

సీ. రవలపాదల దాని రంగారు బంగారుతమ్ములఁ గేరు హస్తములదాని. గీ. ఒక్కవిద్యాధరాని గాంచె యోగివరుఁడు. దశా. 2 10.

కం. కవిలేని రాజు కీర్తియు, రవిలేని నభంబు రూప రసభావములుం, జవిలేని భామపొందును, రవలేని విభూషణంబు రహి నరసింహా. నరస 5. 103.

ఉ. ఆ రమణీలలామ రవయందెలు ఘల్లుమనంగ లేచి. ఇందు 2. 109.

సీ. రవయుంగరంబుల రత్నాల దీప్తులు వాలారు గోళ్లపై జిలుకార. హం. 5. 44.

2. ఖండము.

కం. రవరవలు నెఱపునీలంపు, రవఁణముతోడఁ జెలియ రాళకచంబుల్, కవకవనవ్వున్ పలిజ, కృపకవఁగలకంఠ, కంఠి కఠినకుచంబుల్. విజ వి. 1. 85.

గీ. నుంటి గాడ్పులనుదుటి కస్తూరిబొట్టు, ... రాజంగ నాతఁడా రాజు జూచి కువల. 2. 48

గీ. తళుకు వజ్రంపురవలయందంబు గులుకు, పలుకుదురు తేట ముకుర బింబములవంటి, చెక్కుఁ గనరి గి కెంపుల చెక్కడంపు, గమ్మని మ గ్రమ్మఁ బలికె నాతిలికి యపుడు. ఆని 3 68, 7. 3.

... రాబువు, రేణువు

... పన్నీటి జొబ్బిల్లు పచ్చ ప్రవుఁడినె మీఁద పుప్పొడి ... పాదుకొల్పి యయా. 5. 89

... గగ. చిమ్మిరేఁగెడు కప్పురంపుం వఁ జెండు నీ యేడా ... శుక. 1. 1...

జ. ఎకా ... ము, రవపోఁకము, లవసెల్ల.

రవ[2] (... లవః) ధ్వని.

విభవేంద్రుండు విరూరికాసన మహావిఖ్యాతి రామానుజ, ప్రభువేదాద్రిలిఖించు ప్రాయసము లౌరా పెద్దసంగావనీ, విభుచిత్తంబు నెఱింగి గంట మురవల్ విద్యావధూనూపుర, ప్రభవప్రౌఢఝుళం ఝుళాంఘటి సౌభాగ్యంబు గల్పింపఁగన్. పాండు. 1. 81.

జ. రవమంచము.

రవ[3]. వి. రవగాలు, అశ్వగతి విశేషము.

సీ సింగంపుఁగొదమ తేజీరావు రవద్రొక్క పొగరెక్కి త్రికిఖుండు దగిలి వెడలె రామా. 8. 93.

జ. రవగాలు, రవనడ.

**రవ** సం. వి. ఆ. స్త్రీ. ప్రత్తిచెట్టు (వై. ని.).

**రవకారము**. వి. (√రవ[1].) పలుచని గచ్చుపూఁత (శ. ర.)

**రవగాలు** వి. (√రవ[3]) అశ్వగతి విశేషము.

చం. జనవర మౌళి కొంతవడి సాహిణినిన్వెఱఁగంది చూడ లో, దవరవగాలు చూపుచు హుటాహుటి నేఁగి పశాకు పీరుపి, రనితము దెల్ప వందలు

రయంబున వెంబడ వాగెనల్లియొ. య్యనఁగను మూసికన్ దెలుచునంతటలో మునిసీమఁ జేరఁగన్.
శుసల. 2. 58.

చం. పతియలతేజి నెక్కి వరపాలురు గొల్వ హయాధిరోహపాండితిసరిదాఁట్లు జోడనలు నిబ్బరముస్ రవగాళ్లు వేడెముల్. జతురతఁజూపి ...
చంద్రా. 2. 70.

సీ. రవగాలులకు సాటిరాక గాడ్పుపటాణి పొదలు సిగ్గునఁబోయి పొదలఁజొచ్చె.
ఉ. రా. 1. 68.

రవడి. వి. అప్పు. ఋణము (శ. ర.).

రవణ = రమణ వి. (క. రవణి. త. ఇరణి) ఒప్పిదము.

సీ కువలయాధీశుఁడై రవణఁజెందుచె గాని చక్రాభిరక్షణోత్సవము లేదు.
ఇ. దు. 4. 40.

రగడ. రవణరంజిల్లెడు పరాగముల రాగముల, నవవిలసనములఁ బున్నాగముల నాగముల. భాను 2.68

రవణకము. సం. వి. అ. పుం. రవణము.

రవణము. వి. 1. భూషణము.

సీ. వేల్పుటింతులలోన విఖ్యాతిఁగుచు మేన నవరత్న రవల రవణ మెఱిఁగె
మనుచ. ౧. 11.

మ. ఇవి నాసొమ్ములు వీనిలోన మగఁడా యేమేమిని విచ్చి నాఁ, డవునా తల్లియుఁ దండ్రి బాంధవులు వేడ్కల్ మీఱఁ జేయించి రీ, రవణంబుల్ విను వీని లోన నొకటారంబై వనీ జాలనీ, చెవులాకుల్ వగ నేయవచ్చితివి నీవే నింత నే నోర్తునే.
రుక్మాం 4 122.

వ. సుశర్మయు నేలినవాని వనిఁబూన జోడు పక్కెరకైదువు బిరుదురవణంబు మొదలైన సవరణంబులం జూడ వక్కజంబుగాఁ గూడి భార. విరా. 3 131.

2. కాంతి

కం. రవరవలు నెఱపునీలపు, రవరవణము తోడఁ జెలియరాళకచంబుల్, కవకవనవ్వున్ వలిజక్కవకవఁ గలకరకరి కరివరకుచంబుల్.
విజ. వి. 1. 65.

3. పాటి, సామ్యము.

వ. ... అంగజ భసితాంగరాగ సంగత గంగాధరాంగరంగద్విభా విభవంబుతో రవణంబుగని ...
ఉ. రా. 4. 163.

జ రవణించు, రవణింపు, రవణిల్లు.

రవణము. సం. విశ. (అ.అ.అ.) 1. అఱచుచున్నది. పెద్దకూఁత కూయుచున్నది 2. మ్రోఁగునది, ధ్వని చేయునది 3. తీక్షణమైనది పాఁడిగలది, వేఁడిగలది 4. చంచలమైనది, స్థైర్యములేనిది,

వి అ పుం 1. ఉష్ట్రము, ఒంటె. 2. పికము. 3. మేలుజాతి గుఱ్ఱము. 4 పొట్లవేరు. 5 పటోలము, పొట్ల (వ్య వి.) 6. గర్దభము, గాడిద. 7. భ్రమరము. 8 శబ్దము, ధ్వని (కే. ని.)

న కంచు.

రవణించు—రవణించు అ క్రి ($\sqrt{}$రవణము) ఒప్పిదమగు.

సీ. అమరేంద్రముక్త మేఘములఁ దెప్పుక్రమంబు రవణించ మించు వాయువులు విసరె
దశా 7. (2) 78. 231 పా.

రవణింపు వి. ($\sqrt{}$రవణించు) ఒప్పిదము.

సీ. రవికోటిరుచి పెంపు రవణింపు మణికిరీటంబు వాఁడు సులలాటంబు వాఁడు
వై జ. 1. 82.

రవణిల్లు అ క్రి. ($\sqrt{}$రవణించు) ఒప్పిదమగు, కవికంఠభూషణము. నవరత్న విశ్రమ మునవ్ సజసానజగంబులన్ గవుల్, కవికంఠభూషణముగా రచియింతురు మాటి మాటికిన్, రవణిల్లు కల్పమువనందక మాణిమువేంద్రరుక్మిణీ, ధవుసత్కథాసుధలఁ దత్పరులైన మహాత్ములట్లుగాన్
అశ్వ 4. 230 పా.

రవనడ. వి (రవ + నడ) అశ్వగతి విశేషము.

గీ. . జోడనవద్ద వేడె, ము రవనడ చుట్టు పేరెము పరువులనఁగ, బంచధారల జేర్చి గుఁ బకరాతు.
... 81.

రవపాళము వి. ($\sqrt{}$రవ[1]) వి క్కలి సన్నపాటుది (వస్త్రము). శ. ర.

రవమంచేము. వి. ($\sqrt{}$రవ[2]) సకినలమంచము. (ఈ పదము సంస్కృతమని శ. ర.).

రవము సం. వి అ పుం 1. పక్షుల క రధ్వని, 2. చప్పుడు, శబ్దము

రవరవ. వి. 1. ధ్వన్యనుకరణము.

గీ ఓరచూపుల విటులఁదా నూరడించి గిల్కు మెట్టెల రవంవల్ గుల్కరింప, చికిలిచేసిన తామ్రంపుఁ జెంబు బూని, వీథి నేతెనె సానాని వెలఁది యొకతె. వీథి 17

కం. కవకవనై పదనూపుర, రవరవ లా గుబ్బ కొన్న రతిపతిగతులం, జివచివనై విటుచెన్నెకు, రవళిన్ రతిసల్పురతుల రవరవఁ గనరొయెన్ భాగ, 6. 100

కం. వవనవ సౌరభముల నెక్కువకువలయ వర్ష మపుడు గురిసెన్ మొరసెన్, రవరవ ముఃజ రవంబులు. దివి దివిషజ్జలజముఖులు దెలిసి నటింపన్. మనుచ 4. 118.

2. స్పర్ధయందగు ననుకరణము

కం. నవనవ మను నెమ్మేనులు, రివరివ మను మధ్యములు ద్విరేఫశ్రేణుల్, జవజవ మను వేణికమది, రవరవ మను మరుఁడు వారి రంగులు గనినన్ చమత్కా ౪. 108

3. స్పర్ధ, జగడము.

చం. కులమును రూపము న్మగని కూరిమియుం గల దానవంచునీ, వల వల రుక్మిణీ రమణివాసిఁ జెనంగఁగ సత్యభామయున్, గులమునురూప ము న్మగని కూరిమియు న్గలదాన వంచు నావంః బచరింపఁగా రవరవల్ వొడమెన్ మది వారి కెంతయున్. పారి. 1 42.

కం రవరవలు నెఱపునీలపు, రవరవణముతోడఁ జెలియరాళకచంబుల్, కవకవనవ్వున్ పలిజ, క్కావకవఁ గలకంరకంరి కరివ కుచంబుల్ విజ. వి. 1. 85.

సీ. తివిరివేల్పులమీఁద రవరవల్ నిగుడించు నడుపున నూర్పులు గడలుకొనఁగ. 4. అచ్చ. రా. సుం. 11.

4. కాంతి విశేషము.

కం. రమణులికడకనుప మనో,రమకున్ మజ్జనము దీర్చి రవరవ కచపింఁ,ధమునకుఁ గాలాగరు ధూపము వెట్టి జవాది నంటువాపి నిపుణతన్. 6 మనుచ. 9 4.

గీ. రవరవల గుబ్బలొండొంటి రాయుచుండ ప్రబంధ 18.

రవలి = రవళి వి. ధ్వని

కం దినమునకు నేఁగి చిక్కిన, యవయవముల తోడ నర్ధరామరుఁ డుండం, గవకాచు దేవ దూతలు, రవలిం జనుదెంచి యమర రాజ రుదందన్. శేష. 1. 112.

సీ. మణితులాకోటి కోమల ఝణత్కారంబు రవలిమట్టెల మ్రోఁత యవఘళింప. భీమ, 1. 104.

చం. మొగములతమ్మి వాసనకు మూఁగెడు తేఁటు లఁదోలు కేలికై, చిగురుల మేపరుల్ గదియఁ జిల్కెడు పల్కులఁజేర గిరముల్, బెగడఁ గమించునందెరవలింగల హంసలు రాస సైన్యమై, తగు మరుమిఁచుఁబోణి కెనఁ దాలుతు రిచ్చటి శాలిపాలికల్. చం. రా. 3 98

రవళి = రవలి. వి. (క. రవళి). 1. ధ్వని.

మ కలవఁ జెంతయు వింతగా నలఁది చెంగల్వ త్నెటిన్నించవే, నలిఁగిల్కొల్పి పసిండి యందె రవళిన్ రాయంచ లంతంత రాఁజెలులుం దానును సత్యభామ సమదెంచె న్నాథుఁ డుప్పొంగఁగన్. పారి. 3. 14.

గీ. అత్తెఱంగున నదిరిపాటారజంపు, వన్నె తోడకట్టి తాఁబాదు సన్నరవళి, పాటలశి ఝంకృతి శ్రుతిఁబాదుకొనఁగఁ, జూడకయ చూచు చూపుతో సుడియుటయును. మనుచ. 6. 32.

(సన్నరవళి = సూక్ష్మధ్వని)

మానిని. అంచుమనంబున వద్భుతమందుచు నా సరసీరుహామంటినఁ గో,పించి ఘనాఘనభీకర గర్జలపెంపునడంచెడు పెన్రవళిం, గొంచెపు మానిని కొంచకదల్చిన గొబ్బున సారథి గూలఁగవీ,ఉించి నృపాలుఁడు చేష్టలుదక్కి మహీసమదేహరుచి న్నిలువన్. వరాహ 8.78.

మహాస్రగ్ధర. ... వాతాఘాత ఘూర్ణ ద్వనధుల రవళుల్ వాద్యముల్ మీఱఁగా ...

అము 4. 185.

2, హుంకారము, గర్వధ్వని

సీ పడతియబ్బురపుఁబెండొడల నిగారింపు రంభా పటుత్వంబు రవళిగెల్చు. రసిక. 2 77

(ఇట నుత్కర్షమని భావము.)

జ, రవళించు.

**రవళించు.** అ. క్రి (√ రవళి) ధ్వనించు

ద్వి. ప్రవిమలరత్నదర్పణ తోరణములు, రవళించి దాఁటు సాంద్రాణి తేజీలు.

ద్వి. హరిశ్చ. పూ. 125. పం.

**రవసెల్ల.** వి (రవ[1] + సెల్ల) మిక్కిలి సన్నపాటి సెల్లా.

గీ. పసిఁడిచెఱఁగుల రవసెల్ల పైనివేగ, పొదుపుగాఁ గప్పికొని పూలపొద మఱుఁగున, నిలిచి యళుకుచు బెళుకుచుఁ జెలులఁ జూచి, చిలుకవలె ముద్దుపల్కులఁ బల్కె నిట్లు.

వేం. మా. 4. 261.

**రవాణా.** హిం. వి. పంపుట (శ. ర.).

**రవాయి.** వి. కృత్రిమ పద్మరాగ మణి.

(చ. వి., శ. ర.)

**రవాలు**—రవగాలు. వి. 1. అశ్వగతి విశేషము.

కం మిత్తియుఁ బితరులఁజేఁడు, న్మత్తిలితిరుగఁగఁ జూచినలిఁ బొగరడగన్, మొత్తిన తెలిగిత్త రవా,లుత్తడి నెఱరౌత వల్దలల దొరితాతా.

అచ్చ. రా. కిష్కిం. 108

2. అశ్వము, గుఱ్ఱము.

గీ. తత్తడి రవాలునడగఁడు కత్తలాని, తురికి జాబా యనఁగ నొప్పుఁ దురగమునకు.

సాం. ని. తిర్య. 71.

**రవాళి.** వి రవళి, ధ్వని.

ఉ. గుత్తపు గుబ్బలాఁడి సుమకోమలి ముద్దుల గుమ్మ మల్లిపూ,గుత్తి మెఱుంగుఁదీఁగెలతకూన మనోజ్ఞరవాళి జాళువా, ముత్తెపుఁ గోల...

నిరం. 4. 82.

సీ. కెంజిలి నెమ్మిగుల నేయు కేకారవంబులు లాపుకలెత్తు నీలల రవాళి చంద్రా. 2. 81.

జ. రవాళించు.

**రవాళించు** అ. క్రి. (√ రవళి) రవళించు, ధ్వనించు (శ. ర.)

**రవి** సం వి ఇ పుం. 1. సూర్యుఁడు. 2. పర్వతము. 3 జిల్లేడుచెట్టు 4 పండ్రెండు సంఖ్యకు సంకేతపదము

**రవికాంతము** సం. వి అ పుం. సూర్యకాంతము, సూదంటురాయి

**రవిజుఁడు** సం. వి అ పుం 1 శని గ్రహము. 2. కర్ణుడు. 3. వైవస్వతమనువు. 4. సావర్ణి మనువు (వా) 5 యముఁడు 6. సుగ్రీవుఁడు ఇట్లే రవితనయుఁడు.

**రవిణె** వి. గంట (ఇది యింద్రునితో సూర్యుని యన్నమాట)

సి. శివుఁ డొక్కనాఁడు దేశికమెచ్చి వాతిచ్చెఁ బెద్దపల్లవుఁ గుచ్చుబిరుదుఁ బిణె. వాళ్మ. 3.86

**రవినేత్రుఁడు** సం వి. అ పుం. విష్ణువు ఇట్లే రవిలోచనుండు మొ.

**రవిప్రియము.** సం వి. అ. న 1 ఎఱ్ఱతామర పువ్వు, కెందమ్మి. 2. బ ధాన్యము (వ. వి.). 3. తామ్రము, రాగి

ఇట్లే రవినామము, మొ.

**రవిరత్నము** సం. వి. అ. న. మాణిక్యము, కెంపు

**రవిరేక** = రావిరేక. వి బిడ్డలు కూకటియందు

ధరించెడి రావాకువంటి పతకము.

సీ. మొలకకూకటిఁ గ్రాలు ముత్యాల రవిరేక ఛసి తంపుబొట్టుతో నాదరింప. కాశీ 3. 240.

**రవిలించు.** స. క్రి. (√రవులు) రగులు. మండించు.

చం. గుడుగుడిఁ ద్రాగబంగు జడఁగూర్చిన చిలుము గుడాకుముద్దపైఁ, బడి రవిలించి క్రోవి పొగ వచ్చెడు రీతిని మించఁ గేలముల్, పొడువును గాక యాటియును బోవక నేర్పున వీతిహో త్రుఁడ, చెడుగులఁ గొల్పు.. పార్వ. 2. 78.

గీ అగ్గి రవిలించి యావాలు గుగ్గిలంబు అచ్చ రా యు. 488

గీ నిప్పుకలువెట్టి రవిలింపఁ గప్పులెరవు, జాణ మంటలు వెదచల్లఁ జాగెమిగుల. అచ్చ. శా. సుం, 166.

**రవిలోహము** సం. వి. అ. పుం. (రవిప్రియ లోహము) తామ్రము, రాగి.

**రవివారము** సం వి అ. పుం. ఆదిత్యవారము, ఆదివారము ఇట్లే రవిదినము మొ

**రవీషువు** సం. వి. ఉ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

**రవుతు.** వి (సం రాహుత్తః) సాది, రౌతు

చం. . తటిమాడరాక వెలుఁగునొందిర త్రముల కైవడి నాఘనయోధు లుండ నీ, రవుతులు కోడలన్ రథికరాజియు వారిమొవల్ గలంపఁగాన్. భార ద్రో. 1 378

గీ. ఇవిగదా తెలిమావు రవుతు సంతుపిసాళి తొడ సెజఁ బవళించు నొదయ లయ్యె. ముకుంద. 1. 84 పా. 1 పం.

మ. మదదంతవళదంతము ల్నలుకు నమ్మావంతులు ద్రాప్తి లతన్, బెదరన్ జల్లము గుజ్జుమున్ రవుతునున్ వేటాలుతుఁడెంబులై, చెదరంగా వడిబ్రేయువీరంథిక శ్రేణిన్ బలౌఘంబులన్, గుదియంజేయుభటాలిఁ ద్రుంచు విలసద్దోరాసి ధారాహతిన్. విక్ర. 6. 78.

**రవులు**=రగులు. అ. క్రి. మండు, ప్రజ్వలించు (చూ. రవులుకొను).

జ. రవిలించు, రవులుకొను, రవులుకోలు.

**రవులు(ల్కొ)కొను.** అ. క్రి. (రవులు + కొను. స్వార్థమున.) మండు, రగులుకొను.

సీ. .... అవులనాపొట్నూర రవులుకొనియె.

గీ. ... కృష్ణ రాయశాహు ప్రతాప జాగ్రద్వహ్ని. మనుచ. 1 37.

సీ. ... అవులనాపొట్నూర రవులుకొనియె.

గీ. ...ఔర నీదు రవగాహ, ఖేలదుగ్ర ప్రతాపాగ్ని కృష్ణరాయ. ఆము. 1. 86

చం కువలయపత్రనేత్ర కనుఁగొల్కులయం దుద యించె బాష్పవీఁ,దువులు ధరానురుండు తనుఁ దోడ్కొని పోకయుపేక్షసేయున, న్నవదర వింద చక్రమిథునంబుల సహ్యవశాఁగ జాగ్ని చే, రవులుకొనంగఁ బుట్టిన నిరంతర ధూమము నోఁకియో యనన్. శివరా. 7. 122.

కం. చనుదెంచి మ్రొక్కి నిలిచిన, వనితామణిఁ జూచె దివిజవల్లభుఁడు రవు ల్కొనుకోప వహ్నికీలల,ఘను బొమముడి ధూమపంక్తి కొదువం దీఁప్పన్ నిరం. 4. 108.

ఉ గబ్బుమదంబువందము పొకాలిపికాలి కుకాలి అంతులా, గుబ్బులుఁరేఁగ బుప్పొడులు గొబ్బున జబ్బన రాలుచుండగా,మబ్బున గుజ్జుఁ గెంజిగురు మావిడి చూచి చలించె గబ్బిలే, గుబ్బెతకంతుచే బిరుసుఁ గ్రోవి రవుల్కొనెనంచు నయ్యెడన్. కకు. 3. 84.

**రవులుకోలు.** వి. (√రవులుకొను) రవులుకొనుట.

సీ. ఇల్లిల్లుఁ దిరుగ నొక్కింత బబ్బు శిఖ యక్కెనే నింటలోఁ బూరియిడివిసరక, రాఁజదు రాఁ జిన రవులు కోల్వాసాలఁగాని కల్గదు మతి దానఁగలిగె, నేని క్రూడగుటమందు ... ఆము. 4. 127 (వేదం. పా.)

**రవ్వ**[1]=రవ[1]. వి. వజ్రము.

సీ. కురులు కూడనినాఁడె యిలుగ్రాసినమేని రా
కాసి సేసిన రవ్వయితఁడు. బహు. 4. 82.
(ఇట వజ్రమువంటివాఁడు, దిట్టరి అని భావము).

రవ్వ² = అవ్వ వి. 1. నింద, దూఱు.

ద్వి. రాచకూఁతునుగొని రవ్వగాకుండ, దాఁచిన మీమూల ధనమెల్లఁబెట్టి.
ద్వి. హరిశ్చ. ఉ. 1050. పం.

కం రవ్వకుమొదలగు పాపవు, జవ్వన మెదిరించె జిగియొసఁగ నామేనన్. మనుచ. 6. 42.

2. దౌష్ట్యము.

ఆ నమ్మి నిదురవోవ నా పట్టచుంచుమా, తేఁగ తోఁకతోడ లీలఁగట్టి, పిదుఖందుఁ దోలె వెలఁది నీ కొమరుండు, రాచబిడ్డఁడైన రవ్వమేలె.
భాగ 10 పూ. 332.

రశన. నం. వి. అ స్త్రీ. 1. త్రాడు, దారము. 2 కళ్లెపువాఱు, కళ్లెపు పగ్గము. 3 నడికట్టు, ఒడ్డాణము, కాంచి, 4. నాలుక, జిహ్వ.

రశ్మి. నం. వి ఇ. పుం. 1. త్రాడు, పగ్గము. 2 కళ్లెపువాఱు, కళ్లెపు పగ్గము 3. సూర్య కిరణము. 4. నేత్రలోమము, కను ఱెప్పవెండ్రుక. 5. రాఁబడి, ఆదాయము, ఆస్తి.

సీ. బలము తక్కువయైనఁ బైబట్ట బరువగు సంచార ముడిగిన సడలు రశ్మి. రామలిం. 50

(ఈ యర్థమునఁ దెలుఁగుశంఁదే ప్రయోగము కన్పట్టుచున్నది.)

ఆ. ... మేను కడిపెఁడు బిడ్డల, వార మెట్లు బ్రతుకువార మనుజ, నీవెఱుఁగకుండ నే వంక సైనను, గలుగు రశ్మిగలదె తెలుపు మాకు.
భోజరా. 6. 144.

వ పద్మము, తామరపువ్వు. స్త్రీ. జ్వాల.

రస నం. వి. అ. స్త్రీ. 1. రసాతలము, పాతాళము. 2. భూమి, పుడమి. 3. జిహ్వ, నాలుక. 4. ద్రాక్షపండు. 5. అందుగు, (వ్య. వి.) 6 చిఱుబొద్ది 7. కొట్టులు. (శ. ర.) 8. దూర్వ (వ్య. వి.).

రసంగి. వి. ధాన్యవిశేషము (శ. ర.)

రసకము. నం వి. అ పుం. 1 కుశి. ఇనుముతో చేసినవస్తువు. 2. ఒకానొక జాఁరము. 3 మాంసాది క్వాథము.

రసకర్పూరము. నం. వి. అ పుం. న కర్పూరరసము

రసకేసరము నం. వి. అ న. 1 కర్పూరము.
2. వకుళము, పొగడ (వ్య. వి) 3. వేధకము (వ్య వి.) 4. నాగపుష్పము, నాగకేసరము (వ్య. వి)

రసగంధకము. నం. వి అ. పుం. . 1 గోపరసము, పరిమళముగల యొకానొకబంక జాలెత బోళము 1. గంధకము

రసగంధము నం. వి అ పుం న. రసగంధకము

రసగర్భము. నం. వి. అ. న. 1. రసాంజనము. 2. ఇంగిలీకము.

రసగుండు మి. వి. (రసము + గుండు) పాదరసము పూసిన గోళాకారవస్తువు (చి. ని., శ. ర.)

రసఘ్నము. నం. వి. అ. పుం. వెలిగారము.

రసజము. నం. వి అ పుం 1. గుడము, బెల్లము. 2. మద్యకీటము, మద్యము పులియబెట్టుటవలనఁ బుట్టెడి పురుగు. న. రక్తము, నెత్తురు ఇట్లే రస భవము మొ.

రసజ్ఞ. నం. వి. అ. స్త్రీ. జిహ్వ, నాలుక.

రసజ్ఞత. నం. వి. అ. స్త్రీ. 1 కావ్యరస గ్రహణ కౌశలము. 2. రుచుల నెఱుఁగుట, రుచిజ్ఞానము. 3. వివేకము. (గుణదోష) జ్ఞానము.

రసజ్ఞత్వము. నం. వి. అ. న. రసజ్ఞత.

రసజ్ఞము. నం. వి. అ. పుం. 1. అయోభేదము, 2. అయస్కారము. (కే. ని)

రసజ్ఞుఁడు. నం విశ. అ. అ. అ. 1 రుచినెఱిఁగినవాఁడు 2. వస్తుసౌందర్య మెఱిఁగినవాఁడు, కావ్య సౌందర్యవేది.

వి. అ. పుం. 1. రసమెఱిఁగిన మనుష్యుఁడు, విమర్శకుఁడు, కవి. 2. రసాయనశాస్త్రజ్ఞుఁడు. 3. వైద్యుఁడు.

రసజ్యేష్ఠము. సం. వి. అ. పుం. తియ్యఁదనము, మధురము. 2. శృంగార రసము.

రసతేజస్సు. సం. వి. స్. న. రక్తము, నెత్తురు.

రసదాడి. (?) వి. (సం రసదాళికా) ఒకజాతి యరఁటిచెట్టు: ఆ యరఁటిపండు.

సీ చిన్నజాబిలిదాల్పు సింగిణి రసదాడికేస్వామి శుభ కరం బిభకరంబు. చం. రా. 1. 41.

గీ. వారుచెట్టునఁ దనుదానయారబండి, నట్టిపరువంపు రసదాడి యరఁటిపంటి, గొలలు చక్కెరనెయ్యి మక్కువ నొసఁగ. శుక. 2. 37.

సీ చక్కెరఁ బొంలించి చాలించు రసదాళ్లు కడఁ ద్రుంచియుంచిన కమ్మనపడయు. పాంచాలీ. 4 58,

గీ. అవఁటగొలనుండి పండి తనంతఁదానె, యవని రాలిన రసదాళి యువతిపంప, ఖటికల కొలది వసుధాఘుటిక లనుచు, గుటుకు గుటుకువ ద్రింగె వజ్జటికులఁబు బహు. 4. 48.

2. ఒకజాతి చెఱకు.

చ .. చెన్నగురసదాడి గుంపులు పురాంతికసీమల... వసు. 1. 113.

రసదాలిక సం. వి ఆ. స్త్రీ. పుండ్రేక్షువు, ఒక విధ మగు చెఱకు. (వృ.వి.) (వాచ.).

రసధాతువు సం. వి ఉ. పుం. పాదరసము.

రసధేనువు. సం. వి ఉ పుం. దానమిచ్చుట కొఱకు ఇక్షురసముతో నిర్మించిన ధేనువు (వాచ.).

రసన సం. వి. ఆ. స్త్రీ. 1. జిహ్వ, నాలుక. 2. కాంచి, మొలనూలు, 3. త్రాడు. 4. ఒకానొక లత, రాస్న. (వృ. వి). 5. ఆస్వాదన, చవి చూచుట (కే ని.).

రసనము. సం. వి. అ న. 1. చప్పుడు, ధ్వని. 2 అన్నము. 3. రుచి, కమ్మఁదనము. 4. రుచిని గ్రహించెడి రసనేంద్రియము. జిహ్వ. 5. కషాయము, ద్రవరూపమగు ఔషధము. 6. స్నేహము జిడ్డు. 7. విషము 8 ఫలము, పండు. 9. నిర్యాసము, జిగురు. 10. బంగారము 11. రూప్యము, వెండి (కే.ని.).

రసనేత్రిక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱపాషాణము, మనశ్శిల.

రసపాకజము. సం. వి. అ. పుం. 1. గుడము, బెల్లము 2 రుధిరము, నెత్తురు.

రసఫలము, సం. వి. అ. పుం. నారికేళవృక్షము, కొబ్బరిచెట్టు. (వృ.వి.).

రసమాణిక్యము. సం. వి. అ. న. పాదరసముతోఁ జేయఁబడిన మాణిక్యమువంటి ఒక వస్తువు.(వాచ.)

రసము సం. వి. అ. పుం 1. పసరు, పుష్పాదుల రసము. 2 ద్రవము. 3. నీరు. 4. మద్యము, త్రాగుడు పదార్థము. 5 పే యౌషధము, త్రాగఁ దగిన మందు 6 రుచి, చవి. (రసములాఱు: కటు అమ్ల మధుర లవణ తిక్త కషాయములు.) 7 రుచి గల పదార్థము 8. ఒకవస్తువు నందలి యభిరుచి, ఇష్టము, వాంఛ. 9 ప్రేమ, అనురాగము. 10. (కావ్యాదులయందు) శృంగారాది—శృంగారము హాస్యము, కరుణము, రౌద్రము వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము అని ఎనిమిది రసములు. శాంతము చేర్చి తొమ్మిదని కొందఱనిరి. వాత్సల్యము చేర్చి పదిగా నెంచఁబడినవి. 11. పారము, చేవ. 12. దేహధాతు విశేషము. 13. వీర్యము, శుక్లము 14. పాదరసము. 15. విషము, విషముగల త్రాగుడు పదార్థము. 16. చెఱకు రసము. 17. అమృతము. 18. పులుసు, చేరు. 19 ఆఱుసంఖ్యకు సంకేతపదము. 20. రసనేంద్రియము, నాలుక. 21. గోపరసము. గంధద్రవ్య విశేషము. 22. సువర్ణము, బంగారు. 23. అన్నము. (వాచ.) 24. శబ్దము, ధ్వని. 25. చెట్టునుండి వెడలుబంక. 26. లశునము, వెల్లుల్లి. 27. ఫలము ప్రయోజనము. 28. భోజనము. 29. స్నేహము. 30 ఇంగిలీకము. 31. హారిద్వర్ణము. 32. మాంసము 33. పులికడుగు. 34. వినుగు. 35. పండము. (కే. ని.).

రసయోని. సం. వి. ఇ. స్త్రీ. వెలిగారము (వై.వి.)

రసరాజము. సం. వి అ. పుం. 1. రసాంజనము. ఇట్లే రసనాథము మొ.

**రసలోహము** సం. వి. అ. పుం. 1. రసాంజనము. 2. పాదరసము.

**రసవతి.** సం. వి. ఈ. స్త్రీ. వంటసాల, వంటిల్లు.

**రసవర్గము** సం. వి. అ. పుం. ఆహారపదార్థము.

చ. అచలితవృత్తి నిట్లువిడియం దళవాయి సలాశి వీఁడు మెచ్చుచు నంకోటకేఁగు జలసూత్రపుఁ జోటు లెఱిఁగి యడ్డక, ట్టుచు రసవర్గ మచ్చట గడున్వడిఁ జొంగనీక శూరతా, రచనలఁ జిల్లరల్ సలుపు రక్కసిపాలియుగాంద్రఁ గొట్టుచున్. కువల. 3. 2.

**రసవాదము.** సం. వి. అ. పుం. పాదరసమును కట్టు బంగారము చేసెడి విద్య (శ. ర.).

**రసశోధనము.** సం. వి. అ. న. 1 వెలిగారము 2. పాదరసశుద్ధి.

**రససింధురము** సం. వి. అ. న. 1. తుత్తనాగము నుండి తీసిన ఇంగిలీకము 2. పాదరసము. 3. మైలతుత్తము. 4 సూరేకారము, వెల్లుప్పు.

**రససిద్ధుఁడు** సం. విణ. అ అ అ 1. కవిత్వమున నిపుణతగలవాఁడు, శృంగారాది రసములయందు నేర్పుగలవాఁడు. 2. రసాయనశాస్త్రమునఁ బ్రవీణుఁడైనవాఁడు.

**రసస్థానము.** సం. వి. అ. న. ఇంగిలీకము

**రసాంజనము.** సం. వి. అ. న. 1. అంజన విశేషము.

**రసాగ్రజము.** సం. వి. అ. న. రసాంజనము.

**రసాఢ్యము.** సం. వి. అ. పుం. ఆమ్రాతకి, అంబాళము (వృ. వి).

**రసాతలము.** సం. వి. అ. న. 1. పాతాళములోని లోకము, అధోలోకములలో నొకటి

**రసాధిక.** సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరము, కాకిమేడి (వృ. వి)

**రసాధికము.** సం. వి. అ. పుం. వెలిగారము.

**రసాభాసము.** సం. వి. అ. పుం. 1. బాహ్యదృష్టికి రసమువలెఁ గాన్పించుట, రసమను భ్రాంతి. 2. రసము ననుచితరీతిగా స్పష్టపఱచుట.

శ్లో॥ ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతేఽపి వా, యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధా మతః

**రసామ్లము.** సం. వి. అ. పుం. చుక్రము, చింతపండు.

**రసాయనఫలము.** సం. వి. అ. న. హారీతకి, కరక (వృ. వి) (త్రి. ని).

**రసాయనము** సం. వి. అ. న. 1 జీవనౌషధము, సంజీవిని, 2. సంజీవినివంటి పదార్థము. ఆనందపఱచెడి లేక తృప్తిపఱచెడి పదార్థము.

ఉదా: శ్రోత్రరసాయనము, కర్ణరసాయనము మొ. 3. వెండిబంగారములుచేయు విద్య లేక రసవాదశాస్త్రము 4. కొన్నిమందు దినుసులు కలసిన పదార్థము. 5 తక్రము, చల్ల. 6 ఒకానొక విషము, 7. పిప్పలి.

పుం. ఒకానొక ఓషధి, విహంగము (వృ. వి)

**రసాయనములు** నారికేళ-, గుడూచి-, శిగ్రుపుష్పాది, చూతఫలాది రసాయనములు, లోహరసాయనాదులు.

**రసాయనశాస్త్రము.** సం. వి. అ. న. కెమిస్ట్రి.

**రసాయనుడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుడు.

**రసాల** సం. వి. ఆ. స్త్రీ. 1. నాలుక. 2. ద్రాక్ష 3. గఱిక. 4. చెక్కెర సుగంధిద్రవ్యములు కలిసిన పెరుఁగు

**రసాలము.** సం. వి. అ. న. 1. శల్లకీద్రవము. 2. రసగంధము.

పుం. 1. చెఱకు. 2. మామిడి.

**రసాలస** సం. వి. ఆ. స్త్రీ రక్తనాళము, ధమని.

**రసావళ్లు(ళులు)** మి (ఏకవచనము, రసావళి) అపూపమువంటి భక్ష్యవిశేషము.

కం. తనయింటనవ్వు డాయిత, మొనరి చిన నమ్మ దావులోలుకు రసావళ్లను మిసుపవపలు జావట్లును గోదుమపిండివంటలున్ గలవ నినన్. విష్ణు. 3. 377.

రసి. సం. విశ. న్. రసముగల.

రసి. దే. వి పుంటిచీము (శ. ర.).

రసిక సం. వి. ఆ. స్త్రీ. 1. రసికురాలు. 2 నాలుక 3 చెఱకురసము. 4. రశన, మొల నూలు.

రసికము. సం విశ 1. రుచిగల. మధురమైన 2. రసవంతమయిన 3. అందమైన 4 రస గ్రహణశక్తిగల 5. చతురతగల 6. కాముకమైన. 7. ఏదేనొక విషయమునందు ఆసక్తిగల.

ఈయర్థమునందు సమాసములోనే ప్రయుక్తము) క్రీడారసికుడు.

రసికుడు. సం. వి. పుం. 1. రసజ్ఞుడు. 2. ఏనుగు 3. గుఱ్ఱము. 4 సారసపక్షి, బెగ్గురు

రసికత సం. వి ఆ. స్త్రీ. రసజ్ఞత

రసికత్వము సం వి అ న. రసికత

రసికేశ్వరుడు సం. వి. అ పుం. రసికురాలి నాథుడు, కృష్ణుడు (విల్యమ్స్).

రసితము సం. వి. అ న. 1. ద్రాక్షారసము. 2. ధ్వని, అఱపు, గర్జనము

విశ. 1 రుచిగల. 2 రుచిచూడబడిన 3. మొలాము చేయబడిన. 4. ధ్వనించిన.

రసీదు ఆంగ్ల. చెల్లుపత్రము, ఏదేని ముట్టినట్టు వ్రాసి యిచ్చెడు పత్రము.

రసునము. సం. వి. అ. పుం. ఓటి?

రసేంద్రము సం. వి అ పుం. పాదరసము

రసోత్తమము సం. వి. అ. న. పాలు

రసోద్భవము. సం వి. అ న ముత్యము

రసోన(క)ము. సం. వి అ. పుం. వెల్లుల్లి.

రసోపలము సం వి. అ. న. ముత్యము

రస్తా హిం వి దారి.

రస్తు దే. వి. వస్తుసంభారము.

ఉ. ... వారలు ఘనంబుగ మార్గము చక్కగించినన్ సన్నుతశౌర్య రస్తు మన సైన్యముఁ జేరుట దుస్తరంబగున్. కృష్ణ. 3. 67.

చం. పరఁగెడు రస్తు కొట్టడులు భద్రముగా నొగి బీగముద్రలన్, గరిమ నొనర్చి...

హంస 1. 109.

రస్న = రసన.

రస్యమానము. సం. విశ రుచిచూడఁబడుచున్నది.

రహటము వై. వి. (√అరఘట్టము. మహారా. రాహాట) ఘటయంత్రము, నూతిరాట్నము, గిరక.

రహటు. వై వి రట్టు.

రహణము సం వి. అ న. ఎడబాటు, విడువల.

రహదారి. హిం. వి స్వేచ్ఛగా అందఱును పోదగిన దారి.

రహము. సం. వి అవ్య. చూ. రహస్సు, రహస్యము.

రహస్య. సం. వి ఆ. స్త్రీ ఒకనది

రహస్యము. సం. వి. అ. న. 1. ఏకాంతము. గుట్టు, 2 మంతనము. కందువ 4. సైగ.

విశ. దాచఁదగిన, ఉపగూఢము.

మ అలినీలాలక నీవు నీపతిరహస్యక్రీడ వర్తించు వేళ ... పారి. 1. 60.

రహస్సు. సం. వి. స్. న. 1. రహస్యము. 2 సురతము

రహి. దే వి 1 అందము

మ. .. విందియంబాటిన గొజ్జెఁగల్గురియ మున్నీరైన యక్కమ్మనీరురహిం గూడిన నేర్పరించుగములై రోలంబకాదంబముల్. ఆము. 5. 121.

సీ. పొడుపుఁగెంపు వహింపు బెడిదంపు వినుఁగెంపు రహినింపు కంఠహారంబు వాఁడు. ఉ రా. 1. 18.

2 బాగు.

కం. . గంధవహాములు, శరీరములనేదఁదీర్పఁ జనుదెంచె రహిన్. పారి. 2. 102.

మ. ... మహావాల్లభ్య సౌభాగ్యవ, ద్రతనన్థేశ కుమారుఁ డంత రహిగాఁ దన్నేలుకోఁబోలు

నాయన దానిత్తఱివట్టివల్లభకు దన్వై యొందు
మన్నాఁడో కో. కళా. 3. 48.

3. విలాసము.

చం. సరసులనర్మ మింపులు నొసంగఁ గదంబపు
దండ,గట్టుచోఁ గరఁగుటఁదెల్పు దృక్తరళ
కాంతులు నుత్తరమిచ్చు వంతరాం,తరముల
నవ్వులున్ గలువతండము మొల్లలు నంచు
మిన్నుగ్రుచ్చి రహినిరిత్తనూ లొసఁగి సిగ్గు
వహింతురు పుష్పలావికల్. ఆము. 2. 20.

4. ఆనందము, సంతోషము.

కం జంభాహితుఁ డూర్వశిపై, రంభపయిం గరుణ
కలిమి రహిఁ దన్నట నో,జ్జృంభణల తార
తమ్యము, సంభావించుటయె కాని చాలఁడు
తెగడన్. విక్ర. 2. 77

గీ. తానవంబుగ దొరఁజేయువాలిమంత్రి,మునకు
వేగమె లోఁజేయఁజవదు వాఁడు,క్రొత్త మన్న
వరహి ననుఁగులకు జెప్పనయిన వది చెడు.
ఆము. 4 260.

5. ఉల్లాసము, మనోవికాసము.

సీ. ఒక యిక్కనిది వితర్దిక నిక్కమని వదా
గ్రమునిక్క రహి నెక్కఁగాఁ దలఁతు
వసు. 4. 73.

6. ప్రేమము, అనురాగము.

సీ. నెఱికవట్టి వసిండి నీటిప్రాఁత దెలుంగువెలి
పట్టు రహిఁగట్టి వెలఁదియొర్తు.
ఆము. 6. 128.

7. ఆసక్తి.

కం. ఆ విభునవంతరంబుధ, రావలయముఁ బూని
తీవు రహిమైఁ దిరుమల్, దేవియును నన్న
పూర్ణా,దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరు
లుగాన్. ఆము. 1. 33.

చం. తన మృదుగీతికాపరిణతధ్వని వైఖరిఁబల్కు
మంచు మిం,చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు
గీఁటుచు నేర్పుచున్నదో,యన నఖరాంకరింబుల
వయమ్ముగఁ దంత్రులు మీఁటి గానమిం,పొనఁ
రఁగఁజేయు వాణి ... పారి. 1. 5.

కం. రాయైనఁ గొంతమేల్ వా,రాయణ మీ
మనసుకంటె రహి నిక నెపుడున్, మీయంత
దడివెదకె యని, యాయంగన యితనిపాద
మల్లనఁ బట్టెన్ కళా. 4. 115.

8. రక్తి

సీ. రహిపుట్ట జంత్రగాత్రముల జాల్ గరఁగించు
విమల గాంధర్వంబు విద్య మాకు
మనువ. 2. 43.

9. కాంతి, శోభ.

చం. ... తారభటాళితో నిశా,ధిపుని బలంబు
లేఁగిఁ గతిన్ రహి వీడెను బాండుచంద్రికల్.
వసు. 4 125.

ఉ. ...జక్కవ లొక్కట జోడుగూడె వే, వేయుతి
యాడఁదోడ రహి వీడె వినిర్మల సాంద్ర చంద్రి
కల్. చంద్రా 5. 113.

10. సత్త్వము, బలము.

కం. అహితుని నాశ్చర్యకరం, ప్రవాహిణవిధిఁ
జాలడీలు వఱిచె నతండున్, రహిఁ దిరుగఁ
దెచ్చుకొని వి,గ్రహచేష్ట లడంగ నొంచెఁ గరు
వలిపట్టిన్. రాఘవ. 4. 163.

11. ప్రసిద్ధి, కీర్తి

కం. శ్రీరంగరాజు రామ, జ్మాణిమణుసిరంగ్
రాజుమహింబహి కెక్కెన్, ధారాధరఖేచరి మం,
దారాధఃకారిదాన ధారానిధియై
రామా. 1. 64.

(రహికెక్కు=ప్రసిద్ధి కెక్కు, కీర్తి వహించు అని
భావము)

12. విధము, ఒఱి.

సీ. అంజనాచలముపై వరుణాతపము మించు
రహి మేనఁ గనకాంబరము దనర.
ఉ. రా. 2. 42.

సీ. అకసంబంటిన కీకసరానలు రజతశైలంబుల
రహి వహింప. దశా. 6. 137.

13. పోలిక, సాదృశ్యము.

సీ. జహ్నుజార్జునసరోజ విరాజ మానవరాగ ములతో రహివహిలచు. గీ. విమల కైవల్య పదము శ్రీవిష్ణుపదము ఇందు. 1. 45.

14 ఉత్కర్షము, అతిశయము.

సీ. ఆ రాజు విమలవిఖ్యాతిచంద్రికనిచ్చ రహి కెక్కజాతె జారప్రసంగము ...

వసు. 6. 88.

(రహికెక్కన్ = అతిశయింపన్ అని భావము.)
జ: రహించు.

రహియి(ం)చు అ క్రి. (√రహి). 1 వర్ధిల్లు, పెరుగు.

మ ... అరుల్లసిం, చె నురుప్రకాంతి జనించె గర్భము రహించెన్ మించె నిట్టూరుపుల్.

ఉ. రా. 1. 181.

సీ. పులకాంకురంబులు పొంరలిపాటెనె రదా చెక్కు టద్దములకు జిగి రహించె. కవిరా. 5. 125.

2. ఒప్పు, శోభిల్లు.

మధురగతింగడ. కలిగి ధరిత్రిని ఘనత వహించెను, అలకాపురముకన్న రహించెను.

కుచేల. 1. 23.

సీ. తతమై రహించునితంబబింబముఁ జూచి ...

దశా. 2. 308.

ఉ. ...రోహిణీ, కాంతునిరేఖఁ గ్రొమ్మెయిలు కప్పుటఁ జూసి రహించినట్లు త, త్కాంత తనూవిలాసరతికాంత తళుక్కున నెంత నిల్చెవన్.

శుక. 1. 381.

స. క్రి. వర్ధిల్లఁ జేయు.

కం. ఇందిందిరవనమందిర, యిందిందిరవందనుండ యేలినయెడ నీ, మందిందిరమై తేనియ, మందిందురహింతుననుచు మదమేమిటికిన్.

రా. వి. 4. 63.

2. పొందు.

సీ. ఆర్యాభిగణ్య సౌకర్యంబును రహించి ...

ఉ. రా. 1. 2.

(ప్రయోగాంతరము లేదు.)

రహితము. సం. విశే. అ. ఆ. అ. త్యక్తమైనది. వదలి వేయఁబడినది.

# రా

రా[1]. అ. క్రి. వచ్చుధాతువుయొక్క ప్రార్థనార్థక రూపము, ఏతెమ్ము. రమ్ము.

ఉ. రాయనుఁ గాయనుం దొగలరాయనిఁ గేరుని గాఁపుంగుడా, రాయనుమేటి నాడెపు దొరా యను .. అచ్చ. రా. అయో. 89.

మ. తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరు వంచించియుం. బదుమూఁడేఁడులు నీవునుం దిఁగిదాపాలిక పోవచ్చునే...

భాః. ఉద్యో. 3. 97.

=ర,

అవ్య. స్త్రీలతో మాటాడునపుడు "ఏ" అనునది అనుప్రయుక్తమగునట్లు నీచమిత్రోద్దేశమున పురుషులతో మాటాడునపుడు ఏకత్వమువఁదును ప్రయుక్తమగును.

(కోపమునకు)

శా.... నా, జింకల్ భుక్తిగొనంగ నేమిటికి రాచేచిట్ట మ్రోయించియా, తంకంబున్ ఘటి యించితి... హర. 1. 4.

(ప్రశంసకు)

కం. వికచాబ్జదళాగ్రంబుల, మకరందము కరుడు గట్టి మఱిజాఱనిపో, లికనున్నవిరా సఖయా, లికుచస్తనిమృదుపదాంగుళీనఖపంక్తుల్.

వరాహ. 3. 119.

(ఆశ్చర్యమునకు)

ఉ.... ఆ సరోజముఖి...రా, కావిధమెన్నఁ డబ్బునో దయామతినానతి యిమ్మనంగనో,

రా! వలరాచవేగిరము రాముకు నంచుఁ జెలంగి నవ్వుచున్. ఉ. హరి. 5 71.

(ప్రశ్నమునకు)

శా. ప్రారంభించిన వేదపారమునకుం బ్రత్యూహ మౌనంచునో, యేరా తమ్ముఁడ! నన్నుఁ జూడఁ జనుదేవు... పాండు. 3 33.

(అనాదరమునకు)

కం. నోరెనవినుండకేనో, రోరి ... మా సమీప పూరనెమనియున్, దూరము వోయితివే నొ, మ్మేరీతిని నీకు దక్కునే కానీరా... ఆము. 6. 82.

(అధిక్షేపమునకు)

కం. ఏరాయోరి నిశాచర, యేరా వృత్రారి నెఱుఁగవే నాతోడన్, బోరాడలేవు పోరా, కోరా యభయంబు నిల్చుకోరా తనువున్... దశా. 2. 407.

కం. ఈ కారణములుగలవను, నాకొండిదియె వాసుదేవుఁ డదిగాకయుఁ గీ, డే కురువంశమున కతని, రాకయతండేమిచేసెరా పాపాత్మా భార ఉద్యో 3. 171.

ద్రు. "వచ్చు" ధాతువు మధ్యంతరూపము. వచ్చుటకు, వచ్చునట్లు మొ వర్థము నిచ్చును.

ఉ... ము, న్నచ్చట వచ్చుటన్ జెదరివట్టి బలంబులు దన్నుఁ గూడిరాఁ, జొచ్చినవారితో బలము జొచ్చినలాగును గన్న లాభమున్. విక్ర. 2. 154.

ఉ.... అపదా, ల్వెన్నెవసిండి మేడలకు రాఁ బరి యేమిల సౌధనామముల్. విజ. వి 1. 7.

సీ...., తోడిచేడియలు నాతోడి వంతులకు రానయిరింపఁ జాలఁడో నన్ను తాంగి. పాం. 1. 84.

రా². వి వృత్తియందు 'రాచ' శబ్దములోని 'చ' వర్ణము విభాషను లోపింపఁగా మిగిలిన రూపము.

చ.... వజ్రదోః. పరిఘవశీకృతాన్య వసు పాలకు లప్పురి రాకుమారకుల్. ఆము. 2. 54.

ఉ. కొండొక సేపు నిల్చిచేమ కోరిక రాకొమరుండు,...వటంబునీడఁ గూర్చుండె... విక్ర. 3. 78.

ఉ.. మంచుఁగొండ రా, చూలినిగూడె... సీలా. 1. 1.

ఉ. ...మంచుఁగొండ రా,యల్లునికిం బినాకికిఁ బ్రియంబున నూర్వశిపెట్టె భిక్షమున్. హర. 5. 46.

(కొండరా=పర్వతరాజు, హిమవంతుఁడు)

రా³ వి. (సం. రాజన్.) చంద్రుఁడు

(దీనికి వ్యస్తప్రయోగము కానరాలేదు. ఉదా: రారేక, రారాయి, మొ.)

శా....రా, రాలంగట్టిన తిన్ని యన్నిలిచెమాణ స్వాప్నీ తాపార్తితోన్. ఇందు. 3. 65.

జ: రారేక,

రా⁴=జా.

వి. (√రాయి). శిల, పాషాణము.

సీ. నేలయు నింగియు దాలముల్వాయింప... జేనుంగుపురుడో మూరా నారఁగొన గాలిగంటిడ... కు. స. 3 155.

కం. రాకొమరు నెఱులునీలవు, రాకొమరుడు నీరాకరించు రాకాచంద్రున్, రాకొట్టు మొగము. విజ. వి 1 65.

వ. ... పటిక ముపురాచేట్ట నేలలనెట్టుకొని.... మనుచ. 3. 28.

రా. సం. వి. అ. స్త్రీ. 1. బంగారము. 2. విభ్రమము. 3. దానము. 4. ధనము

రాంకలము సం. వి. అ. పుం. కటకము ము ల్చు. (పల్యము?)

రాంకవము. సం. న. అ. న. మృగరోమముతో నేయఁబడిన వస్త్రము. రోమవస్త్రము. (కంబలము, శాలువ.)

రాంభము సం వి అ. పుం. సన్యాసిధార్యమగు వెణువదండము

**రాఁజఁబెట్టు.** స. క్రి (రాఁజెన్ + పెట్టు) రాఁజు నట్లుచేయు, వృద్ధినొందించు.

గీ. ఏను సంధికిఁ బోయినఁ దాను ధార్తరాష్ట్రి మానసములఁ బగ రాఁజఁ బెట్టి, నన్నుఁ బట్టింపఁ జూడఁడె... భార. కర్ణ. 3. 124.

**రాఁజు** అ. క్రి, 1. (నిప్పు) అంటుకొను, ప్రజ్వరిల్లు

సీ. ఇల్లిల్లు దిరుగు నొక్కింతబుగ్గశిఖ యబ్బెనే నింటిలోఁ బూరియిడి విసరక, రాఁజదు రాఁజి న రవులుకో ల్వాసాలఁ గాని కల్గదు ... ఆము 4. 127.

సీ అప్రొద్దు ప్రోయిరాఁజనట్టి నిర్ధనదయు భోగించు నైశ్వర్యము లెనిమిదియు .. పాండు 1. 101.

చం పొగయక రాఁజకొక్కుమొగి భోరన మంటలు విస్ఫులింగముల్, నెగసి ... పురారినేత్రశిఖ మల్పె మహాశనిపాతభీమమై ... కు. సం 5. 528.

కం తన మదిలోపల రాఁజెడు, వనవిల్తుని కాఁకచేత వలనతియగుచున్ మనుకొన్న నెగల కోర్వక, ననుజాన్వునమన్న రాజునుం గనిచెల్వన్ యయా 5 93.

2. పొగయు, ప్రధూమితమగు

సీ. మొగము రాఁజి దివంబు మిగుల ముండెడు నర్క వహ్ని చేపట్టిన స్వాహా యొంత ... ఘటికా 1. 42.

3. దుఃఖించు.

చం. అతఁడు సితాంబరావరణమైన మహీమణి పీఠ మెక్కి యచ్యుతు నిజసింహపీఠ, గతుఁ జూచి మురాంతక యేఁతచిన్నవో, యితి మది నెంతవంతగలదీ యదువీరులు నేల చాలధీ, రతఁ దంలించి చిత్తముల రాఁజెద రన్న మురారి యిట్లనన్. ఉ. హరి. 6. 4

**రాఁబట్టు.** స క్రి (రాన్ + పట్టు) 1. ఇచ్చిన దాని మరలఁదీయు. 2. సేకరించు; వచ్చునట్లు చేయు. (శ. ర.)

సీ. ఒకటికి రెండుగా నొగి వడ్డి రాఁబట్టి ధనమెల్ల మూఁకను దాఁచుకొనుట .. రామ. 566.

**రాక = రాకడ** వి. (√వచ్చు). 1. ఆగమనము, వచ్చుట.

మ. పనగన్ వే చని దోర్బలంబున రణప్రావీణ్య ముం జూపి నీ, వసురానీకముఁ ద్రుంచి భూప్రజలకున్ హర్షంబు గావించి రా, క నుమీ రాక జయంబుతేక ప్రజ దుఃఖం బొందఁ గా రాకనీ యసువర్గంబుల పోక గా నెఱుఁగు పెక్కాడంగ నింకేటికిన్. భార. శాం. 2. 438.

కం ... కీడే కురువంశమున కతని, రాక యతం డేమి చేసెరా పాపాత్మా. భార. ఉద్యో 3 171.

ఉ అకులమయ్యె భోగ వి దె యాదల అన్నియు ప్రసన్నఁ ప్రాణముల్, రాకలఁ బోకలం బొలిసె. భాగ. 10 పూ 687.

2. ప్రసారము, వీచుట.

చం. ... వేసవిన్, మలయపుగాలి రాకలకు మానసముల్ చిగురొత్త దంపతుల్ ... ఇందు. 3. 112.

కం. ఈ కరణి నన్నృపాగ్రణి, యే కరతీయములు మాని హిమకరవిలన ద్రాకలకు న్వలిదెమ్మెర రాకలకున్ జాలిగొని విరాళిఁ బడంగన్ ... కువల. 4. 102.

3 చైత్రయాత్ర, దాడి.

చం. అది మొదలా నృపాలుని శుభాకృతి కన్నులఁ గట్టినట్లు నా, మది వలపించుచున్నయది మారుని రాకకు నోర్వరాదుగా... ఇందు. 2. 93.

అ. తండ్రిపాలు మాకుఁ దగునంచు నటియరి, తనము నేసి రాక తప్పఁగాక ... భార. ఉద్యో. 1. 250.

అవ్య. (వచ్చుధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థక రూపము.)

1. వచ్చుటమాని.

(వ్యవ.) తాను రాక కుమారునిఁ బంపినాఁడు. 2 వచ్చుటకు) నేరక, చాలక, శక్యముగాక మున్నగు నర్థముల నిచ్చును (ఈ యర్థములను క్త్వ్యంతక్రియల కనుప్రయుక్తమయియే యుండును).

గీ. అవులదాఁటి పోవను రాకయద్రికరణి, గతినమై యాఁగె నవు డంధకారపటల, మెంతయును భీతిఁ బొందితి వేను రథ్య, ముబునురథ మీద్వగా లేక ముచ్చముడిగి ... హరి. ఉ. 5. 82.

**రాక.** సం. వి. అ. స్త్రీ. 1. పూర్ణచంద్రుఁడు గల పున్నమ. 2. తొలిసమర్త యాడిన పడుచు. 3. గజ్జి, తీఁట. 4. నదీభేదము, ఒక యేఱు.

**రాకము.** సం. వి. అ. పుం ఎండ, సూర్యకాంతి. (కే. ని)

**రాకట్టు.**[1] వి. (రాయి+కట్టు). 1. శిలారత్నాది నిబద్ధభూమి. వెలకట్టు, కుట్టిమము.

ద్వి. పటికంపురాకట్టుపై నెక్కనలయు, కుటిలకుంతలి యెట్లు గుట్టలు గడచె...
ద్వి. హరిశ్చ. పూ. 1891 పం.

విశే. రత్నఖచితము, మణులు చెక్కినది.

సీ. పుంజాలదండలు పూదెలకడయాలు ముంగురులక రాట్టుటుంగరములు... ధనా. 3. 37.

రగడ. చౌకట్లుకొంట్లు చేసరులునున్ మొలకట్లు. రాకట్టు చుట్టుంగరములు బల్ చేకట్లు...
హంస. 5. 356.

వ. అవ్విరించి జనకునకు నగణంబు గామించులు గండపెండెరంబులు రాకట్టు మొలకట్టు లుంగరంబులు మొంగై మురారులంగదంబులు.
ప్రబంధ. 605.

**రాకట్టు**[2]. వి. (రాచే + కట్టు) రాజశాసనము, శాసనము

సీ. వందిమాగధుల కై వారంబువిను చెవి విబుధారి రాకట్టు వినఁగ నేర్చు ... దశా. 2. 112.

**రాకడ** = రాక. వి. (√వచ్చు.) 1. ఆగమనము.

ఉ. పోకడ రాకడల్ వశముపోవక మన్మథుఁ డావవెట్టి వ్రట్లాకలకఁరి నిల్చె వచలాకృతిఁ జిత్తరు బొమ్మకైవడిన్. కృ. శకుం. 258.

గీ. ఏలికకుఁ దమరాకడ యెఱుఁగఁజెప్పి ...
నీలా. 2. 47.

2. మల్లవిద్యావిశేషము.

వ. హస్తవీక్షణము, నయనవీక్షణము, లిత, రాకడ, ఏకసరము, పైసరము .... మల్లుపు. 2. 69.

**రాకాసి** = రక్కసి వి. (సం రాక్షసి.) రాక్షసుఁడు, రాక్షసస్త్రీ.

సీ. ఆకసంబునఁ బాఱు రాకాసుల పురాలుఫాలలోచనుఁ డవలీల గెలిచె .. వరాహ 9. 65.

ద్వి డాకాలి పెండెంబు డమరువుఁ గత్తి, రాకాసి తలలతోరపు వనమాలి ..
ద్వి. హరిశ్చ. ఉ 132 పం.

7. పగిలి రాకాసి దేహంబు మొగపుముత్యమయ్యె ముంగాముంరారి రంగైమురారి . .
మనుచ. 6. 115.

గీ. కలుషపిశితంబు మెసపు రాకాసి కాకి,
కాశీ. 2. 49

సీ. ... నేత్రైక సర్వాంగలక్ష్మి, నొప్పురాకాసి తద్వ్యతిమాని తా వనయంబు జాత్యుచితరూపంబులైన, దృక్కాణి పదగతుల్ దీపింప....
రాఘవ. 3. 74.

**రాకాసిప్రోలు** = లంక, రాక్షసపట్టణము.

గీ. విల్చి రాకాసిప్రోలు విభీషణునకుఁ, దిరముగా నిల్చి సెకబాసఁ దేరివట్టి, చాలు పేరింటి పూఁబోఁడి నోలిఁగూడి, తాను దమ్ముఁడుఁ దగ నయోధ్యకును వచ్చె. యయా. 3. 37.

జ: రాకాసి ములికి.

**రాకాసి ములికి.** వి, (√రాకాసి).

అసురాస్త్రము.

గీ. అట్లు నెఱజోదు లిర్వురు నదరి పెక్కు, గడిఁది తూఁపులఁ బోరాడునెడల నోఁకు, మిన్న రాకాసిములికి యామన్న జేని, నై నిగిడ్చిన నదిదగ్ధపఱుపుమీఱ. అచ్చ. రా. యు. 378.

రాకింమే. స. క్రి. మోఁదు, చిరుకఁగొట్టు.

కం. పోకనడగొట్టితేసియు, రాకింతుఁజుమీమొ
గంబురాచట్టుపయిన్ (శ్రీ) కాశిక నందించిన,
నీకింతట నేలపోవు నీచచరిత్రా.
భీమ. 2. 153.

రాకిడి = రాగిడి వి. స్త్రీ. శిరోభూషణవిశేషము. (జడబిళ్ల అని శ. ర.)

ద్వి. పౌజులకమ్మలు వల్లేరుపూలు, రాజిల్లు
రత్నాలరాకిడివెట్టి...
ద్వి. శ. సా. 1. 258. వం.

సీ. బటువుముత్యముల పాపటబొట్టు రాకిడి జడ
బిళ్లలను గుచ్చులడరి వెలుఁగ ...
వేం. మా. 1 130.

రాకుఁడు నం. వి అ. పుం. సూర్యుఁడు.

రాకొట్టు[1]. వి. (రాయి + కొట్టు) రాలునింపిన కొట్టు (చూ. రాకొట్టు[2]. వి.)

రాకొట్టుక్రి స. క్రి. 1. (√వచ్చు.) రారా పో రాయని యేకవచనాంతముగా నుచ్చరించు.

కం. కవుఁగిలి పొగడువేళఁ గాంతలురంతివేళ, సుతు
లుముద్దువేళ నూఁ వరులు, ంణము సేయువేళ
రాకొట్టిపిలుచుట, పాడి యుదియు మిగుల
భజనకెక్కు. ద్వా 7 65.

2. తిరస్కరించుట

కం. రాకొమరు నెఱులు నిలఁవు, రాకొమరు
నిరాకరించు రాకాచంద్రుద్, రాకొట్టు
మొగము కెంపగు, రాకఁగని పరాకుసేయు
నొఁపదంబుల్. విజ. వి. 1. 65.

వి. తిరస్కారము.

సీ. కొమ్మపాలిండ్లకుఁ కొండలీడంటి మాత్రతుకెల్ల
రాకొట్టు పాలుచేసె చమ. 2. 49.

రాకొమరుఁడు. వి. (రాచ + కొమరుఁడు. నం. రాజకుమారః.) రాజకుమారుఁడు. రాచబిడ్డఁడు.

కం వాకిలి వెడలి యొఱుంగవు, రాకొమర నియొఱుఁ
గు వలి యఃత్యాంతఃథా, పాకలవం బెట్లొ
దవెను, మాకున్న నిజంబుఁ జెప్పుమా గురు
పుత్రీ. విక్ర. 3. 123. వై వ. 2. 22.

రాకొమ్మ వి. (రాచ + కొమ్మ) రాజభార్య

గీ. క్రమ్ముచ్చుఁదవనమున రాకొమ్మఁదెచ్చినట్టి, యు
తియఱక్కనుఁ డిదె డాఁగియున్న వాఁడు.
అచ్చ. రా. కిష్కిం. 90.

రాక్ష. నం. వి. అ. నం. లాక్ష.

రాక్షన. నం. వి. అ. పుం. అఱువది సంవత్సరములలో నొకటి, ఆనంద తరువాతిది.

రాక్షసము. నం. వి. అ పుం. 1. కన్యక యొక్క బంధువుల జయించి బలాత్కారమునఁ గన్యకవప హరించికొనివచ్చి చేసికొనెడి వివాహము. (ఎనిమిది విధములగు వివాహములలో నొకటి )
2. (జ్యోతి) ఒకానొక యోగము.

విశ. (అ.ఈ.అ ) రాక్షససంబంధమైనది.

రాక్షసి. నం. వి. ఈ. స్త్రీ 1. రాక్షసస్త్రీ, రక్కసి. 2 లంక. 3. శిశిరఋతువునందలి రాత్రి 4. కోఱ, దంతము. 5. చోరపుష్పి, శంఖిని. (వృ వి.). 6 చండిక.

రాక్షసుఁడు. నం. వి అ. పుం. 1. పిశాచము. 2. రక్కసుఁడు.

రాగతాకు. వి (సంగీ) ఒక స్వరస్థాయి.

ద్వి...' అంశుకలలిత, గాఢంబులలి రాగకాకును
బొచ్చు, గాఢంబు మఱిదేశికాకును సింధు. ....
యాదిగానొగయు తాయములు.
బస. పు 3.940. వం.

రాగఖా(ం)డవము. నం వి.అ.పుం. రాగషాడవము.

రాగచూర్ణము. నం. వి అ. పుం. 1. ఖదిర వృక్షము. 2. సిందూరము. 3. లక్క, లాక్ష. 4. ఎఱ్ఱనిపొడి, బుక్కా, బగ్గుండి.

రాగచూర్ణుఁడు. నం. వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

రాగదాలి. నం. వి. ఇ. పుం. మయూరమనెడి ధాన్య విశేషము.

**రాగపుష్పము.** సం. వి. అ. పుం. 1. బంధూకము, ముంకెశచెట్టు. (వృ. వి.).

2. వాడనివియు గుండ్రముగ నుండునట్టివియు నగు పుష్పములుగల చెట్టు, రక్తామ్లానము. (వృ. వి )

**రాగపుష్పి** సం. వి.ఈ.స్త్రీ. జప,దాసనము (వృ.వి ).

**రాగప్రసవము.** సం. వి. అ. పుం. రాగపుష్పము. (వృ వి )

**రాగమంజరి.** వి. ఒకానొకరాగము, ఎనిమిది పురుష రాగములలో నొకటి.

సీ. భైరవి శ్రీరాగ బంగాళ హిందోళ మాళవులును రాగమంజరియును... ప్రబంధ. 95.

సీ. భైరవిమాళవి బంగాళ హిందోళ రాగమంజరియు శ్రీరాగ గౌళ, భూపాళలెన్మిదిపురుష రాగంబులు... హంస. 5.128.

**రాగము.** సం. వి. అ. పుం. 1. రంజనము, రంగు వేయుట, 2. రంగు, వన్నె. 3. ఎఱుపు, రక్తవర్ణము. 4. ఎఱ్ఱరంగువేయు సాధనము, ఎఱ్ఱలత్తుక. 5 అనురాగము; వలపు. 6. ప్రీతి. (సంగీత) భైరవ్యాది.

శ్లో. భైరవః కౌశిక శ్చైవ హిందోళో దీపక స్తథా, శ్రీరాగో మేఘరాగశ్చ రాగా షడితి కీర్తితాః,(భరతుఁడు).

8. కాంత. 9. మాత్సర్యము. 10 (యోగ) పంచక్లేశములలో నొకటి. (అవిద్య, అస్మిత, రాగము ద్వేషము, మరణభయము అనునవి పంచక్లేశములు. కల్ప.)

**రాగయుజము.** సం వి. జ. పుం మాణిక్యము, కెంపు.

**రాగరజ్జువు.** సం. వి. ఉ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

**రాగలత.** సం వి ఆ స్త్రీ. మన్మథునిభార్య,రతీదేవి.

**రాగవంతము** సం. వి. త. పుం. పూగము, పోఁక (వృ వి.), (వై.ని .).

**రాగవుఁడు.** విశే. (సం. రాఘవః) రఘువంశోద్భవుఁడు.

గీ వినుము కత వేల్పుజేడదారి విన్ను చూలి, మేనరుల సిట్టుపుట్టువు మేటితపసిఁ, గాంచి యిట్లనునంత నగ్గట్టుమీఁదఁ, దరలిరాఁగవుల వలికి దాఁటి చనుమ. అచ్చ. రా. అర. 2.

వి. శ్రీరాముఁడు.

అ. అంతఁ బెద్దబాపనయ్యల యానతి, వడని యొక్క మంచిగడియదోయి, యందు రాగవునకుఁ బొందుగాఁ దనపట్టిఁ, బెండ్లి సేసె మఱియు బేర్మితోడ. అచ్చ రా. బా. 192.

**రాగశాలవము.** సం. = రాగషాడవము. (వై.ని.)

**రాగషాడవము.** సం. వి. అ పుం. ద్రాక్షదాడిమాది ఫలములతో చేసిన ఒక విధమగు మధురభక్ష్యము. (విల్యమ్సు).

**రాగసూత్రము.** సం. వి అ న. 1. పట్టుదారము, 2. త్రాసుయొక్క త్రాడు.

**రాగాంగి.** సం. వి. ఈ స్త్రీ. మంజిటి మంజిష్ఠ.

**రాగారువు.** సం. విశే. ఉ. దాన మిచ్చెదనని (ధర్మము చేసెదనని) యాశపెట్టి తుదకీయక యాశాభంగము గలుగఁజేయువాఁడు (విల్యమ్సు.)

**రాగాశని.** సం. వి. ఇ. పుం. బుద్ధుఁడు.

**రాగి¹.** వి. (క. రాగి. త. ఇరాహి ) సస్యవిశేషము తవిఁదపైరు.

అ. ధాన్యవిశేషము, తవిఁదలు, చోళ్లు.

సీ. ... రాగులు, గోధుములును, యవలుగొని యున్న త్రిగుణమౌ నందుఫలము. రెట్టమతము 3. 40.

రాగిసంకటి = వండిన రాగి పిండిముద్ద.

చం. బొడ్డుగిన్నెలో, నునుతురు రాగిసంకటి తలోదరు లద్భుతభక్తిఁ జూపుమన్. శుక. 3. 385.

**రాగి².** వి. (సం. రక్తః) 1. తామ్రము, పంచలోహములలో నొకటి

గీ. చక్రి పాదమంగఁ బార్థివ స్థానమయ్యె, నొరి మీ వంశమందుఁ దాఁ గోర్వఁజాలు వారిఁ జూపుమా కుమ్మరావమున రాగి, ముంత లేఅంగఁ గలదె నీకింత యేల. ఉ. హరి. ౪.48.

2. ఎఱుపు, రక్తవర్ణము.

సీ. రాగిదేరెడు చొకాంపు నీలిచల్లడంబు ఉడంబు చీకట్ల బలము సేయ పారంగ. 3 28.

విశ. 1. తామ్రముతోఁ జేసినది

ఉదా:- రాగిచెంబు. రాగివళ్లెము. మొ.

2. రాగివలె ఎఱ్ఱనివర్ణముగలది, ఎఱ్ఱనిది. (చూ రాగిజుట్టుపిట్ట).

3. రావి, అశ్వత్థము (వృ. వి) (శ. ర., బ్రౌ)

జః రాగిజుట్టుపిట్ట.

**రాగి.** సం. విశ. (న్. జ్ న్.) 1. రంగువేయఁ బడినది. 2. రంగువేయువాఁడు. 3 ఎఱ్ఱనిది. 4. ఎక్కువ కామముగలవాఁడు, కామవశుఁడైన వాఁడు 4. రాగాతిశయమునఁ బ్రేమించువాఁడు, అనురక్తుఁడు. 6. ఆనందించువాఁడు, ఉల్లాసపడెడి వాఁడు.

**రాగిజుట్టుపిట్ట.** వి. (రాగి[2] + జుట్టు + పిట్ట). కోడి, తామ్రచూడము.

రాగిజుట్టుపిట్టతాలుపు = కుమారస్వామి.

ఆ. బొమ్మగాఁడిపాలు వమ్ములనేసిన, సొమ్మ వోయిమేటి కొమ్మమెకవు, బిరుదురాగిజుట్టు పిట్టతాలుపువాలుఁ, గోలఁగొంచగట్టు వోలె బ్రాలె. అచ్చ.రా. యు 208.

**రాగిడి.** వి. = రాకిడి. (బ్రౌ., చి, ని., వా.)

**రాగిణి.** సం వి. ఈ. స్త్రీ. 1. సంగీతాంగమైన రాగభేదము (దీని జాతులు ముప్పది. ముప్పది యాఱు అని కొందరు).

2. విదగ్ధురాలగు స్త్రీ. 3. తృణధాన్యభేదము.

**రాగించు.** సం. అ. క్రి. రాగిల్లు.

కం. చంచుల కాంతులువెన్నెలఁ, జించి యమృత ముట్టనొసఁగు చెన్నునకును రాగించుచుఁ జవినొక్కుచుఁ గబళించుఁ జకోరికలు సమ దలీలాలసలై. నిర్వ. 6 ఆ. (శ. ర.)

**రాగిలు(ల్లు)** సం. అ. క్రి. = రంజిల్లు. 1. సంతసిల్లు, సంతోషించు.

కం. దమియింపఁ దగినవారల, సమయమున దమించి వారి సంపదలు మహీ, రమణుండు దనదు బండారముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. భార. శాం. 2. 395

ద్వి. రాజులు బుధులును రసికులును కవి, రాజులు గోష్ఠిని రాగిల్లి పొగడ.

రం. రా. బాల. 4 పొ. 27 పం.

శా. ... విషవృక్ష స్ఫూర్తియుం గీర్తితా, రంజి ప్రౌఢత వట్లయ్యె నుడిపెదన్ రాగిల్లుఁడీ రందఱున్. హరి. పూ 6. 73.

2. అనురాగము కలిగియుండు.

ద్వి. అవెవచ్చెఁ గపిసేనలని కోప ముడిగి, రవి తనూజుని మీఁద రాగిల్లుచుండె.

రం. రా. కిష్కిం. 223 పొ. 20 పం.

3. ప్రకాశించు, శోభిల్లు.

వ ... కటికిచీకటి మొత్తంబు మధ్యంబున నిగ నిగని నెమ్మేను దీఁగె రాగిల్ల నల్లన వసియించె..

విప్ర. 3. 60.

కం. ... చూడన్, రాగిల్లుచును, దదగ్రిమ, భాగంబున నున్న కనకపాత్రము లేమిన్. విప్ర.5.4.

4. గర్వోక్తులు పలుకు

ద్వి. రావణుతోఁగూడ రాక్షసప్రతతి, వేవిధంబులనైన నేమె చంపుదుము, రామభూపాలక రణమున ననుచు, రామునిముందఱ రాగిల్లు వారు. రం రా. యు. 282 పొ. 19 పం.

**రాగుఁడు.** సం. వి అ. పుం. 1. రాజు, ఱేఁడు. 2. సూర్యుఁడు 3. చంద్రుఁడు.

**రాగె.** వి. అంకవన్నె, గుఱ్ఱము నెక్కుటకు పార్శ్వములయందు త్రాటితో నేర్పఱచిన మెట్టు.

గీ. వాజిగుణమును రాగెయు వాగెథూమి, మూన
మును శరశస్త్ర సంధానములును ...
ప్రబంధ. 184.

ద్వి. రాగెలు బిగియించి రథనంబుతోడ, వాగి
య సడిలి చున్నవనెండుగడల. దాటించి..
ద్వి. పరమ. 2. 280 పా.

ద్వి. ... సిద్ధుడు కోపగించి, . , రాగెలు బిగి
యించి రవళినేయనుచు, ....
ద్వి. పరమ. 2. 82 పా.

**రాఘవము.** సం వి అ. పుం. 1. ఒకజాతి పెద్ద చేప. 2. సముద్రము.

**రాఘవుడు.** సం. వి. అ. పుం. రఘురాజవంశమునఁ బుట్టినరాజు, రాముఁడు.

**రాచ.** వి. (సం. రాజ) రాజున్. (దీనికి సమాన పూర్వావయవముగానే ప్రయోగములు కన్పట్టుచున్నవి. "విశ" అని శ. ర )

ఉదా: రాచవాడు, రాచటికము.

జ: రాకట్టు[2], రాకొమరుడు, రాకొమ్మ, రాచకందు, రాచకుఱుపు, రాచకూఁతురు, రాచకొడుకు, రాచజడదారి, రాచజాపిల్లి, రాచజిల్లేడు, రాచదారి, రాచనగరు, రాచనడక, రాచనెలవు, రాచపగ, రాచపదవి, రాచపట్టె, రాచపాడి, రాచపుంపు, రాచపుట్టువు, రాచబావఁడు, రాచమాట, రాచయీవి, రాచటికము, రాచనన్నెము, రాచవాఁడు, రాచవీథి రాచవేఁట, రాచవేల్పు, రాచసింగము, రాచసిరి, రాచిలుక, రాచిల్కదొర, రాచూలి, రాతఱిసి, రానిరాజారి, రాపట్టి, రాపులుఁగు, రాయంచ రాయంచగిండి, రాజేఁడు, రాసాని రాకంగము, రాసిరి.

**రాచకందు.** వి. (రాచ). రాజకుమారుఁడు.

సీ. జడదారి నెలదండఁ జని క్రచ్చఱగయాళి
రాకాసిఁ జెండిన రాచకందు.
అచ్చ, రా. అయో. 98.

**రాచకిక్కి.** వి. (√రాయి.) రాతిప్రదేశము.

సీ. కనుపట్టె నీశైలమున దశకన్యకాధవుఁడు
సామాన్యపుఁ దపసివోలె, నొకవిన్నరాచకిక్కనుండు నీగిరి వలకాపట్టణంబు పక్కణముపోలె. వరాహ. 6. 87.

**రాచకుఱుపు.** వి. (రాచ). ప్రాణాంతకముగా వీఁపున లేచెడి మహావ్రణము (శ. ర.).

**రాచకూఁతురు.** వి. (రాజ.) రాజకన్య.

చం. శరశతమైదుకైదువుల జంతయటంచువిరాళి.
కొగ్గిడ,గ్గఱుటయు రాజకూఁతురుల గాలిబి
గిలికి సోఁకశక్యమే. చం. రా. 299.

ఆ. కొడుకుఁగాంచు రాచకూఁతు రెద్దానికి, వట్టి
పనికి నుచితమైన సమయ, మొదవెఁ దడయు
టెంక నొప్పదు జనములు, వట్లు గాని పురుషు
లవరు మిమ్ము. భార. ఉద్యో. 3. 199

**రాచకొడుకు** వి. (రాజ ) రాజపుత్రుఁడు.

ఆ. రాజకొడుకు లెల్లఁ జూచుచునుండిరి.
భార. ఆది. F. 207

**రాచజడధారి.** వి. (రాచ.) రాజర్షి.

గీ. రాఁజనముఱతమా వేల్పురానులవీదు, రాచసిరి
మానివీనికా రాచఱంబు, రాచబావని మాటకు
రాఁజనునొకొ, రాచజడదారిలీల నీరాచ
మాల. ఉ హరిశ్చ. 4. 167.

**రాచెట్టు.** వి. (√రాయి.) చెట్టురాయి, భూమగ్న శిల, చెట్టు.

కం. సోకనఁ గొట్టితేనియు, రాకింతఁ జుమీ
మొగంబు రాచట్టుపయిన్, శ్రీకాశిక నిండించిన
నీకింతట నేలపోవు. నీచచరిత్రా భీమ. 2 158.

కం. గట్టిగను మూఁగదయ్యెము, వట్టివదొ కాశ
కట్టొ ఒలు రాచట్టో, యిట్టులు మనమింద
ఆమను, జట్టుఁ బిలువఁగ నొకింత చూడకయున్నే. వాల్మీ 8. 118.

రాచేజాబిలి. వి. (రాచే) రాజచంద్రుఁడు. రాజశ్రేష్ఠుఁడు,
గీ. ... పెద్ద, లెన్ననారా చేజాబిలి చెన్నుమీఱు.
నీలా. 1 43.

రాచేజిల్లేడు వి. (√రాచే) రాజార్కము, క్షాష్ఠీలము (వృ వి)

రాచేదారి వి (√రాజ.) రాజమార్గము, రాచేబాట.
గీ తేరులా కొమ్ము కేనుఁగు బారులావ, సారులా చౌక్కటపు రాచేపారులా కొ, టారలా తీరులా గొవరాకునౌర, ప్రోలియొయ్యారి మేరిక గొగడవరిది. అచ్చ రా. బాల. 34.

రాచేనగరు వి (రాచే) రాజసంబంధమైన గృహము,
సీ. వన్నిటతోఁ గదంబముఁ జేసి పూసినమ్మృగహాభిపన రాచనగరు దెలుప. ఆము 2 75.
గీ గ్రహణ సంక్రమణాదుల రాచనగరఁ, గాసు వీసంబు లెడలమి గ్రాసమునకు, నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని, లెస్సయుండుసె గృహకర్తలేని బ్రతుకు. మనుచ. ... 129

రాచేనెలవు వి. (రాచే.) రాజధాని, రాజు నివసించు చోటు.
గీ. చేరి జేజేలు మఱి జడదారిగములు, నచ్చటలుఁ గొల్వ వేగమ్న లతని మొదలి, రాచనెలవే లెఁ గేణ్మనేరాజుతంబ్రిడి, యతఁడు గొనియాడ నెగడె యయాతి పుడమి యయా. 1. 19.

రాచేపగ. వి (√రాచ.) 1. రాజశత్రువు.
ఆ. ఇట్లుచాలుపేరి యొలనాగఁ బెండ్లియై, గాధివట్టి వనిచి కదలి చనుచు, దెగి యెదుర్చు రాచపగ నేలవేలపు, భీరమెల్లఁ జక్కఁబెట్టి యంత. యయా. 3 13.

2. క్షత్రియుఁడు వహించు విరోధము (వా.)

రాచేపదవి. మి. వి. (√రాచే.) రాజసంబంధమైన ఉన్నతస్థితి.
ఆ. అందంబు ... కంబగట్టుభూమి కానిక గఁగ బెం, పెసఁగు రాచబదవు లెల్లఁ బడసె.
దశకు 1. 21.

రాచేపట్టి. వి. (√రాచే.) రాజపుత్రుఁడు.
గీ. తనకనలు చేష్టలంత భీతిని ఘటింప, మగిడి శరణన్నఁ దన్మహిమయుఁ దదాత్త, తన్మహాదైన్యము గణించి దయ దలిర్పఁ, గాచె నేమన నప్పుడా రాచపట్టి రాఘవ. 2 109.

రాచేపాడి. వి. (రాచే.) రాజధర్మము.
సీ. అక్కట రాజాన్వయంబునఁ బ్రభవించి నీచుఁడై. యేమియు రాచపాడి, యెఱుఁగక నడురేయి యెల్లజనంబులు సుప్తులై యుండ గఁ జోరునట్లు, ననుదెంచి నెవ్వఁ డాతనిఁ గోరి వెదకెద. హరి. ఉ. 6. 149.

(క్రొత్తప్రతి. పా. రాచపాటి. ప్రాతప్రతి. పా.)

రాచేపుండు. వి. (రాచే) రాజవ్రణము.
సీ. . రాచపుండనఁగను రాజవ్రణము పేరు తేజరిల్లు. ఆం. భా. 2. 130.

రాచేపుట్టువు. వి. (రాచే.) క్షత్రియుఁడు.
కం. రంగుగఁ జూపఱ కోర్కులొ, సంగన్ డోనంబు లడఁపఁ జనుదెంచిన యా, గంగం గని మైయెల్లను, బొంగం దగ్గ మ్రొక్కె రాచపుట్టువు మదిలోన్. యయా. 2. 45

రాచేబాపఁడు. వి (రాచే.) విశ్వామిత్రుఁడు
గీ. రాఁజన సులభమా వేల్పురాచవీడు, రాచసిరిమానివీనికౌ రాచలంబు, రాచిబాపని మాటకు రాజనునొకో, రాచజడరారిలీల నీ రాచమాల. ఉ. హరివ. 4. 167.

రాచేమాట. వి. (√రాచే,) మంచిపలుకు.
సీ జమునిల్లు సొచ్చిన జంతువునైనను గాచునెమ్మోయనను రాచమాట
భారం. విరా 2. 204.

రాచేయావి. వి. (రాచే) రాజుబుచేయు దానము.
ద్వి. ఈ చతురోక్తుల కేమికారణము, రాచయావుల నమ్మరాదను మాట, యీ చందనమున నిల్చె,
ద్వి. హరివ. పూ. 1405 పం.

రాచేతిక(ర్క)ము. వి.(రాచ + తికము.) 1. క్షత్రియత్వము.

ఉ. ... విరాళిగాకయే, రంపెల గొట్టుగాక బలు
రాయిడికత్తియగాక యెప్పుడున్, పొంపొక
యింతలేనియెడ జూదరికత్తియగాక యెంత
యున్ ... ధనాభి. 2.60.

రాయు. అ. క్రి. 1. ఒరయు, స్పృశించు.

సీ. రాజుల నందడి రాసిన తొడవులు మురిసి
రాలిన పొడి ముగ్గుగాఁగ.
భార. విరా. 3. 74.

సీ. వరుసఁ దరతరంబ వనములు సత్ఫలరాసు
లయినభంబు రాయుచుండు ...
కు. సం. 7. 930.

మ .. కీర్తి ప్రవాహంబు వా,రణగండ స్థలకుంభ
కూలముఃతో రాయుం దివారాత్రముల్.
నైష. 2. 42.

2. ప్రతిఘటించు.

గీ. మెఱసి మూఁడులోకంబుల మేటిమగలు, రాయ
నేర్తురె యాదవరాముతోడ. ఉ. హరి. 1. 8.

క. తారకితగగన చక్రము,తో రాసెవనంగ రేలు
తొగపువ్వుల నొ,ప్పారె విపులనిర్మల కా,సారం
బులు సారస ప్రసవ సేవ్యములై.
హరి. పూ. 7. 115.

సీ. తారకా మందార తారాచలంబులతో రాయు
నెవ్వాని చారుకీర్తి.. క్రీడా. 14.
(ఇట నౌపమ్యద్యోతకము).

3. కలహించు.

సీ. తమలోన రాసి భూధవులు చూఱలు గొన్నఁ
గఱములెల్లను పోయి నెలవు వెదలి,
హరి. ఉ. 9. 56.

గీ. రజకితోడ నుదక్యతోశ్రమణతోడ, విధవతో
నాథుతో రాయు వెలఁదితోడ, జెడిపెతోఁ
జూలఁ బోరామి నేయఁజనదు, ప్రాణసంకట
ములను బుణ్యాంగవలకు ... కాశీ. 2. 74.

కం. వైరులు రాయుట హితస,త్కారముపక
యనువులిచ్చెఁ దస్కరుఁడు ....
వేం. పంచ. 3. 217.

కం. భారతవర్షమువకుఁగాఁ, గౌరవులును పాండ
వులును, గాంతం గడుఁబె,ల్లె రాసి యెం
డొరులతోఁ, బోరందెగి రిట్టి లుబ్ధబుద్ధులు
గలరే ... భార. భీష్మ. 1. 28.

4. రాల్పడు, (గొంతు) కంపించే.

ద్వి. రాసిన యెలుఁగును రథమార్గధూళి, ధూన
రంబగుమేనఁ దూలిపైకొంగ, తుంగస్తనంబు
లఁదోఁగ నుగంద, దొంగలి ఱెప్పలం దొరఁగు
కన్నీరు ... రం. రా. ఉ. 122. పొ. 26.పం.

ఉ. గొంతులు రాయఁ గో యనుచుఁ గూతలు
వెట్టిరి గ్రామ్యభూసురుల్ ... పాంచా. 2.52.

5. చొచ్చు, ప్రవేశించే.

చ. అదిమొదలీ వధూటి విరులంటదు కస్తురి
గీరుబొట్టు పెట్టదు పువుఁదోఁట రాయదు
పటంబులు వ్రాయదు .. కువల. 3. 78.

6. ప్రకాశించే.

ఉ. చొక్క యొకింత నిక్క బలసూదనుదిక్కున
రాయుచుండుటన్, జక్కఁగ వేఁగదిప్పుడు
నిశాసమయం బిది ... క్రీడా. 51.

ఇ రాపాడు, రాయడి, రాయింత, రాయిడిం
రాయిడించే, రాయిడికత్తె.

రాయుఁడు. సం. వి. అ. పుం రాజు, ప్రభువు.
(విట్యమ్ము.)

రారాజు. వి. (సం. రాజరాజః) 1. రాజులకు రాజు,
చక్రవర్తి, సార్వభౌముఁడు. (శ. ర.)

2. కుబేరుఁడు.

గీ. రంభ రంభాభ్రమఫలసమగ్రంబుగాఁగ, నమృత
దివ్యాన్నభిక్ష కామారి కొసఁగె, రావుఁ జన్ను
లనడుమ రారాజుపట్టి, పట్టియొత్తిన నఖరేఖ
బయలుపడఁగ. హర. 5. 43.

3. దుర్యోధనుఁడు.

గీ. ...రారాజనన్గనిలజునకు, దుస్ససేను మంది
రము పార్థుకు వరుస,తోడ దుర్మర్షణుఁడియును
దుర్ముఖునియు, నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె
నృపతి. భార. శాం. 1. 398.

గీ. చెలఁగు దుశ్శాసనుఁడు దుస్సనేనుఁ డనఁగఁ, బ్రబలు దుర్యోధనుండు రారాజన దవ...
ఆం. భా. 2. 182.

రారాపు. వి. (రాపు+రాపు) మిక్కిలి యొరయిక, ఉపద్రవము.

శా. ఏ గంధర్వుఁడు దర్పవిలాసములు మున్నీక్షించి లోనెంతయున్, రాగాంధుండయి కోరి హత్తక కడున్ రారాపులం గంతుఁడు, ద్వేగం బందగఁ జేయ నెవ్వగల నువ్విళ్లూరుచు న్వేగువాఁ, డా గంధర్వ కుమారుఁ డంగభవవిద్యాపారగుం డాత్మలోన్. మనుచ. 3. 68.

రారేక[1]. వి. (రా[3]+రేక.) చంద్రరేఖ.

సీ. రారేక నుదుటిపై రత్నాల క్రొందళుకు రావి రేక బెడంగు రహిఁ జెలంగ... ఇందు. 2, 141.

శా. రారేకన్నగు చెక్కుటద్దములు దోరంబార నానందవుం, బారావారములో మునిఁగి కులుకుం జాలిండ్లపైఁ బల్మలున్, జీరల్జాఱ...
బహు, 3. 58.

రారేక[2]=రావిరేక. వి. 1. పిల్లలకు ముందు సిగను గట్టెడు రావియాకువంటి యొక నగ.

కం. అక్కు ధరపుత్రి వాకున్, ముక్కంటికి వేలు లేదనుచుఁ దెలుపుటకున్, మిక్కిలి కనుదాల్చిన గతిఁ, జక్కని రారేక నెన్నొసల దరియించెన్.
వరాహ. 6. 6.

సీ. బుడుత కల్వల విందుఁబోలు నెన్నొసలిపైఁ జెలువంపు రారేక చిందులాడ, ...
నీలా. 1. 75.

2. కర్ణభూషావిశేషము.

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన రావిరేక మురువనఁగఁ గర్ణభూషావిశేషము ల్పొచ్చు ...
ఆం. భా. 2. 148.

రారేఁడు. వి. (√రాచే.) రాజులకు రాజు, చక్రవర్తి.

కం సదమదమగుచుండిరి య,మ్ముదితయు రారేఁడుఁ గూర్మి ముంచుకొనంగన్ ...
యయా. 5. 152.

రాలకాష్ఠము. సం. వి. అ. పుం. సాలవృక్షము.

రాలఁగొట్టు. స. క్రి. (రాలన్+కొట్టు) రాలుచు, రాలునట్టుచేయు (శ. ర.).

రాలము. సం. వి. అ. పుం. సాలవృక్ష నిర్యాసము, సాలవృక్షముయొక్క జిగురు.

రాలించు. స. క్రి. (√రాలు) రాలుచు, రాలునట్లు చేయు.

సీ. మావితోఁపులు పండి మహిమీఁద రాలించి మొక్కలు మొలిపించుఁ బెక్కుగాను ...
రామలిం. 94.

రాలు. అ. క్రి. 1. గళితమగు, క్రిందఁబడు.

గీ. రాలియున్న పుష్ప ప్రకరము విదిర్చి, చెమ్మగానున్న నేసిన సెజ్జయనఁగ, వేగుటయుఁ జుక్క లన్నియు విశద, భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు. భార. విరా. 2. 239.

శా. రారాపిళ్ళ భుజాంగదంబుల మణుల్ రాలంగ విద్యాధరుల్, గారామొప్పఁగ నెత్తికొంత్రు నను... మనుచ. 4. 76.

గీ. కృతపయఃపాన నవమేఘ పృథుకములకు రాలె నొయ్యవడగండ్ల పాలపండ్లు,...
ఆము. 4. 82.

శా. ... ఈ కంథచే, వేలతుల్ కనకంబు రాలు విద్రుపన్ విశ్వంభరాధీశ్వరా ... విక్ర. 2. 7.

2. విఱిగిపడు.

శా. వాలోత్క్షిప్తగిరుల్ సురారిపురిపై వ్రాలన్ విశీర్ణంబులై, రాలె న్గోపురముల్ గ్రహంబులురలెం బ్రాసాదముల్ నుగ్గులై, తూలెన్ ...

3. నశించు.

శా. నీ బాణంబులు రాల నీ ధనువు ఖండీభూతమై పోవ నీ, జోబిల్లిన్ ఫణియంట నీబలము లాశావిథిపాలై చనన్. నీ జంత్రౌత్సుకవంబు స్త్రీల తొడనే నిన్నెవ్వరు న్నవ్వరే. మాబాలామణి వేఁచఁ బోకు మకటా మర్యాద గాదాత్మజా.
ఇందు. 4. 58.

4. అతిశయించు.

సీ ...గీ. యోగికై వడి మిగుల విరాగిరీతి, వదియె లోకంబుగానున్న యాపదంతి, నేఁప రాలెడు తమ్మిరుమ్మి పిరంగి, వీరుమటు మాయ మాయింప నేరదయ్యె. స దంశా. 2 157.

జ. రాలఁగొట్టు, రాలించు, రాలుఁగాయ, రాలుఁగాయతనము, రాలుగొను, రాలుచు, రాలుపు, రాలువారు.

**రాలుఁగాయ** విశ (√రాలు.) తుంటరి, దుష్టుఁడు (చూ. రాలుఁగాయతనము)

**రాలుఁగాయతనము** వి. (రాలుఁగాయ+తనము) దుండగము.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెఱిగి, కాఁకఁ నుదేఱ గడిమీఱి గట్టిపారి, రాలుఁగాయతనాన బేంజుపుదారి, నాఱితేఱియు బలు గుంటమారి యయ్యె.. హఁ. ప. 5. 110.

**రాలుగొను** అ. క్రి. (రాలు+కొను. స్వార్థమున) గశితమగు, క్రిందఁబడు.

చం. అదరు నవాంబుధారలు జటాటవిలోఁబడి విభ్రమించి వెల్వడ చనుదెంచి రాలుగొని వక్షములన్ వెడనిల్చి.. కు. సం. 6. 767.

**రాలుచే(ల్చు)** స. క్రి. (√రాలు.) 1. రాలునట్లు చేయు.

చం... పాదపంబుల వెన వేళ్లతోఁ బెఱికి పువ్వులు రాలించి దొల్లఁ దాఁచి...భా. రా సుం. 333.

సీ. వనదేవతాగాత్రమునను చైత్రుఁడు నించి కడఁగి రాలిచిన చిక్కని మనంగ ...

ఉ. రా 6. 5.

శా. రక్ష స్సైన్యములోఁ గబంధములు గృధ్రంబుల్ వటించెన్ ద్రిలో.కక్షోభంబుగ మేఘము ల్గురిసె నిర్ఘాతాస్థిమాంసాస్రముల్, వక్షము జేవ మునొప్పు నిప్పుకలు గూబల్ చూపులన్ రాల్చె.

ఉ. రా. 2. 32.

2. విదలించు, దులుపు.

ద్వి. . తలిరుల రాల్చి పత్రంబుల దుల్చి....

ద్వి పారిజా. పూ. 1211 పం.

గీ. .. రాల్చె జాడించె ననఁగను రహికి నెక్కు, విదిలి చెనటన్న పలుకగా వేదవేద్య ...

అం. భా. 3. 132.

3 చేల్లు.

మ. .. ద్విజానగుల్ క్రతిహితా వ్యాజాము లాపంబుతో, నలఘుశ్రీకరకాంచల వినిర్ణత్కాసరార్ద్రాక్షతంబులు రాల్చెన్నర దేవ రత్నమకుటీభూషావిశేషంబుగన్.

వసు. 1. 150.

**రాలుప(ల్ప)డు.** అ క్రి. (ఎలుఁగు) కంపించు.

ఆ. అంగ వీరినాథుఁ డగ్నిలోఁ బడుటకు, శోకవహ్నిఁ జత్తమాకులముగ, నెలుఁగు రాలు పడఁగ నిట్లు పలవించె.

భార. శాం. 3. 329.

గీ. .. పంరగద్గదికా వ్యక్తి కాకు వికృతి, రాలు పడఁ బండ్లిగుల్చుచు దీలుపాటుఁ, బ్రకట దైన్యంబు దోఁప లోభంబు వచ్చె.

నైష 7 52

కం. చంచుములు వడ కు ... బ ... పళమా నొడలు రాలుపడు నెలుఁగావా, మరణమున నెట్టి చిహ్నము, లరయన్ యాచకుఁడు ధ్రాల్చు నచ్చిహ్నములన్. వేం పంచ. 2. 142.

వ. కొండొక సేపునకు మూర్ఛదేఱి యన్నాపాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె ...

భార. సౌ. 2 12.

ఉ పసివ నింతినొచ్చి నెలుఁగెంతయు రాల్పడఁ గోప జృంభణంబు, జేసి ముఖా మొప్పఁగ.

భో. రా 5. 102.

జ. రాలుపాటు.

**రాలుపాటు** వి. (√రాలుపడు.) గద్గదము, కంపనము.

చం. వెలిచిన కన్నునీరు జడివెచ్చని చేన్నుల మీఁది వేఁడియున్, దొలకరి ఘర్మతోయములతోఁ గలసె న్మొయి ద్రూనుపాటుతో, నెఱఁగుప రాలుపాటొదవె నెక్కు వివర్ణతతోవ లోపలం, గలగొనె నారటంపుఁ బులకంబులతోఁ బొడ తెంచెఁ గంపమున్.

ఉ. హరి. 5. 112.

**రాలుపు** వి. (√రాలు.) రాలుట.

సీ. ఆకురాలుపు గండ్ల నానెడు నాస నింతడు గూఁది బంకంటి యంగలార్చి ...

ఆము 5. 117.

**రాలువారు.** ల. క్రి (√రాలు) జాలు, ప్రవహించు.

సీ. వర్ణన తెల్లచో వర్ణనకెక్కంగ రసములు ఒలుకొత్తి రాలువారి ... కు సం. 1. 36.

**రావడి** = హోవడి వి. ఉపద్రవము. (శ. ర.)

**రావణగంగ.** సం. వి. ఆ. స్త్రీ. లంకాపురమునఁ బ్రవహించునది

**రావణహస్తము.** వి. వాద్యవిశేషము.

వ. .. పికిళులు బచ్చికోల్లు రుద్రవీణియలు స్వరమండలంబులు తంబురలు కిన్నెరలు రావణహస్తంబులు రబాబులు .. ప్రబంధ. 605.

వ. కాహాళుల్ డోల్లు శంఖములు రావణహస్తములు డిండిమంబులు .

(బలరామచరిత్రము) (బ్రౌ ని.)

**రావణారి.** సం. వి. అ. పుం. శ్రీరాముఁడు, రఘురాముఁడు

**రావణి** సం వి ఇ.పుం. ఇంద్రజిత్తు, మేఘనాదుఁడు.

**రావణుఁడు** సం. వి. అ (అ అ అ.) అఱచువాఁడు, రోదనము చేయువాఁడు.

వి అ పుం. రాక్షసముఖ్యుఁడును, లంకాధిపతియునైన రాక్షసుఁడు.

**రావము.** సం. వి. అ. పుం. 1. అఱపు, బొబ్బరింత, జంతువుల యఱపు. 2. ధ్వని.

**రావి** = రాగి. వి. అశ్వత్థము (వృ. వి.).

ద్వి. రావులఁగొట్టి వారణములఁగట్టి మావులఁబట్టి గ్రామమ్మవులఁ గట్టి ...

ద్వి. హరిశ్చ. పూ. 1207.

కం. . . . చివురలఁ గెం, పారు నొక పిప్పలముఁ గని, యా రావిన్వాదసాక్షికై వేఁగొనుచున్.

ఆము. 4. 57

సీ. రావి మామిడి కొండరావి మేడియు బ్రహ్మ మేడియు జీడమామిడియుఁ జింత ...

హంస. 4. 11.

జ: రావిరేక.

**రావించు.** స. క్రి. (√వచ్చు) రప్పించు వచ్చునట్లు చేయు.

కం. రావించి తగవుమై సంధానింపవకాక నాఁడ పాండవులఱుసం, బోవిడువరె మిగలుడురే, నీవచనంబునకుఁ నిలిచి నిలుపుము ...

భార. ఉద్యో 2. 206.

కం. కావున శ్రీనగమునకేఁ, బోవఁగ నూహించి మిమ్ము బోధించుటకై, రావించితి నా వాక్యము. భావింపఁగవలయు నిపుడు పరమార్థమునన్ ... విక్ర. 1. 202.

కం. ... చూతముగా, రావింపు మటన్న నాఁటి రాత్రి చనంగాన్ ... ఆము. 4. 55.

**రావిపూరాజనాలు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. ... పలిక రాజనా లీశ్వరప్రియములు రావిపూరాజనాల్ రత్నసరులు, ...

హంస. 4. 128.

వ. ... వంగాకుబుడమలు ప్రయోగలు పసపుగన్నేర్లు గుత్తి బలుగుత్తులు రావిపూరాజనాలు పొన్న శ్రీరాజనాలు నివ్వరులు ...

ప్రబంధ. 112.

**రావిరేక** = రారేక², రాప్రేక, వి. (√రావి.) 1. పిల్లలకు ముందుసిగయందుంచెడు రావియాకువంటి ఆభరణవిశేషము.

సీ. ... రారేక నుసటిపై రత్నాల క్రొందళ్కు
రావిరేక బెడంగు రహిఁ జెలంగ ...
ఇందు. 2. 141.

ఉ. మువ్వలు గంటలు న్మొరయ ముందటి కూఁకటి
రావిరేకతో, నవ్వనజాతుఁ డాడు ...
హరి. పూ 5. 191.

2 కర్ణభూషావిశేషము,

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన
రావిరేక మురువనఁగఁ గర్ణభూషావిశేషము
లొప్పులు ... ఆం. భా. 2. 145.

**రావు.** వి. (సం. రాజన్.) రాజు. (ఇది కొన్ని విశేష్యముల కడపటఁ బ్రయుక్తమయి శ్రేష్ఠార్థక మగును.)

సీ. ... సింగపుఁగొదమతేజీరావు రవద్రొక్కఁ
బొగరెక్కి త్రిశిఖుఁడు దగిలి వెడలె, .
రామా. 8. 67.

**రావుతు(ఁడు) = రావుత్తు.** వి రౌతు, సాది.

అయఃగ్రాహి. రావుతుల తుండములు మావతుల
ముగ్గుఁదురు గావలికవంబులు గజావయవరాశీ,
భావభయదస్థలులు ... భార. స్త్రీ. 2 5.

ఉ. గిబ్బపటాణి రావుతుఁడు గెల్పొసఁగుం గృతినేత
కెప్పుడున్ ... చం. రా. 1. 2.

ద్వి. హితులు భృత్యులు పురోహితులును రాజ,
సుతులు బండరులు రావుతులు లెంకలును ...
పండితా. వాద. 172 పు.

గీ రవుతు రౌతు రావు తనఁగ రాహుతుఁడగు ..
ఆం. భా. 2 203.

**రావుత్తు (డు) = రావుతు, రాహుత్తు.** వి (క. రావుత. త. ఇరావుత్త. మ. రావుత్తు. మహా. రాహుతా) రౌతు, అశ్వసాది.

గీ ... తొలు కారుకలఁక పులుఁగు మావు రావుత్తు
నిలిచె బ్రాహ్మణుని బ్రోల...పాండు. 1 51.

ఉ ఏరికమోముతా లెవులుక నెక్కిన రావుతు
రాజు... భీమ. 1. 2.

**రావెడలు.** అ క్రి. (రాన్ + వెడలు) పైకివచ్చు, పైకిఁబడు.

కం. జలరాశిఁ దిమి తిమింగలములు నాఁదగు మీల
సత్వములు వినలేదే, కులశైలనుతుఁడె జలచర,
ములతో రావెడల నమియుఁ బుమకల
తోడన్...

**రాశ్రేక = రావిరేక.** వి. పిల్లలకు ముందుసిగ యందుఁ బెట్టెడి రావియాకువంటి భూషణ విశేషము

సీ. మొలక కూఁకటిఁ గ్రాలు ముత్యాలరాశ్రేక
ధసితంపు బొట్టుతో బాదరింపఁ, బాలబుగ్గల
కాంతిపల్లవంబులతోడఁ జిన్ని లేనగవులు
చెలిమి సేయ... కాశీ. 3. 240.

**రాశి.** సం. వి ఇ పుం. 1. ప్రోగు, సమూహము, గుంపు, మొత్తము. 2 (గణిత) లెక్కకై వేసిన యంకెలు, వ్యక్తావ్యక్త గణకేనము 3 రాశి చక్రము యొక్క ద్వాదశాంశము, మేషాది. 4. పరిమాణవిశేషము, ఆఢకము (కే ని).

**రాశిచక్రము.** సం. వి అ న మేషాదిరాశుల చక్రము.

**రాశిభోగము.** సం వి అ. పుం. సూర్యాదిగ్రహముల గమనము.

**రాష్ట్రము** సం. వి. అ. న. 1. దేశము, రాజ్యము. 2. మండలము, దేశభాగము (పండ్రెండుగ్రామములపైనున్నది) 3. ఒక దేశపుజనము, ఆ దేశస్థులగు ప్రజలు. 4. ఉపద్రవము. 5 ప్రాణి. జీవి. (వై. ని).

**రాష్ట్రిక** సం. వి. ఆ. స్త్రీ. నాకుఁడు (స్ప. ని). (శ. ర.).

**రాష్ట్రియుఁడు.** సం. విశే. (అ ఆ. అ.) రాష్ట్రముసకు సంబంధించిన వాఁడు.

వి అ. పుం. (నాట్య). రాజస్యాలుఁడు (రాణి యొక్క సోదరుఁడు.).

**రాష్ట్రియుఁడు** సం. వి అ పుం. = రాష్ట్రియుఁడు.

రాసకము సం. వి అ. న. దృశ్యకావ్యభేదము, ఒకానొక ఉపరూపకము.

రాసభము. సం వి. అ. పుం, గాడిదె, గార్దభము.

రాసభవందిని. సం వి ఈ. స్త్రీ. మల్లిక, మల్లి (వ్య. వి.).

రాసమండలము. సం. వి. అ. న. రాసక్రీడ, గోపికలును శ్రీకృష్ణుఁడును మండలాకారముగఁ జేసిన నృత్యము, అట్టిప్రదేశము, మండపము.

రాసము సం. వి అ పుం. 1. అఱపు, కోలాహలధ్వని. 2. (సామాన్య) ధ్వని. 3 సల్లాపము, మాట 4 గోపికలును శ్రీ కృష్ణుఁడును గలసి యాడిన యాట, రాసక్రీడ. 5. పరిహాసము. 6. ఒసము (శ. ర.).

రాసయాత్ర సం వి ఆ. స్త్రీ. కార్తిక పూర్ణిమనాఁడు జరిగు భగవదుత్సవము (వాచ)

రాసాని వి (రాచే+సాని). రాజుభార్య.

ఉ. పైనపుదట్టి గట్టుకొని బద్దులపుట్టిక వెంటరాఁగ రా,సాని పసాని నవ్వునెల జవ్వనిరాఁగని యొక్కసాని యో,సాని మిటారి నీకు దొర సాసికి నీవడ చెల్లదించు భూ,జానిపటానిగా యవక జిక్కి వెసం దిగికొమ్మకొమ్మనెన్. రా వి 2. 59.

రాస్తా వి. (హిం. రాస్తా) రాజమార్గము, బాట.

సీ. కలుపల దొర చల్లగాలి వజీరులు పూనిరాస్తాను చపాను గొలువ .. గీ. మదనువాదుసవాదండు గదల నపుడు. అని. 3. 19.

రాసి. వి. (సం. రాశి), 1. ప్రోఁగు, పుంజము.

శా. . తి న్నానశేచ్చన్ బిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్, రాసుల్ గా నిడి చిచ్చువెట్టఁ బనిచెన్ రౌద్రంబులో భృత్యులన్. భాగ. 10. పూ. 1672.

(ఇట శ స. ప్రాసము)

గీ .. ఋష్యయన రాసి యనఁగను గువ్వయనఁగ, వాశి యగు... ఆం. భా. 2. 101.

2. మొత్తము.

ద్వి... రాసి నీకెదురుత్తరంబులు వల్క, నా సరోజాతుండు నలుకు నే నెంత...

ద్వి. హరిశ్చ. ఉ 2628 పం.

3. మేషాదిరాశి, (శ. ర.).

రాసికెక్కు=ప్రసిద్ధికెక్కు.

ద్వి. ధరనెవ్వరేఁ బంతతఁగీర్ణయము, సేసి యూళుల్కంబుఁ జేకొనుం డనుచు. రాసికినెక్కమర్యాదగావించి.

ద్వి. పదమ. 5 667 భా

రాసింగము. వి. (రాచే+సింగము). రాజసింహము, రాజశ్రేష్ఠుఁడు.

దండకము. ... దుర్లభాగతమానవ మత్తేభయూథంబులం జించిచెండాడు రాసింగమున్ సింగభూపాలు భూపాల గోపాల గోపాలికా కృష్ణగోపాలు .

భోగినీదండకము.

రాసిరి. వి. (రాచే+సిరి). రాజలక్ష్మి.

కం. సిరివంటి బడేబీబీ, విరిబోఁడికి వెన్నుఁడనఁగ వెఁయచు మిగులన్, గరగరిఁడవెడ రా, సిరులందు నమీనుఖాను చెలువములగమీ...

యయా. 2 1.

చం. గరతరమైనలేమి సమకూరిచి యెవ్వరికిదరాని రా, సిరిగలదండనాథు గృహసీమకుఁ బోవఁగఁబంచి యచ్చటన్ ...

చెన్న. 5. 847.

రాసీరసము. సం వి అ.పుం. 1. రాసక్రీడ. 2. వినోదము, ఉత్సవము 3. జనసంఘము, సమూహము. 4. శృంగారరసము. 5. ప్రసవానంతరము వచ్చు అపరాత్రి 6. పరిహాసము, వేళాకోళము చేయుట. 7. * రససిద్ధి, రసాయన శాస్త్రము నందలి నిపుణత. * (వాచ.).

రాసీవాసము. సం. వి అ. పుం. = రాసీరసము.

రాసేశ్వరి సం. వి. ఈ. స్త్రీ, రాధ.

**రాస్న.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఓషధివిశేషము, సన్న రాష్టము (వ్య. వి.). 2. ఏలాపర్ణి, కాయపలికి (వ్య. వి.). 3. నాకులి, సర్పాక్షి (వ్య వి.). 4. ధేనువు, ఆవు (కే.ని.).

**రాహిత్యము** సం. వి. అ. న. రహితభావము.

**రాహు(వు).** సం వి ఉ. పుం 1. సైంహికేయుఁడు, విప్రచిత్తి సింహికల పుత్త్రుఁడగు నొక రాక్షసుఁడు, తలగాము.

భార. శల్య. 2. 340, అను. 4. 103.

2. గ్రహణము, సూర్యచంద్రులకు అడ్డముగా వచ్చు ఛాయ. 3. త్యాగము, విడుపు. 4. విడుచువాఁడు. త్యాగకర్త. 5. విడుచువాఁడు. త్యాగకర్త. 6 తపస్సు. (వాచ).

**రాహువచ్ఛత్రము.** సం. వి. ఆర్ద్రకము, అల్లము (వ్య. వి.).

**రాహుతు(ఁడు).** = రావుత్తు. వి. రవుతు.

ద్వి. ఒక్కలులైన రాహుతు లేవ్వమీటి, తక్కక చని రి తురుచరాధిపుల.

రం. రా. యు. 406 పొ. 26 పం.

ఉ. చుట్టములైన రాహుతులు చూరెలఁ బేరెల మిరో జవోజ్జ్వలా, రట్టజవాహరోహణ విశాలి తులై తమఁ జేరి కొల్వఁగా ...

విక్ర. 4. 53.

ద్వి. రాహుతులైన యారాక్షసాధిపుల, సాహసంబున నేలఁ జమిరిరి కడిమి.

రం. రా. యు. 407 పొ 2పం.

**రాహుత్తు(ఁడు)** = రావుత్తు. వి. రౌతు, సాది.

సీ. ... గూడెఁ దెలుంగు రాయ రాహుత్తుండు ... స్తూరికేరాజుఁ బ్రస్తుతి తు ..

శ్రీనాథుని చాటువు.

**రాహుదర్శనము.** సం. వి. అ. న. సూర్యచంద్రుల గ్రహణము.

**రాహురత్నము.** సం. వి. అ. న. గోమేధికము.

**రాహుసంస్పర్శము.** సం. వి. అ. పుం. సూర్యచంద్రుల గ్రహణము

**రాహూచ్ఛిష్టము.** సం. వి అ న. లశునము, ఉల్లి.

**రాహూత్సృష్టము.** సం. వి. అ న. లశునము, ఉల్లి.

# రి

**రి.** సం. వి. అ. పుం. 1. స్రవము, కారుట. 2. క్షయము, క్షీణించుట

**రింఖ.** సం వి. ఆ. స్త్రీ. 1. ప్రాకుఁట. జారుట 2. నృత్యము చేయుట. 3. అశ్వగతిభేదము. 4. గుఱ్ఱపు డెక్క. 5 దుగదగొండి, దూలగొండి (వ్య. వి).

**రింఖణము.** సం. వి. అ న. 1 ప్రాఁకుట, సర్పణము. 2. స్ఖలనము, జారుట.

**రింగణము.** సం. వి = రింఖణము

**రింగు.** వి. (క. రింఖ) బాణము మొదలగునవి పోవునపుడగు ధ్వనికనుకరణము

(దీని యామ్రేడిత రూపము రింగురింగు)

ఉ. బంగరు దుప్పటంబు పరివాటుగ కొప్పు హసన్ముఖాబ్జుఁడై, రింగున నాఁగోల పరిరించి తటాలునఁ ద్రుంచె నా పను, శ్యాముఁడు ..

చమ. 3. 77.

2. పై కెగురుటయందగు ధ్వని కను కరణము.

సీ. నింగికై రింగున నిగుడు తేజంబునొగల్ గాఁడి విమానములే గదలఁ బాఱ ...

చంద్రా 6 90.

3. బాణములు విసురునపు డగు ధ్వని కనుకరణము.

వ. గుంటిప్రోవుల ... దుపాఱ ఫెళ ఫెళలు బాణముల చదరాలు ... రింగు రింగులు .

ప్రబంధ. 7 88.

4. పిట్ట రెక్కల ధ్వని కనుకరణము.

సీ రెక్క గాడ్పులు మింట రింగుమనఁగ.

చాటువు.

**రింగులు.** వి. బ. (క. రింగు) స్త్రీపురుషులు ధరించు వ్రేళ్లు.

క. పుంగవము విరివిరి ఇలుగు దుప్పటపు రింగుల వల్లె వాటు ... సొలుపవచ్చు ..

రామా. 2. 110.

ఉ. రింగుల వల్లె వాటు సవరించి మెయిన్ మృగ
నాభినించి.. సారఁగ 2. 218.

సీ. కలువగొంగకు లేని బలువ గంగను జీనివలువ
వలువ రింగలు పైని గలుగువాని ..
ప్రబంధ. 802.

సీ. గోణముపైని రింగులు వారఁగట్టిన వలిపె
దుప్పటి కటిస్థలి రహింప .. చ. రా. 2 61.

**రింఛోళి** సం. వి. ఈ. స్త్రీ సమూహము.

**రింజె** వి మల్లబంధ విశేషము, కాలు పట్టుకొను
టకుఁ జొచ్చినచో కాలు తప్పించి సందిటఁ మెడఁ
బొదివిపట్టెడి పట్టు.

గీ. కళవరావకుఁ జొచ్చి డొక్కరము హత్తి,
చడికిమైఁ బిడఁగొని పట్టసమునఁ దొడరి,
తోరహత్తంబునను బొత్తమూరి బ్రంభ,ణముష్టి
వను రింజపట్టి విన్నాణ మెసఁగ ...
ఉ. హరి. 3. 69
(చి. ని., శ. ర పీరేళ పా )

**రింబ = రిమ్మ** వి ఉన్మాదము.

సీ. .. రిమ్మ యసంగను రింబ యనఁగ, వెఱ్ఱి
యనఁగను విచ్చ యన గ మమ్మాద మనఁగ
నున్మాదసంజ్ఞ ... అం భా. 1. 136.

**రికము = ఋకము.** అవ భావార్థము నందు వచ్చు
ప్రత్యయము.

చం. అఁయఁగఁ దిల్లి టక్కనెలియంద్రకుఁ దక్కు
మ గర్గినట్టి చుట్టరికమువారికిన్ ...
ప్రభా 3. 88.

**రికిరించు** స క్రి నిక్కఁబెట్టు.

సీ. పెంపెట్టె ఫోకలు విసరి తారుచుఁ జెవుల్
రికిరించుకొని దిశల్ రేసి చూచి ...
రసిక 1 113

**రికిబు.** వి. (హిం. రికాబ్ ) సేవకుఁడు.

గీ. రేయి సుల్తాణి జగమాపరింపఁ దలఁచి,
పాలుచు నిరులను బలురికిబులును బనిచి,
కొటల నెత్తిన సున్నంపుఁ గుండ లనఁగఁ,
జాలఁ గనుపట్టెఁ దారకానముదయంబు.
విప్ర. 3. 28.

సీ. ఇటు వల్లెత్రాటి మిక్కుటపు చెక్కురికిబు
కెడగొప్ప తిప్ప వీక్షించినాఁడ ...
ప్రబంధ. 149.

**రిక్క.** వి (సం. ఋక్షమ్.) నక్షత్రము.

క. ఒక్కొక్కటి వేయికోటులు, మొక్కలపుం
గపులు గలుగు మొనలవి ముయ్యే, డొక్కటఁ
గొలువఁ బొలుచునా, రిక్కలఁ దాఁకిన
పొడువు దరిముఖుఁ డధిపా.
భా. రా. యు 854.

సీ. రిక్కలోయి నికావురే చాముతుఱుముపైఁ
జెరివిన మల్లె క్రొవ్విరులుగాని ...
నైష. 8. 161.

ఇ. రిక్కదారి, రిక్కదొర, రిక్కరాయఁడు,
రిక్కఱేఁడు

**రిక్కదారి** వి. (రిక్క + దారి) ఆకాశము.

ఆ ... వెన్ను, నడుగు రిక్కదారి యన నభంబై
తగు .. అం భా. 1. 69.

**రిక్క(ల)దొర.** వి. (రిక్క + దొర) చంద్రుఁడు.

వ. దంష్ట్రాంగదవర్గళ లాలాజలంబు రాహువు
ముక్కాలు గ్రాసంబుగా మెక్కవం జిక్కిన
రిక్కదొర ప్రక్కం బొరఁగు సుధాధారలం
గేరడంబాడ ... రా. వి. 3. 65.

సీ. వెఱయీఁగి బలుజెట్టు నిగనిగల్ గడునవ్వి
రిక్కలదొర రంగు ద్రుక్కఁజేసి ....
రామ. 371.

**రిక్కరాయఁడు.** వి. ( రిక్క + రాయఁడు )
చంద్రుఁడు.

సీ. చెక్కు నొక్కెదయంచు దిక్కరిగ్రామణి
యక్కుఁజేరదెయంచు రిక్కరాయఁడు ...
వసు 1. 80.

ఆ. పెక్కు దివియలున్న జక్కవ చెలియున్న,
రిక్కరాయఁడున్న జుక్కలున్నఁ, జిన్నవేడి

చూడిక్క చేడియ నెడఁబాయు, నవ్వు డంధ
కారమ య్యె జగము. భర్గ. 2. 14.

రిక్కరించు. స క్రి. నిగుడించు, రిక్కించు.

వ రిక్కనిక్క వెక్కరింపుచుఁ జెవులు రిక్క
రించుచుఁ బండ్లి గిలింపుచు.. పిక్కటిల్లు మర్క
టం బులును .. ప్రబంధ 186.

రిక్కఱేఁడు. వి. (రిక్క + ఱేఁడు) నక్షత్రేశుఁడు, చంద్రుఁడు.

కం. కావున నా విన్నప మో, దేవర నీయెదను
నిలిపి తేఁకువ మీఱం,గా లించేయుఁడు
గొబ్బున, నావుడు రా రిక్కఱేఁడు నగుచుం
బలికెన్ ... అచ్చ రా కిష్కిం. 53.

గీ. చొక్క మిక్కిలి రక్కసి రిక్కఱేఁడ్లు, చక్క
నయ్యకుఁ జిక్కి .. దశా. 2. 304.

రిక్కించు. స క్రి నిక్కఁజేయు

సీ. రిక్కించి వీనల చిక్కు లదరఁజేయి ఘుర్ఘుర
ధ్వని ప్రతి ఘోషమురుము .. ప్రబంధ. 218.

మ. తన చూ పంబుధిమీఁదఁ జూచి శ్రవణ
ద్వంద్వంబు రిక్కించివం,చిన చంచద్భుజముల్
సముత్కట టీసిమంబు లం బూన్చితోఁ,క నభో
వీథికిఁ బెంచి యగ్రిమ పరియంగాఁ జెట్టి
బిట్టూఁద గ్రక్కన నక్కొండ యిడఁగఁ
ద్రొక్కి పయికిం గుప్పించి లంఘించుచున్.
రామా. 6. 93.

గీ. మించు రిక్కించె ననఁగ సిక్కించె వనట.
ఆం. భా. 187

రిక్కు వి. త్రిప్పుట యందగు ధ్వన్యనుకరణము.

సీ. రిక్కురిక్కు నఁ దోఁకఁద్రిప్పి జాడించుచు
ఖురపుటంబులఁ దలగోఁకుకొనును ...
హరివం. 2. 49.

రిక్త. నం. వి. ఆ. స్త్రీ చాంద్రమానపక్షమున చతుర్థి,
నవమి, చతుర్దశి తిథులకుఁ బేరు.

రిక్తత. నం. వి. ఆ. స్త్రీ. 1. దారిద్ర్యము,
2. శూన్యత.

వం. ఘనమగు నాకు రావితిలకం బతిరిక్తత మున్న
వోర్తులోఁ, గనికర మూని ...
ఆము. 5. 135.

రిక్తపాణి. నం. విశ. (ఇ) రిక్తహస్తుఁడు.

రిక్తము. నం. విశ. (అ. ఆ. అ.) 1. శూన్యమైనది,
ఏమియులేనిది, 2. నిష్ప్రయోజనమైనది, పనికి
మాలినది.

వి అ. న 1. శూన్యప్రదేశము, ఆకాశము,
2 అరణ్యము, అడవి

రిక్తహస్తుఁడు నం. విశ. (అ ఆ. అ.) 1. శూన్య
హస్తుఁడైనవాఁడు (పువ్వులు మొ. బహుమానపు
బదార్థములేనిచేతులు గలవాఁడు.) 2. నిర్ధనుఁడు,
దానములు చేసి దరిద్రుఁడైన వాఁడు

రిక్థగ్రాహుఁడు నం. విశ. (అ ఆ.అ ) దాయము
తీసికొనెడివాఁడు.

వి. అ. పుం. దాయాదుఁడు, జ్ఞాతి, వారసు.

రిక్థము. నం. వి. అ న. 1 దాయము, విభాగార్హ
మైన పిత్రాదులధనము. 2. ధనము, ఆస్తి.

రిక్థహారి నం. వి న్. పుం 1. దాయాదుఁడు,
జ్ఞాతి, వారసు 2. మేనమామ, మాతులుఁడు.
చ. వట బీజము, మఱ్ఱి విత్తు.

రిక్థి. నం విశ (న్. ఈ. న్.) 1. దాయమును
పుచ్చుకొనెడువాఁడు, వారసైనవాఁడు.

వి న్ పుం. దాయాదుఁడు, జ్ఞాతి.

రిష. నం. వి. ఆ. స్త్రీ. లిక్ష, ఈఁ పేనుగ్రుడ్డు.

రిటి నం. వి. ఇ. పుం. 1. గుంటలు ఎఱుమట
మగుట 2 నల్ల యుప్పు. సంగీతసాంప విశే
షము 4 భృంగరిటి, శివపరిచారకులలో నొకని
పేరు. (విశ్వము)

రిట్ట. వి. ఒకానొక చెట్టు,
పి. శా. శ. 1024 Ep. Ind 5.

రితము. నం. వి అ. న. 1. గతి, గమనము.

వి. (అ.ఆ.అ.) గతము, గతించినది.

రిత్త. వి (నం. రిక్తమ్.) 1. వ్యర్థము అబద్ధోక్తి.

కం. సియోగము నాడినంతయుఁ, జేయక కతఁడో
పు రిత్త సెప్పెడువాఁడే ..
భార. ఉద్యో. 2. 193.

కం. రిత్తలు రచ్చెడువాఁడే, మత్తగజా యుత

బలుండు మారుతియని యుద్వృత్తుఁడగు దుస్ససేనుని, నెత్తురురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్ ...

భార. ఉద్యో. 4. 204.

2. వ్యర్థత

ఉ. వంచన లేక యానసము వాంచిన యప్పుడు ఫాల మోర గా,వించుడుఁ జెక్కుటద్దములు వ్రీడభరంబువఁ గిలెటింగి చుంబించి మనంబు తాలిమి గభీరత రిత్తకునెత్తఁ బూనినన్, మించి ముఖాబ్జుమంబనము మేకొని నవ్వు విభుండు నేర్పునన్. నైష 7 183.

విశ 1. వ్యర్థము, నిరర్థకము.

చం. నెమ్మనంబునన్, విపులశమంబు గై కొనని వీరతపస్వి తపంబు నింద్రియా, దన్యపరి సౌఖ్యమునవ నియోగి వివేకము రిత్త యాంయన్ ... సీతారా 3 134

2 వట్టిది, శూన్యము.

గీ. విత్తు సహకారిగాకున్న రిత్తనేల, వంధ్య మగుఁగాక తా ఫలవంతమగునె ...

భారం. అను. 1.156.

గీ. అత్తయును మామయునులేని రిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోడ ...

హర. 3. 25.

చం. .. ... దృక్తరళకాంతులు మత్తంమిచ్చు వంతరాంగరముల నవ్వులు స్గలున తండము మొల్లలు నంచు మిన్ను గ్రుచ్చిరిహాని రిత్త నూలొనఁగి సిగ్గువహింతురు పుప్పొలావికల్.

ఆము. 2. 90.

3. కల్ల.

వ. ఇట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భిం జూచి రిత్తయలుకఁ దెచ్చుకొని యుపదేశగురువువగు వాకు రతిరహస్య వార్త సెప్పవైతి, ధూర్తవై నీవు సెప్పకుందు గాకేమి? .. ఇదె చూడుమని.

నైష. 8. 70.

4. ఇతరమైనది.

గీ. ... ఆఱునెలల కొకనాఁడు భోజనాదులకుఁ దెలియునాఁడు వీఁడజయ్యుఁడు రిత్తనాఁడు దెలువ, జలిమిఁ దెలియనాఁడీ పని బలము దూలు. భా. రా. యు. 876.

క్రి. విశ. 1 ఊరక, వ్యర్థముగా.

కం రిత్తదడవు గాకుండఁగ, నిత్తఱి నాచార్యు తోడ యీనుడిగి వెసం, త్తమ శకట వ్యూహము, చిత్తంబున నొండు దలపు నేర్పకు మింకన్. భార. ద్రో. 3. 68.

కం. మాయఁ బ్రకటించుచును వెడ, మాయవు మంత్రములు రిత్త మంత్రించుచు భూనాయక నందన గనుఁగొను, మాయామదిరాక్షి నీ మదాలసయగునే. మార్క. 3. 81.

సీ. .. , సరసోక్తులకు సదుత్తర మీయకుండుట చూపు లేకయ రిత్త చూచుటయును ...

దశా. 7. 70.

వ. .. ప్రతిఫలిత తారకంబులు ద్రాక్షాఫలంబులని రిత్త చప్పరించువారను ... ఎను 4 23

3. నిష్కారణముగా, ఊరక.

కం. కావున మనుజుఁడు సేయక, దేవుం డీయంగ లేఁడు తెగి యేమియు నానావిధధాన్యము లుండిన, వావిరి వండక యె రిత్తవంటక మగునే ... కుచేల 1. 81.

కం. ... తామును పెట్టనిది రిత్త దవ కేలబ్బున్ ...

విక్ర. 2. 182.

వ ... రిత్త బంకించువారుమ ... పారి. 4. 66

జ : రిత్తకత్తె, రిత్తగాఁడు, రిత్తకురిత్త, రిత్తవడు, రిత్తవాఁడు, రిత్తపుచ్చు, రిత్తపోవు.

రిత్తకత్తె. విశ. ($\sqrt{}$రిత్త) సంబంధములేని స్త్రీ, తేర కత్తె. (శ. ర.)

రిత్త(కా)గాఁడు. విశ. (రిత్త+కాఁడు) తేరకాఁడు' సంబంధములేనివాఁడు.

కం. ఉన్నంత నీవు గలిగితి, బన్నంబులు దలఁక

(శ ర. పా. కప్పువిప్పగు. ముద్రి. పా)

రిప్పము సం. వి అ. పుం. లగ్నమునకు ద్వాదశ రాశి, వ్యయస్థానము.

రిప్రము సం వి అ న. 1. పాపము. 2. దుఃఖము. (కే.వి.)

రిమ్మ=రింబ వి త్రిక్క, ఉన్మాదము.

గీ. దండహస్తిమనోజుండు దండవెట్టె, నమ్మహీ దేవు నెమ్మది రిమ్మవొడమ. శుక. ౨. 458.

సీ. తనరు వేళాకోళమవంగఁ ద్రిక్కయవంగ రిమ్మయవంగను రింబయవంగ, వెట్టియవంగను విచ్చియవంగ నున్మాదమవంగ మన్మాద సంజ్ఞ... అం. ఖా 1. 136

జ రిమ్మగొను, రిమ్మవట్టు

రిమ్మ(లు)గొను. అ. క్రి (√రిమ్మ) ఉన్మాదము నొందు

వ నెమ్మనంబునం గ్రమ్మిన యమ్మలికంబు పెంపున రిమ్మగొని పొమ్మసిలి.. చిత్రభా. 8. 94.

వ. విద్యుల్లతా విలోకంబున రిమ్మలుగొని సొమ్మలు వోవుచున్న లేఁగలు. భాగ 10 పూ. 904.

రిమ్మపట్టు అ క్రి. (రిమ్మ+పట్టు) దిమ్మెక్కు.

ఆ. బొమ్మ ద్రొక్కి మోము రిమ్మవట్టఁగ మోఁది. భాగ. 5. 2. 157.

మ. ... పార్థుమస్తంబు విట్టుగలం దాఁకిన రిమ్మపట్టి వివశుండై వ్రాలెన మ్మేటియున్. జై. భా. 5. 76.

రిరంస. సం. వి. అ. స్త్రీ. 1. రమింపనిచ్ఛ, ఆడవలయునను నిచ్ఛ. 2. రతి యందలి యిచ్ఛ, విషయసుఖములు పొంద నిచ్ఛ.

రిరంసువు. సం. విశే. (ఉ) రమింప నిచ్ఛగలవాఁడు. (శ, ర.)

రిరక్ష. సం. వి. అ. స్త్రీ. రక్షింప నిచ్ఛ.

రిరక్షువు. సం. విశే. (ఉ) రక్షింప నిచ్ఛ గలవాఁడు.

రిరి. సం.వి.ఈ.స్త్రీ. కాంస్యము, కంచు (విల్యమ్సు.).

రివట. వి. ఉపశాఖ, రెమ్మ.

కం. ఒక గృధ్ర మెండిపోయిన, యొక చేఁదము గఱచికొనుచు నుడుపథమునరా, నొకతంగిఁ బ్రిదిలిపడి యది యొక యెండిన రివట మీఁద నుండఁగ నెలమిన్. భోజరా 4 23.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ నెలగచివ్వ.. ఒలుగు గోల బరగు నెలయవ మపశాఖ చెలఁగను... ఆ. భా. ౨ 37

రివరివ. వి. కుచ్చెళ్ల ధ్వని కనుకరణము.

సీ. గమగమ మైకదంబములు గుభాళింప రివరివ గుచ్చెళ్ల రవణ మెసఁగ... ప్రబంధ. 18.

జ: రివరివమను.

రివరివమను. అ క్రి (రివరివ+అను) కదలుట యందగు ధ్వని కనుకరణము.

కం. నవనవమను నెమ్మేనులు, రివరివమను మధ్యములు ద్విరేఫశ్రేణుల్, జవజవమను వేణికమది, రవరవమనుమరుఁడుగ వారి రంగులు గనివన్... చమ. 3. 108.

రివ్వ[1]. వి. పక్షి విశేషము.

సీ. మానిపుల్కుటిగాఁడు జీనువ యొల్లంకి డాబ శీతువు నెవ్వ డాయ రివ్వ. (పార్వ. 6.77)

రివ్వ[2]. వి. రెమ్మ, ఉపశాఖ.

కం. చెఱకువఁ బుచ్చక రివ్వలఁ, గఱచిన రసమా వనిగతి... కు. సం. 8 159.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ నెలగ చివ్వ.. ఒలుగు గోల బరగు నెలయవ మపశాఖ చెలఁగను... అం. భా. 2.36.

రిశ్యము. సం.వి.అ.పుం. ఒకజాతిలేడి, మృగవిశేషము.

రిష్టము. సం. విశే. (అ. అ అ.) 1. యాప్యము, అధమము.

2. దురదృష్టము గలది, అదృష్టములేనిది.

వి. అ. న. 1. హాని, కీడు. 2. దురదృష్టము, దౌర్భాగ్యము. 3. నాశము, నష్టము. 4. పాపము. 5. మంగళము, మంచి యదృష్టము.

పుం. 1 ఖడ్గము, కత్తి. 2. కుంకుడు చెట్టు.
రిష్టి. సం. వి. ఇ. స్త్రీ. అశుభము. అమంగళము.
పుం. 1. ఖడ్గము, కత్తి 2. రంధ్రము, బెజ్జము.

# రీ

రీఙ్గ. సం. వి. అ. స్త్రీ 1. నింద, దూషణము. 2. లజ్జ, సిగ్గు 3. అణకువ (విల్యమ్సు.)
రీఠ. సం.వి.అ.స్త్రీ. రీఠాకరంజము (వ్య.వి).
రీఠాకరంజము. సం. వి. అ. పుం. రీఠ, ఒకానొక వృక్షము.
రీఢ. సం. వి. అ. స్త్రీ అమర్యాద, అగౌరవము.
రీఢకము. సం. వి. అ. న. వెన్నెముక (విల్యమ్సు).
రీణము. సం. విశ. (అ. అ. అ) స్రవించునది, కారునది.
రీతి. సం. వి. ఇ. స్త్రీ. 1 కారుట, ప్రవహించుట. 2. గమనము, చలనము. 3 నది, స్రవంతి. 4. మేర, హద్దు. 5. పద్ధతి. 6 వైఖరి, స్వభావము. 7. వైదర్భ్యాదిశైలి. (వైదర్భి, గౌడి, పాంచాలి, లాటిక, యని నాలుగు విధములు). 8. ఇత్తడి, పిత్తలము. 9. ఇనుపచిట్టెము. లోహకిట్టము. 10. పంక్తి, వరుస. (కే.ని.)
రీతిక. సం వి. అ స్త్రీ =రీతికము.
రీతికము. సం. వి. అ. న. 1. లోహపుష్పము, లోహకిట్టము. 2. పుష్పాంజనము.
రీతిగౌళ. సం. వి. అ. స్త్రీ ఒకానొక రాగము.
గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము, దన రుహాంబీరనాటయు నని నప్తుంన, కములు ముప్పదిరెండు రాగములు ... ప్రబంధ. 97.
రీతిపుష్పము సం వి అ. న. =రీతికము.

# రు

రు. అవ. 1. వర్తమానాద్యర్థక ప్రథమ మధ్యమ పురుషముల బహువచన ప్రత్యయము. ('ఇ' కారము మీఁద నిది 'రి' గా మారును.)
ఉదా : వచ్చుచున్నారు, రాఁగలరు, వత్తురు. రారు, వచ్చిరి.
2. ప్రార్థనార్థక మధ్యమపురుష బహువచన 'డు' వర్ణకమునకు ఎదాను అనుప్రయుక్తమగునపుడు ఆదేశముగా వచ్చు ప్రత్యయము
చం. చిలుకకు మావికిం బగలు నేయకురే అత కూవలార ... కకు. 1 130.
ఉ. ...మల్లియలార మీ పొవల మాటున లేఁడు గదమ్మ చెప్పరే ... భాగ. 10. పూ. 1011.
3. అల్లుడు మున్నగు శబ్దముల ప్రథమా బహువచన ప్రత్యయము
ఉదా అల్లురు, బాలురు
4. 'కూఁతు' శబ్ద ప్రథమమైకవచన ప్రత్యయము.
ఉదా : కూతుఁరు.
రుంజ వి (త ఉరుంగల్) చర్మవాద్య విశేషము. డంగురము.
సీ ... డంగురమన రుంజ నావిరాణ మనఁగను వీరణంబు ... అం భా. 1. 128.
జ. రుంజకాఁడు.
రుంజకాఁడు. వి.(రుంజ+కాఁడు) రుంజ వాయించుచు కంసాలులను యాచించు నొక జాతివాఁడు.
సీ. వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కల్లు విత్తము రుంజకానిపాలు .... రామలిం. 28.
విశ. రుంజ వాద్యము వాయించువాఁడు
రుంఠము. సం వి. అ. పుం. బంధము, మొండెము.
రుంటిక. సం. వి అ. స్త్రీ 1. రణరంగము, యుద్ధరంగము. 2. దూతి, కార్యకర్త్రి. 3. ఇంటి గడప. 4. మనుష్యాతీతశక్తి. (విల్యమ్సు.)
రుంద్రము. సం. విశ. (అ. అ. అ.) విరివియైనది. (శ ర.)
రుకుఁడు. సం. విశ. (అ. అ. అ.) ఔదార్యము గలవాఁడు, దాత. (విల్యమ్సు.)
రుక్మాముపుంజా. వి. ఒక జాతి కోడిపుంజు.

వ. ...రుక్కాముపుంజాలు కలచికాట్ల జుట్టలు గలచుక నారెలు డుస్సిపాలు వరుస ...
ప్రబంధ. 788.

రుక్కు. సం. వి. క్. స్త్రీ. 1. బాధ, వేదన. 2 రోగము, తెగులు. 3. ఆఁడుగొఱ్ఱె. 4. కుష్ఠము, కుష్ఠురోగము. (విల్యమ్సు)

చ్ స్త్రీ 1. సూర్యకిరణము. 2. కాంతి. 3 ఇచ్ఛ. (శ ర.)

రుక్ప్రతిక్రియ. సం. వి ఆ స్త్రీ. జబ్బుకుదురుట, మందు పుచ్చుకొనుట, రోగప్రతిక్రియ.

రుక్మకారకుఁడు. సం. వి. అ. పుం. స్వర్ణకారుఁడు, కమసాలి.

రుక్మము. సం. వి. అ. న. 1. బంగారము. 2 ఇనుము. 3. నాగకేసరము, (వృ. వి). 4. ఉమ్మెత్తచెట్టు.

రుక్మిణి సం వి. ఈ. స్త్రీ. విదర్భ దేశాధిపతియైన భీష్మకమహారాజు కూఁతురు, శ్రీకృష్ణుని భార్య, ప్రద్యుమ్నుని తల్లి.

రుక్షము సం విశ (అ ఆ. అ) = రూక్షము,

రుక్సద్మము. సం వి న్. పుం. పురీషము, మలము (విల్యమ్సు).

రుగ్ణము. సం. విశ (అ. ఆ అ.) 1. విఘాతము చెందినది, భంగమైనది 2. వంగినది, వంకర యైనది 3. రోగముఁ జెందినది, రుజాయుతము.

రుగ్ణుఁడు సం. విశ. (అ. ఆ. అ.) రోగముఁ జెందిన వాఁడు. జబ్బుగా నున్నవాఁడు.

రుచ సం. వి ఆ. స్త్రీ. = రుక్కు (చ్).

రుచకము. సం. విశ (అ. ఆ. అ.) 1. మనోజ్ఞమైనది, ఇంపైనది. 2. ఆఁకలి పుట్టించునది. 3. తీక్ష్ణమైనది, చుఱుకు మనునది.

వి. అ. పుం. 1. మాదీఫలము. 2. పావురము.

న. 1. దంతము, పల్లు. 2. కాసు, స్వర్ణముద్ర. 3. ఆస్వాద్యమైన రసము, 4. పుష్పమాల, పూలదండ. 5. సౌవర్చలవణము, 6. గుఱ్ఱపు మెడమీఁద నుండెడి ఆభరణ విశేషము. 7. మాంగల్య ద్రవ్యము 8. సర్జికాక్షారము.

రుచి. సం. వి ఇ. ఈ స్త్రీ. 1. వెలుఁగు, తళతళమను కాంతి. 2. సూర్యకిరణము. 3 కాంతి, అందము. 4. చవి, నోటికింపగుట. 5. బుభుక్ష, ఆఁకలి 6. ఇచ్ఛ, అభిరుచి. 7 అత్యాసక్తి, వ్యామోహము 8. ఒకజాతి గోరోచనము. 9. సిరి, లక్ష్మి. (శే ని.) 10. రీతి, విధము.

(ఈ యర్థమున తెలుఁగునందే ప్రయోగము కన్పట్టు చున్నది)

శా అ మందోద్భవబీజమండరుచి నయ్యాటించు చుజ్ మత్తికా, స్తోమంబాతతపక్షగుచ్ఛ మగుచున్ దోతేరఁగా క్ష్మాశ్రులం, బై మిన్నొప్పు తదంగసంగతి మధువ్యామోహముం జేయు దో,డ్తో మర్త్యాలికిఁ దద్విహారకలిత ద్రుస్కంధ వీరుచ్ఛిఖల్. పాండు. 4. 254.

11. కమ్మన.

చం ... అప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండిన శాకమూలముల్, గడురుచి నిష్ట భోజనసుఖంబును దృప్తియుఁ గూర్చుచుండఁగన్. భార. అర. 1. 44.

పుం. 1. ప్రజాపతులలో నొకఁడు. 2. ఆలింగన భేదము.

రుచి(యి)ంచు. సం. అ. క్రి. 1. ఇష్టమగు.

గీ. ....అప్పార్థుకోర్కి, యంత సఫలతఁ బొందెడు నచ్యుతుండు, నెట్లు దనకు రుచించెఁ దా నట్లు చేయు... భార. ద్రో. 5. 379.

కం. శాంతిం బొందుట నీకుం, గుంతీపుత్రులకు మేలగున్ దానికయే, నింతయు నాడెద నది నీ, కెంతయు రుచియింపకునికి యెఱిఁగి యెఱిఁగియున్. భార. ఉద్యో. 3. 170.

సీ. ... నీకంటె బాలికుండు, కలఁడె యెవఁడు బుద్ధుఁ బోలియుంటె నా కృష్ణుఁ డెక్కటి

తద్రాజ్యమెల్లఁ దావ,కొని కిత్తపట్టంబు నిముఁ బూన్పు నతని పెట్టెడు నన్నపిండంబు గుడిచె దకట. గీ. యెట్లుగాఁ బెద్దవాఁడ వైతేమి బ్రతుకు, సిగ్గటివ భోగమెట్లు రుచించె నీకు, హరికి బంటవుగాక నీవవనిపతివె, యిట్టి రాజ ధర్మ ధ్వంసి నేను సైప. హరి. ఉ. 2. 25.

2. ప్రకాశించు.

వ. ఉదయార్కబింబ సుందరదేహుండగు తనకు వికీర్ణ కపిల జటావళులు ప్రత్యగ్ర మరీచులయి రుచియింప... హరి. ఉ. 1. 34.

న. క్రి భక్షించు.

కం ఇత్తెఱఁగున నా ప్రశ్నల, కుత్తర మిమ్మీక యూరకుండుదువేనిన్, బ్రత్తుం బ్రేవులు సాదగు నెత్తుటఁ జొత్తిల్ల దాఁచి నేఁడు రుచింతున్. దశకు. 10 69.

**రుచిగొను** మి. న క్రి (రుచి+కొను) ఆదరించు.

గీ. పరమముని యతివ శతమన్యురతిహేతు, వున మహాశాపహతిఁ జేసి తను వికృతిగ, నున్న నేల యంతవచింప నొగి నరుదని, తత్కథల్ రుచి గొనుచు రాత్తనయులందు. రాఘ. 2. 36.

**రుచిర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకవిధమైన గోరో చనము. 2. ఛందోభేదము.

**రుచిరము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. మనోహర మైనది, సుందరమైనది. 2. మధురమైనది, తియ్య నిది.

వి. అ న. 1. కుంకుమపువ్వు 2. లవంగము. 3. మూలకము, ముల్లంగి దుంప.

**రుచిరాంజనము.** సం. వి. అ. పుం. శోభాంజనము (వ్య. వి.).

**రుచిష్యము.** సం. విశే (అ. ఆ. అ.) మనోహర మైనది, ఇంపైనది.

**రుచ్యము** సం. విశే. (అ ఆ. అ.) రుచిరము.

వి. అ. పుం. 1. శాలి. 2. కతకము, ఇందుగు (వ్య. వి.)

వ. సౌవర్చల లవణము.

**రుచ్యుఁడు.** సం. వి. అ. పుం. పతి, భర్త.

**రుజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. భంగము, ముక్క. 2. జర, ముసలితనము, 3. మృత్యువు, మరణము. 4. రోగము, తెగులు (కే. ని.).

**రుజాకరము.** సం. వి. అ. న. కర్మరంగము, శిరా లము (వ్య. వి.).

**రుటము.** విశే. (సం. రూఢమ్) రూఢము

కం అటు ముందట పటుశైత్యోద్గత,దృఢటమయి దిట మయి నిగాఢదళసంతతి విస్ఫుటమయి రుట మయికడునా, వటమయి బటువయిన దొడ్డ వటముం గనియెన్. ప్రబంధ 207

సీ. వట్టివేరున కీవు వట్టవేరులు సేయ వట్టివేరుఁ ము లిఁపైన చెలికి... రా. వి. 3. 106.

2. దృఢము, బలాఢ్యము.

ఉ. ఖానుకులీనుదేవిఁ జెఱపట్ట దశాననుఁ జెంచ బ్రహ్మత, శ్వాగ్రీణపమీరు సౌరవుగయాత్ర కమ ర్చిన పైఁడి జోడు నెమ్మొని రుటఁపు లేటి తల మిన్న పరాణి యనఁగ .. చం. రా. 5. 62.

ఉ. అంగముపం గురఁగ మదమందముగాఁగ వలంది మౌళి సంపంగివిరుల్సిరుల్గన రుమాలు ధరించి రుటంపుటంగిపై, రంగు మెఱుంగు బంగరు చెఱంగుల రెంటెము నాల్గు కొంగులు బ్రింగులువారఁ గట్టి .. బహు. 4. 5.

3. తీక్ష్ణము

గీ. కఱకనంగను రుటమనఁ బురుకనంగఁ, దీంద్ర మనఁ దీంద్రయనఁగను దీక్ష్ణనామ,ధేయములు.. అం. భా. 1. 84.

వి. 1 రూఢి.

కం. అచ్చేడియ తచ్చనలకు, నిచ్చ మహోత్సాహ మంది యిచ్చెలువకునే, మిచ్చిన బుణంబు గాదని, బచ్చె రుటం బచ్చువడఁగ భావించి మదిన్. బహు. 5. 124

2. దార్ఢ్యము.

గీ. ఒక్కమొత్తంబుగా వన్ని యుక్కుమీటి, నిగుడి తన మీఁదఁ గవియ వన్నిటికి నన్ని రూపుల

ధరించి వాటిమై రుట మడంచి, పట్టి యొక త్రాట దేవకి వట్టి గట్టె... సుదంశా. 4. 60.

3. ఒప్పిదము.

సీ. ముడుఁగుఁ దామర క్రింద నడఁగు క్రొంబఱ పుతో సకినెల పట్టి మంచవు రుటంబు, దగ్గఱ నేస్తకాంద్రకు నిడ్డజగపీఁట తళుకు బంగరు కాసెఁ దగులు తగులు... బహు. 5. 129.

రుట్టు. సం. వి. ష్. స్త్రీ. కోపము, కినుక.

రుణస్కర. సం. వి. ఆ. స్త్రీ. సాధుగోవు, మంచి యావు, సులభముగాఁ బాలు పిదికికొన నిచ్చెడి యావు (విల్యమ్సు).

రుతము. సం. వి. అ. న. మృగపక్ష్యాదుల అఱపు, కూఁత, ధ్వని.

రుతి సం. వి. ఇ. స్త్రీ. రుతము, ధ్వని.

రుత్త. వి. నాశము. వాని రూపు రుత్తాయెను పో (శ. ర.)

విణ. రిత్త, వట్టిది.

సీ. .. రుత్త లోటారంబు రిత్త చీడు, సొళ్లు నా రిక్తాఖ్య శోభిల్లుఁ... ఆం. భా. 3 15

రుత్తు. స. క్రి. కొట్టు, ప్రహరించు. (శ.ర., చి.ని.)

రుదనము. సం. వి. అ. న. ఏడ్పు, రోదనము.

రుదితము. సం. వి. అ. న. 1. రోదనము, ఏడ్పు. 2. ధ్వని.

సీ. గిరిగరుత్ఖండన క్రీడాసమారంభ దంభోళిరుదితముఁ ద్రస్తరించి... పి. శకుం. 3 93.

రుదురక్క = రుదురాక. వి. రుద్రాక్షము.

గీ. పులికళాసముకకపాలఖాదిపూఁత, జడలుఁ కొత్తంబు రుదురక్కసరులు కావి,పుట్టములు లాతమును జోగివట్టియయును, దవర నియ్యోంతిఁ జేరి దీవవ విడుటయు ...

అప్ప. రా. అర. 53,

చం. తిరుపతి కొప్పులందముగఁ దీర్చిన బూడిద బొట్లు మంచి వ్రేఁర్పులచిన మించునట్టి రుదురక్కలపేరులుఁ గావికోకలన్.... శుక. 3 91.

రుదురాక = రుదురక్క. వి. (సం. రుద్రాక్షః) రుద్రాక్షపు పూస.

గీ. ...రుదురాకలిడ్డసంది, నూతసంహిత లిటికించి చౌరఁదొడఁగిరి... అము 4 46.

సీ. గబ్బి సిబ్బెంపుచన్నవ పైన గలగల రుదురాక పేరులు ఝ్రూఁత లూఁగ... పార్వ. 4. 21.

చం. ... పొన్, పాదివిన యట్టి యేక మొగపున్ రుదురాకల దండ సందిటన్, వదనమువన్ మృదుస్మితమువర్తిలు యోగినిఁ గాంచి భక్తితోన్ ... అహ. 3. 5.

రుద్దు. స. క్రి. (క. రుద్దు.) 1. మర్దించు, రాయు.

శా. బ్రద్దల్వాటి ధరిత్రి లీల దెలిఖాఖాఁ జూచి వేఁటాడుచున్, రుద్దున్ ఘల్లున కొమ్ము కళ్లైగయఁగా నూరారునవ్నల్వదున్ ...

శశాం. 2. 24.

సీ. పడితేచియుండినఁ బరఁగ మేనఁబొసంగఁ దైలంబు చేత రుద్దంగ వలయు ...

వేం. మా 4. 293.

2 తోము, నిర్మలముచేయు.

గీ ప్రామెఁ దొలిచెను వెలచెను దోమె రుద్దె, నవఁగ నిర్మల మొనరించెనట యొప్పు...

ఆం. భా. 3. 127

జ. రుద్దుడు.

రుద్దుడు. వి. (√రుద్దు) తోమకము, తోముట.

సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము డవ మార్జన సంజ్ఞ పొలుచుచుండు.

ఆం. భా. 2. 160.

రుద్రజట. సం. వి ఆ. స్త్రీ. జటావల్లి, రుద్రజడ చెట్టు.

రుద్రజడ. మి. వి. రుద్రజట, సువాసనగల యొకానొక మొక్క (వ్య. వి.) (వా.)

రుద్రజము. సం. వి. అ. న. పాదరసము.

రుద్రపత్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గాదేవి. 2. అతసి, నల్లవిసిచెట్టు.

రుద్రప్రియ నం. వి. ఆ. స్త్రీ. పార్వతి, హరీతకి, కరకచెట్టు.

రుద్రభువి నం. వి ఈ. స్త్రీ. రుద్రభూమి, శ్మశానము.

రుద్రవింశతి. నం. వి. ఇ. స్త్రీ. ప్రభవాది షష్టి సంవత్సరములలో చివరి ఇరువది సంవత్సరములు. (ప్లవంగ మొదలు క్షయ వఱకు గలవి)

శ్లో. ఆద్యా తు వింశతిర్బ్రాహ్మీ ద్వితీయా వైష్ణవీ స్మృతా, తృతీయా రుద్రదైవత్యా శ్రేష్ఠమధ్యాऽధమా భవేత్ ... (వాచ.)

రుద్రవీణ. నం. వి. ఆ. స్త్రీ. వీణాభేదము, ఒక విధమగు వీణ.

సీ. ... మంచి, నీళ్ల గిండియు గాజు నిలువుటద్దము రుద్రవీణకిన్నెర వట్టివేళ్ల సురటి. సురా. 106.

రుద్రవీణె(ణియ) మి వి. ఒక విధమయిన వీణ.

సీ. జాళువా చందువ ల్జాలవల్లిక తమ్మపడిగము నెత్తంపు బలక,రుద్ర. గీ. వీణె వింజామరలు వట్టివేళ్ల సురటి... రసిక. 4. 4.

వ .. పికిలులు, బచ్చికోళ్లు, రుద్రవీణియలు, స్వరమండలంబులు... ప్రబంధ. 805.

రుద్రాక్రీడము. నం. వి. అ పుం. శ్మశానము.

రుద్రాక్షపిల్లి. మి. వి. మనోగతమగు భావమును కప్పిపుచ్చి పైకి సాధువుగాఁ గనఁబడు వంచకుఁడు, వంచకుఁడు. (బ్రౌ)

రుద్రాక్షము. నం. వి అ. న. 1. రుద్రాక్షవృక్షము యొక్క కాయ (జపమాలలో నుపయోగింపఁబడును). 2. రుద్రాక్షపూస.

గీ. చెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింప. మనుచ 1.59.

ద్వి వలుద రుద్రాక్షతావళములు నక్ష, వలయంబులను నిడువాలైన జడలు... వన. 3. 281 పొ.

రుద్రాక్షవన్నెలు. మీ, వి. బ. వస్త్రవిశేషము.

వ. ... నిండువన్నెలును నుఱుతచాఱలవన్నెలును సురవన్నెలును పుప్పొడివన్నెలను గంటకివన్నెలును రుద్రాక్షవన్నెలును నాగబంధంబులను .. ద్వా. 3 188.

రుద్రాక్షి. నం. వి ఈ. స్త్రీ సంపెమల్లియ (వృ వి.). (శ. ర.)

రుద్రాణి. ం. నవి. ఈ. స్త్రీ రుద్రునిభార్య, పార్వతి.

రుద్రారి. నం. వి ఇ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

రుద్రావాసము. నం. వి. అ, పుం. రుద్రుని నివాసము 1. కైలాసపర్వతము. 2. వారణాసిపురము, కాశి. 3. శ్మశానము.

రుద్రుఁడు నం. వి, అ. పుం 1. శివమూర్తి భేదము (వీరు పదునొకొండుగురు.)

శ్లో. అజైకపా దహిర్బుధ్న్యో విరూపాక్ష స్సురేశ్వరః, జయంతో బహురూపశ్చ త్ర్యంబకో ప్యపరాజితః, వైవస్వతశ్చసావిత్రో రుద్రా ఇతి స్మృతాః. (వాచ.)

2 శివుఁడు. 3. అగ్ని. 4. ఏకాదశ సంఖ్యకు సంకేతము.

రుధిరము పుం. విశ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది, ఎఱ్ఱరంగుగలది.

వి. అ. న. 1. రక్తము, నెత్తురు. 2. కుంకుమపువ్వు. 3. మణిభేదము.

పుం. 1. ఎఱ్ఱరంగు. 2. అంగారక గ్రహము.

రుధిరోద్గారి. నం. వి. ఇన్. పుం. ఒకానొక సంవత్సరము పేరు. దుందుభి తరువాతిది.

రుద్ధము. నం. విశ. (అ. ఆ. అ) 1. అడ్డగింపఁబడినది, అడ్డగింపఁబడినది. 2. చుట్టఁబడినది, ముట్టఁబడిన

రుప్పు = రువ్వు[1]. న. క్రి. జాలు మొ. విసరు. (బ్రౌ., వా.)

రుప్పాయిఖాళ్లు వి. చెల్లాచెదరు.

శా. కాయం బెక్కడమంచెనేమి వనితా కందర్పుఁ బ్రాణేశ్వరున్, జాయంబాలవు ప్రాణముల్

మనసు రుబ్బాటులాట్లగాఁ జేయుటన్, డాయ వచ్చుఁగదా పయోధరములంటం గాఁగిటం జేర్చి యూ, చాయంబై కొని చెక్కునొక్కి రతిరాజ్యశ్రీలఁ దేలింపుదున్.

వేం. పంచ 3. 284.

**రుబ్బు.** స. క్రి (క. రుబ్బు.) నానిన పప్పు మొదలగు వానిని ఱోటిలో వేసి పొత్రముతో మెదుపు.

(చూ. రుబ్బుఱోలు)

జ. రుబ్బుగుండు. రుబ్బుఱోలు

**రుబ్బుగుండు.** వి. (√రుబ్బు) రుబ్బెడు పొత్రము. (వా) ఇళ్లే రుబ్బుపొత్రము (వా)

**రుబ్బుఱోలు** వి (√రుబ్బు) నానిన పప్పులోనగునని రుబ్బుటకు ఱాతితోఁ జేసినసాధనము.

గీ. ఇఱుకు ద్రాను పెరంటిలో నెక్కుజావి, మునుఁగలను ఱొప్ప పెనువామి ఉనుము రుబ్బుఱోలు పిడుకలకుచ్చెలదాలిగుంత...

శుక. 2. 408.

**రుమ.** సం. వి ఆ. స్త్రీ. 1. సుగ్రీవునిభార్య 2. ఉప్పుటేరు, ఉప్పుపండుపొలము.

**రుమాలు = రుమాలువు** వి. ఉష్ణీష విశేషము, ఒకవిధమగు తలగుడ్డ.

సీ తనకెంజడలచిన్నె తళుకు చంద్రిక వన్నె పూల సైకపు రుమాల్ పొలుపు గాఁగ ...

ఇందు. 1 7.

చం చిటిలిన గంధముం దళుకు చెంపను వ్రేలు రుమాలుజాఱు దుప్పటియును నిద్రదేఱు ముఖపద్మము...

శుక. 1. 515.

సీ. చెంద్రిక పూవన్నె జిలుగురుమాలుపై జాతిమిన్నల తురా చౌకళింప...

దశా. 1. 71.

జ. రుమాలుగుడ్డ.

**రుమాలుగుడ్డ.** వి. (రుమాలు + గుడ్డ) చే రుమాలు, చిన్న రుమాలు.

సీ. అలకముల్ మాటి యాదలఁ జాగఁజుట్టి పై వడ్డకట్టు, రుమాలుగుడ్డ కట్టి...

వైజ. 2. 4.7.

**రుమాలువు = రుమాలు.** వి. ఉష్ణీషభేదము. ఒకవిధమగు తలగుడ్డ.

సీ. ముందర ముడిగొని ముంగొంగు వెలివెట్టి మాటుచెంగావి రుమాలువులును.

రా. వి. 2. 44.

చం మినుకుఁ గడాని తాయెతు సమేళపుఁ గ్రొవ్విరి దిండు దండ డాల్పని వలెవాటు చల్వవలి పంపు రుమాలువు గట్టి ...

కువల. 2. 54.

గీ. మతిరుమాలువు గాదని మత్స్యనేత, చొపసిగఁ గెంపు తాయెతు చేరుఁజేర్చె.

పాంచా 1 68.

**రుమీచూరకత్తి.** వి చిన్నకత్తి. సురియ.

మ. తల నిద్దాతగటీలు పేరణుల పైదట్లున్ రుమీచూరకత్తులు జోళ్లుం బదనించినట్టి కటిహేతుల్ తళుక్కుగుల్కంగ రిక్తులరన్నెత్రకరాళవక్త్రములనగ్రక్షోణిఁ గఁఖాణికా, వళికందోళి సలాముఁ జేయ యవనవ్రాతంబు భూభర్తకున్.

రా. వి. 2. 52.

**రుమ్మీపిరంగి.** వి. గుండ్రని యొకరకపు పిరంగి.

గీ మేఁత గానివచ్చు తమ్మి రుమ్మీపిరంగి, దొర తురంగివిలాసంబు దొంయఁగొల్పు, గంపవింటికిఁ దెచ్చు నాకాపుబిగువు, టొంగవగల గుబ్బలాడి యొక్కొక్కవేళ.

శుక. 2. 410.

(తమ్మిరుమ్మీపిరంగిదొర = మన్మథుఁడు.)

గీ యోగికై వడి మిగుల విరాగిరీతి, వదియోలోకంబుగా నున్న నాపడంతి, నేఁప రాలెడు తమ్మిరుమ్మీపిరంగి, వీరు మటుమాయ మాయింప నేరిదయ్య.

సుదంతా. 2. 157.

**రురువు.** సం. వి ఉ. పుం. 1 మృగభేదము, ఒకజాతి లేడి. 2, ఒకానొక రాక్షసుఁడు.

**రువాణము.** విశే. చక్కనిది, సుందరము.

(వి, కాంతి. అని శ. ర.)

చం. కలకల నవ్వు చక్కని మొగంబు వెడంద,
యురంబు సింగముం, గలఁచు రువాణపుంగవును
గల్గిన యాకురువీరపుంగవున్ ... విజ. 2 21.

సీ. పిడికిటమ్ముులు వీఁపున నిడిన పొదియుఁ,
దెలిరువాణపు వెదురు ముత్తియపుఁ జేరుఁ,
గలిగి యొటుకు నాయంకుఁ డొక్కండు వచ్చి,
పుడమి రావేల్పురాయని కడను నిల్చి ...
చంద్రా. 2. 40.

రువారము, విణ. 1. సవిలాసము.

ఉ. వచ్చి పురంబు వాకిట రువారపుఁ గోడె
తనంబు తోడఁ గన్నిచ్చకు వచ్చు చేడియల
నెచ్చరికించుచు ధూర్తకోటితో, మచ్చరికించు
చున్ . విక్ర. 8 8

2. సుందరము, చక్కనిది.

చం. ... తోఁచెఁబయిఁ గ్రొందొగ రిప్పుడు
నెమ్మితో నిశావనిత మఱుంగువట్టిన రువా
రపుఁ జెంద్రిక పావడో యనన్ ....
చంద్ర. 4. 72

సీ. వాలు మెఱుంగు రువారంపుఁ గొనగోటఁ
జెక్కిలి నొక్క నొచ్చెవని వేఁడు ...
మల్లుపు. 4 92.

ఉ వచ్చె వసంత కాలము రువారపుఁ దేనె పసిండి
నీరునన్, బచ్చెన మ్రాఁటి తేఁటి నిను పౌజులఁ
దీరుగ వ్రాసియున్న యా, పచ్చనివిల్లువంచి
సుమబాణుఁడు పాంథుల ధైర్యవర్మముల్,
గ్రుచ్చి చనంగ మవ్వమగు క్రొవ్వునఁ గ్రొవ్విరి
తూఁపు తేయఁగన్ ... మద. 2. 45.

3. ఇంపు.

మ. గరుడారోహమొనర్చు మాధవు క్రియన్
గాండావతంసంబు బంధురలీలాగతి నెక్క
రాసుతుఁడు! దోర్దోస్సైన్యముల్ గొల్వఁగా,
శౌరిదిన్ సన్నరుమాలుహోన్ సరిగెకుచ్చుల్
చెన్నువన్ జౌకళింప రువారంబుగ వాద్య
నాదముల దిక్చక్రంబువన్ నిండఁగన్.
ఇందు. 2. 55.

వి. ఒయ్యారము, విలాసము.

ద్వి. అనగ వాలిగు వారువారంబు, లానీటు
లాపాట లావికాసంబు ..
రఘునా 32. పొ. 12 పం.

ఉ. వచ్చినఁ జూచి కీరము రువారము మీఱ ముఖా
రుణద్యుతుల్, బచ్చెన పన్న నా నృపతి పాలి
కిఁ బోయెద వేమొ పొమ్ము... శుక 2. 97.

రువ్వ. వి. దమ్మిడి. (శ. ర., బ్రౌ.)

రువ్వపులుఁగు వి. కాటుకపిట్ట.

సీ. ... కాటుకపిట్ట రువ్వపులుఁ గనఁ దవరు ..
అం భా. 2 91.

రువ్వము వి (సం రూపమ్) తడవ, ఆవృత్తి

కం. పది రువ్వ ములు భక్తిం, బఠిలుండై వినఁగ
వలయు భారతము బగద్విదితగుణ వాని
కన్నిటి, కొదవు ఫలము తేర్పటింతు వోలిశ
నీకున్ . హరి. ఉ. 10. 283.

సీ తొలుత రువ్వము వినఁగలుగు వగ్నిష్టోమ
యాగంబు ఫలముఁగామాసిద్ధు, లీ లోకమును
వఁ గాంచి... హరి. ఉ 10 284.

రువ్వు[1] అ. క్రి. విసరు, వీచు

ద్వి. విడువక రువ్వెడు విషమ వాయువున..
ద్వి. హరిశ్చ పూ. 2157. పం..

=రువ్వు స. క్రి 1. విసరివైచు.

మ. ధరఁ బాంథుల్ బెగడొందఁ ద్రిమ్మరి యొ భద్ర
శ్రీమహీభృన్నృపా, సరసాలానవసత్య శృంఖ
లిత చంచన్మారుతేభంబు కే,సరసాలా నవపత్ర
ముల్ తులుముమన్ జైత్రాహజాగ్ర ద్విలా,స
రసాలా వవధిప్రసూన రజముల్ సారెన్ బయిన్
రువ్వుచున్ . చంద్రి. 4. 32.

వ. విద్యాధర సందోహంబుల రువ్విన జెందిన
మువ్వంపుఁ జెందిరంబును ..
భీమ. 5. 120.

2 చిమ్ము, చల్లు.

ఉ. .... అ, తంకవిధాయి తీవ్రవిశిఖల్ వెద
చల్లుచు నూర్పుగాడ్పు కూ, లంకష నష్టా

సాగరజలంబులు తువ్వరగాఁగ రువ్వుచున్. వరాహ 7. 7.

3. గ్రుద్దు, పొడుచు

వ. . . పాదంబుల జవురుచుఁ బిడికిళ్ళ రువ్వుచు వఱచేతులం జాదుచు ... వీర 4. 107.

వి ఆక్షేపము, విసరుట.

కం. అని జవ్వను లవ్వనిఁ గ్రొవ్వునఁ బువ్వులు గోసి కడుదవులొల్కను నవ్వుల్, వనరువ్వులు కొందఱు మెచ్చని చివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్ కువల. 4. 143.

కం. ఎవ్వరికి వలచెనొకో యీ, జవ్వని యని రవ్వ మీఱు గాసోక్తులు లే,నవ్వులు ముడిచినపువ్వుల, రువ్వులుఁ దనయందె సమధిరూఢము లగుటన్. పాండు 3. 66.

రువ్వు$^2$. వి అన్వృత్తి, వల్లె

ద్వి ఆ తరువాతఁ దా నాతరువాయి, యేతరి యోజ రువ్వియఁ బోనంత ...
ద్వి. పరమ. 2. 127. పొ.

సీ వినుము రెండవరువ్వు విని యతిరాత్ర యజ్ఞము షణ్యమొందిఁ భోగముల నెలమి. హరి. ఉ. 10 284.

సీ. పదవర్ణ సౌష్ఠవ ప్రకటనం బెంతయు నిపు మీఱఁగ రువ్వెచ్చి యిచ్చి ... కళా. 4. 42.

రువ్వు$^3$ వి. వేగమునందగు ధ్వని కముకరణము.

కం తూరుపు తెలతెలనై రాఁగా రువ్వున విసరునీఁద గాడ్పులు నయ్యూ సౌరమును ముట్టుకొనె ... వేం. పంచ. 1. 483.

చం. విడివడి రువ్వునన్ గగనవీథికి గుబ్బము చౌకళించినన్ ... కువల. 4. 163.

రుశత్ (శత్రంతము) హాని చేయుచున్నది, అనిష్ట మగుచున్నది, అసంతుష్టి గలిగించుచున్నది (మాట.).

రుశతి నం. వి. ఈ. స్త్రీ. అశుభకరమైన వాక్కు. అమంగళమైన మాట.

రుష. సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

రుషితుఁడు. సం విశ. అ. ఆ. అ. కోపగించినవాఁడు.

రుష్టుఁడు. సం విశ. (అ. ఆ. అ.) రుషితుఁడు.

రుసి. వి (సం ఋషిః) ఋషి.

సీ. కోపాగ్నిఁ గడుఁబరితాపంబు నొందెడు రుసులకు నభయంబు లొసఁగెఁగాన ... భీమ. 2 12.

రుహ. సం వి. ఆ. స్త్రీ. దూర్వాతృణము.

రుహము. సం. విశ. (హ. అ ఆ. అ.) సమాసాంత ముస) మొలిచినది, బయలుదేరినది.
ఉదా. మహీరుహము.

# రూ

రూ. సం. వి ఈ. స్త్రీ. బంగారము.

విశ. కామరూపము కలది (నానార్థరత్నమాల).

రూక వి. (సం రుక్మమ్.) 1. ఒకానొక నాణెము.

సీ మోసపోయితి దీని మునువాటునకైనఁ జేకూ
ర్పలేనైతి రూకరుట్ర .. నిరం. 2. 123.

సీ. రూకంతగాని లే దేకై వడి నమంబు వచ్చు బంగారుమై హెచ్చుడిగిక ... సారంగ. 2.47.

ద్వి. నూఱు మాడలకు మున్నుగ రూకవడ్డి ... ద్వి. కల. 1. 221.

2. ధనము (శ. ర.).

రూకపాత్కె. వి. ఓషధీ విశేషము.

చ. గురుగెలబొద్ది చెంచలియుఁ గుచ్చలి చిట్టి తగిర్సి తుమ్మి దు,స్సరి బలుగూటి బొద్ది నెలి చల్మిడి పల్లెరు రూకపాత్కె వెల్పరిగిసె ముగ్గ వెల్గ ... హంస. 4. 132.

రూక్షగంధకము. సం. వి. అ. పుం. రూక్షగంధము.

రూక్షగంధము. సం క్లీవి. అ. పుం. గుగ్గులువు.

రూక్షణము. సం వి. అ. న. 1. ఎండించుట, శుష్కముగాఁ జేయుట.

**రూక్షదర్భ.** సం. వి. అ. పుం. తృణవిశేషము. హారిదర్భ (వృ. వి.).

**రూక్షపత్రము.** సం. వి. అ. పుం. శాఖోట వృక్షము.

**రూక్షప్రియము.** సం. వి. అ. పుం. ఓషధి విశేషము.

**రూక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కఠినమైనది, కఱకైనది. 2. ఒగరైనది. (రుచి). 3. ఎండినది, శుష్కమైనది.

వి. అ. పుం. 1. వృక్షము. 2. దంతి, నేపాళము. (వృ. వి.).

**రూడి.** వి. (సం. రూఢి) 1. స్థైర్యము.

కం. వేడుక నమ్ముని ముందటఁ, జాడిరి మాడి డితమి పెక్కు వరవాసంబుల్, రూడిగఁ బలికిరి మెల్లం, జూడఁడు మావలను నీరసుం డన మఁడెన్. భార. ఆది. 6. 156.

గీ. పదురంములు వర్తించు రూడగాఁగఁ, నమ్మ హానిధి ... మార్క. 6. 117.

2. నిశ్చయము.

ద్వి. రూడిగా రాకుమారుని జంపె వనెడి, యాడిక తలఁగూడె నభిమాన మెడలె.

ద్వి. హరిశ్చ. ఉ. 2481. పం.

3. ప్రసిద్ధి (చూ. రూడికెక్కు.).

ఇ. రూడికెక్కు.

**రూడికెక్కు.** అ. క్రి. (√రూడి) ప్రసిద్ధికెక్కు.

సీ. నీతేఁసుట్టులు నీఱయిపోయినఁ జాండుసకులము చెప్పంగఁ జావ, గీ. లేకపోదె యిబ్బంగిఁ బల్కి సముకుందు, తోడ నేను మీ రెమ్మెయి రూఢికెక్కి, వెలుఁగ గోరుట కతమునఁ దలఁచి చాని, నా యనుటఁ దెత్తిపెట్టి నేమనఁగఁగలరు.

భార. అర్జ. 1. 168.

దశా. 1. 119.

**రూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మొలిచినది, మొలక యెత్తినది. 2. పుట్టినది, ఉత్పన్నమైనది. 3. ప్రసిద్ధమైనది, సర్వవిదితమైనది. . నిశ్చితమైనది, రూఢియైనది. 5. అవయవశక్తిని అపేక్షింపక క్రొత్తయర్థమందు ప్రసిద్ధమైనది.

(ఉదా. లావణ్యము మొదలగునది).

**రూఢి** సం. వి. ఇ. స్త్రీ. 1 పుట్టుక, ఉత్పత్తి. 2. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.

రో. రోహిణ్యా... మనురూఢిగా కందిత మహానీయరత్నసామగ్రి గలదె ... కా. సం. 3. 246.

3. సంప్రదాయము, ఆచారము, వాడుక 4 వాడుకలోనున్న యర్థము, ప్రకృతి ప్రత్యయముల యపేక్షలేకుండఁగ బోధపడెడి యర్థము. యౌగికము కానియర్థము

**రూణించు** స. క్రి మల్లు లొక విధముగా బంధించు (చూ. రూణింపు)

ఇ రూణింపు.

**రూణింపు.** వి (రూణించే) మల్లబంధ విశేషము.

వ. ... పెట్టాగుము రూణి పను సరిబిత్తరంబును .. నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి... హంస. 1. 206.

వ. ...పెట్లాగును రూణింపును సరబిత్తరంబును... ప్రబంధ. 78.

సీ. రూణింపు బరిపోటు రొండిప్రేటు.

గీ ... మెరపట్టునాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములకుఁ జెల్లు.

ఆం. భా. 2. 209.

**రూపకతాలము.** సం. వి. అ. పుం. సంగీతతాళభేదము, నియమిత కాలభేదము.

**రూపకము.** సం. విణ. (అ. ఆ. అ.) మూర్తము, ఆకారము కలది.

వి. అ. న 1. ... ము, రూపు. 2. ... శ్యము ... ము ... ) రూపకములు ... ది. ఉపరూపకములు ... ది. ... అర్థాలంకారములలో ... యమే యోపమాన ము ... భేదముగా ... చు...) 4. మూఁడు గుంజెంపి గింజల యెత్తు ... (... ణిమాణము ).

రూపగంధ సం.వి.ఆ.స్త్రీ మూరుకొండ (వృ.వి.).

రూపగు. అ. క్రి. (రూపు+అగు.)

1. ఏర్పడు, కలుగు.

మ. . వరుల్ భ్రాంతివహించుచు రేల విశిఖాస్థుల్ గూడి రూపైనమోహిని యేకాదృశము కావ రాసి పురుషుం డీక్షించఁ గాంక్షింపగన్. ప్రబోధ. 4. 12.

చం విలయత్రకానుకీలముల వేడిమిఁ జోడిమి మాలి వెల్విడిం, గలిసిన భూతధాత్రి మటి క్రమ్మఱరూపయి నిల్చి... వ.వి.చ 2. 10

2. ప్రసిద్ధి కెక్కు.

చం విపుల ధరాధరాగ్రమున వేలుపుమూకల ఁచ్చరావి దివ్యపరిమళంబుతోఁ గడవలంతలు పండుల విట్టవీఁగునా, కిరాతిపయోధి ద్రచ్చు రేఁ గేరవృత్తై మఁమాలచెర్వుఁ జేరి పడియోఁ గేతమాలమన రూపగు వర్షము దానిపేరిటన్. వరాహ 10. 120.

3. సంపన్నుఁడగు.

కం ఏవిట రూపగుఁబురుషుం, దేమెయి రూపు సెడు నాకు నెటిఁగింపుము తేజోమహిత యనిన... భార శాం. 5. 3.

రూపడఁగు (రూపు + అడఁగు.) 1. నశించు, నిర్మూలమగు.

కం. కోపంబున భృగుపతి ప్రతిరోపంబులు నృపుని శరధి రూపడఁగించెన్. దశా. 6. 106.

2. చచ్చు.

మ... లెక్కింపఁ జెక్కైనకాల్వర మొత్తంబులు రూపడంగె... భార. కర్ణ. 2. 200.

రూపడఁచు. స. క్రి. (√రూపడఁగు.) 1. రూపు మాపు, చంపు

చం. ఉడుగని బాష్పపూరముల నుగ్మలి యవ్విభు పాదపద్మముల్, దడుపుచు వర్ధరాత్రి శత ధన్వుఁడు తండ్రి నకారణంబ రూపడచుట యున్ శమంతక మహామణిరత్న మతిప్రయ త్నమేర్పడఁ గొని చన్న ధార్త్యము నపారపు దుఃఖముతోడఁ జెప్పినన్ ... వి, పు. 6. 282.

సీ. ... వార్ధిఁ గలంచి పాంచజన్యంబు చేపట్టి రూప, గీ. డించె నా జరాసంధుఁ బాండవుల మనిచె ... - ఉ. హరి 2 84.

2. వశింపఁజేయు.

చం. ఎరగలి చిచ్చు గాఁడవి యెల్లను జెల్లగ నొక్కపాయగా, దరికొని రూపడంచిన విధంబున ... భార. భీష్మ 2. 5.

సీ. కోపంబు మీఱఁగాఁ జాపంబుఁ జేపట్టి రోపంబుచే దాని రూపడంచె ... దశా. 2. 395.

రూపధేయము. సం. వి అ. పుం. రూపము. ఆకారము

కం. శ్రీయోగ స్త్రీయోగ వ్యాయామయుతరోమాంచ భూషణ నిరీక్షణ యామ్నాయమయభావన కృతా, ధ్యాయస్మృత రూపధేయ దత్తాత్రేయా చంద్ర. 5. 1.

రూపనాశనము సం. వి. అ. పుం. కౌశికము, గుడ్లగూబ. (విల్యమ్సు).

రూపము. సం. వి. అ. న. 1. ఆకారము, రూపు. 2. శుక్లాదివర్ణము 3. సొగసు, అందము. 4. స్వభావము, గుణము. 5. స్థితి, స్వరూపము.

గీ. ... ఉన్నరూప మేర్పడఁగఁ జెప్పుము ... దశకు. 2. 93

కం. క్షమయ కడుమెల్లయు తోడ పుత్రమ రూపముగోరువారు దాల్తురు దానిన్ ... భార. ఉద్యో. 2. 40

6. సామ్యము, పోలిక.

(సమాసాంతమున ఉదా. తపోరూపము.)

7 విభక్తి ప్రత్యయముల యొక్కయు క్రియాప్రత్యయముల యొక్కయు చేరికచే మార్పు చెందిన రూపము. 8. ఒకటి, ఏకసంఖ్య. 9. నాటకాది రూపకము, కంఠపాఠము చేయుట, వల్లె వేయుట. 10. ఒకనాణెము, రూప్యము.

11. శబ్దము, పదము. 12 (గణిత.) వ్యక్త రాశి. 13. మృగము, జంతువు. 14. పద్యము, శ్లోకము. 15. పేరు, ఆఖ్య. 16. అగ్ని గుణము.

రూపరి. విశే. (రూపు + అరి) రూపవంతుఁడు, సౌందర్యవతి.

మ. స్ఫురణం బాసిన సజ్జనుండు ధన లుబ్ధుండైన రాజున్ నిర, తురుఁడౌ రూపరి రచ్చలో ఖలుఁడు.
మల్లభూ. నీతి 46.

రూపఱు అ. క్రి. (రూపు+అఱు). 1. చచ్చు. మృతి నొందు.

కం. వెలవారి నెల్లఁ దరమికి, నఱకుచుఁ బాండు క్షితీశనందనులను రూపఱ నేయం జేయూడదు.
భార. ఉద్యో 4. 150.

ఉ. ... కాలు చేతి బ,ల్లో)క్కల నమ్మను బ్రభృతు లున్ దుదరూపఱకుండ నేర్చరే. ఆము. 2. 78

సీ. ఒక దైత్యుఁదొడరి యా భంగి రూపఱఁజేసి రక్షించె నేకచక్రాపురంబు ...
భార. విరా. 1. 74.

2. నశించు, చెడు.

సీ. సోమపాన క్రియ చొప్పులు రూపఱె హూత ములు కలవర్యో హుతవహులకు ...
హరి. పూ. 1. 100.

కం. కోపమెఁడగు దుర్వాసుని, శాపంబున దివిజ రాజ్య సంపదలెల్లన్, రూపడిన చంద మబ్జజుఁ, డా పురుషోత్తముని తోడ వంతయుఁ జెప్పెన్.
వి పు. 1. 169.

సీ. మనుజేంద్ర సంకల్పమునఁ బుట్టుఁ గామంబు రూపఱు దేహనిరూపణమునఁ ..
భార. శాం. 3. 421.

3. రూపుచెడు, విఱుగు.

చం. జనకుఁడు మెచ్చఁగా హరుని చాపము రూపఱఁజేసెఁ బెంపుతోఁ, దన భుజవీర్య శుల్కము కతంబున సీత నయోనిజాత నే, ర్పున వరియించి హైహయ పురోగమ రాజకులాంబుదప్రభం,జను జమదగ్నిసూను భుజసత్వ మపాస్తముఁ జేసె ధీరతన్
వి పు. 5. 320.

4. విరూపమగు.

గీ. ... వృకోదరు పల్కు దప్పఁకుండఁ దద్గదా దండప్రచండనిహతి, రెండు దొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ, గూలి రూపఱె రారాజు ధూళి గ్రుంగె.
కావ్య. 1. 9

రూపవంతము. సం. విశే. త్రి. 1. ఆకారము గలది, లేక రంగుగలది. 2 శరీర సంబంధ మైనది. 3 మూర్తిమంతమైనది, శరీరము ధరించినది. 4. సుందరమైనది, అందమైనది

రూపసి. విశే. (√రూపు) సౌందర్యవంతుఁడు, సౌందర్యవతి.

కం. ... అంచితగుణుఁడు రూపసియునగు, సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణవంద్యా.
భార, ద్రో. 2. 190.

శా. ఈ రూపే కలలోపలం గలసె వన్నె రూపు నం జేరు నా, కీరూ పింతటి మేటిరూపసికిఁ దా నిల్లాలుగా నోము న,గ్గారా మేలలితాంగికిం గలుగు ...
ఉ. హరి. 5. 155.

గీ. రోగశంకా విహీనుండు రూపసియును ....
హర. 2. 53.

క. రక్కసిమగువలయందును, జక్కలచెలులందు వేల్పుచానలయందుం, బక్కదొరగొలువువవలా, రొక్కమునందైన నిట్టి రూపసి గలదే.
అచ్చరా. రా. అర. 19.

గీ. అథుల యందైన మఱి యపత్నికుఁ డనుము, బ్రాహ్మణార్థంబుఁ జెప్పరేపాటివారు, నొకతె రూపసిగాఁకున్న నోసియన్న, నోయనెడు మాత్రమునకైన ను డపలయు.
శుక. 3. 315.

ద్వి. బాపురే యమునానఁ బ్రాలేమిగాక, రూపింప వాకంబె రూపసి గదె ...
ద్వి. హరిశ్చ. 4. 1036 పం.

రూపాజీవ. సం. వి. అ. స్త్రీ. వేశ్య, లంజె.

రూపాయ. వి. ఒక వెండినాణెము. (తారకా వర్ణ నము.)

సీ. కాలంబు పేరి చీకటిగొంగకు వణంకి పాఱంగఁ జల్లు రూపాయ లనఁగ... సుదంశా. 2. 150.

రూపార్చు (ఱుచు). స. క్రి. (√రూపాఱు.) రూపుమాపు.

గీ. గబ్బిబెబ్బులి డాకాల ద్రొబ్బి విరియఁ, బ్రామి రూపార్చుకున్న నీ బంటఁగాను.

రూపాఱు = రూపఱు. అ. క్రి. (√రూపు) నశించు, చెడు. (చూ. రూపార్చు.)

రూపాస్త్రీఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు.

రూపించు స. క్రి. (√రూపు.) నిర్ణయించు.

శా. పెంపేదం దమకిట్టి తక్కునలు రూపింపంగ నేలా ... భార. ఉద్యో. 3. 103.
భార. ఉద్యో. 1. 25.

2. విమర్శించు.

ద్వి. బాపురే యెంతనేర్పరి యొకో నలుఁడు, రూపింపఁ బెద్దయు రూఢికినెక్కె, యరుగు దీర్చిన మాడ్కి వలవడఁ దీర్చె ...
(రం. రా. యు. 316 పు. 14 పం.)

శా. గోపాలత్వ విరూపుఁడైన కతనం గ్రొవ్వ గ్గలంబై మదిన్, రూపింపం జొరకేను నిన్ను నిట సంరోధించి శాధించితిన్ ...
హరి పూ. 7. 199.

రూపిక. సం. వి. అ. స్త్రీ. శ్వేతార్కవృక్షము.

రూపు. వి. (సం. రూపమ్.) 1. ఆకారము.

గీ. వినయమున ద్రోణురూపు మన్నన నమర్చి .. భార. ఆది. 6. 232.

కం. తన యింట నొండెడకు నెందును బోవక నెమిలిరూపుతో నొప్పెడు కేతనము తనరారు, చోటికిఁ జని యాసీనుఁడయి యాప్తజనములు వొగడన్. హరి. ఉ. 7. 21.

2 సౌందర్యము, చక్కఁదనము.

కం. నీ రూపు చూచి వలచితిఁ, గారుణికాగ్రణివి నన్ను గైకొనుము పరిహారంబునకుం గారణ, మేరూపునలేదు... హరి. ఉ. 8. 96.

గీ, ధరణిధరకన్య నిందించెఁ దనదు రూపుఁ, బరులు మెచ్చని చెలువు నిష్ఫలము కాదె .. హర. 4 3

వ. ... సకల సీమంతినీ సీమంతముక్తామణియగు నాముక్తమాల్యద రూపు నెలప్రాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి తనలోన ...
ఆము. 6 104.

3. దేహము, శరీరము.

కం. నరతురగద్విరద రథోత్కరముల లో నతని శరముదాఁకని రూపుం, బరికింపఁ గానం ద, త్వరితత్వంబునకు వేఱువర్ణన యేలా
భా. ద్రో. 4 70.

గీ. మన్ను గేస్తుఁడు నగ్గియు మిన్న నీరుఁ, బ్రొద్దు నెలగాడ్పు లెవ్వాని రూపు లయ్యె ...
నీలా. 1 12.

చం. దొరఁకొని పూర్వజన్మమున దుర్జనశిక్ష యొనర్పఁగాని సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దటిలేమి నాత్మలో, హరి తలపోసి సౌఖ్యముల నందఁగఁ దత్పురిఁ జెక్కురూపులై, సొరిది జనించె నా నృపతిసూనులు వొల్తురు శ్రీసమేతులై ... విక్ర. 1. 71.

సీ. ధర్మభూమిధరంబు పలురూపు లాయెనో యన మించు నర్మహర్మ్యములు గలుగ ...
ఉ. రా. 1. 233

4. విధము.

కం. నారాయణాస్త్రము మిమ్మోయి, వైరిచమూ సంచయంబు వధియింపకపో, రారాజును ద్రౌణి యుఁ దా, రేరూపున సంచరించి రెటఁగింపు తగన్ ... భార. ద్రో. 5. 391.

కం. ఈ రూపునఁ బొలివోయిన, వీరములో వృష్ణి భోజవిభు లేతేరన్, ద్వారవతి కరిగి నిలిచితి ...
ఉ. హరి. 2 35.

కం. మారుఁడు దుర్వారుఁడు సం.సారమిది యనాది
వంశసంరక్షణ మం,భోరుహవదనల చేతిది, యే
రూపున జాతిశుద్ధి యేర్పఱుప నగున్...
నైష. 7. 67.

వ. తనదు సాకార నిరాకారతలు వారికిఁ జూపు
జూపున దీపించు వాని... ఆము. 6. 98.

5. స్థితి.

చం. ... దానిది కలరూపెఱుంగ నవనీపతి
యుత్సుకుఁడయ్యె నాత్మలోన్ ...
భార. ఆది. 4. 30.

కం. . . కల రూపెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ
నాకున్... భార. కర్ణ. 1. 12.

వ. ... మాయంగుళీయకంబు నీకెట్లు కలిగె? ఉన్న
రూపు చెప్పుము... కాశీ. 4. 100.

6. నిజము, సత్యము.

క. వారుగలరు వీరుగలరు, పోరికివని చెప్పెదీవు
పొంగారుచు మీ,వారిని మిమ్ముఁ నరేపుగ, దా
రూపేర్పడఁగఁ జూచెదం గితవసుతా.
భార. ఉద్యో. 4. 206.

7. కన్నెపిల్ల మెడలోఁ గట్టిన బంగారునానెము.

ఉ. ... నేఁ, జేరక పూవుదీవియలచెంతనె నిల్చి
లతాంగిరూపు క,న్నారఁగఁ జూచి వచ్చితి
వివాహఋరుహాంబక నీకుఁ దెల్పఁగన్...
వసు. 2. 55.

ఔ. రూపగు, రూపడఁగు, రూపడఁచు, రూపర్చి,
రూపఱు, రూపని, రూపార్చు, రూపాఱు,
రూపించు, రూపుమాపు, రూపువిలాపించు,
రూపుమాయు, రూపుసెడు.

రూపు(లు)మాపు. స. క్రి. (రూపుమాయు)
1. నశింపఁజేయు.

ఉ. బుద్ధులు సెప్పుచెల్ల నటుపోవిడు మెమ్మెయి
నైన సౌఖ్యసం,సిద్ధి యొనర్పు నాకు నెడ సేసి
నఁ దావము రూపుమాపు ...
భార. విరా. 2. 76.

మ. .. డెందములోన ధర్మపటిమం ద ద్భూప
సేనాంగద,ర్ప సముద్రేకము రూపుమాప,గళిత
ప్రారంభులై రంతటన్. రాఘవ. 2. 20.

2. చంపు, మృగికొందించు.

మ. ... దుప్పుల్ నుగ్గునూచంబులై, పాలియం
జేసి వరాహసంఘముల రూపుల్మాపి సింగం
పుగుం,పుల నెల్లం దెగటార్చి... శుక. 1. 176.

రూపుమాపించు. స. క్రి. (రూపుమాయు.) నాశము
చేయించు, చెడఁగొట్టించు.

వ. ... పౌండ్ర భూపాలుండు...స్వస్తిక సర్వతో
భద్రవంద్యావర్తపిచ్ఛందకాదిహర్మ్య ప్రాసాద
సౌధంబులు రూపుమాపించియు ...
ఉ. హరి. 3. 36.

రూపుమాయు అ. క్రి. (రూపు+మాయు.) నశించు,
చచ్చు.

ఉ. మ్రొగ్గెడు వాహనంబులును మోములు
వాడఁగ వాహనంబుల,న్డిగ్గి, తలంగు సైనికులు
నేలకుఁ గష్టపుఁ జొప్పుసొప్పగన్, ద్రగ్గ నిడం
బులుం గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి
యొంగిమై, మ్రగ్గెడువాఁడునై కురుధరావరు
సైన్యము రూపుమాయఁగన్
భార. కర్ణ. 2. 355.

రూపుసెడు. అ క్రి. (రూపు+సెడు.) నశించు,
చెడు.

ఆ. అంత నిలక యమ్మహాబలు నిగ్రహింతుఁ, జేసి
శత్రుబల విజృంభణంబు, రూపుసెడ హరింతు
నేపున వావార,లెల్లఁ జూచి సంతసిల్ల ననుచు...
రాఘ. 4. 197.

కం. ఏమిట రక్షగుఁ బురుషుం, డేమిట రూపు
సెడు నాకు వెలిఁగింపుము తే,జోమహిత
యనిన నతఁ డా,భూమిపతికి నిట్లనియె
భూపప్రవరా ... భార. శాం. 5. 3.

రూపవ్యము. వం. విశ. (అ. అ. అ.) 1. అందమైనది.
మనోజ్ఞమైనది.

వి అ. న. వెండి. 2 వెండినాణెము. 3. బంగారము.

**రూప్యాధ్యక్షుడు.** సం. వి. అ. పుం. టంకశాలకు యజమానుఁడు, కోశాధిపతి.

**రూషకము.** సం వి. అ పుం. వాసకవృక్షము.
విణ మిశ్రితము

**రూషితము.** సం విణ. అ. ఆ. అ. 1. ధూళి మొ. వానిచేఁ (ఖాయఁబడినది,) కప్పఁబడినది. 2. కఱుకుగా చేయఁబడినది. 3. రత్నఖచితమైనది.

# రె

**రె** అవ్య. ఆశ్చర్యార్థకమును వాక్యాలంకారమునగు, నఁట్, బాపు మొదలగువాని కనుప్రయుక్తము.

గీ. మైకాఁకకు నుజల్వమందులఁ బెట్టేరు దీనిచేఁ గాఁకలు దీఱునఁటరె.... కలు. శ. 18.

చం. సర్వములయారెమేలుగ్రుబిలి బాగురెమూర్ఛవకంపితంబు బాపురె... ఉ. రా 6. 135.

**రెంచే** వి. (జూదమునందు) రెండు (శ. ర.).

**రెంజితుంజి** క్రి. విణ. సంపూర్ణముగా, పూర్తిగా.

ద్వి. దేవహెచ్చరిక దైతేయారి యనుచు, కీవిమైమున్న కట్టికవారు నడుమ, వలరు శంఖధ్వనులదరంగ దైత్యకులవధూగర్భార్భకుల రెంజితుంజి, యఱిముఱి మురువేప నా వాద్య గతులఁ, గుబుచల నిడఁదలఁగూడి వాయింప, సన్నమెఱింగి యాసన్నకాళియలు, సన్నలోమగఁగూడి ఒళిమఁబూరింప ....
అ. మ. క. 5. 2. 41 పొ. 14 పం.

**రెంట.** వి. (√రెండు.) 1. రెండగుట.

కం. ఆరెట్లట్లగఁ దమ్ముఁడు, జేవ ముత్తెంపు సరులఁ పేడియచన్నుల్,లో రెంట బుటి పె
ఆము. 5 23.

ఉ. బంటుతనంబు పెంపెసఁగఁ బచ్చరి శారున్నకమొక్కు వెట్టి యా, యెుగ్రిరియైనయట్టి శివ యోగాముద్రము నాదు కోలలన్, రెంటలుచేసి శీఘ్రమువ నిక్కముగాఁ జలికొండ కూఁతుపు, ట్టింటికి వెంట గౌరి చన నీకునితోఁ బఱతున్ సురాధిపా.... వీర. 2. 65.

2. (నీతి) ద్వైధీ భావము.

గీ. ... షడ్గుణములగుచుఁ, బేరుకొనఁగాను వగుసంధిపోటుపోక, యునికి రెంట ననండన సుగ్రమూర్తి .. అం. భా. 2. 169.

విణ. రెండర్థములు గలది (వాక్యం.)

గీ. భోగి సహవాస సంబంధములు భజించు, భువనధారి హస్తంబునఁ బోయుమనుచు, రెంటమాటల బలిఁ బ్రతారించినట్టి, దంభవామన మామనస్థాప ముడుపు. నైష. 8. 148

**రెంటఁద్రాగుడుమెకము.** వి. (రెంటఁద్రాగుడు + మెకము) ద్విపము, గజము

గీ. గాలితేజిమెకంబులు క్రోలుపులుల, కొదమసింగములే రెంటఁద్రాగుడుమెకంబు, లల త్న ధ్వాజమునిరాజనిలయమునకు, బలకరంబున జోడుల వగిదిఁ బొలిచె. రామా. 5. 51

**రెంటత్రాగుడు.** (√రెంట.) వి. ద్విపము, గజము ఏనుఁగు.

సీ. రెంటత్రాగుడు చట్ట రెంకెంపుతాలుపు తలపువ్వు తండ్రిలో నిలుచు జియ్య ...
ప్రబంధ. 1583

**రెంటత్రాగుడుతిండి.** వి. (రెంటత్రాగుడు + తిండి.) సింహము

కం. ఒకమున కంకెను బ్రజ్ఞాబల మెక్కుడు గాదె బుద్ధిబలమునఁ బేర,చ్చలమునఁ గైకొను హాలిగాఁ,దలఁద్రుంతుం జెండి రెంటఁ ద్రాగుడు నడన్. వేం. పంచ. 1. 347

**రెంటపేట** వి. (రెండు + పేటలు.) జేములు (చి. ని ).

**రెంటము** వి. 1. రెంకెము, జమిలినూలిబట్ట.
ఉ. కుమ్ములు హాస్యవాహములు గుత్తపు సుగ్గడి

తంపుఁ దోఁపు రెం,టమ్ముల్లు దట్టుపున్న మృగ నాభియుఁ జాఁదును నోడె... క్రీడా. 46.

2 పార్శ్వమందలి కట్టు టట్టమడత, రొండి.

సీ. మృతమర్త్యు రెంటావ నిడ్డఁజాలక నెత్తు రంజిల్లు వెనుపొట్టముంజివాని ... ఆము. 6. 19.

**రెంటాడు** స. క్రి. (రెంట + ఆడు.) ద్వివిధ ముగాఁ బలుకు.

మ. భయముం దత్తరపాటు దైన్యమును దోఁపన్ స్వామి శ్రీరామ మీ,దయకుం జాత్రుఁడఁ గానె యేమిటికి నిద్రాణిణ్యు చిత్తుండవై,తి యథార్థస్థితి రాఘనుం డనియె భక్తిం గొల్వ లేదో హిత,క్రియలం దేమటియుంటినో పలుకులన్ రెంటాడి కావైతినో.

శ్రీరం మా. 2. 124.

**రెంచెము.** వి. గెంచెము. జంటనేఁతవస్త్రము.

సీ. పుటియల చౌకీలు పొలుపైన తలపాలు పన్నగ విసఁటము బన్నసరము, ఒలుకుల బూది క్రొవ్వ లవులజవ్వాది వేలిమి మెకము పిసాళికుళము, చాఱలరెంచెంబు సన్నంపు గెంచెంబు ఖాను పండులచాలు పసిఁడినూలు. వరాహ. 9. 88.

సీ. పులితోలు రెంచెంబు వెలిపట్టు గెంచెంబుఁ గటిమండలంబున గరిమఁదనర ....

రుక్మా. 1. 29.

సీ. పులుగురాయని చట్టుపలవన్నె నొరవట్టు హుంబట్టు జిలుఁగు రెంచెంబుతోడ ...

ఆము, 1. 12. యయా. 4. 3.

**రెండర.** వి (రెండు + అర) రెండునర. సార్థ ద్వయము.

ఉ. అర్ధమ రేయిఁ బోయిరి శివాయని పల్కుచు రెండరామడన్ ... కాళ. 4. 55.

సీ. రెండర యేఁట నొక్కండధిమాస మిట్లెక్కిన యన్నెలలెల్లఁ గూర్చి కొనఁ బదు మూఁడు హాయనములు దప్పక నివ్వటి తోడన నిండె. ...భార. విరా 4. 232.

(ప్రాఁతప్రతి పా. రెండేఁడులరకు నొక్కండధి మాసము. అని భా. ఆ. వ్యా. పా, రెండవ యేఁట. ముద్రి. పా.)

**రెండాడు.** అ. క్రి (రెండు + ఆడు.) 1. రెండు మాటలాడు, ఒట్టమాడు.

కం. నేలయు మదకము తేజము, గాలియు వాక సము నెఱుఁగఁ గాచితి నాకై, కోలిడె రెండాడఁగ నా, నాలుక మీ కులమువారి నాలుక లటవే ? ద్వా. 5. 195.

2. నిందించు (ఎదురుచెప్పు, ప్రతిఘటించు.)

కం. రూఢిగ బిజ్జనదను రెం,డాడిన భూపతుల శిరము లసిముఖమునఁ జెం,డాడుమఁ గయ్యము లిచ్చవడె, యేడెన్నఁగఁ బొడిచె జయమహీ వల్లభుఁడై.

(చూ. ఆ సా. ప. ప. 8.) కొండిదేవ శాసనము.

**రెండవసూతకము** వి. (√రెండు) మృతా శౌచము, మైల.

సీ. ఎట్టి చుట్టంబేని యింటికేతేర రెండవ సూతకముఁ దెల్పి యవలఁ జొనుపు ...

పాండు. 4. 149.

**రెండు.** వ. బౌ. ద్విశబ్దార్థకము.

(దీనికి వృత్తియందు హల్లు పరమగునపుడు ఇరు ఇను ఆదేశములగు, అచ్చు పరమగునపుడు ఈరు అనునదియు, వికల్పముగా నాదేశములగును. చూ. ఇరు, ఈరు. సమాసమున వర్ణవికారము వైకల్పికముగానగు. బ. రెండ్లు, రెండులు.)

ఉ. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి యీకుండుట దాన ధారకుఁ బయోనిధుల్ వ్యయింపఁగేమి యీ, రెండవ కీర్తులం దలధరించినవాఁడు ...

నైష. 1. 51.

మహాస్రగ్ధర. స్వనిలింపావాపదశ్యాళవదతిలమిథ స్తాంతమ్యంబు లీ రెం,డును దీనుల్గాంచు వమ్మా డుపులనె ... ఆము. 1. 58

గీ. నాలుగింటను వెండియు నాలుగింట, రెంట
నైదింట మఱియును రెంట వేల్చి, యజ్ఞశీలు
రారాధించు నట్టి విష్ణుఁ, డిష్టదాయి ప్రసన్నుఁ
డయ్యెడును నాకు భార శాం. 4. 222.

కిం... పెల్చినయే నమ్ముల నా రెంటిని ద్రెళ్లఁగ
నేసెఁ గడుఁగరిన హృదయుండై ...
భార. అను 5. 49.

కం. రెన్నెల్లలోన నాకుం, జెన్నొందఁ వధీనగాఁగఁ
జేయుఁడు .. భా. రా. సుం 204.

కం తనబిడ్డమధ్యమున జూచిన దలతేకున్న
వాఁడు చెల్లున రెన్నెల్లను ...
జై భా. 8. 100.

గీ. ఇంక రెన్నెళ్లు నూఁచు నీ వంకఁ దెగువ, గలుగ
కుండ బ్రతుకులూళ్లు దలఁచి పోవ ...

వి. భేదనము.

చ పతియుడ రెంటు తేజ కులభామలు భారతఁ
దెట్టఁడైన సమ్మతిఁ జరియించు టొప్పు ....
భా. రా. అయో. 297.

రెండాఱుచేతుల జేఁడుఁ = కుమారస్వామి.

మ. ... రెండాఱుచేతుల జేఁ డుండిన జెల్లు
టల్లు గనుమా దోషాచరగ్రామణీ ..
ఉ. రా. 3. 62.

రెంటికిఁ జెడిన రేవఁడు = ఉభయభ్రష్టుఁడు.

గీ. అనుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ,
జఁడికతమున ముని బ్రహ్మచర్యనియమము
వకు గృహమేథి వర్తనమునకుఁ దొలఁగి, రెంటి
కినిఁ జెడ్డ రేవని రీతి యయ్యె ...
జై. భా. 4. 87.

జ రెంట, రెంటఁద్రాగుడు మేకము, రెంట
త్రాగుడు, రెంటద్రాగుడుతిండి, రెంట పేట,
రెంటాడు, రెండర, రెండాడు రెండవనూత
కంబు, రెండుదలచు.

రెండుదలఁచు. అ. క్రి. (రెండు + తలఁచు.) కపట
ముగాఁ బ్రవర్తించు.

సీ. వేదఘోషణలేని వీట నున్న యతండుఁ దలి
దండ్రులకు రెండుదలఁచు నతఁడు ...
జై. భా. 1. 86.

మ. తలయుం గోకయు వీడఁగాఁ జలిచి సంతా
పంబునం గాశికానిలయం బొక్కఁడ చొచ్చి
చచ్చిన నుతు వీక్షించి శ్రీవిష్ణుభక్తుఁ కున్
రెండుదలంచు ద్రోహులకు యుక్తుల్ గొల్చునే
యంచుఁ దద్విళిపిశోవలపాత భగ్నశిరఁడై
ప్రాణంబులం బాసిన౯. జై. భా 8 112.

రెంబ = రెమ్మ. వి. ఉపశాఖ. (శ. ర.)

రెక్క. వి. 1. పక్షము

గీ. అతివ చన్నులు జక్కవలగుట కేమి, నంది
యంతింత దండలచోయ నిగుడి, రెక్కకై
యుండ సొంపునఁ బిక్కటిల్లి, వలిపపయ్యెద
యను చిన్నివలను దగులఁ. (యయా. 4 43)

కం. గ్రక్కునఁ జని వ్రాలుదువో, రెక్కలుగట్టు
కొని దివిజరిపు మేడలపై .... ప్రభా. 4 86

ద్వి. రెండు హస్తము లెత్తి రెక్కలతోడి, కొండ
రివ్వున వచ్చు కొమరు దీపింప ...
రం రా. బాల. 27 పొ. దశా. 1. 14.

2. పక్షతి, రెక్కమొదలు.

సీ. .... రెక్కనాఁ బక్షతియగు ...
ఆం. భా. 2 99.

జ రెక్కచాఁపు, రెక్కతలుపు, రెక్కలతేజి
రెక్కపాయ.

రెక్కచాఁపు. వి. (రెక్క + చాఁపు.) అంతరీయోత్త
రీయముల జత. (చి ని.)

రెక్కతలుపు. వి. (రెక్క + తలుపు.) ద్వారమున
కిరుప్రక్కలనుండు రెండువలకలతో నేర్పఱచిన
తలుపు. (చి. ని., శౌ., వా.)

రెక్కలతేజి. వి. (రెక్కలు + తేజి.) గరుత్మంతుఁడు

ద్వి. శ్రీనతిపతుఁడైన శ్రీరంగశాయి, మెచ్చి
రెక్కలతేజిమీఁద నొంపారు, లచ్చితోఁగూడ
నుల్లము పల్లవింప, నారూఢుఁ డగుచు...
ద్వి. పరమ. 7. 494 పొ

సీ. వెడదసన్నపుటత్తె బ్రేళ్లుబ్బు చెక్కిళ్లు రెట్ట
కట్టెదురికి మిట్టబోర. ప్రబంధ. 191.

రెట్టి విశ. ద్విగుణము.

చం. పొరిఁబొరిఁ బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన
మాచరించు.. భార. విరా. 1. 209.

ఆ. ఖూడి, యద్భుతంబు రెట్టియై జనింప.
హరి. పూ. 8. 192.

సీ. మైనిండు పాలీని మగ్గంపుఁ జకచకల్ బూది
పూతకు రెట్టపుట్టసేయ.. చంద్రా. 3. 89.

ఉదా రెండురెట్లు, మూఁడురెట్లు.

జ. రెట్టించు, రెట్టింపు, రెట్టిత్రావుడు.

రెట్టించు అ క్రి. (√రెట్టి) ద్విగుణమగు, ఇను
మడించు

క. నీలధూపఘాతపత్రి, ధ్వజకంకటఖండవేష్టితము
లైన కరు, వ్రజగాత్రశకలములు వారిజనాథ
కనుంగొనంగ రెట్టించె వగల్
భారం. స్త్రీ 2 53.

శా. శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొనుచుం
జెల్వంబు రెట్టింపఁగన్ ...
హరి. పూ. 5. 170.

కం. నిట్టూర్పులు దళుచయ్యెను, గట్టులదొరకలికి
కలికికన్నులయందున్, రెట్టించె ధవళ
కాంతులు, పట్టుగఁ గనుఁదెవ్వలలసభావముఁ
జెందెన్ జాహ్నవి. 1. 91.

వ. క్రి. ద్విగుణము చేయు, ఇనుమడించు.

సి. తరువాత నదిమొదల్ దప్పక రెట్టించి ...
అప్ప. 4. 143.

వ. .. ఉత్కృతియందుఁ బుట్టిన సమవృత్త
సంఖ్య రెట్టించి ... అప్ప 4. 139. టీక.

రెట్టింపు విశ. (√రెట్టించు). ద్విగుణితము.

సీ. రెంటత్రాగుడు చట్ట రెట్టింపుతాలుపు తల
పువ్వు తండ్రిలో నిలుచుజియ్య.
ప్రబంధ. 153.

రెట్టిత్రావుడు వి. (√రెట్టి.) ద్విపము, ఏనుఁగు.

వ. ... పదయుగనఖాంచలంబులఁ బంచంచు
చూపుటంబుల రెట్టిత్రావుడు బొబ్బమెకము
దచ్చికాళ్లి మెకంబుల నిరీక్షించి కలుచుక
యుప్పరంబున కుప్పరం బెగసి మల నెలయేళ్ల
పులినతలంబుల వజ్జగా వజ్జగాఁజెండు గండ
భేరుండ కాండంబులును ప్రబంధ. 156.

సీ. ... చెలఁగి అంకెలువైచు వెలిగిబ్బ మావులో డా
వంక నొఅపౌ మిటారితోడ, రెట్టిత్రావుడు
గాము చట్ట డువ్వెలువతో ...

గీ యతునకు మ్రోల హరుఁడు ప్రత్యక్షమయ్యె.
శ్రీరం. మా. 4, 80.

రెట్టు. వి. ముతుకబట్ట. (శ. ర.)

రెడి వి. రెడ్డి.

కం. చాలు విసాళింపకుమని, యాతరి రెవెసాని
మగని వదలించి సుతుం, దాలును నీవును
నిచ్చోఁ, దాలిమి వసియింపుమని యతని
లాలించెన్. వేం. పంచ. 4, 453.

రెడ్డన. వి (రెడ్డి+అన[1]), రెడ్డన్న, రెడ్డి.

కం. ఈ రీతినుండి యొకనాఁ, డా రెడ్డన పనికిఁ
దలుగు లమరించుటకై, నారలు గావలెనని
పొరు, గూరికినై పోయి మట్టియాడలు
దేరన్. శుక. 2. 338.

రెడ్డి=రడ్డి. వి. (ఎత్వమునకు నిర్ధారక ప్రయోగము
కనబడలేదు.) కాఁపులలో నొక తెగవాఁడు,
గ్రామాధికారి.

గీ. దొడ్డయేశ్వర వివకోటరెడ్డి విభుల ...
కాశీ. 1. 24.

గీ. రెడ్డికొడుకైన యొక యెడ్డెబొడ్డిగీఁడు, పొల
ము దోఁకరి కాచెనుబోతువంటి, వాఁడయో
దాని మగఁడఁట వాణిమగని, కెంత
చెడిపోయెనో బుద్ధి యెట్లుగూర్చె.
ఉ హరిశ్చ. 4. 12.

మ. . . మేఁ, కెరువుం గుంపటి మంచమెక్కిరి
ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడివ్ ... అము. 4. 134.

గీ. అనిన నలఁతిగఁ గోల్పోక యతఁడు రెడ్డి, రాజుఁ గనుననని... ఆము. 6. 83.

జ. రెడ్డర, రెడ్డిపాలవంకెలు, రెడ్డివంకెలు, రెడ్డి వారి వానఁ బ్రాలు.

**రెడ్డికము.** వి. కూర్చొనుటలోని భేదము. ముడుచుకొన్న యొకమకాలి తొడమీఁది మోఁకాలు మీఁదుగా ముడుచుకొన్న కుడికాలి పాదము మోపి, ఆ కాలిని వీఁపును వస్త్రముతో బిగించి కట్టుకొని కూర్చుండుట. ("రెడ్డిగము" అని శ. ర.).

వ. ... వలువకు రాజధానియైన మనోవత్ నగంబు దనకు మణికిరీటంబుగా మెఱయు నగరాజంబునకు రెడ్డికంబునుం బోలె నొద్దునం బదివేల యోజనంబులు పొడవున ముప్పదివేల యోజనంబులునై చుట్టి వచ్చి వియచ్చర ... ప్రవాళంబగు చక్రవాళంబున సూర్యాది గ్రహములు సంచరించు ...

వరాహ. 10. 114.

**రెడ్డిపాలవంకెలు.** వి. బ. (√రెడ్డి) ధాన్యవిశేషము.

సీ. పచ్చపసుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు పచ్చకర్పూరనరులు ... హంస. 4. 123.

**రెడ్డివంకెలు.** వి. బ. (√రెడ్డి.) ధాన్యవిశేషము.

వ. ... వసపుగన్నేర్లు గుత్తివంకపుత్తులు రావి పూరాజనాలు పొన్నశ్రీరాజనాలు నివ్వరులు సీగకాపులు రెడ్డివంకెలు చౌటవరులు టి గెమల్లెలు సుఖభోగులు ...

ప్రబంధ. 112.

**రెడ్డివారినానఁబ్రాలు.** వి. (√రెడ్డి) ఒకానొక యోషధి (వృ. వి.). శ. ర. (బ్రౌ., వా.)

**రెపరెప** వి. 1. నిప్పు మండునప్పుడగు ధ్వని కనుకరణము. 2. గాలి వీచుటయందగు ధ్వని కనుకరణము. (శ. ర.).

**రెప్ప=ఱెప్ప.** వి. నేత్రపక్ష్మము. (శ. ర.).

ఉ. అప్పుడు భీష్ముఁడేమి హృదయంబున నుమ్మలి కమ్ము గూరఁగా, నెప్పటి చందముల్ విడిచి యేడ్తెఱఁ దక్కిన చూడ్కుల్ రొండొరు, బ్రెప్పలమాటునం బొలయ నీ సుతుపాలికి వచ్చు రాజులం,దిప్పు డతండు నాకవదే యని కర్ణుఁ దలంచి రందఱున్ . .

భార. ద్రో. 1. 14.

ఉ. కోరిక ఱెప్పలెత్తుచును గొంకక నంచెరెప్ప వ్రాల్చుచున్ ... కళా. 2. 276.

**రెప్పము.** విశ. పూర్ణము.

శా. ఆలోకించెదు శార్ఙ్గముక్తవిటుకాణౌఘంబుచే నీ మొనల్, నేలం గూలఁగ ఫాలపాలికలతో నిండారు రక్తంబులన్, గ్రోలం గోలెఁ బిశాచ జాలికలు నైకొన్నన్ మణిశ్రేణితోఁ, గ్రాలం బట్టిన వెండికోరల గతిన్ గప్పంబు రెప్పంబుగాన్. ఉ. హరి. 4. 195.

(శ. ర., వీరేశ. పా. వావిళ్ళపాఠము. కప్పంబు లొప్పంబుగాన్.)

**రెపరెపమను.** అ. క్రి. (జఠరాగ్ని.) మండు, ఆఁకలి యగు.

వ్యవ. వానికిఁ గడుపులో రెపరెప మనుచున్నది.

**రెప్పాల.** వి. వన్యవృక్షవిశేషము.

(పాదిరివంటి యాకులు గలది. దీని యాకు కారముగ నుండును. ఈ మ్రానిపలక దంతమువలె ధవళమై స్నిగ్ధమై యుండును. చి. ని.)

ద్వి. బోల పంపములు నరోళ కుంజములుఁ, బాలమ్రాఁకులును రెప్పాల మ్రాఁకులును.

ద్వి. పరమ. 2. 54 పా.

**రెబ్బ.** వి. రెమ్మ, ఉపశాఖ.

ఉదా. రెండు కరివేప రెబ్బలు తెమ్ము.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ నెంగ చివ్వ ... అవ నుపశాఖ చెలఁగు... ఆం. భా. 2. 37.

**రెబ్బు.** స. క్రి. సంహరించు, చంపు.

కం. ఉబ్బఁడు లిబ్బులు గలవని, తెబ్బఁడు రిపురాజుగాని రేఖలవఱరా,యబ్బఁడు. పరభామినికై, యబ్బఁడు శ్రీపాదకమలని యబ్బఁడు ధాత్రిన్. జకా. 1. 20

# రే

రే¹=రేయి. (సం. రాత్రిః) రాత్రి, నిసి.

కం. పలుకులఁ బనిలేదీ రే, తలపెట్టకపోరువా రుదగ్రత నేనుం, బలము మెఱయఁ జాంచా లుఁ, బోలియింపక కత్తశంబువుచ్చ వరేంద్రా. భార. ద్రో. 5 37.

కం. నా విని సుబలతనూజుఁడు, దేవా నీయాన యేను దెల్లంబుగ రే, యీనెంచె నెమ్మి నమ్మిన, భావించితి పనియె .... భార. అర. 5. 232.

చం. ... బంగరుప్రుమేనల సోరణగండ్ల వెంట రే, ల్వని యెదు రిక్క మొత్తములు ... నీలా. 1. 29.

ఉ. ... వ ఁ త్తికందుఁ డా,భీలభుజాప్రతాపమును జెప్పను మీఱఁగఁ బోరె వారితో, రేలు బగళ్లు నా కనలి రేఁగి మొగిం బదిరెండు మాసముల్. ఉ. రా. 3. 375.

జ. రేకంటు, రేగాము, రేచీకు, రేచీఁకటి. రేజోతి, రేదొం, రేద్రిమ్మరి, రేద్రిమ్మరిఁడు, రేపులుగు, రేమగఁడు, రేయెండ. రేయేలిక. రేరా, రేరాచరేక, రేరాచఱాయి, రేరాజు, రేరాయఁడు, రేఱేఁడు, రేవగలు, రేవెలుఁగు, రేవెలుఁగుతీవ, రేవెలుఁగుఱాయి.

అవ్య. 1. ప్రశంసార్థకము

(బళిమొదలగు ప్రశంసార్థకశబ్దముల కనుప్రయుక్తమై యుండును. కొన్నిపట్ల నట్లుకాకయు నుండును.)

కం. ... ఒక్కొకటన, రెంటం బోదువంగ వల యురే వెరవారఁన్... భార. అను. 1. 223.

2. సంతాపార్థకము.

కం. సైరింపరాని శోకము, కారణముగ నాదు తనయ కాంతారములో, మారుతసఖు పాల్పడి యెదు, జూరే... దశకు. 3. 48.

ఉ. కొమ్మను వేలుకొమ్మ కడికుందనమీను సుమమ్మ రెమ్మరే... ప్రబంధ 700.

రేఁగు¹. అ. క్రి. 1. ఎగయు.

సీ. దూర్లమక్కెక్కి మంగళ్లి అప్పులు రేఁగు వడు వున గాలి నాడెదు నెఱలు ... ఆము. 6. 17.

చం. గుణమున అస్త్రకంబువను గోటియుగంబువఁ గేలఁ దార భీషణముగ నుప్పతిల్లి రథసంబువ రేఁగినమాడ్కిఁ దీవ్రమార్గణనికరంబులొక్కట వరాతిబాలంబులఁ గప్ప .... భార. విరా 5. 30.

గీ. రాజసంబున హస్త్యశ్వరథపదాతి, పాద ఘట్టన మేరువు మీఁదఁ బసిఁడి, బూడిదలు రేఁగ నొకనాఁడు దాడివెట్టి ... వరాహ. 6. 129.

2. విజృంభించు, చెలరేగు

కం. ... గాంధారేయులు వెస నొక్కపెట్టు రేఁగి యతనిపైఁ, గోయని కవిసిన ... భార. భీష్మ. 2. 100.

గీ. రాత్రి వచ్చెను జీఁకట్ల రాణమీఱె, మన్మ థుఁడు రేఁగె నోదూతి మఱుఁగులేల, పూని యున్నది నాబుద్ధి వానిమీఁదఁ, దగిన పనిఁ జేయు మీ వేళఁ దాళలేను. గంధ. 178.

కం. ఆ పెనఁగ రేఁగి యట్ల, పాపాత్మకమగు కిరాతబలము సమగ్రాటోపమువఁ గవిసి వివిధ ధనాపహరణ మాచరింప నారంభించెన్. భార. మౌ. 184.

ఉ. రేఁగి చకోరదంపతులఁ బ్రేల్చిన కల్మష పంక మిందులోఁ, దోఁగినఁగాని పాయదని తోయజబాంధవుఁ డిట్లు చేసెనో, వాఁగఁ బ్రశాంతినొంది కిరణంబులు వేఁడిమి దక్కి శైత్యముల్, గాఁగ రథాంగముల్ బెదరఁగా నపారాంబుధిఁ జొచ్చెఁ బెచ్చురన్. భోజరా 2. 98.

3. ఉబుకు, పైకివచ్చు.

కూఁతలువేయించెఁ గొమ్మ యొకతె ...
చంద్రా. 3 97.

చ. ... ఉపాయవుఁ బ్రేలరి మాటలాడి ధీగుల
మచికైన నూఁక విరోధమొనర్చుచు నుంకు
రాజులఁ, జెలుచని రేఁగి తెచ్చి తలపెట్టు
వినోదవుఁ దీఁటవోవఁగన్ ...
హరి. పూ. 5. 92.

4 కోపింపఁజేయు.

చ. వినుమది జంపనుఁ జెరుప వేచుట లెస్స
ప్రతాపబాడబాగ్నిని వెడనుల్లి కుట్టులను
బ్రోకుఁ వానిఁ గెంగఁజేసి రేఁచిన దవ
పూపుప్పు ... భార శాం. 3. 20.

సీ. ... సీకేమిటి వలనఁ దక్కు, వేల
చెప్పఁ మాటల నిల్లు వన్ను, రేఁచె దేనిచ్చు
వఁ ము సప్రీతిఁగొనుము, పుత్రు జగదేక
వీరు ... గనుము. హరి పూ. 9 77

5. అతిశయింపఁజేయు, ఉద్రేకింపఁజేయు.

సీ. అఁ యంచఁబట్టి తెమ్మని కోర్కి రేఁచి నిబ్బ
ఁపుటి తల నీటఁదిరుగనేర్చె . .
ఉ. రా. 6. 94.

చం. ఒకపాలదిండ తొయ్యలికి నొయ్యననవ్వుల
నాస రేఁచి యోపిక వది యిచ్చిరా నెదురు
వెట్టు .. చంద్రా 1. 26.

6. పుట్టించు, కలిగించు.

చం. కుటిలకటాక్షవీక్షణముఁ గోమలనూత్నకపో
లరాగమున్, జటులనమంచితభ్రుకుటిసంవళ
నంబును జూచువేడుకన్, జిటపొటరేఁచె రాజ
సరసీరుహనేత్రకు... నైష. 8. 42.

రేఁచు = రేఁచు. 1. ప్రేరించు.

కం. కర్ణుండు రేఁచిపెట్టఁగ, దుర్ణయపరులైన
శకుని దుశ్శాసను లీ,నిర్ణయమె మేలనఁగ నీ,
కర్ణములకు నించునెట్లు కార్యవచనముల్.
భార. ఉద్యో. 2. 248.

(ఇట పురికొల్పు అని యర్థము)

2. అతిశయింపఁజేయు.

సీ. పదిప్రశ్నములకైనఁ బ్రత్యుత్తరముఁ బొందఁ
జూచు పీనులకింపు రేఁచి పెట్ట ...
కవిక. 3. 223.

రేఁచుకొను స. క్రి. (రేఁచు + కొను, స్వార్థమున)
అతిశయింపఁజేయు.

ఉ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మెడు తమ్మో
దిరించి యేమియన్, డయ్యక కొంతసేపు
పెనుబాకను జేతుఁ ... డెమ్మో
డఁ బోటిజెట్టుకకు సంతియుఁ గొతుక
తారిగాఁచె ... రేంద్రుడుతోఁ యని
తాన యొనర్చుట యుక్తి పెన్నఁగన్
ప్రభా 2. 59.

రేఁకెను = రెంకెను. వి. జంటపోగుజవలువ, జమిలి
నేఁతవస్త్రం.

మ. ... మంచిముత్యాంపేరులు మైథాగవురే
కెముల్ పసిఁడితేరుల్ పల్లకుల్ పోనుగా,
నులువా చేసె యయాతిం దఁపులో
నుప్పొంగుచుం గూర్మితోన్. యయా. 5. 75.

రేఁపు = రేఁచు. స. క్రి. (√రేఁగు[1]). 1. రేఁగఁ
జేయు.

గీ. వృపుతలఁపు రేఁపె నపుడు మాఘపదపాంగ,
పాన మొనదేరిన యనంగశర మనంగ ...
రా. వి. 3. 129.

చం. గురుసతిఁ గూడు రట్టువకుఁ గొంకని మోడు
వియోగి నీసము,తక్కరముల కీడుచూచుటకు
దర్పకు రేఁపెడు కుట్టు చేఁడుతె, మ్మెకలకుఁ
దోడు చిత్రగతి మిన్నులఁజాఁటెడు మాయ
లాడు పెన్నిరులను పోతుకాలుకొని యేర్చు
వెలుంగుల వీడు వీఁడువో, వరాహ. 4. 24.

2. పుండు మొదలగు వానిని ఆఘాతాదుల వలన
నుద్దీపితము గావించు.

వ్యవ. కులుపురేఁపకు.

3. వి. ప్రేరణము.

**రేకలా.** వి. (హిం. రెఖా. మి శ్రా) ఒక విధమైన చిన్న పిరఁగి.

సీ. ఒక రేకలా దెబ్బ యుద్ధ తారాతి రా పాట కుటిరముల కంబములగదల్చె ... రంగా. 3 185

**రేకు=ఱేకు** వి. 1. పుష్పదళము.

సీ అలి కలభములు పైఁ దొలకించుతని రేకు లలకలఁ జిన్ని పువ్వై వెలుఁగ ..కు. సం 9. 325.

సీ. చదలు గేదఁగి తూర్పుతుదకొమ్మ నరవిరియై కానుపించు పూ రేకు లనఁగ ...
పారి 2 38.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి యమ్మనఁ బెట్టిన ట్లందమొంది. ... శార విరా. 2 52

సీ. రేకులన్నియు విచ్చి రేయొంద జిగినిండి కర మొప్పు తెల్లదామరల కంటె ...
భా. రా. అర. 1. 135.

సీ. రేరాచ గేదంగిరేకు క్రొవ్వెదతోడ వెట్టకన్ జేగురుబొట్టుతోడ... పాంచా 3. 76.

2. దళము, ఆకు.

గీ. కనకములచోఁదకమ్ముల గడిగి వార్చి, తులసి రేకులు సేవించి కటుకుఁ బచ్చడాలు తిన్నె వసించి... ఘటికా. 2. 17

3. బంగారు మున్నగువాని తగడు.

కం. కాకున్నఁ గెంపు వెన్నెల, రేకులవలెఁ బలువ గ్రుమ్మరించునె తల్లీ, యీ కారుమంట లిటు లన్ నీకు న్నీమహిమఁ జూప నేఁబని వింటిన్,
రామా. 7. 5.

4 దుప్పటిగాఁ గూర్పని వస్త్రము.

సీ. ... దుప్పటి యొకు హాసావళి దువ్వల్వ వీడము దుప్పటమన ... గీ. వని యె కూర్పనిచో రేకులనఁగ వెలయు ... అం. భా. 2. 156.

జ. రెక్కొను, రెక్కలుపు. రెక్కలు, రేకుమడగు, రేకుమడఁగించు, రేకుమణఁచు, రేకెత్తు.

**రేకుఁడు.** సం. వి. అ. పుం. నిమ్నజాతివాఁడు, నీచ జాతివాఁడు.

**రేకుమడ(ణ)ఁగు** = (రేకు+మణఁగు.) అ. క్రి. అణఁగు.

సీ. అడిదంబుచే రేకుమడఁగఁ గొట్టిన వికాసము దక్కి కడుస్రుక్కి జరిగెఁ గుముదుఁడు . .
శశా. 4. 101.

**రేకుమణఁగిఁచే** స. క్రి. (√రేకుమణఁగు) మణఁగఁ జేయు, మణఁగించు.

సీ. గురుకరంబుల భవత్కువలయంబును రేకు మణఁగించు ప్రభుసగల్ మాన్పికొనుటొ ...
రావి 4 49.

ద్వి. మలయు సంపఁగిరేకు మణఁగించి సొంపు, గిలుకాడి తిలకంబు క్రియఁ బొల్చు నాస ...
అ. మ క. 2. 108 శా. 15 పం.

**రేకుమణ(డ)ఁచు.** స. క్రి. (√రేకుమణఁగు.)

1. అణఁగఁద్రొక్కు, మణఁగి చు.

సీ. భ్రమరపంక్తులవేటఁ బరిహరింపకయున్న బ్రమానిసంపఁగిరేకు మణఁచుఁ దగతె ...
భాను 2. 61.

ఉ. లంచముఁబట్టు నంచలబలంగముచే వడలంగ బంగరుం, గొంచెముగాని మేనితళుకుల్ బెళుకుల్ బచరించుఁ జూపులున్. మించులఁ గుంచు మోము రజనీవిటు గుప్పునఁ దవ్వఁ బెంపుమన్, సంచపు రేకుమడఁచంగము నంగన నక్కుఁ జెక్కులున్. రా. వి. 4. 9.

2. చంపు, సంహరించు

పి. తమఁ బిల్చినప్పుడ, విని లోనుపడెనంచుమకరంబు కరిరేకు మడచునొక్క, విభుఁడ కల్గిన మొఱ వివఁడె లేఁడని దంతిజడిసి ప్రాణములేడ విడుచు నొక్క ... వాల్మీకి. 1 100.

ఉ. యాదవవార్ధి వెల్లివిరియన్ మఱియాఁ గెడు పాటి వీరుఁ డి, మ్మేదిని నెవ్వఁ డిందులకు మీరలు గావలె నేమె చాలమే, పోదుమె కట్టి తెత్తుమె బుభుప్రభునందనుఁ డెంతవాని తం, ద్రే దురమం దెదిర్చినను రేకు మడంతుము మాట లేఁటికిన్. విజ. వి. 3 165.

రేకెత్తు = జేకెత్తు. అ. క్రి. (రేకు + ఎత్తు) వర్ధిల్లు.

గీ పెంపు సె దెమ దామరతంపరయ్యెఁ, బ్రబలె నెగడెను గొనసాగె బలిసెఁ బెరిగె, వనఁగ రేకెత్తె ననఁగఁ జెల్లయ్యె వృద్ధిఁ, బొందె నను టకు . ఆం. శే 5.

రేఖ సం. వి ఆ స్త్రీ 1 గీఁటు. గీత. 2. పాణి పాద తలముల యందలి గీఁత. 3. కొద్దిభాగము, గీఁతంత మేర 4 వరుస 5. లంకాపురమునుండి యుజ్జయినిమార్గమున మేరువు వఱకు జ్యోతిశ్శాస్త్రవేత్తలు గీసిన మొత్తమ లేక ముఖ్యమైన రేఖ. 6 మోసము, వంచన 7. ఆభోగము, వైశాల్యము 8. మార్గము త్రోవ. 9. రీతి, విధము.

(ఈ యర్థమున తెనుఁగుననే ప్రయోగము కన్పడుచున్నది.

మ. జననీ తుభ్భర గర్భగోళముననే సర్వజ్ఞుఁడై ప్రజ్ఞచే, ఘనతం బొల్చెను దత్పరాశరుని రేఖన్ భూరవై రాగ్యబో, ధనిరూఢిన్ శుకయోగిచంద్రుఁ డు నానందంబందెఁ దా నెన్నఁడే, జననంబొందె నతం డదేమొదలుగా సర్వంసహామండలిన్. విప్ర. 1 76.

మ మనుజుం డొక్కెడఁ బాటులంబడుట సామ్రాజ్యంబు గైకొంటయుం, గనుఁ డా నేర్పరిచేతి కందుకము రేఖన్ బెక్కు చందంబులన్. ... నా. పంచ. 2. 156.

సీ. భరతుని లాగునఁ బరశురామునిభాతి రంతి దేవునిభంగి రాముగరిమ,నంగుని రేఖ య యాతి భావంబునఁ బృథువిధంబున భగీరథుని మాడ్కి ... విక్ర. 2. 69, వసు. 6. 6

రేఖగొను మి అ క్రి. (రేఖ + కొను.) గీఁతల చేత గుఱుతులు పెట్టుకొను

ఉ అత్తనుమధ్యరూపు కడు నందముగాఁ గుసుమాయుధుండు నా,చిత్తమునందు రేఖగొని చిత్రము వ్రాసెనొ ... కు. సం 6. 825.

రేఖాగణితము సం. వి. అ. న. క్షేత్రగణితము.

రేఖానులు, వి. బ. (హిం. రేఖావ = మెట్ట భూమి) ఒకదినుసు మెట్టధాన్యము.

వ. ... కటకసరులు రత్నసరులు శనిసరులు రాయసరులు పచ్చడినసరులు గుండుసరులును మద్దిగంద్రలు రేఖానులు కాంభోదులు మదనసరులు ... ప్రబంధ 112.

రేగడ = రేవడ వి రేగడి, బంకమన్ను. (శ ర.)

రేగడి = రేవడి. వి. ఔ. బంకమన్ను.

గీ. పంకమునగొరిజ దిగఁబడఁ బఱవలేవు, మన్నులిప్పుడు రేగటిమన్నులందు... మనుచ. 4. 20.

జ. రేగడిదూల.

రేగడిదూల. వి. (√రేగడి) ఒకానొకవృక్షము, కచ్చుర (వృ. వి ). (శ. ర.)

రేగాము. వి. (రే[1] + గాము.) రాక్షసుఁడు, పిశాచరుఁడు

సీ సవనాగ్నిశిఖలతో దివిఁ బ్రాఁకె రేగాము కఱకు జంజాలు వెంబ్రుకల కెడంగు... ఉ. రా. 1. 83.

రేచకము. సం. విశే. (అ. అ. అ.) 1. కల్మషము పోఁగొట్టునది. 2. బేదిచేయునది, విరేచన కారియైనది.

వి. అ. పుం. 1. ఊపిరి విడుచుట, ఒక్క ముక్కురంధ్రము ద్వారా యూపిరి విడుచుట. (పూరకము, కుంభకము, రేచకము.) 1. చిమ్మనగొట్టము, పిచికారు 3 సురేకారము, పెట్లుప్పు, 4. జయపాలవృక్షము. 5. తిలకము (వృ వి.).

న. 1. బేదిమందు, విరేచనౌషధము. 2. కంగుష్ఠము.

రేచకి సం వి. ఈ స్త్రీ. కరకచెట్టు.

సీ. నెత్తిఁ దంగేడాకు మెత్తి రేచకి నిమ్మపంటి పుల్పున నూటి పట్టువెట్టి ...

కాళ. 3. 110.

రేచన. సం. వి అ. స్త్రీ. 1. ఊపిరి. విడుచుట. 2. బేదియగుట, విరేచనములగుట. 3. విసర్జించుట, నిస్సారణము.

**రేచకశక్తి.** సం. వి. అ. స్త్రీ. 1. శ్వేతత్రివృత్తు (వృ. వి.). 2. కాంపిల్లము (వృ. వి.) (వాచ.)

**రేచకము.** సం. వి. అ. పుం. 1. కాంపిల్యము, రోచని (వృ. వి.). 2. దంతీవృక్షము, జేపాళము (వృ. వి.). 3. ప్రాణాయామము (వృ. వి.) (వాచ.)

**రేచనకము.** సం. వి. అ. న. రేచన.

**రేచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కాంపిల్యము, రోచని. (వృ. వి.) 2. అంకోలము, ఊడుగు. (వృ. వి.)

**రేచిపెట్టు.** సం. అ. క్రి. ఊపిరివిడుచు.

కం. ప్రాణమునిరోధమ్మునకతె, నటిముచేఁ బూరించి ప్రాణి యానందముతో, నపుడు గుంభించిన వాయువు, నటిరి రేచింపవలయుఁ గ్రమముగ నెడున్. వేం. మా. 3. 119.

సం. క్రి. పొంగిపోవు.

మ. వెలితోఁ గన్నులు నాసికాగ్రనిహితిన్ వేమాఱు రేచించి యిమ్ముల సచ్చిత్సుఖ రూపత్త్వము మరి బూరించి యామీఁద ని,శ్చలమై తన్మయమై జగన్మనము నభ్రాంతంబు గుంభించినన్, భయహీనుఁ డతఁ వేద్యమై తనరు ప్రాణాయామ యోగంబగున్.

సీతారా. 3. 163.

**రేచితము.** సం. వి. అ. న. వంకరలేక వేగముగాఁ బోవు యశ్వధారావిశేషము, గుఱ్ఱపుదౌడు.

**రేచీకటి¹.** వి. (రే¹ + చీకు) రాత్రి కన్నులు కన్పడనిది.

సీ. వడఁతి చూపులతోడఁ జాటనవచ్చునే రేచీకటైన నీరేరుహాములు ... తపతీ. 2.17.

**రేచీకు².** వి. (రేపు + చీకు.) కేవలాంధుఁడు.

ద్వి. రెండుగన్నులులేని రేచీకుచేత, నుండు దర్పణ మట్టు లుపదేశహీను, శివపూజంబులు చింతింప ... ప్రభులిం. 2. 46 పొ.క పం.

**రేచీకటి.** వి. (రే¹ + చీకటి.) రాత్రి కన్నులు కన్పడని నేత్రరోగవిశేషము, నిశాంధ్యము.

కం. తమ్మాకు రెండుపట్టలు, కుమ్మరి యవాక్షీరము లను గూర్చి వడిచి చా. రొమ్ముతోఁగ ద్రిప్పినం బులుగొనఁ, బమిన్న రేచీకటిల్లఁ బాయునెవ్వగన్. చికి (చి. ని.)

**రేజోతి.** వి. (రే¹ + జోతి) చంద్రుఁడు.

సీ. పొడిమగజాచందు నొడిగె నంటినజాతి రేజోతి జాగోడ జాజుటాకు... ఘటికా. 2 66.

సీ. కెలన రేజోతిరాచలువతిన్నియపొంతఁ బరువంపు పూలచప్పరము పన్ని ... ప్రబంధ. 241.

**రేటి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నహ్నారటితము, అగ్ని వలన గలుగు ధ్వని. 2. నయుడోత్కట మగు వాక్కు. 3. తిత్రిబీజము (వృ. వి.). 4. స్పృహా. 5. కాంతి. 6. ప్రావృట్ (శే. వి.).

**రేణము.** వి. మిక్కిలి చిన్నదూడ పేఁడ.

వ. ... మొదవుల నోరి నురువులుం బెయ్యల రేణంబులుం బాలకుండల మరలు నున్.

హరి. పూ. 5. 142.

ఉ. దోసెడుకొంపలోఁ బసుల త్రొక్కుడి మందముదూడరేణమున్, బాసిన వరటుకంబు ..శ్రీనాథుని చాటువు.

**రేణి¹.** వి. ఉపయోగము. (రేణికివచ్చు = ఉపయోగపడు, పనికివచ్చు.)

శా. దావ క్రేణికిరాక తండులాల రందర త్తావృగీశక్రిక్రి, లానేకాయుగఖుక్రచాకచింముక్త త్పాతకల్యామణి, శ్రీనే తోరణమొప్పఁ దూటి విజయశ్రీఁ బెండ్లియై వత్తుఁగా, కేవంచుం జొరఁగా హారుం డెటఁగిపోయెం బోయినం గ్రక్కున్. కకు. 5. 93.

**రేణి².** వి. ఒకానొక చెట్టు.

సీ. వేరుపనస గుత్తివెట్టి వారువ రేలపనస కరక కొమ్మిరి పలుకరేణి ... హంస. 4. 11.

**రేణుక.** సం. వి. అ. స్త్రీ. 1. జమదగ్ని యొక్క భార్య, పరశురాముని తల్లి. 2. ఒక దినుసు మందు పదార్థము, గంధద్రవ్యవిశేషము.

రేణురూషితము. సం. విశే. (అ. ఆ. అ.) దుమ్ముచే మలినమైనది, దుమ్ము పడినది.

వి. అ. పుం. గార్దభము, గాడిదె.

రేణువాసము. సం. వి.అ పుం. భ్రమరము. తుమ్మెద. (విల్యమ్సు.)

రేణువు. సం. వి. ఉ పుం. 1. దుమ్ము, ఇసుక మొదలగువాని యణువు. 2. పుప్పొడి, పుష్ప పరాగము. 3 స్త్రీ గంధద్రవ్య విశేషము, రేణుక (వృ. వి.).

రేణుసారకము. సం. వి. అ. పుం. కర్పూరము.

రేణుసారము. సం. వి. అ. పుం. కర్పూరము.

రేతజ. సం. వి. ఆ స్త్రీ ఇసుక.

రేతము. సం. వి. అ న. రేతస్సు.

రేతస్సు. సం. వి. స్. న. 1. ఇంద్రియము పురుష వీర్యము. 2. జలము, నీరు. (కే. ని.) 3. పాదరసము.

రేతిరి = రాతిరి. వి. (సం రాత్రి) రాత్రి, నిశి.

ఉ. ...దూతి యా. రేతిరిఁ బోయి చీఁ నగరిప్రతి రథ్యమునుంగొనర్చి సం, జాతకుతూహలుం డగుచు జారుఁడు దత్సదనంబుఁ జేరఁగన్.
వేం. పంచ. 4. 271.

కం. ప్రాతఃకాంముదాఁ దద, రేతిరి యేతెంచి వేఁడ తేఁనక కడఁన్, భీతి కలంత యొసఁగితిఁ, జేరులు దులుపకొనియుంట శివుఁడే యెఱుఁగున్.
శేష. 3. 256.

(అరరేతిరి = అర్ధరాత్రము.)

సీ. రెయి రేయి రాతిరి రేతి రవంగను రజని బొల్పును.
ఆం. భా. 1. 94.

రేత్యము. సం. వి. అ. న. కంచు. (విల్యమ్సు.)

రేత్రము సం. అ. న. 1. ఇంద్రియము, శుక్రము, 2. పాదరసము. 3. అమృతము. 4 పరిమళముగల పొడి, 5. సూతకము, జాతాశౌచము.

రేదొర వి. (రే¹+దొర.) నిశాపతి, చంద్రుఁడు

కం. రేదొర మొగమున కెన చిగు, రేదొరపల్వలుకు తోడ నిటిగుబ్బ లయా, రే దొరయున్ జక్కవకవ, నైకలివలు వెన్న కలుపడఁదికిఁ దరమే.
అప్పరా. శాలి. 135.

సీ. తొలిచేఁబాల్పు రేదొర వికయింప నిర్మించిన మగజాఁ మేఁజ యరఁగ ...
ఉ. భా 4. 180.

సీ. నిండు రేదొరఁగేరు నెమ్మోము ...
... 1. 6.

రేద్రిమ్మరి. వి. (రే¹+ద్రిమ్మరి) రాత్రిం చరుఁడు, రాక్షసుఁడు.

ఉ. కొమ్ములఁ దోఁక లేక జతగూడెను చీకు వృషాజ్య యింద్ర రే, ద్రిమ్మరి బొమ్మ కయ్యము న దిట్టతనం బటి పూరిమేటితో ...
... 2. 4. 5

(అగ స్త్యవర్ణనము.)

సీ. వెడమాయ లదరిఁచు గడుసుఁరేద్రిమ్మరి పొంచి యెవ్వానికి భోజన బు ...
... 1 31, ... 1. 5.

రేద్రిమ్మరీఁడు వి. (రేద్రిమ్మరి + ఈఁడు, స్వార్థము న.) 1. నిశాచరుఁడు, రాక్షసుఁడు (శ. ర.) 2. నిరృతి.

ఆ. మూలఱేఁడు సోకుమూకలఱేఁడు రే. ద్రిమ్మరీఁడు ... అన గను, నిరృతి పేళ్లు చెల్లు.
ఆ. సం. దేవ. 20.

రేనాఁడు. వి. దేశవిశేషము.

క. వెలనాఁడు వేఁగినాఁడును బులు, గులనాఁ డ్పాకనాఁడు పొత్తపినాఁడున్. గలమురికి నాఁడు రేనాఁ, డలయక గనుఁగొంటి వచటి యబలలఁ గంటిన్.
హంస. 1. 53.

రేను = రేఁగు². వి. (దీని 'ను' వర్ణమునకు ఏక త్వము న వికల్పముగాను, బహుత్వమున నిత్యము గాను బిందుపూర్వక 'గు' వర్ణము ఆదేశమగును.) వృక్షవిశేషము. బదరీవృక్షము.

సీ. పొన్నబొట్టుగు బోఁక పొగడ దాడిమ మిప్ప గుమ్ముడిందు గురువింద గోను రేను ...
వేం, పంచ, 4. 522.

**రేపకడ.** వి (రేపు + కడ.) ప్రాతఃకాలము. (వ్యుత్పత్తి) వర్ణవికారము.

గీ. రేపకడయును బగలును మాపు వరుస. వర్ణ ధర్మకామంబుల నాచరింపవలయు ...
భార. అను. 2. 45.

కం. రేపకడ గోవుపంచిత, మేపురుషుం డెవ్వఁడైన నెప్పుడు నియమం,బోపి తలఁజల్లు కొని పాపముచెడుఁ బుణ్యలోకఫలము ల్గలుగున్.
విజ్ఞా. ప్రా. 58.

• . . ఆరేయి గడిపి. ఈ. రేపకడవలేచి పాపవినాశన,తీర్థమునకు నేగి పార్థివుండు..
ద్వా 7. 131.

**రేపము** సం విణ (అ. ఆ. అ.) 1. నింద్య మైనది, నీచమైనది 2. కఠినమైనది, క్రూరమైనది, 3 కృపణమైనది.

**రేపస్సు.** సం విణ. (స్.) 1. నీచమైనది. 2. దుష్టమైనది, చెడ్డది. 3. కృపణమైనది. 4. క్రూరమైనది, ఆరణ్యమైనది.

**రేపాడి** వి. (రేపు + ఆడి. స్వార్థమున) ప్రభాతము, ప్రాతఃకాలము.

కం. రేపాడి లేచి నియమము, దీపింపఁగ స్నానవిధులు దీర్చి రమేశున్, గోపాలుని జాగరణము. చూపట్టఁగఁ బూజ సేయ సుగతి లభించున్.
శేష. 4. 9.

సీ ... జీమూత డంబ,రంబెచె మధ్యందినంబుల రేపాడి చినికె దుషారంబు దివదివంబు ...
కాళ. 3. 149.

**రేపు.** వి. దే. అవ్య. 1. ఎల్లి, మఱునటి దినము, నేఁటితరువాతిదినము.

మ. వరుసం దెల్లముగాఁగ నీవడుగుమే వత్తున్ సమ్మెస్యుండనై,పురసంరోధమొనర్చ రేప కటకం బూరింపు ముత్సాహతన్ ...
హరి. ఉ. 1. 13.

మ తలమే బ్రహ్మకునైన నీవగమహత్త్వం బెన్న నేనియెవ్వడం,గల చోద్యంబులు రేపు గన్గొనియెదన్ . మనుచ. 2, 12.

చం. అని కొనియాడి విశ్వభువనైకధురంధర నేఁడు రేపు నీ,వనితయు నీవు నిచ్చట వశ్యము మజ్జన భోజనాది పూ,జనములు గైకొనవలయు ...
పారి 3. 39.

2. అచిరభావికాలము, భావికాలము, ముందు.

మ. ఇదిగో రేపె తపఃప్రభావమున వాణీశాను మెప్పించి మీ,పదముల్ గైకొన నున్న వాఁడు విజితప్రత్యర్థి సామాన్యుడే ... దశా. 4. 57.

శా. నీపుత్రుం డితఁడంచు దుఃఖపడె దెంతే దేహమో ,జీవుఁడో, నీపుత్రుం డిట దేహమాత్రమని యంచేఁగాదు జీవుండనన్, నీపుత్రుండిపు డైనఁ గర్మగతినొం దేఁబూర్వముం బుట్టఁడో, రేపుం బుట్టఁడొ యింక నెవ్వరికిఁ బుత్రీభావ మాద్యంబగున్. దశా. 4. 10.

3. పగలు, దివాభాగము.

గీ. కలుగు నూఱేండ్లలో వర్షకాల మపహ,రించు నిద్రయె యానిద్ర రేపు మాపు, మాని యుండిన జాడ్యంబు మేనఁబొడము ...
దశా. 2. 133.

ఉ. ఆపుటభేద వేంద్రదర్పమదావళి కల్పితగోపురాళి,పై, నేపున మాపు రేపుఁ జను నిందుదివేంద్రులఁ బర్వఁ దద్ద్యుతుల్, జాపురె పీనికిన్ గ్రహణబాధ యపర్వములందు నేక్రియం, బ్రాపితమయ్యె నంచు మది భ్రాంతివహింతురు తాంత్రికోత్తముల్. హంస. 1. 163.

ఉ. ఈస్ఫటివీధరంబున నిభేంద్రకటోదితదానధారలై, దీపపతీతరంగతట విస్ఫుట కైవల కందళంబులై, తాపసబాలికాశ్రవణదత్తయవాంకురభూషణంబులై, రేపు దమంబు సేయు శబరీ కబరీ నిబిరీస నీలిమల్ .
వా డు 2. 178.

4. ప్రాతఃకాలము.

చ. అమలనివాతసౌధములయందు మనోజ్ఞ మరాళతూలతల్పముల శయించి రేపులు శుభస్థితి మాగధసూత గీతనాదములఁ బ్రమోదముం బొరయు ధర్మసుతుండె కఠోర భూమిభాగమున శయించి, మేల్కొను సృగాలనినాదవికీర్ణకర్ణుఁడై. భార అర. 5. 369..

ఉ. ... గోకుల మిల్లిలు దప్పకుండ లక్ష్మీపతి గ్రుమ్మరున్ గడియపేపువ రేపువ నిచ్చనిచ్చ లున్ ... ... హరి. పూ. 5. 200

సీ. అరుణోదయమున శౌచాదు లన్నియుఁ దీర్చి వరుస రేపటి సంధ్య వార్చవలయు ...

విజ్ఞా. అచా. 63.

గీ. ఎల్లి చేయుపనులు నేఁడ యింతి మాపు, ఆవర్చు పని రేవ చేయుట వా మతంబు...

భార. అను. 5. 238.

జ. రేచీకు², రేపకడ, రేపాడి, రేయెండ².

రేపులుఁగు. వి. (రే¹ + పులుఁగు.) చకోరము, వెన్నెల పులుఁగు.

వ. ... తమతమ సుదతులఁ గవఁగూడి యెదుర్కొను రేపులుఁగు కొలము లెదురెక్కు సమానవతికమీవ వితానంబులును ...

చంద్రికా. 4. 107

రేఫము. సం. విశే. (అ. అ. అ.) నీచమైనది, నింద్యమైనది.

వి. అ. పుం. 'ర' యనెడి అక్షరము.

రేఫస్సు. సం. విశే. = రేపస్సు

రేమగఁడు. వి. (రే1 + మగఁడు.) నిశాపతి, చంద్రుఁడు.

చ. చలువవెలుంగు రేమగఁడు జక్కవ వెచ్చెలి కోడుకోడె ... ... చందమామ కడునింగిఁ జెలంగి వెలింగె నెంతయున్.

రామా. 2. 95.

చ. చలువలొసంగి వేడుక పొసంగ మెఱుంగు వరంగిపిట వ, న్నెలఁతలు రాచరేమగని నిల్పికురుల్ తడియార్చి గోళులం, గలయఁగ దువ్వుచున్ హాయలు గాసిగ చైచి మెఱుంగు ముత్యమున్, గులికెడు శాసికఁబు దగఁ గట్టి రుమాలువు గట్టిఁ ంతటన్.

కువల. ౬. 91

(రాచరేమగఁడు = రాజశ్రేష్ఠుఁడు. అని భావము.)

రేమిడి వి ఒక జాతివృక్షము.

ద్వి. ... పనస, పండ్లును మొదలై పవంతులను వెలఁగ, కాయలు రేమిడికాయలు గలివి కాయలు ...

పండితా. పర్వ. 348 పొ.

రేయి = రే¹. వి. బొ (బ రేలు.) రాత్రి, నిసి

చం. ఎడపక రేయియుం బగలు నెమ్మెల వమ్మలతాల్పుఁ గూడి పూ, వడిదపుజోదు నిబ్బరపుటాలమునం దమి హెచ్చ ...

నీలా. 1. 103.

కం. రేయిట మండియుఁ గృష్ణునిఁ, జూయు టకుఁ గలరు గోపభామినులు నిజం, బై యప్పుడు హరివిరహ, వ్యాయతదుఃఖంబు దమ్మె నటు వొదువుటయున్.

హరి. పూ. 8. 174.

ఉ. . చల్లని రేయిటి తట్టు ఫన్గళిన్ విందుల దేల్చ ... ఆము. ౬. 90.

గీ. రెండు వీళ్ల జనంబులు రేలు వివిధ, వాద్య సంగీతములమ ... ప్రొద్దుపుత్తురు భరత ముఖ్య ... భార. భీష్మ. 2. 348

జ. రేయింద్రిమ్మరి, రేయినడకరి, రేరేయి.

రేయుంద్రిమ్మరి. వి. (రేయి+త్రిమ్మరి.) రాక్షసుఁడు.

కం. తెలివల కడుపులలో నే, ద్దెల బెరిగెడి ప్రోడ రేయిత్రిమ్మరి దొరపైఁ, గొఱకొఱ మార్పులు నిగుడుచు, తెఱఁగున గాటంపు టూర్పు తెమ్మెర లడరెన్.

అచ్చ. రా. బాల. 82.

**రేరా.** (వి. రే$^{1}$ + రా$^{2}$.) చంద్రుఁడు.

కం. రేరాపొడుపువఁగన్నీ, రేఱాయను మాతనే తురెరా మారా ... అ. అ. ని. 4. 72.

**రేరాచెరేక.** వి. (రే$^{1}$ + రాచె + రేక.) చంద్ర రేఖ.

సీ. చినుకు వెల్తురు మబ్బుచే వడ్డపాటింతవో కాఱ్చు రేరాచరేకయవఁగ ...

రా. ని 4. 119.

**రేరాచేఱాయి.** (రే$^{1}$ + రాచే + ఱాయి.)

వి. చంద్రకాంతమణి.

సీ. రేరాచేఱాల గూర్చిన రచ్చపట్టులో రహిఁ బాడు, పాటల రవళి యరసి ...

యయా. 4. 74.

**రేరాజు.** వి. (రే$^{1}$ + రాజు.) చంద్రుఁడు.

గీ. కువలయాధీశ్వరుఁడు బుధగురుత నెసఁగు, రఘుమహారాజు జగతిరేరాజు కరణి ..

ఇందు. 1. 158.

సీ. రేరాజు రాకకు రేచాన మునుమున్న నవ రించు వసితవసన మనంగ ...

ఇందు. 1. 158.

సీ. మదనబాణబటాక్షపదనమంచుంబుమీ తమ్మికి రేరాజు దాయయగుట ....

భాను. 3. 7.

**రేరాయఁడు.** వి. (రే$^{1}$ + రాయఁడు.) నిశా పతి, చంద్రుఁడు.

రా. ని. 4. 86.

సీ. రేరాయనికిఁదొక్క తారావధూమణి కటి

కోఁజుశా. 5. 19.

మ. అలివేణి పదిలోపలం బదునొకంటై యుంచె నోశేదొ జక్కుల రేరాయలపట్టీ యంత టనె నీకు న్వాఁడు నిక్కంబుగాఁ, నెలు వుండె కద ... ఉ. రా. 4. 215.

(ఇట శ్లేషార్థము.)

క. ... రే, రాయఁడు తొలిసంక్రమణ దర ముఙ్గగ వెడలెన్ ...

అచ్చ. భా. 6. 47. పూ.

**రేరిహాణుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. దొంగ. 3. పిశాచము లేక రాక్షసుఁడు

**రేఱేఁడు.** వి. (రే$^{1}$ + ఱేఁడు) నిశానాథుఁడు, చంద్రుఁడు.

సీ. కలితకాళరముపైఁ గన్నె గేదఁగిపువ్వు ఱేకు తోఁ గూడ రేఱేనిఁ బోదివి ...

వై మ. 9. 22.

వ. .... వీడె మనమేడమీఁద రేఱేఁ డున్నాఁడు. వీనిం బట్టు కొందమని సోపాన వితానమార్గంబునఁ జనఁ దివురు శిశువుఁ బోఁడి మార్గస్థ సాహసంబుల కరుదంది ...

మ్మ. ని. 2. 84.

**రేల = రేలు.** వి. అరగ్వధము, ఒకానొకచెట్టు.

వ. ... ప్రోగు వారించి రావుల మోవుల జువ్వల మొవ్వల రేఁగుల గోఁగుల రేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల నిరుగుల నెమ్మిల జమ్మిల ... వి. కళం. 2. 14.

రగడ. మారేడు వంటికై మగువకును గొరె.. చెరరాఁగదె యిప్పచెంత వదిగో రేల ...

ఉ. రా. 6. 61., ఆం. భా. 2. 42.

**రేరేయి.** (రేయి + రేయి.) వి. అర్ధరాత్రము, సగమురాతిరి. (చి. ని.)

**రేవ.** సం. వి. అ. స్త్రీ. 1. నర్మదానది. 2. నీలి చెట్టు. 3. కామపత్ని, రతిదేవి. 4. దుర్గ, పార్వతి.

**రేవంతుఁడు.** సం. వి. అ. పుం. అశ్వశిక్షకుఁడు.

**రేవడు.** వి. అవివేకి (రేవు[1] + అడు చాకలి వాడు అని శ. ర.)

ఆ. ఘనవినాశివౌమగడ నీవు ఓటి నీకు, నిట్టి ప్రాంతములెల్లఁ బట్టనేల, ... జెడిన రేవఁడవై వృథా, బోకవైతి వెందుఁ గూడ వైతి. ప్రబోధ 2. 24.

ద్వి. కుక్కకూ తుర మెడ గోసి పోఁగలవు, రె డుపోనాడిన రేవనిరతి, ను ...

ద్వి. హరిశ్చ. ఇ 883.

ఉ. ... ఇహపరంబులకూరక దూరమై వయ, శ్రీ చన రెంటికిం జెడిన రేవఁడ నౌదునె నీర జేక్షణా. మనుచ 3. 105.

**రేవగలు.** వి. బొ (రే[4] + పగలు.) రాత్రియుఁ బగలును (బ. రేవగళ్లు, రేవగలు...)

ఉ. వీఁడును మున్ను రేవగటివేళకు మానిసి యోట ... ఆము. 6. 21.

చ ... రవీందుల బండికండ్ల చప్పుడు గతి ప్రమోపె రేవగలు భూరిభయంకరగర్జ లత్త ఱిన్ ... ఆము. 4. 85.

ఉ. అబ్బులు వేసవిన్ ఘనగుహాంతరసీమల రేవ గళ్లుమైఁ, బ్రబ్బెడు ముబ్బ ...

వాల్మీకి. 2. 73.

**రేవగుప్తి.** వి. ఒకానొకరాగము.

గీ దేశమలహారి సాహరి రేవగుప్తి ...

ప్రబంధ. 97.

**రేవటము.** సం. వి అ. పుం. 1. అడవిపంది. 2. వెదురుగడ. 3. సుడిగాలి. 4. ఒకజాతిశంఖము. (విల్యమ్సు).

**రేవడ = రేగడ.** వి. బంకమన్ను.

చ. ... ఇచట నల్ల రేవడయ దూరము వోయినఁ దాండు మృత్తికాకరములు గావము ...

పరమ. 2. 12.

ఆ. కృష్ణభూమి వెలయు రేగత రేవడ, యనఁగ విమలకీర్తి సాంబమూర్తి

ఆం. భా. 2. 3.

**రేఁడి = రేగడి** వి. బంకమన్ను. (శ. ర.)

**రేవతము** సం. వి. అ పుం. 1 దబ్బచెట్టు. 2. ...కము చెట్టు (వ్య. వి.).

**రేవతి** సం. వి. ఈ స్త్రీ. 1. ఇరువదియేడవ నక్షత్రము. 2. బలరామునిభార్య. 3. గోవు, ఆవు. 4 ఒకానొకదేవత, మాతృకాభేదము. 5. దుర్గ పార్వతి. 6 ఒకానొకనది.

**రేవతీరమణుఁడు** సం. వి. అ. పుం. బలరాముఁడు, కామపాలుఁడు.

**రేవలచిన్ని** వి. ఓషధివిశేషము. (శ. ర)

**రేవు**1. వి. 1. వస్త్రాదులను మనుష్యులు దిగుట కనువుగా నేర్పఱచిన దారి, జలావతారము.

మ. తలఁ బదచ్చటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁ గుల్యాంతరస్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్నానప్రయాతద్విజా, వలి పిఁడకృతిశాటులన్నవిఁదదావానంబుఁ జేర్పంగ రే, వుల డిగ్గ న్వెరఁబాఱువానిఁ గని నవ్వున్ శాలిగోప్యోఘముల్ ఆము. 1. 65.

సీ. వేద్యావిధానవై వెలసిన యిమ్మహాతటిని నీరేవున దాఁటిపోయి, క్రూరకర్ములు మహాచోరు లుండెడు నద్రిగిరి చూచి యొక విభావరి ప్రియమున ..

హరి. ఉ. 1. 43.

ద్వి. రేసి చూడఁగరాని రేవు నక్కటికి, దాసిన పొదలలో డాఁగి యేనుండ ...

రం. రా. అయో. 123 పా. 3 పం.

2. సముద్ర తీరమందు సముద్రవ్యాపారము చేయుట కుపయోగించు పట్టణము.

శా. రేవుల్మానవు పతంగజంబులు మణిశ్రీ ఖండ
ముక్తాదియున్, రావాణిజ్యము పెంచి యే
ఱంగఁజగన్వర్షంపు వెవ్వన్ రుచన్, హావర్ణం
బిగు వవ్యభూప్రజల రాజానూంచుఁ జాల్త్రి
చిలిన్, శ్రోవంగాఁదసుఁ దోఁట దొడ్డిగను లాప్తు
ల్పాడఁబంపం దగన్. (ఆము. 4. 245.)

3. సముద్రమునందు సంకులు ఎగుమతి దిగుమతి యగుచోటు.

గీ. వనధిసర్వంకషంబయ్యు వలయునికి, రేవు లవకాసి గొరరాని రీతి వదివ, విశ్వరూపకుఁ డయ్యు శ్రీవిభుఁడు నుక్త, రూపములఁ రేవ్యుఁ డగు నారురుతువులకు. కవిక. 5 77.

4. చాకివాఁ డుదుకుటకై బట్టలు తీసికొనిపోవు తడవ.

క. వెల యునిమిడియగుపాలును, వెల వాల్గవాలు నోలి వితుపంగవలయున్, తొలురేవున మలు రేవునఁ, జెలువే దఁగఁ జాకిచీర చెఱచిన చోటన్. విజ్ఞా. ప్రా. కాం. 62.

విశేషార్థము. రేవుపెట్టు = మొదలుపెట్టు. "వారినందఱను జంపఁదలఁచి యొక్కొక్క నినే రేవు పెట్టినాఁడు."

జ : రేవఁడు, రేవులువాఱు, రేవుగుజ్జము, రేవు పడవ, రేవుబోయ.

రేవు² = రేఁగు¹. అ. క్రి. విజృంభించు, చెల రేఁగు.

ఆ. ... త్రిభువనముల, రేవులసన్నవాఁడు నూపెనీఁ డురుశౌర్య, భానురుండు తారకా సురుండు. కు. సం. 11. 672.

రేవులువాఱు. (రేవులు + పాఱు.) అ క్రి. రోమవీథులేర్పడు.

క. నీవఱచిన యఱపులు మఱి, నీవే తెలుఁగు దువు తెలుప నీతోడుసుమీ, బాబాయని తల గడ్డము, రేవులువాఱంగ వడి గొరిగి విడిపించెన్. భోజసుచా. 4. 139.

వ. ... వానిఁబట్టి బంధించి గడ్డంబును మీసం బును లెయయును రేవులువాఱ గొరిగి విరూ పించెను ... భాగ. 10. పూ. 1768.

రేవుగు(జ)జ్జము. వి. (రేవు + గుజ్జము) గాడిద.

సీ. ... రేవుగజ్జము గాలిగాఁడు. గాడిద యనఁగను ఖరము రాజిలుచుండు ...
వేంక. పంచ. 94.

ఉ. [illegible] నముక్కన రేవు [illegible] యాత్రిక బోవువాఁడు [illegible] పతిటాకమిపభూమికిన్. (శుక. [illegible])

రేవుపడవ. వి. (రేవు¹ + పడవ.) నద్యాదుల యిద్దరినుండి యద్దరికి మనుష్యాదుల దాఁటించు పడవ. (వా.)

రేవుబోయ. వి. (రేవు¹ + బోయ.) రేవు పడవ నడుపువాఁడు.

ఉ. అగ్నిష్వస రేవుబోయల క్రియఁబు మెయిం బిలిపించి దేవికిన్, జయ్యన నోడ పెట్టమని ...
నిర్వ. 9 8.

రేవెలుఁగు. వి. (రే¹ + వెలుఁగు.) చంద్రుఁడు.
గీ. వేవెలుఁగుబొరబోడు రేవెలుఁగు ..
మనువ. 1. 18.

ఆ రేవెలుంగుచేత రెమ్మినఁ జదలల్లి, వల్లమట్ట్లు వోలు పెల్లుచీక, చేచి తేపికంటి యొత్తిన యేనిక, తోలుతోడి సాటదోఁప వెలిఁగె.
అచ్చ. భా. 3. 44.

రేవెలుఁగుతీవ. వి. (రేవెలుఁగు + తీవ.) సోమలత

వ. గాములతెఱగంటిసాముల నెల్లదెసల వెలిం గించు రేవెలుంగుతీవ యగ్గిప్రోవులమాటి ...
అచ్చ. భా. 2. 26 పొ.

రేవెలుఁగుఱాయి. వి. (రే + వెలుఁగు + ఱాయి.) చంద్రకాంతమణి.

గీ. మరకతనిబద్ధభూముల మలయు రేవె, లుంగు
టాతిన్నియల చెన్నె సంగు పొగడ, మ్రాని
నీడలందగు పొక్కకోవలోన, పుష్పక విమాన
మటు పొగిపోక నిలిచె.

ఉ. రా. 3. 66.

రేష. సం. వి. ఆ. స్త్రీ. అలుపు, బొబ్బరింత, గుఱ్ఱపుసకిలింత.

రేషణము. సం. వి. అ. న. అలుపు, బొబ్బరింత, గుఱ్ఱపుసకిలింత.

రేసు. వి ఈర్ష్య, ఈసు. (చులకన — అని, శ. ర.)

ద్వి. సవతి రేసునఁబట్టిఁ జంపింపఁ దలఁచి, సవ
రగా వవృతభాషలు బొంతిచేసి ...

వన. 2. 83 పొ. 9 పం. ప్రాఁతప్రతి.

క. నీ సఖ్యమునఁ జరించిన, దోసము మోసము
వ నేఁడె తోడన కలిగెం, బోసరమొ పోటి
క్రొవ్వో, రేసో యిట్లాడ నెవ్వరికి నీడేరున్.

వేం. పంచ. 1. 713.

విశే. చులకనిది. (శ. ర.)

రేసుగుడ్డ. వి. చేతిగుడ్డ. (శ. ర.)

# రై

రై = రో. సం. వి. ఐ. పుం. 1. ధనము, సొమ్ము. 2. బంగారము. 3. ధ్వని.

రైక = రయిక, తైక. వి. అవిక, కంచుకము.

క. పోకముడి పీడఁ బులకలు, మూఁకలిడం
జెమటగ్రమ్మ మోవి చలింపన్, రైక పెల్లిని
పెట్లఁగ, రాకేందునిభాస్యఁ గనెఁ బురాం
తకుఁ డంతన్. పార్వ..33. 5

సీ. జంట ముత్తెపుఁగుట్టు జంటరై కలనంచి బిగి
గుబ్బచన్నులు పిక్కటిల్ల ...

ఉ. రా. 6. 131.

రైతు = రయితు. వి. (క. రైతు) సేద్యగాఁడు. కర్షకుఁడు, పంటకాఁపు.

(వ్యవ.) ఇప్పుడు రైతుల స్థితి చాల ...

రైత్వము సం. విశే. (అ. ఆ. అ.) ఇత్తడితోఁ చేయఁబడినది.

రైవతకము సం. వి. అ. పుం. 1. ద్వారకా పట్టణమునకు సమీపమున నున్న యొకానొక కొండ. 2 పారేవతము, ఈడ (వ్ర. వి.).

రైవతము. సం. వి. అ. పుం. 1. ఒకానొక పర్వతము, స్వర్ణాలు వృక్షము, ఈడచెట్టు.

# రొ

రౌ = రో. అవ్య. 1. సంబుద్ధియందు స్త్రీవాచక శబ్దంబుల కనుప్రయుక్తం బగునది.

ఉ. బాలరో పుష్పమంజరులపై భ్రమరంబులు
వ్రాలె ... దశా. 1. 11. 7.

2. ప్రశంసాశ్చర్యార్థములందు స్త్రీవాచకముల కనుప్రయుక్తమగు.

ఉ. అమ్మరో ధర్మరాజుఁ గొనియాడఁగఁ జెల్లదె
యెల్ల దేశముల్ ... పాంచా. 5. 76.

(కొంద ఆధునికకవులు పుంవాచకములకు నను ప్రయుక్తముఁ గావించిరి.)

ఉ. తప్పక చూచు మగ్గనుచు దాదులు పల్కి
వఁ గేరి నవ్వ మా యప్పరో నిద్రపొమ్మనిన
నల్లన బారలుచాఁచు ... (చంద్రహాస విలా
సము — పూర్వభాగము.)

(ఆంధ్రకవుల చరిత్రము — ద్వితీయభాగము. 333 పొ.)

రొంజుడు = రోఁజుడు. వి. ప్రలాపము

సీ. రోజేడు రొంఁజుడు .. నాఁగఁ జెల్లఁగనౌఁ, బ్రలాపాఖిధ ... అం. భా. 1. 116.

రొండి. వి. 1. నడుము యొక్క పార్శ్వ భాగము, కటిప్రోథము.

సీ అడ్డంబు దిరిగి తలాపాళిఁ బడి రొండి హస్తంబులిడి యంగలార్పు కపుల ...
అము 6. 18.

ద్వి కరతలంబులు రొండ్లఁ గదియించు కొనుచు బిగిసి పెందొడలు పొంపిరి భాయకుండ ....
పండితా. పర్వత. 348 పు.

సీ. రొండి యనం గటిప్రోథ సంజ్ఞ ...
అం. భా 1. 136.

2. నడుము యొక్క పార్శ్వభాగమున నుండు బట్టనడత.

సీ. ...గీ. చిక్కుఁ జిలువావ మొక యింటఁ జేర్చి తలుపు, చిలుకు ముద్రించి బీగము చేయి రొండిఁ జెక్కికొను ... శుక. 3. 345.

జ. రొండివేటు.

రొండివేటు. వి. (√రొండి.) మల్లబంధవిశేషము.
వ. రొండివేటును ఫణంబును గన్నాతును భారంబు ... నృసింహాంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాడెంబు పరీక్షించి .... హంస. 1. 206.

వ. ... బిల్లియు తుట్టును బరిపోటును రొండి వేటును పణంబును కరాత్తును ...
మల్లు. పు. 3. 67. ప్రబంధ. 78.

సీ. ... రూఢింపు బరిపోటు రొండివేటు ...
అం. భా. 2. 209.

రొండు. వి. శ్వాసరోగము, రోఁజు.

సీ. రొండు రోఁజు వగర్పు రొప్పన శ్వాసమౌ.
అం. భా. 2. 127.

రొండు డు. వి రోఁజుడు, ప్రలాపము

సీ రోఁజుడు రొంజుడు రొద్దుడు రొండుడు ... నాఁగఁ జెలఁగ నౌఁ బ్రలాపాఖిధ ...
అం భా. 1. 116.

రొంప. వి. 1. పీనసరోగము. (శ. ర.) 2. పడి సెము. (చి ని., శ. ర., వా.)

రొంపి. వి. బురద, పంకము.

క. జొంపములు గొనియె వనములు, రొంపు లిగిరె నెమిలిగముల రొదలుడిగె నదుల్, పెంపులకుఁ బాసె నులుములు, శంపల సంపదలు మానె శారదవేళన్.
భాగ. 10 పూ. 764.

సీ. ఏడుసాగరములు నిక్కి దక్కుడఁ బెట్టి పలుచని రొంపి మై నలఁది కొనఁగ ...
భార. విరా. 2. 134.

కం. ముంపుఁగొని విరుల వావల, జొంపంబులు గురియ సురలు సుమనోమధువుల్, తుంపర లెగయఁ బరాగపు, రొంపుల భూభాగమతి నిరూపిత మయ్యెన్. భాగ. 8. 510.

మత్తకోకిల. పాయసంబుల రొంపులున్ బహు భంగి బూరెలు వట్టులున్ ...
హరి. పూ. 7. 152.

జ. రొంపిదుక్కి, రొంపిమాను, రొంపులెక్కు.

రొంపిదుక్కి. వి. (రొంపి + దుక్కి.) నీళ్లు గట్టి ఆడుసుగా దున్నుట, దమ్ము. (శ. ర.)

(వ్యతి. — మెట్టదుక్కి.)

రొంపిమాను. వి. (రొంపి + మాను.) రొంపి దున్నిన పిమ్మట మిట్టపల్లములు సరిచేయుటకు మీఁద పాటించెడు మాను, దంతపట్టె. (శ. ర.)

రొంపులెక్కు. అ. క్రి. (రొంపులు + ఎక్కు.) రొంపియగు.

మ. తెలిపూగద్దియ గాడుపుం గొదమ మస్తే
నెక్కితేఁదేఁటి గం,టల సంధిల్లు రొదాళ
ముల్ వరవ ... చంద్ర 3. 51.

ఇ : రొదాళించు.

**రొదాళించు.** అ. క్రి. (√రొదాళము.) ధ్వనించు.
(వేం. పంచ. 1.) (శ. ర.)

**రొప్పించు.** స. క్రి. (√రొప్పు) రొప్పఁజేయు, త్రోలించు.

ఉ. ... మీఁదనిశేఁద్ర పం,క్తి రొ,ప్పింతురు
ఘోరశంగి .... భా 1. 3 స్కం. 989.

ఉ. ... మీఁదనిశేఁద్రపం,క్తి రొ,ప్పించితి
ధిక్కరించితి శపించితి ...
భాగ. 7. స్కం. 201.

**రొప్పు.** అ. క్రి. 1. కూయు.

క. అప్పుడు గగనమున మొగుల్, గప్పె మహిం
జలచి విసరె గాడ్పులు రొప్పెం, గప్పలు
వడగండ్లురిసెం, గుప్పలుగొనసోనవాన గురి
యం దొడఁగున్. వేం. పంచ. 1. 656.

ద్వి. అనఘుని రఘురాము నట లక్ష్మణుండు, గని
వెండి యెలుఁగెత్తి గ్రక్కునఁ బిలిచెఁ, గ్రై
శోందుఁ దెలివని కలయఁగ రొప్పి, చేకొని
చిఱుతరా చేరువఁబట్టి ...
రం. రా. అర. కాం 195 పు. 16 పం.

క. వనితా! కృష్ణుడు వల్లని, ఘనమనియున్
వేణురవము గర్జనమనియున్, మనమునఁ
దలంచి రొప్పుచు, ననవరతము నెమిలి
తుటుము లాడెడిఁగంటే.
భాగ. 10. పూ. 784.

2. అఱచు.

తే. ఇంట పెవ్వారయిన భిక్షమిడినముష్టి, పెట్టినఁ
గరాళికేఁజి యొప్పిదముదోప, నెరిగిపడి
యుందులకును మీరెవ్వరమనుచుఁ, బెద్దపులి
వోలె రొప్ప నా బిసరుహాక్షి.
శుక. 3. 346.

తే. తెప్పదెరలంగ బండులేతెంచుచున్న, యవి
మహాత్మ తన్నేమిజాతారవములుఁ, గడఁక
నెడ్లను దఱిమి రొప్పెడునరాలి, యులి
వులిని యుల్లమునఁ గడు నులుకువుట్ట.
భార. అను 4. 318.

సీ. ధనమెక్కుడుగఁ గూర్చి తినలేక, యేడ్చెడు
పెనులుబ్ధుఁ డర్థులఁ గనిన రొప్పు ...
వేణు. 86.

3. (పంది) ఘుర్ఘురించు.

సీ. పొదలమాటునమండి యదలించుచును రొప్పి,
కదియంగఁజూచిన, బెదరిపోలఁగు, ...
విక్ర. 2. 185.

గీ. పొరలుఁ గెరలు నటించునంబరము దెరల,
రొప్పునుప్పర మెగయును గొప్పరించు,
ముట్టె బిగియించు మునమున మూరుకొనుమ్మ,
వడరుసంరక్షితక్షోణి యజ్ఞఘోణి.
భాగ. 3 స్కం. 413.

4. (పులి) గాండ్రుమను.

సీ. రోషభీషణరేఖ రొప్పుచు బీరంబు పొలివోని
కడఁది బెబ్బులు లనంగ ...
హరి. ఉ. 2. 60.

సీ. రొప్పుచు నెతిరించు గొప్పవులుఁగు,పుఁ
లోనీక జముదాళ్లఁ బొడిచివైచి ...
శంబు 2. 62.

5. (ఎలుఁగు) అఱచు.

గీ. ఉల్లము గలంగ న య్యుగ్రభల్లుకంబు, గుట
గుట యటంచు రొప్పి యుక్కుటిలుఁ గదిసి.
శుక. 1. 500.

6. (పాము) బుసకొట్టు.

క. ... మహాసర్పము గ్ర,క్కున నొక్క బొక్క
వెలువడి, చనుదెంచెను రొప్పుచున్ విష
జ్వాలలతోన్. దశ. 6 61.

7. విసరు, వీచు.

గీ. ధూళి మినుగప్పె వడిసుడిగాలి రొప్పె, బ్రజల కళవళ మెల్లఁ దప్పె నప్పట్టునందు ...
చెన్న. 527.

స. క్రి. 1. తర్జించు, భయపెట్టు, అదలించు.

ఉ. చెప్పుడు చెప్పుకున్న మిముఁ జిత్రముగా వధియింతు నంచు జేఁ, దప్పుడు తమ్ము రొప్పిన భయంబు వహించక యానువర్ణసాం, బొప్పుఁగ భర్త కిల్లను ... హంస. 5. 250.

2. బాధించు.

క. తప్పితివో యిచ్చెదనని, చెప్పితివో కపట సాక్షి చేసినమేలున్, దప్పితివో శరణార్థుల, రొప్పితివో ద్విజులఁ బసుల రోగుల సతులన్.
భాగ. 1. 355.

సీ. మొనసి స్వర్గద్వారమునునుండి పోఁకి నిలఁబడఁ ద్రోయించె నిదిగో యముఁడు, రొప్పుచు ... ఉ. హరిశ్చ. 4. 171.

మ. ... నా ప్రావీణ్యముఁ గోలుపోయి బలిష్ఠుండగు కాముబారిఁబడి నే నెట్లోర్తునే బండిక, త్రైబడిం బాపపుఁదృష్ణ యిప్పు డకటా! శీర్షావృతిన్ రొప్పెడిన్.
భాగ. 9. స్కం. 575.

3. నెట్టు, త్రోయు.

ఉ. ... ఒకమ్మ మారీచుఁ దృణాయమానముగఁ ద్రిప్పుచు రొప్పుచు నప్పయోధిలో, వైచె ... అధ్యా. బాల. 15 పుట.

4. త్రోలు, తఱుము.

సీ. ... కంసుండు చెల్లెలు మఱఁదియు మల్లి సిల్లి, హరులపగ్గములఁ జేసంది రొప్పఁ దొడంగె ... భాగ. 10. పూ. 20.

చ. అనిలజుఁడు ... పేదదుశ్శాసనుజులఁ బంపనేల యని మానుగ గోవుఁడు గోగణంబులన్, గొనకొని రొప్పునట్టు లధికుం డెగిచెం బృథుదండహస్తుఁడై.
భార. ఆది. 6. 78.

ద్వి. మును పాఁతఱల ధాన్యములు పొంగుచుండె, గోధనంబులు రొప్పుకొని పోఁవపోవ, ...
పండితా. పురా. 167 పా.

క. కిరాటులఁగని వలలు పన్నుఁడు, చాలేర్పడఁ దోలుచట్టు చాగుఁడురలన్, గిలించి బోను లొడ్డుడు, కాలాగక రొప్పుఁ డడవిఁ గల మృగచితతిన్. చిత్రభా. 2. 155.

క. అప్పుడు సముబోఁడ్లకతల్, చెప్పగ నేమిటికిఁ బ్రాకిరి వేత్రధరుల్, రొప్పఁగఁ గలిరొసిఁ లుపక, యప్పుడు మేల్కొని యనువదలి కరిదూఁటముల్. ... 2. 71.

ఉ. ... పక్త్రి తామరపత్ర ... సంఘమున్, రొప్పుదు నిద్రఁగ్రాకొన డుకోజ పరస్పర నక్తహాటములన్, విప్పుడు ....
భాగ. 10 స్కం. 1728.

వి. ఆధిక్యము, శ్వాసము, వగర్పు.

గీ. ... ఉసుర్పు నా శ్వాసమెఱు, నొవ్వువడి దీర్ఘమైన నిట్టూర్పునంగ, నధికమగునది రొఁజు రొప్పనఁదగు ...
హరి. ఆం. భా. 1. 30.

సీ. రొండు రొఁజు వగర్పు రొప్పున శ్వాసమౌ ...
ఆం. భా. 2. 127.

ణ : రొప్పించు.

**రొమ్ము = ఱొమ్ము.** వి. (సం. ఉరః.) వక్షము.

సీ. మగలాఁడు వారికి మరిగి .... పరదేశంబు లుడుగక క్రమ్మర బ్రేక్షను రొమ్ముఁబోయి. యాచకులై వేఁడి ... కు. సం. 7. 667.

ద్వి. సీరొమ్ము గొనియాడనేర్తువే చూడ. నీ రాజ్యగతిఁజూడ నేర్తుఁగాకేమ ...
రంగ. రా. యు. 292 పొ. 29 పం

ఉ. అన్నరపాలువాలుగల కగ్గలమౌ తెలినోగ
కమ్మ లా.[క్రొన్నెల వెన్నెలల్ వెడఁద
రొమ్ము చొఁకారపు తేఁటచెక్కులు ...
రా. వి. 4. 20.

**రొయి** — రొయ్యి. వి. కట్టెలిప్పుమీఁది నిగురు. (శ. ర.)

**రొయ్యు.** వి. మత్స్యవిశేషము.

ఉ. ... పిత్తడికాసు మగ్గుమీఁ,వల్లె యుగుండె
రొయ్యపరకాపెగఁ దేపలఁబట్టి పెట్టగన్.
ప్రబంధ. 195.

తే. .. అరైద ముద్దువేఁపుము గొర్రెనొంచు,
నగె రొయ్యానియపు మీలఁ ...ట్టు నిపఁడు.
... 4. 187.

సీ. ... అవరు రొయ్య యపు తుక్కడాండజ
నామమై .... ఆం. శా. ... 160.

జ ; రొయ్యపుర్వు.

**రొయ్యపుర్వు.** వి. (రొయ్య + పుర్వు.) ఒక విధమగు రొయ్య చేఁప.

ఆ. రొయ్యపుర్వు [గ్రొవ్వి రోధోవసుంధర,
కెగసి తెగిన పగిది నిట్టులేల, జలతలంబు
విడిచి చనుదెంచి వాబుద్ధి, పుర్వుమేయఁ
బెట్టఁ బొందఁగంటి.
వేం. పంచ. 4. 486.

**రొయ్యి** = రొయి. వి. కట్టెలిప్పుమీఁది నిగురు. (శ. ర.)

**రొల్లు.** అ. క్రి. [ప్రలాపించు. (శ. ర.)

జ : రొల్లుడు.

**రొల్లుడు.** వి. (√రొల్లు.) [ప్రలాపము, రొంటుడు.

సీ. రోజేడు రొంజేడు రొద్దుడు రొందుడు
రొల్లుడు రజు .... వాఁగఁ జెలఁగనౌఁ
[ప్రలాపాభిధ. ఆం. శా. 1. 118

# రో

**రో¹** = రొ. అవ్య. సంబోధనమున తఱచు స్త్రీ వాచకములకు ప్రయుక్తములగు.

ఉ. ... అమ్మరోఁ, రమ్మని బోటికోమలి కర
మ్మనివార్యగతిం దెమల్పఁగన్ ...
... 130.

క. ఉల్లము ఝల్లన సుఖమునఁ బెల్లుగ బాష్ప
ములు కొరఁగఁ [ప్రేమం బ నహా, వల్లభరో
యనుచును మది, పల్లటిలన్ రాము. డుర్విఁ
బడి మూర్ఛిల్లెన్. (భా. రా. కిష్కిం. 55.)

ఉ. నీకు నిచ్చవచ్చినకు నీనెఱి పెన్నిధు లున్న
తిరిచెన్, నిఖిలుపు టిలు ముందుకు నియొ
[ప్రాణపు ... ..రో, ...
ములు కప్పురమె యూరిదివేసి యొ పట్టుఁ
జీరతే, యూరినునైన పల్లవము లీరసమిష్ట
మనోజభోగమే. ఉ. రా. 3. 106.

ద్వి. సిగ్గు లజ్జయుకేరి చెవఁటిరో నమ్మఁ
బగ్గించుచున్నారు పగతురిల్లంగి ...
రం. రా. యు. 515 పొ. 6 పం.

**రో²** — రోయి. వి. 1. కుసువ, తాకట్టు, ఆధి.

క. ఇన్నాళ్ల కింత నెట్టక,యున్నను రో దక్కు
వనుచు నాడఁబడు నేఁ దా,నన్నాళ్ల దక్కు
వతనికి, నెన్నఁడు భోగ్యంబు దక్కదే
ధర్మములన్. విజ్ఞా. వ్యవ. 92.

ద్వి. ఇదెవచ్చెఁ బులివలె నీ శివరాత్రి, ముదిత
రో యుకఁబుచ్చె ముత్తెంపువరుల ...
పండితా. పురా. 122.

2. వేశ్యకిచ్చెడు శుల్కము.

క. రోయిడి యెల్లని ఘటగుఁడు, రోయివిడువ
వలయు లంజెరోఁ గొనిమలులన్, రోయిఁబఁ
దలఁచిన నిమమడి, పాయక యిచ్చుటయ
తగినపాడి యరయఁగన్.
విజ్ఞా. [ప్రా. 109.

శ్లో. శుల్కం గృహీత్వా పణ్యస్త్రీ నేచ్ఛన్తీ ద్విగుణం వహేత్ అనిచ్ఛన్ దత్తశుల్కోపి శుల్కహాని మవాప్నుయాత్. (యాజ్ఞ.)

సీ. రో యనఁ బైఁడన రొక్క మనఁగను వేశ్యా భృతికి సంజ్ఞ వెలయుచుండు ...

ఆం. భా. 2. 303.

జ : రోయిడు, రోవాటు, రోవెల, రోవెలఁది.

రో వం. వి = రై.

రోఁకటిపాట వి. (రోఁకలి + పాట) రోఁకటితో దంపునపుడు పాడెడిపాట, సువ్విపాట.

ద్వి. వినికల్లిదేవయ్య విప్రులఁజూచి, యనియె రోఁకటిపాట లట్ల వేదములు ...

బస. పు. 7. 197.

రోఁకటిపోటు వి. (రోఁకలి + పోటు.) రోఁకలితోఁ బొడుచుట.

ఆ. సుజనవినుత గోరుచుట్టుపై రోఁకటిపోటు దాఁకినట్లు పోతలంప, మొదలశోకజలధి మునుఁగంగ నందుపై, నీవు పల్కినట్టి నిష్ఠురోక్తి. హరిశ్చ. 5. 89.

రోఁకటిబండ. వి. (రోఁకలి + బండ.) 1. శతపది, ఒకపురుగు.

సీ. ఎఱ్ఱరోఁకటిబండ జెట్టి మన్నిఁడి మున్నగు నరీసృపములం దంతకంటె ...

ఆము. 3. 80.

2. పొన్నులేని చిన్నరోఁకలి. (శ. ర., వా.)

3. క్రోష్టుపుచ్ఛి, నక్కతోక పొన్న (వృ. వి.).

సీ. ... క్రోష్టుపుచ్ఛియు నేలపొన్న. నా నక్కతోఁకపొన్ననఁ బొర్లుగాడినా రోఁకటిబండనా రూఢికెక్కు. ...

ఆం. భా. 2. 55.

రోఁకలి. వి. ౙా (సం. గోకిలః) 1 ముసలము, దంచెడు సాధనము.

బ. రోఁకళులు, రోఁకళ్లు, రోఁకండులు, రోఁకండ్లు, రోఁకలులు.

చం. పటికపుఁబోల ముక్కెదురుఁ బ్రాలు లోనిఁ బోయుచు గారుకొమ్ము రోఁకటఁ గొని దంచుచున్ ... కు. సం. 6. 704.

ఉ. చీఁదఱ చేసినట్లు రిపుసేవల నెల్లను మొట్టి రోఁకటన్ మోదుచు నాగటం దిగిచి నొంచుచుఁ గార్ముకముక్తబాణముల్, పైఁ బొలిగొంచి కూల్చుచును ...

హరి. ఉ. 1. 101.

చం. హలమున నమ్మహాబ్ధముల నప్పటికప్పుడు దంచుకోఁగ రోఁకలిఁ గయికొంటివౌర ...

దశా. 3. 57.

కం. ఏరీతిం బెనఁగిన నెవ్వారె యెఱుఁగరు సీదు గట్టు వనితామణి రోఁకట్లా రోఁకండ్లం జూడిన, కూరము రిపుడింత జూచుకొన్న నడఁగునే ప్రభా. 5. 25.

2. గానుఁగలో నువ్వులు మొదలగు వానిని నలఁగఁజేయు సాధనము.

చం. ... పెనుగానుఁగ రోఁకట నిక్షుఖండముల్, చిదుపుతెఱఁగునం జిదియఁ జేయుఁడు ...

పరమ. 1. 89.

జ ; రోఁకటిపాట, రోఁకటిపోటు, రోఁకటిబండ.

రోఁజు. అ. క్రి. నిట్టూర్చు, ఉచ్ఛ్వసించు.

చం. ... అవవుడు బుట్టలోపలి మహాభుజగేంద్రుఁడు రోఁజునట్లు రోఁజె నధిప యవిక్షిణుండు దవచిత్తమునప్పులుకుల్ గలంచి వన్. భార. శల్య. 2. 94.

**రోఁతగించు.** అ. క్రి. (√రోఁత.) రోఁతపడు. (శ. ర.)

**రోఁతపడు.** అ. క్రి. (రోఁత + పడు) అసహ్యపడు, ఎగ్గుపడు.

గీ. ఎంగిలికి రోఁతయెఱుక మెప్పించువాడు, సిరయ ...

శేష. 3. 44.

**రోఁతబమారి.** విణ. (√రోఁత.) ఏవగించు చేయుస్వభావము కలవాఁడు, కలది.

సీ. .... మూసినముఁకి నిర్మోహి ప్యాపమిత్రద్రోహి దుష్టు రోఁతబమారి దోసకారి ...

హంస. 5 113

**రోక.** వి. మూల, కోణము. (శ. ర.)

**రోకము.** సం. వి. అ. న. 1. రంధ్రము, కొన్నము, 2. ... ఓడ. ... చలనము, ... పుం. 1. ప్రకాశము, కాంతి. 2. సొమ్మిచ్చి కొనుట.

**రోకు.** వి వికాసము.

సీ. ప్రవిమల కుసుమసంపదలకు దూరమై రోకు గాసిన మహీరుహాము రీతి ...

నూ... 1. 168.

(శ. ... పా. రూపుఁకొక్కిన, ముద్రి. పా.)

**రోగఘ్నము.** సం. వి. అ. న. 1. మందు. 2. వైద్యశాస్త్రము.

**రోగము.** సం. వి. అ. న. ఓషధి, మూలిక.

**రోగభువి.** సం. వి. ఈ. స్త్రీ. రోగస్థానము, శరీరము. (వి. వ్యమ్సు)

**రోగము** సం. వి. అ. పుం. 1. వ్యాధి, జేబ్బు. 2. కుష్ఠౌషధము. (వాచ.)

**రోగరాజము.** సం. వి. అ. పుం. క్షయవ్యాధి.

**రోగశిల.** సం. వి. ఆ. స్త్రీ. ఎట్టపాపాణము.

**రోగశ్రేష్ఠము.** సం. వి. అ. పుం. జ్వరము.

**రోగహారి.** సం. విణ. (న్. ఈ. న్.) రోగమును మాన్పువాఁడు, జబ్బు కుదుర్చువాఁడు.

సం. వి. న్. పుం. 1. వైద్యుఁడు. 2. ...చెట్టు. 3. బూడిదగుమ్మడి. (వ్య. వి.).

**రోగి.** సం. విణ. (న్. ఈ. న్.) రోగముగలవాఁడు, జబ్బుతోనున్నవాఁడు.

**రోగితరువు.** సం. వి. ఉ. పుం. అశోకవృక్షము.

**రోచకము.** సం. విణ. (అ. ఆ. అ) 1. ప్రకాశింపఁజేయునది. 2. మనోహరమైనది. ఇంపైనది. 3. ఆఁకలి వృద్ధిచేయునది, ఆఁకలి పుట్టించునది.

అ. న. 1. ఆఁకలి. 2. అరటిచెట్టు, 3. రాజపలాండువు. ఎఱ్ఱఉల్లి (వ్య. వి.). 4. అవదంశము, ఊరుగాయ. 5. ఒకానొకచెట్టు, గ్రంధివర్ణము (వ్య. వి.).

**రోచకుఁడు.** సం. వి. అ. పుం. గాజుపని, కుందనపుఁ బనిచేయువాఁడు, నగలపైఁ జిత్తరువులు చెక్కువాఁడు. (విల్యమ్సు.)

**రోచన.** సం. వి. ఆ. స్త్రీ. 1. సౌందర్యవతియగు స్త్రీ, అందకత్తె. 2 ఒకజాతి గోరోచనము. 3. కెందమ్మి, ఎఱ్ఱతామరపువ్వు.

**రోచనకము.** సం. వి. అ పుం. దబ్బచెట్టు.

**రోచనము.** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) 1. ప్రకాశింపఁజేయునది. 2. ఇంపైనది, మనోహరమైనది. 3. ఆఁకలి పుట్టించునది.

వి. అ. పుం. 1. శ్వేతశోభాంజనము (వ్య. వి.). 2. పలాండు (వ్య.వి.). 3. ఆరగ్వధము (వ్య.వి.) 4. దాడిమము (వ్య వి.). 5. కరంజము (వ్య. వి.). 6. అంకోఠము (వ్య. వి.). 7 కూటశాల్మలి (వ్య. వి.).

వ. 1. కోరికను చెందుట, కోరికలీరికలెత్తించుట. 2. ఆకాశము, ఖగోళము

రోచనఫల. సం. వి అ. స్త్రీ. చిర్భిట, దోస (వృ వి.).

రోచనఫలము. సం. వి. అ. పుం. బీజపూరము, మాది (వృ. వి ).

రోచని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱపాషాణము, మణిశిల. 2. గోరోచనము. 3. ఆమలకి (వృ. వి ). 4. శ్వేతత్రివృత్తు (వృ.వి ). 5. గంధద్రవ్యభేదము.

రోచమానము సం విశే. (అ. ఆ. అ ) 1. ప్రకాశించునది. 2. మనోజ్ఞమైనది అందమైనది. వి. అ న గుఱ్ఱపుమెడమీఁద నుండెడి జూలు.

రోచి. సం వి ఈ. స్త్రీ శాకభేదము హిల మోచిక (వృ. వి.).

రోచిష్ణువు సం. విశే. ఈ. 1. ప్రకాశించునది, కాంతిగలది. 2. సొగసుగా నుండునది, అందముగా నుండునది, నవయౌవనము. 3. ఆకలి పుట్టించునది.

రోచిస్సు సం. వి. స్, న. 1. వెలుఁగు, ప్రకాశము, కాంతి.

రోజు. వి (హిం రోజ్ ) అహోరాత్రము, దినము. (శ. ర., వా.)

రోటిక సం. వి. అ. స్త్రీ. రొట్టె, గోధుమాది నిర్మితమైన రొట్టె

రోటు వి. ఈఁచే. (చూ. రోటువోవు ) (శ ర.)
జ : రోటువోవు.

రోటువోవు. అ. క్రి. (రోటు + పోవు.) ఈఁచఁబోవు.

ద్వి రోటువోయిన చేయి రొమ్ముకంపరము, వాటుఁ గాలును బోటివలెనున్నవడుము ..
ద్వి. హరిశ్చ. ఉ. 1087.

రోడు. అ. క్రి. తగులు, తాఁకు.

ఉ. లాడికి మూఁగు కాకులఁ బలాయనమొందఁగఁ జేయ వీఁపుపైఁ, ద్రాడువ్రేలు నీఁకె గుదితాపిన దేహము వేఁడికాళ్ళకున్, రోడి వశించుతోఁక బలురోమము లంటిన జోటు టేఁగలున్, గూడిన బంధముం గలిగి కూర్కుచు నుండొక బక్కగుఱ్ఱమున్. హంస. 5. 80.

రోదనము. సం. వి. అ. న. 1. ఏడ్పు. 2. కన్నీరు.

రోదని. సం. వి. ఈ. స్త్రీ. దురాలభ, తీఁటకసింద (వృ. వి ).

రోదనిక సం. వి. అ. స్త్రీ. రోదని (వృ. వి.).

రోదసి సం. వి ఈ. స్త్రీ. 1. భూమ్యాకాశములు, మన్నుమిన్నులు. 2. స్వర్గము. 3. భూమి 4. ఆకాశము.

క. నీచానంబున విస్మితులై దైవతయక్షసిద్ధులభివర్ణన ముత్సాదరమునఁ జేసెరిదే, రోదసిసమ్మర్దముగ నరుగుదెంచి తగన్.
భార. ఆశ్వ. 4. 240.

రోదస్సు సం. వి. స్. న 1. స్వర్గము, 2. భూమి.

రోదించు. సం. అ. క్రి. రోదనముచేయు, ఏడ్చు. (శ. ర.)

రోధకము. సం. విశే. (అ. ఆ. అ ) అఁపునట్టిది. అణఁచునట్టిది.

రోధనము. సం. వి. అ. పుం. అంగారకగ్రహము. న అఁపుట.
విశే. (అ ఆ. అ ) ప్రతిబంధకముచేయునది.

రోధము సం. వి. అ. పుం. 1. అఁపుట, ఆటంకపఱుచుట. 2. ముట్టడి, ఆవరణము. 3. గట్టు, తీరము.

రోధస్సు సం. వి. స్. న. 1 గట్టు, తీరము. 2. కుడ్యము, గోడ 3 అంతరిక్షము, ఆకాశము. 4. [illegible]ణము, ముట్టడి. 5 అఁపుట, ఆటంకపఱచుట.

**రోధించు.** సం. స. క్రి. అడ్డగించు. (శ. ర.)

**రోధో(ధ)వక్ర.** సం. వి. ఆ. స్త్రీ. (రోధస్ + వక్ర.) 1. నది, ఏఱు. 2. వేగవతియగు నది, వడిగల యేఱు.

**రోధోవప్రము.** సం. వి. అ. పుం. వడిగల నది.

**రోధ్రపుష్పము** సం. వి. అ. పుం. మధూక వృక్షము, ఇప్ప (వృ. వి.).

**రోధ్రపుష్పిణి.** సం. వి. ఈ. స్త్రీ. మాతక వృక్షము, ఏఱుజాజి (వృ. వి.).

**రో[illegible].** సం. వి. అ. పుం. [illegible] లొద్దుగ. వృ.వి.) పుం, న. [illegible] అపరాధము.

**రోపకుఁడు.** సం. వి. అ. పుం. రోపణము చేయు వాఁడు.

**రోపణము.** సం. వి. అ. న. 1. లేనిదానిని మోపుట, ఆరోపించుట. 2. పైరుచేయుట. మొక్కలు పాతుట. 3. పుట్టించుట. 4. ఒకానొక యంజనము.

**రోపణీవర్తి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక యంజనము, నేత్రాంజనవటి.

**రోపము.** సం. వి. అ. పుం. 1. ఆరోపించుట. 2. పైరుచేయుట, మొక్కలు పాతుట. 3. బాణము. న. 1. రంధ్రము, గుహాబిలము

**రోపితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పాతఁబడినది, నాటఁబడినది. 2. ఆరోపితము, ఆరోపణ చేయఁబడినది.

**రోమంథము.** సం. వి. అ. పుం. 1. నెమరు వేయుట.

**రోమకందము.** సం. వి. అ. పుం. పెండలము, చాఱకంద (వృ. వి.).

**రోమకము.** సం. వి. అ. న. 1. పాంశులవణము. 2. ఒకజాతి సూదంటుఱాయి.

**రోమకూపము.** సం. వి. అ. పుం. న. రోమ రంధ్రము, చర్మముమీఁది రోమరంధ్రము.

**రోమకే(శ)సరము.** సం. వి. అ. న. సురటి, వింజామరము

**రోమగుచ్ఛము.** సం. వి. అ. న. వింజామర, సురటి.

**రోమభూమి.** సం. వి. ఇ. స్త్రీ. రోమస్థానము. చర్మము.

**రోమవము.** సం. వి. న్. న. దేహముమీఁద నుండెడి వెండ్రుక, ముఖము శిరము దక్క ఉన్న దేహమందుగల వెండ్రుక. 2. పక్షుల యీఁక. అ. పుం. 1. బిలము, గుహ, 2. జలము, నీరు. (విల్యమ్సు.)

**రోమరంధ్రము.** సం. వి. అ. న. రోమకూపము.

**రోమరాజి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. రోమావలి, నూఁగారు.

**రోమలత.** సం. వి. ఆ. స్త్రీ. రోమావలి, నూఁగారు.

**రోమవికారము.** సం. వి. అ. పుం. పులకరించుట, గగుర్పాటు.

**రోమవిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. పులకరించుట, గగుర్పాటు.

**రోమశము** సం. విశే. (అ. ఆ. అ.) రోమములు గలది, బొచ్చుగలది. వి.అ.పుం. 1. గొఱ్ఱెపోతు. 2. పంది 3. పెండలము, చాఱకంద (వృ. వి.). 4. ముంభి, నాచు (వృ. వి.).

**రోమశి.** సం. వి. ఈ. స్త్రీ. ములుదోస (వృ.వి.). (శ. ర.)

**రోమహర్షణము.** సం. విణ. (అ. ఆ. అ.) పులకరింపఁజేయునది, గగుర్పాటు గలిగించునట్టిది, భయము పుట్టించునది. వి. అ. న. గగుర్పాటు, రోమాంచము. పుం. విభీతకవృక్షము, తాండ్ర. (వృ వి.).

**రోమహర్షణుఁడు.** సం. వి. అ. పుం. శౌనకునకుఁ బెక్కు పురాణములు వినిపించినవాఁడును వ్యాసశిష్యుఁడు నగు సూతుఁడు, లోమహర్షణుఁడు.

**రోమహర్షము** సం. వి. అ. పుం. గగుర్పాటు, గగుర్పొడుచుట.

**రోమాంచము** సం. వి. అ. పుం. (ఆనందము, భయము, ఆశ్చర్యము మొదలగు వానివలన) నొడలు పులకరించుట, గగుర్పాటు, గగుర్పొడుచుట.

**రోమాంచితము** సం. విణ. (అ. ఆ. అ.) గగుర్పొడుచునది, లోమాంచితము.

**రోమావళి** సం. వి. ఈ. స్త్రీ. 1. నూగారు. బొడ్డుభాగమునుండి ... పైకి నుండెడి వెండ్రుకల వరుస, రోమరాజి. 2 తారుణ్యము, యౌవనము.

**రోమ...** సం. వి. ఉ. పుం. ...

...

**రోమ...** సం. వి. అ. పుం. కుంభి వృక్షము ... (వృ వి.).

**రోమాళి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. రోమాలి.

**రోమోద్గమము** సం. వి. అ. పుం. పులకరించుట, గగుర్పొడుచుట, గగుర్పాటు.

**రోయి = రో** వి. (సం రాః) 1. వేశ్యకిచ్చెడి శుల్కము.

కం. రోయిడివొల్లని భుజగుఁడు, రోయి విడువ వలయు లంజెరోఁగొని మరలన్, రోయి డఁదలఁచిన నినుమడి, పాయక యిచ్చు టయ తగినపాడి యిరయఁగన్.

విజ్ఞా. ప్రా. 109.

గ్వి. పాయకరోయి మాపణఁతికి నిచ్చి, వేయేసి సూడలు ... యనుడు ...

పండితా. మహిమా 281 పు.

ఉ. రోయిడఁ బంచువారు ... ... రోయి పొల్తులఁ గావఁగ రోయువార లన్ .. కు. సం. 8. 138.

2. ఉడువ, తాకట్టు.

సం. రోయిఁ ... వడ్డి కిచ్చినఁ, జాయక నెల నెల వళితిభాగము గొనివన్, న్యాయముమిగులఁగొను ట, న్యాయం బొడఁబడని చోట వభివదండీ. విజ్ఞా. వ్యవ. 64.

3. చేబదులు.

కం రోయిఁగొని పెట్టఁబాలక, ప్రాయిఁ రైయయుగునతఁడుఁ బరదేశము చాఁబోయి నతఁడు మూఁడునెలల్, పోయిన తుదివడ్డి సహితముగఁ బెట్టదగున్ ...

విజ్ఞా. వ్యవ. కాం. 69.

4 జూదమునఁ దొడ్డెడు పందెపు ధనము.

కం దగయంది రోయిఁగా జూ, దము నీతోఁగాడఁ గడఁగెదను ... భార. అర. 2. 41.

జ · రోయివెఁటి.

**రోయించు** స క్రి. (√రోయు.) రోయఁ జేయు, వెదకించు.

ఆ. చరులఁ బనిచి వైరిచరుల రోయించుట, నెమ్మనమున నెఱిఁగి నమ్మకునికి, ... యోగమునకుఁగా శత్రునై నను, నవిశ్వసనట్ల యునికి నయవిధంబు. మార్క. 8. 128.

**రోయిడు.** (రో² + ఇడు.) స. క్రి తాకట్టు పెట్టు.

తే. పరల సొమ్మిమ్ముటకు ఒహు మథనపడిన,
యష్టులని రోసి పూ ౖతా పైౖ హొరెవి,
ట్టుమోపి దవంగఁ గొచ్చపముమీఁద, గట్టి
రెక్కె సురాసుఁగణము లపుడు.

దశా. 2 197.

కం. బల్లోకంబుల జనములు, రోళ్లన్ రోకండ్లఁ
జాడ రోయక మఱియున్, వెల్లివిరివిగాఁగ
దిరిగిన, గళ్లకు వయగారి మెలఁతుకం గొని
పోయెన్. వరాహ. 7. 22.

సీ. ఆయుధంబులు నేసి హుంకారములు రోసి
మ్రొక్కువారును ఒుట్ట లెక్కువారు ....

వరాహ. 3. 47.

సీ. .... చిఱుతపొప్పళి రోసి సరిగంచు పసరు
పొప్పళికుచ్చెల చెఱంగు వలువగట్టి ....

శుక. 1. 257.

3. నిందించు.

చ. ఘనతర శోకవేగమునఁ గన్నుల నీరుల
నించి యాసుయోధను నవిసియు విదవ
ధర్మజనూజుఁడు సంధిగోరి వ్రక్కిన తగవుం
గడంగి యనికిం దలకొన్న నిజోద్యమంబుఁ
దోఁచిన మదిఁ దిట్టుచున్ వినుతిసేయుచు
రోయుచు నుండె వయ్యెడన్.

భార. భీష్మ 3. 156.

కం. వాసవసుతుఁ డాలింగముఁ, జూసి చనఁగలేక
గాసిఁబడియుం దమఁదా, రోసియుఁ బలు
నిట్టూర్పులు, నేసియు నాడెల్ల నుపవనిం
చుచుఁ జనియెన్. కాశ. 4. 84.

చం ధరణిజ నిందునందును బదంపడి రోసి
వృథార్తి రోసి ధీ,నురుచిరుఁడైన మారుతి ...

చం. రా. 7. 31

4 వెదకు

కం బి రోయు తీఁగకాళ్లఁ, జెనఁగెం బాసనుమఁ
బొంగి భీమున్ గు

భార. ఆది. ౯. 220.

ఉ. ... కప్పుఁ పురిప్పుటనంటులనీడరేఁగు రా,
కన్నెల రోయు నన్నుఁ కు గన్నులు
మూయుచు ... వసు. 1. 112.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ
దొడంగె మనోభవుండు వి,ల్లెక్కిడి చక్రవాక
ముల యిక్కలు రోయఁగఁ జొచ్చె ...

భార. వి. ౯. 519.

చం. ధరణిజ నిందునందును బదంపడి రోసి
వృథార్తి రోసి ధీ,నురుచిరుఁడైన మారుతి ...

చం. రా. 7. 31.

5. చొచ్చు, ప్రవేశించు.

మ. ఉఱ కంభోనిధి రోసి వేదముల కుయ్యాల్
దైన్యముం జూచి వే,గఱు లబ్లార్చి ముఖంబు
జొచ్చి బలువీఁకం దోఁక సారించి ...

భాగ. 8. 730.

కం. శ్రీరమణభిక్షుహారన, రోరుహసద్గంధలహరి
రోసి చరించున్, సారెకు నై వచ్చుట శిశిర
సమీరము అఖిలైకసుఖముమీఱఁగ నెపు
డున్. వాల్మీ. 1. 72.

6. తలఁచు, భావించు.

కం. శకుని విను సమరధుఁడు పాం,డుకుమారుల
తోడ నెప్పుడుం బగగొని వా,రికిఁ గీడ
రోయు ... భార. ఉద్యో. 4. 227.

జ : రోఁత, రోఁతగించు, రోఁతపడు, రోఁతల
మారి, రోయించు.

రోయెలనాఁగ. (రో + ఎలనాగ.) వి. వేశ్య,
పణ్యస్త్రీ.

క. తుగళిని తేల్చురోఁడయె, నాఁగను దగులు కొని నాఁడునాఁటికిఁ గోర్కుల్, తీఁగలు సాగఁగ మన్మథ భోగంబుల మనసు తృప్తిఁ బొందిన పిదపన్. పి. శకుం. 2. 144

రోదద. సం. వి. ఆ. స్త్రీ. అతిశయరోదనము, పెద్దయేడుపు.

రోలంబము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద

రోలప సం. వి. అ. పుం. పానీయామలకము, నీటియుసిరిక. (వృ. వి)

రోఁవాటు. వి. (రోఁ2 + పాటు.) వేశ్యాభృతి, లంజెకిచ్చెడి సొమ్ము.

క. మీ వెలఁది కూడఁబెట్టిన, రోఁవెలఁ జేయింపు కొంటిరో మీకెవరో, రోఁవాటున నిడిరో విజులఁ, తాకట్టిదో యనిన వేశ్యతల్లి యలని త ...

రోఁవి. వి. ...

దో ... రావులు నిప్పులు రాణఁ దలిర్చన్ ... యయా 2 48.

రోఁవెల వి. (రోఁ2 + వెల.) వేశ్యాభృతి ధనము.

చం. నలపులయిక్కలుంజియల వమ్మిన రోఁవెల వంటజక్కవ, ... పనికిడు .. చకటి పర్వె మర్వడన్. కవిక. 4. 86.

ఉ రోఁవెల్లనీఁగి వేఁటొకని రోఁయుఁదగన్ ... కు. సం. 8. 58.

చం .. వెలయాఁడ్రుపిల్చి, కులజుమైన ముస్నుదమకుం బ్రకృతఁబుగ నిచ్చువట్టి రోఁవెల కధికంబు నొక్కయఁదీసము కానును జేతికిచ్చినన్.

(వైజ. 2. 61. శుక. 3. 64.)

రోఁవెలఁది. వి. (రోఁ2 + వెలఁది) వారాంగన.

చం. వలుఁగిడి చల్వఁదాల్చి పయనంపుటలంతలు నిద్రఁజెందు రోఁ. వెలఁదుల లేపఁగాఁకి .. కువల 2. 110.

రోషణము సం. వి అ. పుం. 1 ఒరగల్లు, సీటురాయి 2. పాదరసము. 3. ఊషరక్షేత్రము, చవిటనేల.

రోషణుఁడు. సం. విశే. (అ ఈ. అ) కోపశీలముకలవాఁడు, ముక్కోపి, సులభముగా కోపము వచ్చువాఁడు.

రోషము. సం వి. అ పుం కోపము, కినుక.

రోషించు. సం. అ క్రి రోషపడు, కినియు. (శ. ర.)

రోసగాఁడు విశే. (రోసము + కాఁడు) రోషము ... రోషముగలవాఁడు.

ఉ ఆయన యొంటిగాఁడు వెలయాఁడ్రులగుల్ల లవారికు వాఁడిమిం, బోయినచో, మాట పాటిబొచ్చెము నైఁవని రోసగాఁడుగా, యీయొడ నేమి పుట్టునొ ... శుక. 3 150.

రోసము. వి. (సం. రోషః.) కోపము.

ఉ. ... అంతఁతకు రోస మీనుబెరయన్ ధరణీశుఁడు తెచెఁ జెచ్చెరన్ ... ఉ. రా. 3 146.

గీ. బేంజపు గట్టి జంత పాతూరిసంత, చలము సాధించు దిట్ట రోసాలపుట్ట ... శుక. 3. 18.

సీ. గురుఁడుగాఁడే స్థిరధరుఁ డధికంబెన్నఁ దవకేల నీరోస మని యొ కొకఁడు ... దశా. 3. 152.

జ : రోసగాఁడు, రోసించు.

రోసించే అ. క్రి. (√రోసము) రోషి చే, కినియు, రోషపడు.

కం. ఆ సమరప్రౌఢికి మది, రోసించి విదేహావర వసుధుడు చమూప్రాప్తిగేసరులకుఁ జెయిపిచిన, నాసురకశి కకటంబు లకటిం బొడవెన్.

విక్ర. 4. 109.

రోసు. విశ. పలుగాకి, దుష్టుఁడు.

సీ. ... సుమామాళమును దూబ కొంపచెఱుపు, ... గేరెయ చెరువచేట రోసు, బడియ ... మడియచేట్కమెయ్యక ... కాపెనలమారి.

హంస. 5. 118.

రోసుబడి. విశ రోఁతగొట్టు.

(స్త్రీ...) ...పు ఏమి రోసుబడిగా నున్నావు !
(శ. ర.)

రోహంతము. సం. వి. అ. పుం. 1. వృక్షము, చెట్టు. 2. ఒకానొక వృక్షము.

రోహంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. లత, 2 ఒకానొక లత.

రోహణము. సం వి. అ. పుం. లంకలోని పర్వత విశేషము.

న. 1. ఎక్కుటు, ప్రాపరిచేయుట. 2. బయలు దేఱుట, ఉద్భవించుట. 3. పురుషుని వీర్య ము, శుక్రము.

రోహము సం. విశ. (అ. ఆ. అ) 1. మొలచు నది, మొలక యెత్తునది. 2. ఎక్కునది, ఆరోహించునది.

వి. అ పుం 1. ఎక్కుట, ఆరోహణము, 2. మొలక, అంకురము.

రోహి. సం. విశ. (న్. ఈ. న్.) 1 మొలచు నది, మెఱుగునది. 2. ధార్మికుడు.

వి. న్. పుం. 1. రోహితము. 2. వటము. (వృ. వి.).

... వృక్షము 3 ... ము, విత్తు

రోహిణము సం. వి అ పుం 1. ...ము. (వృ. వి).

2. రోహితకము. 3. భూతృణము. (వృ. వి.). పగటి యొక్క పదునైదు భాగములలో తొమ్మిది భాగము. (వాచ.)

రోహిణి. సం. వి ఈ స్త్రీ 1. ఎఱ్ఱని యావు. 2. గోవు, ఆవు 3. అశ్విన్యాది వాల్గవ నక్షత్రము. 4. బలరాముని తల్లియు వసుదేవుని భార్యయు నగు రోహిణి. 5. తొమ్మిదేండ్ల వయస్సుగల కన్యక. 6. మెఱుపు, విద్యుత్తు 7. గళరోగభేదము, ... కటుకరోహిణి (వృ. వి.). హారీతకి (వృ వి). సోమవల్కము (వృ. వి) మంజిష్ఠ (వృ. వి.). కాశ్మీరి (వృ వి.). సురభికవల్లి (వృ. వి.). రోహిత వర్ణమైన స్త్రీ. (వాచ.)

రోహిణీపతి. సం. వి. అ. పుం 1. చంద్రుఁడు. 2. వసుదేవుఁడు.

రోహిణీరమణము. సం. వి. అ పుం. వృషభము, ఎద్దు. (విశ్వమ్ము.)

రోహిణ్యష్టమి. సం. వి. ఈ స్త్రీ కృష్ణాష్టమి.

రోహితము. సం. విశ. (అ. ఆ జీ అ) అగ్ని హోత్రుని వాహనము. 2. ఎఱ్ఱనిది, ఎఱుపు రంగు గలది. - వి అ. పుం. 1. ఎఱుపు రంగు. 2. కేసరి మృగము. 3. ఎఱ్ఱ ...ము. 4. ఒకజాతిచేఁప. 5. రోహితవృక్షము. న. 1. రక్తము. 2. కుంకుమపుష్పు. ... ఇన్నని యింద్రధనుస్సు

రోహితాశ్వుఁడు. సం. వి. అ. పుం. అగ్ని. హరిశ్చంద్రుని పుత్రుఁడు, లోహితాస్యుఁడు.

(శ. ర.)

**రోహితుఁడు.** సం. వి. అ. పుం. హరిశ్చంద్రుని కొడుకుపేరు.

**రోహిత్తు.** సం. వి. త్. పుం. 1. సూర్యుఁడు. 2. ఒకజాతి చేఁప.

స్త్రీ. 1. లతాభేదము. 2. మృగి, ఆఁడులేడి.

**రోహిషము.** సం. వి. అ. పుం. 1. ఒకజాతి చేఁప. 2. ఒకజాతి లేడి, మృగభేదము. 3. తృణవిశేషము.

## రౌ

**రౌక్ష్యము.** సం. వి. అ. న. 1. రూక్షత్వము, కాఠిన్యము. 2. శుష్కత్వము, ఎండుట.

**రౌచ్యము.** సం. వి. అ. పుం. బిల్వదండము, మారేడుదండము. (పై. వ్యమ్ము.)

**రౌచ్యుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక మనువు, పదుమూఁడవ మనువు.

**రౌతు = రవుతు.** వి. (పం. రావుత్తః) సాది, గుఱ్ఱపుస్వారిచేయువాఁడు.

శా. ... ధారాపంచకభావవం జెలఁగు గంధ ర్వంబుఁ ద్రొక్కించు బల్ వీరంపున్ నెఱ రౌతు .... ఆము. 4. 31.

ఉ. పలుకులు నేయునేల నినుజాల కనుంగొని పంతనుంపియున్, జిలుకపటాణిరౌతు త్వర నేసె ... ఉ. రా. 4. 200.

**రౌద్రము.** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) 1. తీవ్ర మైనది, కోపముగలది. 2. భయంకర మైనది. వెక్కసగలిగించునది. 3. (మంత్రము లేక సూక్తము) రుద్రుని సంబోధించునది లేక స్తుతించునది. - వి. అ. పుం. 1. తీవ్రత, కోపము. 2. రౌద్ర రసము. (నవరసములలో నొకటి) న. 1. కోపము, క్రోధము. 2 భయంకరత్వము. (క్రూరత్వము.) 3. వేఁడిమి, ఉష్ణత, 4. ఎండ, ఆతపము.

**రౌద్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గ, పార్వతి. 2. రుద్రజట (వృ. వి.). - ఇ. పుం. అఱువది సంవత్సరములలో నొకటి, సిద్ధార్థి తరువాతిది.

**రౌప్యము.** సం. వి. అ. న. వెండి.

**రౌమకము.** సం. వి. అ. న. లవణవిశేషము. ఒకరకపు ఉప్పు.

**రౌమము.** సం. వి. అ. న. లవణభేదము, సాంభరి లవణము.

**రౌరవము.** సం. విశే. (అ. ఈ. అ.) 1. రురు చర్మము. (కృష్ణ మృగచర్మము)తోఁ జేయఁ బడినది. 2. భయంకరమైనది. 3. చంచల మైనది. 4. మోసముచేయునది, ధూర్తమైనది. వి. అ. పుం. ఒకానొక నరకము, నరక విశేషము. - న. ఒకానొక సామము.

**రౌలు = రవులు.** అ. క్రి. (నిప్పు) మండు.

జ : రౌలుకొను, రౌలుకొలుపు, రౌలుకోలు, రౌలుచు.

**రౌలుకొను.** అ. క్రి. (రౌలు + కొను.) (స్వార్థమున) రగులు. (చూ. రౌలుకొల్పు)

**రౌలుకొలుపు(ల్పు.)** స. క్రి. (√రౌలుకొను.) మండునట్లుచేయు, రగులునట్లుచేయు.

చ. చులుకు చులుక్కు నం దినువు దోఁకెడు వన్నెల రౌలుకొల్పుచున్ ... వలపఁగఁ జొచ్చె దెమ్మెరలు ...

చంద్ర. 4. 110. (ప్రా. పా.)

రౌలుకొల్పు, ముద్రి. పా )

**రౌలుకోలు = రవులుకోలు.** వి. (√రవులుకొను.) రగులుకొనుట.

**రౌలుమే. = రవులుమే.** స. క్రి. (√రౌలు.) రగులుకొనఁజేయు.

రౌహిణము సం వి అ పుం 1. చందన వృక్షము 2. కాలభేదము రోహిణము

రౌహిణేయము. సం వి అ. పుం. 1. ఆవు దూడ. 2 మరకతము 3. బుధగ్రహము 4. శనిగ్రహము 5. కాలభేదము - వి 1. ఒచ్చె మరకతము, రోహిణము.

రౌహిణేయుఁడు. సం. వి అ పుం 1. బల రాముఁడు 2. బుధుఁడు, (గ్రహము) 3 శని.

రౌహిషము సం వి ష. పుం 1 మృగ భేదము, కొండగొఱ్ఱె 2 ఒకజాతి మత్స్యము 3 ఒకజాతి తృణము, కామంచి.

రౌహిషి సం. వి. ఈ స్త్రీ 1. రోహిషజాతి యాఁడుజింక 2. లత. 3 ఒకదినుసు దూర్వా తృణము, దూర్వ. (వ్య. వి.)



అ వి ఒకానొక యక్షరము.

(ఇది దక్షిణదేశభాషలందుఁ గనవచ్చుచున్నది)

అంకాట వి (అంకు + ఆట) జారత్వము చేయుట.

సీ. బెటుతిట్టుట మేనుముట్టి నోవడుచుట తొడ్లాట అంకాట సాహసంబు, ... జనులు కోఁచిచ్చి సభఁజెప్పుదురు దీనిఁ దెలియనడిగి ఒధుడు తీర్పవలయు. విజ్ఞా వ్యవ. 17.

అంకాడు అ క్రి (అంకు + ఆడు) అంకు నేయు, జారత్వము చేయు.

గీ. ఇతఁడు కలఁద్రాగి అంకాడె నెఱపిదివియొ, నిలిచి మూత్రించెఁ జడాలలనఁగూడెఁ, గూతు రమియించెఁ దెఁవాటు గొట్టెఁ బ్రజ లఁ, జెచురాజుల సేవించెఁ జెటిచెఁ గుఁమ. శివరా. 4. 54.

సీ. వలదవఁగా నొరువనితతో నొక్కండు దాఁ బల్కెనేని శతద్వయంబు, వారించు తెలిఁగియు వారిద్దఱును మాటలాడిరేనియును అంకాడినట్లు .. విజ్ఞా. ప్రా 116.

ద్వి వేయేల ప్రేవాడ వెన్న ముచ్చిలుచుఁ బోయి అంకాడదే పొలఁతులతోడ ...

బస పు 6. 880 పం.

అంకు వి జారత్వము.

సీ. జనులోకర్మ లజఁ దొల్లిసమయంబు ఒడిచి వేఁ జేసి క్రూరతయు ముచ్చిమియు అంకు నైరక .. భార. శాం 257.

సీ ఆచార్యుఁ డనక భార్యకుఁ దప్పినప్పుడు పొడు గలు నీఅంకు పొడువదయ్యె ...

పి, శకుం. 3 184.

జ · అంకాట, అంకాడు, అంకుబోతు, అంకు టాలు, అంకుతడక, అంకుతెగులు, అంకు మగఁడు, అంకురాట్నము. అంకులఁడి, అంకులాఁడి, అంకువెలఁది, అంకెడ

అంకుఁబోతు. వి. జారిణి, జారుఁడు.

సీ. అంకుఁబోతునకు సద్వ్రతనిష్ఠలేటికి పానివి యేమిటికి దుర్వర్తనునకు ... రామలిం. 38.

అంకుటాలు వి. (అంకు + ఆలు) వ్యభిచారిణి, జారిణి. (శ. ర.)

అంకుతడక. వి. (అంకు + తడక) మిక్కిలి జారత్వముగల స్త్రీ.

ఉ. ఈలువు వంగడంబుగల వీజవరాలని యోలి రొక్కరొక్కలిదె యెట్టి అంకుతడకన్ వరయించితి దీని వక్కటా ...

వెం. పంచ. 4. 507.

అంకుతెగులు. వి. (అంకు + తెగులు) సుఖ రోగము, మేహ రోగము. (శ. ర.)

**అంకుమగఁడు.** వి. (అంకు + మగఁడు) ఉపపతి జారుఁడు.

గీ. మగనిరాక మెఱిఁగి మగువ యొయ్యన ఉంపు మగనిఁ బెరిఁ యింటిమఱుఁగున నుండఁ, గల్లు నోలెమువను గదియించి యామీఁద. గంప ద్రెవ్వ వెట్టెఁ గదలకుండ. (శల్లా. 1.) (శ. ర.)

**అంకురాట్నము.** వి (√ అంకు.) జారిణి, లంజె.

సీ. ... అంకురాట్నాలకును కుంటరండలకును, ..

గీ. ప్రాభిఅసమున చేడ్పెడి ద్రాజవాని, గడన వీండ్ల కెకాక సత్కవుల కవునె ...

వేణు. శ. 88.

**అంకులగొండి.** విశే (అంకుల + గొండి) అంకుతనపుస్వభావముగలది

ద్వి బొంకుల పిడుగులు అంకులగొండ్లు, ఎన్నె కత్తెలు నాంచవనితలు మఱియు ....

పండితా. పురా 116. పా.

**అంకులాఁడి.** (√అంకు) వి. జారస్త్రీ, లంజె.

ఆ దొంగతనము అంకుదొరయను జగతిని, అంకులాఁడి కింత శంకపుట్ట, దొంగకెన్న వేవెలం గొప్పుగా నట్టి, ... వేమ. 1. 155.

**అంకువెలఁది** వి (అంకు + వెలఁది) జారిణి.

కం. పంతపురకన్నెమూఁకల, అంకు లడిగె నెలమి గనిరి అంకువెలందుల్ ...

అచ్చ. రా సుం. ౬.

**అంకె.** వి. 1. ఎద్దు మొదలగునవి చేయు ధ్వని.

కం. చెలఁగు పటుసింహనాద ,బాలు అంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభంబుల క్రియ పొండొరులకు మా,ర్మలయుచుఁ దాఁకుచు ముదాత్తరభసోజ్జ్వలులై.

భార. ద్రో 4. 171.

ఉ అంకెలు గర్జలై యుడర ఊష్మసటంబున నొందుఁ బర్వ నిశ్శంకవిలోక వైకృత కృశానుశిఖల్ దెసలెల్లఁ గప్పఁగా ... లివిఁపవచ్చె యదూద్వహుపై నయంబునన్.

హరి పూ. 8 44.

ద్వి బంతుగా నాబోతు అంకెవేసినను, గంతులు దక్కునే కంఠీరవంబు ...

వ మిసమిసమెఱయు సస్యంబు లాస్యంబులం జరివ్రించి గర్వించి అంకెలువేయు జింకలును.

చిత్రభా. 2. 135.

2. ధ్వని.

మ. .. మహోత్సాహంబునం దేరు వెక్కియనేకంబులు తూర్యముల్ దిశల అంకెల్ ద్రేయఁజేయన్ ... రామా 8. 242.

3. కేక, అఱపు.

ఉ. ... కవితసారె మెఱుగక సారెసారెకు, స్తంకెలువేయు దుష్కవిబృంబుల నెల్లఁ దృణీకరించెదన్. రుక్మి. 1 17.

జ, అంకెవైచు.

**అంకెత.** వి. (అంకు.) జారిణి, జారత్వముగలది

ద్వి. బంకెతల్ అంకెతల్ పచ్చిరక్కసులు

పండితా పురా. 116. పా.

**అంకెవైచు.** (అంకె + వైచు) అ. క్రి. కేకలువైచు.

అ మీకుఁ చిన్నవాఁడ నేకాంగవీరుండ, అంకెవైచిన నెదలింకమైన, నగినఁ గేరరించినను మీసలంటినఁ, బట్టితివియ నాకుఁ బాడిగాదె. ద్వా. 7. 41

**అంకిలు(ల్లు)** అ. క్రి. (√అంకు.) పెద్ద ధ్వనిచేయు, (కలకలధ్వనిచేయు, అని శ. ర.)

**అంపె(పియ).** వి. 1. మాదిగవాఁడు తోలు కోసెడు సాధనము. (శ. ర., బ్రౌ.)

2. తాటాకులు మట్టగించి కోసెడు సాధనము (శ. ర., వా.)

**అక్కు.** న. క్రి. గీఱు, బరుకు.

వ్యవ. పిల్లగోళ్లతో ఒకళ్లొకళ్లను అక్కుకొన్నారు.

వి. గీఱు, బరుకు.

ఉ. చెక్కులఅక్కులన్ మిసలఁ జెల్వగు మోవినిఁ బంటినొక్కులన్ ...
రాజ. వి. 2. 116.

**అజ్జ.** వి. వ్యర్థభాషణము.

(ఇది శకటరేఫయుక్తమని కావ్యాలం. సాధురేఫమని యప్పకవి.)

ఉ. అజ్జులాడి యూఱేఁబాపడిపథలోన, జేసిపోరి లోన ఊచ్చఁబోరని, తెన్నమడుగు పుడమి జేర్ల నేల మఱింప, మనకు విశ్వనాథుఁ డొవరియుండ. కావ్యా. 7. 46.

**అట్టడి=రట్టడి.** వి. కలకలము.

సీ. తన్నపాలుని సేవ యొనరించు అట్టడిరాకుమారులను జీకాకుపఱుచు ... రామ. 2. 35.

**అట్టు=రట్టు.** వి 1. అపకీర్తి, నింద.

సీ. గతిమాలి విశియాడుకాఁగిలిలేని యాఅడి కూర్మికే నేల అట్టువడితి ...
ఉ. హరి. 5. 117.

సీ. తమ్ములందోషాప్తి క్రమ్మి మూపిన అట్టు వయహాలులను తొట్టొనర్చు కొఱఁత ...
విప్ర 1. 37.

ఆ. ఆలిమాటకొఱకు బేలమై కోడలిఁ, గొడుకుఁ బోవఁదోచుకొనియె పతని, కేఁటిమగతవం బికె కడుఁగొరలేని, అట్టునొందె నింక అంతులేల. అచ్చ. రా. అయో. 86.

ఆం. భా. 1. 116.

2. అఘోషణము, గోల.

జ. అట్టువెట్టు.

**అట్టువెట్టు.** న. క్రి (√అట్టు + పెట్టు) వంచించు, మోసపుచ్చు.

గీ. అన్నియు మఱచెఁగాఁబోలు వెన్నుఁ డాత్మ, గోరి తాఁ జాయనానైనవారివిడుచు, నట్టి కృష్ణుఁడు తము అట్టువెట్టునవక, యేల నమ్మిరి పురసతుల్ జేలగుచు.

భాగ. 10. స్కం. ఉ. 172.

**అప్పు.** వి. చిన్నతాయి.

గీ. పూని తమతమ కొనివచ్చుభూరుహముల, కాయగనరెల్ల వెరఁజాడి తాయి అప్పు, దెచ్చువారికి వోయూరఁ దించు వత్తురు ...

భా. రా యుద్ధ. 265.

చం. పతుఁబయిఁ బందుకొల్పు విరిపైఁడియుగట్టు దినుసుతాయి అప్పయు మఱిబంటు తాని సలుఁ బైరముఁ బెయ్యముఁ జేనుకెట్టులో, వయిన సమస్తసంపదలు వన్న నితిర్లకి వెచ్చ పెట్టఁగా ... కళా. 6. 86.

(ఇట చిన్నరత్నమని భావము)

**అయిక = అవిక = తైక.** వి. కంచెల, కూర్పాసము.

గీ. కొదమగుబ్బలఁ దావికుంకుమపుఁబూఁత, విభుఁడు చెంగావిఅయికంచు విడువఁ బోవ ... దశా. 8. 124.

**అవఅవ.** వి. 1. కోపవికారము, స్పర్థ.

కం. తివిరి కరవాలు సేకొని, అవఅవలెసఁగంగ వత్తెవపై జనుచోఁ, దివజేడల రేయుద్రిమ్మరి, పువుఁబోడి యొకర్తు నెయ్యమున నడ్డంబై.

అచ్చ. రా. సుం. 85

చం కులముకు రూపము న్మగనికూరిమియుం గల
దానవంచు నీ,వలవల రుక్మిణీరమణి వాసిఁ
బెనంగఁగ సత్యభామయుం, గులమును
రూపము న్మగని కూరిమియుం గలదానవంచు
నా,వలఁ బచరింపఁగా అవలవ ల్వొడమె
న్మది వారి కెంతయున్

పారి. 1. 42. వసు 6. 9.

2. మండుటయందగు ధ్వని కమకరణము.

సీ. అవఅవమండు నెట్టని చంద్రమల్లెఁచోదయ్యఁపు
గుండాలు చొచ్చువారు ...

క్రీడా. 1 142.

అవిక = తైక వి (క అవికె, త ఇరవిక్కై) కంచె, కూర్పాసము

చం అవికయుఁ బట్టుపుట్టము చెఱంగు మఱుం
గయి యున్కిఁ జేసి . నైష. 6 131.

చం. కలయగఁ జంద్రకావిఅవికంబలెఁ గుంకుమఁ
బూసి చూడు మో,పాలఁతుక వాదు
నేర్పనిన ... విజ. వి. 2. 92.

సీ. .. కంచెల అవిక తైక యనవడరు ...

ఆం. భా. 2. 155.

అవ్వ వి. నింద, దూఱు.

కం. ఇవ్విధమునఁ బ్రతిదినమును. నవ్వెలఁది
చరింపఁ గొంద అతిదూషకులై, అవ్వలు
సేయుచు నోరుల, గ్రొవ్వునఁ బాపంబు
పంచికొందరు వరుసన్. భోజరా 3. 95.

సీ ద్విజరాజులఁ గులాయవితతిఁగూర్చు మిటారి
దితికి రతిప్రేమఁ దెచ్చు అవ్వ ...

రా వి 3. 3.

(ఇట నిందాహేతువని భావము)

ఉ. ... ఇవ్విధమెల్ల నెచ్చెలుల కేర్పడఁజెప్పిన
దిట్ట కూళలై, నవ్వులఁబెట్టి యందఱు విన౦
గడు భామునఁ ద్రుళ్లకొంచుఁ దా,రవ్వల
అవ్వలంబఅపి యంకిలి సేయక మానవేర్తురే.

రసిక. 4 11.

జ : అవ్వచేయు, అవ్వలాడి, అవ్వాడు.

అవ్వచేయు. స. క్రి (అవ్వ + చేయు) నిందా
పాలుసేయు.

ఉ .. ఇంత యెఱుంగలేక తా,నే నను అవ్వ
చేసినఁ ద్వణీకృతమింతె శరీరమొక్క
మ్మట్లయిన సమానదుఃఖ మెవయం దనకాపుర
మెత్తిపోవదే. శుక 2. 133.

అవ్వలాడి వి (అవ్వలు + ఆఁడి) నిందించు
వనిత.

వ ... కెకెనవ్వు జవ్వనంపు అవ్వలాఁడి ...

ఉ. రా. 4 163.

అవ్వాఁడు స. క్రి. (అవ్వ+ఆడు) నిందించు.

(శ. ర).

## ఆా

ఆా. వి. వృత్తియందు 'ఆాయి' శబ్దమునకు మీఁది
వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము

కం. ఆ పారావారము ఆా,రూపై రథమరుగు
నంత త్రోవ విడిచినన్ ...

ఉ. హరి. 2. 44.

గీ. అట్లు తడవుగఁ గొల్చి సాష్టాంగ మెరఁగి,
గర్భమంటపిఁ గడిగిన కలుషజలము, లోని
ఆాతొట్టినిండి ... ఆము. 6. 8.

గీ. వచ్చుఆా మానికంబుల వళ్లెంములు ...

నైష. 6. 122.

**లెప్ప** = లెప్పము[1]. వి. (క. లెప్ప) లక్ష్యము, (ఆ. ని., శ. ర.)

సీ. ... లెప్ప యనంగ గుఱి యనఁగ బఱవ లక్ష్యాభిధానంబు ... ఆం. భా. 2. 212

**లెప్పము[1]** = లెప్ప. వి. లక్ష్యము, గుఱి

కం. మీ పుష్పగంధి నెయ్యపుఁ, జూపులకును లెప్పమైన సుకుమారవపుః, శ్రీ పెంపునఁ దనరిన వను, ధావతిసుతుసఖుఁడ నింద్ర దత్తాహ్వయుఁడన్. భోజరా. 3. 240.

కం. అప్పుడు నరపతి యిప్పటి, యప్పడఁతుక యెందుఁ బోయె నాశ్చర్యం బీ,చొప్పు కలయొ నిజమొ యనును, లెప్పంబయ్యెను మదనుశిలీముఖములకున్.

కేయూర. 4. 24.

ద్వి. అభిముఖుండై హృదయాబ్జకర్ణికను, లెప్ప మౌ దన ప్రాణలింగంబు నెఱ్జి, నుప్పరిం చుడు తతియోరులింగంబు.

పండితా దీక్షా 59 పు.

**లెప్పము[2]**. వి. (సం. లేపః) సున్నము మొదలగు వాని పూఁత.

సీ. ఆయతీశ్వరుఁ డంత వతిరమ్యమైన యా లెప్పంపుఁ బూఁబోఁడి యొప్పు చూచి.

కళా. 8. 169.

**లెమ్మ** = లే[3]. అవ్య. 1. తర్జించుట (ఇది మొదలు లేచు ధాతు ప్రార్థనార్థక రూపమయ్యెను క్రమముగా అవ్యయముగా మాఱినది)

మానినీవృత్తము అంతమదింపకువేయని పల్కిన వంతమదింపకువే యనుచున్, గంతు లడంచెద లెమ్మని పల్కి నగంతు లడంచెద లెమ్మనుచున్. కళా. 3. 195.

2. కానిమ్ము, కానీ. (పక్షాంతరాంగీకారమును దెలుపును.)

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో, మది సాత్రాజితి దానికే నిపుడు ప్రేమం బంపినన్ దీని నెల్లి దముం జేసినజాడ దోచునొకో యా నెమ్మిందు నేమనిన్నఁ జెల్లదువో యెరికిఁ బంపఁగా ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్. పారి 1 54

**లెయ్యంబు**. వి. (సం. స్నేహః) నెయ్యము, స్నేహము.

గీ. పాలు నేయును గూడినభంగివోలె, నొనరి లెయ్యంబుతోఁ గూడియున్న భటుడు ...

కు. సం. 11. 623.

**లెస్స**. వి. 1. క్షేమము, కుశలము.

మ. చెలువంబే విను వీటి నీటరులకున్ జేజేలకున్ లెస్సయే ... చం. రా. 2. 20.

ద్వి. నీ లెస్స నా లెస్స నీకైవలేమి, నాలేమి గావ నానావిధంబులను.

రం రా. అయో. 69 పు 16 పం.

గీ. ... అమ్మ కుశలంబె సాధ్వి యనామయంబె దేవి భద్రంబె లెస్సలా పూవుఁబోడి ...

కాశీ. 2. 71.

గీ. క్షేము మగు లగ్గు లెస్స మేల్ నేమ మనఁగ. ఆం. భా 1. 98.

2. మేలు.

గీ. పసిఁడిమృగము నిక్కంబైనఁ బట్టి తెచ్చి, జనకసుతకోర్కి దీర్చెద పమ్మదమున, లేక మాయామృగంబైన లీలఁ ద్రుంచి, హిత మొనర్చెద మునులకు నెట్లు లెస్స.

భా. రా. అర 2. 44.

గీ. ఎఱిఁగినవి నాల్గు నొడువ నేమయిన లెస్స

ఆము. 4. 68.

3. మంచిపని, యుక్తకార్యము

కం. ఆలోక దాన మన భూ,పాల నరగు దీప మీగి భావము సద్ధర్మాలోకనశీలంబగు, నాలెస్స యొనర్చినట్టి యతనికి నధిపా

భార అను. 4. 18.

విశే. 1. క్షేమయుక్తము

సీ. వేదసంచోదిత విప్రకర్మంబులు లెస్స లయ్యెడు నవి లేకయున్నఁ జెడియెడు

లెస్సైనఁ జెడినను రాజున కగుఁ బుణ్య
పాపంబు లగ్గలములు.
భార. శాం. 1. 275.

గీ. .. లెస్సయుండుదె గృహకర్తలేనిబ్రతుకు.
మనుచ. 3. 129

సీ ఎంతలెస్సగనున్న నంతవేడుకె కాని ప్రజల
కల్మి కనూయపడుటలేదు.
విజ. వి. 1. 22.

2 యుక్తము, మంచిది

ఉ. ... తల్లి వినవమ్మ యీ జగములెల్ల సృజింప
భరింపనొంపజా, ల్దైవత లెట్లు వర్తిలిన లెస్స
వుగా కివి చెల్ల వేరికిన్.
సారంగ. 2. 120.

చం. ... విభేదవృత్తి నా,మనమున లేదు పాండవ
సమాజము మీరును నొక్కరూప కా,వున
నిది లెస్సమాట దగవుం దలపోయఁగ ..
భార. ఉద్యో 1. 97.

3 రుచ్యము రుచిగలది.

సీ. లెస్సాయెఁగా కదళీశాకపాకముల్ మఱి
హరించెనే దా మనసు గినసు.
రా. వి. 2. 105.

కం చక్కెర గలుపుక తింటే, ముక్కవతవుకైన
లెస్స మోహముగలచో, వెక్కురుజానిప
యైవన్, మక్కువతో దివ్యభామ మహిలో
వేమా. వేమ. 2. 85.

4. శ్రేష్ఠము, ఉత్తమము

చం. ప్రియ మెనఁగం దగం బిలిచి పెట్టెడుకూడది
లెస్సకూడు... భార. ఉద్యో. 3. 222.

కం. అనుటయు వైశంపాయనుఁ, డవఘా లెస్స
కథ యడిగి తచ్యుతశుభలాం, ఛనామధామ
మాత్మం, గొనియాడి ...
హరి. ఉ. 5. 103.

ఆ. దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.
ఆము. 1. 15.

5. సులభము, సుఖప్రాప్యము.

కం. జ్ఞానమ యింధనముగ వి,జ్ఞానాగ్నిం బ్రబలఁ
జేయ జరయు మరణమున్ నానావిధదుఃఖం,
బులు, లేని యమృత మక్షరంబు లెస్సై
లోఁచున్. భార. శాం 4. 317.

6. అనుకూలము.

గీ, మనువు లెస్సయియుండెఁబో మానవపతి.
హర 4. 28.

క్రి. వి. చక్కఁగా.

ఉ కానక రాజుచిత్తము పకావకలై తెగఁ
జూచువట్టు లా,హా విపరీతమైన పలుకాడెద
నంటివి ము న్వినాశకా,లే విపరీతబుద్ధి
యని లెస్స బయల్పడఁ జెప్పినారెకా,నీ
విధి యాడుమీ యనఁగ నీవిధి నాడెదు
నుమ్ము భామినీ సారంగ. 2. 142.

ఉ. అంచు వతఁడు వల్క దరహాసతఁ జెక్కిలి
గొట్టి లెస్స వం,చించితివోయి దాసరి ...
ఆము. 6. 40.

కం అనిన న్మఱియుం జదివిం,చినయట్లనె
చదువ లెస్స శిక్షింపక చె,ప్పినరీతిఁ జదువఁ
దని .. దశా. 4. 148.

అవ్య. ప్రశంసార్థకము.

చం. ... లంచమిచ్చి వే, పిలిచి తలార్ల చేత నని
పించిన దిట్టుల నీకు వాశముల్. దెలియక
వెఱ్ఱిరాజ యిది లెస్సనిజం బని నమ్మి
నాఁడవే. సారంగ. 3. 207.

(ఇట వ్యతిరేకలక్షణచే నిందార్థకము)

చం. వికవికనవ్వి యక్కపట విప్రకుమారుఁడు
మేలు లెస్స వా,నికి నయి రాగబంధమును
నిల్పె మదిం దరళాయతాక్షి ...
హర. 4. 27.

సీ. ... ఒగి లెస్స యనఁగ సాధూక్తి దనరు.
అం. భా. 3. 67.

జ : లెస్సఁదనము, లెస్సవాఁడు.

**లెస్సఁదనము.** వి. (లెస్స + తనము) మంచి
తనము, యోగ్యత.

కం. బాలసఖుండవు నాకును, నీ లెస్సఁదనంబు
వేము నీతివిడిచి దు,శ్శీలురమగుటయు శైశవ,
లీల మొదలుగాఁగ మును దెలియదే నీకున్.
భార. ఉద్యో. 1. 378.

తెస్సవాఁడు. విశే. (తెస్స + వాఁడు) యోగ్యుఁడు.

కం. నిను తెస్సవానిగాఁగన్, వినినాఁడంగావ నాణువిభవము సర్వంబును నీకిచ్చితిఁ జిర జీవనసౌఖ్యము నొందు మనుంవర యని నెమ్మిన్. హరి ఉ. 8. 240.

# లే

లే[1]. అ. క్రి. కలుగుధాతువునకు వ్యతిరేకమున ప్రాయికముగా వచ్చు ఆదేశము.

ఉదా : లేఁడు, లేరు, లేదు, లేక. లేవడి.

(లేనిదియగు, లేనివాఁడగు)

గీ. .... నీవును ముక్కువోలె, నిలువరింపంగఁ దగినాఁడు నిలుపులేవ ..
భార ద్రో. 5. 326.

మ. అలనా యేటికి .... వలలేఁడుం గృపలేఁడు కీచకులు దుర్వారంబు లెట్లో కదే ...
భాగ. 10 పూ. 1129.

ఉ. ఎవ్వతె వీవు భీకరహరిణేక్షణ యొంటిఁ జరించె దోటలే, కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్, గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ ఒనుదెంచి పురంబు జేర నిం, కెవ్విధిగాంతుఁ దెల్పఁ గదవే తెరువెద్ది శుభంబు నీకగున్.
మనుచే. 2. 39.

(ఉండదు. ఉండఁడు)

కం. కలవారెల్లను మగిసిర, కలిగియు లేఁడయ్యెఁ గుంతకర్ణుఁడు వీనిం, దెలుపుదు నీ ..
భార అర 7. 93.

చం ... సంగరమున లేరు హంసడిభకప్రతివీరు లనంగఁ బొంగుచున్.
ఉ. హరి. 4 17.

ఉ స్వామిహితంబునన్ సమదశాత్రవభంజన శక్తి బంధురజామహనీయసంపద వసంత సమాగమ ఫుల్లమల్లికా, స్తోమ తుషార పాండుర యశోగరిమంబున ధర్మశీలతన్, మామిడిమంత్రిఁ బోల మఱి మంత్రులులేరు వసుంధరాస్థలిన్.
నైష. 1. 24.

కం. ప్రేమానుబంధ మిరవుం, కేమాగ్రమ నాఁడువ లేదుఁడీ యనివట్లా, భూమిసురు లవ్వరు నకు. వామాక్షికిఁ గొంకుముడులు వైచిరి వేడ్కన్. (లేదు + చుఁడీ. ఈ. ఇట చు లోపము.)
ఇందు. 6. 58.

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నెఱజనించుఁ, బ్రబ్బులేదగువంచుఁ బలుకుట దప్పుగాదు ...
భాగ. 10. పూ 128.

సీ. ... నిందాభినుతులు, హింసయు నాత్మ ప్రశంసయులేవు భూతంబులయందెల్ల దయ ఘటిల్లు.
భార శాం 5. 228.

చం .. ఉమ్మలికయు మబ్బు నాదుమది మందున కైనను లేదు వాసవా.
భార శాం. 4. 394.

కం. తమ్ముఁ దవత మ్ముఖను నాగన్నకొడుకులట్ల తలఁతుఁగాని వివేదం, బెన్నఁడు నామది లేమికి, వెన్నుఁడ దైవంబసాక్షి వినుము వలికెదన్.
భార. ఉద్యో. 3. 193.

(మధ్యమపురుషక్రియ సమాపకక్రియ యుక్తమయి చాలదు, ఓపదు, చాలఁడు, ఓపఁడు అను అర్థము నిచ్చును.)

కం. పాపంబుఁ బుణ్యమును ద్వంద్వప్రాపకులకు దుఃఖ సౌఖ్యసంపాదు లగున్. భూపాల విన్నష్టులు ... లగుట వాని ... లేవా ఫలముల్.
భార. ... 1. 145.

చం. ... ములు నాగరణంబు ప్రచారణంబుగాఁ, గలుగ నుపాధిభేదముల గాఢమతి న్నిగమూఢమైన వింద్యులు పదునాలుగి టికి నశం బొనరించెఁ ... త్వము, దెలియగలేము ... దీక్ష నెమ్మెయిఁ జరిపుచేసినవన్.
నైష. 1. 45.

గీ. నెలఁతకుచకుంభయుగళము డియు వియోగ, జలధి యీదింపలేదయ్యె సఖులు నంచు, చున్న పన్నిట వెల్లిలోఁగొన్న శతవ, ము పకది లాఘవమునఁ దేలింపఁగలదె
ఆము 5. 151.

వ త్రి. పొందకుండు.

ఆ. కర్మఫలములేదు కర్మఫలాప్తికిఁ, గారణంబు విధియుఁ గాదనంగ, నెంత యొఱుకలేనె యాత్రినై విధిచెద్దు, కలిసిపలికితిం గ్రియంబు దప్పి. భార. అర 1. 281.

ఎంతకులేడు = ఎంతకు సమర్థుఁడుకాఁడు.

ఉ. ఎంతకులేడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీకాంత వినంగ నేను వినఁగాఁ బలికెన్ బతిఁగూర్చిచావ నా, యంతటివారు లేరని... పారి 1. 60.

పొట్టకులేక = తిండికిలేక.

ఉ ఎట్టిపురాణముల్ పదియునెన్మిది జెప్పితి వెట్టు పొట్టకులేక తిట్టెదవు పుణ్యగుణం బుల రాశిఁ గాశికన్ కాశీ. 7. 192.

లేనివాఁడు = దరిద్రుఁడు.

అ. కంబుకంఠి నీవు కలవాఁడు గలవాఁడు, లేని వాఁడు నీవు లేనివాఁడు. కాశీ. 3. 47.

సా కలవాఁడు గాదె తీయునప్పటికి లేనివాని ప్రాణము పోయినది.

జ : లేనడి

లే² విశే. లేతశబ్దముయొక్క ఉపక్షేపరూపము. ఉదా. లేఁగొమ్మ, లేఁబచ్చిక, లేమావి, మొ॥ (చూ. లేత.)

క్రి. విశే. అల్పముగా.

ద్వి లీలఁ బయ్యెదకొంగు లే జాఱవై చి. ద్వి. పరను. 4. 294

లే³ = లెమ్ము 1. నిశ్చయమును దెలుపును.

రగడ లేను జాదిపువ్వు మొగ్గలేదులే దురాశ గాని, చాయవృక్షవాటిఁ దిరగఁజాఁ జాలు సొలపుమాని. వరాహ. 8. 92.

ఉ లెంకఁగ నేలుకోగలదులే మగనిం దిరితీపు చేసి ... విజ. వి. 3. 34.

2. పరిహాసమును దెలుపును.

సీ. చెలి పెండ్లికతఁ జెప్పఁ జెవియొగ్గి వినవేమి కలదులే యని గేలిసలిపె భద్ర. విజ. వి. 3. 28.

3 అనాదరమును దెలుపును.

మ. శివలింగార్చన మెందుఁబోయెడుఁ దపస్వి త్వమ్ము నెందే నుపద్రవముం బొందదు లే ... హర. 7. 65.

దండకము ... జీవింప,బోరామిఁ గావింపఁగా రాదులే కాదులే వాదులేలా ..

భోగినీదండకము.

అ ఈనుబుద్ధిమాట లెంతలేయని పోయె, దీసు బుద్ధి నిడుఁజూమీ లతాంగి. సారంగ. 2 24.

లేండము. సం. వి. అ. న. మూత్రము, పరీషము, మలము.

లేఁక = లెంక. వి. 1. సేవకుఁడు.

గీ లేకయుండిన వినివి యా లేఁకలు. అచ్చ రా. యు. 227 (వ. ర. పా)

గీ. లేవకుండిన వినివి యా లెంక లప్పుడు. మద్రి. పా.

లేఁగ వి. (లేత + కానుపు) క్రొత్తగాఁగలిగిన దూడ, తర్ణకము, దూడ, వత్సము.

(ఇది కొన్ని పట్ల వృత్తియందు జౌపవిభక్తిక ముగా కన్పడుచున్నది. చూ లేఁగటిపడ్డ)

గీ ... తనరు లేఁగ యనంగఁ దర్ణకంబు. ఆం. భా. 2. 262.

కం. ఒకనాఁడు గో వొకటి లేఁగకుఁ జన్నిచ్చు చును దానిఁ గనుఁగొని ... భార. అను 3. 85.

ద్వి లేఁగలఁ బుడుకుచు లీలఁ గేతయ్య, మూఁగి యర్చుచు మేఁత ముట్టకుండుటయు ... బస. పు. 7. 625.

చం. ఇది యొకమంచిలేఁగ వినుఁ డెంతయు నొప్పెడు నంచు దాన తత్పదములు దోఁకయుం బిగియఁబట్టి చెలంగి వెలంగ మ్రానితో, బదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం, గుదలుకొనఁగ బాలకులు కోయని యార్వ నఖర్వలీలతో. భాగ. 10. పూ. 435.

లేఁగంపు. వి (లేఁత + కంపు) కొంచెము పరిమళము

ద్వి తుమ్మెదల్ వెమిఁ వాతులు దొల్చితొల్చి కమ్మనిలే గంపు గవియునో యనుచు

పండితా పురా. 90 పొ

లేఁగటా(టియా)వు. వి. (√లేఁగ) లేఁతదూడ గల యావు, ధేనువు

గీ. పేరుకొని లేఁగటావులఁ బిలిచిపిలిచి, పిచ్చలించుచు, గ్రేపుల విడుచువాని ...

వి. పు. 7 337.

చం సనుపడు లేఁగటాలసిరిఁ జాయని యిండుల దొడ్డి మందలం దనియఁగ జూపెదన్ ....

చెన్న. 3. 73.

లేఁగటిపడ్డ. వి. (లేఁగ+పడ్డ) క్రొత్తగా యీనిన ఆవు పెయ్య.

ద్వి ... పిడుక, గొడ్డును లేఁగటిపడ్డయై యపుడ. గడ్డుగ నిండారఁగాఁ బాలు గురసె.

పండితా. పురా. 188 పొ.

లేఁగవును = లేఁగౌను. వి. (లేఁత + కవును) సన్నని నడుము.

చం. చెదరిన ముంగురుల్ తఱుచు చెమ్మటఁ దోఁగిన తళ్కుఁ జెక్కులున్, వదలినకప్పుఁ గొప్పు వసివాడిన మేనొకయింతజాఱుప, య్యెద యసియాడు లేగవును నిట్టటుఁ దొట్రిలు పద్మయుగంబుఁ జెల్లొదవెడి యూర్పులుం గల తలోదరిఁ గన్గొని రాముఁ డిట్లనున్.

ఉ రా. 6. 65.

లేఁగసవు. వి. (లేఁత+కసవు) బాలతృణము (వ్యా. వి.). (శ. ర.)

లేఁగారము. వి. (లేఁత + కారము) కొలఁదికారము, అల్పమైన కారము.

సీ. కమ్మవిడెంపు లేఁగారంబుగల మోవి కండ చక్కెరపానకంబు లిచ్చి. వాల్మీ. 2. 79

లేఁగౌను = లేఁగవును వి. (లేఁత + కౌను) సన్నని నడుము.

కం. లేఁగౌఁదీఁగె నితంబము, వ్రేఁగునఁ ద్రెవ్వెటయుఁ గని విరించి బిగింపన్.

అము. 5. 28.

సీ. కృశదైవ్యజాతి వర్ధిలు నిటులనురీతిఁ గలకంఠి లేఁగౌను బలితమయ్యె.

ఉ రా. 2. 137.

లేఁజిగు(పు)రు. (లేఁత+చిగురు) మృదుపల్లవము.

సీ. కొమ్మ లేఁజిగురాకుఁ గెమ్మోవి చవిగొని యమృతంబు నీరసమని తలంతు

శుక. 3. 48.

లేఁజూపు. వి. (లేఁత + చూపు) మృదువైన చూపు.

గీ దమ్మికేలుండఁ బెర కేల దండయిచ్చు, లేము లుడిపెడు లేఁజూపు లేమతోడ

అము. 1. 12.

లేఁజెక్కులు. వి. (లేఁత + చెక్కులు) కోమలము లగు కపోలములు.

సీ. తొలిచూలి జవరాలి తళుకులేఁజెక్కు టద్దములతోఁ దులఁదూఁగు దంతరుచులు.

దశా. 2. 229.

లేఁజెమరు. వి. (లేఁత+చెమరు) చిఱుచెమట

చం అలికుల వేణియొక్కతె ఏకాంతమునఁ దవయంగవల్లికన్. బులకలుచొక్కు లేఁజెమరు పుట్టఁగ నేగి నరేంద్రుఁజూడ నా ఫలకలు చొక్కు లేఁజెమటఁ బోవక యిట్టులనుండె.

మనుచ. 5 66.

లేఁజెఱకు. వి. (లేఁత + చెఱకు) కోమలమగు చెఱకు, పిపుగల చెఱకు.

కం. చిలుకల తేరును గోకిల, బలములు లేఁజెఱకు విల్లుఁ బ్రసవాస్త్రములున్, దొలఁగించిన మరుఁడో యన, విలసితగతి నిచ్చు రాజవీథిఁ జరింపన్

శుక. 1. 121.

లేఁత విశే. 1. పసి, తరుణము. (దీనికి తరుణమైన అనియే యర్థమైనను వ్యుత్పత్తియందు కొంచెము, చిన్న, తిన్న, తేలిక, పలుచ, మెత్త, సన్న

మున్నగు ననేకార్థములు వచ్చును వృత్తియందు దీని మొదటివర్ణముమాత్రము శేషించును. అవు డుత్తరపదము పరుషాదియగునేని దీనికి నుగాగమంబడును

ఉదా: లేఁత + కొమ్మ = లేఁగొమ్మ, లేఁత + కప్పు = లేఁగప్పు మొ॥

సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేత చందురులఁ దాలిచినవారు.

పాండు. 1. 165.

(శ్రీకృష్ణుఁడు) గీ. జాంబవతియను దేవికి సాంబుఁ గనిరో, నక్క్రమారుండు లేఁతప్రాయంబు నందు, వీథి నొకనాఁడు సఖులతో విహృతి సలుప.

కాశీ. 6 3.

చం. ఒదవెడు జవ్వనంబు వెలికొత్తఁగఁ బయ్యెద సిగ్గుఁగూడి బిత్తుదుమగ లేఁతలౌట దిగ నాఁకకు మీఱమలేక వక్షపుం, జదుమునఁ బ్రక్కల న్మెఱసి చప్పటలై మఱి లావు గూడఁ బైఁ, బొదలెననంగఁ బిక్కటిలెఁ బొల్తుక చన్నులు నాఁడునాఁటికిన్

ఆము. 5. 21.

2. సుకుమారము, కోమలము.

సీ. జేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ దాటంక యుగళంబు తన్నియాడ. హర. 3. 93.

3. మృదువు, మెత్తనిది.

సీ. కనకకుంభస్తని కక్షద్వయము గబ్బుమాత్రంబు గలిగుండు మనసు లేఁత

కళాశాస్త్రము 1. 20.

సీ. చిన్నిబుగ్గల లేఁత చిఱునవ్వు వెలర్ప సిరి యాళుఁడు మొగిడ్చెఁ జేయిదోయి.

హం. 2. 115.

4 అల్పుఁడు, అల్పము.

చం. తనుశతకోటు లెత్తి బహుధర్మవినిర్మితిఁ బేర్మిఁ గాంచినన్, ననుఁ గనలేనిలేఁతలకు నాతియ భోగ్యము భాగ్య మీవ ప్రాఁగ్జననమునం దొనర్చితి వొకానొకయర్చన నన్నుఁగూర్చి దాఁనవ సమకూరెఁజుమ్మ సుజనవ్రజనందిత చర్య నీదెసన్. పాండు. 4 191.

ఉ. ప్రాఁతల మేము నీకుఁ బలుబాములఁ బొందకయున్న నాఁటి నీ చేఁతలు గాఁటి మందలకుఁ జిత్తముల న్వెలిఁదోఁచు మాఁతలుం, బూఁతలు నీవ యొండు దల పోఁతలు లేఁతలు మమ్ము నెమ్మెయిన్, లాఁతుబగాఁ దలంపకు సలంపకు చాల వలంగియుండగన్. ఉ. హరి 4. 97.

వి 1. లాఘవము, చులుకన

చం. ... ముదితచకుక్య్రవల్లభుని మ్రోలఁ దవర్చుట చూచి నెచ్చెలుల్, మదనుని చేఁతకుం దరుణి మానము లేఁతకు నొచ్చి రిచ్చలన్.

కావ్యా. 5. 48.

ఉ. పూఁతపసిండివంటి వలపుంబచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యుత్తెఱఁగు ...

మను వ 3 38.

2. ఆందోళికా దండము యొక్క దోషవిశేషము

వ. లేఁత ముదురు సన్నము గమకము నీలధవళ రక్త హరిద్వర్ణంబులు మొదలుగాఁగల దుర్గుణంబులులేక ... ప్రబంధ. 605.

జ : లేఁగ, లేఁగంపు, లేఁగటావు, లేఁగటిపడ్డ, లేఁగవుము, లేఁగసవు, లేఁగారము, లేఁగొమ, లేఁజిగురు, లేఁజూపు, లేజెక్కులు, లేఁజె మరు, లేఁజెఱకు, లేఁతనగవు, లేఁతనవ్వు, లేఁతవెల, లేఁతమాట, లేఁదలిరు, లేఁదీఁగ, లేఁదెమ్మెర, లేఁదొడ, లేఁబగలు, లేఁబచ్చిక, లేఁబట్ట, లేఁబరువు, లేఁబల్కు, లేఁబురులు, లేఁబెయ్య, లేఁబైరు, లేఁబొఱ, లేఁబొల, లేఁబోఁక, లేఁబ్రాయము, లేగాడ్పు, లేజవ్వనము, లేజాఱు, లేనగవు, లేనడ, లేనవ్వు, లేనురువు, లేనెన్నడ, లేనెల, లేబొండుమల్లె, లేమరులు, లేమావు, లేమావి, లేమొండ, లేవంక.

లేఁతనగవు = లేఁతనవ్వు. (లేఁత + నగవు) మందహాసము, చిఱునవ్వు.

కం. అనితలఁచి లే తనగ పావనమునఁ దగ శంభుఁ డాసవము డిగ్గక మున్, దన వామపదాంగుష్ఠం,బున వదిమె దశాస్యహస్తములు క్రిందు వడన్. ఉ. రా. 3. 83.

**లేఁతనవ్వు** = లేఁతనగవు, లేనగవు. వి. (లేఁత+నవ్వు) చిఱునవ్వు, మందహాసము.

ఉ. అల్లన మేలమాడు వచలాత్మజమాటకు లేఁత నవ్వు నం,ధిల్ల ... మనుచ. 1. 2.

**లేఁతనెల.** వి. (లేఁత+నెల) బాలచంద్రుఁడు.

చం. ... అవ్విరిం, దననెఱిగొప్పునం జెరివి వవ్వలిగుబ్బలిముద్దుపట్టి లే,తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహన కాంతి సంపదన్. పారి. 1 55

**లేఁతమాట.** వి (లేఁత+మాట) నికృష్టవచనము.

ఉ. బొందులు వేఱుగాని తలపోయఁగఁ బ్రాణములేక మంత్రిలం, గొందఱు లేఁత మాట లవి కూరిమిపట్టువపంచుఁ బ్రాణముల్, బొందులు వేకమైరనఁగఁ బొల్పగు శంకరుని న్నృపాని వ,స్పందితభక్తిమైఁ గదిసి బ్రాహ్మణపుంగవుఁ డానతాంగుఁడై. భోజరా. 6. 220.

**లేఁదలిరు.** వి. (లేఁత+తలిరు) లేఁజిగురు.

మ. .... శీతక్రియల్, పానరింపవ్ సమకట్టు లేఁదలిరులన్ బుష్పంబులన్ బూఁతలన్. దశకు. 3. 123.

**లేఁదీఁగ.** వి. (లేఁత+తీఁగ.) లేఁతలత.

సీ. జుంజువెండ్రుకలెత్తి చుట్టున లేఁదీఁగ పన్న గాధీశ్వరుపగిది మెఱయ. విక్ర. 2. 123.

**లేఁదెమ్మెర.** వి. (లేఁత+తెమ్మెర) పిల్లవాయువు.

సీ. ఒలసిన లేఁదెమ్మెరల యెమ్మె గను కమ్మ బంగరుపూఁదోఁటపజ్జన్ ...

ఉ. రా. 3. 66.

**లేఁదొడ.** వి. (లేఁత+తొడ) సుకుమారమైనతొడ.

ద్వి. పన్ని కాళియల సంపదముట్టుకోలు, గొన్న నిగ్గులబోవఁ గురియు లేఁదొడలు ...

ద్వి. పరమ 1. 15 పా.

**లేఁబగలు.** వి. (లేఁ + పగలు) సూర్యోదయము మొదలుకొని పదిగడియల ప్రొద్దెక్కువఱకు నుండు కాలము.

గీ. .. సమిధలుగొని మహాప్రాజ్ఞుఁ డతఁడు, వచ్చు లేఁబగటికి నిజావాసమునకు ...

పాండు. 2. 17.

**లేఁబచ్చిక.** వి. (లేఁత+పచ్చిక) లేఁతనైన పల్లగరిక.

శా. ప్రాతర్వేళల మంచుచిన్కుగమి జొంపంబైన లేఁబచ్చికల్. ఉ. రా. 5. 286.

**లేఁబట్టి.** వి. (లేఁత+పట్టి) పసివాఁడగు కొడుకు; అట్టికూఁతురు.

సీ. ముక్కంటితలపువ్వు మున్నిటిలేఁబట్టి కైటభారాతిడాకన్నదమ్మి. నైష. 8 201.

శా ... ముఖలక్ష్మికి న్ముకురమై ఁండల్ల లేఁబట్టికిన్ మాఱెన్యయతనం బొవర్చె గిరియాత్మశ్రీ భావంబువన్. వసు. ౧. 34.

**లేఁబరువు.** విశే. (లేఁత+పరువు) నూతనము.

చం అఱవిరి వెండిచెంబుల వయంబునఁ దేనియ పానముం లేఁ,బరువగు గుజ్జుమావి చవి పందిరులన్ లతకూన లియ్యఁగఁ, వరుదుగఁ గ్రోలియన్ నటసిజాస్త్రగృహస్థిగఁ గఁదుఁ దేఁటి ని,బ్బరముగు జాళిమై నధరపల్లవ మంటులఁ గటివే చెలీ. కువల 3. 122.

**లేఁబలుకు(లుకు).** వి. (లేఁత + పలుకు) లేఁత మాట, మృదువాక్కు.

సీ. ఘనపురాతనభక్తకథలు విన్వీనుల వెలఁడి లేఁబలుకులు వినఁగఁగోరు.

చన్న. 2. 242.

**లేఁబురులు.** వి. (లేఁత+పురులు) బాల్యము.

ద్వి. బుద్ధు లెఱుంగ లేఁబురులు ప్రాయమున, సిద్ధంబు భక్తుల శివునిగాఁ దలఁచు.

ఒస షు. 1. 424 పం.

**లేఁబెయ్య.** వి. (లేఁత + పెయ్య) చిన్నదూడ, లేఁగదూడ.

గీ కొనం కాఁబోతు నాఁబోతు గ్రుమ్ముఁలాడ, నడిమి లేఁబెయ్యగతి వచ్చె నాకు నిపుడు
కాశీ 2. 104.

లేఁబైరు వి (లేఁత + పైరు) తరుణమైన సస్యము, లేఁతచేను

గీ. పలుకులవెలంది తళుకుఁజెక్కుల విచిత్ర, పత్రముల వ్రాయనేర్చినపాణి ననిల, సుతుని నెమ్మేను నిమిరిన శోష దీఱి, వాఁడు లే బైరు వానచేవలెఁ జెంగి ఉ రా. 5 1 8.

లేఁబోఱ వి పల్లవము, చిగురు

కం. మెఱుఁగుల కచించ శశికిం గఱయుసు మణి కనకములకుఁ గారిన్యము లేఁబోఱకుం గాఢము దక్కఁగ, మెఱఁగెల్లను వచ్చి గిరిజసేనన నిల్చెన్ కు సం ౯. 119.

సీ. పూర్వసెజ్జ॰ను లే బోఱల పీచోపులు వెంపు వాటించి గానించువారు. దశకు 3 124.

కం లేఁబోఱల సోయగంబును, లేఁబోకల విచ్చు తమ్మిఁవిరిచెలువంబున్, లోఁబడఁగొని సేసిన క్రియ, బూఁబోఁడికిఁ బోలుఁ జరణములు మృదులములై.
సూరన యుదయనోదయము. 4. 857.

లేఁబోల వి (లేఁత + పోల) లేఁతదగు చేప పొట్టు.

సీ మలివాడు నాఁచువల్లుల గొంతొగరి లేఁ బోల వలు గాలి వే పోక నెఱిఁగి.
అము. 2. 53.

లేఁబోక వి. (లేఁత + పోక) మందగమనము, చిఱునడక

కం. పూఁబోఁణులకును విటులకు, లేఁబోకలఁ దఱు సొంపువీడ్కొలుపుఁబురిన్, లేఁబోకఁ బోఁకతోఁటల, పూఁబాళల కమ్మతావిఁ బొగడవగాడ్పుల్. భీమ. 1. 85.

లేఁబ్రాయము. వి (లేఁత + ప్రాయము) తరుణ వయస్సు.

శా శీలంబున్ గులమున్ శమంబు దమముం జెల్వంబు, లేఁబ్రాయమున్ మనుచ. 1 55.

లేఁబ్రొద్దు వి (లేఁత + ప్రొద్దు) అపరాహ్ణము.
(శ ర.)

లేక[1] అవ్య (ఉండు కలుగు ధాతువునకు వ్యతిరేక క్త్వార్థకరూపము) 1. ఉండక

కం .. ఆధారము లేకను ని తాకోర్చ్చెదం బువ క్రేలెద మనోమలోకమున తెరవుననీన్
భార ఆది .. 112.

శా దై తేయాఁతక యొక్కచో ని..వం దా .. మిన్ను గిరా. కలోయఁబు లేక పొ.. మిడ్చిజాలాపంబునన్
నైష 3 21.

గీ. దివ్య.. ఋగే .. త్రీలు లే., ..పృత దుఃఖాదలగు పదార్థమ లలేక యక్క పడియు డె బహుకాల మొప్పదఱగి, విగతదుఃఖ..లాసుఁడై వేల్చెజే డు
హం 6 80.

2. చాలక, ఓపక.

ఆ అలిగి యాడుగఱచి యాకట పెలుచన, నిల ..లేక యిమురి నింగిదాఁక
భార ఆది 6. 201.

గీ. పశువుచేతఁ బురిస్కృతిఁ గాడయలేక, చాపలమున వర్తించు చామరములు.
నైష. 2. 10.

3. పుట్టక.

(వ్యవ.) వానికి లేకలేక యొక పుత్రుఁడు పుట్టి నాఁడు.

4 లేనియెడల, కానియెడల, కాక.

గీ. స్వర్గమర్త్యపథూటుల చక్కఁదనము, తచ్చు మని నాగకన్యలతోఁడి కలహముననుచు గాల్లిప్పెదవా లేక బొటనవ్రేలఁ, బుడమి వ్రాసెద వదియేల పువ్వుఁబోఁడి.
దశా. 2. 424.

ఉ. కంతుఁడొ కాక యా రజనికాంతుఁడొ లేక జయంతుఁడో యితం, డెంతవిలాసము ...
సారంగ. 2. 37.

గీ. దిగ్గజంబులు మ్రొగ్గ ధాత్రీశరేంద్ర, మనఁగఁ బ్రొక్కుచునో తేక యంబరమున, కెగుర వైతురో . దశా. 2 159.

కం. ఈరణిఁదలంచుచు నాఁటినిఖానన నెరన్ నిలిపి రేగడకెన్, తేకెటుల నిద్రపమ్మున్, రేఁగు నయ్యువిన నెనరు నిల్పిన వాఁకన్. విః. వి. 1. 151.

**తేక².** వి. (సం. లేఖ) 1. జాబు.

కం. నీపతి నీకై వందుచు, నా పేరును తే యరపి నా డని యిది నే, నాపులుఁగవలనఁ దెలిసి ము,దాపూర్ణత మబ్బి విడివి ఎనిపితి దాలిన్. ప్రభా. 4 48. (శ.ర.సా తేఖ ముద్రి. పా.) 2. ఎడముతేక మిక్కిలి చేరకయగు వృక్షాదుల వరుస (శ. ర.).

జ : తేకరి

**తేకరి.** విశ. (తేఁ+అరి³) లేఖకుఁడు, వ్రాయరకాఁడు (శ ర.).

**తేకి.** వి రాలిన ధాన్యపుగింజ.

ఉ. తేకినిధి వ్రజంబు లవలేశము కాంచనభూధరంబు ర,త్నాకరరత్నరాసు లడుగంట్లు మనుష్మణి కామధుక్సురా, నోకహాముల్ ప్రయోజిత వినూతనవస్తువు లిట్టివట్టి వ,న్యాకుల కందరాలి పురవైశ్యుల సంపద తెల్పి చూపుచోన్. కవిక. 1. 11.

విశ. అప్రయోజకుఁడు (శ. ర.).

జ : తేకిబ్రతుకు, తేకివాఁడు.

**తేకిబ్రతుకు.** వి. (తేకి + బ్రతుకు) ఉంఛవృత్తి. తేకిగింజలేరుకొని బ్రతికెడు బ్రతుకు (శ. ర).

**తేకివాఁడు** విశ. (√తేకి) 1. తేకిగింజలేరుకొని బ్రతుకువాఁడు.

ద్వి వక్క సేయని తేకివాఁడవు నీవు. ద్వి హరిశ్చ. ఉ. 1418 పం.

2. అప్రయోజకుఁడు (శ. ర).

**లేఖ.** సం వి. ఆ. స్త్రీ. 1. రేఖ, చారిక. (విద్యుల్లేఖ. ఫేనలేఖ మొ॥) 2. గీఁత, నాఁగేటిచాలు, 3. పంక్తి 4 గీఁతలు గీఁయుట 5 చంద్రకళ. 6. ఆకృతి, రూపము 7. గుర్తు, ఆనవాలు. 8 పోలిక, సాదృశ్యము 9 మడిచికుట్టిన యంచు, అంచు 10. శిఖ, కొప్పు.

**లేఖకదోషము.** సం. వి అ పుం వ్రాయసగాని తప్పు; వ్రాఁత తప్పు.

**లేఖకప్రమాదము.** సం. వి. అ పుం. వ్రాయసగాని పొరపాటు, వ్రాఁతపొరపాటు, వ్రాఁత తప్పు.

**లేఖకము.** సం. వి. ఇ న. 1. వ్రాయుట, ఒకదానికి ప్రతివ్రాయుట 2 జాబు (విర్యమ్ము).

**లేఖకుఁడు.** సం వి. అ పుం వ్రాఁతగాఁడు, వ్రాయసగాఁడు, ఒకదానికి ప్రతివ్రాయువాఁడు 2. శిల్పి, చిత్తరువు వ్రాయువాఁడు.

**లేఖనము.** సం విశ. (అ ఈ అ) 1. వ్రాయునది; చిత్తరువు వ్రాయునది, బొమ్మలను వేయునది. 2 గోఁకునది. గీరునది. మొ॥ వి. అ పుం కఱమునకై యుపయోగపడెడి యొక జాతి రెల్లు. న. 1. వ్రాఁత, చూచివ్రాయుట, ప్రతివ్రాయుట. 2. గోఁకుట, గీఁకుట. 3 తాఁకుట, తగులు. 4. సన్నము గాఁ జేయుట 5. శస్త్రవైద్యమున కోయుట, గంటులు వేయుట. 6 వేదము, శ్రుతి 7 గోఁకుకొనెడి పనిముట్టు 8. వృక్షవిశేషము, భుజపత్రవృక్షము. 9. (వ్రాయుట కుపయోగించెడి) తాళపత్రము, తాటియాకు. బూర్జపత్రపు పట్ట మొ॥

**లేఖనికుఁడు.** సం వి. అ పుం 1 జాబులు తీసికొనిపోవువాఁడు. 2. వ్రాయనేరక వ్రాఁతకు బదులుగా నొక గుర్తు నేర్పఱుచుకొనెడివాఁడు 3. వ్రాయసగాఁడు, లేకరి.

**లేఖము.** సం వి. అ. పుం 1. వ్రాఁతమూలము, ఇచ్చిపుచ్చుకోలు పత్రము. 2 జాబు.

**లేఖర్షభుఁడు.** సం. వి. అ పుం వేల్పుఱేఁడు, ఇంద్రుఁడు

లేఖాక్షరము. సం. వి. అ. న. వ్రాఁత

లేఖాధికారి సం వి న్ పుం. (రాజనొద్ద) ఉత్తర ప్రత్యుత్తరాదులు వ్రాయు నధికారి.

లేఖార్షభము సం వి అ. పుం (శ్రీ)తాళము. (వ్య) వి 1. ఒకజాతి తాటిచెట్టు

లేఖాహారి సం. వి. న్. పుం జాబులు తీసికొని పోవువాఁడు.

లేఖాహారుఁడు సం వి. అ. పుం. = లేఖాహారి

లేఖిని. సం వి ఈ. స్త్రీ 1. కలము పేనా. 2 గంటె, దర్వి

లేఖుఁడు సం వి. అ పుం వేల్పు దేవత.

లేఖ్యకృతము. సం విణ. (అ. ఆ. అ.) వ్రాఁత యందుంచఁబడినది, వ్రాఁతమూలముగ జేయఁబడినది.

లేఖ్యగతము సం. విణ. (అ. ఆ. అ.) చిత్తరువుగా వ్రాయఁబడినది, చిత్రీకృతము.

లేఖ్యచూర్ణిక. సం వి అ స్త్రీ 1. బొమ్మలు వేయు కుంచె. 2. లేఖని, వ్రాఁతపుడక, కలము, పేనా

లేఖ్యపత్రము. సం వి అ న. 1. జాబు 2. వ్యవహార సంబంధమైన (ఇచ్చిపుచ్చుకోలు) పత్రము 2 తాళపత్రము, తాటియాకు పుం తాటిచెట్టు.

లేఖ్యము. సం విణ (అ ఆ అ) 1. వ్రాయఁదగినది, గీయఁదగినది, చిత్తరువు వ్రాయఁదగినది 2. గీఱఁదగినది, గోఁకఁదగినది. 3. వేల్పులకుఁ బ్రియమైనది వి. అ. న. 1. వ్రాఁతయను వస్తువు 2. ప్రతివ్రాయుట 3 వ్రాసినది, జాబు, పత్రము, ఇచ్చిపుచ్చుకోలు పత్రము. 4. వ్రాసిన పుస్తకము. 5. శాసనము, శిలాదులపైఁ జెక్కిన వ్రాఁత. 6 చిత్తరువు వ్రాయుట. 7. చిత్ర ప్రతిమ, చిత్తరువు బొమ్మ.

లేఖ్యస్థానము. సం. వి. అ. న. వ్రాసెడిచోటు. కచ్చేరి.

లేఖ్యారూఢము సం. విణ (అ. ఆ అ) వ్రాఁత యందుంచఁబడినది.

లేగాడ్పు వి. లేఁత+గాడ్పు) మందమారుతము.

మ ... మలయంపుం గమ్మలేగాడ్పు తేరున నేతెంచు లతాంతబాణునకు ...

ఆము. 5. 101.

లేచు. అ. క్రి 1. ఉత్థితమగు, నిలువఁబడు.

సీ (శ్రీ)కాద్యుపమలఁ గాంచిన లేచి మ్రొక్కు నంజలికి నింద్రుండు వక్కాలువుఁ గోర.

ఆము. 1. 59.

గీ. ననుఁ గనుంగొనినప్పుడె వినయము నను, లేచి కూర్చుండు మనెడి నిలింపవైరి

దశా. 2. 100.

2 మీఁదికెగయు

మ. ... మహిమీఁది లోహరజముల్ పైఁబర్వె నా లేచె వాత్యలఁ బ్రాగ్గావముపు ల్మోగి ల్మోదల గ్రద్దంబై దివిన్ లేచినన్.

ఆము. 4. 80.

మ లకుముకుల్ క్రఁచై పడున్ లేచు ...

ఆము. 1. 57.

సీ. వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దన నాగ బెత్తాన మూర్ధంబు మొత్తిమొత్తి.

కళా 8. 79.

శా బాహాసంభృత కాలదండజనిత స్ఫారస్ఫులింగాళికిన్, సాహాయ్యంబు ఘటించి కోప రసఘూర్ణన్నేత్రదీప్తుల్ పయోవాహాంతర్గత వైద్యుతప్రభల లేవం జోప వాహద్విష, ద్వావహోత్తంసము నెక్కి పోరి కడరెన్ వైవస్వతుం డుద్ధతిన్. పారి. 4. 79.

3. మేలుకాను.

చం. వలుఁగిడి చల్వఁదాల్చి పయిపంపుటలంతల నిద్రఁజెదు రో, వెలఁదుల లేప గొంకిపతి వింతగడాఁపు పారివారి గం, టలరొద కుల్కి లేపఁ జిలువవ్వులతోఁ దమవారిఁ గూడ యిం, పులతమి దీటివన్ విదురవోయిరి నున్నుబోజుంగు లత్తటిన్. కువల. 2. 110

సీ. ... ప్రత్యూష పవనాంకురంబులు పైకొనువేళ
వామనస్తుతి పరత్వము నలేచి
మనుచ. 1. 54.

4 పూను. ఉద్యమించు
క. లేలెమ్ము విరుదమై..., మ్మా ముసకు ..
భా... 2. 79.

ఉ. ఇంచిననేడ్కల నాత్మహృదయోర్విరం గన్గొని
శౌరి మందహాస, సాంచితనేత్రుడై జలక
మాడంగ లెమ్మని పైడిచేలం గొంగించుక
జాలి .. పారి 2 6.

5 ప్రసించు
కం. లాగిన వారి తులగమి, నేరి తెలిసి ముమ్మ
నాజ్ఞ యడ కతండు చెలం, బోలాంతి
నినసమకమెం, లేలేవదె శూలధ్రుపడి
జ్యాయయమునన్. ఆము 4. 298.

లేజవ్వనము వి (లేత + జవ్వనము) నవయౌవ
నము, లేత యౌవనము.

మ. దనుజాధీశ కుశధ్వజుం డను తపోధన్యుండు
మున్నొక్క నాయన వేదంబు పఠించువేళ
ముఖయంబై నేను వాపోవంగా, నను,
ప్రేమంబునం జూచి వేదవతియ న్నామంబు
గావించి పెంచిన లేజవ్వన ముప్పతిల్లుటయు
జేజేలున్ మునుల్ రాజులున్
ఉ. రా 7. 109.

లేజాలు. అ క్రి (√లేత) ఇంచుక జాలు.
ద్వి పాలిండు లఱంగామ పడ నొక వింత, లీలం
బయ్యెదకొంగు లేజాలవైచి.
ద్వి. పరమ. 4. 294 పా.

లేట. వి చెట్టుకొమ్మ, శాఖ.
సీ. మానిమ్మమూట మరుని గెల్పులకోట
పడువెన్నెల తేట పసిండిలేట.
అచ్చ. రా. బాల. 186. (శ. ర. పా).

లేటమొగము వి విముఖత్వము, పెడమొగము
(చూ లేట మొగముపడు.)
వ . వెఱగుపడి బాణుండు లేటమొగంబుతోం
జేయునదిలేక విన్ననయి యున్న యెడ ...
భాగ. 10. ఉ 423 (చి. ని. పా లేట
మొగంబువడి ముద్రి. పా.)
జ లేటమొగముపడు.

లేటమొగముపడు. అ. క్రి (లేటమొగము +
పడు) పెడమొగము పెట్టు.
సీ. దేవదత్తాభీలరావంబు వెసం గర్ణముల
దీటుకొన లేటమొగముపడుచు
భార విరా 4 248.
కం ఏటున వాటున వ్రేటునం, జోటున దశ
ముఖుండు రౌద్రముగ సెలుమునయన్,
లేటమొగమువడి యతులు, కోటసారంబాటి
చనుం గోటి మొగవంగన్ నిర్వ 4. 48.

లేటి = లేడి వి కృష్ణసారాదిమృగము.
సీ. ఇట్టు వెన్నాడ యెటసి కాదిది మృగంబు,
మాయమో యేమొ యైన నేమా యె
వనుచుం, గరలి చనకమ యోగ్రాశుగింబు
వఱుపం, లేటిరాకొమ్మ నడువక్కి నాంటు
కొనిన. రామా. 6. 164.
ఉ. .. ముకుందవేణుకల నాదపుటీకు లేటి
మొత్తమై. ఆము. 5. 68

2. మృగి, ఆడులేడి.
సీ. పాలయించి నీచూచు వలంతికి మెడయెత్తి
కొని చూచు రాలేటికొదమ లివియు.
కు. సం. 6. 687.

3. మగజింక.
కం లేటిం దాచుకొనవొ ము,న్నీట న్నడయాడ
లేదొ నిను ద్విజరాజం, చేటికిం బల కం
గోకా, ఖేటకపాటవకిరాతకేసరివి శశీ
పా చా 3 68.

సీ. ముని పట్టుంబుట్టముల్ చిమగువ చు సివంగి
లేటిమైం దవగోట మీంట వసుకు
చంద్రా. 3. 71

జ : లేటివల.

లేటివల వి (లేటి + వల) మృగములను బట్టు
కొనెడు వల.
వ. తెంచీరకట్లు ప్రోంగుచుట్టలు దొడ్డివల లేటి
వల కుందేటివల మొదలగావలయు వలలును.
కాశ 3. 46.

గీ. లేటివలలును మఱియుఁ గుందేటివలలు, నెలుక
వలలును సంపెంగవలలు డొడ్డివలలుఁ బందిటి
వలలును ... యయా. 1 110.

**లేడి = లేటి.** (బ. వ. లేడులు, లేళ్లు). ఇ. మృగము.

చం. పులిఁ గనుగొన్న లేడులును బోలె విభూతిఁ
గలంగఁ జాలు .. భార విరా 5. 6.

చం. పులిఁ బొడగన్న లేళ్లగమిఁబోలె సుయోధను
నగ్రసైనికుల్, ఉలుకి కలంగి . .
భారి భీష్మ 2. 157.

చం. ప్రకటబలాఢ్యులై లోకుల దిరంబయి
పల్వురుపేరు భూమిపాలకునకు గడ్డమైనఁ
దవులంపడి హుమ్మని నోరి కంఠ నాం చి
కొనిన ప్రేమ వెన్నెలిపశేషము దోఁచెఁగఁ
బార్థుపట్టిసారయకముల నొంచినం దెరలి
పందలు లేళుల పిండునాకృతిన్.
భార. ద్రో. 2. 28.

శీ. జెలుకుఁజూపుల లేడి గెలిచికై కోసి పైనో నాఁ
గ్రిందఁ గృష్ణాజినంబు వేయ.
ఉ. రా. 3. 103

2. మృగి

కం మవసిజరాగంబునఁ బెనఁగినయట్టిని లేడిఁ
జూచి కృతహస్తుఁడు పెల్చన యేనమ్ములు
నారెంటిని ద్రెళ్లఁగనేసెఁ గడుఁ జిరినహృద
యుండై. భార. ఆది 5. 89.

ఇ. లేడికంటి.

**లేడికంటి.** వి. (లేడి + కన్ను) లేడికన్నులవంటి
కన్నులు గల స్త్రీ, మృగాక్షి (శ. ర.).

**లేతము.** సం. వి. అ. పుం., న కన్నీరు, బాష్పము

**లేదా** అవ్య. (లేదు + ఆ[4]) లేనిచో న్, లేని
పక్షమున.

(అంజనేయుడు) ఉ. చూచుటలే దశోకవనిఁ
జొచ్చి యటుం జని చూడఁగాఁగదా, యా
చపలాక్షి మజ్జనని యచ్చటనుండిన యేని
లెస్స లేదా చతురాననుఁడు మొదలైన
సుపర్వు లెఱుంగఁ జిచ్చులో, నై చెదఁగాక
యీ యొడలు వానరవీరులమ్రోల నైతునే.
రామా. 6. 120.

శా వీరుండై జనియించినప్పుడ రణోర్వీన్ వైరు
లన్ దోర్చలో, దారత్వ బునఁ గెల్వఁగా
వేయు లేదా యొమ్ము నాయమ్ముడన్, వీర
స్వర్గము గాంచఁగావలయు. దశా. 4 9

**లేదుబంతి.** విశే. లేనిది. (వి. పొంకు అని శ. ర.)

చం. తెలియఁగజాలినట్లనె మదన్ బఘు లాంసి
తిప్పు సిపయిన్, గదని లక్షచోఁ గుచ
యుగం బటు బట్టబయల్గ చేసి యా యలిక వ
లేదుబంతి యన వండఅపెడము సి ప్రాయంబు
పెం, పాలయఁగఁ గిల్లలో నిజ మొక్క
డుగాఁ దబపోసి మాచినన్

నాంగ 3. 210. (అసత్యము అని భావము.)

సీ ఎంతమాత్రం బిది యీ క్షణంబున లేదుబంతి
గావించెదఁ బ్రజ్ఞ మీఱ నిరం. 4. 72.

(లేదుబంతిగావించు=పోగొట్టుకొను అని భావము.)

ఉ . . అన్నపతిపాలికిఁ బోయెదవేమొ పామునా
నీ,యిచ్చకువచ్చినట్లు రమియింపు మొకా
నొకమాట పుట్టవన్, నెచ్చెలిలేదు బంతియను
నేర్పనదిద్దుకొనంగజాలివన్. శుక 2 97.

(లేదుబంతియను = పోగొట్టుకొను )

వ ... ... తురంగంబు వంట దోలి గంటియుడి
వెంటంబడుటయు గెంటించి లేదుబంతి
యన్నట్లల్లంతనుండి ... మనుచ. 4. 115.

చం. జలరుహగంధివిమలపసల్ వవసంఖ్య నదేమి
లెక్కనున్, తెలియ నఖాంకురాళి నెల
చేడియనై కముఁ దాను జుక్కనున్, బోలఁ
తుక గబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదు
బంతినున్, కలికిముఖారవిందముల కవ్వల
రాయనిఁ దోసిరాజనున్. విజ. వి. 1. 87.

(ఇట ఔపమ్యవాచకము పోలు అని భావము.)

**లేనగవు = లేఁతనవ్వు, లేనవ్వు.** వి. (లేఁత +
నగవు) చిఱునవ్వు, మందహాసము.

సీ పలుకంగనేర్తురు పాటలాధరముల మొలచు
లేనగవులు ముద్దుగురియ. భీమ 1. 94.

ఉ. ... ఆ,యన్నుల కులు. లేనగవు లచ్చుపు వెన్నెల లంచు . . సీలా 1. 6

**లేనడ** వి (లేత + నడ) మందగమనము

చం. కనిహృదయంబు ఝల్లుమన ఘల్లుమన గం బడాంగదంబు డిగ్గన వెస లేచి లేనడ యొయారములో దెంచాలు జేరె గా,మిని కెలికి త్రిత త్రమ మెక్కొన గద్దియ దెచ్చి యుంచమి, చివలమి నందుమీంద నివసించె ధరాపరుం డాదరాత్ముదై. కువల. 9 59.

**లేనవ్వు = లేనగవు.** వి (లేత + నవ్వు) మంద హాసము.

మ. ... మమ్మాకమ్మలంబ్రోవ నా యమరుల్ నీ కెదురే ఐయుండిగ్గిదిలయ్యా యన్న లేనవ్వు డ్డాయ మరుల్ కొల్పుచు వాడ వీడ్కొలిపి దైత్యచ్ఛేదనోద్యోగియై. ఉ రా 1 8

**లేని.** (కలుగు ధాతువునకు వ్యతిరేకార్థక విశేషణ రూపము.) విశే. 1. ఉండనిది.

చం. బలమును నొవ్వు బుద్ధియును బ్రౌఢతయుం గలవారు లేనివారి లవక వేయొక్క తంగి... భార. శాం. 4. 395.

సీ. సకల దైవత బుధజనస్ఫూర్తి కెవ్వానిపుట్టు కామనిలేని మెట్టపంట. అము 1. 19.

2 చాలనిది, ఒకనిది.

గీ. శాస్త్రతత్వ మెఱుంగక సంశయాత్ము, డగుచుం బరమార్థ మిట్టిద యనంగ లేని, యట్టి వాడు ... భార. శాం. 5. 446.

3. ప్రాప్తింపనిది, దొరకనిది

గీ. దర్పపోటుల దిని లేనితఱులమైత్రి, పట్టి పితృశేషము భుజించి ... అము. 6. 69

4. సంభవింపనిది, జరుగనిది

సీ. ఇది లోకమునలేనియది యేమిసేయంగనగు ననీ చింతాకులాత్మయైన

భార. ఆది. 7. 209

**లేనివాడు = దరిద్రుడు**

... కలవాడు లేనివాడు సబలుడు డబలుడు మూఢబుద్ధి ప్రౌఢుండనగా

భార శాం 5 278.

ఆ. కంబుకంఠి నీవు కలవాడు కంవాడు లేని వాడు నీకు చేపవాడు నాశీ 47.

జ. లేనిది.

**లేనిది** వి (లేని + అది) అసత్యము (ఇది 'కలుగు' ధాతువునకు వ్యతిరేకవిశేషణమైనను క్రమముగా నీయర్థము కలిగి విశేష్యమైనది)

గీ. అనుడు ధరణీశుడు డాతపోధనుని జూచి, వింటివా యోయి యీమచ్చెక్కంటి యాడి, పట్టిమాటలు తెలియ నేమైన నిగ్గుడు, గలది లేనిది గలిగిన తెలుపవలయు విప్ర. 5 49.

**లేనురువు** వి. (లేత + మరువు) అప్పుడంటి ము.

ద్వి. ఒలయు లేనురువు చిట్టుములు బిట్టయ్యె ... ద్వి పదమ. 1. 67 పొ..

**లేనెత్తు = లేవనెత్తు.**

ద్వి. పడియున్న వతిదయాభావామృతంబు, కడ కంటు గెడగూడ గొడుకు లేనెత్తి.

బస. పు. 1 569 పం.

వాడుకలోని ప్రయోగములు పొగ యింటి కొప్పునుండి లేచివది.

తోకతొక్కిన తాచువలె లేచినవాడు

జ : లేపు

**లేనెన్నడ.** వి (లేత + నెన్నడ) మందగమనము.

సీ. నెఱనీటు గులుకు లేనెన్నడల్ పరికించి కడు మందగతి గాంచె గంధకరణి.

ప శా. 2. 202.

**లేనెల.** వి (లేత + నెల) బాలచంద్రుడు.

ఉ. ... మంచుగొండరా, చూలినిగూడిపేడకలం జొక్కడు లేనెలతాల్పు గొల్చెదన్.

నీలా. 1. 1.

గీ ... ఈనెలంత లలాటంబు లేనెలంత ...
విజ. వి. 1. 130.

**లేపకరుఁడు.** సం. వి. అ. పుం. తాపీపనివాఁడు, సున్నపుఁబనివాఁడు. సున్నముపూయువాఁడు.

**లేపకుఁడు.** సం. వి. అ. పుం. 1. తాపీపనివాఁడు, సున్నపుఁబనివాఁడు. 2. పాత్రములు మొదలగువాని యచ్చుపోయువాఁడు

**లేపనము** సం. వి. అ. పుం ధూపద్రవ్యము. సీమ సాంబ్రాణి. న 1. రాచుట, పూయుట 2 లేపనపదార్థము. పూయుటకుపయోగించెడి వస్తువు. 3. సున్నపుగచ్చు. వెల్ల. 4 మాంసము.

**లేపభాగి** సం. వి. న్. పుం. ప్రపితామహుని తండ్రి, తాత. ముత్తాత, తండ్రి మొదలుగా నాలుగైదాఁటుతరములవాఁడు, పిండభాక్కు.

**లేపభుక్కు.** సం. వి. జ్. పుం. లేపభాగి.

**లేపము** సం. వి. అ. పుం. 1. పూయుట. రాచుట. 2. గాయము మొ॥ వానికి రాచెడి తైలము. 3 సున్నము మొ॥ పూయుట. 4. పితృపితామహ ప్రపితామహులకంటె పూర్వులగు మూఁడుతరములవారికి నొసఁగఁబడు పిండశేషాన్నము. 5. మచ్చ, కళంకము 6 పాకము. 7. ఆహారము.

**లేపి.** సం. విశే. (న్. సీ. న్.) పూయునది, రాచునది, కప్పునది. వి. పుం. తాపీపనివాఁడు.

**లేపించే.** సం. న. క్రి. లేపనముచేయు, పూయు.
సీ. వక్త్రేరుకణిక గంధము తేనె వగ నూటి లేపించి కూడిన లేమ వలచు. హంస. 5. 121.

**లేపు¹.** న. క్రి. (√లేచే) లేచునట్లుచేయు మేలుకొలుపు.
చం. వలుఁగిడి చల్వదాల్చి పయనంపుటలంతల నిద్రఁజెందు రోవెలఁదుల లేపఁ గొంకి ...
కువల. 2. 110.

**లేపు².** వి. 1 పాన్పుపై వలచు దుప్పటి.
సీ. ... శయ్యాఖ్య చెల్లు సెజ్జ, పఱుపు తలిపము దడిఁబము పాన్పు మెత్త, యనఁ బదాచ్ఛాది యొఁకు లేపనఁగ శయ్య.
ఆం. భా. 2. 163.
2 పడకమీఁద పఱచెడు పఱుపు.
చం. సకినల పట్టెమంచమునఁ జాయనతాసు తివాసిపైఁ దుప్పటిక మొకమాలు లేపున నొగిన్ శయనించి మనోభవవ్యథన్.
హంస 1 69.
చం ... జాఫరా జినుఁగు లేపునఁ జెందుపలంగు పోషుత,కిన్నెకగల జాళు వా గొలుసు గిలొప్పము మంచముపై మహూన్నతిన్.
హం. 1. 240
2 ఏనుఁగుమీద పఱచెడి చిత్ర కంబళము; జాలు.
సీ. ... కుథముజాల్ లేపనఁ గొఱలుచుండు ...
ఆం. భా. 2. 195.

**లేప్యమయి.** సం. వి. ఈ. స్త్రీ. మట్టితోఁజేసి సున్నము పూసిన (బిడ్డలాడుకొను) బొమ్మ.

**లేప్యము.** సం. విశే (అ అ. అ.) 1. గచ్చుచేయఁదగినది, పూయఁదగినది 2. పోఁత పోయఁబడనది. వి. అ. న. 1. పూఁత.

**లేబరము.** విశే. 1. వ్యర్థము.
గీ. లేబరము కాదె బిడ్డలులేని బ్రతుకు.
ఉ హరి. 2. 16.
సీ. పరగు లీసరము లేబర మన వ్యర్థంబు ...
ఆం భా. 5 24
2. శూన్యము.
సీ. ప్రావితో వర్షంబు సమకూఁడకుండుటఁ బంట లేబరమయ్యెఁ బాఁడితోడ.
కాశీ. 1. 137
సీ. అట్లతిబాధచే హాహాస్వనంబుతో భువన సంక్షోభంబు పుట్టె మిగుల, గీ. బంటలును బాఁడితోడ లేబరములయ్యె. తపతీ 5. 76.
3. దీనము.
గీ. లేదు పెట్టలేమనియెడు లేబరంపు, బలుకు దవ ప్రజలో వినఁబడియెనేని, నితకంటె

చ: బుడుష్పల గల్గు ఝ్ఝురము బూనిన ప్రాణము లుత్తరించు లేమిడి నొదవించు వేదనలు మీఱంగ ... దశ్వ చరిత్ర. 7 ప.

**లేమిపడు.** అ. క్రి. (లేమి + పడు) పేదపడు, పేదఱికముఁబొందు.

సీ. పల్లవుల్ తుది లేమిపడి యుంటచాయరా మొగి లంజతల్లులు మూర్గినట్లు
కవిరా. 2. 84.

**లేయము.** సం. వి. అ. పుం. సింహరాశి.

**లేయెండ.** వి. (లేఁత + ఎండ) లేఁతయెండ, ప్రొద్దుటియెండ, బాలాతపము.

కం. లేయెండ వేఁడియయ్యును, దోయజమండ మున కిపు డొలఁకించుక్రియన్, నీ యలుక పరుసమయ్యును, నా మోదంబునకు వేడ్కసేయు నళినదళాక్షీ. నైష. 8. 46.

కం. పరపరిఁ దుంచు గిళులు గ్రక్కదలఁగ లేయెండచాయఁగడు నుగ్రములై, యెదురం గొందఱు గలరని, మదినెంచుక సరకగొనక మదమున నడచెన్. నిర్వ. 6. 93.

**లేలిహ.** సం. వి. అ. స్త్రీ. అంగుళీసన్నివేశవిశేషము, అభినయభేదము, అభినయవిశేషము, ఒక విధమగు ముద్ర.

**లేలిహము.** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**లేలిహానము.** సం. వి. అ. పుం. సర్పము, పాము. విణ. (అ. ఆ. అ.) మరలమరల నాలుకను జాఁచునది, లేక నాకునది.

**లేలిహానుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**లేవ.** వి. గుజ్జుపు పిలాటము.

సీ. ఒలితఁపుఁ బులు దిండిమలదాయ యజాచెక్కడపు గోవపని చొక్కటంపు లేవ.
చంద్రా. 2. 69.

గీ. జిగిగొలఁకు లేవ పాలాసి మొగసరియును, బూని సాహిణి యొక కత్తలానిఁ దెచ్చె.
చంద్ర. 2. 16.

**లేవంకి.** వి. (లేఁత + వంకి) చిన్నకత్తి.

సీ. నిలువులేవంకితో నిగ్రహ గాగామి పరిస్థితి తేటపఱుపు ననియె. కకు. 4. 41.

**లేవడి.** వి. (లే[1] + వడి) 1. అశక్తము; కార్శ్యము.

సీ. నిదుర లేవడిఁ గెంపునెఱయు కన్ల తోడఁ బొడపాడియైన మైపూఁతతోడ.
హంస. 5. 80.

గీ. వేలుపుల లేవడులు కడువేగఁ దొలఁగఁ, బరతుల కెన్నడమును లేవడులు దొలఁగె.
అచ్చ. రా. బాల 77.

2. దారిద్ర్యము.

సీ. వెనుక ముందఱ లేరు నెనరైన చుట్టాలు లేవడి యొంటేని జీవనంబు. నైష. 1. 17.

కం. వేదలు దానముసేయుఁగ, లేదఁగదా నొమ్ము వారు లేవడిచె దిక్కెదన్నక్నపడ బున, కేటేనియు ద్రోవగఁటో యొఁగిపు హరి.
శేషధ. 1. 151.

ఉ. లేవడిమీఁద బాసలు లేనికతంబున నూర కుండవన్, బోవమి నప్పనప్పలకుఁ బొవుట వేఱుగఁ దోఁచనేమొకో ...
శుక. 2. 175.

3. కష్టము.

గీ. వేలుపుల లేవడులు కడువేగఁ దొలఁగఁ, బడఁతుకల నెన్నడముల లేవడులు దొలఁగె.
అచ్చ. రా. బాల. 77

విణ. అల్పము, కృశము.

రగడ. పొగడ ప్రాఁకియే పోనే లేవడి, సిగరు బోఁడికా నెంతయు లేవడి.
రాజ. చ. 2. 149.

ద్వి. మెఱుఁగు లేవడియైన మించు నడలినను, వెలిచందనము నకుఁ గొఱఁత దోఁచినను.
బస. పు. 4. 872 పం.

**లేశము.** సం. వి. అ. పుం. 1. లవము, అత్యల్పభాగము. 2. అల్పత్వము, కొంచెపుఁదనము. 3. అణువు. 4. రెండు కళల పరిమితిగల కాలము.

అత్యల్పకాలము. 5. ఒక విధమగు పాట (విల్సన్ ప్ర.). 6. (అలం.) ఒకానొక యలంకారము.
శ్లో. లేశః స్యా ద్దోషగుణయో ర్గుణదోషత్వ కల్పనమ్. (చంద్రాలోకము.)

**లేశోక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) సూచింపఁబడినది, జాడ చూపఁబడినది.

**లేశ్య.** సం. వి. ఆ. స్త్రీ. ప్రకాశము. (సూర్య) కాంతి (విల్సన్స్.).

**లేశ్యము.** సం. వి. అ. పుం., న. ప్రకాశము, (సూర్య) కాంతి. (విల్సన్స్.)

**లేష్టుభేదనము.** సం. వి. అ. పుం. మంటిగడ్డలు పగులఁగొట్టెడి పనిముట్టు.

**లేష్టువు** సం. వి. ఉ. పుం. మంటిగడ్డ.

**లేసికుఁడు.** సం. వి. అ. పుం. ఏనుఁగుపై స్వారి చేయువాఁడు.

**లేసు** వి. (సం. లేశః) 1. చులుకన. 2. సులభము. (శ. ర.).

**లేహనము.** సం. వి. అ. న. 1. నాలుకతో నాకుట. 2. పెదవులతోఁ బీల్చుట.

**లేహము** సం. వి. అ. పుం. 1. పెదవులతోఁ బీల్చుట, కొంచెము కొంచెముగాఁ ద్రాగుట. 2. రుచిచూచుట. 3. నాలుకతో నాకెడుమందు, లేహ్యము 4. ఆహారము. 5. సూర్యచంద్ర గ్రహణములు సంభవించు పదిమార్గములలో నొకటి (విల్సన్స్.).

**లేహి** సం. వి. ఈ. స్త్రీ. చెవులకొనయందుఁ బుట్టెడి రోగవిశేషము.

**లేహినము** సం. వి. అ. పుం. వెలిగారము.

**లేహ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పెదవులతోఁ బీల్చఁదగినది, నాలుకతో నాకఁదగినది.
వి. అ. న. 1. నాకి యనుభవింపఁదగిన యాహార పదార్థము. 2. ఆహారము. 3. అమృతము.

# లై

**లైంగము.** సం. వి. అ. న. పదునెనిమిది మహాపురాణములలో నొకటి.

**లైంగికము.** సం. విణ. (అ. ఈ. అ) 1. లింగము (గురుతు = అనుమాపకచిహ్నము) పై నాధారపడునది. 2. లింగసంబంధమైనది. 3. అనుమితము, ఊహింపఁబడినది.

**లైంగికుఁడు.** సం. వి. అ. పుం విగ్రహములు చెక్కువాఁడు.

**లైంగుఁడు.** సం. వి. అ. పుం. శివలింగమువలన జనించినవాఁడు.
ద్వి. లింగమధ్యములోని లైంగులు పరిదెు.
బస. పు 3. 84 పం.

# లొ

**లొంక = లోఁక.** వి. గుహ; గుహాంతర్భాగము.
ఆ. గరణిపాలుఁ డంపఁ దురగంబు నచ్చోటఁ, గట్టి వాలుఁ గేలఁ బట్టికొనుచు, లొంకఁ జొచ్చె నాక్ష్మ గొంకక వాలుఁడు, గదిసి దివియపట్టి వెదకుమాడ్కి. ద్వా 3 44.

**లొంగ.** వి వస్త్రాది భాగము, మూల.
సీ. ... భయంబు లేక, కాలుగట్టుక చనఁగా బిట్టు నేతెంచు కుఱ్ఱ నాఁలొగ గొనక మాన. ర్ఘు. 1. 93.

**లొంగు = లోఁగు** అ. క్రి. లోకువగు, వశపడు.
కం. ... సుమచాపునకున్ లొంగి మానవనంబునఁ బొగడెన్ దశా. 2. 266.
ద్వి. తనులత వడఁకఁ గెంతను లొంగియున్న. కలవాణి సతి జూచి కలకఁ బవ్వి.
మృ. వి 2 73.

**లొండు.** వి. జలాశయవిశేషము, ఒక విధమగు నీటిపట్టు.
కం. తిరుకోనము నూయి లోఁ యుఁ, జెఱువు మడువు లొండు కుంట చెలమ సడియ కో, నెఱు బుగ్గ వాఁగు దొనసెల, పరి గుండము కాల్వ డిగియబావి దొరవులన్.
హంస. 4. 210.

**లొంప.** వి. అల్పగృహము, కొంప.

సీ. ... అల్పగృహము కొంప లోంపనఁ దగు ...
అం. భా. ౩. ౧౧.

**లోంపి** = రొంపి. వి. బురద, పంకము.

సీ. క్రొవిగుంటలు దక్క ఉల్లిలు చిక్కంగ నివిరినఁ గొంగరాయిడికి మిడికి, కొరదయుఁ గడిసె పాపర మల్లు ముచ్చుఁగి కొంకెు ముక్కు ను లోంపి గ్రుచ్చుకొని యె ....
వేం. పంచ. 1. 394.

**లోంపు** వి. ఒకతెగ (...).

**లొగ్గడి** వి. కలగుండు, క్షోభము (శ. ర.). (సంకీర్ణము, కలిసిపోయినది. వా.)
జ : లొగ్గడిల్లు.

**లొగ్గడిల్లు** అ. క్రి. (√లొగ్గడి) కలగుండుపడు, క్షోభపడు (శ. ర.).

**లొగ్గు** = లొంగు, లోఁగు. అ. క్రి. నశమగు.

ఆ. సకలమైన రాజసంఘంబులకు లొగ్గి, యాత్మఁ జో ... కలికి యలికి, ... మటించునట్టి యైశ్వర్యములకంటె, నాకుఁ జూడ లేమి నయము కృష్ణ.
కుచేల. ౨. 49.

చం. అదివఱ కెల్లఁ దప్పరి సుయజ్ఞుని యాజ్ఞకు లొగ్గి భీతులై, యెదురుచుఁ దల్లిలేని ప్రజలో యనసుండిరి గాని నాగరల్, మరి నఱ లే ... రాజునకు మాటికి వందనముల్ ఘటింపుచున్, వదనముఁ జూచి చేరి యనివారి తులై తగఁ బల్కి రందఱున్.
ఉ. హరివ. 1. 78.

**లొచ్చు** = లొజ్జ విశ. కొఱఁతయైనది, తక్కువయైనది

శా. ... కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియున్, రామస్ఫూర్తికి లొచ్చుగాక సరియైరాజిల్లె.
హరి. పూ. 1. 30.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము ...
ఆం. భా. ౩. 24.

చం. హరమకుటావతంసమగు వర్ధసుధాకరుఁ డష్టమీనిశాకరుఁ డెదిరించి లొచ్చుగుట గానఁబడంగ నపాంగమాలికా, పరిచిత ... మన్ నిఁల పాళిఁ పైనిడి మోయఁబోలునీ, సరణి ననన్ బొమల్ మెఱయు జన్యనికిన్ నెఱవంక బాగునన్.
చంపూరా. ౧. 78.

**లొజ్జ** = లొచ్చు. విశ. తక్కువ.

మ ... ఇచ్చెలు లెల్లన్ ఘనలక్షణాసతికి లొజ్జె సమగ్రమ్యాప్తిన్.
చమ. ౩ 9.
(ముద్రి పా. లొచ్చే. శ. ర. పా.)

చం. .. లొజ్జుగాని బల్ దొనలను దొడ్డసింగిణులు దూకొని వెన్కకు రాని బీరమున్, బొసంగ ... తొలిబొట్టి ... డు ... పిలన్.
అచ్చ. రా. యు. 70.

కం. నానయు వెఱగును వేడ్కయు, లోనెర యఁగ వతని మెచ్చి లొజ్జించుకయుం, బూనని నెయ్యం ... నబిడారంపు సామిఁ గన్గొని పలికెన్.
అచ్చ. రా బాల. 178.

**లొట** = లొట్ట. విశ. అణఁగినది.

ద్వి. కొడుకు నేడకొ దాఁగ గలుతుగా నంపి, కడు సుగ్రభుజగంబు గఱచినదనుచు, వెడ యేడ్పు లేడ్చుచు వెదకుచు నందు, వెడలి పోఁజూచెదో వేసాలువన్ని, లోకంబులో లేని లొట తాఁటకత్తె.
ద్వి హరిశ్చ. ఉ. 1903 పం.
(లొటతాఁటకత్తె = బయటికి మంచిదానివలె అణఁకువ కలిగియుండువది, అని భావము.)

**లొటకజిట్ట**. వి. లొట్టకన్ను జిట్ట, పక్షివిశేషము. (శ. ర.).

**లొటలొట**. వి. 1. శీఘ్రముగాఁ బోవుటయందగు ననుకరణము.

కం. ఇటునటుఁ గనుఁగొని లోనికి, లొటలొటఁ జని మంచమెక్కి లోలత నది తత్తట మువఁ గూర్చుండిన వక్కుటిలాత్ము డు కౌఁగిలించుకొని యిట్లనియెన్.
చంద్ర. వి. 3. 74.

2. వదరుటయందగు ధ్వని కనుకరణము.

కం. లొటలొట పుర్వులు దొరఁగఁగ, లొట లొటమనుకొంచు నిండ్లలోనికిఁ జన ...
ఖల్లా 2. (శ. ర.).

జ : లొటలొటకాఁడు.

**లొటలొటకాఁడు.** వి. (√లొటలొట) లొట లొటయను ధ్వనిసేయువాఁడు, వదరుఁబోతు.

కం. కుటిలుఁ డపకారి జూదరి, లొటలొటకాఁ డాగడీఁడు లోభి ఖలుఁడు దుర్విటుఁడు బటురోగి కర్కశి, మొటుకిడి జావనగరాసు ముట్టకు మబలా.
ప్రబంధ. 644.

**లొటలొటమను.** అ. క్రి. (లొటలొట + అను) లొటలొట యని ధ్వనించు. (శ. ర.).

**లొటారము.** వి. సారాభావము, సారములేమి.

చం. పతి యతికౌంక్ష మెంచి యుపభర్తరతాప్తికిఁ జేరుకున్న, నచ్యుతమగు ధైర్య మిచ్చుచు వయో మగవాఁడవటంచు నెట్లు పుట్టితి విఁక నేమి తిమ్మజపటిష్ఠత లోన లొటార మింతె నీ, వకవికిఁ గొంకనేలని భయస్థితి మాంచి రమించుఁ దద్రతిన్.
శుక. 3. 161.

పా: లోన లొటారము, పైన పటారము.

ఉ. ... లోన లొటార మౌట మది లోకు లెఱుఁగరె వేయునేఁటికిన్. తపతి. 2. 23.

2 బొక్క, సుషిరము.

సీ. లొట్ట లొటారము లొత్తయం చనఁగను తోఁఖిల్లుమాఁడును సుషిరసంజ్ఞ.
ఆం. శా. 1. 146.

విణ రిత, వట్టిది.

సీ. గుత్త లొటారంబు రిత్త బీడు, సొళ్లు నాఁకత్రాఖ్య తోఁఖిల్లు ... ఆం. శా. 3. 15.

**లొటిపిట(ట్ట)** వి. ఉష్ట్రము, ఒంటె.

సీ. ఒంటె యనఁగను లొట్టియ యనఁగను లొట్టె నాఁగ, లొటిపిట యనఁగను లొటి పిట్ట యనఁగను లొట్టిపిట్ట యనఁ గన్పట్టు నుష్ట్రము ... ఆం. శా. 2. 265.

**లొటుక్కు.** వి. కలఁగుటయందగు ననుకరణము.

కం. పిలిచిన గుండె లొటుక్కనఁ, గలఁగుచు వ్యాపారి వెడలఁగా నెటులనుచున్, దలఁ చినచో వెఱవకుమని, నిలిచిన దార్ఢ్యమున మానినీమణి వేడ్కన్.
హంస. 2. 60.

**లొట్ట = లొత్త** వి. 1. మగకుటి. (శ. ర.).

2. రుచ్యములగు పదార్థములను భుజించునపుడు నాలుక నంగిటఁ జేర్చి కలిగించెడి ధ్వని (శ.ర., వా) 3. పల్లము (శ. ర.). 4. రంధ్రము, కన్నము.

గీ. వామనుఁడు దర్భగిండిలో వారిధార, కడ్డమై యున్న శుక్రుని యక్షిఁ బొడుక, మిట్టి పడి కన్నుపోయిన లొట్టపోయె, ననుచు నగుచును జేసాఁచి యడుగుటయును.
దశా. 5. 108.

(లొట్టపోయెను = కన్ను మేఁకఁ లోపలి కణఁగెను)

విణ. 1 అణఁగినది

ద్వి. బుఱ్ఱముక్కును లొట్టపోయినకన్ను.
ద్వి. హాంశ. ఉ. 106. 6 పం.

2. నిస్సారము.

ఉ. లొట్ట యిదేటిమాట ... చాటువు.

జ : లొట్టకంటివాఁడు, లొట్టకన్నుపిట్ట, లొట్టకాయ, లొట్టవేయు.

**లొట్టకంటివాఁడు.** వి. (√లొట్ట) క్షీణాక్షుఁడు.

గీ. .... లొట్టకంటివాఁ డనఁ గ్షీణచక్షుజ్ఞాము మఖవ.
ఆం. శా. 2. 150.

**లొట్టకన్నుపిట్ట = లొటకపిట్ట** వి. (√లొట్ట) పక్షివిశేషము. (శ. ర.).

**లొట్టకాయ.** వి. (లొట్ట + కాయ) మగకుటి. శ. ర., (బ్రౌ., వా)

**లొట్టపోవు** అ. క్రి. అణగు.

(వ్యవ.) వానికి కన్ను లొట్టపోయినది.

**లొట్టవేయు** అ. క్రి. √లొట్ట) రుచ్యములగు పదార్థములను భుజించునపుడు నాలుక నంగిటం జేర్చి ధ్వనిపుట్టించు (శ. ర.)

లొట్టి. వి కల్లుతీసెడు ముంత.

మ మొలచుట్లు వ్వడదోలు దాన నగు ఒల్మో కాసయిం గొంకత్తులు నూఱున్ ముసలంబు వామభుజమందున్ దానికిర్వంకలన్, గలు లొట్లొండెడఁగట్ల నిచ్చెన పిరుదం గొమ్ము కాల్బందమున్, దల గోరాముకిగడ్డయున్ నవరఁ బ్రాతః కాలమం దెప్పుడున్.

చెన్న. ర 252.

సీ కల్లు లొట్టెఁడు ద్రాగి కై పెక్కి తెలియక వదరసంతనె శాస్త్రవాదిగాఁడు. సేను. శ. 7.

జ : లొట్టిముచ్చు.

లొట్టిపిట్ట(ట) వి. (లొట్టియ + పిట్ట) తె, ఉష్ట్రము.

కం పినుమిఁక మొద్దును గాడిద. నెప పోతును లొట్టిపిట్ట నెక్కిన నన్న.జును వి యు నువ్వులు గలఁ దినఁ గననగుఁ గీడు వసుమతీ వంతికా. ద్వా 9. 57.

లొట్టిముచ్చు. వి. (√లొట్టి) త్రాగుఁబోతు. (శ. ర., బ్రౌ )

లొట్టియ= లొట్టె వి. ఒంటె.

ఆ బలిమిఁగొనిన ధనము పదివేలు లొట్టియల్, పెటికి రాఁగ వైరిభీకరుండు, వచ్చె నకులుఁ డధిక వాహినీపదహతిఁ, దల్లడిల్లుచుండ ధరణి తలము. భా. సభా. 1 267.

చం. మఱిమఱి యామువేనుఁగుల మావుల లొట్టి యలం గడిందిగా, మఱు మొనరించి హెచ్చ రిక నూల్కొనఁ దేరులు పిండిసేయుచున్.

అచ్చ. రా యు. 131.

సీ. ... లొట్టియ నాఁగను లొట్టె నాఁగ ... ... కన్పట్టు నుష్ట్రము ... ఆం. భా 2. 265.

జ : లొట్టిపిట్ట.

లొట్టె= లొట్టియ.

జ : లొట్టెనుఁగు.

లొట్టెను గు. వి. (లొట్టె+ఏనుఁగు) ఒంటె.

సీ. అర్థించినవి యేమి యడిన నా లొట్టెనుఁ గొప్ప నా మెడ శతయోజనప్రమాణంబగుట కోర్కి వాణిశ నావుడు ..

భా. శాం. 2. 82.

కం లొట్టెను గంతపొడవున దట్టముగా వెలుగు వెట్టఁ దగు నూరులకుం, జుట్టును దిరుగఁగఁ జేలకు, నట్టిపొలము మేసెనేసి పను బందె గొనన్. విజ్ఞా. 2. 5.

సీ అలరును లొట్టెమఁ గవ మహోష్ట్రాభిధ ...

ఆం. భా. 2. 265.

లొడపెట్టు స. క్రి. ద్రవద్రవ్యమును చేతఁ గల పెట్టు (శ. ర.. బ్రౌ.)

లొడలొడ. వి. 1. కాఱుటయందగు ధ్వని కనుకరణము. (శ. ర., బ్రౌ)

(వ్యవ.) కత్తి తాకి నెత్తురు లొడలొడ కాఱు చున్నది.

2. వదరుట మున్నగువానియందగు ధ్వని కను కరణము.

(వ్యవ.) వాఁడు లొడలొడ మాటాడుచున్నాఁడు. విణ. వదులు, బిగువుకానిది. (శ. ర, బ్రౌ )

లొడిత. వి. లొడితిలి, ప్రాదేశము.

గీ. వాసిదయ్యమ నీవె వెయ్యేసియైన, తలలుఁ జేతులుఁ గన్ను లజ్జలును గలిగి, యలర లొడితెఁడు మగవాఁడ వగుచు నేల, యెల్ల నాఁగుదువని మిమ్ము నెన్నఁగదవె.

అచ్చ. రా. యు. 159.

సీ లొడిత యంచనఁగను లొడితిలి యఁచన జుట్టి యంచనఁగను జు యనఁగఁ బ్రాదేశ నామమై పరగు ... ఆం. భా. 2. 140.

లొడితిలి. వి. లొడిత, పరిమాణవిశేషము.

లొడుగు వి. ఆవుమెడకు కట్టెడు ఘంటావిశేషము. (శ. ర.) విణ. దీనము (బ్రౌ.).

లొడ్డ. వి. రొడ్డ (శ. ర.).

లొడ్డు. విజ. ఒడ్డు (శ. ర.).

లొత్త = లొట్ట. వి. సుషిరము, రంధ్రము.

సీ. లొట్టలొటాంటములొత్తయం చనఁగను శోళ్లు చుండును సుషిరసంజ్ఞ.

ఆం. భా. 1 146

(పల్లము శ. ర.)

లొద్ద వి ప్రోవు, రాశి

ద్వి. అమృతంబు ముద్ద తియ్యందనంబు లొద్ద విం పౌల జిలుమంట విబుధుల పంట

పవ. 2. 116 భా 1 పం.

సీ. గుబురు గుమురు గుంపు గుమిగమి పిండు మొత్తము తెట్టె పైకము దాటెు లొద్ద, తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ మన గ వర్గము దగు .. ఆం. భా. 2. 100.

లొద్ది. వి. లోయ.

గీ. లోయ యన లొద్ది యనఁగఁ బొల్పొందు చుండు, నచలమధ్యధరాఖ్య.

ఆం భా. 2 31.

లొద్దుగు. వి. (సం. లోధ్రః) గాలవము, ఒక జాతి చెట్టు. (దీనిభేదములు ఎఱ్ఱలొద్దుగు, తెల్ల లొద్దుగు.)

సీ. గోఁగులు రేఁగులు క్రోవులు మోవులు మద్దులు నిమ్మలు లొద్దుగులును.

అచ్చ. రా సుం 25.

సీ. కడపట దిశ పాలకొడి తెల్లలొద్దుగు చిరి చేఁకు లొద్దుగజీడిపాల. హంస. 4. 11.

లొబ్బెన. వి లలంతికావిశేషము, స్త్రీహారవిశేషము. (శ. ర.)

లొల్ల. వి. దున్నినవేల మిట్టపల్లములు లేకుండఁగ నరుదునట్టి బల్ల. (శ. ర., బ్రౌ.)

జ : లొల్లకాఁడు

లొల్లకాఁ(గా)డు. విజ. (√లొల్ల) దరిద్రుఁడు

గీ. చల్లఁగాఁ జేతికాసెల్ల డుల్లి లొల్లకాఁడవై యుఁకనైన నీ కాఁపురంబు, బ్రదుకు వని విచారింప కీపనికిఁ జొరఁగఁబడిన వానికిఁ నె ఁడి భాగ్యబుద్ధి. నిరం. 2. 128.

సీ. తండ్రి గడియించినట్టి విత్తంబు వోవ, లొల్లగాఁడయ్యె నవ్విప్రవల్లభుఁడు.

శుక. 4, 111.

లొల్లి విజ. తఱచు, ఘనము.

క. లొల్లియగు వగల ద్రొక్కన, నిల్లుగ్గులు గానవచ్చు హృదయములోనన్, మల్లామడి యగు మ..., .. గూర్చుండెఁ దాల్మి మినమిను కనఁగన్

ఉ హరి. 5 166. (శ. ర. వీరేశ. పా. వెల్లియగు. వావిళ్ల పా.)

## లో

లో¹ = లోపల. (వ్ర. (దు. షష్ఠీవిభక్తి ప్రత్యయము.

1. నిర్ధారణార్థకము.

కం. ... వారిలో విప్రుతకీర్తి నెసెంచెఁ దుర్యో ధనుఁడు గుణనిధియై. ఆము. 1. 22.

చం. దినిఁ దాల్చి యిప్పుడితులోఁ గనఁ గొను మపరిమహామహిమానుభావముల్.

పారి 1. 61.

2. అధికరణార్థకము.

చం. అడిగి యంతలోవ సరసాన్నములన్ సమ కూర్చు ... పారి. 1 61.

సీ. ధ్రువ వసిష్ఠాగుంధతులఁ దనుచ్ఛాయయుఁ గావనివాఁ దేఁటిలోనఁ గడచ.

జై. భా 6. 98

3 అపాదానార్థము.

చం. ... నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ..

భార. ఆది 3. 144.

లో². వి లోను, లోపల శబ్దము యొక్క లుప్త శేషము (అంతఃకరణము).

ఉ. .. అవు లెప్పుడని యూరడిస్ సుదంత లో, గుందుట మానె జాంబవతి గోప మడంచెను మిత్రవిందయున్. పారి. 1. 69.

చం. ... పఁగె లో, నొగులుచు నొక్కుఁజక్కున యునుండు పనన్ ... వసు. 4 9.

(అంతర్భాగము.)

మ. దలమై లో వెలిఁ దానె యన్నిఁ దెలిసె న్నారాయణంబు .. ఆము. 6. 11.

కం. కరువువఁ బూరితమై లో,హాఁసము లోఁ గాఁజనట్టు లంగజు ... విమ్ముగఁ, గరఁగియుఁ బొడవఁక లోనఁ గాలుచునుండెన్. కు. సం. 5 578.

లోకి = లోనికి.

సి. దీనిఁ దగిలించుకొనవలెఁ దివ్యవిభుత్వ, దురము లోనికి నేఁడు ముద్దుగ నటించుఁ, దలఁచునంతటిలో జాణతనములాడి, లోఁ బలచి వానిఁ దో డ్తెచ్చె లోలనయన. హంస. 4. 49.

**లోఁక.** వి. లోపలిప్రదేశము.

కం. ... మ్రాఁకుఁ కుఁ జేరి యేటులఁ, లోఁకఁ కుం జనిరి దివిలోపలఁ గలయన్. దశకు. 10. 65

**లోఁకువ.** విణ 1. అధీనము, వశము.

ఆ. చెట్టుబట్టుదనుకఁ జేలోఁకువై యుండు, రంతఁ దాడుగట్టి నగడుగంద్రు. వేమ. 2. 564.

2. తక్కువ (శ. ర).

**లోఁగడ.** వి. (లోను + కడ.) 1. అంతరాళము. దేశములయు కాలములయు నడిమిభాగము.

కం చెడవిఱిగియడలిఁ బడి యెన, నెడ గట్టుల తుదలఁగోటి యిడి లోఁగడకున్, దడుకు వొడిపించి యాకుల,గుడిసెల వసియించె మఁత్రి గురుభటయుతుఁడై. ఆము. 3. 17.

2. గతకాలము. (శ. ర., బ్రౌ., వా.)

**లోఁగన్ను.** వి. ఔ. (లోను + కన్ను) అంతర్దృష్టి, జ్ఞాననేత్రము.

వ. ... ముక్కంటి లోఁగంటం గనుంగొనుచు నిశ్చల ధ్యానయోగాను సంధానంబున మాధుర్యంబు భుజించెనో ... కాశీ. 2. 44.

**లోఁగలి = లోఁగిలి.** వి. ఔ. (లోను + కలను) 1. గృహము (శ. ర). 2. గృహాంతర్భాగము.

చం. నటవిటకాంద్ర పాలిఁడు జారుల చెంతమ వేశ్య లిండ్ల లోఁ,గటను మిటారి తొత్తుల తెగన్ ననగూఁటుల విడుపట్టులన్, బటు వగు జూనగాంద్రకడఁ బల్లదకాంద్రెడ ... పోకడ వెట్టుకొనెన్ మదంబునన్. భల్లా. 3. (శ. ర.)

**లోఁగించు.** స. క్రి. (√లోఁగు) లోఁగఁజేయు, లొంగఁజేయు.

ద్వి. దీకొని హంవానిఁ దిణిగించివైచి, పైకొని జటంబుఁ బట్టి లోఁగించి.

ఆ. మ. ర. 3. 151 పొ. 26 పం.

**లోఁగియాడు.** అ. క్రి. (లోఁగి + ఆడు. స్వార్థమున ఆడు:) లోఁగు.

చం. మగఁ డపరాధియై కుచము మక్కువనంట గటాక్షమాలికల్, చిగురుకొనంగఁ జూచె వటు చిట్టునఁ గోపముతోడఁ బ్రోడ యిం,పుగ వగలొందు మేలయిన ముచ్చట వల్కియు నంత వింతగా, మగువయుఁ బ్రీతిఁ బూనె నవమన్మథకేళికి లోఁగి యాడుచున్. గంధ. 1. 160.

**లోఁగిలి = లోఁగలి.** వి. ఔ. (√లోను.)

1. గృహము, ఇల్లు.

సీ. అంతఁ బోవక యవి యాగోపముఖ్యులోఁగిటి లోని కుటిల యక్షేశలీల.

హరి. పూ. 6 138.

ఉ కౌఁగిటి కానచేసి నొడికారితనంబున నిమ్ముఁ దేల్చి రా, రాఁగొఱగానివాఁడనయి రామలలో నగుఁబాటు దేను నీ,కేఁగలుగంగ సంపదల కేల విచారము పద్మగంధి నీ, లోఁగిటఁ దేర్పనే యుభయలోకసుఖంబులు నమ్ముఁబొందినన్. ఉ. హరి. 1. 64.

గీ. ... దారువర్మని లోఁగిలి దతియుఁజొచ్చి,
దశకు. 3. 77.

2. ఇంటిలోపలి భాగము.

సీ. కేశవస్వామి లోఁగిలి పరామర్శించి కాల భైరవదేవుగవను జూచి. కాశీ. 2. 41.

కం. లోఁగిటికి రాని రూపముఁ, గోఁగిటికిన్ రానిపొందుఁ గారింపంగా, మూఁగిన కుసుమశరంబులఁ, జేఁగఱకఱనందె నళిన చిత్తం బంతన్. ఉ. హరి. 5. 101.

3. వాస్తు: ఇల్లుకట్టు స్థలము.

గీ. ... లోఁగిలి యన వాస్తుసంజ్ఞయై తనరు చుండు. అఁ. భా 223.

లోఁగు = లొంగు. అ. క్రి. 1. వశమగు.

ఉ. బాల విరాళి నిట్లుసుమబాణశరాళికిఁ జంద్రచంద్రికా, పాళికి సన్నగాలికిని భావజు తేజివయాళికిన్ రవో, ద్వేలమదాళికిన్ బ్రసవదీప్తవనీబుతుమాళికిన్ సదా, లోలత గుట్టుపట్టగల లోఁగి వచింపుము నార్తిఁ జెందఁగన్. ఉ. హరిశ్చ. 444.

వ. ... వ్రేఁగి లోఁగువారును గంది కుందువారును వ్రాలి కూలువారును వెఱచి పఱచువారును నై పలుదొసంగుల నెసంగుచుండి రప్పుడు. అచ్చ. రా. యు. 364.

ఉ. ... ఎవ్వానికి లోఁగ కెంత తొరవచ్చినఁ గాచెద నిన్నుఁ గూరిమిన్. హరిశ్చ 4. 108.

2. అడఁగు; అడఁగారు, నశించు.

కం. లోఁగుఁ దరమైన పొదరుల, నాఁగిన శకువంబ తలఁచు నడుగడుగునకున్, డాఁగఁ గెల వరయు ... కు. సం. 5. 49.

గీ. తపనుఁ డుదయింపఁ దద్బింబదర్శనమున, లోకపాతకపటలంబు లోఁగి పఱచి, యతఁడు గ్రుంకినఁ జనుదెంచె ననఁగ బర్వి, యంధకారంబు జగమెల్ల నాక్రమించె. కాశ. 4. 89.

ద్వి. లోపలు వెడలక లోఁగినవాని, లోవక చొచ్చి లోలోనఁ గ్రుమ్మియను
హరిశ్చ. పూ 609.

కం. మూఁగిన ఘనములు తారిం, గ్రాఁగినధరణీ తలం ... వెల్లన్, లోఁగగఁ గుంభ ద్రోణము, గాఁ గురిసెం జలము వ్రేఁగట్టిన తేవన్. విప్ర. 3. 61.

3. అడఁకువకలవాఁడగు, వినయవంతుఁడగు.

అ. ... శాంతిమై, నూరకున్న ... జూచి వారి వెఱచి, లోని కెఱుకచేసి లోఁగుచు ... ద, న్ననుప నరిగె నృపగృహంబు సేర.
భార. శాం. 6. 263.

కం. ఆ లో నాలోలశిఖి, జ్వాలోపమకోపశీలి వాలి వడిం బా, తాలోకితు ... లోఁగెడు నాయకున్ దురాలోచనుఁడై.
చం. రా. 6. 25.

4. క్రుంగు.

దండకము మన్నూకు శరాకాని బల్ కూటువల్. మోవఁగాలేం పెన్ వ్రేఁగునన్ లోఁగు నమ్మన్నుఁబూఁబోఁడికై ... సిలా. 2. 41.

5. వెనుదీయు, సంకోచించు.

ఉ. లోఁగక సంగరస్థలములోనఁ బరాక్రమ కేళి చూపుచున్, మూఁగిన దైత్యదానవుల మొక్కల ముక్కవఁ జక్కు చేసి తా, నీఁగల తిండిగాఁ జదిపె వేపున నచ్యుతపూర్ణ జుండుపై, నాఁగలిపాఁచి రాఁ దిగిచి నాగరథాశ్వపదాతి సంహతిన్.
ఉ. హరి. 6. 151.

మధ్యా. ... నిన్నుఁ బోరిలో నోర్వఁగా నున్న వీరుండ నొండు దక్కి లోఁగక చక్క నిలుము. భార. ఆది. 7. 200.

ఉ. తాఁగడు వేగిరించెఁగద నద్గతి నీవు నెఱుంగ సిగ్గునన్, లోఁగుచు నిఁసనుండి యిఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా, నేఁగుచుఁ గోరు నీ బలిమి నీప్సితసిద్ధి విపుగావే రా, దాఁగుట దీనిపేరు నిబిడంబిది జాలిక కెల్ల నాత్మలోన్. ప్ర. భా. 5 1

గీ తనకళత్రంబు లోఁజేసికొనుట యెఱిఁగి,
యమితనేత్రము లొసఁగ గౌతముఁడఁగాను.
దశా. 2. 41.

సీ తృణముగా లోఁజేయు నెంతటివాని నీ
నీలాలముంగలు నీలవేణి. విజ. వి. 1. 16.

లోఁడు న క్రి. వ్రేలలోఁతగువానితో కెల్లగించు. (శ ర.).

లోఁతిఁడి విశ (లోఁతు + ఇఁడి) లోఁతు లేనిది (శ ర).

లోఁతు వి. 1 అగాధత్వము, నిమ్నత,

సీ శరనిధుల్ లోఁతుచూప రసాతలము దోఁపఁ
జిలువరాచెలులకంటులు చలించె
ఉ. హా. 2 44.

సీ. కదలిరాయల లోఁతు గన్న గబ్బి.
మనుచ 5 47

సీ. తనలోఁతుపాఁతునైతము గానరాఁ గూర్మిఁ
గలసిన మొగమాటకాని వదలి
వరాహ 1. 32.

(ఇట గాంభీర్యమని రెండవ యర్థము.)

2. గాంభీర్యము, గుట్టు

చం. ఎదిరి మనంబు లోఁ తెలుఁగ కేమిటి కీవల
వంతఁ దల్లడించెదు ... సారంగ. 2. 101.

ద్వి. మఱి యంత బసవన్న మనసులోఁ తరయఁ,
బోఁచి గిన్నెరుప్రాణమును దమలోన,
డాఁచుడు ... పండితా. దీక్ష 82 పు.

(గంగ) వ. ... మానిని యన లోఁతుమూపక
గరితయన నడచనప్పుడు నేయక ముగుదయన
బయలువడక ... భాగ. 9. 230.

(ఇట నిమ్నత్వమని రెండవ యర్థము)

విశ. 1. పల్లము, నిమ్నము.

సీ. శీర్షంబు వలుఁదయై చెక్కిళ్లు లోఁతులై ......
కాశీ. 6. 41.

చం. ...అతఁడప్పుడు ముందటనుయ్యి వెన్కలోఁ
తగు గొయి యున్నలాఁగయినఁ దల్లడ
మందె వఱంతమేనుతోన్. విక్ర. 2. 81.

2. గంభీరము, గూఢము.

మ. ... విద్వన్మణీ, భజనప్రావక పాదపంకరుహా
మీభావంబు లోఁ తంచు నీ, రఘునాథుం
డ్రనుతించి చెప్పుడు గభీరప్రౌఢసూక్తంబు
లన్. కళు. 5. 185.

జ : లోఁతిఁడి

లోఁబట్టు వి. (లోను + పట్టు) లోపలిభాగము, అంతర్భాగము

ఉ. చుట్టి బిగించి పట్టి పురమూదవ యీ గర
ళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పు మతి
గాక దిగంబఱనిత్తువేని లోఁబట్టన నున్న
లోకముల భస్మము సేయు వెలార్చితేని
వెల్పట్టుననున్న లోకముల భస్మము సేయు
నిజంబు చెప్పితిన్ భీమ 4. 64.

లోఁబడు. అ. క్రి. (లోన్ + పడు) 1. వశమగు, అధీనమగు.

చం. అడరిన దానవుండు గరుడాకృతిఁ గైకొని
మాయతోడ లోఁ, బడ భుజగంబులం బొదివి
పట్టి ఁయంబున మ్రింగి యుప్పుచే,డ్పతు వరు
వట్టి కఁరముఁ గృపాణమునం దెగవైవ ...
భాగ. భీష్మ. 3. 105.

గీ. కినిసి పాణి నాళీకంబు సోనువుటయును,
వంత లోఁబడ కతియు మోహప్రకటన,
మాని తన్ననిచిన యతి మానతుంగ, తరు
నెనసితోన గ్రహణగోచరతఁ దొలఁగె.
హ. న. 2. 47.

కం. మీకింత వంది కంద భయాకులతం బొంది
నిర్గతైశ్వర్యులరై, రాకముఁ గారణమేమి
త్రిలోకాహిత దనుజతతికి లోఁబడరువరే.
కు. సం. 4. 365.

2. అడఁగు, క్రుంగు.

గీ. ప్రళయజలనిధిక్రింద లోఁబడినయట్టి, యుర్వి
దంష్ట్రాంకురంబున నుద్ధరించి.
శివరా. 1. 64.

3. హీనస్థితినొందు, దైన్యమొందు.

కం. భూకాంత నీరువట్టుచుఁ, గాక వదన మిటు
రింపఁగాన్పించిన పం, క్లోకానన వెతి

పుచ్చులు, లోకమ్ము గాచె నిట్లుఁలోఁబడె జనముల్. వరాహ. 10. 30.

లోఁబఱచే న. క్రి. (√లోఁబడు) వశముఁజేయు.

వ ... అమ్మహాశాసనవైరుల లోఁబఱచి ముఁమచు ... ఉ. రా. 2. 61.

లోకంపృణము. సం. విణ. (అ. ఆ. అ.) లోకమును నిండించునది, లోకమంతటను వ్యాపించునది.

లోకకంటకుఁడు. సం. వి. అ. పుం. లోకమునకు బాధ కలిగించువాఁడు, దుర్మార్గుఁడు.

లోకకథ సం. వి. ఆ. స్త్రీ. సర్వసాధారణమైన పురాణకథ, నీతికథ, జనులందఱు నెఱిఁగిన పురాణగాథ.

లోకకర్త. సం. వి ఋ. పుం లోకమును సృజించువాఁడు, భగవంతుఁడు.

లోకకల్పము సం. విణ. (అ. ఆ. అ.) 1. కొంచెము తక్కువగా ప్రపంచమువలెనున్నది. 2. లోకముచే గారవింపఁబడినది. వి. అ. పుం. ప్రపంచము నిలిచి యుండు కాలవిశేషము.

లోకకాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) లోకమున కిష్టుఁడైనవాఁడు, సర్వజనసమ్మతుఁడు. వి. ఆ స్త్రీ. ఓషధివిశేషము (రా. ని.).

లోకగతి సం. వి. ఇ. స్త్రీ. జనుల నడవడి, లోకుల ప్రవర్తనము.

లోకగాథ సం. వి. ఆ. స్త్రీ. జనులందఱు పాడెడపాట.

లోకచక్షువు(స్సు) సం. వి. స్. న. జగముకన్ను, సూర్యుఁడు

లోకచారిత్రము. సం. వి. అ. న ప్రపంచపు నడవడి

లోకజనని సం. వి. ఈ స్త్రీ. లక్ష్మి.

లోకజిత్తు. సం. వి. త్. పుం. 1. బుద్ధుఁడు. 2. లోకమును జయించిన పురుషుఁడు. 3. సన్యాసి.

లోకజ్ఞుడు. సం. విణ. (అ ఆ అ.) లోక స్వభావ మెఱిఁగినవాఁడు, కలోజ్ఞానము గలవాఁడు

లోకడుపు. వి. (లోపల + కడుపు) కడుపు లోపలిభాగము.

కం. లోకంబుల సృజియింపను, నాకంఠితము గాఁగఁ గ్రోచి యన్నియు విసవన్, లో కడుపున నడగింప మహాకర్మురుఁ డితఁ డచింతితాత్ముఁ డహామన్.

హరి. ఉ. 5 223.

లోకతంత్రము. సం. వి అ. న. ప్రపంచపద్ధతి.

లోకతత్త్వము. సం. వి. అ. న. ప్రపంచనిజస్థితి, ప్రపంచజ్ఞానము.

లోకతుషారము. సం. వి. అ. పుం. కర్పూరము.

లోకత్రయము. సం. వి. అ. న. ముల్లోకములు' స్వర్గ మర్త్య పాతాళ లోకములు.

లోకత్రయి = లోకత్రయము. సం. వి. ఈ స్త్రీ.

లోకద్వారము సం. వి అ. న. స్వర్గద్వారము, స్వర్గలోకపు వాకిలి

లోకనము. సం. వి. అ. న చూచుట.

లోకనాథుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. విష్ణువు 3. శివుఁడు. 4. రాజు, చక్రవర్తి. 5. బుద్ధుఁడు. 6. వేలుపు, దేవత. 7. సూర్యుఁడు

లోకపథము = లోకపద్ధతి. సం. వి. అ. పుం

లోకపద్ధతి. సం. వి ఇ స్త్రీ లోకమార్గము, పదుగురు నాచరించు రీతి.

లోకపాలుఁడు. సం వి. అ. పుం 1 లోకము నందలి యొకదిక్కును పాలించువాఁడు, దిక్పాలకుఁడు. 2. చక్రవర్తి, సార్వభౌముఁడు.

లోకపితామహుఁడు సం. వి అ. పుం బ్రహ్మ.

లోకప్రకాశనుఁడు. సం. వి అ పుం. సూర్యుఁడు'

లోకప్రవాదము. సం. వి. అ. పుం జనశ్రుతి, కింవదంతి, అందఱును చెప్పుకొనెడి మాట.

**లోకప్రసిద్ధము.** సం. విణ. (అ. ఈ అ.) అందఱకును దెలిసినది, లోకమునఁ బ్రసిద్ధికెక్కినది.

**లోకబాంధవు.** సం. వి. ఉ. పుం. లోకబాంధవుఁడు.

**లోకబాంధవుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. శివుఁడు 3 విష్ణువు.

**లోకబాహ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెలి వేయఁబడినవాఁడు, జాతినుండి బహిష్కరింపఁబడినవాఁడు. 2 లోకమునకు వేఱైయున్నవాఁడు, లోకవిరుద్ధుఁడు.

**లోకభావనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లోకక్షేమమును దలంచువాఁడు, లోకక్షేమమును వృద్ధిపొందించువాఁడు.

**లోకమర్యాద.** సం. వి. ఆ. స్త్రీ. లోకాచారము, వాడుక.

**లోకమాత.** సం. వి. ఋ. స్త్రీ. లక్ష్మి.

**లోకము.** సం. వి. అ. పుం. 1. స్వర్గాదిభువనము. (స్వర్గము, మర్త్యము, పాతాళము). (ఊర్ధ్వలోకములు ఏడు: భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. అధోలోకము లేడు: అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము) 2. భూలోకము. 3. జనము. 4 ప్రజ, పాలితవర్గము. 5 సమూహము. 6. రాష్ట్రము, భూభాగము (ఉదా: ఆంధ్రలోకము.) 7 లోకవ్యవహారము. (వ్యతి.) వైదికవ్యవహారము 8 సామాన్యమానవజీవితము. 9. సప్తసంఖ్య, ఏడు.

**లోకములకన్ను.** మి. వి. (లోకముల + కన్ను) జగచ్చక్షువు, సూర్యుఁడు

గీ. కవుఱుముంగొంగు వాఁడన్న లోకములకన్ను,
పచ్చగుఱ్ఱపువన్నెకాఁడు పగటిఱేఁడు

ఇందు. 4. 71.

**లోకయాత్ర.** సం. వి. ఆ. స్త్రీ 1. లోకవ్యవహారము, ప్రపంచ జీవనమార్గము. 2. సర్వజన సామాన్యపద్ధతి, పదుగురు నడచుకొనురీతి 3. లోకస్థితి, జీవయాత్ర. 4. జీవిక, జీవనాధారము, బ్రతుకుతెరువు.

**లోకరంజనము.** సం. వి. అ. న. ప్రపంచమును సంతోషపఱుచుట, ఎల్లవారిని సంతోషపెట్టుట.

**లోకలేఖము.** సం. వి. అ. పుం. సర్వజనవిదితమైన వ్యవహారికపత్రము.

**లోకవాదము = లోకప్రవాదము.** సం. వి. అ. పుం. కింవదంతి.

**లోకవార్త.** సం. వి. ఆ. స్త్రీ. జనప్రవాదము, కింవదంతి.

**లోకవిద్విష్టుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లోకముచే ద్వేషింపఁబడినవాఁడు జను లసహ్యించుకొనువాఁడు.

**లోకవిశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రపంచమంతటను వ్యాపించినకీర్తి 2 నిరాధారమగు వార్త, కల్లవార్త, అసత్యప్రవాదము.

**లోకవృత్తము.** సం. వి. అ. న. 1. లోకమునఁ బదుగురు నడచుకొను రీతి, లోకాచారము. 2. పనిలేని మాటలు, వ్యర్థసంభాషణము.

**లోకవ్యవహారము.** సం. వి. అ. పుం. 1. ప్రపంచపద్ధతి, లోకాచారము. 2. ప్రపంచపు కార్యపద్ధతి. విణ. (అ. ఆ. అ.) వాడుకలో నున్నది. సర్వజనోపయోగమునందున్నది.

**లోకశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. జనశ్రుతి, కింవదంతి. 2. ప్రపంచమంతట నిండిన కీర్తి

**లోకసంగ్రహము.** సం. వి. అ. పుం. 1. లోకము మొత్తము. 2. లోకక్షేమము. 3. లోకానుభవము. 4. ప్రజలనందఱను బ్రసన్నులనుగావించుకొనుట.

**లోకసంస్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. విధి, భవితవ్యత. (ఆ. ని.)

**లోకసాక్షి.** సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ. 2 అగ్ని 3 సూర్యుఁడు.

**లోకసాక్షికము.** సం. విణ. (అ. ఆ. అ.) లోకము సాక్షిగాఁ గలది, ఎల్లవారు ననుమతించినది.

**లోకసిద్ధము** సం. విణ. (అ ఆ అ) 1. జనుల వాడుకలో నున్నది, మామూలుగా నున్నది. 2. అందఱిచేత నంగీకరింపఁబడినది.

**లోకహితము** సం. విణ. (అ. ఆ అ) 1. జనోపకారమైనది, అందఱకును మేలు కలిగించునది. వి. అ న. సర్వజనక్షేమము.

**లోకాంతరము** సం వి. అ. న. అన్యలోకము, భవిష్యజ్జన్మము.

**లోకాచారము.** సం. వి. అ. పుం. లోకము నందలి వాడుక, పదుగురు చేయుపని, ప్రపంచపద్ధతి.

**లోకాతిగము.** సం విణ. (అ. ఆ. అ) ప్రపంచమును మించినది, అసాధారణమైనది.

**లోకాత్మ** సం. వి న్. పుం. సమష్టిజీవుఁడు. కూటస్థుఁడు.

**లోకాధికము.** సం. విణ. (అ ఆ. అ.) ప్రపంచముకంటె నధికమైనది, అసాధారణమైనది.

**లోకానురాగము** సం. వి అ. పుం. 1. మానవకోటియందు గల సమానప్రేమ, సర్వజనహితాభిలాషము. 2. సర్వజనుల యొక్క ప్రేమ.

**లోకాపవాదము.** సం. వి. అ పుం. లోకనింద, పదుగురు నిందించుట.

**లోకాభిభావి.** సం. విణ. న్ (నీ న్.) 1 లోకమును మించువాఁడు 2 లోకమంతయు వ్యాపించునది (వెలుఁగు మొ॥)

**లోకాభ్యుదయము.** సం. వి. అ పుం. ప్రపంచక్షేమము.

**లోకాయతము.** సం. వి. అ న. అనాత్మవాదము, నాస్తికమతము, చార్వాకమతము.

**లోకాయతికుఁడు** సం. వి. అ పుం. చార్వాకమతస్థుఁడు నాస్తికుఁడు, అనాత్మవాది.

**లోకాయతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నాస్తికవాదము చేయువాఁడు ఆత్మ లేదనువాఁడు. వి అ పుం. నాస్తికుఁడు.

**లోకాలోకము** సం వి అ పుం. (ఒక పార్శ్వమున సూర్యకిరణసంపర్కము గలదియును ఒక పార్శ్వమున సూర్యకిరణస్పర్శము లేనిదియు నగు పర్వతము) చక్రవాళపర్వతము.

**లోకేశము.** సం. వి. అ పుం పాదరసము.

**లోకేశుఁడు** సం. వి. అ పుం. 1. బ్రహ్మ. 2. ప్రపంచాధిపతి, రాజు.

**లోకోత్తరుఁడు** సం. విణ. (అ ఆ. అ.) ప్రపంచమును మించినవాఁడు,అసాధారణుఁడు. వి అ పుం. రాజు.

**లోకైషణ** సం. వి ఆ. స్త్రీ. స్వర్గాభిలాష, స్వర్గకామము.

**లోకోక్తి.** సం. వి. ఇ. స్త్రీ 1. సామెత. 2. సామాన్యవచనము, పదుగురాడుమాట.

**లోక్యము.** సం. విణ. (అ ఆ. అ) 1. లోకమున వ్యాపించినది 2 ఆచారప్రాప్తమైనది, మామూలైనది. 3 సరియైనది, యథార్థము, ఉత్తమలోకమును సంపాదించుట కనుకూలమైనది. 4 స్వర్గసంబంధమైనది 5. స్వాతంత్ర్యమున కవకాశము నిచ్చునది.

**లోగము.** సం. వి. అ. పుం. మంటిగడ్డ, మంటిబెడ్డ.

**లోగుట్టు** వి. (లోను + గుట్టు) గుప్తమంత్రము, రహస్యమైన యాలోచనము.

ఆ. బలము లేఁగ దైవబలమును గలిగి లోగుట్టు
చేటులేని యట్టి నృపతి,వలన మత్సరింపఁ
వలదు ... భార. ఆశ్ర. 1 71.

**లోగృహము.** మి. వి. (లోపల + గృహము) లోపలియిల్లు, అంతర్గృహము.

కా నే పాతొమించ భుజించి లోగృహములో నిద్రించు ధర్ముండు ... మల్లి. శృం 97.

**లోగ్రుక్క** (లోను + గ్రుక్క) మణితము, రతి కూజితము.

సీ. ... ... ... ... లోగ్రుక్క వెతిగ్రుక్క ... ... అం భా. 2. 160.

**లోచకము.** సం. వి. అ. పుం. 1. కనుపాప, నల్లగ్రుడు నడుమనుండు రంధ్రము. 2. దీపపు మసి, కాటుక 3. ఒకవిధమైన కర్ణాభరణము. 4 నీ ... వస్త్రము, నల్లబట్ట ... మాంసపుముద్ద, మాంసపిండము. ... చర్మము 10. కదలీవృక్షము, అరంటిచెట్టు.

**లోచకుండు.** సం. వి అ పుం. మూర్ఖుండు

**లోచనగోచరము.** సం. వి అ పుం దృష్టి పథము, నేత్రమార్గము

విణ దృష్టివిషయము, కంటికగపడునది.

**లోచనపథము.** సం వి అ. పుం. లోచనమార్గము.

**లోచనమార్గము.** సం వి. అ. పుం దృష్టి పథము, నేత్రమార్గము

**లోచనము.** సం. విణ. (అ. ఈ. అ.) 1. ప్రకాశింపఁ జేయునది, కనఁబడునది. 2. దృశ్యమైనది. వి అ న. 1 చూపు, చూచుట. 2 నేత్రము, కన్ను.

**లోచనహిత** సం వి ఆ. స్త్రీ. తుత్థాంజనము, మైలుతుత్తము.

**లోచనస్తకము.** సం. వి. అ. పుం. ఓమము. (శ. ర.).

**లోచము.** సం. వి. అ. న. కన్నీరు, బాష్పము.

**లోచూపు.** వి. (లోపల + చూపు) 1. జ్ఞానదృష్టి.

సీ. ఏవపుల్ ముమమాని లోచూపుగా మిన్కుఁ గడలఁ దోఁచు వెలుఁగు గాంచువారు యయా. 2 43.

మ. .. ప్రాజ్ఞుల్ నిక లోచూపునన్, గను నానందము నీవెకావె విను ... లామీఁదటన్. ఉ. రా 2 135.

కం రేచక పూరక కుంభక, సూచకముల రాజయోగి సుస్థిరమతియై, లోచూపు చూడ నొల్లక, వాచాబ్రహ్మంబు పలుకవద్దుర వేమా, వేమ 3 200.

2. క్రేఁగంటి చూపు.

ద్వి ... లోచూపులు తీతీపులాడ.

ప్రభు (లిం) ... 2 పా. 3 ...

**లోజతనము.** వి. (లోపల + జతనము) హృదయరక్షకము.

వ బెస్తలు సిస్తుగామోచి నిబ్బడుగుముఁడ్డ డియం గాలజడుపుపై నరంబోరడయడుగు లోజతనము మోరిడి బలిమికం బొద్దికొట్టడి. ప్రబంధ. 1 605.

**లోటు.** వి. 1. జలాశయ విశేషము.

కం. తిరుకోశము నూయి లోటయు, జెలువు మడువు లొందు కుంట చెలమ పడియ కోనెలు బుగ్గ వాఁగు దొనతల,వరి గుండము కాల్వ డిగియబావి దొరువులన్. హంస. 4. 102.

2 (హిం. లోటా) చిన్న పాత్ర (శ ర.).

**లోటనము.** సం. వి అ. న. దొర్లుట, పొరలుట

**లోటు** విణ. (క. లోట్టు) తక్కువ, న్యూనము. వి 1. న్యూనత. 2. నష్టి (శ. ర. )

జ. లోటుపోవు.

**లోటుపోవు.** అ. క్రి. (లోటు + పోవు) లోటు వచ్చు, తక్కువగు (శ. ర.).

లోరము. సం. వి. అ. పుం. నేలపైఁ బొర్లుట, దొర్లుట.

లోడనము. సం వి అ న. క్షోభపడుట, సంశ యించుట.

లోడి = లోడి[2]. వి. (సం. లగుడః) మల్లవిద్యా సాధనము.

చఁ. కరికలభంబు కొమ్మపుడు గైకొని బిఱ్ఱునఁ ద్రిప్ప లోడి వై, ఖరి గిరియెత్తు సంగడము కైవసి నవ్వులయాద్రిఁ బట్టు గొఁ, బరహిని మ త్తభద్గిని బరౌ రజంబుగఁ గొట్టు ...

రా వి 2 27.

సీ. సంగడాల్ బూన బుజాపురాయింపు బరి లోడ ద్రిప్ప మేల్ బరుల యుబ్బు

ప్రబంధ 82.

మ. ... సమీరమల్లుఁ డనువొంద న్వావిపూ లోడిఁ ద్రిప్పు మెయిన్ గోకిలజాలుఁ డెంచికొను సొంపుల్ గుల్కు నాదంబులన్.

కళా. 2. 117.

సీ. మనును జెట్టి యవంగ మల్లాభిధానంబు ... తత్సాధనంబులై తగు గంబము కొణత కట్టిక లోడి సంగడము జాల. గీ. సంగడమ్ము నీల గోతా మవంగ ... ఆం. భా. 2 203.

లోడి[1] వి వస్త్రవిశేషము.

ఁగడ. పాఁంబట్టు లోడీలుపాఁనలా దుకూలాలు, కబ్బాయికలు డాలు గల్గు జరబాబీలు

హంస. 5. 826.

లోడి[2] = లోడి వి. మల్లవిద్యాసాధనము (శ. ర.)

లోడు. వి (క లోడు) ఉపధానము, ఒఱగు దిండు (శ. ర.).

లోణారము. సం. వి. అ పుం లవణభేదము, ఒకవిధమైన ఉప్పు ఉప్పునుండి పుట్టెడి యొక విధమగు క్షారము (రా. ని.).

లోతక్కువ. విశ. (లోపల + తక్కువ) శేషము, మిగిలినది (శ. ర.)

లోతమి. వి. (లోపల + తమి) లోపలితమి, అంత రంగిక కుతూహలము.

(కానేరి నైన్నవము) వ. ... జాహ్నవి నిహ్నవించి గౌతమి లంతమి యడంచి సారవంబు గౌర వంబుఱచి యన్యసరిన్నివహంబు నపహ సించి .... శ్రీరం. 1. 132.

లోతము సం. వి. అ. పు. 1. కొల్లగొట్టిన సొమ్ము. 2. గుఱుతు, ఆనవాలు, చిహ్నము.

వ. 1. కొల్లగొట్టిన సొమ్ము, దొంగిలించిన సొమ్ము. 2. ఉప్పు.

లోత్రము. సం. వి. అ. న 1. కొల్లగొట్టిన సొమ్ము, దోఁచుకొన్నధనము. 2. కన్నీరు.

లోదాడ. వి (లోపల + దాడ) దొడకు లోపలి భాగము.

చఁ. ... గిఱికొను గాలి వట్ట దొరఁగి బిఁగి వేలుపు బంతి లోదాడల్, నెఱికసి వోలెఁ గెంపుగమి ఒద్దకుఁ గ్రొమ్ముత్యపునూలి డాల్ గనెక్

లోధము సం. = లొద్రము

లోధ్రము సం వి. అ పుం ఎఱ్ఱని పువ్వులు గాని తెల్లని పువ్వులు గాని గల యొకజాతి వృక్షము లొద్దుగచెట్టు.

లోనిచూపు. వి. (లోను + చూపు.) అంతర్దృష్టి.

కం. వ్యావృత్తి సూత్రాకృతియగు, చిను న్శక్తి బురాణపుర షోత్తముడు, గన్గొనగిది లోనిచూపు సన్మానమ్ముఁ దత్తండు చూచు సమయమున నమున్. పాండు 4 16.

లోనిచ్చు. అ. క్రి. (లోను + ఇచ్చు) గుట్టుచెప్పు.

సీ. రిపులకు లోనిచ్చె నపర యయ్యెఁ బీడని యమ నృల చెప్పు లరసి ... డఁచు. గీ. భువన మరి దండ నా కళాపూర్ణుఁ ... డు.

కళా. 6. 200.

లోను. వి జా. అనో. 1 లోపల, అంతర్భా గము, మధ్యము.

శా. . కాతర స్వాంత ప్రశాసకరంబు నై దురభి
వేశంబైన యాలోను నిశ్చింతుండై సతికేలు
వట్టుకొని చొచ్చెన్ భీముం డత్యుగ్రతన్
భార విరా 2 327.

కం. వంచన వనంబు లోన నొ కించుకయను లేక
యమ్మహీంద్ర ముమీఁదన్. బంచానల మధ్యం
బునఁ, బాంచాలీవల్లభుఁడు తపం బొనరించెన్
హర. 7 6.

ఆ ఎంతనిష్ఠ గలిగెనేనియు మానంబు లోని
యడ యొక్కుడైనదివము, లధిప యుప
వసింపనగు . భార అను 4 161.

సీ అట్టి యాలోను కడురయం బారఁజొచ్చి,
యొయ్యనఁ దఱయ పి దక్కిన నొదిఁగియు-డెఁ
బగతుఁడును వెనువెంటఁన పాఱుతెంచి, కనియె
నిద్రాయమాణు నమ్మనుజనాథు
హరి. ఉ. 2 186.

చ పరగ సువర్ణబంధమృదుభావము గల్గియు
లోన చూడఁగాఁ బొరవగు చిత్రరూపమును
బోలెవ సత్కవికావ్య మిమ్మహిం, బరగు ...
కు సం. 1. 37.

కం కాలం బగుటయు నృపులకు, నాయము సమ
కూరె దీనిఁ డలకు మది నీ. వాలోకింపఁగ
వలసిన, నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్రా.
భార భీష్మ. 1. 6

చం. .. లో,నికి మణిపట్టబంధసరణిన్ ధరణీ
సురుఁ డేగెంగన్ మనుచ 2. 21.

కం .. పూర్ణేందు ముఖ చూచి మీలో,నం దెవ్వఁడు
వాడిచి యొడిచె నతనిన వలతున్.
భార. ఆది. 8. 110.

లోనందు = లోపలను, మధ్యను.

కం. సుందరి మా యిద్దర,లోనం దెవ్వరి వలతు
సెప్పుమా యనవుడు భార. ఆది. 8. 110.

ఆ. అగ్నిలోన బయల నప్పుల నప్సరో,గణము
మ్రోలఁజేసెఁ గడిఁది తపము
కకు 1. 164.

అగ్నిలోనన్ = పంచాగ్నిమధ్యను

చం వినియె . ఆత్మఁగీ ల్కొన వల విప్రుఁ
డాద్విజులలోన సుభాషితముఁ బఠింపఁగా.
ఆము 2 76.

2. మనస్సు, అంతఃకరణము

కం. అత్తెఱఁగంతయు నూర్వశి,చిత్తంబున నెఱిఁగి
వాఁడు చేతో జాతా, యత్తుండై తనఁబిలుపం,
బుత్తెంచట తెలిసి లోనఁ బూనిన లజ్జన్
ఉ హరి. 1. 59.

కం అని హరిఁ దలఁచుచుఁ దన లో,నను జింత
యొనర్చు బ్రహ్మవాసాంద్రం,బున ...
దశా. 8. 180.

3 లోఁకున

సీ. ఏనిఁదలకు సామి లో నీకు మనియెంత చాటు
చెప్పితి నను పోటుబంట్లు రా. వి 4 124.

విశ. 1. ఆది, మొదలు

గీ. స్థావరములు జంగమములు భూత లోను,
గాఁగఁ బ్రళయంబు నొందినకాలమునను,
నిలుచు నెవ్వఁ డొకండ యానిత్యసత్య, లలితు
శార్ఙ్గి బ్రసన్నుఁగాఁ గొలుతు నియతి
భార శాం. 4. 219.

ఉ కారణ మానువత్వమున ఁగంసుఁడు లోనుగ
దష్టదైత్యులన్, బేరడగింపఁ బొంకెు నిటుఁ
బృథ్వి జనించినవాని వాదిపం,కేరుహ నాభుగా
నెఱిఁగి ... హరి ఉ. 1. 40.

కం. ఏమను మదియశిష్యులు, లోనుగ వంచించి
కొలఁకిలోపల ... దశకు. 11. 59.

2 అధీనము, లొంగినది.

చం. తనమది నొక్కయుమ్మలిక,దక్కిన మంచిది
దానిఁ బాపఁగా, వని తలపోసి చేయు పని
కక్కట యేనును లోనుగానె ...
నిర్వ. 9. 27.

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రకుల భీషణలోనుఁడు
చిత్త మెప్పు డెల్లి మద మెత్తునో యతని
యుగ్రహవృత్తికి లోనుగాక ...
భార. విరా. 1. 177.

(లోనగు = లోఁబడు)

కం. మిడిలోనులఁ గాలుచ్చులఁ బడఁదోలియుఁ
లోఁగు లోను పఱచియు శేల్లన్, వడిగల
జింకలనెల్లన్, వొడిచిరి కడుఁ జెంచు లాఖు
వులఁ జద లడరన్. యయా. 2 19.

సీ. కికురించి రిచ్చిపుచ్చుకొనుచోటుల వారలాఁ
కకలోనుగా కవ్వలిఁక. మనుచ 3. 129.

1. ఆలోవన్ = అసమయమందు.

సీ. అరదంబుపై ప్రాలి యాలోనఁ దెలిసి తన్నేసి
వాతనిఁ బడనేయువారు
భార. విరా. 3. 169.

కం. ... పురుషుఁ డొకఁ, డాలోక దుస్సహుండై,
యాలో జనియించి శీలవడుఁకుచు నెదురన్.
హరి పూర. 1 106.

కం. ఆలోనొకనాఁడు మహీపాలుని ప్రియ
మతుఁడు విజయపాలుండను దక్షుఁడు
మృగయాలోలత, వ్యాలమృగాకీలమైన
వనమున కరిగెన్. విక్ర. 3. 72.

2. అంతలోపల.

గీ. ... మగిడి, వచ్చునాలోన నీరూపు వచ్చె నాకు.
ఆము. 6. 85.

కం. ఆదారి నత్త కినిసెనొ, లేదో యాలోన
నమ్మరలించుట నే నిం, కేదియుఁ జెప్పిన
నిక్కము,గాదేకద యంచు గోపకామిని
యేడ్చెన్. శుక. 2 576.

ఇ: లోఁగడ, లోఁగన్ను, లోఁగలి, లోఁగిలి.
లోఁగొను, లోఁజెయ్యి, లోంజే, లోఁజేయు,
లోఁబట్టు, లోఁబడు, లోఁబఱచు, లోగుట్టు,
లోగ్రుక్క, లోనిచూపు, లోనిచ్చు, లోను
చేయు, లోనుగఁజేయు, లోనుపడు, లోను
పఱుచు, లోలోనిచవి, లోలోను, లోవంక,
లోహాటము.

**లోనుచేయు** స. క్రి. (లోను+చేయు) లోఁబఱచు
ఉ. ...మీ, మీనిపుణత్వముల్ దెలియు మే కొని
యమ్మునిని లోనుచేసితన్.
వాల్మీ 3. 69.

**లోనుగఁజేయు.** స. క్రి. (లోను+కన్+చేయు)
లోఁబఱుచు, వశముచేయ.

చఁ. పయికొని వన్నె సిట్లు మరుబాఱికి లోనుగ,
జేయఁ బూని యే,నియతియొ వట్టి సంది
యము నీకొవరిఁపఁగఁబోలు
కళా 7 226.

**లోనుపడు.** అ. క్రి (లోను + పడు) వశమగు.

నీ తను బిల్చినప్పుడ విని లోనుపడెనంచు మక
రంబు కరి రేకు మడఁచునొక్కొ, విభుఁడు
గల్గిన మొర వినఁడె వేడని దంతి జడిసి
ప్రాణములేడ విడచునొక్కొ.
వాల్మీ. 1. 100.

**లోనుపఱు(ఱ)చు.** స క్రి. (√లోనుపడు)
లోఁబడునట్లుచేయు, వశపఱుచు.

కం. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ, బనుపక యొంగి
లికి లోనుపఱుపక తగు మన్ననతోడ నరయు
వారల, కనురాగము నెఱపి నడతు రస్మత్ప్రభు
లున్ భార. విరా 1 329.

సీ. వీని చంద్రికలు ద్రావిన చకోరికలకు ద్రిమ్మరుట
భారమే యుగలంబు, వీని జన్మస్థానమైన
వార్ధికి లోనుపఱచుట భారమే బాడబాగ్ని
వరాహ. 4. 23.

అ ఇంద్రియముల నిగ్రహించి కామంబును లోభ
మోహములను లోనుబఱచి, యుపవసించి
శీత ముష్ణంబు దలపక, తపము సేయ కేల
తక్కుదేను కుచేల. 3 41.

**లోప.** సం. వి అ స్త్రీ. అగస్త్యమహాముని భార్య
లోపాముద్ర.

**లోపగతుఁడు** వి. (లోపల + పగతుఁడు) అంత
శ్శత్రువు

కం. ఏర్పడ లోపగతుంను వెలార్చక లోకంబు
నకుఁ దొలంగక గుఱిపై, నేర్పు నుపనపవన
ములం, గూర్పక యోగీశ్వరుండగునె యే
లంగిన్ శివయోగ ఉ. భా 1. 18.

**లోపనము** సం. వి. అ. న. 1 అతిక్రమించుట, ఉల్లంఘించుట. 2. లోపింపఁజేయుట, లొలఁగించుట

**లోపము.** సం. వి. అ. పుం. 1. అపహరణము కొల్లగొట్టుట 2 నాశము 3. ఛేదనము, తెగఁగొట్టు 4 రద్దుచేయుట, తొలఁగించుట. 5 అతిక్రమించుట, మీఱుట. 6 అభావము 7. పరిత్యాగము, విడిచిపెట్టుట. 8. వ్యాక.) ప్రసక్తమయిన వర్గముగాని పదముగాని కనఁబడకుండుట (అదర్శనం లోపః) 9 కలవరపాటు

**లోపల.** వి కొ. 1 అంతర్భాగము

గీ వెలుపలను లోపలను నుండుఁ దలిరుఁబోఁడి.
శాకుం 1. 117.

మ వియద్గంగాప్రవాహంబు లోఁజలికింబోయి మరిప్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్
భాగ. 1. 496.

మ జలిదైతేయ భయాంధకారభరితబ్రహ్మాండగేహంబు లోఁపలఁ దైమండెడు తత్ప్రికాప మయదీప జ్వాల డిందన్.
ఆము. 4. 24.

2 అంతఃపురము, అవరోధము.

గీ. బయలుతేరిన సుతుఁడు లోపలనుపతిపుఁ, గాని యమ్మలు తేరైరి ఖచరపతికి.
కళా. 2. 51.

3. మనస్సు, అంతఃకరణము.

కం. వారిదువృథఁ దమలోపల, వేఁడుగొని ...
ఆము. 3. 15.

క్రి. అవ. 1. నిర్ధారణషష్ఠియందు బహువచన ప్రత్యయము.

ఆ. పూజనీయులైన పురుషులలోపల, నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁడు. భార. సభా. 2. 11.

చం. ... కర్మనం,జనితవిశేషతం గలుగు భాయల లోపల నెట్టి యమ్మిథుం, గరుటకు నల్పమను ...
భార. శాం. 5. 498.

2 అధికరణార్థకము, అందు.

కం. చని పట్టి పాలవట్టికఁ, గనుపట్టెడు కనకపత్రికావిలిఖత నూ,తనబిరుదాక్షరములు వే,ర్కొని లంఘలవె చదువుకొనె వివరముగన్.
కై భా 4. 6.

లోలోపలన్ = మనస్సునందు

అంతలోఁపలన్ = అనన్తయమున్‌లోనె.

ఉ. హాయని మోహినీమహిళ యదభృతరోషకషాయితాక్షియై, హాఁ యను నంతలోపల సహస్ర సహస్ర సహస్ర దీధితి,చ్ఛాయ సహస్రధారమగు చక్రము వ్రాలె గళాంబుజంబునన్ దశా 2 368.

జ : లోఁకడుపు, లోఁచూపు, లోఁజతనము లోతక్కువ, లోకమి, లోదాడ, లోవగతుఁడు, లోతాద, లోవిత్తరి, లోమొన, లోవాఁడి.

**లోపాకము.** సం. వి అ. పుం సృగాలము, గుంటనక్క

**లోపావకము=లోపాకము.** సం.

**లోపాముద్ర.** సం. వి. అ. స్త్రీ. అగస్త్యముని భార్య, విదర్భరాజు కూఁతురు.

**లోపాయకారి.** విణ. రహస్యముగా నొకరి పక్షముతనున్నది. (శ. ర.).

**లోపాశకము=లోపాకము.** సం.

**లోపాశము** సం. వి అ. పుం గుంటనక్క, సృగాలము.

**లోపి.** సం. విణ. (న్. వి. న్.) 1. హానిచేయునది, 2. లోపముగలది.

**లోపించు.** సం. అ. క్రి 1. మఱుఁగుపడు.

శా. లోకక్రోశజనించుచున్ మెలఁగుచున్ లోపించు వానిన్ సుమిత్రాకాంతున్ హరిఁ గూర్చి యాగము సేసె న్నాహుషుండు డక్కున్నెడన్.
భాగ. 9. 562.

2. తక్కువవు (శ. ర.).

**లోపు.** విశే. స్వీయము, తనది

కం. మురగరుడోరగ విద్యా, ధరపురవరనతులతోడ
దనుజేశ్వరకిం, కరులు ఁదమింతురు దోషా,
చరులకు వెలి లోపు గలదె చతురాననుఁడా.
కు. సం. 4. 374.

జ : లోపుసేయు.

**లోపుసేయు** స. క్రి. (లోపు + చేయు) లోఁబఱచు.

వ. ఇట్లు త్రిణయనున్ దన వయనవాగురలకు లోపుసేయుచు. కు. సం. 5. 514.

**లోపొద.** వి. (లోపల + పొద) పొదలోపలి భాగము.

సీ. దూరోద్గమద్ధావధూమమంబుకబుద్ధి నెమ్మి లోపొదనుండి నిక్కి-చూచె
పాంతు. 1. 186.

**లోప్త్రము.** సం. వి. అ. పుం. అపహరించినసొత్తు, స్తేయధనము.

**లోవిత్తరి.** వి. (లోపల + విత్తరి) మల్లయుద్ధగతి భేదము.

వ. ... పదఖండనంబును నురిత్రాడును లోవిత్తరియు వెలివిత్తరియు సర్పాంకుశంబును మొదలుగాఁగల పదిరెండు గాయమానంబులును. ప్రబంధ. 78.

వ. ... పదఖండనంబును లోవిత్తరి వెలివిత్తరి సర్పాంకుశంబు మొదలుగాఁగల పదిరెండు గాయమానంబుల భేదంబులు విచారించి....
హంస. 1. 206.

**లోభనము.** సం. విశే. (అ. ఈ. అ.) ఆకర్షించునది, మోహింపఁజేయునది, ఆశ గలిగించునది. వి. అ. న. 1. ఆకర్షణము, మరులుకొలుపుట, మోహింపఁజేయుట. 2. బంగారము

**లోభనీయము.** సం. విశే. (అ. అ. అ.) మరులు కొలుపునది, ఆశ గలిగించునది, ఆకర్షించునది.

**లోభము.** సం. వి. అ. పుం. 1. అత్యాశ = దురాశ, పరద్రవ్యాపహారణేచ్ఛ, పిసినారితనము. 2. ఆసక్తి, (ఒకదానియందలి) కోరిక. 3. లోభగుణము అరిషడ్వర్గములలో నొకటి.

**లోభి** సం. విశే. (న్. నీ. న్.) 1. లోభము గలవాఁడు. దురాశగలవాఁడు 2. కోరికగలవాఁడు, ఆసక్తిగలవాఁడు. 3. మరులుకొలుపువాఁడు, మోహపెట్టువాఁడు.

**లోభించు** సం. అ. క్రి లోభమునొందు. అత్యాశనొందు, ఆకాంక్షించు, కోరు.

శా. ... మోహాంధులై దీని కేలా లోభింతు రెఱింగియున్ ... మల్ల. వై. 71.

శా. ... ఆరాజన్యుఁడు ... ... పారస్పారచతుర్విధాన్న ఫలమజ్జాపాయసాపూపవ, ల్గారాద్యుత్తమభుక్తి మానసమునన్ లోభింప డింతేనియున్. కృ శకుం 8 3.

**లోభ్యము = లోభనీయము** సం. విశే

**లోమకర్ణము.** సం. వి. అ. పుం. శశకము, కుందేలు.

**లోమకీటము.** సం. వి. అ. పుం. పేను.

**లోమకూపము.** సం. వి. అ. పుం. రోమకూపము, రోమముల మొదలనుండు బిందురూపమగుయిన గుంత

**లోమఘ్నము.** సం. వి. అ. న. తలవెండ్రుకలను బోఁగొట్టు నొకానొక రోగము.

**లోమపాదుఁడు.** సం. వి. అ. పుం. అంగదేశపు రాజులలో నొకఁడు.

**లోమమణి.** సం. వి. అ. పుం. రోమములతోఁ జేయఁబడిన తాయెత్తు.

**లోమమార్జారము.** సం. వి. అ. పుం. పునుఁగుపిల్లి.

**లోమము** సం. వి. అ. పుం. తోఁక. (వి. న్. న.) దేహమందలి వెండ్రుక, రోమము.

**లోమరాజి.** సం. వి. ఇ. స్త్రీ. నూఁగారు, లోమావళి.

**లోమవాహి** సం విశే. (న్. నీ. న్.) 1. ఈఁకలు గలది. 2. వెండ్రుకను సైతము నఱుకునంతటి వాఁడికలది.

**లోమశ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆడునక్క. 2. వాలిడికోతి 3. అన్నభేది 4. కాకి దొండ (వృ. వి.) 5. జటామాంసి (వృ. వి.). 6. వస (వృ. వి.). 7. గూలగొండి (వృ. వి.) 8. మహామేద (వృ. వి.) 9. పెరుగు తోటకూర (వృ. వి.). 10. పెద్ద జనుము (వృ. వి.) 11. ముత్తవపులగము (వృ. వి.).

**లోమశపుష్పకము.** సం. వి. అ. పుం. శిరీష వృక్షము, దిరిసెన చెట్టు (వృ. వి.).

**లోమశము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెండ్రుకలు గలది, బొచ్చుకలది. 2. రోమములతోఁ జేసినది, రోమమయము. 3. గొఱ్ఱెలు మున్నగు వాని బొచ్చు ఆస్తిగాఁ గలది 5. పచ్చికలిసినది. వి. అ. పుం. పొట్టేలు

**లోమశ్యము.** సం. వి. అ. న. 1. బొచ్చుగలిగి యుండుట, వెండ్రుకలుగలిగియుండుట. 2. కఱకుదనము, కర్కశత్వము.

**లోమసారము.** సం. వి. అ. పుం. పచ్చ, మరకతము.

**లోమహర్షణము.** సం. విణ. (అ. ఆ. అ.) గగుర్పాటు గలిగించునది. వి. అ. న. గగుర్పాటు.

**లోమహర్షి** సం. విణ. (న్. ణీ. న్.) గగుర్పాటు గలవాఁడు, గగుర్పాటుగలది.

**లోమహృత్తు.** సం. వి. త్. పుం. తాళకము, హరిదళము, పర్వతములందలి ధాతువిశేషము

**లోమాంచము.** సం. వి. అ. పుం. 1. రోమాంచము, గగుర్పాటు. 2. సన్నబొచ్చు, మెత్తని వెండ్రుకలు గల తోఁక.

**లోమావలి**=రోమావలి. సం. నూఁగారు

**లోమాశము.** సం. వి. అ. పుం. సృగాలము, గుంటనక్క.

**లోమా(శ)శిక.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుగుంటనక్క, సృగాలి

**లోమెన.** వి. (లోవల + మెన) మల్లవిద్యావిశేషము

వ. .. లోమెన వెలిమెన యసిమెన నరితాళంపుమెన యాదిగాఁగల పదియెడు మెనల నారితేఱి .. హంస. 1. 106.

వ .. లోమెన వెలిమెన యసిమెన నరితాళంపుమెన లాదిగాఁగల పదియెడు మెనలు . ప్రబంధ. 78.

**లోయ** వి. 1. సొరయ, రెండుకొండల మధ్య భాగము

సీ. ఒలుపడి పెను లోయఁబడిన క్రొన్నెలరాల చఱులలో నిరుగడఁ దఱచు మెఱచు. వసు. 3. 21

క. కులిశధారాహతి సొలవునఁ బైనుండియడుగు మోవఁగ జేసుకైవతటులఁ, గమటట్టు లోయ గంగానిర్ఝరము వాఱఁ జలువనౌ వయ్యోటి కెలకులందు. మనుచ. 4. 19

గీ. లోయ యన లొద్ది యనఁగఁ బొల్పారుచుండు, నచలమధ్యధరాఖ్య ...
ఆం. భా. 3. 31.

2. ప్రదేశము

సీ. ఒకలోయ ఖగనాయకకుదాయ సముదాయమొకచాయ సురగాయక కృతగేయము ...
ప్రబంధ. 45.

**లోల** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి. 2. మెఱుపు. 3. నాలుక.

**లోలజిహ్వుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) చలించెడి నాలుక కలవాఁడు, జిహ్వాచాపల్యము గలవాఁడు, తిండికై యల్లాడువాఁడు.

**లోలము** సం. విణ (అ. ఆ. అ.) 1. కదలునది, చంచలము. 2. కలఁతనొందినది, క్షుబ్దము. 3. అస్థిరము, క్షణభంగురము. 4. మిక్కిలి యాసక్తిగలది, తృష్ణతోఁ గూడినది.

**లోలాయపడు.** అ. క్రి. (లోలాయము + పడు) శ్రమనొందు కష్టపడు.

**లోలాయము.** వి. శ్రమము. (చూ. లోలాయపడు.)

జ. లోలాయుఁడు.

**లోలార్కుఁడు** సం. వి. అ. పుం. కాశీపుర మందుఁగల సూర్యమూర్తి విశేషము.

**లోలితము.** సం. విశే. (అ. ఆ. అ.) చాలితము, చలింపఁజేయఁబడినది, కదల్పఁబడినది.

**లోలుగు** వి మచుకుందవృక్షము (వృ. వి.).

**లోలుప** సం. వి. అ. స్త్రీ మిక్కుటమైన కోరిక, తీవ్రేచ్ఛ.

**లోలుపము.** సం. విశే. (అ. ఆ. అ.) అత్యాసక్తి గలది, ఉత్కటమైన యిచ్ఛ కలది.

**లోలుభము** = లోలుపము. సం

**లోలోంక.** వి. మల్లబంధవిశేషము (శ. ర.).

**లోలోనిచవి** వి. (లోలోను + చవి) తనయ దలి జ్ఞానామృతము యొక్క రుచి.

కం. బాలకుఁడు బ్రహ్మవిద్యా, శీలుండై చిత్సుధాభిషేచనమతితో, లోలోనిచవుల మిక్కిలి, లోలుండై బాహ్యరుచులు లోఁగొనకుండెన్. వి. పు. 2. 42.

**లోలోను.** వి. (లోను + లోను) (లోనుశబ్దము యొక్క ఆమ్రేడితరూపము) 1. అత్యంతరము.

ఉ. .. హితుఁడుమంబోలె లోలోన బోధించి ... కాశీ. 6 62.

2. మనస్సు.

సీ. లోలార్కునకు నీకు లోలోననేమేని బోటి పుట్టెడు గదా మాటమాట భీమ. 2. 88.

**లోవ** వి 1. లోయ రెండుకొండల మధ్య భాగము.

ద్వి. లోవలు వెదలక లోఁగినవాని, లోవక చొచ్చి లోలోనఁ గ్రుమ్మియును ద్వి. హరిశ్చ. పూ 619 పం.

శా. ప్రాకారంబులు దాఁటి హెగ్గడులు యోగాల్ వట్టి యట్టిట్టవో, వాకిళ్లల్లను దాఁటి చప్పటము లోవం జేరి రాజయ్యెడన్. బహు. 3. 20.

2. దూరు.

సీ. పులిదిండ్లజా ముత్తములలోవ లమరించి స్పటిక సోపానముల్ సంఘటించి ఉ. రా. 3. 292.

చం. జిగమగజాలదెంచికలు చక్కని సింహపుఁ బెక్కుదాల్ మెఱుంగగు తెలిమిన్నలోవ యును తచ్చుపలంగరుపేర్చఁగువన్, దగఁ గనుపట్టు నొక్కవికస న్మణిమండప మధ్యోదంచఁగన్ చంద్రికా. 2. 23.

ఉ. బంగరు మేలికంబములఁ బాటిలు వాటపు మధ్యరంగమున్, తెంగట తీవరత్నముల చెక్కడపుంబని మించు సెజ్జయిల్, ముంగల వజ్రపుంజలకలోవ పొసంగిన నొప్పు చప్పరం, మ్మంగళ భావచిత్రనవమోహనకేళిగృహంబు తలంబునన్. విజ 3 169.

3. రత్నపీఠము మీఁది చట్టపు అంచు.

సీ. పగడాల గాజాల జిగిమించు పుష్యరాగపు లోవ వైడూర్య ఘంటికలును వసు 1 144.

జ : లోవరి

**లోవంక.** విశే. (లోను+వంక) లోపలికి వంగినది.

వ. ... తెప్పులసంకులు లోవంక భుజంబులు కొంకిసిగలు గాని తుప్పటులు నొప్పు. ... ఆము. 4. 36.

**లోవరి.** వి. (లోవ + అరి) తొట్టికట్టు, దుర్గ. (శ. ర.)

**లోవాఁడి.** వి. (లోపల + వాడి) అంతః స్తీక్ష్ణత, మనః కాఠిన్యము.

కం. లోవాఁడియు వావాఁడియు, చేవాఁడియుఁ గలిగి విసుత సిరా గామ గ్రామాగ్రహార జనదత, దేవస్థానాంతపులను ద్రిమ్ము కతనన్. ప్రబంధ. 767.

**లోవి.** వి. వంటకుండ, స్థాలి.

సీ. పాఁప మెపరి పచ్చపన్నాల లోవులఁ గలుగు గుజ్జెనగూళ్లు గుడుచు టుడిగి, అముక్తా. 3. 147.

గీ....లోవిలోని, శిష్టశాకాన్నలవము ప్రాశించి....
భాగ. 1. 484.

ద్వి. మూలవన్నారుల యాలోవిలోవఁ, లోలె
యున్నవి వంచి పోయి తెచ్చెదను.
జన. పు 8 427 పం.

లోవిడి. విణ పూర్వపుది, మునుపటిది (బ్రౌ. ని.).

లోవ = లోఁగు. అ క్రి. వెనుదివియు.

ద్వి. లోవలు వెడలక లోఁగినవాని, లోవక చొచ్చి
లోలోనఁ గ్రుమ్మియును.
ద్వి. హరిశ్చ పూ. 920 పం.

లోవై(వయి)నము విణ. కడచినది (శ. ర.).

లోష్టకము. సం వి అ. పుం. మంటిగడ్డ. మట్టిబెడ్డ. పుం న. 1. మచ్చె. మఱక. 2. గుర్తుగా నుపయోగపడెడి యొకానొక పదార్థము 3. ఇనుపత్రుప్పు. అయసకిట్టము.

లోష్టఘ్నము సం. వి. అ. పుం. లోష్టభేదనము.

లోష్టభేదనము. సం. వి అ. పుం. న. మంటిగడ్డలు వలఁగఁ గొట్టెడి సాధనవిశేషము. పాపటము.

లోష్టము సం. వి. అ. పుం., న. మంటిగడ్డ. న. అయసకిట్టము, ఇనుపత్రుప్పు.

లోష్టువు. సం. వి. ఉ. పుం. లోష్టము, మంటిగడ్డ.

లోసబురు. వి. ఒడ్డునకు దూరముగ సముద్రయానము చేయుట. (వ్యతి వెలిసబురు)
(చి. ని ,శ. ర.)

లోహండి వి. వంట సేయుపాత్రము, స్థాలి, లోవి.

వ. అయస్థిపేటికయు లోహండియుఁ దండలంబులుఁ గంబళంబులుం దగిన సంబడంబును వహించి యొక్కరుండును దెరువు తోడునం బెక్కుదేశంబులు గడచి ...
కాశీ. 5. 82.

సీ. పెల్లులోహండి కావళ్ల కొమ్ములవ్రేలు గిడ్డి మొత్తము నేతిలడ్డిగలును. ఆము. 2. 97.

సీ. రాగిలోహండినన్ బ్రాయ లేకుండంగ వండి ంచిన యుపుర్వంటకంబు. కాశీ. 3. 121.

లోహకంటకము. సం. వి. అ. పుం. వృక్షవిశేషము, మంగచెట్టు. పుం న. ఇనుపముల్లు, ఇనుముతోఁ జేసిన ముల్లువంటి సన్నని వాఁడిగల వస్తువు.

లోహకాంతము. సం. వి. అ పుం. సూదంటుఱాయి.

లోహకారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరి = ఇనుపపని చేయువాఁడు.

లోహకిట్టము. సం. వి అ. న. ఇనుపత్రుప్పు.

లోహఘాతకుఁడు. సం. వి. అ. పుం. కమ్మరి.

లోహచూర్ణము. సం. వి. అ. పుం. 1. ఇనుపరాపొడి. 2. లోహకిట్టము, ఇనుపత్రుప్పు. (రా. ని.)

లోహజము. సం. వి. అ న. 1. కంచు. 2. లోహకిట్టము.

లోహజాలము. సం. వి. అ. న. ఇనుపచిక్కము, కవచము.

లోహజిత్తు. సం. వి. త్. పుం. వజ్రము, రత్నభేదము.

లోహటము. వి. (లోను + హటము) మనస్సు నందలి పట్టుదల.

సీ. లోహటంబులుమాని ఉలిఁగన్నఁ బడకున్నఁ బరదాళ మని పోవుఁ బలక యిచ్చి.
ఉ. హరి. 3. 120.

లోహద్రావి. సం. వి. న్. పుం. వెలిగారము.

లోహపృష్ఠము. సం. వి. అ. పుం కంకము, రాపులుఁగు.

లోహప్రతిమ. సం. వి. ఆ. స్త్రీ. 1. పట్టెడ, కంసాలిదాగలి. 2. ఇనుపవిగ్రహము.

లోహబద్ధము. సం. విణ. (అ. ఆ అ) ఇనుముతో నతుకఁబడినది.

లోహమారకము. సం. విణ (అ. ఆ అ) లోహమును భస్మముగాఁ జేయునది.
వి. అ. పుం ఒకజాతి కూరాకుమొక్క.

**లోహము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱ్ఱనిది 2 రాగిది, రాగితోఁ జేయఁబడినది. 3. ఇనుపది, ఇనుముతోఁ జేయఁబడినది. వి. అ పుం. న. 1. తామ్రము, రాగి. 2 ఇనుము. 3. ఉక్కు. 4. బంగారము. 5. లోహసామాన్యము. 6. నెత్తురు. 7. అయుధము. 8. చేఁపలను బట్టు గాలము. పుం ఎఱ్ఱమేఁక. న. 1. ముసాంబరము. 2. అగురు.

**లోహరాజకము.** సం. వి. అ. న. రజతము, వెండి.

**లోహలము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇనుముతోఁ జేయఁబడినది, అయోమయము. 2. లోహము నాకర్షించునది, లోహగ్రాహకము. 3. అస్పష్టముగ మాటలాడునది.

**లోహలింగము.** సం వి అ న రక్తముతో నిండిన కుఱుపు, రక్తపూరితమైన వ్రణము.

**లోహవరము.** సం వి. అ. న. బంగారము.

**లోహశ్లేషణము.** సం. వి. అ. పుం. వెలిగారము.

**లోహసంకరము.** సం. వి. అ. న. ఇత్తడి మున్నగు మిశ్రలోహము.

**లోహాభిసారము.** సం. వి. అ. పుం. రాజులు యుద్ధయాత్రకుఁబోవునపుడు చేసెడి శస్త్రనీరాజనము.

**లోహాభిహారము** = లోహాభిసారము. సం

**లోహిక.** సం. వి. అ. స్త్రీ. అయస్పాత్రము, ఇనుపమూఁకుడు.

**లోహితకము.** సం. విశే. (అ. తికా. అ) ఎఱ్ఱనిది. వి. అ. పుం. 1. పద్మరాగము, కెంపు. 2. అంగారకగ్రహము. 3. ఒకజాతి బియ్యము. న. 1. కంచు. 2. ఇత్తడి (రా. ని.), ఇత్తడి భస్మము.

**లోహితకల్మాషము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎఱ్ఱని మచ్చలు గలది.

**లోహితగ్రీవుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని.

**లోహితచందనము.** సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు. 2. రక్తచందనము.

**లోహితపుష్పకము** సం. వి. అ. పుం దాడిమవృక్షము, దానిమ్మచెట్టు (వ్య. వి)

**లోహితము.** సం. విశే (అ. తా హినీ అ.) 1. ఎఱ్ఱనిది, ఎఱుపురంగుగలది 2 రాగిది, రాగితోఁజేయఁబడినది. వి. అ. పుం. 1. ఎఱుపు రంగు. 2. అంగారకగ్రహము. 3. సర్పము, పాము. 4. మృగభేదము, ఒకజాతి జింక. 5. బ్రహ్మపుత్ర యనెడి నది. 6. మత్స్యభేదము, ఒకజాతి చేప. 7. ఒకవిధమైన బియ్యము. 8. కనుఱెప్పలలోఁ బుట్టు రోగభేదము. 9. పద్మరాగము. న. రాగి. 2. నెత్తురు. 3. కుంకుమపువ్వు. 4. యుద్ధము 5. రక్తచందనము. 6. ఎఱ్ఱగంధము 7. హరిచందనము. 8. ఇంద్రధనుస్సు యొక్క యసంపూర్ణాకారము (విల్యమ్సు) 9. అగరుగంధపుఁజెక్క. 10. మర్దనము, నూరుట.

**లోహితమృత్తిక.** సం. వి. అ. స్త్రీ. ధాతువిశేషము గైరికము; జేగురుమన్ను.

**లోహితాంగము.** సం. వి అ పుం. 1. కాంపిల్లవృక్షము, ఒకచెట్టు. 2. అంగారకగ్రహము.

**లోహితాక్షము.** సం. వి. అ. పుం. 1. ఎఱుపు రంగు 2. ఒకజాతి పాము. 3. కోకిల. న. 1. చంక. 2. తుంటి (విల్యమ్సు).

**లోహితాక్షుఁడు.** సం. వి. అ పుం. విష్ణువు.

**లోహితాననము.** సం వి. అ. పుం. ముంగిస (రా. ని.).

**లోహితాయస్సు.** సం. వి. స్. న. తామ్రము, రాగి.

**లోహితాశ్వుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిదేవుఁడు.

**లోహితిమ.** సం. వి. న్. పుం. ఎఱుపురంగు, రక్తిమ

**లోహితుఁడు.** సం. వి. అ. పుం. అంగారకుఁడు. (శ. ర.) ఇట్లే **లోహితాంగుఁడు.**

**లోహితోదము.** సం. విశే. (అ. అ. అ.) ఎఱ్ఱని నీరు గలది.

**లోహిత్యము.** సం. వి. అ. పుం. ఒకవిధమగు బియ్యము. ౨ బ్రహ్మపుత్ర యనెడి నది.

**లోహిని.** సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱని చర్మముగల స్త్రీ, ఎఱ్ఱనియాఁడుది.

**లోహోత్తమము.** సం. వి. అ. న. బంగారము.

## లౌ

**లౌకాయతికుఁడు.** సం. వి. అ. పుం. లోకాయత మతము ననుసరించువాఁడు, చార్వాక మతానుసారి, నాస్తికుఁడు

**లౌకికజ్ఞుఁడు.** సం. విశే. (అ అ. అ.) లోకాచార మెఱిఁగినవాఁడు, లోకవ్యవహారములు తెలిసినవాఁడు.

**లౌకికము.** సం. విశే. (అ. ఈ. అ.) 1. లోక సంబంధమైనది, భూలోకసంబంధమైనది. 2. సర్వ సామాన్యమైనది, వాడుకలోనున్నది. 3. ప్రతి దినమున జరుగునది, ఆచారముగా నున్నది. 4. లోకములోనిది, (వాక్యము మొ.) 6 లోక విదితము, పదుగురకుఁ దెలిసినది. 7. లోకహితము, లోకమునకు మేలుచేయునది

న. లోకాచారము, జనుల వాడుక.

**లౌకికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) 1. లోకవిదితుఁడు, అందఱకుఁ దెలిసినవాఁడు. 2. లోకహితుఁడు. లోకమునకు మేలుచేయువాఁడు.

**లౌకికులు.** బ. వ. లోకమందలివారు, సామాన్యజనులు.

**లౌక్యము.** సం విశే. (అ. అ. అ.) 1. ప్రపంచ సంబంధమైనది, మనుష్యసంబంధమైనది. 2. సర్వ సామాన్యమైనది, వాడుకలోనున్నది.

**లౌడి=లవుడి.** వి. పరిఘము, ఒకానొక ఆయుధము.

కం. కేడెము కత్తి తుపాకి, లౌడియు నిండమ్ము లిఁకెలంగొని తొలుతన్, జోదులు దాలిచి సేమలు, జోదులు తమకన్న లేదు నూనవికినుక ప్రబంధ. 782.

వ. ... లౌడి వంకిణి సబళ యీఁటె సెలకట్టె సిల్లము ద్వాత్రింశదాయుధంబులు ...
ప్రబంధ. 78.

**లౌణి=లౌడి.** వి. పరిఘము.

ద్వి. వాలముల్ జళిపించి వడి లౌణు లెత్తి.
రం. రా యు. 288. పొ. 12. పం.
(శ. ర. పా. లౌడు లెత్తి ముద్రి పా.)

**లౌల్యము.** సం. వి. అ. న. 1. చంచలత, చపలత, స్థైర్యములేమి. 2. ఉత్కటమైన కోరిక, లుబ్ధత, భోగేచ్ఛ, విషయాసక్తి.

**లౌహ.** సం. వి. అ. స్త్రీ. కాఁగు, నీరు కాఁచుపాత్ర.

**లౌహకారుఁడు.** సం. వి. అ. పుం., కమ్మరి.

**లౌహజము.** సం. వి. అ. న. లోహకిట్టము, మండూరము.

**లౌహబంధము.** సం. వి. అ. పుం న. ఇనుప గొలుసు, ఇనుపసంకెల.

**లౌహభువు.** సం. వి. ఊ. పుం. కాఁగు, నీరు కాఁచుపాత్ర.

**లౌహము.** సం. విశే. (అ. అ. అ.) 1. లోహమయమైనది, ఇనుపది 2. రాగిది, రాగితోఁ జేయఁబడినది. 3. లోహముతోఁ జేయఁబడినది. 4. రాగియొక్క రంగుగలది. ఎఱ్ఱనిది.
వి. అ. న. ఇనుము.

**లౌహాత్మము.** సం. వి. న. పుం. కాఁగు, నీరు కాఁచుపాత్ర.

**లౌహితకము.** సం. విశే. (అ. అ. అ) ఎఱ్ఱనిది.

**లౌహితము.** సం. వి. అ. పుం. శివుని త్రిశూలము.

**లౌహిత్యము.** సం. వి. అ. పుం. 1 బ్రహ్మపుత్ర యనెడి నది. న. ఎఱుపు.